శ్రీ వేదవ్యాస విరచిత

# శ్రీమన్మహాభారతమ్

## శ్రీ నీలకంఠీయ వ్యాఖ్యానువాద సహితమ్



## ఉద్యోగ పర్వ

## ప్రథమో భాగః

అనువక్త

ఆచార్య శలాక రఘునాథశర్మ



ఆర్ష విజ్ఞాన ట్రస్టు

హైదరాబాదు

# శ్రీమన్మహాభారతము
# ఉద్యోగపర్వము

ప్రథమ భాగము

ఆంధ్ర తాత్పర్య నీలకంఠీయ వ్యాఖ్యానువాద సహితము

అనువక్త

**ఆచార్య శలాక రఘునాథశర్మ**

శ్రీకృష్ణదేవరాయ విశ్వవిద్యాలయము

అనంతపురం.

ప్రచురణ :

**ఆర్ష విజ్ఞాన ట్రస్టు**

హైదరాబాదు

**1989**

ప్రథమ ముద్రణ : శుక్ల విజయదశమి 1989

ప్రతులు : వేయి



ప్రతులకు :

1. **శ్రీ పమిడిఘంటం శ్రీరఘురామ్,**
శ్రీరామసదనము, ప్లాట్ నం. 1361, రోడ్ నం. 45,
జూబిలీహిల్సు కో-ఆపరేటివ్ హౌసింగ్ సొసైటీ,
హైదరాబాదు - 500 034. ఫోన్ : 238237

2. **శ్రీమతి శలాక రాజేశ్వరి,**
A-2, స్టాఫ్ క్వార్టర్సు,
శ్రీకృష్ణదేవరాయ విశ్వవిద్యాలయం, శ్రీవేంకటేశ్వరపురం,
అనంతపురం - 515 003.

**మూల్యం : రూ. 60/-**

**గ్రంథాలయ ప్రతి వెల : రూ. 80/-**

ముద్రణ :

**పద్మావతీ ఆర్ట్ ప్రింటర్స్,**
హైదర్‌గూడ, హైదరాబాదు - 500 029.

# అక్షరార్చన

నారాయణం నమస్కృత్య
నరం చైవ నరోత్తమమ్,
దేవీం సరస్వతీం వ్యాసం
తతో జయ ముదీరయేత్.

* * *

నమోస్తు తే వ్యాస విశాలబుద్ధే
ఫుల్లారవిందాయతపత్రనేత్ర,
యేన త్వయా భారతతైలపూర్ణః
ప్రజ్వాలితో జ్ఞానమయః ప్రదీపః.

* * *

ధర్మమూలం జగత్సర్వం
ధర్మశ్చ శ్రుతిమూలకః,
భారతం పంచమో వేదః
శ్రుతిసర్వస్వవిస్తరః.

ఆర్ష విజ్ఞాన ట్రస్టు
శ్రీరామ సదనము
ప్లాట్ నం. 1361, రోడ్ నం. 45,
జూబ్లీ హిల్సు కో-ఆపరేటివ్ హౌసింగ్ సొసైటీ,
హైదరాబాదు-500 034.
ఫోన్ : 238237

# శ్రీ మన్మహాభారతమును గూర్చి ప్రముఖ పండితాభిప్రాయములు

వ్యాసభగవానుడు పరమకారుణికుడు. అతనికి సమాజమందున్న మానవు లందరిపైనను దయ గల్గినది. అందుచే పరమదయాళువైన వ్యాసుడు వారి యుపయోగము కొఱకై పదునాలుగు విద్యలయొక్క సర్వరహస్యముల నీ గ్రంథమున వివరించెను.

—శ్రీ నీలకంఠులు

అది సకల కౌతుకములకును జన్మస్థానము. వివేక తరువులు బెరిగిన యుద్యానవనము. సర్వసుఖములకును మూలము. జ్ఞానమునకు సముద్రము. పరిపూర్ణమైన నవరససుధాబ్ధి. అది భూలోకమునకు దిగిన వైకుంఠము. సర్వవిద్యలకును మూలపీఠము. సమస్తములైన శాస్త్రములకును నొరపిడిరాయి. ధర్మములకుఁ బుట్టినిల్లు. సజ్జనుల జిహ్వా కలంకారము. శారదాదేవి యొక్క లావణ్యరత్నభాండారము. బాలభానుని యొక్క కాంతులు విరిసినంతనే మూఁడు లోకములును స్పష్టముగ బ్రకాశించును గదా! అట్లే వ్యాసుని మేధాశక్తి వికసించినంతనే దాని కాంతితో లోకమే ప్రకాశింప నారంభించెను. ఈ గ్రంథ మద్వితీయమైనది. సర్వపవిత్రమైనది. మాంగల్యధామము. దీని నవధరింతురు గాక!

—శ్రీ జ్ఞానదేవుడు

వ్యాసుని సృష్టి ఎంత విస్తృతమో అంత గంభీరము. ఎంత గంభీరమో అంత విస్తృతము. భారతము నవరససుధాబ్ధి.

—'మహాకవి' 'సరస్వతీపుత్ర'

డా॥ పుట్టపర్తి నారాయణాచార్యులు

# ఆంగ్లమున

The 'Ramayana' and the 'Mahabharatha' are the two encyclopedias of the ancient Aryan life and wisdom portraying an ideal civilization which humanity has yet to aspire after.

The 'Mahabharatha' especially is the most invaluable work in Indian History; and it is not too much to say that this Book has not as yet been even properly read by the Westerners.

—SWAMI VIVEKANANDA.

The 'Mahabharatha' is the creation and expression not of a single individual mind, but of the mind of a Nation; ........................ It is the poem of itself written by a whole people .................. The whole poem has been built like a vast national temple unrolling slowly its immense and complex idea from chamber to chamber crowded with significant groups and sculptures and inscriptions.

—SRI AUROBINDO.

The MAHABHARATHA is not a mere epic; it is a romance, telling the tale of heroic men and women and of some who were divine; it is a whole literature in itself, containing a code of life; a philosophy of social and ethical relations, and speculative thought on human problems that is hard to rival.

—K. M. MUNSHI

The MAHABHARATHA belongs to the world and not only to India. To the people of India, indeed, this epic has been an unfailing and perennial source of spiritual strength.

—C. RAJAGOPALACHARY.

It is only in a very restricted sense that we may speak of the Mahabharat as an "Epic" and a 'Poem'. Indeed in a certain sense the Mahabharat is not one Poetic Production at all, but rather a whole literature.

—Dr. WINTER NITZ.

The foreign reader .................... is at once struck by two features: in the first place its unity in complexity; and, in the second, its constant efforts to impress on its hearers the idea of a single centralized India, with a heroic tradition of her own as formative and uniting impulse.

—SISTER NIVEDITA (Margaret Noble).

In the Mahabharatha a very definite attempt has been made to emphasize the fundamental unity of India, or Bharatvarsha as it was called from Bharat, the legendary founder of the race.

—Dr. S. RADHAKRISHNAN.

If I were to confine for life to a single book, I would certainly choose the Mahabharatha.

—ARTHUR WILLIAM RYDER.

In the Mahabharatha breathes the united soul of India and the individual souls of her people.

—HERMANN ODERBERGE.

# శ్రీ వ్యాసులకు, భారతమునకు కవిత్రయము వారి నీరాజనము

భారతభారతీ శుభ గభస్తిచయంబులఁ జేసి ఘోరసం
సార వికార సంతమస జాలవిజృంభము వాపి సూరిచే
తోరుచిరాబ్జబోధనరతుండగు దివ్యుఁ బరాశరాత్మజాం
భోరుహమిత్రుఁ గొల్చి మునిపూజితు భూరియశోవిరాజితున్.

*  *  *

ధర్మతత్త్వజ్ఞులు ధర్మశాస్త్రంబని
యధ్యాత్మవిదులు వేదాంతమనియు
నీతివిచక్షణుల్ నీతిశాస్త్రంబని
కవివృషభులు మహాకావ్యమనియు
లాక్షణికులు సర్వలక్ష్య సంగ్రహమని
యైతిహాసికు లితిహాసమనియుఁ
బరమ పౌరాణికుల్ బహుపురాణసముచ్చ
యంబని మహిఁ గొనియాడుచుండ

వివిధవేదతత్త్వవేది వేదవ్యాసుఁ
డాదిముని పరాశరాత్మజుండు
విష్ణుసన్నిభుండు విశ్వజనీనమై
పరగుచుండఁ జేసె భారతంబు.

విద్వత్సంస్తవనీయ భవ్యకవితావేషుండు, విజ్ఞానసం
పద్విఖ్యాతుఁడు సంయమిప్రకరసంభావ్యానుభావుండు కృ
ష్ణ ద్వైపాయనుఁ డర్థి లోకహితనిష్ఠం బూని కావించె ధ
ర్మాద్వైతస్థితి భారతాఖ్యమగు లేఖ్యంబైన ఆమ్నాయమున్.

వేదములకు నఖిలస్మృతి
వాదములకు బహుపురాణవర్గంబులకున్
వాదైన చోటులను దా
మూదల ధర్మార్థకామమోక్షస్థితికిన్.

**జస్టిస్ పమిడిఘంటం కోదండరామయ్య** శ్రీరామ సదనం
ఆంధ్రప్రదేశ్ హైకోర్టు మాజీ న్యాయమూర్తి జూబ్లీహిల్స్
ఆర్షవిజ్ఞాన ట్రస్ట్ స్థాపకాధ్యక్షులు హైదరాబాద్ - 500 034.

# ముందుమాట

ఆర్ష విజ్ఞాన ట్రస్ట్‌వారు ప్రచురించిన శ్రీమద్వాల్మీకిరామాయణము బాల కాండ ఆంధ్రుల ఆదరాభిమానములను చూరగొన్నది. అయోధ్యాకాండ ముద్రణ చురుకుగా జరుగుచున్నది.

స్వామి వివేకానంద నుడివినట్లు రామాయణ మహాభారతములు భారతీయ సంస్కృతికి, సారస్వతమునకు మూలకందములు. అందుచే ఆర్ష విజ్ఞాన ట్రస్ట్ వారు భారతమును కూడా మూలశ్లోకములు, తాత్పర్యము, నీలకంఠవ్యాఖ్యాను వాదముతో ప్రచురింప తలంచిరి. కవిత్రయము వారి కటాక్షమువలన తెలుగు వారికి భారతమునందు ఎనలేని అభిమానము కలిగినది. ఈ గ్రంథమునందలి కథాభాగము, శిల్పము, నీతి, ధర్మము, తత్త్వము పాఠకుడు వరుసగా అధిగ మించవలసిన సోపానములు. దీనిలోని మెలకువలు, మలుపులు, మెరుగులు పూర్తిగా తెలియవలయునన్న మూలమును అధ్యయనము చేయవలయును. అందుచే ఈ ట్రస్టువారు ఈ ప్రక్రియను చేపట్టిరి.

భారతము ప్రపంచసారస్వతపు కోవకు చెందినది. దీనిని పూర్తిగా అధ్యయనము చేసిన జాతీయభావము కూడా వృద్ధి చెందగలదని ఈ ట్రస్టువారి ప్రగాఢ విశ్వాసము.

శ్రీ శలాక రఘునాథశర్మ గారు ఇంతకుమునుపే విరాటపర్వమును అనువదించి యుండిరి. దాని తరువాతది ఈ ఉద్యోగపర్వము. గ్రంథకర్తకు గ్రంథరచనయందు మాత్రమే ఏకాగ్రత నిలుచుటకు ఈ ట్రస్టువారు వారి నుండి ముద్రణ, ప్రచురణ బాధ్యతలను వహించదలచిరి.

"భారతే సారముద్యోగః" అను సంస్కృత వాణికి నండూరి బంగారయ్య గారి తెలుగు నుడువు "భారతము నందలి శిల్పకళాలక్ష్మికి వజ్రకిరీట మీ యుద్యోగపర్వము." ఈ భారతము ఇంచుమించు ముప్పది వాల్యూములుగా ప్రచురించవలసి యున్నది. ఇది చాలా సాహసమైననూ వదాన్యశిరోమణులైన ఆంధ్రులు తోడ్పడగలరని మా విశ్వాసము. భారతముపై మహాపురుషుల, పండితుల అభిప్రాయములను కూడా ఇందు పొందుపరిచితిమి.

ఈ సారస్వత యజ్ఞమునకు శ్రీ వేదవ్యాసభగవానుని అనుగ్రహము పూర్తిగా లభించునని మా విశ్వాసము.

సం/-

**పమిడిఘంటం కోదండరామయ్య**

# మహాభారతము - మున్నుడి

—డా॥ నండూరి రామకృష్ణమాచార్య

"వ్యాసోచ్ఛిష్టం జగత్ సర్వమ్" - అనే సంస్కృతసుభాషితం ఏర్పడింది భారతదేశంలో.

సంస్కృత మహాభారతం ఏకలక్ష శ్లోక సంభృతమైన మహేతిహాసం. ప్రపంచవాఙ్మయంలో ఇంత పెద్ద గ్రంథం వేరొకటి లేదు.

"ధర్మే చార్థేచ కామే చ మోక్షే చ భరతర్షభ,
యదిహాస్తి తదన్యత్ర యన్నేహాస్తి న తత్ క్వచిత్"

అనే మూలశ్లోకమును తిక్కన మహాకవి—

'అమల ధర్మార్థ కామమోక్షముల గుఱిచి
యెలయు తెరు వెద్దియును నిందుఁ గలుగు నదియ
యొండెడలఁ గల్గు దీన లేకుండు చొప్ప
దక్కొకకంటను లేదు వేదజ్ఞులార'

అని యథామాతృకముగా తెనిగించినాడు.

నన్నయ మహాకవి - ఈ భావమును వ్యాఖ్యానపూర్వకముగా తెలుగు భారతం పీఠికలో వివరించియున్నాడు—

ధర్మతత్త్వజ్ఞులు ధర్మశాస్త్రం బని
　　అధ్యాత్మవిదులు వేదాంత మనియు
నీతివిచక్షణుల్ నీతిశాస్త్రం బని
　　కవివృషభులు మహాకావ్య మనియు
లాక్షణికులు సర్వలక్ష్యసంగ్రహ మని
　　ఐతిహాసికు లితిహాస మనియు
పరమపౌరాణికుల్ బహుపురాణసముచ్చ
　　యం బని మహి గొనియాడుచుండ

వివిధవేదతత్త్వవేది వేదవ్యాసు(
డాదిముని పరాశరాత్మజుండు
విష్ణుసన్నిభుండు విశ్వజనీనమై
పరగుచుండ( జేసె భారతమ్ము.

సంస్కృతమహాభారతం - సనాతన భారతీయ విజ్ఞాన సర్వస్వము.

## II

"నారాయణం నమస్కృత్య
నరం చైవ నరోత్తమమ్,
దేవీం సరస్వతీం చైవ
తతో జయ ముదీరయేత్"

పాండవులకు సమకాలీనుడైన వ్యాసమహర్షి వ్రాసిన కృతి - "జయ" ప్రబంధము.

భారతీయ సాహితీ చరిత్ర - History of Indian literature - అనే గ్రంథంలో జర్మను పండితుడు వింటర్‌నిట్జ్ ఈ క్రింది వాదాలు రేకెత్తించినాడు.

i. మహాభారతము ఏకకర్తృకము కాదు.

ii. మహాభారతములోని కథలు గాథలు వృత్తాంతాలు - ఏకకాలికములు కావు. అవి బహుకర్తృకములు.

iii. మహాభారతములో ఎన్నో ప్రక్షిప్తములు ఉన్నాయి. సమన్వయించటానికి వీలులేని భిన్నవేదాంతవాదాలకు ఇది కూడలి.

iv. వేదవ్యాసమహర్షి వ్రాసిన జయ కృతి మహాభారతమునకు ఆద్య ప్రకృతి.

v. జనమేజయుని సర్పయాగమునందు వైశంపాయనమహర్షిప్రోక్తము - రెండవరూపము.

vi. ఉగ్రశ్రవసుడు అను పేరుగల సూతుడు నైమిశారణ్యములో శౌనకాది మహర్షులకు వినిపించినది - "మహాభారతము" మూడవ రూపము. ఇదిఏకలక్షశ్లోకసంభృతము.

vii. నేడు ఉపలభ్యమానమగుచున్న మహాభారతములోని శ్లోకసంఖ్య - లక్ష దాటినది.

యుగయుగాంతరాలలో భారతము పెరిగినది. పాశ్చాత్య పండితులు గూడ-మహాభారతమును "సనాతన భారతీయ విజ్ఞాన సర్వస్వము"గా అంగీకరించి యున్నారు—

-"మన్వాది భారతం కేచి దాస్తీకాది తథాపరే
తథోపరిచరాద్యన్యే విప్రా సమ్యగధీయతే."

ప్రాచీన కాలము నుండి మన్వాదిభారతము, ఆస్తీకాదిభారతము, ఉపరి చరాదిభారతములు ఉన్నట్లు తెలియవచ్చుచున్నది. అంతేగాక పంచభారతములు వైశంపాయన - శుక - సుమంతు - పైల - జైమినిమహర్షులు - వ్యాసశిష్యులు వ్రాసినవి ఒకనాడు ప్రచారములో ఉన్నట్లు నిదర్శనములు ఉన్నవి.

సంస్కృత మహాభారత ప్రతులలో ఉత్తరదక్షిణ పాఠములున్నవి. అంతేగాక ఉత్తరప్రతిలో 1. శారద (కాశ్మీర) 2. నేపాళ 3. మైథిలి 4. వంగ 5. దేవనాగరి ప్రభేదములును, దక్షిణ ప్రతిలో 1. తెలుగు 2. గ్రంథాక్షరి 3. మళయాళ ప్రభేదములు కలవు.

విదేశీయుడైన వింటర్ నిట్జ్ అభిప్రాయమునకు - ఆతని అభిప్రాయముతో కొందరు పూర్తిగా ఏకీభవింపకపోయినను- పక్షపాతమునకు అతీతుడైన న్యాయమూర్తి తీర్పునకు ఇవ్వదగిన విలువ ఉన్నదని ఆధునికులు పలువురు విశ్వసించుచున్నారు.

వింటర్ నిట్జ్ వ్రాసిన వాక్యాలు ఇవి- "హైందవుల విశ్వాసపూరితమైన దృష్టితో కాక చారిత్రకపరిశోధనదృష్టితో చూచినచో మహాభారతము ఏక కర్తృకమని చెప్పుటకు వీలులేదు. అంతేగాక- విచక్షణ గలిగిన ఒక సంపాద

కుడో లేదా తెలివిగల ఒక సంగ్రథనకర్తయో చేసిన పని అనిగూవ అనలేము. మహాభారతము మొత్తముమీద ఒక మహాసాహిత్యబ్రహ్మరాక్షసి. పరస్పర విరుద్ధములైన దర్శనములను విభిన్నాభిప్రాయములను ఒకచో సంగ్రథించు ఆ అసాధ్యకృత్యమునకు పృథివిలో ఏ మానవమాత్రుడు ప్రయత్నించి యుండలేదు. కవితాశక్తి లేని పౌరాణికులు, ప్రాయసగాండ్రు- వివిధ భాష్య కారులు యుగయుగాంతరముల నుండి వచ్చుచున్న సారస్వతఖండములను ఆధ్యాత్మికవిషయములను అన్యోన్యవిరుద్ధాంశములను ఒకచో - చేర్చుటకు సాహసించినారు. కాని ఈ మహారణ్యములో అమరకవితాభావనలు, అద్వితీయ జ్ఞానరత్నములు దేదీప్యమానముగ శాశ్వతముగా మిఱుమిట్లు గొల్పుచుండును. ప్రపంచవాఙ్మయమున నిరూపమానములు అని వర్ణింపదగిన ప్రాచీనతమవీర గాథలు - ఆధ్యాత్మికగీతలు - నీతికథలు - కవితాభావముత్రులు మహాభార తములో పడుగు పేకలుగ కలిసిపోయి కన్పించుచున్నవి."

స్థూలదృష్టికి వింటర్‌నిట్జ్ అభిప్రాయము- "తీర్పు" వంటిదే గాని సూక్ష్మదృష్టితో పరిశీలించినచో అది పాక్షికసత్యమే అని చెప్పవలసివచ్చును. ఆయనయే- మహాభారతము ప్రపంచవాఙ్మయములో నిరూపమానము, గరిష్ఠము అని ప్రశంసించినాడు. మహాభారతమునందు ప్రక్షిప్తాలు ఉన్నమాట నిజమే గాని, అందు వైవిధ్య మున్నమాట యథార్థమే గాని, అందు ఆధ్యాత్మికమైన- సాహితీపరమైన ఐక్యసంధానము లేదు అని చెప్పరాదు.

ప్రాచీనులు మహాభారతమును- "పంచమవేదము" అని అభివర్ణించి యున్నారు. అనగా వేదవాఙ్మయమునకు ఐక్యసంధానము కల్పించునట్టి ప్రామాణికరచన అన్నమాట. అసలు వ్యాసమహర్షి వ్యక్తిత్వమే ఐక్య సంధానము. ఆయన "సమన్వయసంధాత". ఆయనకు "వేద" వ్యాసుడు అనే బిరుదు ఏర్పడినది. వేదాలకు సమన్వయసంధానము చేసిన వ్యాసుడే మహా భారతకర్త. పైల - సుమంతు - శుక - జైమిని - వైశంపాయనులు వ్యాస మానస పుత్రులు - శిష్యులు. వేదవ్యాస వేదాంతప్రచారకులే. అందుచే - ఏకలక్ష శ్లోక సంభృతమైన మహాభారతము వ్యాసప్రోక్తము "వైయాసికి" - అని చెప్పుటలో విప్రతిపత్తి ఏమాత్రము లేదు. ఈ విషయమును గుర్తించిన తిక్కన మహాకవి చెప్పిన మాటలు ఇట అనుసంధేయములు.

"విద్వత్ సంస్తవనీయ భవ్య కవితావేశుండు విజ్ఞాన సం
పద్విఖ్యాతుడు సంయమిప్రవరసంభావ్యానుభావుండు కృ
ష్ణద్వైపాయనుఁ దర్థి లోకహితనిష్ఠం బూని కావించె ధ
ర్మాద్వైతస్థితి భారతాఖ్యమగు లేఖ్యంబైన ఆమ్నాయమున్".

వేదవాఙ్మయంలో స్థూలదృష్టికి కన్పించే వైరుధ్యాలను పరిహరించుటకే - పంచమవేదమైన మహాభారతము వ్రాసినది వేదవ్యాసమహర్షి. ఈ సమన్వయ సంధానమునకు తిక్కన పెట్టిన పేరు "ధర్మాద్వైతము". ఇది వేదవ్యాస మహర్షి సాధించిన విశిష్టత. సుస్పష్టముగా తిక్కన ఈ క్రింది పద్యములో ఈ విషయము చాటి చెప్పినాడు.

"వేదములకు నఖిలస్మృతి
వాదములకు బహుపురాణవర్గంబులకున్
వాదైన చోటులను దా
మూదల ధర్మార్థకామమోక్షస్థితికిన్".

## III

"ధర్మము భిన్నము కాదు. ధర్మము అద్వైతము. ధర్మాద్వైతదర్శనమే మహాభారతమునకు జీవనాడి. ఈ ధర్మాద్వైతమును సాధించి చూపిన యోగీశ్వరుడు శ్రీకృష్ణుడు - గీతాచార్యుడేగాక అనుష్ఠానవేదాంతి. జీవితసాఫల్యమునకు భగవద్గీతగాని, మహాభారతముగాని ఏకైక మార్గమును ఉపదేశింపలేదు.

శాంతిపర్వమునందు వివిధవేదాంతములు, ఆధ్యాత్మిక ప్రబోధములు, నీతిమార్గములు భీష్ముడు ధర్మరాజునకు వినిపించి, సింహావలోకనప్రాయముగ అందించిన సందేశము స్మర్తవ్యము.

"కొందరు బ్రహ్మచర్యమున కొందరు భవ్యగృహస్థధర్మముం
బొందుట కొంద రిద్ధతపమున్ వనభూమిఁ దగం జరించుటన్
కొందరు నిష్క్రియత్వమున కొందరు యజ్ఞవిధానశాలితన్
కొందరనూనదానముల కోరి యొనర్తురు నిత్యసౌఖ్యమున్"
జననీజనకారాధన
మున గురుభక్తిని సువృత్తమున శాంతిని దాం
తిని సత్యమున నహింసను
వినుకాంతురు మోక్షపదము వేర్వేర జనుల్."

## IV

ప్రాచీన గ్రీకువేదాంతి ఒకరు - "ఒకే నదిలో ఎవరైనను రెండుమారులు స్నానము చేయలేరు" అన్నాడు. అనగా ప్రతిక్షణపరిణామశీలము నది. అందలి నీరు సదా ప్రవహించుచునే ఉండును. అంతేగాదు. స్నానము చేసే మనిషిగూడ ప్రతిక్షణపరిణామశీలియే. అందుచేత - ప్రతిక్షణపరిణామబద్ధమైన ఈ ప్రపంచములో కర్తవ్యము ఎట్లు నిర్ణయించుకోవలె? ఏ ధర్మమును ఆచరింపవలె?? సదా పరిణామశీలమైనది సదా గమించునది గదా ఈ జగత్తు. అందుచేతనే మహాభారతము ధర్మమునందలి అద్వైతమును సమన్వయసంధానమును ప్రసాదించుచున్నది. వైవిధ్యములోని ఏకత్వప్రతిపాదకము మహాభారతము.

## V

మహాభారతములో ఎన్నో గాథలు ఉన్నవి. ఎన్నో గీతలు ఉన్నవి. అయితే—వేదాంతము సన్యాసులకు మాత్రమే పరిమితము కాదు. మహాభారతములో అవతారికలో ఒక అర్థవంతమైన వాక్యము ఉన్నది. అది బ్రహ్మదేవుని నోటినుండి వెలువడిన మాట. "అన్ని ఆశ్రమాలలో గృహస్థాశ్రమము ఏ విధముగా ఉత్కృష్టమైనట్టిదో- అదే విధముగ అన్ని కావ్యాలలో మహాభారతము మిన్న"... వివిధ వేదాంత దర్శన వివరాలతోపాటు మహాభారతమునందు అనుష్ఠాన వేదాంతము ఉపదేశింపబడినది.

మహాభారతప్రచారమునకు పూనుకొనిన మహానుభావులు అందరకు- విశేషించి శ్రీ కోదండరామయ్యగారికీ నా హృదయపూర్వకమైన ధన్యవాదములు.

—నందూరి రామకృష్ణమాచార్య

23 - 8 - 1989.

1-8-76 ప్రెండరుఘాస్టు రోడ్డు
35 జవహరునగరు కాలనీ
సికిందరాబాదు-500 003.

# తీర్థము

"భారతే సార ఉద్యోగః" అనియు, "విరాటోద్యోగసారవాన్" అనియు భారతభావుకమూర్ధన్యుల సారసంగ్రహవాక్యములు వినవచ్చుచున్నవి. భారతమున ఉద్యోగము సారభూతమైన దనియు, శ్రీమహాభారతము విరాటోద్యోగములు సారముగా గలది యనియు పై వాక్యముల కర్థము.

శ్రీమహాభారతమును పరాభట్టారికస్వరూపముగా భావించినచో అందు ఆదిపంచకము వాగ్భవకూటము. అమ్మవారి ముఖము వంటిది. యుద్ధషట్కము మధ్యకూటము - పరమేశ్వరి మెడక్రింది భాగము నుండి నడుమువఱకు ఉన్న ప్రదేశము వంటిది. శాంతిసప్తకము శక్తికూటము. కట్యధోభాగము వంటిది. ఇందు వాగ్భవకూటస్థానీయమగు ముఖభాగమునకు తిలకాయమానము ఉద్యోగ పర్వము.

ఇచట ఉద్యోగశబ్దార్థమును గూర్చి కొంత పరిశీలింపవలసి యున్నది. ఉద్యోగశబ్దమునకు ప్రధానమైన అర్థము ప్రయత్నము. దేనిని గూర్చిన ప్రయత్నము అను ఆకాంక్ష యిట పుట్టును. ఒక దృష్టితో యుద్ధ ప్రయత్న మనియు, మరియొక దృష్టితో సంధి ప్రయత్న మనియు, వేరొక దృష్టితో భగవంతుని కర్తవ్యత్రయసాధనప్రయత్నమనియు సంభావించుట కిందు హేతువులు కానవచ్చును.

స్థూలదృష్టికి ధార్తరాష్ట్రులు యుద్ధమునకు, పాండవులు సంధికి, కృష్ణుడు తన కర్తవ్యఫలలబ్ధికి యత్నించినట్లు మన కనిపించును. కాని సూక్ష్మముగా గ్రంథార్థమును పరికించినచో పాండవులు కూడ యుద్ధోద్యోగమునెడ విముఖులు కారను విషయము స్పష్టముగా ఎఱుకకు వచ్చును. మఱి దుర్యోధనాదులు కేవలము యుద్ధమునే కాంక్షించిరా? యన్నచో - కాదు. వారు రాజ్యకాంక్ష తలమునుకలుగా కలవారు. రాజ్యలబ్ధికై దేనికైనను సిద్ధపడి యున్నవారు. పాండవులు రాజ్యము వలదన్నచో వారికి యుద్ధమక్కరలేదు. పాండవులకు కనీసము గ్రాసవాసో దైన్యములేని స్థితి కావలయును. అది వారి యుద్యోగము.

మఱి వాసుదేవుని సంగతి యేమో విచారింపవలయును. ఆయనను కర్తవ్యత్రయసాధన యను మహాభారతము, క్రిందికి దింపినది. సాధు పరిత్రాణనము, దుష్కృతవినాశము, ధర్మసంస్థాపనము అనునవి ఆ కర్తవ్యములు. ఆయన సర్వసమర్థుడు. ఈ పని చిటికలో చేయగలడు. కాని లోకము తనయందు సంపూర్ణవిశ్వాసమును నింపుకొనుట అతని అభీష్టము. తాను చేసిన పనిలో లేశమైనను దోసము లేదని, కనీసము తనయందు విశ్వాసము కలవారికైనను, చెదరని అభిప్రాయము కలుగవలయును. ఏలయన ఆ పునాదిపైనే భావిమానవ సత్స్వభావ సాధనయత్న దివ్యభవనము నిలిచియుండును. దీనికై శ్రీవాసుదేవుడు సాధారణమనుజునివలె పడరానిపాట్లు పడవలసి వచ్చెను. ఆ పాట్ల సమాహారమే యాతని పరముగా ఉద్యోగము.

ఇంతకు కృష్ణుడు సంధిని కోరెనా? యుద్ధమునకు యత్నించెనా? అన్నచో రెంటిలో నేదియు అతనికి అభీష్టముకానిది లేదని సమాధానము. అతనికి సంబంధించినంతవరకు సంధియా? యుద్ధమా ? అనునవి ముఖ్యాంశము కాదు. ధర్మసంస్థాపనము ఆతని పరమలక్ష్యము. దానికి పూర్వాంగములు దుష్టశిక్షణ శిష్టరక్షణలు. సంధి కుదిరినచో ఇవి సిద్ధింపవే యని యనుమానింపబనిలేదు. సంధి కుదిరిన దన్నచో దుష్టస్వభావము తన అస్తిత్వమునకు తిలోదకము లిచ్చి తన్ను సంస్కరించుకొన్న దన్నమాట. యుద్ధమైనచో దౌష్ట్యము రూపుమాసిన దన్నమాట. ఇట్లు రెండు పక్షములలో నేదియైనను శ్రీకృష్ణునకు సమ్మతమే. కావుననే లోకసామాన్యముగా ఆ మహాత్ముడు సంధికొఱకు చిత్తశుద్ధితో ఎంత గాఢముగా యత్నించెనో విశేషదృష్టితో యుద్ధమునకును అంత గట్టిగా ఉద్యోగించెను.

ఇట్లుగా సాగిన ఉద్యోగమునకు సంబంధించిన సకలసూక్ష్మాంశములను చక్కగా వివరించినది ఉద్యోగపర్వము.

ఉభయపక్షములందును కృషిలోపము లేదనియే చెప్పవలయును.

ధృతరాష్ట్రు డొక దూతను, దుర్యోధను డొక దూతను, పాండవులకడకు తమ అభిప్రాయనివేదనముకై పంపెను. అందు మొదటివాడు సంజయుడు స్వామిభక్తి రూపుదాల్చినట్టివాడు. కాని తన స్వామి అధర్మమున కొడిగట్టెనే యని లోపలను, వెలుపలను కూడ కుమిలిపోవు స్వభావము గలవాడు. ఈతడు తన దౌత్యము ముఖమున తన పక్షమునకు సాధించినదేమియు లేదు గాని

సహజముగనే శాంతస్వభావుడగు ధర్మజుని హృదయమునందు యుద్ధ వైముఖ్యమును చేయగలిగినంత చేసెను. ఆ హృదయమును మరల రగుల్కొల్పుటకు కృష్ణాదులు పడినపాట్లు గమనించినచో సంజయు డెంతపని చేసెనో మన కవగతమగును.

దుర్యోధనుడు పంపిన దూత ఉలూకుడు. ఇందులో పెద్దగా రాజనీతి కానరాదు గాని శత్రుపక్షమున మనోవైకల్య మేర్పరచి నీరుగార్చుట ప్రధానోద్దేశము. కుటిలనీతిలో ఆరితేరిన శకుని కొడుకు ఉలూకుడు. తనకు నిర్దిష్టమైన పనిని సమర్థముగనే నిర్వహించెను. కాని ఆశించిన ప్రయోజనము మాత్రము అతడు సాధింపలేక పోయెను.

ఇంక ధర్మరాజు పక్షమునుండి కౌరవులకడ కరిగిన దూతలిద్దఱు, అందు మొదటివాడు ద్రుపద పురోహితుడు. కార్యము సాధించు పట్టుదలకంటె కుండబద్దలు కొట్టినట్లు తన ప్రభువుల అభిప్రాయమును వెల్లడించితిమన్న తృప్తి యీతనిలో విశేషముగా గానవచ్చును. ఈతనిదెబ్బ కదలిన ధృతరాష్ట్రుడు పాండవులను శాంతపరచుటకై సంజయుని దూతగా పంపవలసి వచ్చినది. ఇట్లాతడు సాధించినది స్వల్పమే అయినను గణనీయమే.

ఇక సర్వజ్ఞుడు, సర్వశక్తిమంతుడు, ఏది యేమైనను పట్టనివాడు, ఆదర్శములకంటె ఆచరణకే ప్రాధాన్యమను సిద్ధాంతము కలవాడు, పశ్చాత్తాపము పొంద నక్కరలేని రీతిలో కార్యమును నిర్వహించువాడు నగు శ్రీకృష్ణుడు పాండవపక్షమున రెండవ దూత. పేరునకు దూతయే కాని అవసరమైనచో ప్రభువులకు ప్రభువుగా నిర్ణయములు తీసుకొనగల నియంత. సంధిని సాధింపలేదుగాని సర్వమును సాధించెను. ఏది ధర్మపక్షమో, ఏది అధర్మపక్షమో, ధర్మపక్షముకూడ ఏల యుద్ధమునకే సిద్ధపడవలసివచ్చెనో, యుద్ధమున పైచూపునకు అధర్మములుగా గానవచ్చు కొన్ని ఆపద్ధర్మములకు ధర్మపక్షమేల ఒడిగట్టవలసివచ్చెనో, అయినను అది ధర్మపక్షముగనే ఎట్లు నిలువ ద్రొక్కకొనగలిగెనో అతడు యుగయుగముల వారికి తన దౌత్యము ద్వారమున స్పష్టపరచెను. కౌరవులు శ్రీ కృష్ణవాక్యమును వినక చెడుట రూపమున దుష్టశిక్షణ కార్యక్రమమునకు లక్ష్యభూతులైరి. పాండవులు విని బాగుపడుట రూపమున శిష్టరక్షణకు లక్ష్యభూతులైరి. ఉద్యోగపర్వమునందలి శ్రీకృష్ణుని తత్త్వము

నవగతము చేసికొనుటవలన మానవులలో ధర్మము చక్కగా కుదురుకొనును. ఇట్లు కర్తవ్యత్రయ సాధన మీ దౌత్యములో మనకు హృద్గోచరమగును.

అధర్మపక్షముగా గ్రంథకర్తయే విస్పష్టముగా నిరూపించిన సుయోధనాది వర్గమును చక్కదిద్దుటకు శ్రీకృష్ణు డొక్కడే కాదు. స్వపక్షమునకు చెందిన వారెందరో తమ శక్తియుక్తుల నన్నింటిని ధారవోసిరి. విదురుడు, భీష్మద్రోణులు, ఎడనెడ ధృతరాష్ట్రుడు, తల్లి గాంధారి మొదలగు వారిందు గణనీయులు. ఇక తటస్థులైన నారదాదిమహర్షులు దుర్యోధనాదిధార్తరాష్ట్రులకు నిర్మలమగు బుద్ధితో చేసిన ఉపదేశములు కూడ ప్రమాణమున తక్కువ కావు. నిజమునకు దుర్యోధనుని సోదరులందే వికర్ణునివంటి ధర్మబద్ధస్పృహు లెందరు కలరో తేల్చి చెప్పజాలము గాని దుర్యోధనదుశ్శాసన శకునికర్ణచతుష్టయము వారిని నోరెత్త కుండ చేసి యుండునన్న అనుమానమున కాస్కారము కలదు. ద్రౌపదీ వస్త్రా పహరణము నాడు ఆమె ధర్మవిజితయా? అధర్మవిజితయా? తేల్చి చెప్పు డని పెద్ద లను నిలువదీసినవాడు వికర్ణుడు దుర్యోధనుని తమ్ముడే యను దానిని మన మిట మరువరాదు. ఇచట మఱి యొక వింత విషయము. భంగ్యంతరముగా సద్బుద్ధిని ఈ పక్షమునకు మూలకందమైన ధృతరాష్ట్రుని యందు నిలుపుటకు లోకతత్త్వ సారసంగ్రహ మనదగిన నీతిని అయిదు వందల శ్లోకములతో విదురుడు, పర మార్థ తత్త్వ సారసంగ్రహముగా ఆధ్యాత్మికతత్త్వమును రెండువందలశ్లోకము లలో సనత్సుజాతుడును ప్రయత్నపడి ఉపదేశించిరి. సాక్షాత్తు సమవర్తి అంశమున జనించిన ధర్మమూర్తి విదురుడును, బ్రహ్మమానసపుత్రుడు నిత్యకుమారుడు సనత్సుజాతుడు చేసిన ఉపదేశములు ధృతరాష్ట్రునియెడ సాఫల్యము పొంద కుండుట అంతగా విచారింపదగిన విషయము కాదు. ఆ రెండు మహానిధులు శాశ్వతముగా మానవలోకమున కందుబాటులోనికి వచ్చినవి కావున ఇవి సంతో షింపదగిన విషయమే.

ఈ పై నిరూపించిన అంశములను బట్టి ఉద్యోగపర్వ మెట్లు భారత సారమో నిర్ణయింపవచ్చును.

1. పాండవధార్తరాష్ట్రుల స్వభావము లెట్టివి?

2. మహాఘోరమగు కురుక్షేత్రసంగ్రామ మెట్టి పరిస్థితులలో అనివార్యమైనది?

3. సంగ్రామఫలితము లెట్లుండును?

4. ఈ సంగ్రామమున పాల్గొన్నవారి శక్తియుక్తు లెట్టివి ?
5. ఇందు మూర్ఖత్వము పాలెంత ? వివేకము పాలెంత ?
6. ధృతరాష్ట్రు డెట్టివాడు ? గాంధారి యెట్టిది ? కుంతి యెట్టిది ?
7. శ్రీకృష్ణుని తత్త్వమేమి ? యుద్ధమగుటలో ఆతని ప్రమేయమెంత ?
8. దౌత్యములందు తారతమ్యము లెట్టివి ?
9. సంఖ్యాబలమునకున్న నిజమైన బలమెంత ?

మున్నగు ప్రశ్నలకు సమాధానములన్నియు నిందు మనకు లభించును. నిజమున కీ ప్రశ్నలకు రేఖామాత్రముగానైన సమాధానములు పొందినపుడే భారత గ్రంథమున శ్రీ వేదవ్యాసహృదయము లీలామాత్రముగ నైన అవగతమగును. వీనికి తిరుగులేని సమాధానములు పొందుటయే వ్యాసమహాభారతమునకు ఒక ముఖ్యప్రయోజనము. ఆ విధముగా ఈ పర్వము భారతసార మగుచున్నది.

* * * *

ఈ ఉద్యోగపర్వము పది ఉపపర్వముల సమాహారము.

| | | | |
|---|---|---|---|
| 1. | సేనోద్యోగపర్వము | 19 | అధ్యాయములు |
| 2. | సంజయయానపర్వము | 13 | ,, |
| 3. | ప్రజాగరపర్వము | 8 | ,, |
| 4. | సనత్సుజాతీయపర్వము | 6 | ,, |
| 5. | యానసంధిపర్వము | 25 | ,, |
| 6. | భగవద్యాన పర్వము | 79 | ,, |
| 7. | సైన్యనిర్యాణపర్వము | 9 | ,, |
| 8. | ఉలూకదూతగమనపర్వము | 5 | ,, |
| 9. | రథాతిరథసంఖ్యానపర్వము | 8 | ,, |
| 10. | అంబోపాఖ్యానపర్వము | 24 | ,, |
| | | 196 | |

పర్వసంగ్రహపర్వమునందు ఉద్యోగమునకు సంబంధించి యీ క్రింది శ్లోకములు కానవచ్చుచున్నవి.

**ఉద్యోగపర్వము విజ్ఞేయ మత ఊర్ధ్వం మహాద్భుతమ్**
**తతః సంజయయానాఖ్యం పర్వ జ్ఞేయ మతః పరమ్.**

ప్రజాగరం తథా పర్వ ధృతరాష్ట్రస్య చిన్తయా,
పర్వ సానత్సుజాతం వై గుహ్య మధ్యాత్మదర్శనమ్.
యానసన్ధి స్తతః పర్వ భగవద్యా న మేవ చ,
మాతలీయ ముపాఖ్యానం చరితం గాలవస్య చ.
సావిత్రం వామదేవ్యం చ వైన్యోపాఖ్యాన మేవ చ,
జామదగ్న్య ముపాఖ్యానం పర్వ షోడశరాజకమ్.
సభాప్రవేశః కృష్ణస్య విదులా పుత్రశాసనమ్,
ఉద్యోగః సైన్యనిర్యాణం విశ్వోపాఖ్యాన మేవ చ.
జ్ఞేయం వివాదపర్వాత్ర కర్ణస్యాపి మహాత్మనః,
రథాతిరథసంఖ్యా చ పర్వోక్తం తదనన్తరమ్.
ఉలూకదూతగమనం పర్వామర్షవివర్ధనమ్,
అమ్బోపాఖ్యాన మత్రైవ పర్వ జ్ఞేయ మతః పరమ్.
(ఆ. 26. 49 నుండి 65½ వరకు)

ఇట్లు పది ఉపపర్వములుగా నూటతొంబదియాఱు అధ్యాయములుగా రూపొందిన ఉద్యోగపర్వమున 6614 శ్లోకములు కానవచ్చుచున్నవి. కాని యీ లెక్క ఆదిపర్వమున పర్వసంగ్రహపర్వమున చెప్పిన యీ క్రింది లెక్కతో సరిపడుట లేదు.

"ఉద్యోగపర్వ నిర్దిష్టం సన్ధివిగ్రహమిశ్రితమ్
అధ్యాయానాం శతం ప్రోక్తం షడశీతి ర్మహర్షిణా
శ్లోకానాం షట్సహస్రాణి తావన్త్యేవ శతాని చ
శ్లోకాశ్చ నవతిః ప్రోక్తా స్తథైవాష్టౌ మహాత్మనా
వ్యాసే నోదారమతినా పర్వణ్యస్మిం స్తపోధనాః" (ఆ. 26. 42. 43½)

దీని ప్రకారము అధ్యాయసంఖ్య 186. శ్లోకసంఖ్య 6698. ఈ హెచ్చు తగ్గులు లేఖకప్రమాదజనితములై యుండునని లఘుటిప్పణీకర్త పండిత రామచంద్రయ్య శాస్త్రి వ్రాసిరి. అధ్యాయసంఖ్య నెట్లు సరిపుచ్చవలయునో మార్గము కానరాకున్నది కాని శ్లోకసంఖ్య విషయమున నది పెద్ద దుష్కరముగా గానరాదు. కొన్నియెడల మూడుపాదములను, మఱికొన్న యెడల ఒక్క పాద మును శ్లోకముగా పరిగణించుట యందు పెక్కుతావుల కానవచ్చును. అంతేకాదు. శ్లోకసంఖ్య నిర్దేశించినచోట వాక్యార్థము పూర్తి కాకుండుటయు కానవచ్చు

చుండును. ఇట్టి తావులను మెలకువతో సరిచేసుకొన్నచో శ్లోకసంఖ్య చక్కగా సరిపడవచ్చును.

*  *  *  *

ఈ ఉద్యోగపర్వమున తెలుగుభారతమున అంతగా ప్రసిద్ధికి రాని రెండు వృత్తాంతములు పరమరమణీయములైనవి కలవు. అందొకటి కణ్వుడు చెప్పిన గరుత్మద్గాలవకథ. ఇది మూలమున 27 అధ్యాయములలో పరచుకొనగా తిక్కనామాత్యులు 33 గద్యపద్యములలో సంక్షేపించెను. ఈ కథలో మూలమున నున్న ఆ యా దిక్కుల ఉత్పత్తియు వానియందలి విశేషములను వర్ణించిన భాగము ఒక మహావిజ్ఞానవిషయము. అట్లే మాధవి కథ పరమాద్భుతమైనది. ఆమె ఒక బాపనికి సాయపడుటకై చేసిన త్యాగము, నిష్కామకర్మము నిరుపమములు. తిక్కనగారు దాని నతిసంక్షేపముగ చెప్పివైచిరి. ఇందు మూల కథ పాఠకుని గుండెకు పట్టుకొను విధము వర్ణనాతీతము.

ఇంక రెండవది దౌత్యము ముగిపిన పిదప శ్రీకృష్ణుడు కుంతిని చూచుటకు వెళ్ళినపుడు యుధిష్ఠిరునికి వేడి పుట్టుటకై కుంతి చెప్పిన విదులో పాఖ్యానము. ఇదియు నాలుగధ్యాయముల కథ. దాదాపు నూటయేబది శ్లోకములలో సాగిన రసవత్కథ. తిక్కన దీనిని పూర్తిగా వదలివైచెను. అట్లే విదురనీతిని కూడ మిక్కిలి సంగ్రహించెను. సనత్సుజాతీయమును ముట్టుకొనలేదు. ఈ మాటలు చెప్పుటకు తాత్పర్యము సంస్కృతభారతమును పరికింపనిచో మన మెంత నష్టపడుదుమో దిఙ్మాత్రముగ తెలుపుటయే.

శ్రీ వ్యాసులు దర్శించిన భారతము పురుషార్థముల విజ్ఞానసర్వస్వము. దానిని 'ఏకబిగిని' ఎవ్వరు చదువలేరనుట నిర్వివాదాంశము. కాని ఎవ్వరి కేది యెప్పుడు కావలసినను అందింపగల సర్వవస్తుసంభారసంపద గల తెరచి యుంచిన మహావిపణి (Super market) వలె దానిని నిర్మించెను. భక్తి శ్రద్ధలు అను మూల్యముతో నెవ్వరైనను అందు పురుషార్థములను విలిచికొన వచ్చును. అందు మహిమగల ఒక విశాలశాల ఉద్యోగపర్వము.

ఈ గ్రంథ ప్రచురణకు సంబంధించిన సర్వబాధ్యతలు వహించి నన్ను ఆదుకొన్న భాగ్యనగర ఆర్ష విజ్ఞాన ట్రస్టు కార్యవర్గ సభ్యుల సౌహార్దాన్ని కలకాలం హృదయంలో పదిలపరచుకుంటాను.

—రఘునాథశర్మ

# ఉద్యోగ పర్వము

## ప్రథమ భాగము

## విషయ సూచిక

### 1. సేనోద్యోగ పర్వము

## 2. సంజయయానపర్వము



## 3. ప్రజాగరపర్వము

## 4. సనత్సుజాత పర్వము



## 5. యానసంధి పర్వము

—: o :—

# శ్రీ మహాభారతమ్-ఉద్యోగపర్వ

# శ్రీ మహాభారతము - ఉద్యోగపర్వము

## సేనోద్యోగపర్వ - 1

## సేనోద్యోగపర్వము - 1

### ప్రథమోఽధ్యాయః - మొదటి అధ్యాయము

**విరాటసభాయాం శ్రీకృష్ణస్య ప్రవచనమ్ -**
**విరాటుని సభలో శ్రీకృష్ణుని ప్రవచనము.**

నారాయణం నమస్కృత్య నరం చైవ నరోత్తమమ్,
దేవీం సరస్వతీం చైవ తతో జయ ముదీరయేత్.

శ్రీమన్నారాయణునికి నరులలో ఉత్తముడగు నరునికి సరస్వతీదేవికి ప్రణమిల్లి పిదప జయమను పేరుగల మహాభారతకావ్యమును పఠింపవలయును.

వైశంపాయన ఉవాచ - వైశంపాయను డిట్లు చెప్పెను.

కృత్వా వివాహం తు కురుప్రవీరా
స్తదాభిమన్యో ర్ముదితాః స్వపక్షాః,
విశ్రమ్య రాత్రా వుషసి ప్రతీతాః
సభాం విరాటస్య తతోఽభిజగ్ముః. 1

---

1. స్వపక్షాః - తనవైపువారు - యాదవులు, పాండవులు మొదలగువారు; ప్రతీతాః - మేల్కొన్నవారు.

అభిమన్యునకు తనవారైన యాదవపాండవాదులు వివాహము గావించి ఆనందించిరి. ఆ రాత్రి విశ్రమించి వేకువజామున మేల్కాంచి, విరాటునిసభ కరిగిరి.

సభా తు సా మత్స్యపతేః సమృద్ధా
మణిప్రవేకోత్తమరత్నచిత్రా,
న్యస్తాసనా మాల్యవతీ సుగన్ధా
తా మభ్యయు స్తే నరరాజవృద్ధాః. 2

విరాటుని ఆ సభయు సమృద్ధితో కూడి, మణుల జాలరులయందలి రత్నములతో చిత్రమైనదై యలరారినది. అం దాసనము లుంచిరి. మాల్యములు గలవు. చక్కనివాసనలు వచ్చుచున్నవి. అట్టి ఆ సభకు రాజులు పెద్దలు చేరిరి.

అథాసనా న్యావిశతాం పురస్తా
దుభౌ విరాటద్రుపదౌ నరేన్ద్రౌ,
వృద్ధౌ చ మాన్యౌ పృథివీపతీనాం
పిత్రా సమం రామజనార్దనౌ చ. 3

అంత ముందుగా వయసున పెద్దలు, రాజు లందరకు మన్నింపదగినవారగు విరాట ద్రుపద మహారాజు లిద్దఱు ఆసనముల నలంకరించిరి. పిమ్మట తండ్రియగు వసుదేవునితోపాటు బలరాముడును కృష్ణుడును కూర్చుండిరి.

పాఞ్చాలరాజస్య సమీపత స్తు
శినిప్రవీరః సహరౌహిణేయః,
మత్స్యస్య రాజ్ఞస్తు సుసన్నికృష్టౌ
జనార్దన శ్చైవ యుధిష్ఠిరశ్చ. 4

---

2. ప్రవేకః - జాలరుల సముదాయము; మణిప్రవేకము లనగా ముత్తెములతో పగడములతో చేసిన అల్లికముల సముదాయములు.

3. పిత్రా - వసుదేవునితో;

4. రౌహిణేయః - రోహిణీదేవి కొడుకు - బలరాముడు.

ద్రుపదమహారాజునకు దగ్గరగా, బలరామునితోపాటు, సాత్యకి కూర్చుండెను. విరాటునికి మిక్కిలి దగ్గరగా శ్రీకృష్ణుడును ధర్మరాజును కూర్చుండిరి.

సుతాశ్చ సర్వే ద్రుపదస్య రాజ్ఞో
భీమార్జునౌ మాద్రవతీసుతౌ చ,
ప్రద్యుమ్నసాంబౌ చ యుధి ప్రవీరౌ
విరాటపుత్రైశ్చ సహాభిమన్యుః. 5

ద్రుపదరాజుకొడుకు లందరును, భీమార్జునులును, నకులసహదేవులును, యుద్ధమున మిక్కిలి వీరులగు ప్రద్యుమ్నసాంబులును, విరాటునికొడుకులతోపాటు అభిమన్యుడును కూర్చుండిరి.

సర్వే చ శూరాః పితృభిః సమానా
వీర్యేణ రూపేణ బలేన చైవ,
ఉపావిశన్ ద్రౌపదేయాః కుమారాః
సువర్ణచిత్రేషు వరాసనేషు. 6

పరాక్రమము, రూపము, బలము అను వాని విషయమున తండ్రులతో సమానులు, శూరులు అగు ద్రౌపది కొడుకులు అందరును బంగారముతో అలంకరింపబడిన ఉత్తమాసనములపై కూర్చుండిరి.

తథోపవిష్టేషు మహారథేషు
విరాజమానాభరణాంబరేషు,
రరాజ సా రాజవతీ సమృద్ధా
గ్రహై రివ ద్యౌ ర్విమలై రుపేతా. 7

తళతళ లాడు నగలతో వస్త్రములతో వెలుగొందు ఆ మహారథు లందఱు అట్లు కొలువుదీరియుండగా రాజులతో నిండిన ఆ సభ ఐశ్వర్యముతో వెల్లివిరియుచు, నిర్మలమైన గ్రహములతో కూడిన ఆకాశమువలె విరాజిల్లెను.

తతః కథాస్తే సమవాయయుక్తాః
కృత్వా విచిత్రాః పురుషప్రవీరాః,

తస్థు ర్ముహూర్తం పరిచిన్తయన్తః
కృష్ణం నృపా స్తే సముదీక్షమాణాః. 8

ఆ పురుషవరులు ఆ సమావేశమునకు తగిన చిత్రములైన ప్రసంగములు చేయుచు, కృష్ణుని పరికించుచు, ఏవో ఆలోచనలు చేయుచు ముహూర్తకాల ముండిరి.

కథాన్త మాసాద్య చ మాధవేన
సంఘట్టితాః పాణ్డవకార్యహేతోః,
తే రాజసింహాః సహితా హ్యశృణ్వన్
వాక్యం మహార్థం సమహోదయం చ. 9

పాండవుల పనికై కృష్ణునిమాటపై అచట సమావిష్టులైన రాజులందరు ప్రసంగములు ముగించి, సారమైన అర్థము, శ్రేష్ఠమగు ఫలము గల శ్రీకృష్ణుని వాక్యమును వినజొచ్చిరి.

శ్రీకృష్ణ ఉవాచ - శ్రీకృష్ణు డిట్లు పలికెను.

సర్వై ర్భవద్భి ర్విదితం యథాఽయం
యుధిష్ఠిరః సౌబలే నాక్షవత్యామ్,
జితో నికృత్యా ఽ పహృతం చ రాజ్యం
వనప్రవాసే సమయః కృతశ్చ. 10

ఈ ధర్మరాజు శకునితో జూదమున ఎట్లు ఓడెనో, వారు వంచనతో అతని రాజ్యము నెట్లు ఒసిచికొనిరో, వనవాస అజ్ఞాతవాసముల పందెము నెట్లు పన్నిరో మీకందరకును తెలిసిన విషయమే.

---

9. సంఘట్టితాః - సిద్ధము చేయబడినవారు; మహార్థమ్ - సారమైన అర్థము గలది; మహోదయమ్ - శ్రేష్ఠమగు ఫలము గలది.

10. అక్షవత్యామ్ - జూదమునందు; నికృత్యా - వంచనతో; సమయః - పందెము.

శక్తై ర్విజేతుం తరసా మహీం చ
సత్యే స్థితైః సత్యరథై ర్యథావత్,
పాణ్డోః సుతై స్తద్వ్రత ముగ్రరూపం
వర్షాణి షట్ సప్త చ చీర్ణ మగ్ర్యైః. 11

బలముతో భూమి నంతటిని గెలువగలవారయ్యును, పంచభూతములలో అడ్డులేని రథగమనము గలవారయ్యును (సత్యమే రథముగా గలవారయ్యును) ఈ పాండుపుత్రులు మాటపై నిలిచి, దొడ్డబుద్ధితో పదుమూడేండ్లు ఆ భయంకరమైన వ్రతమును చక్కగా నిర్వహించిరి.

త్రయోదశ శ్చైవ సుదు స్తరోఽయ-
మజ్ఞాయమానై ర్భవతాం సమీపే,
క్లేశా నసహ్యాన్ వివిధాన్ సహద్భి-
ర్మహాత్మభి శ్చాపి వనే నివిష్టమ్. 12

గడుప శక్యముకాని యీపదుమూడవ యేట, ఎవ్వరికిని ఎరుకపడకుండ మీకడనుండి, సహింపశక్యముకాని వివిధములైన కష్టములను ఈ మహాత్ములు సహించిరి. అరణ్యమునందును అట్లే యుండిరి.

ఏతైః పరప్రేష్యనియోగయుక్తై-
రిచ్ఛద్భి రాప్తం స్వకులేన రాజ్యమ్,
ఏవం గతే ధర్మసుతస్య రాజ్ఞో
దుర్యోధనస్యాపి చ యద్ధితం స్యాత్. 13

తచ్చిన్తయధ్వం కురుపుఙ్గవానాం
ధర్మ్యం చ యుక్తం చ యశస్కరం చ,

11. సత్-అనగా నేల, నీరు, నిప్పు అనుభూతములు. త్యత్ - అనగా గాలి, ఆకాశము అను భూతములు. వీనియందు అడ్డులేని రథము గలవారు 'సత్యరథులు'. ఇది మధ్యమపదలోపి సమాసము. లేదా సత్యమును రథమువలె ఆరోహించుటకు యోగ్యులు అని యర్థము.

అధర్మయుక్తం న చ కామయేత
రాజ్యం సురాణా మపి ధర్మరాజః. 14

ఈ పాండవులు, ఇతరులకు సేవకులై వారి యాజ్ఞలను పాటించుచు నుండవలసివచ్చినది. ఇప్పుడు వంశక్రమమును బట్టి రాదగిన రాజ్యమును కోరుచున్నారు. కావున ఈ ధర్మరాజునకు, ఆ దుర్యోధనునకు ఏది హితమో దానిని ఆలోచింపుడు. అది కురువంశమున పెద్దలందరకు ధర్మము తప్పనిది, తగినది, కీర్తిని గలిగించునదియు కావలయును. అధర్మముతో కూడినదైనచో ధర్మరాజు దేవతల రాజ్యమునైనను కోరడు.

ధర్మార్థయుక్తం తు మహీపతిత్వం
గ్రామేఽపి కస్మింశ్చి దయం బుభూషేత్,
పిత్ర్యం హి రాజ్యం విదితం నృపాణాం
యథాఽపకృష్టం ధృతరాష్ట్రపుత్రైః. 15

ధర్మము, అర్థము కలిసియున్నచో ఏదో యొక గ్రామమునందైనను ఈతనికి ఏలుబడి చాలును. పాండుపుత్రులకు రాజ్యము తండ్రినిబట్టి వచ్చినదని తెలిసినదే కదా! దానిని ధృతరాష్ట్రుని కొడుకు లెట్లు ఒడిచికొనిరో అదియు తెలిసినదే.

మిథ్యోపచారేణ యథా హ్యనేన
కృచ్ఛ్రం మహత్ ప్రాప్త మసహ్యరూపమ్,
న చాపి పార్థో విజితో రణే తైః
స్వతేజసా ధృతరాష్ట్రస్య పుత్రైః. 16

సహింపరాని ఈ మహాకష్టమంతయు ఈతనికి వంచనవలన కలిగినది. ఆ ధృతరాష్ట్రుని కొడుకులు ఈ కుంతీకుమారుని తమ తేజముతో యుద్ధమున ఓడింపలేదు గదా!

తథాపి రాజా సహితః సుహృద్భి
రభీప్సతేఽనామయమేవ తేషామ్.

15. బుభూషేత్-పొందగోరుచున్నాడు. ఇది ఆర్షరూపము.

అయినప్పటికిని ఈ రాజు తన మిత్రములతో కూడి వారి క్షేమమునే కాంక్షించుచున్నాడు.

యత్తు స్వయం పాణ్డుసుతై ర్విజిత్య
సమాహృతం భూమిపతీన్ ప్రపీడ్య,
తత్ ప్రార్థయన్తే పురుషప్రవీరాః
కున్తీసుతా మాద్రవతీసుతౌ చ. 17

పురుషశ్రేష్ఠులగు ఈ పాండుతనయులు రాజుల నందరను మర్దించి స్వయముగా తెచ్చిన ధనమునే కోరుచున్నారు.

బాలా స్త్విమే తై ర్వివిధై రుపాయైః
సంప్రార్థితా హన్తు మమిత్రసంఘైః,
రాజ్యం జిహీర్షద్భి రసద్భి రుగ్రైః
సర్వం చ తద్వో విదితం యథావత్. 18

ఆ ధృతరాష్ట్రుని కొడుకులు రాజ్యమును చేజిక్కించుకొనుటకై క్రూరులై, దుష్టులై అనేకములగు ఉపాయములను పన్ని, వీరు బాలురుగా నున్నపుడే, పగవారి మూకలతో గూడి చంపుటకు యత్నించిరి. అది యంతయు ఉన్నది ఉన్నట్లు మీ రెరుగుదురు.

తేషాం చ లోభం ప్రసమీక్ష్య వృద్ధం
ధర్మజ్ఞతాం చాపి యుధిష్ఠిరస్య,
సంబంధితాం చాపి సమీక్ష్య తేషాం
మతిం కురుధ్వం సహితాః పృథక్చ. 19

బాగుగా పెరిగిన వారి లోభగుణమును, యుధిష్ఠిరుని ధర్మమెరిగిన తనమును, వారి వారి చుట్టరికమును బాగుగా పరికించి మీరందరు కలిసియు, వేరుగను ఒక నిర్ణయము చేయుడు.

---

17. అనామయమ్ - కుశలము; స్వయమ్ - వారు తమ ప్రతాపముతో ఆర్జించిన దానినే కోరుచున్నారు కాని తండ్రు లార్జించిన దానిని కాదని భావము.

ఇమే చ సత్యేఽభిరతాః సదైవ
తం పాలయిత్వా సమయం యథావత్,
అతోఽన్యథా తై రుపచర్యమాణా
హన్యుః సమేతాన్ ధృతరాష్ట్రపుత్రాన్. 20

సత్యమునం దెల్లపుడు మిక్కిలి ప్రీతిగల వీరును ఒడ్డిన పందెమును తప్పక పాలించిరి. దానికి విరుద్ధముగా వారు వీరిని వంచించినచో వీరు ఆ ధృతరాష్ట్రుని కొడుకుల నందరిని ఒక్కపెట్టున చావగొట్టుదురు.

తై ర్విప్రకారం చ నిశమ్య కార్యే
సుహృజ్జనా స్తాన్ పరివారయేయుః. 21

రాజ్యమునందలి దురాశతో వారు చేసిన అపకారమును విని, మిత్రు లందరును ఈ పాండవులకు తోడై వత్తురు.

యుద్ధేన బాధేయు రిమాం స్తథైవం
తై ర్బాధ్యమానా యుధి తాంశ్చ హన్యుః,
తథాఽపి నేమేఽల్పతయా సమర్థా
స్తేషాం జయాయేతి భవేన్మతం వః. 22

వారు మాత్రము యుద్ధమున వీరిని బాధింపరా యన్నచో బాధలొందిన వీరు వారిని చంపుదురు. వీరేమియు తక్కువవారు కారు. కావున పాండవుల జయమునే మీరు అభిలషింపవలయును.

సమేత్య సర్వే సహితాః సుహృద్భి-
స్తేషాం వినాశాయ యతేయు రేవ,
దుర్యోధనస్యాపి మతం యథావ-
న్న జ్ఞాయతే కిం ను కరిష్యతీతి. 23

---

21. అతః-దానికి-అర్ధరాజ్య మిచ్చుటకంటె; కార్యే-రాజ్యలాభముకొఱకు; తైః-దుర్యోధనాదులచేత; విప్రకారమ్-అపకారమును; నిశమ్య - విని, యెఱిగి; తాన్-పాండవులను.

23. సుహృద్భిః - మనవంటి ఆప్తులతో.

మనవంటి ఆప్తులందరు కలిసి ఆ కౌరవుల వినాశమునకే తప్పక యత్నింతురు. ఇంతకును ఆ దుర్యోధను డేమి చేయునో, ఆతనిభావ మెట్టిదో స్పష్టముగా తెలియరాకున్నది.

అజ్ఞాయమానే చ మతే పరస్య
కిం స్యాత్ సమారభ్యతమం మతం వః.

అవలివాని భావము తెలియని సమయమున మన మేమి చేయవలయునో మీ అభిప్రాయ మెరిగింపుడు.

తస్మా దితో గచ్ఛతు ధర్మశీలః
శుచిః కులీనః పురుషోఽ ప్రమత్తః. 24

దూతః సమర్థః ప్రశమాయ తేషాం
రాజ్యార్ధదానాయ యుధిష్ఠిరస్య.

కావున ధర్మశీలుడు, పవిత్రుడు, కులప్రతిష్ఠ కలవాడు, మెలకువతో ప్రవర్తించువాడు, సమర్థుడు నగు ఒక దూత ఆ కౌరవులకడ కరుగవలయును. ఆతడు వారిని శాంతపరచి ధర్మరాజున కర్ధరాజ్య మీవలసినదిగా అడుగును.

నిశమ్య వాక్యం తు జనార్దనస్య
ధర్మార్థయుక్తం మధురం సమం చ. 25

సమాదదే వాక్య మథాగ్రజోఽస్య
సంపూజ్య వాక్యం తదతీవ రాజన్. 26

ఓ రాజా! ధర్మముతో, అర్థముతో కూడినదియు, వినసింపైనదియు, ఇరువైపులవారికి మేలైనదియునగు కృష్ణుని పలుకు విని, దానిని మిక్కలి కొనియాడి, ఆతని అన్న బలరాముడు పలుకు నందుకొనెను.

ఇతి శ్రీమహాభారతే ఉద్యోగపర్వణి సేనోద్యోగపర్వణి
పురోహితయానే ప్రథమోఽధ్యాయః.

ఇది శ్రీ మహాభారతమునందలి ఉద్యోగపర్వమున సేనోద్యోగ
పర్వమున పురోహితప్రయాణమను మొదటి అధ్యాయము.

—(౦)—

25. సమమ్ - రెండు పక్షములకు సమానమైనది.

# ద్వితీయోఽధ్యాయః - రెండవ అధ్యాయము

## బలరామ భాషణమ్ - బలరాముని భాషణము

బలదేవ ఉవాచ-బలదేవు డిట్లనెను.

శ్రుతం భవద్భి ర్గదపూర్వజస్య
వాక్యం యథా ధర్మవ దర్థవచ్చ,
అజాతశత్రో శ్చ హితం హితం చ
దుర్యోధనస్యాపి తథైవ రాజ్ఞః. 1

ధర్మముతో, అర్థముతో కూడిన ఈ నా తమ్మునిమాటను మీరు వింటిరి. అది అజాతశత్రువగు ధర్మరాజునకును, రాజైన దుర్యోధనునకును మేలైనది.

అర్ధం హి రాజ్యస్య విసృజ్య వీరాః
కున్తీసుతా స్తస్య కృతే యతన్తే,
ప్రదాయ చార్ధం ధృతరాష్ట్రపుత్రః
సుఖీ సహాస్మాభి రతీవ మోదేత్. 2

వీరులైన కుంతీతనయులు అర్ధరాజ్యమును వదలి మిగిలిన సగమునకై ప్రయత్నించుచున్నారు. ధృతరాష్ట్రునికొడుకు ఆ సగము నిచ్చి సుఖవంతుడై మనతోపాటు ఆనందించు గాక!

లబ్ధ్వా హి రాజ్యం పురుషప్రవీరాః
సమ్యక్ప్రవృత్తేషు పరేషు చైవ,
ధ్రువం ప్రశాన్తాః సుఖ మావిశేయు
స్తేషాం ప్రశాన్తి శ్చ హితం ప్రజానామ్. 3

ఈ పురుషవరులగు పాండవులు సగము రాజ్యమును పొంది, ఇతరులు చక్కగా ప్రవర్తించినచో, ప్రశాంతచిత్తులై తప్పక సుఖ మందుదురు. దాని వలన వారికి ప్రశాంతియు ప్రజలకు మేలును సిద్ధించును.

---

3. రాజ్యమ్ - అర్ధరాజ్యము;

దుర్యోధన స్యాపి మతం చ వేత్తుం
వక్తుం చ వాక్యాని యుధిష్ఠిరస్య,
ప్రియం చ మే స్యా ద్యుధి తత్ర కశ్చి-
ద్వ్రజే చ్ఛమార్థం కురుపాణ్డవానామ్. 4

దుర్యోధనుని తలపేమో తెలిసికొనుటకును, ధర్మరాజు పలుకులను తెలుపుటకును, కౌరవులకు పాండవులకు శాంతిని కూర్చుటకును ఎవ్వడేని అచటకు పోయినచో అది నాకును ప్రియమే.

స భీష్మ మామన్త్ర్య కురుప్రవీరం
వైచిత్రవీర్యం చ మహానుభావమ్,
ద్రోణం సపుత్రం విదురం కృపం చ
గాన్ధారరాజం చ ససూతపుత్రమ్. 5

అట్లు వెళ్ళునతడు కురువంశమున గొప్పవీరుడగు భీష్ముని, మహానుభావుడగు ధృతరాష్ట్రుని, కుమారునితోపాటు ద్రోణుని, విదురుని, కృపుని, కర్ణుని, శకునిని చక్కగా పలుకరింపవలయును.

సర్వే చ యేఽన్యే ధృతరాష్ట్రపుత్రా
బలప్రధానా నిగమప్రధానాః,
స్థితాశ్చ ధర్మేషు తథా స్వకేషు
లోకప్రవీరాః శ్రుతకాలవృద్ధాః. 6

మరియు ధృతరాష్ట్రుని ఇతర కుమారులు సేనయందును నీతియందును ప్రాముఖ్యము గలవారు. తమ తమ ధర్మములయందు నిలుకడ గలవారు, విద్యలలో వయస్సులో పెద్దవారు, గొప్పవీరులు (ఆ సభయం దుందురు).

---

6. బలమ్ - రథగజతురగపదాతిరూపమైన సేన; నిగమః - నీతిశాస్త్రము; శ్రుతకాలవృద్ధాః - శ్రుతముచేతను, శాస్త్రపాండిత్యముచేతను; కాలముచేతను, వయసుచేతను వృద్ధులు.

ఏతేషు సర్వేషు సమాగతేషు
పౌరేషు వృద్ధేషు చ సంగతేషు,
బ్రవీతు వాక్యం ప్రణిపాతయుక్తం
కున్తీసుత స్యార్థకరం యథా స్యాత్. 7

పై వారందరు చేరియుండగా, పురమునందలి పెద్దలును వచ్చియుండగా ముందు (మన దూత) ప్రణమిల్లి ధర్మజునికార్యమును సాధించు పలుకు పలుకవలయును.

సర్వా స్వవస్థాసు చ తే న కోప్యా
గ్రస్తో హి సోఽర్థో బల మాశ్రితై స్తైః,
ప్రియాభ్యుపేతస్య యుధిష్ఠిరస్య
ద్యూతే ప్రసక్తస్య హృతం చ రాజ్యమ్. 8

ఎట్టి పరిస్థితులయందును వారికి ఉడుకెక్కింపరాదు. వనవాసము మున్నగు ఆ విషయము గడచిపోయినది గదా! వారును దానికి తగిన సామర్థ్యమును పొందియే యున్నారు. జూదమునకు ప్రియముతో అంగీకరించి అందు తగులుకొనిన ధర్మరాజు రాజ్యమును కోల్పోయెను.

నివార్యమాణశ్చ కురుప్రవీరః
సర్వైః సుహృద్భి ర్హ్యయ మప్యతద్జ్ఞః,
స దీవ్యమానః ప్రతిదీవ్య చైనం
గాన్ధారరాజస్య సుతం మతాక్షమ్. 9

---

7. సమాగతేషు - సభకు వచ్చియుండగా అని భావము.

8. తే-వారు-పాండవులు; సః అర్థః - ఆ విషయము-వనవాసాదివిషయము; తైః-ఆ పాండవులచేత; బలమ్ - సత్యపాలనసామర్థ్యము; - ఇదివరకే వీరు వారిపై కోపించియున్నారు. ఇంకను వారికి పురియెక్కింపరాదని భావము.

9. అతద్జ్ఞః - దానిని - ద్యూతమును - చక్కగా ఎఱుగనివాడు.

ఈ కురుపరేణ్యుడగు ధర్మరాజు ద్యూతమునందు నేర్పుకలవాడు కాదాయెను. హితులందరు వలదని వారించినను వినక పాచికలలో ఆరితేరిన శకునితో ఎత్తుకు పైఎత్తుగా జూదమాడెను.

హిత్వా హి కర్ణం చ సుయోధనం చ
సమాహ్వయ ద్దేవితు మాజమీఢః,
దురోదరా స్తత్ర సహస్రశో౾న్యే
యుధిష్ఠిరో యాన్ విషహేత జేతుమ్. 10

ఈ ధర్మరాజు కర్ణుని, దుర్యోధనుని వదలి జూదమున నేర్పుగల ఆ శకునిని ఉసికొల్పెను. అచట జూదమాడువారు వేలకొలదిగా నున్నారు. వారితో నైనచో ఈతడు గెలిచియుండెడివాడు.

ఉత్సృజ్య తాన్ సౌబల మేవ చాయం
సమాహ్వయ త్తేన జితో౾క్షవత్యామ్,
స దీవ్యమానః ప్రతిదేవనేన
అక్షేషు నిత్యం తు పరాఙ్ముఖేషు. 11
సంరంభమాణో విజితః ప్రసహ్య
తత్రాపరాధః శకునే ర్న కశ్చిత్.

అట్టివారందరిని వదలి ఈతడు ఆ శకునినే పిలిచెను. జూదమున ఆతనికి ఓడెను. పాచికలు ఈతనికి పెడమోము పెట్టగా, ఒద్దనకు మారొడ్డుచు మొండి పట్టుదలతో ఓడిపోయెను. అందు శకుని తప్పు ఏ కొంచెమును లేదు.

తస్మాత్ ప్రణమ్యైవ వచో బ్రవీతు
వైచిత్రవీర్యం బహుసామయుక్తమ్. 12

కావున మనదూత వినయముతో ప్రణమిల్లియే ధృతరాష్ట్రునితో అనేకము లగు సామవాక్యములు పలుకవలయును.

---

10. ఆజమీఢః - అజమీఢుడని ఒక వంశకర్త; ఆతని వంశమువాడు - ధర్మరాజు.

12. సంరంభమాణః - మొండి పట్టుదల గలవాడై; సంరబ్ధమానః అనియు పాఠము. అప్పుడు పెరిగిన గర్వము గలవాడై అని యర్థము.

తథాహి శక్యో ధృతరాష్ట్రపుత్రః
స్వార్థే నియోక్తుం పురుషేణ తేన.

ఆ విధమున మాత్రమే ఆదూత ధృతరాష్ట్రుని కొడుకునుండి తన పనిని సాధించుకొనును.

అయుద్ధ మాకాఙ్క్షత కౌరవాణాం
సామ్నైవ దుర్యోధన మాహ్వాయధ్వమ్. 13

కౌరవులలో వారిలో వారికి యుద్ధము కాకుండుటను మీరు కోరవలయును. సామము తోడనే దుర్యోధనుని దగ్గరకు చేర్చుకొనుడు.

సామ్నా జితోఽర్థోఽర్థకరో భవేత
యుద్ధేఽనయో భవితా నేహ సోఽర్థః. 14

సామముతో సాధించిన అర్థమే ప్రయోజనకర మగును. పోరున కీడు వాటిల్లును. సామమున అట్టి కీడు కలుగదు.

వైశంపాయన ఉవాచ-వైశంపాయను డిట్లు చెప్పెను.

ఏవం బ్రువత్యేవ మధుప్రవీరే
శినిప్రవీరః సహసోత్పపాత,
తచ్చాపి వాక్యం పరినిన్ద్య తస్య
సమాదదే వాక్యమిదం సమన్యుః. 15

ఇట్లు బలరాముడు పలుకుచుండగనే సాత్యకి ఒక్కపెట్టున ఎగిరిపడెను. అతని పలుకును మిక్కిలిగా ఛీకొట్టి కోపముతో ఇట్లు పలికెను.

ఇతి శ్రీ మహాభారతే ఉద్యోగపర్వణి సేనోద్యోగపర్వణి
బలదేవవాక్యే ద్వితీయోఽధ్యాయః.

ఇది శ్రీ మహాభారతము ఉద్యోగపర్వమున సేనోద్యోగపర్వమున
బలదేవుని వాక్యము అను రెండవ అధ్యాయము.

—(౦)—

15. యుద్ధే - యుద్ధమైనచో; అనయః-కీడు; భవితా-అగును; ఇహ-సామమునం దైనచో; సః అర్థః-ఆ కీడు; న-లేదు.

# తృతీయోఽధ్యాయః - మూడవ అధ్యాయము

సాత్యకే ర్వీరోచితః సముద్గారః-

సాత్యకి వీరోచితముగా కోపమును వెలిగ్రక్కుట.

సాత్యకి రువాచ-సాత్యకి యిట్లు పలికెను.

యాదృశః పురుషస్యాత్మా తాదృశః సంప్రభాషతే,
యథారూపోఽన్తరాత్మా తే తథారూపం ప్రభాషసే. 1

మనుజుడు మనసునుబట్టి మాటాడును. నీ అంతరాత్మ ఎట్టిదో నీవట్లు పలుకుచున్నావు.

సన్తి వై పురుషాః శూరాః సన్తి కాపురుషా స్తథా,
ఉభా వేతౌ దృఢౌ పక్షౌ దృశ్యేతే పురుషాన్ ప్రతి. 2

లోకమున శూరులైన పురుషులు ఉందురు. నీచులును ఉందురు. ఆ యా పురుషుల విషయమున ఈ రెండు పద్ధతులు స్పష్టముగనే కానవచ్చుచుండును.

ఏకస్మి న్నేవ జాయేతే కులే క్లీబమహాబలౌ,
ఫలాఫలవతీ శాఖే యథైకస్మిన్ వనస్పతౌ. 3

ఒక్క చెట్టునందే పండ్లుగల కొమ్మయు, లేనిదియు ఉన్నట్లు, ఒక్క వంశమునందే మగతనము లేనివాడు, మహాబలవంతుడును పుట్టుచుందురు.

నాభ్యసూయామి తే వాక్యం బ్రువతో లాంగలధ్వజ!
యే తు శృణ్వన్తి తే వాక్యం తా నసూయామి మాధవ. 4

---

1. యాదృశః ఆత్మా-ఆత్మ యెట్టిదో-శుద్ధమో, పాపమో; తాదృశమ్ - ఆ విధముగా-శుద్ధమునో, పాపమునో;
3. ఫలాఫలవతీ......"వత్యౌ" అని యుండవలయును. ఇట్టిది ఆర్ష రూపము.
4. తే వాక్యమ్-శకుని తప్పు లేదన్నమాట. కౌరవులయందలి పక్షపాతముతో పలికిన మాట.

ఓయి! నాగలిపెక్కెపు బలరామా! ఇట్లు పలుకుచున్న నీ మాటను నేను తప్పుపట్టను. కాని దీనిని ఓపికతో వినుచున్నారే తప్పంతయు వారిదందును.

కథం హి ధర్మరాజస్య దోష మల్ప మపి బ్రువన్,
లభతే పరిషన్మధ్యే వ్యాహర్తు మకుతోభయః. 5

నిండుసభలో ఏమాత్రము జంకులేక ధర్మజుని దోషమును చిన్న మెత్తైనను చెప్పవానికి అవకాశ మెట్లు దొరకును?

సమాహూయ మహాత్మానం జితవన్తోఽక్షకోవిదాః,
అనక్షజ్ఞం యథాశ్రద్ధం తేషు ధర్మజయః కుతః. 6

జూదమున కడునేర్పుగల ఆ కౌరవులు, అందు నేర్పులేని మహాత్ముడగు ధర్మజుని కవ్వించి, శ్రద్ధలేనివానిని గెలిచినట్లు, గెలిచిరి. అట్టివారియందు ధర్మజయ మెక్కడిది?

యది కున్తీసుతం గేహే క్రీడ న్తం భ్రాతృభిః సహ,
అభిగమ్య జయేయు స్తే త త్తేషాం ధర్మతో భవేత్. 7

తమ్ములతో విలాసముగా నున్న ధర్మరాజును, అతని యింటికడ, వీ రెదుర్కొని గెలిచియున్నచో అట్టిది ధర్మజయ మగును.

సమాహూయ తు రాజానం క్షత్రధర్మరతం సదా,
నికృత్యా జితవ న్తస్తే కిం ను తేషాం పరం శుభమ్. 8

ఎల్లవేళల క్షత్రియధర్మమునందు ప్రీతి కలిగియున్న రాజును కవ్వించి వంచనతో వారు ఓడించిరి. వారిలోని మంచి ఏది?

కథం ప్రణిపతే చ్చాయ మిహ కృత్వా పణం పరమ్,
వనవాసా ద్విముక్తస్తు ప్రాప్తః పైతామహం పదమ్. 9

పెట్టుకొన్న పందెమును చక్కగా నెరవేర్చి, వనవాసమునుండి బయట పడి, తాతలనుండి వచ్చెడు రాజ్యమునకై వారి కాళ్ళకు మ్రొక్కనేల?

---

6. యథాశ్రద్ధమ్ - ద్యూతమున ఆసక్తిలేక ఆడినట్లున్నవానిని; ధర్మజయః - ధర్మము నిమిత్తముగా గల జయము;

9. పణం కృత్వా - వనవాస అజ్ఞాతవాస రూపమగు పందెమును నిర్వహించి; పైతామహమ్-ఈ మాటవలన రాజ్యము ధర్మజునకు వచ్చుట న్యాయమే అని చెప్పినట్లయినది.

యద్యయం పాపవిత్తాని కామయేత యుధిష్ఠిరః,
ఏవ మప్యయ మత్యన్తం పరా న్నార్హతి యాచితుమ్. 10

ఈ ధర్మజుడు పాపపు సొమ్ములను కాంక్షించునా? అట్లైనను ఈతడు ఇతరులనుండి బిచ్చమెత్త నవసరము లేదు.

కథం చ ధర్మయుక్తా స్తే న చ రాజ్యం జిహీర్షవః. 11

తమరాజ్యమును తాము గైకొనగోరువారు ధర్మయుక్తులు కాకుండుటెట్లు?

నివృత్తవాసాన్ కౌన్తేయాన్ య ఆహు ర్విదితా ఇతి,
అనునీతా హి భీష్మేణ ద్రోణేన విదురేణ చ. 12

అజ్ఞాతవాసమును చక్కగా పూర్తిచేసిన కుంతీకుమారులను బయటపడిన వారని పలికినవారికి భీష్ముడు, ద్రోణుడు, విదురుడు చక్కగా బుద్ధి చెప్పిరి కదా!

న వ్యవస్యన్తి పాణ్డూనాం ప్రదాతుం పైతృకం వసు,
అహం తు తాన్ శితై ర్బాణై రనునీయ రణే బలాత్. 13
పాదయోః పాతయిష్యామి కౌన్తేయస్య మహాత్మనః.

పాండవులకు వారి తండ్రిసొమ్ము నొసగ బూనని వారిని బలాత్కారముగా నా వాడిబాణములతో యుద్ధమున వశపరచుకొని మహాత్ముడగు ధర్మజుని పాదములపై బడవేయుదును.

అథ తే న వ్యవస్యన్తి ప్రణిపాతాయ ధీమతః,
గమిష్యన్తి సహామాత్యా యమస్య సదనం ప్రతి. 14

---

12. విదితాః - అజ్ఞాతవాసమున వెల్లడియైరి; అనునీతాః - నిర్ణయించిన కాలమును వీరు పూర్తిగా గడిపిరని బోధింపబడిరి.

అప్పటికిని వారు ఆ బుద్ధిమంతునకు మొక్కనియెడల వారి మంత్రులతో పాటు యముని సదనమునకు ప్రయాణింతురు.

న హి తే యుయుధానస్య సంరబ్ధస్య యుయుత్సతః,
వేగం సమర్థా స్సంసోఢుం వజ్రస్యేవ మహీధరాః. 15

ఉప్పొంగి పోరుకోరిక పిక్కటిల్లగా పోరాడుచున్న నా వడిని, వజ్రము వడిని పర్వతములవలె, తట్టుకొనుటకు వారు చాలరు.

కో హి గాణ్డీవధన్వానం కశ్చ చక్రాయుధం యుధి,
మాం చాపి విషహేత్ క్రుద్ధం కశ్చ భీమం దురాసదమ్. 16

గాండీవము చేతబట్టిన అర్జునుని, చక్రము ఆయుధముగా గల శ్రీకృష్ణుని, కోపించిన నన్నును, అణపశక్యముగాని భీముని తట్టుకొనగలవా డెవ్వడు?

యమౌ చ దృఢధన్వానౌ యమకాలోపమద్యుతీ,
విరాటద్రుపదౌ వీరౌ యమకాలోపమద్యుతీ. 17

ప్రాణములను పెకలించు యముని కాంతిని, ఆయువును క్రుంగజేయు కాలుని కాంతిని పోలు కాంతి విశేషముగలవారును, దృఢమైనవిండ్లు కలవారును అగు కవలలను (నకుల సహదేవులను) వీరులగు విరాట ద్రుపదులను మార్కొనగలవా డెవ్వడు?

కో జిజీవిషు రాసాదేద్ ధృష్టద్యుమ్నం చ పార్షతమ్,
పఞ్చైతాన్ పాణ్డవేయాంస్తు ద్రౌపద్యాః కీర్తివర్ధనాన్. 18
సమప్రమాణాన్ పాణ్డూనాం సమవీర్యాన్ మదోత్కటాన్,
సౌభద్రం చ మహేష్వాస మమరై రపి దుస్సహమ్. 19
గదప్రద్యుమ్నసాంబాంశ్చ కాలసూర్యానలోపమాన్.

---

17. యమః - శరీరమునుండి ప్రాణములను పెకలించువాడు; కాలః - ఆయువునకు హద్దులు నియమించువాడు.

18. పాణ్డవేయాన్ - పాణ్డవి యనగా పాండవుల భార్య - ద్రౌపది. కనుక పాణ్డవేయు లనగా ఆమె పుత్రులు - ఉపపాండవులు.

19. పాణ్డూనామ్ - పాండునితో తుల్యులగు పాండవులయొక్క;

పృషతుని మనుమడగు ధృష్టద్యుమ్నుని, ద్రౌపదికి పేరుతెచ్చువారును, పాండవులతో సమానమగు ప్రమాణము గలవారును, మదముచే బిరుసెక్కిన వారును, సమమగు దేహబలము కలవారును అగు ఈ అయిదుగురు ఉపపాండవులను, గొప్పవిల్లు పట్టి దేవతలకును అసాధ్యుడగు సుభద్రకొడుకు అభిమన్యుని, కాలునితో, సూర్యునితో, అగ్నితో, సాటివచ్చు గదుని, ప్రద్యుమ్నుని, సాంబుని మార్కొని బ్రదుకగోరువా డెవ్వడు?.

తే వయం ధృతరాష్ట్రస్య పుత్రం శకునినా సహ,
కర్ణం చైవ నిహత్యాజా వభిషేక్ష్యామ పాణ్డవమ్. 20
నాధర్మో విద్యతే కశ్చి చ్ఛత్రూన్ హత్వాఽఽతతాయినః. 21

ఈ మేము శకునితోపాటు ధృతరాష్ట్రుని కొడుకును, కర్ణుని యుద్ధమున చంపి పాండవునకు పట్టాభిషేకము గావింతుము. క్రూరకర్మములు చేయు శత్రువులను చంపినచో ఎట్టి అధర్మమును కలుగదు.

అధర్మ్య మయశస్యం చ శాత్రవాణాం ప్రయాచనమ్,
హృద్గత స్తస్య యః కామ స్తం కురుధ్వ మతన్ద్రితాః. 22

పగవారిని బిచ్చమెత్తుట ధర్మయుక్తము, కీర్తికరము నగు పనికాదు. ఆ ధర్మజుని యెదలో ఏ కోరిక మెదలుచున్నదో దానిని మెలకువతో సాధింపుడు.

నిసృష్టం ధృతరాష్ట్రేణ రాజ్యం ప్రాప్నోతు పాణ్డవః.

ధృతరాష్ట్రుడు మన్ననతో ఇచ్చిన రాజ్యమును పాండుతనయుడు పొందునుగాక.

అద్య పాణ్డుసుతో రాజ్యం లభతాం వా యుధిష్ఠిరః.
నిహతా వా రణే సర్వే స్వప్స్యన్తి వసుధాతలే. 23

ఈనాడు పాండుకుమారుడగు యుధిష్ఠిరుడు రాజ్యమును పొందనైన పొందవలయును. లేదా అందరును యుద్ధమున చచ్చి నేలపై నిద్రనైన పొందవలయును.

ఇతి శ్రీమహాభారతే ఉద్యోగపర్వణి సేనోద్యోగపర్వణి
సాత్యకిక్రోధవాక్యే తృతీయోఽధ్యాయః.

ఇది శ్రీమహాభారతము ఉద్యోగపర్వమునందు సేనోద్యోగపర్వమున
సాత్యకిక్రోధవాక్యమను మూడవ అధ్యాయము.

—(౦)—

22. తస్య - అతనియొక్క - ధర్మరాజుయొక్క

# చతుర్థోఽధ్యాయః-నాలుగవ అధ్యాయము

## ద్రుపదస్య సమ్మతిః - ద్రుపదుని సమ్మతి

ద్రుపద ఉవాచ - ద్రుపదు డిట్లు పలికెను.

ఏవ మేత న్మహాబాహో భవిష్యతి న సంశయః,
న హి దుర్యోధనో రాజ్యం మధురేణ ప్రదాస్యతి. 1

ఓయి! మహాభుజుడా! ఇది యిట్లే యగును. సందియము లేదు. దుర్యోధనుడు సామమార్గమున రాజ్య మీయడు గదా!

అనువర్త్స్యతి తం చాపి ధృతరాష్ట్రః సుతప్రియః,
భీష్మద్రోణౌ చ కార్పణ్యా న్మౌర్ఖ్యా ద్రాధేయసౌబలౌ. 2

కొడుకులన్న పడిచచ్చు ధృతరాష్ట్రుడు వాడు త్రిప్పినట్లే తిరుగును. వానిమీద ఆధారపడి బ్రదుకుచుండుటవలన భీష్మద్రోణులును, మొరకుతనమువలన కర్ణశకునులును వానినే పట్టి వ్రేలుదురు.

బలదేవస్య వాక్యం తు మమ జ్ఞానే న యుజ్యతే,
ఏతద్ధి పురుషేణాగ్రే కార్యం సునయ మిచ్ఛతా. 3

బలదేవుని మాట నాకు ఈ జ్ఞానవంతుల సమాజమున యుక్తముగా తోచదు. చక్కని నీతి కోరువానికి ఇదిగో నేను చెప్పునదే చేయదగిన పని.

న తు వాచ్యో మృదువచో ధార్తరాష్ట్రః కథంచన,
న హి మార్దవసాధ్యోఽసౌ పాపబుద్ధి ర్మతో మమ. 4

ఆ దుర్యోధనుని కడ మెత్తనిమాట లెన్నటికిని పనికిరావు. పాపబుద్ధియగు నాతడు మెత్తదనమునకు లొంగడని నా అభిప్రాయము.

---

1. మధురేణ - సామమార్గముచేత;
2. కార్పణ్యాత్ - వానియన్నము తినుటవలన కలిగిన దైన్యమువలన.
3. జ్ఞానే-జ్ఞానవంతుల సమాజమున; ఏతత్-చెప్పబోవునది.

గర్దభే మార్దవం కుర్యా ద్గోషు తీక్ష్ణం సమాచరేత్,
మృదు దుర్యోధనే వాక్యం యో బ్రూయాత్ పాపచేతసి. 5

పాపబుద్ధియగు దుర్యోధనునియందు మెత్తని పలుకు పలుకువాడు గాడిదయందు మెత్తదనమును గోవులయందు పరుసదనమును ప్రయోగించునట్టి వాడగును.

మృదుం వై మన్యతే పాపో భాషమాణ మశక్తికమ్,
జిత మర్థం విజానీయా దబుధో మార్దవే సతి. 6

పాపాత్ముడు మెత్తగా మాటాడువానిని శక్తిలేనివానినిగా తలపోయును. మెత్తగా నున్నచో, తెలివి తక్కువవాడు అర్థమును గెలిచినట్లే యెంచును.

ఏత చ్చైవ కరిష్యామో యత్నశ్చ క్రియతా మిహ,
ప్రస్థాపయామ మిత్రేభ్యో బలా న్యుద్యోజయన్తు నః. 7

ఇదియును చేయుదము. మన ప్రయత్నము మనము చేయవలయును. కావున మన హితులకడకు దూతలను పంపుదము. మనకై వారు సేనలను సిద్ధపరచుకొందురు.

శల్యస్య ధృష్టకేతోశ్చ జయత్సేనస్య వా విభో,
కేకయానాం చ సర్వేషాం దూతా గచ్ఛన్తు శీఘ్రగాః. 8

శల్యుడు, ధృష్టకేతుడు, జయత్సేనుడు, కేకయులు - ఈ మొదలగు వారందరి కడకు వేగరులగు దూతలు పోవలయును.

స చ దుర్యోధనో నూనం ప్రేషయిష్యతి సర్వశః,
పూర్వాభిపన్నాః సన్తశ్చ భజన్తే పూర్వచోదనమ్. 9

ఆ దుర్యోధనుడును తప్పక అందరికడకు దూతలను పంపును. సజ్జనులును ముందు వేడినవారికి తోడగుదురు.

---

9. పూర్వాభిపన్నాః - ముందుగా సాయమునకై కోరబడినవారు; పూర్వచోదనమ్ - ముందుగా యుద్ధమునకై ప్రేరణ చేసిన వానిని;

తత్ త్వరధ్వం నరేన్ద్రాణాం పూర్వమేవ ప్రచోదనే,
మహద్ధి కార్యం వోఢవ్య మితి మే వర్తతే మతిః. 10

కావున ముందుగా రాజులను పురికొల్పుటకై తొందరపడుడు. మనము మోయవలసిన పని బరువు మిక్కిలి దొడ్డది యని నాతలంపు.

శల్యస్య ప్రేష్యతాం శీఘ్రం యే చ తస్యానుగా నృపాః,
భగదత్తాయ రాజ్ఞే చ పూర్వసాగరవాసినే. 11

శల్యునికడకు, అతని అనుచరులగు రాజుల కడకును త్వరగా దూతలను పంపుడు. తూర్పుసముద్రముకడ నివసించు భగదత్త మహారాజునకును వార్త పంపుడు.

అమితౌజసే తథోగ్రాయ హార్దిక్యా యాన్ధకాయ చ,
దీర్ఘప్రజ్ఞాయ శూరాయ రోచమానాయ వా విభో. 12

అట్లే అమితౌజునకు, ఉగ్రునకు, హార్దిక్యునకు, అంధకునకు, దీర్ఘ ప్రజ్ఞుడైన శూరునకు రోచమానునకు వార్తలు పంపుడు.

ఆనీయతాం బృహన్తశ్చ సేనాబిందుశ్చ పార్థివః,
సేనజిత్ ప్రతివిన్ధ్యశ్చ చిత్రవర్మా సువాస్తుకః. 13

బృహంతుడు, సేనాబిందువు, సేనజిత్తు, ప్రతివింధ్యుడు, చిత్రవర్మ, సువాస్తుకుడు - అనువారిని పిలిపింపుడు.

బాహ్లీకో ముఞ్జకేశశ్చ చైద్యాధిపతి రేవ చ,
సుపార్శ్వశ్చ సుబాహుశ్చ పౌరవశ్చ మహారథః. 14

బాహ్లీకుడు, ముంజకేశుడు, చేదిరాజు, సుపార్శ్వుడు, సుబాహువు, మహారథుడగు పౌరవుడు - అనువారికి వార్తలంపుడు.

శకానాం పహ్లవానాం చ దరదానాం చ యే నృపాః,
సురారిశ్చ నదీజశ్చ కర్ణవేష్టశ్చ పార్థివః. 15

శకుల, పహ్లవుల, దరదుల, రాజులకును, సురారి, నదీజుడు, కర్ణవేష్టుడు అను రాజులకును వార్తలంపుడు.

నీలశ్చ వీరధర్మా చ భూమిపాలశ్చ వీర్యవాన్,
దుర్జయో దన్తవక్త్రశ్చ రుక్మీ చ జనమేజయః. 16

నీలుడు, వీరధర్ముడు, వీర్యవంతుడగు భూమిపాలుడు, దుర్జయుడు, దంతవక్త్రుడు, రుక్మి, జనమేజయుడు - అనువారి కడకు దూతల నంపుడు.

ఆషాఢో వాయువేగశ్చ పూర్వపాలీ చ పార్థివః,
భూరితేజా దేవకశ్చ ఏకలవ్యః సహాత్మజైః. 17

ఆషాఢుడు, వాయువేగుడు, పూర్వపాలి, భూరితేజుడు, దేవకుడు - అను రాజులకు వార్తలంపుడు. అట్లే కొడుకులతోపాటు ఏకలవ్యునకు కూడ చెప్పి పంపుడు.

కారూషకాశ్చ రాజానః క్షేమధూర్తిశ్చ వీర్యవాన్,
కాంబోజా ఋషికా యే చ పశ్చిమానూపకాశ్చ యే. 18

కరూషకదేశరాజులు, వీర్యవంతుడగు క్షేమధూర్తి, కాంబోజ ఋషిక రాజులు, పడమటి అనూపక రాజులు - వీరందరకు వార్తలు పంపుడు.

జయత్సేనశ్చ కాశ్య శ్చ తథా పఞ్చనదా నృపాః,
క్రాథపుత్రశ్చ దుర్ధర్షః పార్వతీయాశ్చ యే నృపాః. 19

జయత్సేనుడు, కాశ్యుడు అట్లే పంచనదరాజులు, క్రాథపుత్రుడు, దుర్ధర్షుడు, పార్వతీయులగు రాజులు - వీరికి వార్తలంపుడు.

జానకి శ్చ సుశర్మా చ మణిమాన్యోఽతిమత్సకః,
పాంశురాష్ట్రాధిపశ్చైవ ధృష్టకేతుశ్చ వీర్యవాన్. 20

జానకి, సుశర్మ, మణిమంతుడు, అతిమత్సకుడు, పాంశురాష్ట్రరాజు, వీర్యవంతుడగు ధృష్టకేతుడు - అనువారికి వార్తలంపుడు.

తుణ్డశ్చ దణ్డధారశ్చ బృహత్సేనశ్చ వీర్యవాన్,
అపరాజితో నిషాదశ్చ శ్రోణిమాన్ వసుమానపి. 21

తుండుడు, దండధారుడు, బృహత్సేనుడు, అపరాజితుడు, నిషాదుడు, శ్రోణిమంతుడు, వసుమంతుడు అనువారికి వార్తలంపుడు.

బృహద్బలో మహౌజాశ్చ బాహుః పరపురంజయః,
సముద్రసేనో రాజా చ సహ పుత్రేణ వీర్యవాన్. 22

గొప్పశక్తికల బృహద్బలుడు, శత్రుపురములను జయించిన బాహువు, పుత్రసహితుడు వీర్యవంతుడు నగు సముద్రసేనుడు - అనువారి కడకు దూతల నంపుడు.

ఉద్భవః క్షేమకశ్చైవ వాటధానశ్చ పార్థివః,
శ్రుతాయుశ్చ దృఢాయుశ్చ శాల్వపుత్రశ్చ వీర్యవాన్. 23

ఉద్భవుడు, క్షేమకుడు, వాటధానుడు, శ్రుతాయువు, దృఢాయువు, శాల్వపుత్రుడు - అను రాజులకు కబురంపుడు.

కుమారశ్చ కలిఙ్గానా మీశ్వరో యుద్ధదుర్మదః,
ఏతేషాం ప్రేష్యతాం శీఘ్ర మేతద్ధి మమ రోచతే. 24

యుద్ధమున పిచ్చి ఆవేశము కలవాడును, వయసున నున్నవాడును అగు కళింగరాజు - అను నిట్టివా రందరికడకు దూతలను వెంటనే పంపవలయును. ఇది నా అభిప్రాయము.

అయం చ బ్రాహ్మణో విద్వాన్ మమ రాజన్ పురోహితః,
ప్రేష్యతాం ధృతరాష్ట్రాయ వాక్య మస్మై ప్రదీయతామ్. 25

రాజా! ఇదిగో ఈ బ్రాహ్మణుడు నా పురోహితుడు, విద్వాంసుడు. ఈతనిని ధృతరాష్ట్రుని కడకు పంపుడు. చెప్పవలసినమాట నీతనికి చెప్పుడు.

యథా దుర్యోధనో వాచ్యో యథా శాన్తనవో నృపః,
ధృతరాష్ట్రో యథా వాచ్యో ద్రోణశ్చ రథినాం వరః. 26

దుర్యోధనున కేమి చెప్పవలయునో, భీష్మునితో నేమాడవలయునో ధృతరాష్ట్రునకు తెలుపవలసిన దేమియో, రథికులలో శ్రేష్ఠుడగు ద్రోణునితో నేమనవలయునో ఈతనికి చెప్పుడు.

ఇతి శ్రీమహాభారతే ఉద్యోగపర్వణి సేనోద్యోగపర్వణి
ద్రుపదవాక్యే చతుర్థోఽధ్యాయః.

ఇది శ్రీమహాభారతము ఉద్యోగపర్వమునందు సేనోద్యోగపర్వమున
ద్రుపదవాక్య మను నాలుగవ అధ్యాయము.

—(०)—

# పఞ్చమోఽధ్యాయః - అయిదవ అధ్యాయము

శ్రీకృష్ణస్య ద్వారకాగమనం విరాట్ద్రుపదయోః సందేశేన
రాజ్ఞాం పాణ్డవపక్షే యుద్ధా యాగమనమ్.

శ్రీకృష్ణుడు ద్వారకకు వెడలుట, విరాట్ద్రుపదుల మాటపై
రాజులు పాండవుల పక్షమున యుద్ధమునకై వచ్చుట.

వాసుదేవ ఉవాచ-వాసుదేవు డిట్లు పలికెను.

ఉపపన్న మిదం వాక్యం సోమకానాం ధురంధరే,
అర్థసిద్ధికరం రాజ్ఞః పాణ్డవ స్యామితౌజసః. 1

సోమకవంశమున దొడ్డవాడగు ద్రుపదుని ఈ మాట చాల యోగ్యముగా నున్నది. గొప్ప శక్తిగల పాండుతనయుడు ధర్మరాజున కిది ప్రయోజనము నెరవేర్చునట్టిది.

ఏతచ్చ పూర్వం కార్యం నః సునీత మభికాఙ్క్షతామ్,
అన్యథా హ్యాచరన్ కర్మ పురుషః స్యాత్ సుబాలిశః. 2

పని చక్కగా నెరవేరవలయునని కోరుచున్న మన కిదియే ముందు చేయదగినది. వేరొక విధముగా చేయువాడు మిక్కిలి మూర్ఖుడే యగును.

కిన్తు సమ్బన్ధకం తుల్య మస్మాకం కురుపాణ్డుషు,
యథేష్టం వర్తమానేషు పాణ్డవేషు చ తేషు చ. 3

---

1. ఉపపన్నమ్ - తగినది.

3. సంబంధకం తుల్యమ్ - పాండవుల విషయమున కుంతి కారణముగా, కౌరవుల విషయమున దుర్యోధనుని కుమార్తెను సాంబుకు తెచ్చి పెండ్లి చేసికొనుట కారణముగా చుట్టరికము సమానము.

పాండవులును కౌరవులును వారి యిష్టము ప్రకారము నడచుకొందురు గాక! మాకు మాత్రము వారిరువురియందును చుట్టరికము సమానమే.

తే వివాహార్థ మానీతా వయం సర్వే తథా భవాన్,
కృతే వివాహే ముదితా గమిష్యామో గృహాన్ ప్రతి. 4

అట్టి మేమందరము పెండ్లికై పిలువగా వచ్చితిమి. మీరును అట్లే. పెండ్లి ముగిసినది. మనము సంతోషముతో ఇండ్లకు పోదము.

భవాన్ వృద్ధతమో రాజ్ఞాం వయసా చ శ్రుతేన చ,
శిష్యవత్ తే వయం సర్వే భవామేహ న సంశయః. 5

మీరు రాజులందరిలో వయసులో, విద్యలో మిక్కిలి వృద్ధులు. మేమందరము మీకు శిష్యులవలె నుందుము. ఇందు సందియము లేదు.

భవన్తం ధృతరాష్ట్రశ్చ సతతం బహు మన్యతే,
ఆచార్యయోః సఖా చాసి ద్రోణస్య చ కృపస్య చ. 6

ధృతరాష్ట్రుడును మిమ్మెల్లప్పుడు మన్నన చేయుచుండును. మరియు ద్రోణ కృపాచార్యు లిరువురకు మీరు చెలికాండ్రు.

స భవాన్ ప్రేషయ త్వద్య పాణ్డవార్థకరం వచః,
సర్వేషాం నిశ్చితం తన్నః ప్రేషయిష్యతి యద్భవాన్. 7

అట్టి మీరు నేడు పాండవుల కార్యము నెరవేరు పలుకును చెప్పి పంపుడు. మీరేది చెప్పి పంపుదురో అదియే మా యందరి తుదిమాట.

యది తావ చ్ఛమం కుర్యా న్న్యాయేన కురుపుఙ్గవః,
న భవేత్ కురుపాణ్డూనాం సౌభ్రాత్రేణ మహాన్ క్షయః. 8

న్యాయము ననుసరించి ఆ కురుపుంగవుడు శాంతిని కావించినచో కౌరవులకు పాండవులకు అన్నదమ్ములతనము చక్కగా కుదురుకొనును. దానివలన గొప్ప వినాశము కాకుండును.

అథ దర్పాన్వితో మోహా న్న కుర్యా ద్ధృతరాష్ట్రజః,
అన్యేషాం ప్రేషయిత్వా చ పశ్చా దస్మాన్ సమాహ్వయేః. 9

7. వచః - సందేశవాక్యము.

ఆ ధృతరాష్ట్రుని కొడుకు మొండితనముతో గర్వముతో శాంతి చేయ కున్నచో, ఇతరరాజు లందరకు వార్తలంపి పిదప మమ్ములను పిలుపుడు.

తతో దుర్యోధనో మన్దః సహామాత్యః సబాన్ధవః,
నిష్ఠా మాపత్స్యతే మూఢః క్రుద్ధే గాణ్డీవధన్వని. 10

అపుడు, గాండీవము పట్టిన అర్జునుడు కోపముతో పెల్లురేగినచో బుద్ధిలేని వాడు మంచి చెప్పినను తెలియనివాడు నగు దుర్యోధనుడు కుతంత్రములు బోధించు మంత్రులతో చుట్టములతోపాటు వినాశనము నందగలడు.

వైశమ్పాయన ఉవాచ-వైశంపాయను డిట్లు చెప్పెను.

తతః సత్కృత్య వార్ష్ణేయం విరాటః పృథివీపతిః,
గృహాత్ ప్రస్థాపయామాస సగణం సహబాన్ధవమ్. 11

అంతట విరాటమహీపతి శ్రీకృష్ణుని, పరివారముతో చుట్టములతో పాటుగా సత్కరించి సాగనంపెను.

ద్వారకాం తు గతే కృష్ణే యుధిష్ఠిరపురోగమాః,
చక్రుః సాంగ్రామికం సర్వం విరాటశ్చ మహీపతిః. 12

కృష్ణుడు ద్వారక కరుగగా యుధిష్ఠిరుడు మొదలగువారును, విరాట రాజును యుద్ధప్రయత్నము లన్నియు చేయ మొదలిడిరి.

తతః సంప్రేషయామాస విరాటః సహ బాన్ధవైః,
సర్వేషాం భూమిపాలానాం ద్రుపదశ్చ మహీపతిః. 13

అటుపై బంధువులతోపాటుగా విరాటుడును ద్రుపదుడును రాజులందరి కడకును, దూతల నంపిరి.

వచనాత్ కురుసింహానాం మత్స్యపాఞ్చాలయోశ్చ తే,
సమాజగ్ము ర్మహీపాలాః సంప్రహృష్టా మహాబలాః. 14

---

9. ప్రేషయిత్వా - (దూతలను) పంపి;
10. నిష్ఠామ్ - నాశనమును, 'నిష్ఠా నిష్పత్తి నాశాన్త యాచ్ఞానిర్వహణేషు చ' అని విశ్వము.

కురువరేణ్యులగు పాండవులయు విరాటద్రుపదులయు మాటపై మహారాజు లందరు గొప్పబలములతో ఉప్పొంగుచు వచ్చిరి.

తచ్ఛ్రుత్వా పాణ్డుపుత్రాణాం సమాగచ్ఛ న్మహద్ బలమ్,
ధృతరాష్ట్రసుతా శ్చాపి సమానిన్యు ర్మహీపతీన్. 15

అట్లు పాండుపుత్రులకడకు చేరిన గొప్ప సేననుగూర్చి విని ధృతరాష్ట్రుని కొడుకులును రాజులను రావించిరి.

సమాకులా మహీ రాజన్ కురుపాణ్డవకారణాత్,
తదా సమభవత్ కృత్స్నా సంప్రయాణే మహీక్షితామ్. 16

కౌరవ పాండవుల కారణమున రాజులందరు చేయు ఆ గొప్పయాత్ర యందు భూమి యంతయు అల్లకల్లోల మాయెను.

సఙ్కులా చ తదా భూమి శ్చతురఙ్గబలాన్వితా,
బలాని తేషాం వీరాణా మాగచ్ఛన్తి తత స్తతః. 17
చాలయ న్తీవ గాం దేవీం సపర్వతవనా మిమామ్.

నాలుగువిధములైన బలములతో కూడి భూమియంతయు గందరగోళముగా నుండెను. పర్వతములతో అడవులతో కూడిన భూదేవి నంతటిని కంపింపజేయు చున్నవో యన్నట్లు ఆ యా వీరుల సేన లన్నియు ఆ యా దేశములనుండి వచ్చు చున్నవి.

తతః ప్రజ్ఞావయోవృద్ధం పాఞ్చాల్యః స్వపురోహితమ్,
కురుభ్యః ప్రేషయామాస యుధిష్ఠిరమతే స్థితః. 18

అంతట పాంచాలరాజు ద్రుపదుడు యుధిష్ఠిరుని అభిప్రాయము ననుసరించి ప్రజ్ఞలో, వయసులో పెద్దవాడగు తన పురోహితుని కౌరవులకడకు పంపెను.

ఇతి శ్రీమహాభారతే ఉద్యోగపర్వణి సేనోద్యోగపర్వణి
పురోహితయానే పఞ్చమోఽధ్యాయః.

ఇది శ్రీమహాభారతము ఉద్యోగపర్వమునందు సేనోద్యోగపర్వమున
పురోహితప్రయాణము అను అయిదవ అధ్యాయము.

—(o)—

# షష్ఠో ఽ ధ్యాయః - ఆరవ అధ్యాయము

## ద్రుపద స్యానుమతిం గృహీత్వా పురోహితస్య దౌత్యాయ హస్తినాపురం ప్రతి ప్రస్థానమ్-

## ద్రుపదుని అనుమతి గొని పురోహితుడు దౌత్యమునకై హస్తినాపురికి బయలుదేరుట.

ద్రుపద ఉవాచ-ద్రుపదు డిట్లు పలికెను.

భూతానాం ప్రాణినః శ్రేష్ఠాః ప్రాణినాం బుద్ధిజీవినః,
బుద్ధిమత్సు నరాః శ్రేష్ఠాః నరేష్వపి ద్విజాతయః. 1

భూతములలో ప్రాణముకలవి దొడ్డవి. వానిలో బుద్ధితో జీవించునవి మిన్న. వానిలో మానవులు గొప్పవారు. మానవులలో ద్విజన్ములు శ్రేష్ఠులు.

ద్విజేషు వైద్యాః శ్రేయాంసో వైద్యేషు కృతబుద్ధయః,
కృతబుద్ధిషు కర్తారః కర్తృషు బ్రహ్మవాదినః. 2

ద్విజులలో విద్యావంతులు, విద్యావంతులలో సిద్ధాంతముల నెఱిగినవారు, వారిలో కార్యముల చక్కగా నాచరించువారు, వారిలో బ్రహ్మమును చెప్పగలవారు శ్రేష్ఠులు.

స భవాన్ కృతబుద్ధీనాం ప్రధాన ఇతి మే మతిః,
కులేన చ విశిష్టోఽసి వయసా చ శ్రుతేన చ. 3

తమరు సిద్ధాంతముల నెరిగిన వారిలో ముఖ్యులని నా నిశ్చయము. కులము చేతను, వయసుచేతను, పాండిత్యముచేతను విశిష్టులరు.

ప్రజ్ఞయా సదృశ శ్చాసి శుక్రే ణాఙ్గిరసేన చ,
విదితం చాపి తే సర్వం యథావృత్తః స కౌరవః. 4

2. వైద్యాః - విద్యావంతులు; కృతబుద్ధయః - సిద్ధాంతముల నెరిగినవారు.

ప్రజ్ఞయందు శుక్రునితో బృహస్పతితో సమానులరు. మరియు ఆ దుర్యోధను డెట్టివాడో యంతకు మీకు తెలిసినదియే.

పాణ్డవ శ్చ యథావృత్తః కున్తీపుత్రో యుధిష్ఠిరః,
ధృతరాష్ట్రస్య విదితే వఞ్చితాః పాణ్డవాః పరైః. 5

కుంతీపాండుల తనయుడు యుధిష్ఠిరు డెట్టివాడో మీకు తెలియును. ధృతరాష్ట్రునికి తెలిసియుండగనే వారు పాండవులను వంచించిరి.

విదురే ణానునీతోఽపి పుత్రమే వానువర్తతే,
శకుని ర్బుద్ధిపూర్వం హి కున్తీపుత్రం సమాహ్వాయత్,
అనక్షజ్ఞం మతాక్షః సన్ క్షత్రవృత్తే స్థితం శుచిమ్. 6

విదురు డెంతగా బుద్ధిచెప్పినను ధృతరాష్ట్రుడు కొడుకు వెంబడినే పోవును. జూదమున ఆరితేరిన శకుని, యెఱిగి యెఱిగి పాచికలయందు నేర్పులేనివాడు, క్షత్రియధర్మమున నిలిచియున్నవాడు పవిత్రుడు నగు ధర్మరాజును జూదమునకు పురికొల్పెను.

తే తథా వఞ్చయిత్వా తు ధర్మరాజం యుధిష్ఠిరమ్,
న కస్యాఞ్చి దవస్థాయాం రాజ్యం దాస్యన్తి వై స్వయమ్. 7

వా రా విధముగా ధర్మముతో విరాజిల్లు యుధిష్ఠిరుని వంచించి తామై ఎట్టి దశయందును రాజ్యము నొసగరు.

భవాంస్తు ధర్మసంయుక్తం ధృతరాష్ట్రం బ్రువన్ వచః,
మనాంసి తస్య యోధానాం ధ్రువ మావర్తయిష్యతి. 8
విదుర శ్చాపి తద్వాక్యం సాధయిష్యతి తావకమ్. 9

మీరు మాత్రము ధర్మముతో కూడిన మాటనే ధృతరాష్ట్రునకు బోధించుచు వాని యోధుల మనస్సులను మరలింపుడు. విదురుడును మీ ఆ మాటను బలపరచును.

భీష్మద్రోణకృపాదీనాం భేదం సంజనయిష్యతి.

అట్లే మీమాట భీష్ముడు ద్రోణుడు, కృపుడు మున్నగువారియందు భేదమును పుట్టించును.

అమాత్యేషు చ భిన్నేషు యోధేషు విముఖేషు చ,
పున రేకత్రకరణం తేషాం కర్మ భవిష్యతి. 10

మంత్రులలో భేదము పుట్టగా, యుద్ధవీరులు పెడమొగము పెట్టగా మరల వారు వారినందరిని ఒక్క కొలికికి తెచ్చుట పెద్దపని యగును.

ఏతస్మి న్నన్తరే పార్థాః సుఖ మేకాగ్రబుద్ధయః,
సేనాకర్మ కరిష్యన్తి ద్రవ్యాణాం చైవ సఞ్చయమ్. 11

ఈ లోపున పాండవులు సుఖముగా, చెదరని బుద్ధితో సేనకు సంబంధించిన పనులను ధనమును కూర్చుకొందురు.

భిద్యమానేషు చ స్వేషు లమ్బమానే తథా త్వయి,
న తథా తే కరిష్యన్తి సేనాకర్మ న సంశయః. 12

తమవారు చీలిపోవుచుండగా, మీరు వారికి ఆలస్యము కలిగించుచుండగా ఆ కౌరవులు వీరివలె సేనాకార్యమును చేసికొనజాలరు. ఇది నిశ్చయము.

ఏతత్ప్రయోజనం చాత్ర ప్రాధాన్యే నోపలభ్యతే,
సంగత్యా ధృతరాష్ట్రశ్చ కుర్యా ద్ధర్మ్యం వచ స్తవ. 13

మనకు ముఖ్యముగా ఈప్రయోజనముకూడ సిద్ధించును. ఒకప్పుడు ధర్మము తప్పని మీ మాటను ధృతరాష్ట్రుడు పాటింపవచ్చును.

స భవాన్ ధర్మయుక్తశ్చ ధర్మ్యం తేషు సమాచరన్,
కృపాలుషు పరిక్లేశాన్ పాణ్డవీయాన్ ప్రకీర్తయన్. 14
వృద్ధేషు కులధర్మం చ బ్రువన్ పూర్వై రనుష్ఠితమ్,
విభేత్స్యతి మనాం స్యేషా మితి మే నాత్ర సంశయః. 15

---

11. ఏతస్మిన్నన్తరే - శత్రువులు చెదిరిన వారిని కూర్చుకొనుటలో మునిగి యుండగా;

12. లమ్బమానే-ఆలస్యము చేయుచుండగా;

అట్టి మీరు ధర్మముతో కూడినవారై వారియందు ధర్మయుక్తమైనదానిని ఆచరించుచు, అచటి దయగల వృద్ధులకడ పాండవు లనుభవించిన పెనుకష్టము లను ఉగ్గడించుచు, పూర్వులు పాటించిన కులధర్మమును ఉపదేశించుచు వారి మనస్సులను మరలింపగలరని నా నమ్మకము.

న హి తేభ్యో భయం తేఽస్తి బ్రాహ్మణో హ్యసి వేదవిత్,
దూతకర్మణి యుక్తశ్చ స్థవిరశ్చ విశేషతః. 16

తమకు వారివలన ఏ భయమును లేదు. ఏలయన మీరు వేదము నెరిగిన బ్రాహ్మణులరు. దూతకర్మమున నియుక్తులరు. విశేషించి వృద్ధులరు.

స భవాన్ పుష్యయోగేన ముహూర్తేన జయేన చ,
కౌరవేయాన్ ప్రయాత్వాశు కౌన్తేయ స్యార్థసిద్ధయే. 17

తమరు పుష్యమీనక్షత్రముతో గూడిన జయమును గలిగించు ముహూర్త మున ధర్మరాజు కార్యసిద్ధికై కౌరవులకడకు వెంటనే యరుగవలయును.

వైశంపాయన ఉవాచ-వైశంపాయను డిట్లు చెప్పెను

తథానుశిష్టః ప్రయయౌ ద్రుపదేన మహాత్మనా
పురోధా వృత్తసంపన్నో నగరం నాగసాహ్వయమ్. 18

మహాత్ముడగు ద్రుపదు డిట్లు చెప్పగా చక్కని నడవడిగల ఆ పురో హితుడు హస్తినాపురమునకు బయలుదేరెను.

శిష్యైః పరివృతో విద్వాన్ నీతిశాస్త్రార్థకోవిదః,
పాణ్డవానాం హితార్థాయ కౌరవాన్ ప్రతి జగ్మివాన్. 19

నీతిశాస్త్రవిషయములను చక్కగా నెరిగిన ఆ విద్వాంసుడు శిష్యులతో కూడి పాండవుల హితమును సాధించుటకై కౌరవులకడ కరిగెను.

ఇతి శ్రీమహాభారతే ఉద్యోగపర్వణి సేనోద్యోగపర్వణి
పురోహితయానే షష్ఠోఽధ్యాయః.

ఇది శ్రీమహాభారతము ఉద్యోగపర్వమున సేనోద్యోగపర్వమున
పురోహితుని ప్రయాణ మను ఆరవ అధ్యాయము.

—(౦)—

# సప్తమోఽధ్యాయః - ఏడవ అధ్యాయము

**శ్రీకృష్ణేన దుర్యోధనార్జునయోః సాహాయ్యకరణమ్-**
**శ్రీకృష్ణుడు దుర్యోధనార్జునులకు సాయముచేయుట.**

వైశమ్పాయన ఉవాచ - వైశంపాయను డిట్లు చెప్పెను.

పురోహితం తే ప్రస్థాప్య నగరం నాగసాహ్వయమ్,
దూతాన్ ప్రస్థాపయామాసుః పార్థివేభ్య స్తత స్తతః. 1

ఆ పాండవులు హస్తినాపురమునకు పురోహితుని పంపి ఆ యా రాజుల కడకు దూతల నంపిరి.

ప్రస్థాప్య దూతా నన్యత్ర ద్వారకాం పురుషర్షభః,
స్వయం జగామ కౌరవ్యః కున్తీపుత్రో ధనఞ్జయః. 2

ఇతరదేశములకు దూతలను పంపి ద్వారకకు మాత్రము పురుషశ్రేష్ఠుడు, కురువంశమువాడు, కుంతి కుమారుడు నగు అర్జునుడు స్వయముగా నరిగెను.

గతే ద్వారవతీం కృష్ణే బలదేవే చ మాధవే,
సహ వృష్ణ్యన్ధకైః సర్వై ర్భోజైశ్చ శతశ స్తదా. 3
సర్వ మాగమయామాస పాణ్డవానాం విచేష్టితమ్,
ధృతరాష్ట్రాత్మజో రాజా గూఢైః ప్రణిహితై శ్చరైః. 4

కృష్ణుడు బలరాముడును తమవారగు వృష్ణి, అంధక, భోజ వంశముల వారందరితోపాటు ద్వారవతి కరుగగా ధృతరాష్ట్రుని కుమారుడు రారాజు గూఢ చారులవలన పాండవులచేష్ట సంతతిని ఎరిగెను.

స శ్రుత్వా మాధవం యాన్తం సదశ్వై రనిలోపమైః,
బలేన నాతిమహతా ద్వారకా మభ్యయాత్ పురీమ్. 5

---

4. ఆగమయామాస - ఎఱిగెను.

మాధవుడు ద్వారకకు పోవుచుండుటను విని దుర్యోధనుడు గాలితో పోలెడు మంచి గుఱ్ఱములతో, కొంచెముపాటి సేనతో ద్వారవతీపురమునకు బయలుదేరెను.

తమేవ దివసం చాపి కౌన్తేయః పాణ్డునన్దనః,
ఆనర్తనగరీం రమ్యాం జగామాశు ధనఞ్జయః. 6

ఆనాడే కుంతీతనయుడగు పాండవుడు అర్జునుడు వడిగా రమ్యమైన ద్వారకకు అరిగెను.

తౌ యాత్వా పురుషవ్యాఘ్రౌ ద్వారకాం కురునన్దనౌ,
సుప్తం దదృశతుః కృష్ణం శయానం చాభిజగ్మతుః. 7

పురుషవరేణ్యులగు ఆ కురుకుమారు లిద్దఱు ద్వారక కరిగి నిద్రించు చున్న కృష్ణుని గాంచిరి. అట్లు నిద్రించుచున్న ఆతని సమీపమున కరిగిరి.

తతః శయానే గోవిన్దే ప్రవివేశ సుయోధనః,
ఉచ్ఛీర్షతశ్చ కృష్ణస్య నిషసాద వరాసనే. 8

అట్లు గోవిందుడు నిదురించుచుండగా సుయోధనుడు ప్రవేశించెను. ఆతని తలవైపు ఎత్తైన మేలైన ఆసనమున కూర్చుండెను.

తతః కిరీటీ తస్యాను ప్రవివేశ మహామనాః,
పశ్చాచ్చైవ స కృష్ణస్య ప్రహ్వోఽతిష్ఠత్ కృతాఞ్జలిః. 9

అటుపై దొడ్డబుద్ధిగల కిరీటి ఆతని వెనువెంటనే ప్రవేశించెను. కృష్ణుని కాళ్ళవైపుగా, వినయముతో చేతులు మోడ్చి కూర్చుండెను.

ప్రతిబుద్ధః స వార్ష్ణేయో దదర్శాగ్రే కిరీటినమ్,
స తయోః స్వాగతం కృత్వా యథావత్ ప్రతిపూజ్య తౌ, 10
తదాగమనజం హేతుం పప్రచ్ఛ మధుసూదనః.

కృష్ణుడు నిదుర లేచి ముందుగా అర్జునుని చూచెను. వారిరువురికి స్వాగతము నెరపెను. తగు విధముగా మర్యాదలు చేసి మధుసూదనుడు వారి రాకకు కారణ మడిగెను.

తతో దుర్యోధనః కృష్ణ మువాచ ప్రహసన్నివ,
విగ్రహేఽస్మిన్ భవాన్ సాహ్యం మమ దాతు మిహార్హసి. 11

అంత దుర్యోధనుడు మెల్లగా నవ్వుచు నిట్లనెను. "నీవు ఈ కయ్యమున నాకు సాయ మొసగవలయును".

సమం హి భవతః సఖ్యం మమ చైవార్జునేఽపి చ,
తథా సంబన్ధకం తుల్య మస్మాకం త్వయి మాధవ. 12

"నీకు నాయందును, అర్జునునియందును చెలిమి సమానమే గదా! మాధవా! అట్లే మాకు నీయందు చుట్టరికమును తుల్యమే".

అహం చాభిగతః పూర్వం త్వా మద్య మధుసూదన,
పూర్వం చాభిగతం సన్తో భజన్తే పూర్వసారిణః. 13

"మఱియు ఓ మధుసూదనా! నేడు ముందుగా నేను నీకడకు వచ్చితిని పూర్వాచారములను పాటించువారు ముందు వచ్చినవారిని చేపట్టుదురు".

త్వం చ శ్రేష్ఠతమో లోకే సతా మద్య జనార్దన !
సతతం సమ్మత శ్చైవ సద్వృత్త మనుపాలయ. 14

"ఓ జనార్దనా! నీవును లోకమున సజ్జనులలో మిక్కిలి శ్రేష్ఠుడవు. ఎల్లపుడు సర్వులకు ఇష్టుడవు. కావున సదాచారమును పాటింపుము".

కృష్ణ ఉవాచ-కృష్ణు డిట్లు పలికెను.

భవా నభిగతః పూర్వ మత్ర మే నాస్తి సంశయః,
దృష్ట స్తు ప్రథమం రాజన్ మయా పార్థో ధనఞ్జయః. 15

"రాజా! నీవు ముందు వచ్చితివి. ఇందు సంశయము లేదు. కాని ఈ అర్జునుడు ముందు నా కంటబడెను".

తవ పూర్వాభిగమనాత్ పూర్వం చాప్యస్య దర్శనాత్,
సాహాయ్య ముభయో రేవ కరిష్యామి సుయోధన ! 16

---

13. పూర్వసారిణః-పూర్వుల అచారములను పాటించువారు.

"ఓయి సుయోధనా! ముందు వచ్చినందువలనను, ముందుగా చూచినందు వలనను మీ యిరువురకును సాయము చేయుదును."

ప్రవారణం తు బాలానాం పూర్వం కార్య మితి శ్రుతిః,
తస్మాత్ ప్రవారణం పూర్వ మర్హః పార్థో ధనఞ్జయః. 17

"కోరిక తీర్చుట బాలురకు ముందని శాస్త్రము. కావున ముందుగా అర్జునుని కోరిక తీర్తును".

మత్సంహననతుల్యానాం గోపానా మర్బుదం మహత్,
నారాయణా ఇతి ఖ్యాతాః సర్వే సంగ్రామయోధినః. 18

"నాతో సమానమైన దేహబలము గలవారు, నారాయణులని ప్రసిద్ధి కెక్కినవారు నగు గోపాలురు యుద్ధమున పోరువారు పదిలక్షలమంది కలరు".

తే వా యుధి దురాధర్షా భవ న్త్వేకస్య సైనికాః,
అయుధ్యమానః సఙ్గ్రామే న్యస్తశస్త్రోఽహ మేకతః. 19

"ఎవ్వరికిని సాధింపజాలని ఆ గోపాలురు యుద్ధమున ఒక పక్షమునకు సైనికు లగుదురు. ఆయుధము నావలబెట్టి యుద్ధము చేయకుండ నేనొకవైపు ఉందును."

ఆభ్యా మన్యతరం పార్థ యత్ తే హృద్యతరం మతమ్,
తద్ వృణీతాం భవా నగ్రే ప్రవార్య స్త్వం హి ధర్మతః. 20

"అర్జునా! ఈ రెంటిలో నీ కేది మిక్కిలి ఇష్టమో ముందుగా నీవు కోరుకొనుము. ధర్మమును బట్టి ముందు నీకు గదా కోరిక చెల్లింపవలయును.

వైశమ్పాయన ఉవాచ-వైశంపాయను డిట్లు చెప్పెను.

ఏవ ముక్తస్తు కృష్ణేన కున్తీపుత్రో ధనఞ్జయః,
అయుధ్యమానం సంగ్రామే వరయామాస కేశవమ్. 21

17. ప్రవారణమ్ - కోరిక తీర్చుట "కామ్యదానం ప్రవారణమ్" అని విశ్వము.

కృష్ణు డి ట్లాడగా కుంతికొడుకు అర్జునుడు యుద్ధమున పోరాడని శ్రీకృష్ణునే యెన్నుకొనెను.

నారాయణ మమిత్రఘ్నం కామా జ్జాత మజం నృషు,
సర్వక్షత్రస్య పురతో దేవదానవయో రపి. 22

నారాయణుడు, పగవారిని రూపుమాపువాడు, జన్మము లేనివాడు, మానవుల యందు ఇచ్ఛామాత్రమున జనించువాడు, సర్వక్షత్రియులకు, దేవదానవులకును ముందు నిలువగలవాడు నగు శ్రీకృష్ణుని అర్జునుడు ఎన్నుకొనెను.

దుర్యోధనస్తు తత్సైన్యం సర్వ మావరయత్ తదా;
అపుడు దుర్యోధనుడు శ్రీకృష్ణుని సేన నంతటిని కోరెను.

సహస్రాణాం సహస్రం తు యోధానాం ప్రాప్య భారత ! 23
కృష్ణం చాపహృతం జ్ఞాత్వా సంప్రాప పరమాం ముదమ్.

ఓ భారతా! పది లక్షల యోధులను కైవసము చేసికొని ఆ దుర్యోధనుడు కృష్ణుని కొల్లగొట్టితి నని తలఁచి పరమానందము నందెను.

దుర్యోధన స్తు తత్ సైన్యం సర్వ మాదాయ పార్థివః, 24
తతో ఽభ్యయాద్ భీమబలో రౌహిణేయం మహాబలమ్.

దుర్యోధనమహారాజు ఆ సేన నంతటిని కైకొని పిమ్మట భీమబలుడై, మహాబలముగల బలరాముని కడ కరిగెను.

సర్వం చాగమనే హేతుం స తస్మై సంన్యవేదయత్,
ప్రత్యువాచ తత శ్శౌరి ర్ధార్తరాష్ట్రి మిదం వచః. 25

తన రాకయందలి కారణము నంతటిని అత దాతనికి విన్నవించెను. అపుడు శూరవంశమువాడగు ఆ బలరాముడు దుర్యోధనునితో ఇట్లు పలికెను.

బలదేవ ఉవాచ-బలదేవు డిట్లనెను.

విదితం తే నరవ్యాఘ్ర సర్వం భవితు మర్హతి,
యన్మయోక్తం విరాటస్య పురా వైవాహికే తదా. 26

24. అపహృతమ్ - కొల్లగొట్టబడినవానినిగా.

"నరవరా! మునుపు విరాటుని యింట పెండ్లినాడు నే నేమంటినో నీకు తెలిసియే యుండును."

నిగృహ్యోక్తో హృషీకేశ స్త్వదర్థం కురునన్దన,
మయా సంబన్ధకం తుల్య మితి రాజన్ పునః పునః. 27

మనకు చుట్టరికము సమానమే యని కృష్ణునితో పలుమార్లు నీకై ఒత్తి పలికితిని.

న చ తద్ వాక్య ముక్తం వై కేశవం ప్రత్యపద్యత,
న చాహ ముత్సహే కృష్ణం వినా స్థాతు మపి క్షణమ్. 28

"నే నాడిన ఆ మాట కృష్ణునకు రుచింపలేదు. నేను కృష్ణుని వదలి క్షణమైన ఉండజాలను."

నాహం సహాయః పార్థస్య నాపి దుర్యోధనస్య వై,
ఇతి మే నిశ్చితా బుద్ధి ర్వాసుదేవ మవేక్ష్య హ. 29

"నేను ధర్మరాజునకు కాని దుర్యోధనునకు కాని తోడు కారాదు అని కృష్ణుని మొగము చూచి నిశ్చయించుకొంటిని."

జాతోఽసి భారతే వంశే సర్వపార్థివపూజితే,
గచ్ఛ యుధ్యస్వ ధర్మేణ క్షాత్రేణ పురుషర్షభ. 30

"పురుషవరా! రాజు లందరు మన్నించు భరతవంశమున పుట్టితివి పొమ్ము. క్షత్రియధర్మముతో పోరుము."

వైశమ్పాయన ఉవాచ-వైశంపాయను డిట్లు చెప్పెను.

ఇత్యేవ ముక్తస్తు తదా పరిష్వజ్య హలాయుధమ్,
కృష్ణం చాపహృతం జ్ఞాత్వా యుద్ధా న్మేనే జితం జయమ్. 31

బలరాము డిట్లు పలుకగా దుర్యోధను డాతనిని కౌగిలించుకొని కృష్ణుడు పట్టిపోయెనని తలచి యుద్ధమున గెలుపు గెలిచినట్లే తలంచెను.

సోఽభ్యయాత్ కృతవర్మాణం ధృతరాష్ట్రసుతో నృపః,
కృతవర్మా దదౌ తస్య సేనా మక్షౌహిణీం తదా. 32

పిమ్మట దుర్యోధనుడు కృతవర్మ కడ కేగెను. కృతవర్మ ఆతని కొక అక్షౌహిణి లెక్కగల సేన నొసగెను.

స తేన సర్వసైన్యేన భీమేన కురునన్దనః,
వృతః పరియయౌ హృష్టః సుహృదః సంప్రహర్షయన్. 33

ఆ కౌరవుడు భయంకరమైన ఆ మొత్తము సేనతో కూడి ఉప్పొంగుచు, హితులను ఉప్పొంగజేయుచు బయలుదేరెను.

తతః పీతామ్బరధరో జగత్స్రష్టా జనార్దనః,
గతే దుర్యోధనే కృష్ణః కిరీటిన మథాబ్రవీత్. 34

అంతట పచ్చనివస్త్రములు ధరించువాడు, జగముల పుట్టించినవాడు నగు జనార్దనుడు దుర్యోధనుడు వెడలినపిదప అర్జునునితో ఇట్లు పలికెను.

అయుధ్యమానః కాం బుద్ధి మాస్థాయాహం వృత స్త్వయా.

"యుద్ధము చేయని నన్ను ఏ బుద్ధితో ఎన్నుకొంటివి?"

అర్జున ఉవాచ-అర్జును డిట్లు పలికెను.

భవాన్ సమర్థ స్తాన్ సర్వాన్ నిహన్తుం నాత్ర సంశయః,
నిహన్తు మహ మప్యేకః సమర్థః పురుషర్షభ. 35

"ఓయీ! పురుషోత్తమా! నీవు వారి నందరిని చంప సమర్థుడవు. సంశయము లేదు. అట్లే నేనును ఒక్కడనై వారిని చంపగలను.

భవాంస్తు కీర్తిమాన్ లోకే తద్యశ స్త్వాం గమిష్యతి,
యశసాం చాహ మప్యర్థీ తస్మాదసి మయా వృతః. 36

"నీకు లోకమున నియతమైన కీర్తి కలదు. ఈ కీర్తియు నిన్నే పొందును. నేనును అట్టి కీర్తినే కోరుచున్నాను. ఆ కారణమున నిన్ను కోరితిని."

సారథ్యం తు త్వయా కార్య మితి మే మానసం తదా,
చిరరాత్రేప్సితం కామం తద్ భవాన్ కర్తు మర్హతి. 37

---

36. "భవాంస్తు కీర్తిమాన్" - నీ వెల్లప్పుడు నియమితమైన కీర్తి కలవాడవు. నీ వెందు నిలచినను అది నీకు కీర్తియే యగునని భావము.

నీవు సారథ్యముమాత్రము చేయవలయు నని నా మదిలోని కోరిక. చాల కాలముగా నున్న ఆ కోరికను నీవు మన్నింపవలయును."

వాసుదేవ ఉవాచ-వాసుదేవు డిట్లు పలికెను.

ఉపపన్న మిదం పార్థ యత్ స్పర్ధసి మయా సహ,
సారథ్యం తే కరిష్యామి కామః సమ్పద్యతాం తవ. 38

అర్జునా! నాతో తూగుచున్నావు. ఇది సముచితమే. నీకు బండి తోలుదును. నీకోరిక నెరవేరుగాక.

వైశమ్పాయన ఉవాచ-వైశంపాయను డిట్లు చెప్పెను.

ఏవం ప్రముదితః పార్థః కృష్ణేన సహిత స్తదా,
వృతో దాశార్హప్రవరైః పున రాయాద్ యుధిష్ఠిరమ్. 39

ఇ ట్లర్జునుడు కృష్ణునితో కూడి పరమానందము పొంది దాశార్హవీరు లందరు చుట్టి రాగా తిరిగి ధర్మరాజుకడకు వచ్చెను.

ఇతి శ్రీమహాభారతే ఉద్యోగపర్వణి సేనోద్యోగపర్వణి కృష్ణ
సారథ్యస్వీకారే సప్తమోఽధ్యాయః.

ఇది శ్రీమహాభారతము ఉద్యోగపర్వమున సేనోద్యోగపర్వమున
కృష్ణుడు సారథ్యమున కంగీకరించుట యను ఏడవ అధ్యాయము.

—(०)—

## అష్టమోఽధ్యాయః - ఎనిమిదవ అధ్యాయము

**సత్కారేణ సుప్రసన్నస్య శల్యస్య దుర్యోధనాయ వరదానం,**
**యుధిష్ఠిరాయ సాన్త్వనాప్రదానం చ -**

**సత్కారముచేత ప్రసన్నుడైన శల్యుడు దుర్యోధనునకు**
**వర మొసగుట, ధర్మరాజు నూరడించుట.**

వైశమ్పాయన ఉవాచ-వైశంపాయను డిట్లు చెప్పెను.

శల్యః శ్రుత్వా తు దూతానాం సైన్యేన మహతా వృతః,
అభ్యయాత్ పాణ్డవాన్ రాజన్ సహ పుత్రైర్మహారథైః. 1

రాజా! దూతల మాటలను విని శల్యుడు గొప్పసేనలతో, మహారథులగు పుత్రులతో కూడి పాండవులకడకు బయలుదేరెను.

తస్య సేనానివేశోఽభూ దధ్యర్ధమివ యోజనమ్,
తథాహి విపులాం సేనాం బిభర్తి స నరర్షభః. 2

ఆతని సేనల విడిదిపట్టు ఒక యోజనముపై సగ మున్నట్లుండెను. ఆ రాజేంద్రుడు అంతపెద్ద సేనను భరించుచుండెను.

అక్షౌహిణీపతీ రాజన్ మహావీర్యపరాక్రమః,
విచిత్రకవచాః శూరా విచిత్రధ్వజకార్ముకాః. 3
విచిత్రాభరణాః సర్వే విచిత్రరథవాహనాః,
విచిత్రస్రగ్ధరాః సర్వే విచిత్రాంబరభూషణాః. 4

స్వదేశవేషాభరణా వీరాః శతసహస్రశః,
తస్య సేనాప్రణేతారో బభూవుః క్షత్రియర్షభాః. 5

ఆ రాజు కొన్ని అక్షౌహిణుల సేనకు అధిపతి. గొప్ప దేహబలము, మనోబలము కలవాడు. క్షత్రియశ్రేష్ఠులగు అతని సేనాపతు లందరు శూరులు. విచిత్రములగు పతాకలు, విండ్లు, నగలు, రథములు, వాహనములు, మాలలు, వస్త్రములు, అలంకారములు, స్వదేశ వేషములు కలిగి నూర్లకొలదిగా వేలకొలదిగా నున్నారు.

వ్యథయన్నివ భూతాని కమ్పయన్నివ మేదినీమ్,
శనై ర్విశ్రామయన్ సేనాం స యయౌ యేన పాణ్డవః. 6

భూతములను పీడించుచు, భూమిని దద్దరిల్లజేయుచు, అందందు సేనను విడియించి శ్రమ దీర్చుచు, ఆ రాజు ధర్మరాజున్న దేశమునకు బయలుదేరెను.

తతో దుర్యోధనః శ్రుత్వా మహాత్మానం మహారథమ్,
ఉపాయా న్త మభిద్రుత్య స్వయ మానర్చ భారత. 7

అంతట దుర్యోధనుడు మహారథుడైన ఆ మహాత్ముడు వచ్చుచున్నాడని విని పరుగున స్వయముగా బోయి పూజించెను.

కారయామాస పూజార్థం తస్య దుర్యోధనః సభాః,
రమణీయేషు దేశేషు రత్నచిత్రాః స్వలంకృతాః. 8

ఆ శల్యుని పూజకై దుర్యోధనుడు రమణీయములగు తావులలో రత్నములతో చిత్రములు, చక్కగా అలంకరింపబడినవియు నగు విడిదులను ఏర్పాటు చేయించెను.

శిల్పిభి ర్వివిధై శ్చైవ క్రీడా స్తత్ర ప్రయోజితాః,
తత్ర వస్త్రాణి మాల్యాని భక్ష్యం పేయం చ సత్కృతమ్. 9

ఆ యా పనులలో ఆరితేరినవారిచే వినోదము లెన్నియో ఏర్పాటు చేసెను. చక్కని వస్త్రములను, మాల్యములను, తినుటకు త్రావుటకు వలయు పదార్థములను చక్కగా ఏర్పరచెను.

కూపాశ్చ వివిధాకారా మనోహర్షవివర్ధనాః,
వాప్యశ్చ వివిధాకారా ఔదకాని గృహాణి చ. 10

పెక్కుతీరులు గలిగి హృదయము నలరించు నూతులను, బావులను చల్లదనమునకై నీటియేర్పాటుగల యిండ్లను కల్పించెను.

స తాః సభాః సమాసాద్య పూజ్యమానో యథామరః,
దుర్యోధనస్య సచివై ర్దేశే దేశే సమ న్తతః. 11

---

6. యేన - ఏ దేశమున ధర్మరా జుండెనో అక్కడకు;

ఆ యా దేశములందు ఆ విడిది పట్టులను చేరిన శల్యుడు ఒక దేవతవలె దుర్యోధనుని మంత్రులచేత పూజల నందుచుండెను.

ఆజగామ సభా మన్యాం దేవావసథవర్చసమ్,
స తత్ర విషయై ర్యుక్తైః కల్యాణై రతిమానుషైః. 12
మేనేఽభ్యధిక మాత్మాన మవమేనే పురన్దరమ్,
పప్రచ్ఛ స తతః ప్రేష్యాన్ ప్రహృష్టః క్షత్రియర్షభః. 13

దేవాలయము వంటి దీప్తిగల మరియొక సభ నాతడు చేరెను. అచట మానవుల కందని మంగళముల నాతడు పొంది తన్ను చాల గొప్పవానినిగా తలచెను. ఇంద్రుడు కూడ తనకంటె తక్కువవాడే యనుకొనెను. ఆ పురుష వరేణ్యుడు ఎంతో ఉప్పొంగి అచటి సేవకుల నిట్లడిగెను.

యుధిష్ఠిరస్య పురుషాః కేఽత్ర చక్రుః సభా ఇమాః,
ఆనీయన్తాం సభాకారాః ప్రదేయార్హా హి మే మతాః. 14

"ఈ విడుదులను తీర్చిన యుధిష్ఠిరుని బంటు లెవ రక్కడః ఆ సభాకారుల నిచటకు తెండు. వారు బహుమానముల కర్హులని నా తలపు."

ప్రసాద మేషాం దాస్యామి కున్తీపుత్రోఽనుమన్యతామ్,
దుర్యోధనాయ తత్ సర్వం కథయన్తి స్మ విస్మితాః. 15

"వారికి పారితోషికము నొసగుదును. ధర్మరాజును ఒప్పింపుడు."—ఆత డిట్లనగా అచటి వారందరు ఆశ్చర్యపడి ఆ విషయమెల్ల దుర్యోధనునకు చెప్పిరి.

సంప్రహృష్టో యదా శల్యో దిదిత్సు రపి జీవితమ్,
గూఢో దుర్యోధన స్తత్ర దర్శయామాస మాతులమ్. 16

శల్యుడు పరిపూర్ణముగా తృప్తి నొంది జీవితమైనను ఒసగుటకు సిద్ధపడు చుండెనని తెలిసినపుడు గుట్టుగా అచట నున్న దుర్యోధనుడు మామకు కాన వచ్చెను.

తం దృష్ట్వా మద్రరాజశ్చ జ్ఞాత్వా యత్నం చ తస్య తమ్,
పరిష్వ జ్యాబ్రవీత్ ప్రీత ఇష్టోఽర్థో గృహ్యతా మితి. 17

---

16. దిదిత్సుః- ఈయగోరినవాడు; గూఢః-గుట్టుగా నున్నవాడు.

మద్రరాజు ఆతనిని చూచి ఆతని ప్రయత్న మెరిగి కౌగలించుకొని ప్రీతుడై నీ కిష్టమైన అర్థమును కైకొనుమని పలికెను.

దుర్యోధన ఉవాచ-దుర్యోధను డిట్లు పలికెను.

సత్యవాగ్ భవ కల్యాణ వరో వై మమ దీయతామ్,
సర్వసేనాప్రణేతా వై భవాన్ భవితు మర్హతి. 18

"ఓ పుణ్యాత్ముడా! సత్యవచనుడవు కమ్ము. నాకు వర మొసగుము. నా సర్వసేనకు నాయకుడవు కావలయును."

[యథైవ పాణ్డవా స్తుభ్యం తథైవ భవతే హ్యహమ్,
అనుమాన్యం చ పాల్యం చ భక్తం చ భజ మాం విభో,

"నీకు పాండవు లెట్లో నేనును అట్టివాడనే. నేను మన్నింప దగినవాడను, పాలింపదగినవాడను. భక్తుడను. ప్రభూ! నన్ను చేరుము."

శల్య ఉవాచ-శల్యు డిట్లనెను.

ఏవ మేత న్మహారాజ యథా వదసి పార్థివ,
ఏవం దాదామి తే ప్రీత ఏవ మేతద్ భవిష్యతి.

"ఓ మహారాజా! నీ మాటయే కానిమ్ము. ప్రీతుడనైన నీకు అట్లే వర మిత్తును. ఇది యిట్లే కాగలదు."]

వైశమ్పాయన ఉవాచ-వైశంపాయను డిట్లు చెప్పెను.

కృత మిత్యబ్రవీ చ్ఛల్యః కిమన్యత్ క్రియతా మితి,
కృత మిత్యేవ గాన్ధారిః ప్రత్యువాచ పునః పునః. 19

శల్యుడు సరే యనెను. మరి యేమి చేయుమందు వనగా దుర్యోధనుడు చాలు చాలు నని మరల మరల బదులు పలికెను.

శల్య ఉవాచ-శల్యు డిట్లు పలికెను.

గచ్ఛ దుర్యోధన పురం స్వక మేవ నరర్షభ,
అహం గమిష్యే ద్రష్టుం వై యుధిష్ఠిర మరిన్దమమ్. 20

"నరవరా! దుర్యోధనా! నీ పురమున కరుగుము. నేను శత్రుమర్దనుడైన ధర్మరాజును చూచివచ్చుట కరిగెదను."

దృష్ట్వా యుధిష్ఠిరం రాజన్ క్షిప్ర మేష్యే నరాధిప:
అవశ్యం చాపి ద్రష్టవ్యః పాణ్డవః పురుషర్షభ. 21

"రాజా! యుధిష్ఠిరుని చూచి త్వరగా వత్తును. పురుషశ్రేష్ఠుడగు పాండవుని తప్పక చూచి రావలయును గదా!"

దుర్యోధన ఉవాచ-దుర్యోధను డిట్లు పలికెను.

క్షిప్ర మాగమ్యతాం రాజన్ పాణ్డవం వీక్ష్య పార్థివ,
త్వయ్యధీనాః స్మ రాజేన్ద్ర వరదానం స్మరస్వ నః. 22

"రాజా! పాండవుని చూచి వేగముగా రండు. రాజేంద్రా! మేము నీ పాలబడితిమి. మాకు వరము నిచ్చినమాట గుర్తుంచుకొనుడు."

శల్య ఉవాచ-శల్యు డిట్లు పలికెను.

క్షిప్ర మేష్యామి భద్రం తే గచ్ఛస్వ స్వపురం నృప,
పరిష్వజ్య తథాన్యోన్యం శల్యదుర్యోధనా వుభౌ. 23

"త్వరగా వత్తును. నీకు మేలగుగాక! రాజా! నీ పురమున కరుగుము."-పిమ్మట శల్యదుర్యోధనులు ఒకరినొకరు కౌగలించుకొనిరి.

స తథా శల్య మామన్త్ర్య పున రాయాత్ స్వకం పురమ్,
శల్యో జగామ కౌన్తేయా నాఖ్యాతుం కర్మ తస్య తత్. 24

ఆ దుర్యోధనుడు అట్లు శల్యుని వీడ్కొని తిరిగి తన పురమునకు వచ్చెను. కుంతీపుత్రుల కాతని ఆ పనిని గూర్చి చెప్పుటకై శల్యు డరిగెను.

ఉపప్లవ్యం స గత్వా తు స్కన్ధావారం ప్రవిశ్య చ,
పాణ్డవా నథ తాన్ సర్వాన్ శల్య స్తత్ర దదర్శ హ. 25

అతడును ఉపప్లవ్యమున కరిగి సేనల శిబిరములను ప్రవేశించి పాండవుల నందరిని కాంచెను.

సమేత్య చ మహాబాహుః శల్యః పాణ్డుసుతై స్తదా,
పాద్య మర్ఘ్యం చ గాం చైవ ప్రత్యగృహ్ణాద్ యథావిధి. 26

---

25. ఉపప్లవ్యమ్-విరాటనగరపు ఒక భాగము; స్కన్ధావారమ్-సేనలు విడిసిన చోటు:

మహాబాహువగు శల్యుడు పాండవులతో కూడి పాద్యమును, అర్ఘ్యమును, ఆవును వారు మర్యాద ననుసరించి యాయగా స్వీకరించెను.

తతః కుశలపూర్వం హి మద్రరాజోఽరిసూదనః,
ప్రీత్యా పరమయా యుక్తః సమాశ్లిష్యన్ యుధిష్ఠిరమ్. 27

అంత మద్రరాజు పరమప్రీతితో కుశలప్రశ్న లడుగుచు ధర్మరాజును కౌగిలించుకొనెను.

తథా భీమార్జునౌ హృష్టౌ స్వస్రీయౌ చ యమౌ వుభౌ.

అట్లే హర్షముతో నున్న భీమార్జునులను, చెల్లెలి కొడుకులగు కవలలను ఆదరించెను.

[ద్రౌపదీ చ సుభద్రా చ అభిమన్యుశ్చ భారత,
సమేత్య చ మహాబాహుం శల్యం పాణ్డుసుత స్తదా,
కృతాఞ్జలి రదీనాత్మా ధర్మాత్మా శల్య మబ్రవీత్.

ద్రౌపది, సుభద్ర, అభిమన్యుడు, ధర్మరాజు - ఈ అందరును మహాబాహువగు శల్యుని ఆదరించిరి. అంత ధీరాత్ముడు, ధర్మాత్ముడు నగు యుధిష్ఠిరుడు చేతులు జోడించి శల్యునితో ఇట్లనెను.

యుధిష్ఠిర ఉవాచ - ధర్మరా జిట్లు పలికెను.

స్వాగతం తేఽస్తు వై రాజ న్నేత దాసన మాస్యతామ్.

రాజా! నీకు స్వాగతము. ఇదిగో ఆసనము. కూర్చుండుము.

వైశమ్పాయన ఉవాచ - వైశంపాయను డిట్లు చెప్పెను.

తతో న్యషీద చ్ఛల్యశ్చ కాఞ్చనే పరమాసనే,
కుశలం పాణ్డవోఽపృచ్ఛ చ్ఛల్యం సర్వసుఖావహమ్,
స తైః పరివృతః సర్వైః పాణ్డవై ర్ధర్మచారిభిః.

---

28. 'హృష్టౌ' అనుచోట 'కృష్ణౌ' అనుపాఠము కానవచ్చుచున్నది. దాని ప్రకారము భీముడుకూడ కృష్ణుడే కావలయును.

అంతట శల్యుడు బంగారుపీటపై కూర్చుండెను. సర్వసుఖములకు యోగ్యుడగు శల్యుని, ధర్మము ననుష్ఠించు పాండవు లందరితో గూడిన ధర్మ రాజు కుశల మడిగెను.]

ఆసనే చోపవిష్టస్తు శల్యః పార్థ మువాచ హ. 28

ఆసనమున కూర్చున్న శల్యుడు పార్థునితో నిట్లు పలికెను.

కుశలం రాజశార్దూల కచ్చిత్ తే కురునన్దన,
అరణ్యవాసాద్ దిష్ట్యాసి విముక్తో జయతాం వర. 29

రాజశ్రేష్ఠా! కురునందనా! జయశాలీ! అదృష్టవశమున అరణ్యవాసము నుండి బయటపడితివి. నీకు కుశలమే కదా!

సుదుష్కృతం కృతం రాజన్ నిర్జనే వసతా త్వయా,
భ్రాతృభిః సహ రాజేన్ద్ర కృష్ణయా చానయా సహ. 30

మనుజుల జాడ లేని అడవిలో తమ్ములతో ఈ కృష్ణతో కూడ నివసించిన నీవు ఎవ్వరు చేయజాలని కార్యము చేసితివి.

అజ్ఞాతవాసం ఘోరం చ వసతా దుష్కరం కృతమ్,
దుఃఖ మేవ కుతః సౌఖ్యం భ్రష్టరాజ్యస్య భారత. 31

ఘోరమైన అజ్ఞానవాసమునందును నీవు దుష్కరమైనపనినే గావించితివి. భారతా! రాజ్యము కోల్పోయినవానికి దుఃఖమే కాని సుఖ మెక్కడిది?

దుఃఖ స్యైతస్య మహతో ధార్తరాష్ట్రకృతస్య వై,
అవాప్స్యసి సుఖం రాజన్ హత్వా శత్రూన్ పరంతప. 32

దుర్యోధనుడు పెట్టిన ఈ పెద్దకష్టము ననుభవించిన నీవు శత్రువుల సంహరించి సుఖమును పొందగలవు.

విదితం తే మహారాజ లోకతన్త్రం నరాధిప,
తస్మా ల్లోభకృతం కిఞ్చిత్ తవ తాత న విద్యతే. 33

మహారాజా! నీకు లోకముతీరు బాగుగా తెలియును. కావున లోభముతో నగున దేదియు నీ యందు కొంచెమైనను కానరాదు.

రాజర్షీణాం పురాణానాం మార్గ మన్విచ్ఛ భారత,
దానే తపసి సత్యే చ భవ తాత యుధిష్ఠిర. 34

నాయనా! పూర్వకాలపు రాజర్షుల మార్గము ననుసరింపుము. దానము, తపస్సు, సత్యము అనువానియందు నిష్ఠ కలిగియుండుము.

క్షమా దమశ్చ సత్యం చ అహింసా చ యుధిష్ఠిర,
అద్భుతశ్చ పున ర్లోక స్త్వయి రాజన్ ప్రతిష్ఠితః. 35

రాజా! ఓర్పు, నిగ్రహము, సత్యము, అహింస, అద్భుతమగు ముందుచూపు నీయందు నెలకొనియున్నవి.

మృదు ర్వదాన్యో బ్రహ్మణ్యో దాతా ధర్మపరాయణః,
ధర్మా స్తే విదితా రాజన్ బహవో లోకసాక్షికాః. 36

మెత్తనివాడవు, మంచివాక్కులు కలవాడవు, బ్రహ్మము నెరిగినవాడవు, దాతవు, ధర్మము నంటిపెట్టుకొని యుండువాడవు - ఇట్టి నీయందు లోకమునకు ప్రమాణములైన ధర్మము లెన్నియో కలవు.

సర్వం జగదిదం తాత విదితం తే పరన్తప,
దిష్ట్యా కృచ్ఛ్ర మిదం రాజన్ పారితం భరతర్షభ. 37

"నాయనా! శత్రుమర్దనా! భరతశ్రేష్ఠా! ఈ జగత్తంతయు నీకు తెలిసినదియే. భాగ్యవశమున ఈ కష్టము నంతటిని గడచి గట్టెక్కితివి".

దిష్ట్యా పశ్యామి రాజేన్ద్ర ధర్మాత్మానం సహానుగమ్,
నిస్తీర్ణం దుష్కరం రాజం స్త్వాం ధర్మనిచయం ప్రభో. 38

"ఓయీ రాజేన్ద్రా! భాగ్యవశమున ధర్మాత్ముడవగు నిన్ను తమ్ములతో పాటు చూడగంటిని. ధర్మముల ప్రోవైన నీవు మహాకష్టమును దాటితివి."

---

35. "లోకః" - చూపు అను నర్థము గ్రహింపబడినది.

36. "వదాన్యో వల్గువాగపి" అని యమరము.

37. పారితమ్ - దాటబడినది.

వైశమ్పాయన ఉవాచ-వైశంపాయను డిట్లు చెప్పెను.

తతో౽స్యాకథయద్ రాజా దుర్యోధనసమాగమమ్,
తచ్చ శుశ్రూషితం సర్వం వరదానం చ భారత. 39

పిమ్మట శల్యుడు ధర్మరాజునకు దుర్యోధనుని రాక, సేవ, ఆతని కిచ్చినవరము అనువానినిగూర్చి చెప్పెను.

యుధిష్ఠిర ఉవాచ-ధర్మరా జిట్లు పలికెను.

సుకృతం తే కృతం రాజన్ ప్రహృష్టే నాన్తరాత్మనా,
దుర్యోధనస్య యద్ వీర త్వయా వాచా ప్రతిశ్రుతమ్. 40

ఓ రాజా! ఉప్పొంగిన హృదయముతో నీవు దుర్యోధనునకు మాట యిచ్చినది మంచిదే.

ఏకం త్విచ్ఛామి భద్రం తే క్రియమాణం మహీపతే,
రాజ న్నకర్తవ్య మపి కర్తు మర్హసి సత్తమ. 41

''కాని మహారాజా! నీకు పున్నెమాయె. ఒక్కటి కోరెదను. చేయరాని దైనను చేయవలయును.''

మమ త్వవేక్షయా వీర శృణు విజ్ఞాపయామి తే,
భవా నిహ చ సారథ్యే వాసుదేవసమో యుధి. 42

"వీరుడా! నామీది ప్రీతితో వినుము. నీకు విన్నప మొనరింతును. ఈ లోకమున యుద్ధమున రథము నడపుటలో నీవు కృష్ణునితో సమానుడవు."

కర్ణార్జునాభ్యాం సంప్రాప్తే ద్వైరథే రాజసత్తమే,
కర్ణస్య భవతా కార్యం సారథ్యం నాత్ర సంశయః. 43

రాజశ్రేష్ఠా! కర్ణార్జునులకు ద్వంద్వయుద్ధము సంప్రాప్తమైనపుడు కర్ణునకు నీవే రథము నడపవలసియుండును. సంశయము లేదు.

తత్ర పాల్యో౽ర్జునో రాజన్ యది మత్ప్రియ మిచ్ఛసి,
తేజోవధశ్చ తే కార్యః సౌతే రస్మజ్జయావహః. 44

మాకు ప్రియమును కోరువాడవైనచో రాజా! అందు నీవు అర్జునుని కాపాడవలయును. మాకు జయము సమకూడునట్లు నీవు ఆ సూతపుత్రుని క్రుంగదీయవలయును.

అకర్తవ్య మపి హ్యేతత్ కర్తు మర్హసి మాతుల.

మామా! ఇది కానిపనియే యైనను నీవు చేయవలయును.

శల్య ఉవాచ - శల్యు డిట్లు పలికెను.

శృణు పాణ్డవ తే భద్రం యద్ బ్రవీషి మహాత్మనః,
తేజోవధనిమిత్తం మాం సూతపుత్రస్య సఙ్గమే. 45

ధర్మరాజా! మహాత్ముడగు కర్ణునితో తలపడునపుడు అతని (వాడి తేజము) క్రుంగదీయు మని పలుకుచున్నావు. నీకు మేలయ్యెడు. వినుము.

అహం తస్య భవిష్యామి సఙ్గ్రామే సారథి ర్ధ్రువమ్,
వాసుదేవేన హి సమం నిత్యం మాం స హి మన్యతే. 46

నే నాతనికి యుద్ధమున తప్పక సారథి నగుదును. ఆత డెల్లప్పుడు నన్ను కృష్ణునికి సాటిగా భావించును.

తస్యాహం కురుశార్దూల ప్రతీప మహితం వచః,
ధ్రువం సంకథయిష్యామి యోద్ధుకామస్య సంయుగే. 47

యుద్ధమున ఆతడు విజృంభించి పోరఁగోరినపుడెల్ల పుల్లవిరుపుమాటలను తప్పక పలుకుదును.

యథా స హతదర్పశ్చ హృతతేజాశ్చ పాణ్డవ,
భవిష్యతి సుఖం హన్తుం సత్య మేతద్ బ్రవీమి తే. 48

ఆతని గర్వము చచ్చి, వాడిమి తరిగినపుడు ఆతనిని చంపుట సులభము. నీకు సత్యము చెప్పుచున్నాను.

ఏవ మేతత్ కరిష్యామి యథా తాత త్వమాత్థ మామ్,
యచ్చాన్యదపి శక్ష్యామి తత్ కరిష్యామి తే ప్రియమ్. 49

---

47. ప్రతీపమ్, అహితమ్ - ఎదురు మాటను, హితము కాని మాటను.

నీ వన్నట్లే యిది చేయుదును. మరియు నేదైన నేను చేయగలిగిన ప్రియమును నీకు చేయుదును.

యచ్చ దుఃఖం త్వయా ప్రాప్తం ద్యూతే వై కృష్ణయా సహ,
పరుషాణి చ వాక్యాని సూతపుత్రకృతాని వై. 50
జటాసురాత్ పరిక్లేశః కీచకా చ్చ మహాద్యుతే,
ద్రౌపద్యాధిగతం సర్వం దమయన్త్యా యథాఽశుభమ్. 51
సర్వం దుఃఖ మిదం వీర సుఖోదర్కం భవిష్యతి.

జూదమున ద్రౌపదితోపాటు ఎంతో దుఃఖమును పొందితివి. ఆ సూతుని కొడుకు పరుసములైన పలుకులాడెను. జటాసురునివలన గొప్పకీడు వాటిల్లెను. అట్లే కీచకునివలనను కీడుమూడెను. ద్రౌపది దమయంతివలె పడరానిపాట్లు పడెను. ఓ వీరుడా! ఈ దుఃఖమంతయు నీకు సుఖముగా పరిణమించును.

నాత్ర మన్యు స్త్వయా కార్యో విధిర్హి బలవత్తరః. 52

నీవు ఇచట దైన్యము పొందవలదు. విధి బలవత్తరమైనది గదా!

దుఃఖాని హి మహాత్మానః ప్రాప్నువన్తి యుధిష్ఠిర,
దేవైరపి హి దుఃఖాని ప్రాప్తాని జగతీపతే. 53.

యుధిష్ఠిరా! మహాత్ములకును దుఃఖములు వచ్చును. దేవతలకును దుఃఖములు వచ్చినవి.

ఇన్ద్రేణ శ్రూయతే రాజన్ సభార్యేణ మహాత్మనా,
అనుభూతం మహద్ దుఃఖం దేవరాజేన భారత. 54

రాజా! దేవతలకు రాజు, మహాత్ముడు నగు ఇంద్రుడుకూడ భార్యతోపాటు గొప్పదుఃఖము ననుభవించినట్లు వినవచ్చుచున్నది.

ఇతి శ్రీ మహాభారతే ఉద్యోగపర్వణి సేనోద్యోగపర్వణి
శల్యవాక్యే అష్టమోఽధ్యాయః.

ఇది శ్రీ మహాభారతము ఉద్యోగపర్వమున సేనోద్యోగపర్వమున
శల్యవాక్యమను ఎనిమిదవ అధ్యాయము.

—:o:—

52. మన్యుః-దైన్యము.

# నవమోఽధ్యాయః - తొమ్మిదవ అధ్యాయము

శల్యేన త్రిశిరోవధ వృత్రాసురోత్పత్తి వృత్రేన్ద్రయుద్ధ
దేవపరాజయాది వృత్తాన్తస్యోపవర్ణనమ్.

శల్యుడు త్రిశిరుని వధ, వృత్రాసురుడు పుట్టుక, వృత్రేంద్రుల యుద్ధము, దేవతల పరాజయము అను వృత్తాంతములను వర్ణించుట.

యుధిష్ఠిర ఉవాచ - యుధిష్ఠిరు డిట్లు పలికెను.

కథ మిన్ద్రేణ రాజేన్ద్ర సభార్యేణ మహాత్మనా,
దుఃఖం ప్రాప్తం పరం ఘోర మేత దిచ్ఛామి వేదితుమ్. 1

ఓ రాజేంద్రా! మహానుభావుడగు దేవేంద్రుడు సతితోపాటు ఘోరమైన దుఃఖము నెట్లు పొందెను? దీనిని తెలియగోరుదును.

శల్య ఉవాచ - శల్యు డిట్లు చెప్పెను.

శృణు రాజన్ పురావృత్త మితిహాసం పురాతనమ్,
సభార్యేణ యథా ప్రాప్తం దుఃఖ మిన్ద్రేణ భారత. 2

భారతా! రాజా! మున్నెన్నడో జరిగినది, ప్రాతకాలమునుండి జనులు చెప్పుకొనుచున్నది అగు ఇతిహాసమును వినుము. భార్యతో కూడి యింద్రుడు దుఃఖము నెట్లు పొందెనో చెప్పెదను.

త్వష్టా ప్రజాపతి ర్హ్యాసీద్ దేవశ్రేష్ఠో మహాతపాః,
స పుత్రం వై త్రిశిరస మిన్ద్రద్రోహాత్ కిలాసృజత్. 3

త్వష్ట యను ప్రజాపతి ఉండెడివాడు. అతడు గొప్ప తపస్వి. దేవతలలో శ్రేష్ఠుడు. ఆతడు ఇంద్రుడుచేసిన ద్రోహమును త్రిప్పికొట్టుటకై మూడు తలలుగల పుత్రుని సృజించెనట.

ఐన్ద్రం స ప్రార్థయత్ స్థానం విశ్వరూపో మహాద్యుతిః.

గొప్పతేజస్సుగల ఆ విశ్వరూపుడు (మూడుతలలవానిపేరు) ఇంద్ర పదవిని కాంక్షించెను.

తై స్త్రిభి ర్వదనై ర్ఘోరైః సూర్యేన్దుజ్వలనోపమైః. 4
వేదా నేకేన సోఽధీతే సురా మేకేన చాపిబత్,
ఏకేన చ దిశః సర్వాః పిబన్నివ నిరీక్షతే. 5

సూర్యునివలె, చంద్రునివలె, అగ్నివలె నున్న ఘోరములైన మూడు ముఖములలో ఒకదానితో అతడు వేదములను చదువుచుండెను. ఒకదానితో మద్యము త్రావుచుండెను. మరియొకదానితో దిక్కు లన్నింటిని త్రావుచున్నట్లు చూచుచుండెను.

స తపస్వీ మృదు ర్దాన్తో ధర్మే తపసి చోద్యతః,
తప స్తస్య మహత్ తీవ్రం సుదుశ్చర మరిందమ. 6

ఆ తపస్వి మెత్తనివాడు, ఇంద్రియములపై అదుపుగలవాడు, ధర్మమునందును, తపస్సునందును గట్టిప్రయత్నముతో నుండువాడు. ఆతనితపస్సు మహాతీవ్రముగా నుండెను. ఇతరులకు చేయ శక్యముకానిదై యుండెను.

తస్య దృష్ట్వా తపోవీర్యం సత్యం చామితతేజసః,
విషాద మగమ చ్ఛక్ర ఇన్ద్రోఽయం మా భవే దితి. 7

అంతులేని తేజస్సుగల ఆతని తపస్సుశక్తిని, సత్యమును గాంచి వీ డింద్రుడు కాకుండుట యెట్లా యని దేవేంద్రుడు విషాదము నొందెను.

కథం సజ్జే చ్చ భోగేషు న చ తప్యే న్మహత్తపః,
వివర్ధమాన స్త్రిశిరాః సర్వం హి భువనం గ్రసేత్. 8

ఇతడు భోగములలో తగుల్కొనువిధ మేది? ఘోరతప మెట్లు మానును? ఇట్లు పెరిగిపోయినచో త్రిశిరుడు మూడులోకములను మ్రింగివేయును.

ఇతి సంచిన్త్య బహుధా బుద్ధిమాన్ భరతర్షభ,
ఆజ్ఞాపయత్ సోఽప్సరస స్త్వష్టృపుత్రప్రలోభనే. 9

అని పలువిధముల చింతించి ఆ బుద్ధిమంతుడు త్వష్టకొడుకును మోహపెట్టుటకై అప్సరసలను ఆజ్ఞాపించెను.

యథా స సజ్జేత్ త్రిశిరాః కామభోగేషు వై భృశమ్,
క్షిప్రం కురుత గచ్ఛధ్వం ప్రలోభయత మా చిరమ్. 10

ఆ త్రిశిరుడు కామభోగములలో పెల్లుగా మునిగితేలునట్లు వెంటనే చేయుడు. పొందు. మోహపెట్టుడు. ఆలసింపకుడు.

శృఙ్గారవేషాః సుశ్రోణ్యో హారై ర్యుక్తా మనోహరైః,
హావభావసమాయుక్తాః సర్వాః సౌన్దర్యశోభితాః. 11
ప్రలోభయత భద్రం వః శమయధ్వం భయం మమ.

అందమైన వేషములు, చక్కని పిరుదులు, మనోహరములగు హారములు, హావభావములు కలిగి సౌందర్యముతో శోభిల్లు మీరందరు ఆతనిని మోహపెట్టుడు. మీకు మేలగుగాక; నా భయమును పోగొట్టుడు.

అస్వస్థం హ్యాత్మనాత్మానం లక్షయామి వరాఙ్గనాః,
భయం తన్మే మహాఘోరం క్షిప్రం నాశయ తాబలాః. 12

ఓ వరాంగనలారా! అబలలారా! నాకు ఆరోగ్యము సరిగా లేదని నాకే యనిపించుచున్నది. ఈ ఘోరమైన నా మహాభయమును త్వరగా రూపుమాపుడు.

అప్సరస ఊచుః - అప్సరస లిట్లనిరి.

తథా యత్నం కరిష్యామః శక్ర తస్య ప్రలోభనే,
యథా నావాప్స్యసి భయం తస్మాద్ బలనిషూదన. 13

ఓ బలారీ! దేవేంద్రా ! ఆతనిని మోహపెట్టుటలో నీకు మరల భయము రాకుండునట్లు ప్రయత్నింతుము.

నిర్దహ న్నివ చక్షుర్భ్యాం యోఽసౌ వాస్తే తపోనిధిః,
తం ప్రలోభయితుం దేవ గచ్ఛామః సహితా వయమ్. 14
యతిష్యామో వశే కర్తుం వ్యపనేతుం చ తే భయమ్.

కనులతో కాల్చివేయుచున్నట్లున్నాడే, ఆ తపోనిధిని లొంగదీయుటకు మేమందరము కలసి పోవుచున్నాము. ఆతని చేజిక్కించుకొనుటకు, నీ భయమును తొలగించుటకును ప్రయత్నింతుము.

శల్య ఉవాచ - శల్యు డిట్లు చెప్పెను.

ఇన్ద్రేణ తా స్త్వనుజ్ఞాతా జగ్ముః త్రిశిరసోఽన్తికమ్.

ఇంద్రు దనుమతింపగా వారు త్రిశిరసునికడ కరిగిరి.

తత్ర తా వివిధై ర్భావై ర్లోభయన్త్యో వరాఙ్గనాః. 15
నిత్యం సందర్శయామాసు స్తథై వాఙ్గేషు సౌష్ఠవమ్,
నాభ్యగచ్ఛత్ ప్రహర్షం తాః స పశ్యన్ సుమహాతపాః. 16

ఆ వరాంగనలు వివిధములగు భావములతో అతనిని లోభపెట్టుచుండిరి. తమ అవయవముల జిగిబిగిని నిత్యము చూపుచుండిరి. కాని ఆ మహాతపస్వి వారిని చూచుచు మనోవికారమును పొందలేదు.

ఇన్ద్రియాణి వశే కృత్వా పూర్వసాగరసంనిభః,
తాస్తు యత్నం పరం కృత్వా పునః శక్ర ముపస్థితాః. 17

అతడు ఇంద్రియములను అదుపున పెట్టుకొని తూర్పుసముద్రమువలె గంభీరముగా నుండెను. వారును చేయగల గొప్ప యత్నమును చేసి తిరిగి యింద్రుని కడ కరిగిరి.

కృతాఞ్జలిపుటాః సర్వా దేవరాజ మథాబ్రువన్,
న స శక్యః సుదుర్ధర్షో ధైర్యా చ్చాలయితుం ప్రభో. 18

వారందరు చేతులు జోడించి దేవరాజుతో నిట్లు పలికిరి. ప్రభూ! అతడు మిక్కిలి అసాధ్యుడు. బిగువునుండి కదలింప వీలుకానివాడు.

యత్ తే కార్యం మహాభాగ క్రియతాం తదనన్తరమ్.

కావున ఓ పుణ్యాత్ముడా! పిమ్మట చేయదగినదేమో చేయుము.

సంపూజ్యాప్సరసః శక్రో విసృజ్య చ మహామతిః, 19
చిన్తయామాస తస్యైవ వధోపాయం యుధిష్ఠిర !

ధర్మరాజా! ఇంద్రుడు అప్సరసలను మన్నించి, పంపివైచి ఆతనివధకు ఉపాయమునే ఆలోచించుచుండెను.

స తూష్ణీం చిన్తయన్ వీరో దేవరాజః ప్రతాపవాన్, 20
వినిశ్చితమతి ర్ధీమాన్ వధే త్రిశిరసోఽభవత్,
వజ్ర మస్య క్షిపా మ్యద్య స క్షిప్రం న భవిష్యతి. 21

ప్రతాపవంతుడు, వీరుడు నగు దేవరాజు అదేపనిగ చింతించుచు కడకు మూడుతలలవానిని చంపుటకై నిర్ణయించెను. నేను వానిపై నేడు వజ్రమును బడవైతును. వెంటనే వాడు రూపుమాయును.

శత్రుః ప్రవృద్ధో నోపేక్ష్యో దుర్బలోఽపి బలీయసా,
శాస్త్రబుద్ధ్యా వినిశ్చిత్య కృత్వా బుద్ధిం వధే దృఢామ్. 22

తక్కువసత్తువవాని నైనను పెరిగిపోవుచున్న పగవానిని బలవంతుడు ఒప్పరికింపరాదు. అని శాస్త్రబుద్ధితో నిశ్చయించి ఆతనిని చంపుటకై గట్టిగా బుద్ధి నిలిపెను.

అథ వైశ్వానరనిభం ఘోరరూపం భయావహమ్,
ముమోచ వజ్రం సంక్రుద్ధః శక్ర స్త్రిశిరసం ప్రతి. 23

పిమ్మట ఇంద్రుడు ఘోరమైన రూపముగలదియు, అగ్నివలె మండు చున్నదియు నగు వజ్రమును మిక్కిలి కోపముతో త్రిశిరసునిపై విసరెను.

స పపాత హత స్తేన వజ్రేణ దృఢ మాహతః,
పర్వత స్యేవ శిఖరం ప్రణున్నం మేదినీతలే. 24

ఆ త్రిశిరుడును వజ్రముతో గట్టిదెబ్బ తిని నుగ్గునుగ్గైన కొండకొమ్మువలె నేలఁగూలెను.

తం తు వజ్రహతం దృష్ట్వా శయాన మచలోపమమ్,
న శర్మ లేభే దేవేన్ద్రో దీపిత స్తస్య తేజసా. 25

వజ్రముచే కూలి పర్వతమువలె నేలపై బడియున్న ఆతనిని గాంచి దేవేంద్రు డాతనితేజస్సుతో మండి పోవుచు దుఃఖమును పొందెను.

హతోఽపి దీప్తతేజాః స జీవ న్నివ హి దృశ్యతే,
ఘాతితస్య శిరాంస్యాజౌ జీవ న్తీ వాద్భుతాని వై. 26

ప్రజ్వలించు తేజముగల ఆ త్రిశిరుని చావగొట్టినను వాడు బ్రదికియున్న వానివలెనే కానవచ్చెను. యుద్ధమున తాను పగులఁగొట్టిన వానితలలు ప్రాణముతో నున్నట్లే అచ్చెరువు గొల్పుచుండెను.

తతోఽతిభీతగాత్రస్తు శక్ర ఆస్తే విచారయన్,

అథాజగామ పరశుం స్కన్ధే నాదాయ వర్ధకిః. 27

తదరణ్యం మహారాజ యత్రాస్తేఽసౌ నిపాతితః.

అంత నింద్రుడు మిక్కిలిభీతిగల దేహముతో విచారించుచు నుండెను. ఇంతలో ఒక వడ్రంగి బుజముపై గండ్రగొడ్డలి నిడుకొని అతడు పడియున్న అడవికి వచ్చెను.

స భీత స్తత్ర తక్షాణం ఘటమానం శచీపతిః, 28

అపశ్య దబ్రవీ చ్చైనం సత్వరం పాకశాసనః

క్షిప్రం ఛిన్ధి శిరాంస్యస్య కురుష్వ వచనం మమ. 29

భయపడిన ఆ శచీపతి ఆ వడ్రంగిని చూచి తొందరతో ఇట్లు పలికెను. "వేగముగా వీని తలలను త్రుంపుము. నా మాట పాటింపుము."

తక్షోవాచ-వడ్రంగి యిట్లు పలికెను.

మహాస్కన్ధో భృశం హ్యేష పరశు ర్న భవిష్యతి,

కర్తుం చాహం న శక్ష్యామి కర్మ సద్భి ర్విగర్హితమ్. 30

"పెద్దకొయ్యగల ఈగొడ్డలి విరుగును. మరియు సజ్జనులు తిట్టు ఈపనిని నేను చేయజాలను."

ఇన్ద్ర ఉవాచ-ఇంద్రు డిట్లు పలికెను.

మాభై స్త్వం శీఘ్ర మేతద్ వై కురుష్వ వచనం మమ,

మత్ప్రసాదాద్ధి తే శస్త్రం వజ్రకల్పం భవిష్యతి. 31

భయపడకు. ఈ నా ఆజ్ఞను వెంటనే చేయుము. నా దయవలన నీ ఆయుధము వజ్రముతో సాటియగును.

తక్షోవాచ-వడ్రంగి యిట్లనెను.

కం భవన్త మహం విద్యాం ఘోరకర్మాణ మద్య వై,

ఏత దిచ్ఛామ్యహం శ్రోతుం తత్త్వేన కథయస్వ మే. 32

---

27. వర్ధకిః - వడ్రంగి

28. తక్షా-వడ్రంగి; 30. న భవిష్యతి-విరిగిపోవును.

నేడింత ఘోరమైన పని చేయుచున్న నీ వెవ్వరో నే నెరుగవలయును. ఇది వినగోరుదును. ఉన్నదున్నట్లు నాకు చెప్పుము.

ఇన్ద్ర ఉవాచ-ఇంద్రుడిట్లనెను.

అహ మిన్ద్రో దేవరాజ స్తక్షన్ విదిత మస్తు తే,
కురుష్వైతద్ యథోక్తం మే తక్షన్ మాత్ర విచారయ. 33

నేను దేవతలప్రభువునైన ఇంద్రుడను. ఓయీ వడ్రంగీ! ఇది నీకు తెలియునుగాక! నేను చెప్పినట్లు చేయుము. విచారింపకుము.

తక్షోవాచ-వడ్రంగి యిట్లనెను.

క్రూరేణ నాపత్రపసే కథం శక్రేహ కర్మణా,
ఋషిపుత్ర మిమం హత్వా బ్రహ్మహత్యాభయం న తే. 34

ఓ ఇంద్రా! క్రూరమైన ఈ పని చేయుటకు నీకు సిగ్గువేయుటలేదా? ఋషిపుత్రుని చంపగా వచ్చు బ్రహ్మహత్యవలన నీకు భయము లేదా?

శక్ర ఉవాచ-ఇంద్రుడిట్లనెను.

పశ్చా ద్ధర్మం చరిష్యామి పావనార్థం సుదుశ్చరమ్,
శత్రు రేష మహావీర్యో వజ్రేణ నిహతో మయా. 35

పవిత్రతకై అటుపైన చేయనలవికాని ధర్మము చేయుదును. వీడు నాకు శత్రువు. గొప్ప శక్తికలవాడు. నావజ్రముతో చచ్చెను.

అద్యాపి చాహ ముద్విగ్న స్తక్ష న్నస్మాద్ బిభేమి వై,
క్షిప్రం ఛిన్ధి శిరాంసి త్వం కరిష్యేఽనుగ్రహం తవ. 36

ఇప్పటికిని నాకు జగులుగనే యున్నది. వీనికి భయపడుచున్నాను. కావున తక్షుడా! శీఘ్రముగా వీని తలలను నరకుము. నీకు మేలు చేసెదను.

శిరః పశో స్తే దాస్యన్తి భాగం యజ్ఞేషు మానవాః,
ఏష తేఽనుగ్రహ స్తక్షన్ క్షిప్రం కురు మమ ప్రియమ్. 37

మానవులు యజ్ఞములందు పశువుతలను నీకు భాగముగా ఇత్తురు. ఇది నీకు నా అనుగ్రహము. వడ్రంగీ! వెంటనే నాకు ప్రియ మొనరింపుము.

శల్య ఉవాచ - శల్యు డిట్లు చెప్పెను.

ఏతచ్ఛ్రుత్వా తు తక్షా స మహేన్ద్రవచనాత్ తదా,
శిరాంస్యథ త్రిశిరసః కుఠారే ణాచ్ఛినత్ తదా. 38

ఇది విని ఆ వడ్రంగి దేవేంద్రుని మాటపై త్రిశిరసునితలలు గొడ్డలితో నరకెను.

నికృత్తేషు తత స్తేషు నిష్క్రామ న్నణ్డజా స్త్వథ,
కపిఞ్జలా స్తిత్తిరాశ్చ కలవింకాశ్చ సర్వశః. 39

ఆ తల లట్లు తెగిపడగా అందుండి కముజుపిట్టలు, తీతువుపిట్టలు, ఊర బిచ్చుకలు వెలికి రాజొచ్చినవి.

యేన వేదా నధీతే స్మ పిబతే సోమమేవ చ,
తస్మాద్ వక్త్రాద్ వినిశ్చేరుః క్షిప్రం తస్య కపిఞ్జలాః. 40

వేదములను చదివినదియు, సోమము త్రావినదియు నగు మోమునుండి ఒక్కపెట్టున కముజుపిట్టలు వెలువడినవి.

యేన సర్వా దిశో రాజన్ పిబన్నివ నిరీక్షతే,
తస్మాద్ వక్త్రాద్ వినిశ్చేరు స్తిత్తిరా స్తస్య పాణ్డవ. 41

ఓ పాండుతనయా! దిక్కులన్నియు త్రావుచున్నట్లు చూచెడు వానిముఖ మున్నదే దానినుండి తీతువుపిట్టలు బయలు వెడలినవి.

య త్సురాపం తు తస్యాసీద్ వక్త్రం త్రిశిరస స్తథా,
కలవిఙ్కాః సముత్పేతుః శ్యేనా శ్చ భరతర్షభ. 42

కల్లుత్రావిన ఆత్రిశిరుని ముఖమునుంకి పిచ్చుకలు డేగలు వెలువడినవి.

తత స్తేషు నికృత్తేషు విజ్వరో మఘవా నథ,
జగామ త్రిదివం హృష్ట స్తక్షాపి స్వగృహాన్ యయౌ. 43

అట్లా తలలు తెగిపడిన పిమ్మట ఇంద్రుడు గుబులుదీరి ఆనందముతో స్వర్గమున కరిగెను. ఆ తక్షుడును తన యింటి కరిగెను.

[తథాపి స్వగృహం గత్వా నైవ శంసతి కస్యచిత్,
అథైనం నాభిజానన్తి వర్షమేకం తథాగతమ్.

వడ్రంగి యింటి కేగి ఆ విషయ మెవ్వరికిని చెప్పకుండెను. ఆతని సంగతి యెవ్వరు నెరుగకుండిరి. ఇట్లొకయేడు గడచెను.

అథ సంవత్సరే పూర్ణే భూతాః పశుపతేః ప్రభో,
సమాక్రోశన్త మఘవాన్ నః ప్రభు ర్బ్రహ్మహా ఇతి.

అంత ఒక యేడు నిండగా భూతములు మా ప్రభువు ఇంద్రుడు బ్రహ్మహంత ప్రభూ! అని పశుపతితో మొరపెట్టుకొనెను.

తత ఇన్ద్రో వ్రతం ఘోర మాచరత్ పాకశాసనః,
తపసా చ స సంయుక్తః సహ దేవై ర్మరుద్గణైః.

అంత ఇంద్రుడు దేవతలతోడను మరుద్గణములతోడను కూడి తపస్సు చేయుచు ఘోరమైన వ్రతము నాచరించెను.

సముద్రేషు పృథివ్యాం చ వనస్పతిషు స్త్రీషు చ,
విభజ్య బ్రహ్మహత్యాం చ తాన్ వరై రప్యయోజయత్.

సముద్రములందును, భూమియందును, చెట్లయందును, స్త్రీలయందును బ్రహ్మహత్యాదోషమును పంచి, వారికిని వరము లొసగెను.

వరదస్తు వరం దత్వా పృథివ్యై సాగరాయ చ,
వనస్పతిభ్యః స్త్రీభ్యశ్చ బ్రహ్మహత్యాం నునోద తామ్.

వరములనిచ్చు ఆ ఇంద్రుడు భూమికి, సముద్రమునకు, వృక్షములకు, స్త్రీలకు వరమొసగి ఆ బ్రహ్మహత్యను పాపుకొనెను.

తతస్తు శుద్ధో భగవాన్ దేవై ర్లోకై శ్చ పూజితః,
ఇన్ద్రస్థాన ముపాతిష్ఠత్ పూజ్యమానో మహర్షిభిః.

అంతట దేవేంద్రుడు శుద్ధుడై దేవతలు, మానవులు పూజింపగా, మహర్షుల మన్నన లందుకొనుచు, ఇంద్రపదవి నలంకరించెను.

మేనే కృతార్థ మాత్మానం హత్వా శత్రుం సురారిహా.

దేవేంద్రుడు శత్రువును చంపి తన్ను కృతార్థునిగా భావించెను.]

త్వష్టా ప్రజాపతిః శ్రుత్వా శక్రేణాథ హతం సుతమ్, 44
క్రోధసంరక్తనయన ఇదం వచన మబ్రవీత్.

ప్రజాపతియగు త్వష్ట ఇంద్రునిచేత తనకొడుకు చచ్చెనని విని క్రోధముతో ఎరుపెక్కిన కన్నులతో కూడి యిట్లు పలికెను.

త్వష్టోవాచ-త్వష్ట యిట్లు పలికెను.

తప్యమానం తపో నిత్యం శాన్తం దాన్తం జితేన్ద్రియమ్,
వినాపరాధేన యతః పుత్రం హింసితవాన్ మమ. 45
తస్మా చ్ఛక్రవినాశాయ వృత్ర ముత్పాదయామ్యహమ్.

ఎల్లప్పుడు తపముచేసికొనువాడు, ఓర్పు, లోని వెలుపలి యింద్రియముల అదుపు కలవాడు నగు నా కుమారుని- ఏ తప్పు చేయనివానిని-చంపిన పాపమునకై ఇంద్రుని రూపుమాపుటకై వృత్రుని పుట్టింతును.

లోకాః పశ్యన్తు మే వీర్యం తపసశ్చ బలం మహత్, 46
స చ పశ్యతు దేవేన్ద్రో దురాత్మా పాపచేతనః.

లోకములు నాశక్తిని, తపస్సునందలి మహాబలమును చూచుగాక! దుష్టాత్ముడు, పాపచేతనుడు అగు దేవేంద్రుడును నాశక్తిని పరికించుగాక!

ఉపస్పృశ్య తతః క్రుద్ధ స్తపస్వీ సుమహాయశాః,
అగ్నౌ హుత్వా సముత్పాద్య ఘోరం వృత్ర మువాచ హ.
ఇన్ద్రశత్రో వివర్ధస్వ ప్రభావా త్తపసో మమ. 48

అంత మిక్కుటమగు కోపము, గొప్పకీర్తియు గల ఆ తపస్వి జలమును స్పృశించి అగ్నిని వ్రేల్చి ఘోరరూపముగల వృత్రుని పుట్టించి యిట్లు పలికెను. "ఓయీ! ఇంద్రశత్రూ! నా తపస్సువలన వృద్ధిపొందుము".

సోఽవర్ధత దివం స్తబ్ధ్వా సూర్యవైశ్వానరోపమః,
కిం కరోమీతి చోవాచ కాలసూర్య ఇవోదితః. 49

అతడును సూర్యునివలె అగ్నివలె వెలుగొందుచు-ఆకాశము నరికట్టి పెరిగెను. ప్రళయకాలసూర్యునివలె పెరిగి 'ఏమి చేయుదు'నని పలికెను.

శక్రం జహీతి చాప్యుక్తో జగామ త్రిదివం తతః,
తతో యుద్ధం సమభవద్ వృత్రవాసవయో ర్మహత్. 50

ఇంద్రుని చంపుమని అతడు చెప్పగా నతడంత స్వర్గమున కరిగెను. అంత వృత్రునకు ఇంద్రునకును గొప్పపోరు జరిగెను.

సంక్రుద్ధయో ర్మహాఘోరం ప్రసక్తం కురుసత్తమ,
తతో జగ్రాహ దేవేన్ద్రం వృత్రో వీరః శతక్రతుమ్. 51

మిక్కిలి క్రోధముగల వారిరువురకును మహాఘోరయుద్ధము జరిగెను. అంత వీరుడగు వృత్రుడు నూరుయజ్ఞములు చేసిన దేవేంద్రుని పట్టుకొనెను.

అపావృత్యాక్షిపద్ వక్త్రే శక్రం కోపసమన్వితః,
గ్రస్తే వృత్రేణ శక్రే తు సంభ్రాన్తా స్త్రిదివేశ్వరాః. 52

వృత్రుడు మిక్కిలి కోపముతో నోరుపెద్దగా తెరచి ఇంద్రుని లోనికి విసరెను. అట్లు ఇంద్రుడు వృత్రునకు చిక్కగా దేవతాధిపతు లందరు గుడుసుళ్లు వడిరి.

అసృజంస్తే మహాసత్వా జృంభికాం వృత్రనాశినీమ్,
విజృంభమాణస్య తతో వృత్ర స్యాస్యా దపావృతాత్, 53
స్వాన్యఙ్గాన్యభిసంక్షిప్య నిష్క్రాన్తో బలనాశనః.

గొప్ప సత్తువగల ఆ ప్రభువు లందరు వృత్రుని రూపుమాపు ఆవులింతను సృజించిరి. అంత వృత్రుడు పెద్దగా నోరుతెరచి ఆవులింపగా ఇంద్రుడు తన అవయవములను ముడుచుకొని వెలికివచ్చెను.

తతఃప్రభృతి లోకస్య జృంభికా ప్రాణసంశ్రితా. 54

అదిమొదలు ఆవులింత లోకుల ప్రాణములను పట్టుకొనియుండెను.

జహృషుశ్చ సురా స్సర్వే శక్రం దృష్ట్వా వినిఃసృతమ్,
తతః ప్రవవృతే యుద్ధం వృత్రవాసవయోః పునః. 55

దేవతలందరు వెలికి వచ్చిన దేవేంద్రుని చూచి సంతసించిరి. తిరిగి వృత్రవాసవులకు యుద్ధము ప్రవర్తిల్లెను.

---

52. అపావృత్య-నోరు పెద్దగా చేసి;

సంరబ్ధయో స్తదా ఘోరం సుచిరం భరతర్షభ,
యదా వ్యవర్ధత రణే వృత్రో బలసమన్వితః. 56
త్వష్టు స్తేజోబలావిద్ధ స్తదా శక్రో న్యవర్తత,
నివృత్తే చ తదా దేవా విషాద మగమన్ పరమ్. 57

ఆర్భాటముతో వారిరువురకు ఘోరయుద్ధము బహుకాలము జరిగెను. వృత్రుడు, త్వష్ట యొక్క తేజము బలమును తనలో పిక్కటిల్లగా యుద్ధమున మిక్కిలిగా పెరిగిపోవుచుండెను. అంత ఇంద్రుడు వెనుదిరిగెను. అట్లు వెనుదిరుగగా దేవతలందరు పెనుదుఃఖమును పొందిరి.

సమేత్య సహ శక్రేణ త్వష్టు స్తేజోవిమోహితాః,
ఆమన్త్రియన్త తే సర్వే మునిభి స్సహ భారత. 58
కిం కార్య మితి వై రాజన్ విచిన్త్య భయమోహితాః.

త్వష్ట యొక్క తేజముచేత దిక్కుతెలియని వారంపరు ఇంద్రునితోపాటు మిక్కిలి భయపడినవారై చేయున దేమని మంతనము లాడిరి.

జగ్ముః సర్వే మహాత్మానం మనోభి ర్విష్ణు మవ్యయమ్,
ఉపవిష్టా మన్దరాగ్రే సర్వే వృత్రవధేప్సవః. 59

వారందరును మహాత్ముడు, అవ్యయుడు నగు విష్ణువును మనస్సులతో ఆశ్రయించిరి. వృత్రుని చంపు నుపాయమును ఆలోచించుచు మందరగిరిపై కూర్చుండిరి.

ఇతి శ్రీమహాభారతే ఉద్యోగపర్వణి సేనోద్యోగపర్వణి
ఇన్ద్రవిజయే నవమోఽధ్యాయః.

ఇది శ్రీమహాభారతము ఉద్యోగపర్వమునందు సేనోద్యోగపర్వమున
ఇంద్రవిజయ మను తొమ్మిదవ అధ్యాయము.

—(౦)—

## దశమోఽధ్యాయః - పదియవ అధ్యాయము

సేన్ద్రదేవానాం విష్ణ్వాశ్రయగ్రహణం విష్ణో రాజ్ఞయా వృత్రాసురేణ సహ సన్ధాయావసరే దేవేన్ద్రేణ తస్య వధో బ్రహ్మహత్యాభయా దిన్ద్రస్య జలే నిలయనమ్.

ఇంద్రునితోపాటు దేవతలందరు విష్ణువు నాశ్రయించుట, విష్ణువు నాజ్ఞచే వృత్రునితో కలిసియుండి తగుసమయమున ఇంద్రుడు వృత్రుని చంపుట, బ్రహ్మహత్యాభయమువలన దేవేంద్రుడు నీటిలో అణగియుండుట.

ఇన్ద్ర ఉవాచ - ఇంద్రు డిట్లు పలికెను.

సర్వం వ్యాప్త మిదం దేవా వృత్రేణ జగదవ్యయమ్,
న హ్యస్య సదృశం కిఞ్చిత్ ప్రతిఘాతాయ యద్ భవేత్. 1

దేవతలారా! అవ్యయమగు ఈ జగత్తంతయు వృత్రునితో నిండి పోయినది. ఈతనిని దెబ్బకొట్టుటకు తగినమార్గ మేకొంచెమును కానరాకున్నది.

సమర్థో హ్యభవం పూర్వ మసమర్థోఽస్మి సామ్ప్రతమ్,
కథం ను కార్యం భద్రం వో దుర్ధర్షః స హి మే మతః. 2

పూర్వము నేను సమర్థుడనై యుంటిని. ఇప్పుడేమో అసమర్థుడ నైతిని. ఏమి చేయవలయును? మీకు మేలగుగాక! అతని నణచుట శక్యముకాదని నా అభిప్రాయము.

తేజస్వీ చ మహాత్మా చ యుద్ధే చామితవిక్రమః,
గ్రసేత్ త్రిభువనం సర్వం సదేవాసురమానుషమ్. 3

అతడు తేజముగలవాడు, మహాత్ముడు, గొప్ప విక్రమము కలవాడు. దేవదానవమానవులతో కూడిన ముల్లోకములను మింగివేయగలడు.

తస్మా ద్వినిశ్చయ మిమం శృణుధ్వం త్రిదివౌకసః,
కావున ఓ దేవతలారా! నేను బాగుగా నిశ్చయించిన విషయము వినుడు.

విష్ణోః క్షయ ముపాగమ్య సమేత్య చ మహాత్మనా, 4
తేన సంమన్త్ర్య వేత్స్యామో వధోపాయం దురాత్మనః.

మన మందరము కలసి విష్ణువు భవనమున కరిగి ఆ మహాత్మునితో ఆలోచించి ఈ దురాత్ముని వధించు నుపాయమును తెలిసికొందము.

శల్య ఉవాచ-శల్యు డిట్లు చెప్పెను.

ఏవ ముక్తే మఘవతా దేవాః సర్షిగణా స్తదా,
శరణ్యం శరణం దేవం జగ్ము ర్విష్ణుం మహాబలమ్. 5

దేవేంద్రు డిట్లు పలుకగా ఋషుల సముదాయముతో కూడిన దేవత లందరు శరణు పొందదగినవాడు, రక్షకుడు, మహాబలుడు నగు విష్ణుదేవునికడ కరిగిరి.

ఊచుశ్చ సర్వే దేవేశం విష్ణుం వృత్రభయార్దితాః,
త్రయో లోకా స్త్వయా క్రాన్తా స్త్రిభి ర్విక్రమణైః పురా. 6

దేవత లందరు వృత్రునిభయమువలన పీడితులై దేవతలకును ఈశుడగు విష్ణువుతో నిట్లాడిరి. దేవా! నీవు మున్ను మూడుపదములతో మూడులోకములను ఆక్రమించితివి.

అమృతం చాహృతం విష్ణో దైత్యాశ్చ నిహతా రణే,
బలిం బద్ధ్వా మహాదైత్యం శక్రో దేవాధిపః కృతః. 7

విష్ణూ! నీవు అమృతమును సాధించితివి. యుద్ధమున ఎందరో రక్కసులను రూపుమాపితివి. మహాదైత్యుడగు బలిని బంధించి ఇంద్రుని దేవతల కధిపతిని గావించితివి.

త్వం ప్రభుః సర్వదేవానాం త్వయా సర్వ మిదం తతమ్,
త్వం హి దేవో మహాదేవ సర్వలోకనమస్కృతః. 8

నీవు దేవత లందరకు ప్రభువవు. ఇది యంతయు నీతో నిండియున్నది. ఓ మహాదేవా! సర్వలోకములు నమస్కరించు దైవమవు నీవేకదా!

---

4 క్షయమ్-గృహము-'నిలయాపచయౌ క్షయౌ'-అని అమరము.

గతి ర్భవ త్వం దేవానాం సేన్ద్రాణా మమరోత్తమ,
జగద్ వ్యాప్త మిదం సర్వం వృత్రేణాసురసూదన ! 9

ఓ అమరోత్తమా! ఇంద్రునితోపాటు దేవతలందరకు నీవే గతివి కమ్ము. రాక్షసాంతకా! వృత్రు డీజగమంతయు వ్యాపించియున్నాడు.

విష్ణు రువాచ - విష్ణు విట్లు పలికెను.

అవశ్యం వరణీయం మే భవతాం హిత ముత్తమమ్,
తస్మా దుపాయం వక్ష్యామి యథాసౌ న భవిష్యతి. 10

నాకు ఉత్తమమైన మీ హితమే తప్పనిసరిగా కోరదగినది. కావున ఆత డెట్లు నశించునో ఆ ఉపాయము చెప్పుదును.

గచ్ఛధ్వం సర్షిగన్ధర్వా యత్రాసౌ విశ్వరూపధృక్,
సామ తస్య ప్రయుఞ్జధ్వం తత ఏనం విజేష్యథ. 11

ఋషులతో, గంధర్వులతో ఆ విశ్వరూపధారికడ కరుగుడు. ఆతనియెడ సామమును ప్రయోగింపుడు. అటుపై వానిని గెలుతురు.

భవిష్యతి జయో దేవాః శక్రస్య మమ తేజసా,
అదృశ్యశ్చ ప్రవేక్ష్యామి వజ్రే హ్యస్యాయుధోత్తమే. 12

దేవతలారా! నాతేజమువలన ఇంద్రునకు జయము కలుగును. ఆయుధములలో శ్రేష్ఠమగు వజ్రమున నేను గుట్టుగా ప్రవేశింతును.

గచ్ఛధ్వ మృషిభిః సార్ధం గన్ధర్వైశ్చ సురోత్తమాః,
వృత్రస్య సహ శక్రేణ సంధిం కురుత మా చిరమ్. 13

దేవతాశ్రేష్ఠులారా! ఋషులతో, గంధర్వులతో కలిసి చనుడు. వృత్రునకు ఇంద్రునితో సంధిచేయుడు. ఆలసింపకుడు.

శల్య ఉవాచ - శల్యు డిట్లు చెప్పెను.

ఏవ ముక్తే తు దేవేన ఋషిభి స్త్రిదశా స్తథా,
యయుః సమేత్య సహితాః శక్రం కృత్వా పురఃసరమ్. 14

దేవు డిట్లు పలుకగా దేవతలు ఋషులతోపాటు ఇంద్రుని ముందిడుకొని బయలుదేరిరి.

సమీప మేత్య చ యదా సర్వ ఏవ మహౌజసః,
తం తేజసా ప్రజ్వలితం ప్రతపన్తం దిశో దశ. 15
గ్రసన్త మివ లోకాం స్త్రీన్ సూర్యాచన్ద్రమసౌ యథా,
దదృశు స్తే తతో వృత్రం శక్రేణ సహ దేవతాః. 16

గొప్పదేహబలముగల ఆ దేవత లందరు ఇంద్రునితోపాటు అతనిని సమీపించి, తేజస్సుతో ప్రజ్వరిల్లుచున్నవాడును, పదిదిక్కులను కాల్చివేయుచున్నవాడును, మూడులోకములను మ్రింగుచున్నట్లున్నవాడును సూర్యచంద్రులవలె వెలుగొందుచున్నవాడును అగు వృత్రుని గాంచిరి.

ఋషయోఽథ తతోఽభ్యేత్య వృత్ర మూచుః ప్రియం వచః,
వ్యాప్తం జగదిదం సర్వం తేజసా తవ దుర్జయ. 17

అంతట ఋషులు వృత్రుని దరిజేరి ప్రియమైన పలుకు నిట్లాడిరి. ఓయి! దుర్జయుడా! నీతేజస్సుతో జగ త్తంతయు నిండినది.

న చ శక్నోషి నిర్జేతుం వాసవం బలినాం వర,
యుధ్యతో శ్చాపి వాం కాలో వ్యతీతః సుమహా నిహ. 18

బలవంతులలో శ్రేష్ఠుడా! దేవేంద్రుని నీవు గెలువజాలకున్నావు. మీ రిరువురు పోరుచుండగా ఎంతోకాలము గడచినది.

పీడ్యన్తే చ ప్రజాః సర్వాః సదేవాసురమానుషాః,
సఖ్యం భవతు తే వృత్ర శక్రేణ సహ నిత్యదా. 19

అంతే కాదు. దేవతలు, రాక్షసులు, మానవులు పీడనొందుచున్నారు. కావున ఓ వృత్రుడా! నీకు ఇంద్రునితో ఎల్లకాలము సఖ్యమగుగాక!

అవాప్స్యసి సుఖం త్వం చ శక్రలోకాంశ్చ శాశ్వతాన్.

నీవును శాశ్వతములగు ఇంద్రలోకములను, సుఖమును పొందుదువు.

20
ఋషివాక్యం నిశమ్యాథ వృత్రః స తు మహాబలః,
ఉవాచ తాన్ ఋషీన్ సర్వాన్ ప్రణమ్య శిరసాసురః.

గొప్పబలముగల ఆ వృత్రుడు ఋషులపలుకును విని వారికి తలతో మ్రొక్కి యిట్లు పలికెను.

సర్వే యూయం మహాభాగా గన్ధర్వా శ్చైవ సర్వశః, 21
యద్ బ్రూథ తచ్ఛ్రుతం సర్వం మమాపి శృణుతానఘాః.

పుణ్యాత్ములైన మీరును గంధర్వులును అన్నివిధములుగా పలికినదాని నంతటిని వింటిని. మహాత్ములారా! నామాటను గూడ వినుడు.

సన్ధిః కథం వై భవితా మమ శక్రస్య చోభయోః,
తేజసో ర్హి ద్వయో ర్దేవాః సఖ్యం వై భవితా కథమ్. 22

నాకును ఇంద్రునకు సంధి యెట్లు కుదురును? దేవులారా! రెండు తేజస్సులకు మైత్రి యెట్లు సంఘటిల్లును?

ఋషయ ఊచుః - ఋషు లిట్లు పలికిరి.

సకృత్ సతాం సఙ్గతం లిప్సితవ్యం
తతః పరం భవితా భవ్య మేవ,
నాతిక్రమేత్ సత్పురుషేణ సఙ్గతం
తస్మాత్ సతాం సఙ్గతం లిప్సితవ్యమ్. 23

మంచివారితో చెలిమిని ఒకమారు పొందదగును. అటుపై మంగళమే యగును. సత్పురుషులతోడి కలయికను కాలదన్నరాదు. కావున సజ్జనసంగతి కోరవేవలయును.

దృఢం సతాం సఙ్గతం చాపి నిత్యం
బ్రూయా చ్చార్థం హ్యర్థకృచ్ఛ్రేషు ధీరః,
మహార్థవత్ సత్పురుషేణ సఙ్గతం
తస్మా త్సన్తం న జిఘాంసేత ధీరః. 24

తెలివిగలవాడు అర్థమునకు సంబంధించిన కష్టములందు గట్టిది, చెడనిది యగు నర్థము మంచివారితోడిమైత్రి యని చెప్పును. సత్పురుషులతోడి స్నేహము గొప్పప్రయోజనములను సాధించును. కావున ధీరుడు సజ్జనుని చంపుకొనరాదు.

ఇన్ద్రః సతాం సమ్మతశ్చ నివాసశ్చ మహాత్మనామ్,
సత్యవాదీ హ్యనిన్ద్య శ్చ ధర్మవిత్ సూక్ష్మనిశ్చయః. 25

ఇంద్రుడు సత్పురుషులకు ఇష్టుడు. మహాత్ములకు నెలవు. సత్యమునే పలుకును. ధర్మము నెరిగినవాడు. సూక్ష్మమైన నిశ్చయములు గలవాడు.

తేన తే సహ శక్రేణ సన్ధి ర్భవతు నిత్యదా,
ఏవం విశ్వాస మాగచ్ఛ మా తే భూద్ బుద్ధి రన్యథా. 26

కావున ఆ ఇంద్రునితో నీకు ఎన్నటికిని చెడని సంధి యగుగాక! ఇట్టి నమ్మకమునకు రమ్ము. నీబుద్ధి మారకుండుగాక!

శల్య ఉవాచ - శల్యు డిట్లు పలికెను.

మహర్షివచనం శ్రుత్వా తా నువాచ మహాద్యుతిః,
అవశ్యం భగవన్తో మే మాననీయా స్తపస్వినః. 27

మహర్షులపలుకు విని ఆ తేజశ్శాలి యిట్లనెను—భగవంతులు, తాపసులు నయిన మీరు నాకు మాననీయులు.

బ్రవీమి యదహం దేవా స్తత్ సర్వం క్రియతే యది,
తతః సర్వం కరిష్యామి య దూచుర్మాం ద్విజర్షభాః. 28

నేను చెప్పుదానిని దేవతలు చేయుదురేని బ్రాహ్మణప్రవరులగు మీరు చెప్పిన దెల్లయు నేను చేసెదను.

న శుష్కేణ న చార్ద్రేణ నాశ్మనా న చ దారుణా,
న శస్త్రేణ న చాస్త్రేణ న దివా న తథా నిశి. 29
వధ్యో భవేయం విప్రేన్ద్రాః శక్రస్య సహ దైవతైః,
ఏవం మే రోచతే సన్ధిః శక్రేణ సహ నిత్యదా. 30

దేవతలతోపాటు ఇంద్రుడు నన్ను తడిలేనిదానితో, తడిగలదానితో, రాతితో, కొయ్యతో, శస్త్రముతో, అస్త్రముతో, పగటియందు, రాత్రియందు, నన్ను చంపరాదు. దేవేంద్రునితో నాకు ఇట్టిచెడని సంధి ఇష్టము.

---

29. న శుష్కేణ...-తడిలేనిది, తడిగలది అనగా రాయి, కొయ్య వంటివని చెప్పుటకై 'అశ్మనా' మొదలగునది.

బాధ మిత్యేవ ఋషయ స్త మూచు ర్భరతర్షభ,
ఏవం వృత్తే తు సన్ధానే వృత్రః ప్రముదితోఽభవత్. 31

ఋషులు సరే యనిరి. ఇట్లు సంధి కుదరగా వృత్రుడు మిక్కిలిగా ఆనందించెను.

యుక్తః సదాభవచ్చాపి శక్రో హర్షసమన్వితః,
వృత్రస్య వధసంయుక్తా నుపాయా నన్వచిన్తయత్. 32

ఇంద్రుడు ఎల్లవేళల సంతోషము కలవాడయ్యు వృత్రునే చంపు నుపాయములను చింతించుచునే యుండెను.

ఛిద్రాన్వేషీ సముద్విగ్నః సదా వసతి దేవరాట్,
స కదాచిత్ సముద్రాన్తే సమపశ్య న్మహాసురమ్. 33

దేవరాజు ఎల్లవేళల సందు వెదుకుచు మిక్కిలి ఆతురతతో నుండెను. ఒకనాడు సముద్రముకడ ఆ మహారాక్షసుని గాంచెను.

సన్ధ్యాకాల ఉపావృత్తే ముహూర్తే చాతిదారుణే,
తతః సంచిన్త్య భగవాన్ వరదానం మహాత్మనః. 34

సంధ్యాకాలము కాగా, ముహూర్తము అతిదారుణమై యుండగా, భగవంతుడగు ఇంద్రుడు మహాత్ముడైన విష్ణు విచ్చిన వరమును తలపోసెను.

సన్ధ్యేయం వర్తతే రౌద్రా న రాత్రి ర్దివసం న చ,
వృత్ర శ్చావశ్యవధ్యోఽయం మమ సర్వహరో రిపుః. 35

ఇదిగో ఘోరమైన సంధ్యాకాలము గడచుచున్నది. ఇది రాత్రియును కాదు, పగలును కాదు. నన్ను నిలువుదోపిడి చేసిన ఈ వృత్రుడు తప్పక చంపదగినవాడు.

యది వృత్రం న హన్మ్యద్య వఞ్చయిత్వా మహాసురమ్,
మహాబలం మహాకాయం న మే శ్రేయో భవిష్యతి. 36

గొప్పబలము, పెద్దదేహముగల మహారాక్షసుడగు ఈవృత్రుని మోసగించి నేను చంపకుండినచో నాకు శ్రేయస్సు కలుగదు.

ఏవం సఞ్చిన్తయ న్నేవ శక్రో విష్ణు మనుస్మరన్,
అథ ఫేనం తదాపశ్యత్ సముద్రే పర్వతోపమమ్. 37

ఇట్లు తలచుచునే యింద్రుడు మనసున విష్ణువును ధ్యానించుచు సముద్రమున కొండవలె నున్న నురుగును గాంచెను.

నాయం శుష్కో న చార్ద్రోఽయం న చ శస్త్ర మిదం తథా,
ఏనం క్షేప్స్యామి వృత్రస్య క్షణాదేవ నశిష్యతి. 38

ఇది ఎండినది కాదు, తడిదియు కాదు. ఆయుధమును కాదు. దీనిని వృత్రునిపై విసరుదును. క్షణములో ఆతడు చచ్చును.

స వజ్ర మథ ఫేనం తం క్షిప్రం వృత్రే నివిష్టవాన్,
ప్రవిశ్య ఫేనం తం విష్ణు రథ వృత్రం వ్యనాశయత్. 39

అంత నింద్రుడు ఆ నురుగును వృత్రునిపైకి వజ్రముతోపాటుగా విసరెను. విష్ణు వానురుగునందు ప్రవేశించి వృత్రుని రూపుమాపెను.

నిహతే తు తతో వృత్రే దిశో వితిమిరాఽభవన్,
ప్రవవౌ చ శివో వాయుః ప్రజాశ్చ జహృషు స్తథా. 40

అట్లు వృత్రుడు చావగా దిక్కులు చీకట్లు మాసినవి. మంగళమగు గాలి వీచెను. ప్రజలందరు సంతసిల్లిరి.

తతో దేవాః సగన్ధర్వా యక్షరక్షోమహోరగాః,
ఋషయశ్చ మహేన్ద్రం తమస్తువన్ వివిధైః స్తవైః. 41

అంతట దేవతలు, గంధర్వులు, యక్షులు, రక్షులు, నాగులు, ఋషులు ఆ మహేంద్రుని పలువిధములగు స్తోత్రములతో కొనియాడిరి.

నమస్కృతః సర్వభూతైః సర్వభూతా న్యసాన్త్వయత్,
హత్వా శత్రుం ప్రహృష్టాత్మా వాసవః సహదైవతైః. 42
విష్ణుం త్రిభువనశ్రేష్ఠం పూజయామాస ధర్మవిత్.

---

38. 'న శుష్కః-నీటిలో పుట్టుటచే ఎండినది కాదు; న ఆర్ద్రః-పిండినచో నీరు గాని, గట్టి పదార్థముగాని కానరావు గాన తడిది కాదు.

సర్వభూతముల మ్రొక్కుగొని యింద్రుడు వాని నన్నింటిని ఓదార్చెను. శత్రువును చంపి ధర్మమెరిగిన యింద్రుడు దేవతలతోపాటు మిక్కిలి సంతోష పడి మూడు లోకములలో శ్రేష్ఠుడగు విష్ణువును పూజించెను.

తతో హతే మహావీర్యే వృత్రే దేవభయంకరే, 43
అనృతే నాభిభూతోఽభూచ్ఛక్రః పరమదుర్మనాః,
త్రైశీర్షయాభిభూతశ్చ స పూర్వం బ్రహ్మహత్యయా. 44

గొప్ప శక్తికలిగి దేవతలకు భయంకరుడైన వృత్రుడట్లు మడియగా, మిక్కిలి వ్యథపడిన ఇంద్రుని మున్నే త్రిశీర్షుని చంపుటవలన చుట్టుకొన్న బ్రహ్మహత్యాపాతకముతోపాటు ఈ అనృతఫలము కూడ చుట్టుకొనెను.

సోఽన్త మాశ్రిత్య లోకానాం నష్టసంజ్ఞో విచేతనః,
న ప్రాజ్ఞాయత దేవేన్ద్ర స్త్వభిభూతః స్వకల్మషైః. 45

తన పాపము లట్లు చుట్టుకొనగా ఆతడు లోకముల తుది నాశ్రయించి, స్మృతిలేక, చైతన్యము కోల్పోయి ఒడ లెరుగకుండెను.

ప్రతిచ్ఛన్నోఽవస చ్చాప్సు చేష్టమాన ఇవోరగః.

ఎవరికి తెలియరాకుండ ఆ ఇంద్రుడు నీటిలో కొట్టుకొనుచున్న పామువలె అణగియుండెను.

తతః ప్రణష్టే దేవేన్ద్రే బ్రహ్మహత్యాభయార్దితే, 46
భూమిః ప్రధ్వ స్తసంకాశా నిర్వృక్షా శుష్కకాననా,
విచ్ఛిన్నస్రోతసో నద్యః సరాం స్యనుదకాని చ. 47

ఇట్లు దేవేంద్రుడు బ్రహ్మహత్యాభయముచేత బాధపడి కానరాకపోగా భూమి సర్వనాశనము పొందినట్లాయెను. చెట్లు నశించెను. అడవు లెండిపోయెను. నదుల ప్రవాహములు చెల్లాచెదరాయెను. సరస్సులు వట్టిపోయెను.

సంక్షోభ శ్చాపి సత్త్వానా మనావృష్టికృతోఽభవత్,
దేవా శ్చాపి భృశం త్రస్తా స్తథా సర్వే మహర్షయః. 48

ప్రాణులకు వర్షములు లేని కారణమున క్షోభ కలిగెను. దేవతలకు, ఋషుల కును భయము కలిగెను.

అరాజకం జగత్ సర్వ మభిభూత ముపద్రవః,
తతో భీతా భవన్ దేవాః కో నో రాజా భవేదితి. 49

రాజులేని జగత్తున కంతటికిని కీడుమూడెను. మాకు రాజెవ్వడగునో యని దేవత లందరు కలవరపడిరి.

దివి దేవర్షయ శ్చాపి దేవరాజవినాకృతాః,
న స్మ కశ్చన దేవానాం రాజ్యే వై కురుతే మతిమ్. 50

స్వర్గమున దేవర్షులు కూడ దేవరాజు లేనివారై దేవతలరాజ్యమునం దొక్కడును మతిపెట్టరైరి.

ఇతి శ్రీ మహాభారతే ఉద్యోగపర్వణి సేనోద్యోగపర్వణి
వృత్రవధే ఇన్ద్రవిజయో నామ దశమోఽధ్యాయః.

ఇది శ్రీ మహాభారతము ఉద్యోగపర్వమున సేనోద్యోగపర్వమున
ఇంద్రవిజయమను పదియవయధ్యాయము.

—(౦)—

## ఏకాదశోఽధ్యాయః - పదునొకండవ అధ్యాయము

**దేవర్షీణా మాగ్రహేణ నహుషస్య దేవేన్ద్రపదేఽభిషేకః, కామాసక్తిః, చిన్తామాపన్నాయా ఇన్ద్రాణ్యా బృహస్పతినాఽఽశ్వాసనమ్-**

**దేవర్షుల పట్టుదలపై నహుషుడు దేవేంద్రపదవియం దభిషిక్తుడగుట, ఆతని కామాసక్తి, చింతనొందిన యింద్రపత్నిని బృహస్పతి ఊరడించుట.**

శల్య ఉవాచ-శల్యు డిట్లు చెప్పెను.

ఋషయోఽథాబ్రువన్ సర్వే దేవాశ్చ త్రిదివేశ్వరాః,
అయం వై నహుషః శ్రీమాన్ దేవరాజ్యేఽభిషిచ్యతామ్. 1

స్వర్గమునందలి పెద్దలైన దేవతలును, ఋషులందరును ఇట్లు పలికికొనిరి. - శ్రీమంతుడగు ఈ నహుషుడు దేవతారాజ్యమున అభిషేకము పొందుగాక!

తేజస్వీ చ యశస్వీ చ ధార్మికశ్చైవ నిత్యదా,
తే గత్వా త్వబ్రువన్ సర్వే రాజా నో భవ పార్థివ. 2

ఆతడు తేజము, కీర్తియు గలవాడు, ధర్మజ్ఞుడు. ఇట్లు తలచి వారందరు ఆతనికడ కరిగి ఓయి చక్రవర్తీ! నీవు మాకు రాజవు కమ్మనిరి.

స తా నువాచ నహుషో దేవా నృషిగణాం స్తథా,
పితృభిః సహితాన్ రాజన్ పరీప్సన్ హిత మాత్మనః. 3

ఆ నహుషుడు దేవతలతో, ఋషిసంఘముతో, పితృదేవతలతో తనదైన హితమును సంపాదింపగోరి యిట్లు పలికెను.

దుర్బలోఽహం న మే శక్తి ర్భవతాం పరిపాలనే,
బలవా ఞ్జాయతే రాజా బలం శక్రే హి నిత్యదా. 4

నేను బలము తక్కువవాడను. మిమ్ముల నేలుటలో శక్తిచాలదు. రాజనగా బలవంతుడు గదా! ఇంద్రునియందు ఎల్లవేళల బల ముండును.

తమబ్రువన్ పునః సర్వే దేవా ఋషిపురోగమాః,
అస్మాకం తపసా యుక్తః పాహి రాజ్యం త్రివిష్టపే. 5

ఋషులను ముందిడుకొని దేవత లందరు అతనితో మరల నిట్లనిరి - మా అందరి తపస్సుతో కూడినవాడవై స్వర్గమున రాజ్యము నేలుము.

పరస్పరం భయం ఘోర మస్మాకం హి న సంశయః,
అభిషిచ్యస్వ రాజేన్ద్ర భవ రాజా త్రివిష్టపే. 6

మా కొకరివలన నొకరికి ఘోరమైన భయము కలుగును. సంశయము లేదు. కావున ఓ రాజేంద్రా! అభిషేకము పొందుము. స్వర్గమున రాజ వగుము.

దేవదానవయక్షాణా మృషీణాం రక్షసాం తథా,
పితృగన్ధర్వభూతానాం చక్షుర్విషయవర్తినామ్. 7
తేజ ఆదాస్యసే పశ్యన్ బలవాం శ్చ భవిష్యసి,
ధర్మం పురస్కృత్య సదా సర్వలోకాధిపో భవ. 8

నీకంటబడినవారగు దేవతలయు, దానవులయు, యక్షులయు, ఋషులయు, రాక్షసులయు, పితరులయు, గంధర్వులయు, భూతములయు, తేజమును చూచుచు గ్రహింతువు. దానితో బలవంతుడగుదువు. ధర్మమును ముందిడుకొని ఎల్లవేళల సర్వలోకములకు అధిపతివి కమ్ము.

బ్రహ్మర్షీం శ్చాపి దేవాంశ్చ గోపాయస్వ త్రివిష్టపే.
స్వర్గమున బ్రహ్మర్షులను, దేవతలను కాపాడుము.

9
అభిషిక్తః స రాజేన్ద్ర తతో రాజా త్రివిష్టపే,
ధర్మం పురస్కృత్య తదా సర్వలోకాధిపోఽభవత్.

ఓ రాజేంద్రా! అంత నాతడు స్వర్గమున అభిషిక్తుడై రాజాయెను. ధర్మమును ముందిడుకొని అప్పుడు స్వర్గలోకములకు అధిపతి ఆయెను.

10
సుదుర్లభం వరం లబ్ధ్వా ప్రాప్య రాజ్యం త్రివిష్టపే,
ధర్మాత్మా సతతం భూత్వా కామాత్మా సమపద్యత.

పొందనలవికాని వరమును పొంది స్వర్గరాజ్యమును చేజిక్కించుకొని మున్ను ధర్మాత్ముడైయున్న ఆతడు కామాత్ముడుగా మారెను.

దేవోద్యానేషు సర్వేషు నన్దనోపవనేషు చ, 11
కైలాసే హిమవత్పృష్ఠే మన్దరే శ్వేతపర్వతే.
సహ్యే మహేన్ద్రే మలయే సముద్రేషు సరిత్సు చ. 12
అప్సరోభిః పరివృతో దేవకన్యాసమావృతః
నహుషో దేవరాజోఽథ క్రీడన్ బహువిధం తదా. 13

దేవతల పూదోటలలో, నందనవనమునందలి భాగములలో, కైలాసమునందును, హిమవత్పర్వత ప్రాంతమునందును, మందరమునందును, శ్వేతపర్వతమునందును, సహ్యమహేంద్రమలయపర్వతములందును, సముద్రములందును, నదులయందును, దేవకన్యలతో, అప్సరసలతో కూడి దేవరాజగు నహుషుడు పలురీతుల క్రీడించుచుండెను.

శృణ్వన్ దివ్యా బహువిధాః కథాః శ్రుతిమనోహరాః,
వాదిత్రాణి చ సర్వాణి గీతం చ మధురస్వనమ్. 14

చెవి కింపైన పలువిధములగు కథలను, సకల విధములగు వాద్యములను, తీయనినాదముగల గానమును వినుచుండెను.

విశ్వావసు ర్నారదశ్చ గన్ధర్వాప్సరసాం గణాః,
ఋతవః షట్ చ దేవేన్ద్రం మూర్తిమన్త ఉపస్థితాః. 15

విశ్వావసువు, నారదుడు, గంధర్వులు, అప్సరసలు, రూపుగైకొని వచ్చిన ఆరు ఋతువులు దేవేంద్రుని కొలిచియుండెను.

మారుతః సురభి ర్వాతి మనోజ్ఞః సుఖశీతలః.

గాలియు సువాసనతో మనోజ్ఞమై సుఖమైన చల్లదనముతో వీచుచుండెను.

ఏవం చ క్రీడత స్తస్య నహుషస్య దురాత్మనః, 16
సంప్రాప్తా దర్శనం దేవీ శక్రస్య మహిషీ ప్రియా.

దుష్టాత్ముడగు నహుష డీవిధముగా క్రీడించుచుండగా ఇంద్రుని ప్రియమైన పట్టపురాణి శచీదేవి యాతని కంటబడెను.

స తాం సన్దృశ్య దుష్టాత్మా ప్రాహ సర్వాన్ సభాసదః. 17
ఇన్ద్రస్య మహిషీ దేవీ కస్మా న్మాం నోపతిష్ఠతి.

అహ మిన్ద్రోఽస్మి దేవానాం లోకానాం చ తథేశ్వరః. 18
ఆగచ్ఛతు శచీ మహ్యం క్షిప్ర మద్య నివేశనమ్.

ఆ దుష్టాత్ము డామెను చూచి సభలో నున్నవారితో, ఇంద్రుని పట్టపు రాణి నన్నేల సేవింపదు? నేను దేవతల కింద్రుడనుగదా! లోకములకు ప్రభువను గదా! శచీదేవి వెంటనే నాకై నానివాసమునకు రావలయును - అని పలికెను.

తచ్ఛ్రుత్వా దుర్మనా దేవీ బృహస్పతి మువాచ హ. 19

అది విని మనసు చెడి ఆదేవి బృహస్పతితో నిట్లనెను.

రక్ష మాం నహుషాద్ బ్రహ్మం స్త్వామస్మి శరణం గతా,
సర్వలక్షణసంపన్నాం బ్రహ్మం స్త్వం మాం ప్రభాషసే. 20

ఓ బ్రహ్మ! నన్ను నహుషుని బారినుండి రక్షింపుము. నిన్ను శరణు పొందితిని. బ్రహ్మ! నీవు నన్ను సర్వలక్షణములు గలదాన వని పలుకుచుందువు.

దేవరాజస్య దయితా మత్యంతం సుఖభాగినీమ్,
అవైధవ్యేన యుక్తాం చాప్యేకపత్నీం పతివ్రతామ్. 21
ఉక్తవానసి మాం పూర్వ మృతాం తాం కురు వై గిరమ్,
నోక్తపూర్వం చ భగవన్ వృథా తే కిఞ్చి దీశ్వర. 22

'నీవు దేవరాజునకు మిక్కిలి యిష్టమైనదానవు. సుఖము పొందెడు దానవు. మగడులేనితనము నిన్నంటదు. సవతు లుండరు. పతివ్రతవు' - అని మున్ను నన్ను నీవు పలుకుచుండువాడవు. ఆమాట నిపుడు నిజముచేయుము. ఓఈశ్వరా! భగవంతుడా! మున్నెన్నడు నీపలుకు వ్యర్థము కాలేదు.

తస్మాదేతద్ భవేత్ సత్యం త్వయోక్తం ద్విజసత్తమ,
బృహస్పతి రథోవాచ శక్రాణీం భయమోహితామ్. 23

కావున ఓద్విజోత్తమా! నీవాడిన యామాట సత్యమగుగాక!- అని పలికి నంత బృహస్పతి భయముతో గుండె చెదిరిన ఆయింద్రపత్నితో నిట్లు పలికెను.

---

23. శక్రాణీ - ఇది ఆర్షప్రయోగము.

యదుక్తాసి మయా దేవి సత్యం తద్ భవితా ధ్రువమ్,
ద్రక్ష్యసే దేవరాజాన మిన్ద్రం శీఘ్ర మిహాగతమ్. 24

ఓ దేవీ! నేను పలికినమాట తప్పక నిజమగును. దేవరాజైన ఇంద్రు డిక్కడకు వచ్చును. నీవు త్వరలో చూతువు.

న భేతవ్యం చ నహుషాత్ సత్య మేతద్ బ్రవీమి తే,
సమానయిష్యే శక్రేణ నచిరాద్ భవతీ మహమ్. 25

నహుషుని వలన భయపడ నవసరము లేదు. ఇదిగో నీకు నిజము చెప్పు చున్నాను. త్వరలో నిన్ను ఇంద్రునితో నేను కలుపుదును.

అథ శుశ్రావ నహుషః శక్రాణీం శరణం గతామ్,
బృహస్పతే రఙ్గిరస శ్చుక్రోధ స నృప స్తదా. 26

అంత నహుషుడు ఇంద్రపత్ని అంగిరసుడైన బృహస్పతిని శరణు పొందినట్లు వినెను. అంత నారాజు మిక్కిలి కోపించెను.

ఇతి శ్రీ మహాభారతే ఉద్యోగపర్వణి సేనోద్యోగపర్వణి
ఇన్ద్రాణీభయే ఏకాదశో౽ధ్యాయః.

ఇది శ్రీ మహాభారతము ఉద్యోగపర్వమున సేనోద్యోగపర్వమున
ఇంద్రాణి భయము అను పదునొకండవ అధ్యాయము.

—: ౦ :—

# ద్వాదశోఽధ్యాయః - పన్రెండవ అధ్యాయము

**దేవతానహుషసంవాదో, బృహస్పతి నేన్ద్రాణ్యాః సంరక్షణం, కిఞ్చిత్కాలావధిం ప్రార్థయితుం తస్యా నహుషసమీపే గమనమ్.**

**దేవతానహుషసంవాదము, బృహస్పతి ఇంద్రపత్నిని రక్షించుట, కొంతకాలము గడువిమ్మని ప్రార్థించుటకు ఆమె నహుషునికడ కరుగుట.**

శల్య ఉవాచ - శల్యుడిట్లు చెప్పెను.

క్రుద్ధం తు నహుషం దృష్ట్వా దేవా ఋషిపురోగమాః,
అబ్రువన్ దేవరాజానం నహుషం ఘోరదర్శనమ్. 1

క్రోధముతో నున్న దేవరాజగు నహుషుని గాంచి ఘోరముగా కానవచ్చు నాతనితో, ఋషులతో కూడిన దేవత లిట్లు పలికిరి.

దేవరాజ జహి క్రోధం త్వయి క్రుద్ధే జగద్విభో,
త్రస్తం సాసురగన్ధర్వం సకిన్నరమహోరగమ్. 2

మహాప్రభూ! దేవరాజా! క్రోధమును విడువుము. నీవు కోపింపగా రాక్షసులు, గంధర్వులు, కిన్నరులు, నాగులు, అందరు అదలిపోవుచున్నారు.

జహి క్రోధ మిమం సాధో న కుప్యన్తి భవద్విధాః,
పరస్య పత్నీ సా దేవీ ప్రసీదస్వ సురేశ్వర. 3

ఈ క్రోధమును విడనాడుము. ఓ సజ్జనుడా! నీవంటివారు కోపింపరు. ఆ దేవి పరునిపత్ని. సురేశ్వరా! ప్రసన్నుడ వగుము.

నివర్తయ మనః పాపాత్ పరదారాభిమర్శనాత్,
దేవరాజోఽసి భద్రం తే ప్రజా ధర్మేణ పాలయ. 4

పరుల భార్యలను ముట్టెడి పాపమునుండి మనసును మరలింపుము. దేవతలకు ఏలికవు కదా! నీకు మేలయ్యెడు. ప్రజలను ధర్మముతో పాలింపుము.

ఓ ఇంద్రాణీ! నేను శరణుపొందినవానిని త్యజింపను. ఇది నా నిశ్చయము. నీవు ధర్మమెరిగినదానవు. సత్యమే నీ శీలము. దోష మెరుగనిదానవు. ఇట్టి నిన్నెన్నటికిని వదలను.

నాకార్యం కర్తు మిచ్ఛామి బ్రాహ్మణః సన్ విశేషతః,
శ్రుతధర్మా సత్యశీలో జానన్ ధర్మానుశాసనమ్. 17

విశేషించి బ్రాహ్మణుడను, ధర్మము లన్నియు విన్నవాడను. సత్యశీలుడను. ధర్మశాసనమును ఎరిగి ఎరిగి పాపపుపని చేయగోరను.

నాహ మేతత్ కరిష్యామి గచ్ఛధ్వం వై సురోత్తమాః,
అస్మింశ్చార్థే పురా గీతం బ్రహ్మణా శ్రూయతా మిదమ్. 18

దేవోత్తములారా! ఈ పని నేను చేయను; పొండు. ఈ విషయమున మున్ను బ్రహ్మ పాడిన గీత మొకటి కలదు. దీనిని వినుడు.

న తస్య బీజం రోహతి రోహకాలే
న తస్య వర్షం వర్షతి వర్షకాలే,
భీతం ప్రపన్నం ప్రదదాతి శత్రవే
న స త్రాతారం లభతే త్రాణ మిచ్ఛన్. 19

భయపడి శరణుపొందినవానిని శత్రువున కప్పగించు వానికి మొలకెత్తవలసిన కాలమున విత్తనము మొలకెత్తదు. వాన పడవలసిన కాలమున వానికి వర్షము కురియదు. తనకు రక్షణ కావలసినపుడు రక్షణ దొరకదు.

మోఘ మన్నం విన్దతి చాప్యచేతాః
స్వర్గా ల్లోకా ద్భ్రశ్యతి నష్టచేష్టః,
భీతం ప్రపన్నం ప్రదదాతి యో వై
న తస్య హవ్యం ప్రతిగృహ్ణన్తి దేవాః. 20

---

19. ప్రపన్నమ్ - శరణు పొందిన వానిని
20. అచేతాః - దుర్బలచిత్తుడు.

భయపడి శరణు కోరినవానిని పగవాని కప్పగించువాడు తిన్నకూడు వ్యర్థము. వాడు దుర్బలచిత్తు డగును. వాడు స్వర్గలోకమునుండి జారిపడును. వాడిచ్చిన హవ్యమును దేవతలు స్వీకరింపరు.

ప్రమీయతే హ్యస్య ప్రజా హ్యకాలే
సదా వివాసం పితరోఽస్య కుర్వతే,
భీతం ప్రపన్నం ప్రదదాతి శత్రవే
సేన్ద్రాః దేవాః ప్రహరన్త్యస్య వజ్రమ్. 21

భయపడి శరణు వేడిన వానిని పగవాని పాలు చేయువాని సంతానము అకాలమున చచ్చును. ఆతని తల్లిదండ్రులు వానిని వీడి వేరుచోట నుందురు. వానిని ఇంద్రుడు దేవతలు కలిసి వజ్రముతో మొత్తుదురు.

ఏత దేవం విజానన్ వై న దాస్యామి శచీ మిమామ్,
ఇన్ద్రాణీం విశ్రుతాం లోకే శక్రస్య మహిషీం ప్రియామ్. 22

ఇది యంతయు చక్కగా తెలిసిన నేను ఇంద్రుని భార్యను, లోకమున పేరుగన్నదానిని, ఇంద్రుని పట్టపురాణిని, ప్రియురాలిని ఈ శచీదేవిని ఏమైనను ఈయను.

అస్యా హితం భవేద్యచ్చ మమ చాపి హితం భవేత్,
క్రియతాం తత్సురశ్రేష్ఠా న హి దాస్యామ్యహం శచీమ్. 23

దేవతలలో పెద్దలారా! ఈమె కేది హితమో, నాకేది హితమో అది చేయుడు. నేను శచి నొసగను.

శల్య ఉవాచ - శల్యు డిట్లు చెప్పెను.

అథ దేవాః సగన్ధర్వా గురు మాహు రిదం వచః,
కథం సునీతం తు భవే న్మన్త్రయస్వ బృహస్పతే. 24

అంతట దేవతలు గంధర్వులు బృహస్పతీ! ఇచట ఏ నీతి నవలంబింప వలయును? ఆలోచన చెప్పుమని గురువు నడిగిరి.

బృహస్పతి రువాచ-బృహస్పతి యిట్లు చెప్పెను.

నహుషం యాచతాం దేవీ కిఞ్చిత్కాలాన్తరం శుభా,
ఇన్ద్రాణీహిత మేతద్ధి తథాస్మాకం భవిష్యతి. 25

ఇంద్రపత్నియగు ఈదేవి నహుషుని కొంతసమయ మిమ్మని అడుగును. ఇది యామెకు మేలు. మనకును మేలగును.

బహువిఘ్నః సురాః కాలః కాలః కాలం నయిష్యతి,
గర్వితో బలవాంశ్చాపి నహుషో వరసంశ్రయాత్. 26

దేవతలారా! కాలము అనేక విఘ్నములు గలది. కాలమే ఆతనిని కాలుని కడ కంపును. వరముల నాశ్రయించి నహుషుడు బలవంతుడైనను గర్వితు డాయెను.

శల్య ఉవాచ - శల్యు డిట్లు చెప్పెను.

తతస్తేన తథోక్తే తు ప్రీతా దేవా స్తథాబ్రువన్,
బ్రహ్మన్ సాధ్విద ముక్తం తే హితం సర్వం దివౌకసామ్. 27

బృహస్పతి అట్లు పలుకగా దేవత లందరు ప్రీతులై యిట్లాడిరి. ఓ బ్రహ్మ! ఈ నీ పలుకు కడుమేలైనది. స్వర్గమునవారి కెల్లరికి ఇది హిత మైనది.

ఏవ మేతద్ ద్విజశ్రేష్ఠ దేవీ చేయం ప్రసాద్యతామ్,

ఓ బ్రాహ్మణప్రవరా! ఇది యిట్టిదే. ఈ దేవిని అనుగ్రహింపుము.

తతః సమస్తా ఇన్ద్రాణీం దేవా శ్చాగ్నిపురోగమాః, 28
ఊచు ర్వచన మవ్యగ్రా లోకానాం హితకామ్యయా.

అని పలికి అగ్నిమొదలుగాగల దేవత లందరు కలతతీరినవారై లోకమునకు మేలుచేయు కోరికతో నిట్లు పలికిరి.

దేవా ఊచుః - దేవత లిట్లనిరి.

త్వయా జగ దిదం సర్వం ధృతం స్థావరజఙ్గమమ్,
ఏకపత్న్యసి సత్యా చ గచ్ఛస్వ నహుషం ప్రతి. 29

ఓ యమ్మా! నీవలన స్థావరజంగమాత్మకమైన ఈ జగత్తంతయు నిలిచి యున్నది. నీవు పతివ్రతవు, సత్యస్వరూపిణివి. నహుషునికడకు పద.

క్షిప్రం త్వామభికామశ్చ వినశిష్యతి పాపకృత్,
నహుషో దేవి శక్రశ్చ సురైశ్వర్య మవాప్స్యతి. 30

నిన్ను కామించిన ఈ పాపకర్ముడు నహుషుడు త్వరలోనే నశించును. దేవేంద్రుడు మరల దేవతల ఐశ్వర్యమును పొందును.

ఏవం వినిశ్చయం కృత్వా ఇన్ద్రాణీ కార్యసిద్ధయే,
అభ్యగచ్ఛత సవ్రీడా నహుషం ఘోరదర్శనమ్. 31

ఇట్లు నిశ్చయించుకొని ఇంద్రపత్ని కార్యము నెరవేరుటకై ఘోరముగా కానవచ్చు నహుషునికడకు సిగ్గుపడుచు నరిగెను.

దృష్ట్వా తాం నహుషశ్చాపి వయోరూపసమన్వితామ్,
సమహృష్యత దుష్టాత్మా కామోపహతచేతనః. 32

చక్కని వయస్సు, రూపముగల ఆమెను గాంచి దుష్టాత్ముడగు నహుషుడు కామముచే బుద్ధి చచ్చినవాడై మిక్కిలి సంబరపడెను.

ఇతి శ్రీమహాభారతే ఉద్యోగపర్వణి సేనోద్యోగపర్వణి
ఇన్ద్రాణీకాలావధియాచనే ద్వాదశోఽధ్యాయః.

ఇది శ్రీమహాభారతమున ఉద్యోగపర్వమున సేనోద్యోగపర్వమున
ఇంద్రాణి కాలవ్యవధి నడుగుట యను పండ్రెండవ అధ్యాయము.

—(o)—

# త్రయోదశోఽధ్యాయః - పదుమూడవ అధ్యాయము

నహుషస్య శచీప్రార్థనాస్వీకరణ మిన్ద్రస్య బ్రహ్మహత్యాయాః సముద్ధారః, శచ్యా రాత్రిదేవ్యా ఉపాసనా-

**నహుషుడు శచి ప్రార్థన నంగీకరించుట, ఇంద్రుడు బ్రహ్మహత్య నుండి విముక్తుడగుట, శచి రాత్రిదేవిని ఉపాసించుట.**

శల్య ఉవాచ-శల్యు డిట్లు చెప్పెను.

అథ తామబ్రవీ ద్దృష్ట్వా నహుషో దేవరాట్ తదా,
త్రయాణా మపి లోకానా మహ మిన్ద్రః శుచిస్మితే. 1

అంత నామెను గాంచి దేవరాజు నహుషు డిట్లు పలికెను. ఓ చక్కని నవ్వులదానా! నేను మూడు లోకములకును ఇంద్రుడను.

భజస్వ మాం వరారోహే పతిత్వే వరవర్ణిని,
ఏవ ముక్తా తు సా దేవీ నహుషేణ పతివ్రతా. 2
ప్రావేపత భయోద్విగ్నా ప్రవాతే కదలీ యథా.

'ఓ వరారోహా! సుందరీ! నన్ను పతిగా పొందుము'. అత డిట్లు పలుకగా ఆ దేవి భయముతో గుండె చెదరినదై పెనుగాలికి ఊగు అరటిచెట్టువలె వణికి పోయెను.

ప్రణమ్య సా హి బ్రహ్మాణం శిరసా తు కృతాఞ్జలిః, 3
దేవరాజ మథోవాచ నహుషం ఘోరదర్శనమ్.

ఆమె చేతులు మోడ్చి తలతో బ్రహ్మకు ప్రణమిల్లి ఘోరముగా కానవచ్చు దేవరాజగు నహుషునితో నిట్లు పలికెను.

కాలమిచ్ఛామ్యహం లబ్ధుం త్వత్తః కఞ్చిత్ సురేశ్వర. 4
న హి విజ్ఞాయతే శక్రః కిం వా ప్రాప్తః క్వ వా గతః.

ఓయీ దేవరాజా! నీవు నాకు కొంతకాలము గడువిమ్ము. ఇంద్రుడు ఏగతి నొందెనో ఎందు బోయెనో తెలియదాయెను.

తత్త్వ మేతత్తు విజ్ఞాయ యది న జ్ఞాయతే ప్రభో. 5
తతోఽహం త్వా ముపస్థాస్యే సత్య మేత ద్బ్రవీమి తే.

అందలి నిజమేమో ఎరిగి ఏమియు తెలియరాకున్నచో అప్పుడు నేను నిన్ను పొందుదును. నీకు సత్యము చెప్పుచున్నాను.

ఏవ ముక్తః స ఇన్ద్రాణ్యా నహుషః ప్రీతిమా నభూత్. 6

ఇంద్రాణి యిట్లు పలుకగా నహుషుడు మిక్కిలి ప్రీతి నొందెను.

నహుష ఉవాచ-నహుషు డిట్లు పలికెను.

ఏవం భవతు సుశ్రోణి యథా మా మిహ భాషసే,
జ్ఞాత్వా చాగమనం కార్యం సత్య మేత దనుస్మరేః. 7

ఓ సుశ్రోణీ! నాతో పలికినట్లే కానిమ్ము. తెలిసిన పిమ్మటనే వచ్చుట మంచిది. ఈ సత్యము నెప్పుడును తలచుచుండుము.

నహుషేణ విసృష్టా చ నిశ్చక్రామ తతః శుభా,
బృహస్పతినికేతం చ సా జగామ యశస్వినీ. 8

నహుషుడు పంపగా ఆ యశస్విని శుభమునంది అటనుండి బయలువెడలి బృహస్పతి యింటి కరిగెను.

తస్యాః సంశ్రుత్య చ వచో దేవా శ్చాగ్నిపురోగమాః,
చిన్తయామాసు రేకాగ్రాః శక్రార్థం రాజసత్తమ. 9

ఆమె మాటను విని అగ్ని మున్నుగా గల దేవతలందరు ఒక్కమనసుతో దేవేంద్రుని గూర్చి చింతించిరి.

దేవదేవేన సంగమ్య విష్ణునా ప్రభవిష్ణునా,
ఊచు శ్చైనం సముద్విగ్నా వాక్యం వాక్యవిశారదాః. 10

దేవులకు దేవుడు, సర్వకార్యసిద్ధికి కారణమైనవాడు నగు విష్ణువును కలిసి కలతపాటుతో, పలుకుటలో నేర్పుగల ఆ దేవత లిట్లు పలికిరి.

బ్రహ్మహత్యాభిభూతో వై శక్రః సురగణేశ్వరః,
గతిశ్చ న స్త్వం దేవేశః పూర్వజో జగతః ప్రభుః. 11

దేవగణములకు ఈశ్వరుడైన ఇంద్రుని బ్రహ్మహత్య పాపము చుట్టుకొన్నది. దేవతలకు ఈశుడవు, జగత్తునకు ప్రభువవు, అన్నింటికి ముందు పుట్టినవాడవు అగు నీవే మాకు గతివి.

రక్షార్థం సర్వభూతానాం విష్ణుత్వ ముపజగ్మివాన్,
త్వద్వీర్యనిహతే వృత్రే వాసవో బ్రహ్మహత్యయా. 12
వృతః సురగణశ్రేష్ఠ మోక్షం తస్య వినిర్దిశ.

సర్వభూతముల రక్షకొరకు నీవు విష్ణుత్వమును పొందితివి. వృత్రుడు నీ శక్తితో చావగా బ్రహ్మ హత్యా పాతకము ఇంద్రుని చుట్టుకొన్నది. సురగణ శ్రేష్ఠ! ఆ పాపము విడుదలకు మార్గమును సూచింపుము.

తేషాం తద్వచనం శ్రుత్వా దేవానాం విష్ణు రబ్రవీత్. 13
మామేవ యజతాం శక్రః పావయిష్యామి వజ్రిణమ్.

దేవతల ఆమాట విని విష్ణువు వారితో నిట్లు పలికెను..—ఇంద్రుడు నన్నే యజించుగాక! నే నాతనిని పవిత్రుని చేయుదును.

పుణ్యేన హయమేధేన మా మిష్ట్వా పాకశాసనః, 14
పున రేష్యతి దేవానా మిన్ద్రత్వ మకుతోభయః.

పాకశాసనుడు పుణ్యమైన అశ్వమేధముతో నన్నర్చించి, మరల నెందును భయములేని యింద్రపదవిని పొందగలడు.

స్వకర్మభి శ్చ నహుషో నాశం యాస్యతి దుర్మతిః 15
కిఞ్చిత్కాల మిదం దేవా మర్షయధ్వ మతన్ద్రితాః.

దుష్టబుద్ధియగు నహుషుడు తనకర్మములవలన నశించును. ఓ దేవతలారా! కొంతకాలము జాగరూకతతో దీనిని సహింపుడు.

---

12. విష్ణుత్వ మనగా అంతట వ్యాపించి యుండుట. అట్లు వ్యాపించియుండనిచో జగద్రక్షణ చేయుట సాధ్యము కాదుగదా!

శ్రుత్వా విష్ణోః శుభాం సత్యాం వాణీం తా మమృతోపమామ్. 16
తతః సర్వే సురగణాః సోపాధ్యాయాః సహర్షిభిః,
యత్ర శక్రో భయోద్విగ్న స్తం దేశ ముపచక్రముః. 17

శుభము, సత్యము, అమృతమువంటిదియు నగు విష్ణువు పలుకును విని దేవతలందరు, పురోహితులతో ఋషులతో కలిసి యింద్రుడు భయముతో గుండె చెదరియున్నచోటికి చేరిరి.

తత్రాశ్వమేధః సుమహాన్ మహేన్ద్రస్య మహాత్మనః,
వవృతే పావనార్థం వై బ్రహ్మహత్యాపహో నృప. 18

రాజా! అచట బ్రహ్మహత్యాపాతకమును పోగొట్టుకొనుటకై మహాత్ముడైన మహేంద్రుడు చేసిన గొప్పఅశ్వమేధయాగము ప్రవర్తిల్లెను.

విభజ్య బ్రహ్మహత్యాం తు వృక్షేషు చ నదీషు చ,
పర్వతేషు పృథివ్యాం చ స్త్రీషు చైవ యుధిష్ఠిర 19
సంవిభజ్య చ భూతేషు విసృజ్య చ సురేశ్వరః,
విజ్వరో ధూతపాప్మా చ వాసవోఽభవ దాత్మవాన్. 20

ఇంద్రుడు బ్రహ్మహత్యను పాళ్ళుగా చేసి చెట్లయందు, నదులయందు, కొండలయందు, భూమియందు, స్త్రీలయందు, భూతములయందు పంచి వదిలించుకొని జ్వరము, పాపము లేనివాడై మరల ఆత్మవంతుడాయెను.

అకమ్పృ న్నహుషం స్థానా ద్దృష్ట్వా బలనిషూదనః,
తేజోఘ్నం సర్వభూతానాం వరదానాచ్చ దుఃసహమ్. 21

బలాసురుని చంపిన ఇంద్రుడు సర్వభూతముల వరదానమువలన సహింప శక్యముకానివాడును, ఇతరుల తేజస్సును నశింపజేయువాడును నగు నహుషుని తన స్థానమునుండి చూచి వణకిపోయెను.

తతః శచీపతి ర్దేవః పునరేవ వ్యనశ్యత,
అదృశ్యః సర్వభూతానాం కాలాకాఙ్క్షీ చచార హ. 22

---

21. 'అకమ్పత' అని యుండవలసినచోట "అకమ్పృత్" అని యుండుట ఆర్షము.

అంత శచీపతి మరల అణగిపోయెను. సర్వభూతములకు కనబడనివాడై కాలమునకై ఎదురుచూచుచు తిరుగుచుండెను.

ప్రణష్టే తు తత శ్శక్రే శచీ శోకసమన్వితా,
హా శక్రేతి తదా దేవీ విలలాప సుదుఃఖితా. 23

అట్లు దేవేంద్రుడు మరల అణగి కనపడకపోగా శోకము నిండిన శచి- అయ్యో! శక్రా! అని పెద్దగా విలపించెను.

యది దత్తం యది హుతం గురవ స్తోషితా యది,
ఏకభ ర్తృత్వ మేవాస్తు సత్యం యద్య స్తి వా మయి. 24

నే నేదైన ఇచ్చియున్నచో, ఏదైన హోమము చేసియున్నచో, గురువులను సంతోషపెట్టియున్నచో నాయందు సత్యమున్నచో నాకు భర్త ఒక్కడే యగు గాక!

పుణ్యాం చేమా మహం దివ్యాం ప్రవృత్తా ముత్తరాయణే,
దేవీం రాత్రిం నమస్యామి సిధ్యతాం మే మనోరథః. 25

ఈ ఉత్తరాయణమున పుణ్యయు, దివ్యయు నగు రాత్రిదేవికి మ్రొక్కుదును. నాకోరిక సిద్ధించుగాక!

ప్రయతా చ నిశాం దేవీ ముపాతిష్ఠత తత్ర సా,
పతివ్రతాత్వాత్ సత్యేన సోపశ్రుతి మథాకరోత్. 26

అందామె నిశాదేవిని శుద్ధురాలై కొలిచెను. పతివ్రత కనుక సత్యము నాశ్రయించి ఉపశ్రుతిని సాక్షాత్కరించుకొనెను.

యత్రాస్తే దేవరాజోఽసౌ తం దేశం దర్శయస్వ మే,
ఇత్యాహోపశ్రుతిం దేవీం సత్యం సత్యేన దృశ్యతామ్. 27

'ఆ దేవరాజెట నుండెనో ఆ దేశమును నాకు చూపుము. సత్యము సత్యముతో కానవచ్చుగాక!' అని ఆమె ఉపశ్రుతిదేవితో పలికెను.

---

26. 'ఉపశ్రుతిమ్'–సందేహమును నిర్ణయించు దేవిని;
27. ఈ శ్లోకమున-

ఇతి శ్రీమహాభారతే ఉద్యోగపర్వణి సేనోద్యోగపర్వణి
ఉపశ్రుతియాచనే త్రయోదశోఽధ్యాయః.

ఇది శ్రీమహాభారతము ఉద్యోగపర్వమున సేనోద్యోగపర్వమున
ఉపశ్రుతిని యాచించుట అను పదమూడవ అధ్యాయము.

—(o)—

---

"ఆ నో యా హ్యుపశ్రుత్యుక్థేషు రణయా ఇహ
దివో అముష్య శాసతో దివం యయ దివావసో"
అను మంత్రార్థము వివరింపబడుచున్నది. మంత్రార్థము- హే ఉపశ్రుతి-ఓ ఉపశ్రుతిదేవతా! నః-మమ్ములను, ప్రతి-గూర్చి; ఆయాహి-రమ్ము; ఉక్థేషు-కామ్యకర్మములయందు; ఇహ-ఇచట; రణయ-కోరిన కోరికలను పొందింపుము; అముష్య-ఇదిగో ఈ నా మదిలోనున్న, దివమ్-దేవలోకమును; శాసతః - పాలించుచున్న ఇంద్రుని; దివమ్-వెలుగు; యయ-ఇమ్ము; హే దివావసో-పగటి ధనమును సూర్యుడువలె చీకటిలో పడ్డదానిని ప్రకాశింప జాలినవాడా!

## చతుర్దశోఽధ్యాయః - పదునాలుగవ అధ్యాయము

ఉపశ్రుతిసాహాయ్యే నేన్ద్రాణీన్ద్రయోః సమాగమః - ఉపశ్రుతి సాయమువలన ఇంద్రాణియు ఇంద్రుడును కలిసికొనుట.

శల్య ఉవాచ - శల్యు డిట్లు చెప్పెను.

అథైనాం రూపిణీ సాధ్వీ ముపాతిష్ఠ దుపశ్రుతిః.

అంత ఉపశ్రుతి రూపము ధరించి ఆసాధ్వికడకు వచ్చి నిలిచెను.

తాం వయోరూపసంపన్నాం దృష్ట్వా దేవీ ముపస్థితామ్. 1
ఇన్ద్రాణీ సంప్రహృష్టాత్మా సంపూజ్యైనా మథాబ్రవీత్,
ఇచ్ఛామి త్వా మహం జ్ఞాతుం కా త్వం బ్రూహి వరాననే. 2

వయస్సు, రూపము నిండుగా గలిగి వచ్చి నిలిచిన ఆ దేవిని చూచి ఇంద్రునిపత్ని మిక్కిలిగా సంతోషించిన ఆత్మతో ఆమెను పూజించి 'ఓ వరాననా! నీవెవ్వరో తెలియగోరుచున్నాను' అని పలికెను.

ఉపశ్రుతి రువాచ - ఉపశ్రుతి యిట్లు చెప్పెను.

ఉపశ్రుతి రహం దేవి తవాన్తిక ముపాగతా,
దర్శనం చైవ సంప్రాప్తా తవ సత్యేన భావిని. 3

మంచిభావములుగల ఓ దేవీ! నేను ఉపశ్రుతిని. నీ కడకు వచ్చితిని. నీ సత్యముచేత నాదర్శనము నీకు లభించెను.

పతివ్రతా చ యుక్తా చ యమేన నియమేన చ,
దర్శయిష్యామి తే శక్రం దేవం వృత్రనిషూదనమ్. 4

నీవు పతివ్రతవు. ఇంద్రియములపై అదుపు, నియమములు గలదానవు. వృత్రుని పరిమార్చిన ఇంద్రదేవుని నీకు చూపింతును.

క్షిప్ర మన్వేహి భద్రం తే ద్రక్ష్యసే సురసత్తమమ్,
తత స్తాం ప్రహితాం దేవీ మిన్ద్రాణీ సా సమన్వగాత్. 5

'శీఘ్రముగా నీవు నా వెనువెంట రమ్ము. నీకు భద్రమగును. దేవశ్రేష్ఠుని చూడగలవు.' అని పలికి బయలుదేరిన ఆమెను ఇంద్రాణి వెంట నంటెను.

దేవారణ్యా న్యతిక్రమ్య పర్వతాం శ్చ బహూం స్తతః,
హిమవన్త మతిక్రమ్య ఉత్తరం పార్శ్వ మాగమత్. 6

దేవలోకపు అడవులను, అనేకములగు పర్వతములను దాటి హిమవత్పర్వతమును దాటి, ఉత్తరపార్శ్వమును చేరుకొనెను.

సముద్రం చ సమాసాద్య బహుయోజనవిస్తృతమ్,
ఆససాద మహాద్వీపం నానాద్రుమలతావృతమ్. 7

పలుయోజనముల వైశాల్యముగల సముద్రముకడకరిగి యందు అనేకములగు చెట్లతో, తీగలతో నిండిన మహాద్వీపమును చేరుకొనెను.

తత్రాపశ్యత్ సరో దివ్యం నానాశకునిభి ర్వృతమ్,
శతయోజనవిస్తీర్ణం తావ దేవాయతం శుభమ్. 8

అచట అనేకములగు పక్షులతో కూడినదియు, నూరామడల వెడల్పు, అంతే పొడవు గలదియు, శుభమైనదియు నగు ఒకదివ్యమైన కొలనును చూచెను.

తత్ర దివ్యాని పద్మాని పఞ్చవర్ణాని భారత,
షట్పదై రుపగీతాని ప్రపుల్లాని సహస్రశః. 9

అందు వేలకొలదిగా దివ్యములైన కమలములు అయిదురంగులతో ఒప్పారియున్నవి. బాగుగా వికసించియున్నవి. తుమ్మెదలు గానములు చేయుచున్నవి.

సరస స్తస్య మధ్యే తు పద్మినీ మహతీ శుభా,
గౌరేణోన్నతనాళేన పద్మేన మహతా వృతా. 10

ఆ కొలను నడుమ ఒకపెద్ద పద్మలత కలదు. దానికి తెల్లని ఎత్తైన కాడగల ఒకపెద్దతామరపూవు కలదు.

5. ప్రహితామ్-బయలుదేరిన.

పద్మస్య భిత్త్వా నాళం తు వివేశ సహితా తయా,
బిసతన్తుప్రవిష్టం చ తత్రాపశ్య చ్ఛతక్రతుమ్. 11

ఆ ఉపశ్రుతిదేవి పద్మముకాడను చీల్చుకొని ఆమెతోపాటు అందు ప్రవేశించియున్న దేవేంద్రుని చూచెను.

తం దృష్ట్వా చ సుసూక్ష్మేణ రూపేణావస్థితం ప్రభుమ్,
సూక్ష్మరూపధరా దేవీ బభూ వోపశ్రుతి శ్చ సా. 12

మిక్కిలిసూక్ష్మరూపముతో అందున్న ప్రభువును గాంచి, ఉపశ్రుతియు సూక్ష్మరూపమును ధరించెను.

ఇన్ద్రం తుష్టావ చేన్ద్రాణీ విశ్రుతైః పూర్వకర్మభిః,
స్తూయమాన స్తతో దేవః శచీ మాహ పురన్దరః. 13

లోకమెరిగిన యింద్రుడు మున్ను చేసిన సత్కార్యములను ఇంద్రపత్ని కొనియాడెను. అట్లు స్తుతిగొనుచున్న దేవేంద్రుడు శచితో నిట్లు పలికెను.

కిమర్థ మసి సంప్రాప్తా విజ్ఞాతశ్చ కథం త్వహమ్,
తతః సా కథయామాస నహుషస్య విచేష్టితమ్. 14

నీవిచట కేల వచ్చితివి? నన్నెట్లెరిగితివి? అని యింద్రుడు అడుగగా ఆమె నహుషుని పాడుపనిని వివరించెను.

ఇన్ద్రత్వం త్రిషు లోకేషు ప్రాప్య వీర్యసమన్వితః,
దర్పావిష్టశ్చ దుష్టాత్మా మా మువాచ శతక్రతో. 15

గొప్పశక్తిగల ఆ నహుషుడు మూడులోకములయందును ఇంద్రత్వమును పొంది గర్వము పైకొనగా దుష్టాత్ముడై నాతో ఇట్లు పలికెను.

ఉపతిష్ఠేతి సక్రూరః కాలం చ కృతవా న్మమ,
యది న త్రాస్యసి విభో కరిష్యతి స మాం వశే. 16

ఆ క్రూరుడు తనకడ నుండుమని యడిగెను. నాకు కొంతసమయ మిచ్చెను. ప్రభూ! నీవు నన్ను రక్షింపకున్నచో వాడు నన్ను చేజిక్కించుకొనును.

ఏతేన చాహం సంప్రాప్తా ద్రుతం శక్ర తవాన్తికమ్,
జహి రౌద్రం మహాబాహో నహుషం పాపనిశ్చయమ్. 17

దేవేంద్రా! ఈకారణమున నేను నీకడకు పరువున వచ్చితిని. మహాబాహూ! పాపపు తీర్పులుగల భయంకరుడగు నహుషుని చంపుము.

ప్రకాశయాత్మ నాత్మానం దైత్యదానవసూదన,
తేజః సమాప్నుహి విభో దేవరాజ్యం ప్రశాధి చ. 18

నీయంతట నీవు వెలువడుము. దైత్యులను, దానవులను సంహరించు ఓ ప్రభూ! తేజమును పొందుము. దేవరాజ్యమును పాలింపుము.

ఇతి శ్రీ మహాభారతే ఉద్యోగపర్వణి సేనోద్యోగపర్వణి
ఇన్ద్రాణీ స్తవే చతుర్దశోఽధ్యాయః

ఇది శ్రీ మహాభారతమున ఉద్యోగపర్వమున సేనోద్యోగపర్వమున
ఇన్ద్రాణిస్తుతి యను పదునాలుగవ అధ్యాయము.

—(౦)—

# పఞ్చదశోఽధ్యాయః - పదునైదవ అధ్యాయము

ఇన్ద్రాణ్యా ఆగ్రహేణ నహుషేణ మహర్షీణాం వాహనీకరణం
బృహస్పత్యగ్న్యోః సంవాదశ్చ-
ఇంద్రాణి ఒత్తిడివలన నహుషుడు మహర్షులను వాహనముగా
చేయుట, బృహస్పతి అగ్నుల సంవాదము.

శల్య ఉవాచ - శల్యు డిట్లు పలికెను.

ఏవ ముక్తః స భగవాన్ శచ్యా తాం పున రబ్రవీత్,
విక్రమస్య న కాలోఽయం నహుషో బలవత్తరః. 1

శచీదేవి యిట్లు పలుకగా ఇంద్రుడు ఆమెతో మరల నిట్లనెను. ఇది పరాక్రమమునకు తగినకాలము కాదు. నహుషుడు నాకంటె మిక్కిలి బలముకలవాడు.

వివర్ధితశ్చ ఋషిభి ర్హవ్యకవ్యైశ్చ భావిని,
నీతి మత్ర విధాస్యామి దేవి తాం కర్తు మర్హసి. 2

ఓ ఊహాశాలినీ! ఋషు లిచ్చు హవ్యకవ్యములతో ఆతడు మిక్కిలి పెరిగి యున్నాడు. ఇచట నాకనీతిని ప్రయోగింతును. దేవీ! నీవది చేయవలయును.

గుహ్యం చైతత్ త్వయా కార్యం నాఖ్యాతవ్యం శుభే క్వచిత్,
గత్వా నహుష మేకాన్తే బ్రవీషి చ సుమధ్యమే. 3

నీ విది చాలగుట్టుగా చేయవలయును. దీని నెచటను చెప్పకుము. ఒంటరిగా నహుషునికడ కరిగి ఓసుమధ్యమా! ఇట్లు పలుకుము.

ఋషియానేన దివ్యేన మా ముపైహి జగత్పతే,
ఏవం తవ వశే ప్రీతా భవిష్యామీతి తం వద. 4

---

2. హవ్యము-దేవతలకు సమర్పించు పదార్థము; కవ్యము-పితృదేవతలకు సమర్పించు పదార్థము.

'ఓ జగత్పతీ! ఋషులు మోయు దివ్యమగు వాహనమెక్కి నాకడకు రమ్ము. ఇట్లయినచో నేను నీకు ప్రీతురాలనై వశ మగుదును' అని వానితో పలుకుము.

ఇత్యుక్త్వా దేవరాజేన పత్నీ సా కమలేక్షణా,
ఏవ మస్త్వి త్యథోక్త్వా తు జగామ నహుషం ప్రతి. 5

దేవరాజిట్లు పలుకగా ఆతని పత్ని కమలములవంటి కనులుగలదై 'అట్లే యగుగాక' యని పలికి నహుషునికడ కరిగెను.

నహుష స్తాం తతో దృష్ట్వా సస్మితో వాక్య మబ్రవీత్,
స్వాగతం తే వరారోహే! కిం కరోమి శుచిస్మితే. 6

అంత నహుషు డామెను గాంచి చిరునగవుతో ఇట్లు పలికెను. వరారోహా! నీకు స్వాగతము. స్వచ్ఛమైన చిరునగవు గలదానా! నన్ను ఏమి చేయమందువు.

భక్తం మాం భజ కల్యాణి! కిమిచ్ఛసి మనస్విని,
తవ కల్యాణి యత్ కార్యం తత్ కరిష్యే సుమధ్యమే. 7

కల్యాణీ! భక్తుడనగు నన్ను పొందుము. ఓ అభిమానవతీ! ఏమి కావలయును? సన్ననినడుముకలదానా! నీపని యేదో అది తప్పక చేయుదును.

న చ వ్రీడా త్వయా కార్యా సుశ్రోణి మయి విశ్వసేః,
సత్యేన వై శపే దేవి కరిష్యే వచనం తవ. 8

ఓ సుశ్రోణీ! నీవు సిగ్గుపడకుము. నన్ను నమ్ముము. సత్యముపై ఒట్టు. ఓదేవీ! నీమాటను తప్పక పాటింతును.

ఇన్ద్రాణ్యువాచ-ఇన్ద్రపత్ని యిట్లు పలికెను.

యో మే కృత స్త్వయా కాల స్తమాకాఙ్క్షే జగత్పతే,
తత స్త్వమేవ భర్తా మే భవిష్యసి సురాధిప. 9

జగత్పతీ! నీవు పెట్టిన గడువుకు ఎదురు చూచుచున్నాను. అటుపై నీవే నాకు భర్తవగుదువు.

కార్యం చ హృది మే యత్త ద్దేవరాజావధారయ,
వక్ష్యామి యది మే రాజన్ ప్రియ మేతత్ కరిష్యసి. 10
వాక్యం ప్రణయసంయుక్తం తతః స్యాం వశగా తవ,

దేవరాజా! నా మదిలోగల పని యేదో చెప్పుదును. చిత్తగింపుము. రాజా! నా కీ ప్రియమును చేసెదవేని, ప్రణయముతోడి నామాటను మన్నింతువేని నీకు వశమయ్యెదను.

ఇన్ద్రస్య వాజినో వాహా హస్తినోఽథ రథా స్తథా. 11
ఇచ్ఛామ్యహ మథాపూర్వం వాహనం తే సురాధిప,
యన్న విష్ణో ర్న రుద్రస్య నాసురాణాం న రక్షసామ్. 12

ఇంద్రునకు గుఱ్ఱములు, ఏనుగులు, రథములు మాత్రమే వాహనములు. ఓ సురాధిపా! విష్ణువునకు, రుద్రునకు, రాక్షసులకు, అసురులకును లేని అపూర్వమైన వాహనమును నేను నీకు కోరుదును.

వహన్తు త్వాం మహాభాగా ఋషయః సఙ్గతా విభో,
సర్వే శిబికయా రాజ న్నేతద్ధి మమ రోచతే. 13

పుణ్యాత్ములగు ఋషు లందరు కూడి నిన్ను పల్లకియందు మోయవలయును. ప్రభూ! ఇది నా కిష్టము.

నాసురేషు న దేవేషు తుల్యో భవితు మర్హసి,
సర్వేషాం తేజ ఆదత్సే స్వేన వీర్యేణ దర్శనాత్. 14
న తే ప్రముఖతః స్థాతుం కశ్చి చ్ఛక్నోతి వీర్యవాన్.

రాక్షసులలో గాని దేవతలలో గాని యెవ్వరికిని నీవు సాటి కారాదు. చూచుట మాత్రమున నీ వీర్యముతో అందరి తేజస్సును కైకొందువు కదా! నీ యెదుట నెట్టి శక్తిశాలియు నిలువజాలడు.

శల్య ఉవాచ - శల్యు డిట్లు చెప్పెను.

ఏవ ముక్తస్తు నహుషః ప్రాహృష్యత తదా కిల,
ఉవాచ వచనం చాపి సురేన్ద్ర స్తా మనిన్దితామ్. 15

ఆమె యిట్లు పలుకగా నహుషుడు పొంగిపోయెనట. మరియు దోసములేని యామెతో సురేంద్రు డిట్లనెను.

నహుష ఉవాచ - నహుషు డిట్లు పలికెను.

అపూర్వం వాహన మిదం త్వయోక్తం వరవర్ణిని,
దృఢం మే రుచితం దేవి త్వద్వశోఽస్మి వరాననే. 16

ఓ వరవర్ణినీ! నీవు చెప్పిన ఈ వాహనము మున్నెన్నడు లేనిది. నాకు చాల యిష్టమైనది. వరాననా! నేను నీకు వశుడ నయితిని.

న హ్యల్పవీర్యో భవతి యో వాహాన్ కురుతే మునీన్,
అహం తపస్వీ బలవాన్ భూతభవ్యభవత్ప్రభుః. 17

మునులను వాహనములుగా చేయువాడు తక్కువ శక్తికలవాడు కాదు గదా! నేను తపస్విని, బలవంతుడను. అయిన దానికి, అగుచున్నదానికి, కానున్న దానికి ప్రభువను.

మయి క్రుద్ధే జగ న్న స్యా న్మయి సర్వం ప్రతిష్ఠితమ్,

నేను కోపించినచో జగత్తుండదు. ఈ జగమంతయు నాయందే నెలకొని యున్నది.

దేవదానవగన్ధర్వాః కిన్నరోరగరాక్షసాః. 18
న మే క్రుద్ధస్య పర్యాప్తాః సర్వే లోకాః శుచిస్మితే,

ఓ శుచిస్మితా! దేవతలు, దానవులు, గంధర్వులు, కిన్నరులు, నాగులు, రక్షస్సులు, సర్వలోకములు నేను కోపించినచో నిలువజాలరు.

చక్షుషా యం ప్రపశ్యామి తస్య తేజో హరామ్యహమ్. 19
తస్మా త్తే వచనం దేవి కరిష్యామి న సంశయః.

నేను కంటితో నెవనిని చూచుదునో వాని తేజమును హరించివేయుదును. కావున నో దేవీ! నీ పలుకు తప్పక ఆచరింతును. సంశయింపకుము.

---

16. వరవర్ణినీ - పరమసుందరమగు దేహకాంతి కలది.

సప్తర్షయో మాం వక్ష్యన్తి సర్వే బ్రహ్మర్షయస్తథా. 20
పశ్య మాహాత్మ్యయోగం మే ఋద్ధిం చ వరవర్ణిని.

సప్తర్షులు నన్ను మోయుదురు. వారే ఏమి? బ్రహ్మర్షు లందరును మోయుదురు. నా మహిమను ఐశ్వర్యమును చూడుము.

శల్య ఉవాచ-శల్యు డిట్లు చెప్పెను.

ఏవ ముక్త్వా తు తాం దేవీం విసృజ్య చ వరాననామ్, 21
విమానే యోజయిత్వా చ ఋషీ న్నియమ మాస్థితాన్.
అబ్రహ్మణ్యో బలోపేతో మత్తో మదబలేన చ,
కామవృత్తః స దుష్టాత్మా వాహయామాస తానృషీన్. 22

ఇట్లు పలికి చక్కని మోముగల ఆ దేవిని పంపి నియమముతో నున్న ఋషులను విమానమునందు వాహనములుగా కట్టి మిక్కిలి బలము కలవాడు, మదముచేత ఒడలెఱుగనివాడు, నశించిన మహిమగలవాడు నగు ఆ దుష్టాత్ముడు కామప్రవృత్తి కలవాడై మోయించెను.

నహుషేణ విసృష్టా చ బృహస్పతి మథాబ్రవీత్,
సమయోఽల్పావశేషో మే నహుషేణేహ యః కృతః. 23

నహుషుడు పంపగా ఆ శచీదేవి బృహస్పతి కడ కరిగి ఇట్లు పలికెను. నహుషుడు నాకిచ్చిన గడువు కొంచెముమాత్రమే మిగిలియున్నది.

శక్రం మృగయ శీఘ్రం త్వం భక్తాయాః కురు మే దయామ్,
బాఢ మిత్యేవ భగవాన్ బృహస్పతి రువాచ తామ్. 24

త్వరగా ఇంద్రుని వెదకుము. భక్తురాలగు నన్ను దయచూడుము. అని పలుకగా భగవానుడగు బృహస్పతి 'సరే' యని యామెతో నిట్లు పలికెను.

న భేతవ్యం త్వయా దేవి నహుషా ద్దుష్టచేతసః,
నహ్యేష స్థాస్యతి చిరం గత ఏష నరాధమః. 25

దేవీ! దుష్టబుద్ధియగు నహుషునివలన నీవు భయపడవలదు. వీడు చిరకాలము నిలువడు. ఈ నరాధముడు పోయినట్లే భావింపుము.

---

20. వక్ష్యన్తి - మోయుదురు.

అధర్మజ్ఞో మహర్షీణాం వాహనాచ్చ తతః శుభే,
ఇష్టిం చాహం కరిష్యామి వినాశాయాస్య దుర్మతేః. 26

వాడు ధర్మ మెఱుగనివాడు. పైగా మహర్షులను వాహకులుగా చేసెను. నేనును ఆదుర్మతివినాశమునకై ఒక యజ్ఞమును చేయుదును.

శక్రం చాధిగమిష్యామి మాభై స్త్వం భద్రమస్తు తే.

ఇంద్రుని సాధింపగలను. నీవు భయపడకుము. నీకు మేలగును.

తతః ప్రజ్వాల్య విధివ జ్జుహావ పరమం హవిః. 27
బృహస్పతి ర్మహాతేజా దేవరాజోపలబ్ధయే,
హుత్వాగ్నిం సోఽబ్రవీద్రాజ ఞ్ఛక్ర మన్విష్యతా మితి. 28

అంత మహాతేజస్వియగు బృహస్పతి దేవరాజును పొందగోరి విధి విధానముగా అగ్నిని జ్వలింపజేసి పరమమైన హవిస్సును ప్రేల్చెను. అట్లు ప్రేల్చి అగ్నితో ఇంద్రుని వెదకు మని పలికెను.

తస్మాచ్చ భగవాన్ దేవః స్వయమేవ హుతాశనః,
స్త్రీవేష మద్భుతం కృత్వా తత్రైవాన్తరధీయత. 29

అంత అగ్నిదేవుడు స్వయముగా స్త్రీ వేషమును అద్భుతముగా ధరించి అక్కడి కక్కడ అంతర్ధానము చెందెను.

స దిశః ప్రదిశ శ్చైవ పర్వతాని వనాని చ,
పృథివీం చాన్తరిక్షం చ విచిన్త్యాథ మనోగతిః. 30
నిమేషాన్తరమాత్రేణ బృహస్పతి ముపాగమత్.

ఆతడును మనోవేగముతో దిక్కులు, మూలలు, పర్వతములు, అడవులు, భూమి, ఆకాశము ఈ అన్నింటిని రెప్పపాటు కాలములో వెదకి బృహస్పతి కడకు వచ్చెను.

అగ్ని రువాచ-అగ్ని యిట్లు పలికెను.

బృహస్పతే న పశ్యామి దేవరాజ మిహ క్వచిత్,
ఆపః శేషాః సదా చాపః ప్రవేష్టుం నోత్సహా మ్యహమ్. 31

బృహస్పతీ! దేవరా జెందును కానరాలేదు. జలములు మిగిలినవి. నేను నీటిలో ప్రవేశించుట కెన్నడు నుత్సహింపను.

న మే తత్ర గతి ర్బ్రహ్మన్ కిమన్యత్ కరవాణి తే,
తమబ్రవీ ద్దేవగురు రపో విశ మహాద్యుతే. 32

ఓ బ్రహ్మ! నాకందు ప్రవేశము లేదు. నీవు మరియే కార్యము చేయుదును? అనగా దేవగురువు 'మహాతేజస్వీ! నీటియందును ప్రవేశింపుము' అనెను.

అగ్ని రువాచ-అగ్ని యిట్లనెను.

నాపః ప్రవేష్టుం శక్ష్యామి క్షయో మేఽత్ర భవిష్యతి,
శరణం త్వాం ప్రపన్నోఽస్మి స్వస్తి తేఽస్తు మహాద్యుతే. 33

అయ్యా! నేను నీటిలో ప్రవేశింపజాలను. నా కచట నాశము కలుగును. నిన్ను శరణు పొందినవాడను. నీకు స్వస్తి.

అద్భ్యోఽగ్ని ర్బ్రహ్మతః క్షత్ర మశ్మనో లోహ ముత్థితమ్,
తేషాం సర్వత్రగం తేజః స్వాసు యోనిషు శామ్యతి. 34

నీటినుండి నిప్పు, బ్రాహ్మణులవలన క్షత్రము, మట్టినుండి లోహము వెలువడినవి. వాని తేజస్సు అన్నియెడల ప్రసరించును. కాని పుట్టుక తావులలో అణగిపోవును.

ఇతి శ్రీ మహాభారతే ఉద్యోగపర్వణి సేనోద్యోగపర్వణి
బృహస్పత్యగ్నిసంవాదే పఞ్చదశోఽధ్యాయః.

ఇది శ్రీ మహాభారతము ఉద్యోగపర్వమున సేనోద్యోగపర్వమున
బృహస్పతి అగ్నుల సంవాద మను పదునైదవ అధ్యాయము.

—(०)—

## అథ షోడశోఽధ్యాయః - పదునారవ అధ్యాయము

బృహస్పతి నేన్ద్రాగ్నిగోష్ఠిః స్తవనం, బృహస్పతే ర్లోకపాలానాం చేన్ద్రేణ సహ సంలాపః-

బృహస్పతి ఇంద్రాగ్నులను స్తుతించుట. బృహస్పతియు, లోకపాలురును ఇంద్రునితో మాటాడుట.

బృహస్పతి రువాచ - బృహస్పతి యిట్లు పలికెను.

త్వ మగ్నే సర్వదేవానాం ముఖం త్వమసి హవ్యవాట్,
త్వ మన్తః సర్వభూతానాం గూఢ శ్చరసి సాక్షివత్. 1

ఓ అగ్నీ! నీవు హవ్యములు మోయుచు దేవత లందరకు ముఖమై యున్నావు. నీవు సర్వభూతములలో సాక్షివలె గూఢముగా చరించుచుందువు.

త్వా మాహు రేకం కవయ స్త్వామాహు స్త్రివిధం పునః,
త్వయా త్యక్తం జగచ్చేదం సద్యో నశ్యే ద్ధుతాశన. 2

హోమపదార్థము అన్నముగా గల ఓ అగ్నీ! నిన్ను మేధావులు ఒక్కడందురు. మఱియ మూడు రూపములు కలవాడనియు నందురు. ఏకరూపుడవగు నీవు లేనిచో ఈ జగత్తంతయు నొక్క పెట్టున నశించును.

కృత్వా తుభ్యం నమో విప్రాః స్వకర్మవిజితాం గతిమ్,
గచ్ఛన్తి సహ పత్నీభిః సుతై రపి చ శాశ్వతమ్. 3

మూడురూపములతో నున్న నీకు నమస్కారము చేసి విద్వాంసులు తమ కర్మముల ద్వారమున సాధించిన శాశ్వతమైన పదవిని పత్నులతో, పుత్రులతో పాటుగ చేరుకొందురు.

---

2. ఏకమ్-జఠరాగ్నిరూపమున ప్రాణులందరి యందుండు అగ్ని ఒక్కటియే; త్రివిధమ్ - గార్హపత్యము, దక్షిణము, ఆహవనీయము అను రూపములతో; త్వయా-జఠరాగ్ని రూపమున ఒక్కడుగా నున్న.

3. తుభ్యమ్ - మూడు రూపములు గల నీకు;

త్వమేవాగ్నే హవ్యవాహ స్త్వమేవ పరమం హవిః,
యజన్తి సత్రై స్త్వామేవ యజ్ఞైశ్చ పరమాధ్వరే. 4

ఓ అగ్నీ! హోమము లా యా దేవతల కందించువాడవు నీవే. గొప్పది యగు హవిస్సును నీవే. సత్రయాగములను, యజ్ఞములను, జ్యోతిష్టోమాది యాగములను నిన్నుద్దేశించియే చేయుదురు.

సృష్ట్వా లోకాం స్త్రీనిమాన్ హవ్యవాహ
ప్రాప్తే కాలే పచసి పునః సమిద్ధః,
త్వం సర్వస్య భువనస్య ప్రసూతి
స్త్వ మేవాగ్నే భవసి పునః ప్రతిష్ఠా. 5

ఓ హవ్యవాహా! నీ వీ మూడులోకములను సృజించి మరల కాలము మూడినపుడు మంటలతో చెలరేగి సంహరింతువు. నీ వీ సర్వలోకములకు ఉత్పత్తిస్థానమవు. ఓ అగ్నీ అట్లే మరల ప్రళయస్థానము కూడ అగుచున్నావు.

త్వా మగ్నే జలదా నాహు ర్విద్యుతశ్చ మనీషిణః,
వహన్తి సర్వభూతాని త్వత్తో నిష్క్రమ్య హేతయః. 6

ఓ అగ్నీ! వివేకముకలవారు నిన్నే మేఘములుగా మెరపులుగా అభివర్ణింతురు. నీనుండి వెలునడిన జ్వాలలే సర్వభూతములను పట్టి నిలుపుచున్నవి.

త్వయ్యాపో నిహితాః సర్వా స్త్వయి సర్వమిదం జగత్,
న తేఽ స్త్యవిదితం కిఞ్చిత్ త్రిషు లోకేషు పావక ! 7

జలము లన్నియు నీయందే నెలకొని యున్నవి. ఈ జగత్తు సర్వమును నీయందే యున్నది. ఓ పావకా! మూడు లోకములయందును నీకు తెలియనిది యిసుమంతయు లేదు.

స్వయోనిం భజతే సర్వో విశస్వాపోఽవిశఙ్కితః,
అహం త్వాం వర్ధయిష్యామి బ్రాహ్మై ర్మన్త్రై స్సనాతనైః. 8

---

5. ప్రసూతిః - ఉత్పత్తిస్థానము; ప్రతిష్ఠా - లయస్థానము.
6. హేతయః - జ్వాలలు.
8. బ్రాహ్మైః - బ్రహ్మమనగా వేదము, వేదసంబంధములైన.

ఎల్లవాడును తనపుట్టుకస్థానమును పొందగలడు. కావున ఎంతమాత్రము శంకింపక జలములలో ప్రవేశింపుము. నేను వేదములందలి మిక్కిలి ప్రాచీనములైన మంత్రములతో నిన్ను వృద్ధి పొందింతును.

ఏవం స్తుతో హవ్యవాట్ స భగవాన్ కవి రుత్తమః,
బృహస్పతి మథోవాచ ప్రీతిమాన్ వాక్య ముత్తమమ్.
దర్శయిష్యామి తే శక్రం సత్య మేత ద్బ్రవీమి తే. 9

బృహస్పతి యిట్లు స్తుతింపగా ఉత్తముడు, మేధావి, భగవంతుడు నగు అగ్నిదేవుడు ప్రీతినొంది మంచిమాట నిట్లు పలికెను. ఓయీ! బృహస్పతీ! నిజ మాడుచున్నాను. నీకు ఇంద్రుని చూపింతును.

శల్య ఉవాచ-శల్యు డిట్లు చెప్పెను.

ప్రవిశ్యాప స్తతో వహ్నిః ససముద్రాః సపల్వలాః,
ఆససాద సర స్తచ్చ గూఢో యత్ర శతక్రతుః. 10

అంత నగ్ని సముద్రములతో, చిన్నపడియలతో నున్న సర్వజలములను ప్రవేశించి చివరకు ఇంద్రుడు గుట్టుగా నున్న ఆ సరస్సును చేరుకొనెను.

అథ తత్రాపి పద్మాని విచిన్వన్ భరతర్షభ,
అపశ్యత్ స తు దేవేన్ద్రం బిసమధ్యగతం తదా. 11

అందును పద్మము లన్నింటిని వెదకుచు తామరతూడులోపల నున్న దేవేంద్రుని గాంచెను.

ఆగత్య చ తత స్తూర్ణం తమాచష్ట బృహస్పతేః,
అణుమాత్రేణ వపుషా పద్మతన్త్వాశ్రితం ప్రభుమ్. 12

ఆతడు బృహస్పతికడకు వేగమున వచ్చి అణుమాత్రమైన దేహముతో తామరతూడు నాశ్రయించి యున్న ప్రభువును గూర్చి తెలిపెను.

గత్వా దేవర్షిగన్ధర్వైః సహితోఽథ బృహస్పతిః,
పురాణైః కర్మభి ర్దేవం తుష్టావ బలసూదనమ్. 13

దేవతలతో, ఋషులతో, గంధర్వులతో గూడి బృహస్పతి అచటి కరిగి ఇంద్రుడు తొల్లి చేసిన మహాకార్యములను వక్కాణించుచు ఆతనిని స్తుతించెను.

మహాసురో హతః శక్ర నముచి ర్దారుణ స్త్వయా,
శమ్బరశ్చ బలశ్చైవ తథోభౌ ఘోరవిక్రమౌ. 14

ఓ ఇంద్రా! నీవు మహారాక్షసుడు దారుణుడు నయిన నముచిని చంపితివి. ఘోరమైన పరాక్రమముగల శంబరుడు బలుడు అను రక్కసులను పరిమార్చితివి.

శతక్రతో వివర్ధస్వ సర్వాన్ శత్రూన్ నిషూదయ,
ఉత్తిష్ఠ శక్ర సంపశ్య దేవర్షీం శ్చ సమాగతాన్. 15

ఓ శక్రా! వృద్ధిపొందుము. పగవారి నందరిని పరిమార్పుము. లెమ్ము! వచ్చిన దేవర్షు లందరిని చక్కగా చూడుము.

మహేన్ద్ర దానవాన్ హత్వా లోకా స్త్రాతా స్త్వయా విభో!

మహేంద్రా! నీ వనేకదానవులను చంపి లోకముల నన్నింటిని రక్షించితివి.

అపాం ఫేనం సమాసాద్య విష్ణుతేజోఽతిబృంహితమ్,
త్వయా వృత్రో హతః పూర్వం దేవరాజః జగత్పతే! 16

దేవరాజా! జగత్పతీ! విష్ణుని తేజముతో శక్తిని మిక్కుటముగా పుంజుకొన్న నీటినురుగును చేకొని నీవు మున్ను వృత్రుని సంహరించితివి.

త్వం సర్వభూతేషు శరణ్య ఈడ్య
స్త్వయా సమం విద్యతే నేహ భూతమ్,
త్వయా ధార్యన్తే సర్వభూతాని శక్ర
త్వం దేవానాం మహిమానం చకర్థ. 17

రక్షకా! నీవు సర్వభూతములలో శ్రేష్ఠుడవు. నీతో సాటివచ్చు భూతము లేదు. భూతము లన్నింటికి నీవే పట్టుగొమ్మవు. నీవు దేవతలకు గొప్పతనమును సాధించితివి.

పాహి సర్వాంశ్చ లోకాంశ్చ మహేన్ద్ర బల మాప్నుహి,
ఏవం సంస్తూయమానశ్చ సోఽవర్ధత శనైః శనైః. 18

మహేంద్రా! సర్వలోకములను రక్షింపుము. బలమును పొందుము. అని యిట్లు స్తుతించుచుండగా ఇంద్రుడు మెల్లమెల్లగా పెరుగజొచ్చెను.

స్వం చైవ వపు రాస్థాయ బభూవ స బలాన్వితః,
అబ్రవీచ్చ గురుం దేవో బృహస్పతి మవస్థితమ్. 19

తనదైన దేహమును పొంది బలముతో కూడినవా డాయెను. అంత ఇంద్రుడు బృహస్పతితో నిట్లు పలికెను.

కిం కార్య మవశిష్టం వో హతస్త్వాష్ట్రో మహాసురః,
వృత్రశ్చ సుమహాకాయో యో వై లోకా ననాశయత్. 20

మీ కింకను మిగిలిన పని యేమి? మహారాక్షసుడు త్వష్టకొడుకు మడిసెను గదా! పెనుదేహముతో లోకముల రూపుమాపిన వృత్రుడు చచ్చెను గదా!

బృహస్పతి రువాచ-బృహస్పతి యిట్లు పలికెను.

మానుషో నహుషో రాజా దేవర్షిగణతేజసా
దేవరాజ్య మనుప్రాప్తః సర్వాన్నో బాధతే భృశమ్. 21

మనుష్యుడగు నహుషు డనురాజు దేవతల, ఋషులతేజమువలన నీవెనుక దేవరాజ్యమును పొందెను. వాడు మమ్మందరిని మిక్కిలిగా బాధించుచున్నాడు.

ఇన్ద్ర ఉవాచ-ఇంద్రు డిట్లు పలికెను.

కథం చ నహుషో రాజ్యం దేవానాం ప్రాప దుర్లభమ్,
తపసా కేన వా యుక్తః కింవీర్యో వా బృహస్పతే. 22

బృహస్పతీ! ఎవ్వరికిని పొందనలవికాని దేవతల రాజ్యమును నహుషు డెట్లు పొందెను? ఆత డెట్టి తపము కలవాడు? ఎట్టి శక్తికలవాడు?

బృహస్పతి రువాచ-బృహస్పతి యిట్లు చెప్పెను.

దేవా భీతాః శక్ర మకామయన్త
త్వయా త్యక్తం మహ దైన్ద్రం పదం తత్,

తదా దేవాః పితరోఽథర్షయశ్చ
గన్ధర్వముఖ్యాశ్చ సమేత్య సర్వే. 23

ఆ గొప్పదైన ఇంద్రపదవిని నీవు విడచిపోగా దేవతలు భయపడి ఇంద్రుడు కావలయు ననుకొనిరి. అప్పుడు దేవతలు, పితృదేవతలు, ఋషులు, గంధర్వముఖ్యులు అందరును కలిసి—

గత్వాఽబ్రువ న్నహుషం తత్ర శక్ర
త్వం నో రాజా భవ భువనస్య గోప్తా,
తా నబ్రవీ న్నహుషో నాస్మి శక్త
ఆప్యాయధ్వం తపసా తేజసా మామ్. 24

వెళ్ళి, నహుషునితో 'నూరు యజ్ఞములు చేసినవాడా! నీవు మాకు రాజవు కమ్ము. లోకమునకు రక్షకుడ వగుము! అని పలికిరి. అంత నహుషుడు 'నా కాశక్తి లేదు. నన్ను తపస్సుతో, తేజస్సుతో పుష్టి నొందింపుడు.' అని పలికెను.

ఏవ ముక్తై ర్వర్ధిత శ్చాపి దేవై
రాజాభవన్నహుషో ఘోరవీర్యః,
త్రైలోక్యే చ ప్రాప్య రాజ్యం మహర్షీన్
కృత్వా వాహాన్ యాతి లోకాన్ దురాత్మా. 25

నహుష డిట్లనగా దేవత లందరు వానిని వృద్ధి పొందించిరి. ఘోరమైన శక్తిగల నహుషుడు రాజయ్యెను. అట్లు ముల్లోకములరాజ్యమును పొంది ఆ దురాత్ముడు మహర్షులను వాహకులుగా చేసి లోకములందు త్రిమ్మరుచున్నాడు.

తేజోహరం దృష్టివిషం సుఘోరం
మా త్వం పశ్యే ర్నహుషం వై కదాచిత్,
దేవాశ్చ సర్వే నహుషం భృశార్తా
న పశ్యన్తే గూఢరూపా శ్చరన్తః. 26

అతనిచూపు విషమువంటిది. మిక్కిలి ఘోరమైనది. ఇతరులతేజస్సును లాగివేయునది, కాని ఎన్నటికిని నీవాతనిని చూడకుము. మిక్కిలిపీడ నొందిన దేవత లందరు చాటుమాటుగా తిరుగుచు వానికంటఁబడకుందురు.

ఏవం వదత్యఙ్గిరసాం వరిష్ఠే
బృహస్పతౌ లోకపాలః కుబేరః,
వైవస్వత శ్చైవ యమః పురాణో
దేవశ్చ సోమో వరుణ శ్చాజగామ. 27

అంగిరసులలో గొప్పవాడగు బృహస్పతి యిట్లనుచున్నంతలో లోకపాలుడగు కుబేరుడు, సూర్యుని కొడుకగు యముడు, పురాణదేవుడగు చంద్రుడు. వరుణుడును అచటికి వచ్చిరి.

తే వై సమాగమ్య మహేన్ద్ర మూచు
ర్దిష్ట్యా త్వాష్ట్రో నిహతశ్చైవ వృత్రః,
దిష్ట్యా చ త్వాం కుశలిన మక్షతం చ
పశ్యామో వై నిహతారిం చ శక్ర. 28

వారందరును వచ్చి ఇంద్రునితో అదృష్టవశమున త్వష్టకొడుకును, వృత్రుడును చచ్చిరి. ఇంద్రా! భాగ్యవశమున శత్రువులను చంపి గాయపడక కుశలముగా నున్న నిన్ను గాంచితిమి' అని పలికిరి.

స తాన్ యథావచ్చ హి లోకపాలాన్
సమేత్య వై ప్రీతమనా మహేన్ద్రః,
ఉవాచ చైనాన్ ప్రతిభాష్య శక్రః
సంచోదయిష్య న్నహుష స్యాన్తరేణ. 29

ఆ యింద్రుడును ఆ లోకపాలురను తగు విధముగా కలిసి ప్రీతిచెందిన మనస్సుతో వారిని పలుకరించి నహుషునితో భేదమును పురికొల్పుచు నిట్లు పలికెను.

---

29. అన్తరేణ-భేదముచేత-

రాజా దేవానాం నహుషో ఘోరరూప
స్తత్ర సాహాయ్యం దీయతాం మే భవద్భిః,
తే చాబ్రువ న్నహుషో ఘోరరూపో
దృష్టీవిష స్తస్య బిభీమ శక్ర. 30

'దేవతలరాజైన నహుషునిది ఘోరమైన రూపము. ఆతనివిషయమున మీరు నాకు సాయము చేయవలయును.' అనగా వారందరు 'ప్రభూ! వాడు ఘోరరూపుడు. చూపులలో విషముగలవాడు. మేము భయపడుదుము' అని పలికిరి.

త్వం చేద్రాజానం నహుషం పరాజయే
స్తతో వయం భాగ మర్హామ శక్ర
ఇన్ద్రోఽబ్రవీ ద్భవతు భవా నపాం పతి
ర్యమః కుబేరశ్చ మయాభిషేకమ్. 31
సంప్రాప్ను వన్త్యద్య సహైవ దైవతై
రిపుం జయామ తం నహుషం ఘోరదృష్టిమ్.

'నీవు రాజైన నహుషుని గెలుతువేని ఆ పనిలో మేమును పాల్గొందుము' అని వారు పలుకగా ఇంద్రుడు అట్లేయగుగాక! నీవును, యముడును, కుబేరుడును నాతో అభిషేకము పొందుదురు. దేవతలతో కూడి ఈనాడే ఆ ఘోరదృష్టిగల నహుషుని గెలుతము.

తతః శక్రం జ్వలనోఽప్యాహ భాగం
ప్రయచ్ఛ మహ్యం తవ సాహ్యం కరిష్యే,
తమాహ శక్రో భవితాఽగ్నే తవాపి
చేన్ద్రాగ్న్యో ర్వై భాగ ఏకో మహాక్రతౌ. 32

అంతట అగ్నియు ఇంద్రునితో 'ఇంద్రా! నాకును భాగమిమ్ము. నీకు సాయము చేయుదును' అని అడిగెను. ఇంద్రుడు 'అగ్నీ! నీకును భాగము కలదు. మహాయజ్ఞమున ఇంద్రాగ్నులకు భాగమొక్కటియేకదా!' అని పలికెను.

---

30. దృష్టీవిషః-చూపులతో విషమున్నవాడు. ఒక విధమైన సర్పము. కావుననే నహుషుడు పాముగా శాపము నందెను.

శల్య ఉవాచ-శల్యు డిట్లు చెప్పెను.

ఏవం సఞ్చిన్త్య భగవాన్ మహేన్ద్రః పాకశాసనః,
కుబేరం సర్వయక్షాణాం ధనానాం చ ప్రభుం తథా. 33
వైవస్వతం పితౄణాం చ వరుణం చాప్యపాం తథా,
ఆధిపత్యం దదౌ శక్రః సఞ్చిన్త్య వరద స్తథా. 34

ఇట్లాలోచించి భగవంతుడగు మహేంద్రుడు కుబేరుని యక్షులందరికిని, ధనములకును ప్రభువును చేసెను. యముని పితృదేవతలకును, వరుణుని జలములకును అధిపతులను జేసెను.

ఇతి శ్రీ మహాభారతే ఉద్యోగపర్వణి సేనోద్యోగపర్వణి
ఇన్ద్రవరుణాదిసంవాదే షోడశోఽధ్యాయః.

ఇది శ్రీ మహాభారతము ఉద్యోగపర్వమున సేనోద్యోగపర్వమున
ఇంద్రవరుణాదుల సంవాదము గల పదునారవఅధ్యాయము.

—: o :—

## సప్తదశోఽధ్యాయః - పదునేడవ అధ్యాయము

**అగస్త్యేనేన్ద్రాయ నహుషపతనవృత్తాన్త నివేదనమ్-**

**అగస్త్యుడు ఇంద్రునకు నహుషపతన వృత్తాంత మెఱిగించుట.**

శల్య ఉవాచ-శల్యు డిట్లు చెప్పెను.

అథ సఞ్చిన్తయానస్య దేవరాజస్య ధీమతః,
నహుషస్య వధోపాయం లోకపాలైః సదైవతైః. 1
తపస్వీ తత్ర భగవా నగస్త్యః ప్రత్యదృశ్యత
సోఽబ్రవీ దర్చ్య దేవేన్ద్రం దిష్ట్యా వై వర్ధతే భవాన్. 2

బుద్ధిశాలియగు దేవరాజు లోకపాలురతో నహుషునివధమునకు ఉపాయము ఆలోచించుచుండగా అచటకు తపస్వియగు అగస్త్యభగవానుడు అరుదెంచెను. ఆత డింద్రుని మన్నించి 'భాగ్యవశమున నీవు వర్ధిల్లుచున్నావు' అని పలికెను.

విశ్వరూప వినాశేన వృత్రాసురవధేన చ
దిష్ట్యాద్య నహుషో భ్రష్టో దేవరాజ్యాత్ పురన్దర! 3
దిష్ట్యా హతారిం పశ్యామి భవన్తం బలసూదన.

ఈ నీవృద్ధికి విశ్వరూపుని పరిమార్చుటయు, వృత్రాసురుని చంపుటయు, కారణములు. భాగ్యవశమున నేడు నహుషుడు దేవరాజ్యము నుండి భ్రష్టుడాయెను. ఓ పురందరా! బలారీ! ఈనాడు భాగ్యవశమున పగవారు నశించిన నిన్ను చూచుచున్నాను.

ఇన్ద్ర ఉవాచ-ఇంద్రు డిట్లు పలికెను.

స్వాగతం తే మహర్షేఽస్తు ప్రీతోఽహం దర్శనాత్ తవ,
పాద్య మాచమనీయం చ గామర్ఘ్యం చ ప్రతీచ్ఛ మే. 4

ఓ మహర్షీ! నీకు స్వాగతము. నీ దర్శనమువలన ప్రీతుడనైతిని. ఇదిగో పాదములకు నీరు, ఇదిగో ఆచమించుటకు ఉదకము. ఇదిగో ఆవు, ఇవిగో పూజా వస్తువులు - వీనిని స్వీకరింపుము.

శల్య ఉవాచ-శల్యు డిట్లు చెప్పెను.

పూజితం చోపవిష్టం తమాసనే మునిసత్తమమ్,
పర్యపృచ్ఛత దేవేశః ప్రహృష్టో బ్రాహ్మణర్షభమ్. 5

అట్లు పూజనొంది ఆసనమున కూర్చున్న మునిశ్రేష్ఠుని, బ్రాహ్మణోత్తముని, మిక్కిలి హర్షముతో, దేవరా జిట్లడిగెను.

ఏత దిచ్ఛామి భగవన్ కథ్యమానం ద్విజోత్తమ,
పరిభ్రష్టః కథం స్వర్గా న్నహుషః పాపనిశ్చయః. 6

ఓయి భగవానుడా! ద్విజవరా! నీవు చెప్పెడు ఈ విషయమును వివరముగా తెలియగోరుదును. పాపనిర్ణయములు గల నహుషుడు స్వర్గమునుండి పరిభ్రష్టుడైన విధ మెట్లు?

అగస్త్య ఉవాచ - అగస్త్యు డిట్లు చెప్పెను.

శృణు శక్ర ప్రియం వాక్యం యథా రాజా దురాత్మవాన్,
స్వర్గా ద్భ్రష్టో దురాచారో నహుషో బలదర్పితః. 7

ఇంద్రా! ప్రియమైన వాక్యము విను. దుష్టాత్ముడు, బలముచేత నిక్కుచున్నవాడు, దురాచారుడు నగు నహుషుడు స్వర్గమునుండి భ్రష్టుడైన విధమును చెప్పెదను.

శ్రమార్తాశ్చ వహన్త స్తం నహుషం పాపకారిణమ్,
దేవర్షయో మహాభాగా స్తథా బ్రహ్మర్షయోఽమలాః. 8
పప్రచ్ఛు ర్నహుషం దేవ సంశయం జయతాం వర.

పాపకర్ముడగు ఆ నహుషుని మోయుటచే అలసట నొందినవారై పుణ్యాత్ములగు దేవర్షులు, నిర్మలులగు బ్రహ్మర్షులు నహుషుని ఒక సంశయమును గూర్చి ప్రశ్నించిరి.

య ఇమే బ్రహ్మణా ప్రోక్తా మన్త్రా వై ప్రోక్షణే గవామ్. 9
ఏతే ప్రమాణం భవత ఉతాహో నేతి వాసవ,
నహుషో నేతి తానాహ తమసా మూఢచేతనః. 10

బ్రహ్మ ఉపదేశించినవియు గోవులను ప్రోక్షించెడునవియు నగు ఈ మంత్రములు నీకు ప్రమాణములా? కావా? అని అడుగగా అజ్ఞానముచేత బుద్ధి కోల్పోయి నహుషుడు కావని వారితో ననెను.

ఋషయ ఊచుః-ఋషు లిట్లనిరి.

అధర్మే సంప్రవృత్త స్త్వం ధర్మం న ప్రతిపద్యసే,
ప్రమాణ మేత దస్మాకం పూర్వం ప్రోక్తం మహర్షిభిః. 11

నీవు అధర్మమున నడచుచున్నావు. ధర్మము నెరుగకున్నావు. తొల్లి మహర్షులు చెప్పిన ఈ విషయము మాకు ప్రమాణము.

తతో వివదమానః స మునిభిః సహ వాసవ,
అథ మా మస్పృశన్ మూర్ధ్ని పాదేనాధర్మపీడితః. 12

అట్లు మునులతో వాదాడుచు, అధర్మము హింసింపగా నాతడు నన్ను తలపై కాలితో తన్నెను.

---

9,10. ఆవులపై ప్రోక్షించునపుడు, యజ్ఞమున మారణము చేయునపుడు ప్రయోగించుమంత్రములు "దేవాశ్చ యాభి ర్యజతే ధదాతి చ గావః సోమస్య ప్రథమస్య భక్షః" మొదలగునవి. ఇట్టి యజ్ఞపశువులు భక్షములని భక్షణాంతయాగమున చెప్పబడినది. అవి ప్రమాణములా? కావా? అని ఋషుల ప్రశ్నము.
నహుషునిభావ మేమనగా "బ్రాహ్మణా శ్చైవ గావశ్చ కుల మేకం ద్విధా కృతమ్, ఏకత్ర మన్త్రా స్తిష్ఠన్తి హవి రేకత్ర తిష్ఠతి" (బ్రాహ్మణులు గోవులు ఒక్కటే కులము. రెండైనవి. ఒకదానియందు మంత్రములు, రెండవదానియందు హవిస్సు నెలకొనియున్నవి.) అను శాస్త్రమును బట్టి బ్రాహ్మణులవలె గోవులును చంపరానివి. ఇట్లతడు వేదమును అప్రమాణ మొనరించెను. వేదమును, బ్రాహ్మణులను అవమానించి అధోగ్రతి పాలాయెను.

తేనాభూ ద్ధతతేజాశ్చ నిఃశ్రీకశ్చ మహీపతిః,
తత స్తం తమసాఽఽవిగ్న మవోచం భృశపీడితమ్. 13

దానివలన వానితేజస్సు నశించెను. ఐశ్వర్య మడుగంటెను. అజ్ఞానము క్రమ్ముకొని మిక్కిలి పీడనొందిన వానితో నిట్లంటిని.

యస్మాత్ పూర్వైః కృతం రాజన్ బ్రహ్మర్షిభి రనుష్ఠితమ్,
అదృష్టం దూషయసి మే యచ్చ మూర్ధ్న్యస్పృశః పదా. 14

రాజా! పూర్వులగు బ్రహ్మర్షులు అనుష్ఠించిన దానిని, నీకు కానరాని దానిని నిందించుచున్నావు. నన్ను తలపై కాలితో తన్నితివి.

యచ్చాపి త్వమృషీన్ మూఢ బ్రహ్మకల్పాన్ దురాసదాన్,
వాహాన్ కృత్వా వాహయసి తేన స్వర్గా ద్ధతప్రభః
ధ్వంస పాపపరిభ్రష్టః క్షీణపుణ్యో మహీతలే. 16
దశవర్షసహస్రాణి సర్పరూపధరో మహాన్,
విచరిష్యసి పూర్ణేషు పునః స్వర్గ మవాప్స్యసి. 17

మరియు బ్రహ్మకు కొంచెము తక్కువవారు, ఇతరులకు లోబడనివారు నగు ఋషులను వాహనములుగా చేసి మోయించుకొనుచున్నావు. ఈ కారణము లుగా వన్నెచెడి నాశనముచేయు పాపమువలన స్వర్గమునుండి పూర్తిగా జారిన వాడవై పుణ్యము కోల్పోయి భూతలమున పదివేలయేండ్లు పాము రూపమును పొంది పడి యుండుము. ఆయేండ్లు నిండిన పిదప మరల స్వర్గమును చేరుదువు.

ఏవం భ్రష్టో దురాత్మా స దేవరాజ్యా దరిందమ,
దిష్ట్యా వర్ధామహే శక్ర హతో బ్రాహ్మణకణ్టకః. 18

శత్రుమర్దనా! ఇంద్రా ! ఇట్లాదురాత్ముడు దేవరాజ్యమునుండి పతన మొందెను. అదృష్టవశమున మాకు పెంపు కలుగుచున్నది. బ్రహ్మవేత్తలకు కంటకమైనవాడు నశించెను.

త్రివిష్టపం ప్రపద్యస్వ పాహి లోకాన్ శచీపతే!
జితేన్ద్రియో జితామిత్రః స్తూయమానో మహర్షిభిః. 19

శచీపతీ! స్వర్గమును పొందుము. ఇంద్రియములను, పగవారిని గెలిచిన వాడవై మహర్షులు కొనియాడుచుండగా లోకముల నేలుము.

శల్య ఉవాచ-శల్యు డిట్లు పలికెను.

తతో దేవా భృశం తుష్టా మహర్షిగణసంవృతాః,
పితర శ్చైవ యక్షాశ్చ భుజగా రాక్షసా స్తథా. 20
గన్ధర్వా దేవకన్యాశ్చ సర్వే చాప్సరసాం గణాః,
సరాంసి సరితః శైలాః సాగరాశ్చ విశాంపతే. 21

అంత దేవతలు, మహర్షులు, పితృదేవతలు, యక్షులు, సర్పములు, రాక్షసులు, గంధర్వులు, దేవకన్యలు, అప్సరసల గణములు, సరస్సులు, నదులు, కొండలు, సముద్రములు మిక్కిలితుష్టి నొందెను.

ఉపాగమ్యాబ్రువన్ సర్వే దిష్ట్యా వర్ధసి శత్రుహన్
హతశ్చ నహుషః పాపో దిష్ట్యాఽగస్త్యేన ధీమతా,
దిష్ట్యా పాపసమాచారః కృతః సర్పో మహీతలే. 22

అందరు వచ్చి 'ఓయీ! శత్రుహంతా! భాగ్యవశమున వర్ధిల్లుచున్నావు. పాపుడగు నహుషుడు ధీమంతుడగు అగస్త్యునివలన నశించెను. ఆ పాపాచారుడు భూతలమున పామై పడియుండెను' అని పలికిరి.

ఇతి శ్రీమహాభారతే ఉద్యోగపర్వణి సేనోద్యోగపర్వణి
ఇన్ద్రాగస్త్యసంవాదే నహుషభ్రంశే సప్తదశోఽధ్యాయః.

ఇది శ్రీ మహాభారతము ఉద్యోగపర్వమున సేనోద్యోగపర్వమున
ఇంద్రాగస్త్యుల సంవాదమునందు నహుషునిపాటు అనెడు
పదునేడవ అధ్యాయము

—(౦)—

## అష్టాదశోఽధ్యాయః - పదునెనిమిదవ అధ్యాయము

ఇన్ద్రేణ స్వర్గం గత్వా స్వకీయరాజ్యస్య పాలనం, యుధిష్ఠిర
మాశ్వాస్య శల్యస్య దుర్యోధన సన్నిధౌ గమనమ్.

ఇంద్రుడు స్వర్గమున కరిగి తనదైన రాజ్యమేలుట, యుధిష్ఠిరుని
ఓదార్చి శల్యుడు దుర్యోధనునికడ కరుగుట.

శల్య ఉవాచ-శల్యు డిట్లు చెప్పెను.

తతః శక్రః స్తూయమానో గన్ధర్వాప్సరసాం గణైః,
ఐరావతం సమారుహ్య ద్విపేన్ద్రం లక్షణై ర్యుతమ్. 1

పావకః సుమహాతేజా మహర్షిశ్చ బృహస్పతిః,
యమశ్చ వరుణశ్చైవ కుబేరశ్చ ధనేశ్వరః. 2

సర్వై ర్దేవైః పరివృతః శక్రో వృత్రనిషూదనః,
గన్ధర్వై రప్సరోభిశ్చ యాత స్త్రిభువనం ప్రభుః. 3

గంధర్వులయు అప్సరసలయు గణములు స్తుతించుచుండగా, ఏనుగులలో శ్రేష్ఠమైనదియు, మంచిలక్షణములు గలదియు నగు ఐరావతము నెక్కి గొప్ప తేజస్సుగల అగ్ని, మహర్షియగు బృహస్పతి, యముడు, వరుణుడు, ధనాధిపతి యగు కుబేరుడు మొదలగుదేవతలందరితో కూడి దేవేంద్రుడు స్వర్గమున కరిగెను.

స సమేత్య మహేన్ద్రాణ్యా దేవరాజః శతక్రతుః,
ముదా పరమయా యుక్తః పాలయామాస దేవరాట్. 4

దేవరాజగు శతక్రతుడు శచీదేవితో కూడి పరమానందముతో స్వర్గరాజ్యమును పాలింప దొడగెను.

తతః స భగవాం స్తత్ర అఙ్గిరాః సమదృశ్యత,
అథర్వవేదమన్త్రైశ్చ దేవేన్ద్రం సమపూజయత్. 5

అంత నచట భగవానుడగు అంగిరసుడు కానవచ్చెను. అథర్వవేద మంత్రములతో దేవేంద్రుని పూజించెను.

తతస్తు భగవా నిన్ద్రః సంహృష్టః సమపద్యత,
వరం చ ప్రదదౌ తస్మై అథర్వాఙ్గిర సే తదా. 6

అంత భగవానుడగు ఇంద్రుడు మిక్కిలి సంతసించి అథర్వవేదవిద్వాంసుడగు ఆ అంగిరసునకు వర మొసగెను.

అథర్వాఙ్గిరసో నామ వేదేఽస్మిన్ వై భవిష్యతి,
ఉదాహరణ మేతద్ధి యజ్ఞభాగం చ లప్స్యసే. 7

ఈ స్తుతిరూపమైన వాక్యము ఈ అథర్వవేదమున అథర్వాంగిరసమను పేరు నొందును. నీకు యజ్ఞభాగము లభించును.

ఏవం సంపూజ్య భగవా నథర్వాఙ్గిరసం తదా,
వ్యసర్జయ న్మహారాజ దేవరాజః శతక్రతుః. 8

మహారాజా! శతక్రతువగు దేవరాజు ఇట్లు అథర్వాంగిరసుని సంపూజించి పంపెను.

సంపూజ్య సర్వాం స్త్రిదశా నృషీం శ్చాపి తపోధనాన్,
ఇన్ద్రః ప్రముదితో రాజన్ ధర్మేణా పాలయత్ ప్రజాః. 9

దేవతలందరను, ఋషులను, తాపసులను సమ్మానించి దేవేంద్రుడు పరమానంద మంది ధర్మముగా ప్రజలను పాలించెను.

ఏవం దుఃఖ మనుప్రాప్త మిన్ద్రేణ సహ భార్యయా,
అజ్ఞాతవాసశ్చ కృతాః శత్రూణాం వధకాఙ్క్షయా. 10

---

7. అంగిరసుడు అథర్వవేదమంత్రములతో ఇంద్రుని స్తుతించెను గావున ఆ భాగమునకు అథర్వాంగిరసమను పేరు ఏర్పడునని భావము. అనగా అంగిరసుడు ఆమంత్రములకు ఋషి యని తాత్పర్యము. ఉదాహరణమ్-వాక్యము; "యస్య వాక్యం స ఋషిః"-వాక్య మెవనిదో అతడు దానికి ఋషి అని పరిభాష.

ఇంద్రుడు ఇట్లు భార్యతో కూడి దుఃఖము లనుభవించెను. మరియు పగవారిని పరిమార్చు కోరికతో అజ్ఞాతవాసము చేసెను.

నాత్ర మన్యు స్త్వయా కార్యా యత్క్లిష్టోఽసి మహావనే,
ద్రౌపద్యా సహ రాజేన్ద్ర భ్రాతృభిశ్చ మహాత్మభిః. 11

కావున ఓ మహారాజా! కారడవిలో భార్యతో, మహాత్ములగు తమ్ములతో కష్టపడితినని దుఃఖింపకుము.

ఏవం త్వమపి రాజేన్ద్ర రాజ్యం ప్రాప్స్యసి భారత,
వృత్రం హత్వా యథా ప్రాప్తః శక్రః కౌరవనన్దన. 12

కురునందనా! రాజేంద్రా! భారతా! ఇంద్రుడు వృత్రుని చంపి రాజ్యమును పొందినట్లు నీవును రాజ్యమును పొందుదువు.

దురాచారశ్చ నహుషో బ్రహ్మద్విట్ పాపచేతనః,
అగస్త్యశాపాభిహతో వినష్టః శాశ్వతీః సమాః. 13

తప్పుడుపనులవాడు, వేదమును నిందించువాడు, పాపాత్ముడు అగు నహుషుడు అగస్త్యుని శాపముచే దెబ్బ తిని పెక్కేండ్లు రూపుమాసి యుండెను.

ఏవం తవ దురాత్మానః శత్రవః శత్రుసూదన,
క్షిప్రం నాశం గమిష్యన్తి కర్ణదుర్యోధనాదయః. 14

ఇట్లే దురాత్ములగు కర్ణుడు, దుర్యోధనుడు మొదలగు నీ పగవారు త్వరలో నాశము పొందుదురు.

తతః సాగరపర్యన్తాం భోక్ష్యసే మేదినీ మిమామ్,
భ్రాతృభిః సహితో వీర ద్రౌపద్యా చ సహానయా. 15

అటుపై తమ్ములతో, ఈ ద్రౌపదితో కూడి వీరుడా! సముద్రములే యెల్లలుగాగల భూమిని పాలింతువు.

ఉపాఖ్యాన మిదం శక్రవిజయం వేదసంమితమ్,
రాజ్ఞా వ్యూఢేష్వనీకేషు శ్రోతవ్యం జయమిచ్ఛతా. 16

గెలుపుకోరెడు రాజు సేనలను పన్నుకొనునపుడు వేదముతో సాటియగు 'శక్రవిజయ'మను ఈ కథను వినదగును.

తస్మాత్ సంశ్రావయామి త్వాం విజయం జయతాంవర,
సంస్తూయమానా వర్ధన్తే మహాత్మానో యుధిష్ఠిర. 17

జయశాలీ! కావున ఈ జయకథను నీకు విన్పించుచున్నాను. ఇది విన్న మహాత్ములు స్తుతిపాత్రు లగుచు వర్ధిల్లుదురు.

క్షత్రియాణా మభావో౽యం యుధిష్ఠిర మహాత్మనామ్,
దుర్యోధనాపరాధేన భీమార్జునబలేన చ. 18

యుధిష్ఠిరా! దుర్యోధనుని అపరాధముచేతను, భీమార్జునుల బలముచేతను మహాత్ములగు క్షత్రియులకు ఇదిగో, వినాశము దాపురించినది.

ఆఖ్యాన మిన్ద్రవిజయం య ఇదం నియతః పఠేత్,
ధూతపాప్మా జితస్వర్గః పరత్రేహ చ మోదతే. 19

నియమముతో ఈ ఇంద్రవిజయమను కథను పఠించువానికి పాపములు పటాపంచలగును. స్వర్గము లభించును. అట్టివాడు ఇహమున, పరమునను ఆనందమందును.

న చారిజం భయం తస్య నాపుత్రో వా భవేన్నరః,
నాపదం ప్రాప్నుయాత్ కాఞ్చి ద్దీర్ఘ మాయుశ్చ విన్దతి,
సర్వత్ర జయ మాప్నోతి న కదాచిత్ పరాజయమ్. 20

అతనికి శత్రువులవలన భయము కలుగదు. సంతానములేనిదశ ఘటిల్లదు. ఎట్టి ఆపదను పొందదు. దీర్ఘమగు ఆయువు పొందును. అన్నియెడలను గెలుపు కలుగును. ఎన్నటికిని ఓటమి కలుగదు.

వైశమ్పాయన ఉవాచ-వైశంపాయను డిట్లు చెప్పెను.

ఏవ మాశ్వాసితో రాజా శల్యేన భరతర్షభ,
పూజయామాస విధివ చ్ఛల్యం ధర్మభృతాం వరః. 21

శల్యు డిట్లు ధర్మరాజు నోదార్చగా ధర్మమును పాటించువారిలో శ్రేష్ఠుడగు ధర్మరాజు శల్యుని శాస్త్రప్రకారమున పూజించెను.

---

20. న, చ + అరిజమ్-అని పద విభాగము; అరిజమ్-అరులవలన పుట్టిన;

శ్రుత్వా తు శల్యవచనం కుస్తీపుత్రో యుధిష్ఠిరః,
ప్రత్యువాచ మహాబాహు ర్మద్రరాజ మిదం వచః. 22

శల్యునిమాట విని యుధిష్ఠిరుడు మద్రరాజున కిట్లు బదులుచెప్పెను.

భవాన్ కర్ణస్య సారథ్యం కరిష్యతి న సంశయః,
తత్ర తేజోవధః కార్యః కర్ణస్యార్జునసంస్తవః. 23

తమరు కర్ణునకు రథము నడుపుదురు. సంశయము లేదు. అందు అర్జునుని కొనియాడుచు కర్ణునిఉత్సాహమును చంపవలయును.

శల్య ఉవాచ-శల్యు డిట్లు పలికెను.

ఏవ మేతత్ కరిష్యామి యథా మాం సంప్రభాషసే, 24
యచ్చాన్యదపి శక్ష్యామి తత్ కరిష్యా మ్యహం తవ.

అది నీవు పలికినట్లే చేయుదును. మరియు నేను చేయగలిగిన దేమి యున్నను నీకు తప్పక చేయుదును.

వైశమ్పాయన ఉవాచ-వైశంపాయను డిట్లు చెప్పెను.

తత స్త్వామన్త్ర్య కౌన్తేయా చ్ఛల్యో మద్రాధిప స్తదా,
జగామ సబలః శ్రీమాన్ దుర్యోధన మరిన్దమ. 25

అటుపై మద్రరాజగు శల్యుడు ధర్మరాజును వీడ్కొని తనబలముతో సంపదతో కూడి దుర్యోధనునికడ కరిగెను.

ఇతి శ్రీమహాభారతే ఉద్యోగపర్వణి సేనోద్యోగపర్వణి
శల్యగమనే అష్టాదశోఽధ్యాయః.

ఇది శ్రీమహాభారతము ఉద్యోగపర్వమున సేనోద్యోగపర్వమున
శల్యుని గమనముగల పదునెనిమిదవ అధ్యాయము.

—:o:—

# ఏకోనవింశోఽధ్యాయః-పందొమ్మిదవ అధ్యాయము

యుధిష్ఠిరదుర్యోధనయోః పార్శ్వే సాహాయ్యార్థం సమాగతానాం
సేనానాం సంక్షిప్తం వివరణమ్.

యుధిష్ఠిరదుర్యోధనుల కడకుసాయము నకై వచ్చిన సేనల
సంక్షిప్తమైన వివరణము.

వైశమ్పాయన ఉవాచ - వైశంపాయను డిట్లు చెప్పెను.

యుయుధాన స్తతో వీరః సాత్వతానాం మహారథః,
మహతా చతురఙ్గేణ బలే నాగా ద్యుధిష్ఠిరమ్. 1

సాత్వతవంశమువారిలో మహారథుడు, వీరుడు నగు సాత్యకి గొప్ప చతురంగబలముతో ధర్మరాజుకడకు వచ్చెను.

తస్య యోధా మహావీర్యా నానాదేశసమాగతాః,
నానాప్రహరణా వీరాః శోభయాఞ్చక్రిరే బలమ్. 2

అనేకదేశములనుండి వచ్చినవారు, గొప్పశక్తిగలవారు, అనేకములగు ఆయుధములలో ప్రవీణత కలవారు, వీరులు నగు ఆతని యోధులు సేనకు శోభను తెచ్చిరి.

పరశ్వధై ర్భిన్దిపాలైః శూలతోమరముద్గరైః,
పరిఘై ర్యష్టిభిః పాశైః కరవాలైశ్చ నిర్మలైః. 3
ఖడ్గకార్ముక నిర్వ్యూహైః శరైశ్చ వివిధై రపి,
తైలధౌతైః ప్రకాశద్భిః సదాశోభత వై బలమ్. 4

---

1. యుయుధానః-సాత్యకి.

3. తోమరము-కంచుతోచేయబడి విసరుటకు వీలైన ఆయుధము; కరవాలము-ఒక అంచుకత్తి.

4. ఖడ్గము-రెండంచులకత్తి; నిర్వ్యూహః-సమూహము; తైలధౌతైః - నూనె రాయుటచే నిగనిగలాడు పదునెక్కి యున్నవానిచేత;

గొడ్డళ్ళు, భిందిపాలములు, శూలములు, తోమరములు, ముద్గరములు, పరిఘలు, కత్తులు, పాశములు తళతళలాడు కరవాలములు, ఖడ్గములు, విండ్లు, బహువిధములగు బాణములు నూనె రాయుటచే పదునెక్కి ప్రకాశించుచున్న ఇట్టి ఆయుధములతో ఆ సేనకు సొంపు కలిగెను.

తస్య మేఘప్రకాశస్య సౌవర్ణైః శోభితస్య చ,
బభూవ రూపం సైన్యస్య మేఘస్యేవ సవిద్యుతః. 5

బంగారునగలతో నల్లనికాంతితో ఒప్పుచున్న ఆ సేన మెరపులతో కూడిన మేఘమువలె అలరారినది.

అక్షౌహిణీ తు సా సేనా తదా యౌధిష్ఠిరం బలమ్,
ప్రవిశ్యాన్తర్దధే రాజన్ సాగరం కునదీ యథా. 6

అక్షౌహిణి లెక్కగల ఆసేన ధర్మరాజుసేనలో ప్రవేశించి సముద్రములో చేరిన పిల్లనదివలె లీనమైపోయెను.

తథైవాక్షౌహిణీం గృహ్య చేదీనా మృషభో బలీ,
ధృష్టకేతు రుపాగచ్ఛత్ పాణ్డవా నమితౌజసః. 7

అట్లే చేదిదేశపురాజు, గొప్పబలము గలవాడు, ధృష్టకేతువు ఒక అక్షౌహిణి సేనతో పిక్కటిల్లు బలముగల పాండవులను చేరుకొనెను.

మాగధశ్చ జయత్సేనో జారాసన్ధి ర్మహాబలః,
అక్షౌహిణ్యైవ సైన్యస్య ధర్మరాజ ముపాగమత్. 8

మగధరాజు, జరాసంధుని కొడుకు, గొప్ప బలముగలవాడు నగు జయత్సేనుడు ఒక అక్షౌహిణి సేనతో ధర్మరాజుకడకు వచ్చెను.

తథైవ పాణ్డ్యో రాజేన్ద్ర సాగరానూపవాసిభిః,
వృతో బహువిధై ర్యోధై ర్యుధిష్ఠిర ముపాగమత్. 9

రాజేంద్రా! పాండ్యరాజు సముద్రద్వీపములలో నివసించు బహువిధముల పోటుగాండ్రతో కూడి ధర్మరాజుకడ కరుదెంచెను.

తస్య సైన్య మతీవాసీత్ తస్మిన్ బలసమాగమే,
ప్రేక్షణీయతరం రాజన్ సువేషం బలవత్ తదా. 10

ఆతని సేన చాల మిక్కుటముగా నుండెను. ఆసేన రాకతో ధర్మజుని సేన చక్కని వేషములు, మంచిబలము గలదియై చూడముచ్చటగా నుండెను.

ద్రుపదస్యాప్యభూత్సేనా నానాదేశసమాగతైః,
శోభితా పురుషైః శూరైః పుత్రైశ్చాస్య మహారథైః. 11

అనేకదేశములనుండి వచ్చినవారితో, శూరులైన పురుషులతో, మహారథులగు పుత్రులతో ద్రుపదుని సేనయు ఒప్పారెను.

తథైవ రాజా మత్స్యానాం విరాటో వాహినీపతిః,
పార్వతీయై ర్మహీపాలైః సహితః పాణ్డవా నియాత్. 12

అట్లే మత్స్యరాజు గొప్ప సేనానియు నగు విరాటుడును కొండదొరలతో కూడి పాండవులను చేరెను.

ఇతశ్చేతశ్చ పాణ్డూనాం సమాజగ్ము ర్మహాత్మనామ్,
అక్షౌహిణ్యస్తు సప్తైతా వివిధధ్వజసఙ్కులాః. 13
యుయుత్సమానాః కురుభిః పాణ్డవాన్ సమహర్షయన్.

ఇంకను మహాత్ములగు పాండవులకడకు ఆయా తావుల నుండి చాలమంది వచ్చిచేరిరి. అనేక పతాకలు గల ఆ సేన మొత్తము ఏడక్షౌహిణులు. ఇట్లు వారందరు కౌరవులతో పోరగోరి వచ్చి పాండవుల నలరించిరి.

తథైవ ధార్తరాష్ట్రస్య హర్షం సమభివర్ధయన్, 14
భగదత్తో మహీపాలః సేనా మక్షౌహిణీం దదౌ.

అట్లే ధృతరాష్ట్రసుతుని పొంగు పెంపొందించుచు భగదత్తుడను రాజు ఒక అక్షౌహిణి సేన నొసగెను.

తస్య చీనైః కిరాతైశ్చ కాఞ్చనైరివ సంవృతమ్. 15
బభౌ బల మనాధృష్యం కర్ణికారవనం యథా.

చీనులతో కిరాతులతో సువర్ణములతో వలె ఆవరించియున్న ఆతని సేన పరులకు సాధింపరానిదై కొండగోగుల తోటవలె ఒప్పారెను.

తథా భూరిశ్రవాః శూరః శల్యశ్చ కురునన్దన, 16
దుర్యోధన ముపాయాతా వక్షౌహిణ్యా పృథక్ పృథక్.

అట్లే శూరుడగు భూరిశ్రవసుడు, శల్యుడును ఒక్కొక్క అక్షౌహిణితో దుర్యోధనుని చేర వచ్చిరి.

కృతవర్మా చ హార్దిక్యో భోజాన్ధకుకురైః స్సహ, 17
అక్షౌహిణ్యైవ సేనాయా దుర్యోధన ముపాగమత్.

హృదికుని కొడుకు కృతవర్మయు భోజకులు, అంధకులు, కుకురులు-అను వారితో కూడి ఒక అక్షౌహిణి సేనతో దుర్యోధనుని కడకు వచ్చెను.

తస్య తైః పురుషవ్యాఘ్రై ర్వనమాలాధరై ర్బలమ్, 18
అశోభత యథా మత్తై ర్వనం ప్రక్రీడితై ర్గజైః.

వనమాలలు ధరించిన ఆ పురుషసింహములతో కూడిన సేన మదించి కొట్లాడుచున్న ఏనుగులతో ఒప్పారు వనమువలె అందగించెను.

జయద్రథముఖా శ్చాన్యే సిన్ధుసౌవీరవాసినః. 19
ఆజగ్ముః పృథివీపాలాః కమ్పయన్త ఇవాచలాన్
తేషా మక్షౌహిణీ సేనా బహులా విబభౌ తదా. 20

సింధు దేశమున, సౌవీరదేశమున నివసించు జయద్రథుడు మున్నగు ఇతరరాజులు కొండలను ఊగించుచున్నారో యన్నట్లు వచ్చిరి. వారి సేన ఒక అక్షౌహిణి లెక్కతో మిన్నగా ప్రకాశించెను.

విధూయమానో వాతేన బహురూప ఇవామ్బుదః,
సుదక్షిణశ్చ కామ్బోజో యవనైశ్చ శకై స్తథా. 21
ఉపాజగామ కౌరవ్య మక్షౌహిణ్యా విశామ్పతే,

18. వనమాలా- కాళ్ళవరకు వ్యాపించిన మాల;

గాలికి రెపరెపలాడుచు చెల్లాచెదరై వింత వింత రూపములతో కానవచ్చు మబ్బువలె కాంబోజరాజు సుదక్షిణుడు యవనులతో శకులతో కూడిన ఒక అక్షౌహిణి సేనతో దుర్యోధనుని చేర వచ్చెను.

తస్య సేనా సమావాయః శలభానా మివాబభౌ. 22
స చ సంప్రాప్య కౌరవ్యం తత్రైవా న్తర్దధే తదా.

ఆతని సేనల మొత్తము మిడుతలదండువలె అలరారెను. ఆతడును దుర్యోధనుని చేరి ఆతని సేనలో కలసిపోయెను.

తథా మాహిష్మతీవాసీ నీలో నీలాయుధైః సహ. 23
మహీపాలో మహావీర్యై ర్దక్షిణాపథవాసిభిః,

అట్లే మాహిష్మతీ పురవాసి నీలుడను రాజు, నీలమైన ఆయుధమును, గొప్పశక్తియు గల దక్షిణదేశవాసులతో వచ్చెను.

ఆవన్త్యౌ చ మహీపాలౌ మహాబలసుసంవృతౌ, 24
పృథగక్షౌహిణీభ్యాం తావభియాతౌ సుయోధనమ్.

అవంతిరాజులు విందానువిందులు మహాబలము గలవారై ఒక్కొక్క అక్షౌహిణి సేనతో సుయోధనుని చేరవచ్చిరి.

కేకయాశ్చ నరవ్యాఘ్రాః సోదర్యాః పఞ్చ పార్థివాః. 25
సంహర్షయన్తః కౌరవ్య మక్షౌహిణ్యా సమాద్రవన్.

నరవరులగు కేకయులను అయిదుగురన్నదమ్ములు దుర్యోధనుని ఉప్పొంగఁజేయుచు అక్షౌహిణి సేనతో పరువున వచ్చిరి.

తత స్తతశ్చ సర్వేషాం భూమిపానాం మహాత్మనామ్. 26
త్రయోఽన్యాః సమవర్తన్త వాహిన్యో భరతర్షభ.

---

22. సమావాయః- సమూహము.

24. ఆవన్త్యౌ - అవంతి రాజులు - విందానువిందులు.

ఇంకను ఆ యా దేశములనుండి వచ్చిన మహాత్ములగు రాజులసేనలు మూడక్షౌహిణులు కలవు.

ఏవ మేకాదశా వృత్తాః సేనా దుర్యోధనస్య తాః. 27
యుయుత్సమానాః కౌన్తేయా న్నానాధ్వజసమాకులాః,

ఇట్లు దుర్యోధనునికై పాండవులతో పోరాడగోరి వచ్చిన సేనలు పదునొకండు అక్షౌహిణులు పలువిధములగు పతాకలతో అలరారియున్నవి.

న హాస్తినపురే రాజన్నవకాశోఽభవత్ తదా. 28
రాజ్ఞాం స్వబలముఖ్యానాం ప్రాధాన్యే నాపి భారత.

వారి వారి సేనలలో ముఖ్యులైన రాజులకును, ప్రాధాన్యమునుబట్టి నిలుచుటకును, హస్తినయందు చోటు చాలలేదు.

తతః పఞ్చనదం చైవ కృత్స్నం చ కురుజాఙ్గలమ్. 29
తథా రోహితకారణ్యం మరుభూమిశ్చ కేవలా,
అహిచ్ఛత్రం కాలకూటం గఙ్గాకూలం చ భారత. 30
వారణం వాటధానం చ యామున శ్చైవ పర్వతః,
ఏష దేశః సువిస్తీర్ణః ప్రభూతధనధాన్యవాన్. 31
బభూవ కౌరవేయాణాం బలేనాతీవ సంవృతః.

పంచనదము, కురుజాంగలము, రోహితకారణ్యము, మరుభూమి, అహిచ్ఛత్రము, కాలకూటము, గంగాకూలము, వారణము, వాటధానము, యామున పర్వతము - అను ప్రాంతములు గల ధనధాన్యములతో నిండిన మిక్కిలి విశాలమైన భూమి కౌరవుల పెనుసేనతో నిండియుండెను.

---

27. ఈ శ్లోకమునందలి వాహినీ సేనా పదములకు ప్రకరణమునుబట్టి అక్షౌహిణి యను నర్థమును గ్రహింపవలయును.

తత్ర సైన్యం తథాయుక్తం దదర్శ స పురోహితః. 32
యః స పాఞ్చాలరాజేన ప్రేషితః కౌరవాన్ ప్రతి. 33

అట్లు కూడిన ఆ దుర్యోధనుని సేనను, పాంచాలరాజు ద్రుపదుడు కౌరవుల కడకు పంపిన పురోహితుడు కాంచెను.

ఇతి శ్రీమహాభారతే ఉద్యోగపర్వణి సేనోద్యోగపర్వణి
పురోహితసైన్యదర్శనే ఏకోనవింశోఽధ్యాయః.

ఇది శ్రీమహాభారతము ఉద్యోగపర్వమున సేనోద్యోగపర్వమున
పురోహితుడు సైన్యమును చూచుట యను పందొమ్మిదవ అధ్యాయము.
సమాప్తం సేనోద్యోగపర్వ - సేనోద్యోగపర్వము ముగిసెను.

—(০)—

# శ్రీ మహాభారతమ్-ఉద్యోగపర్వ
# శ్రీ మహాభారతము-ఉద్యోగపర్వము

## సంజయయాన పర్వ - 2
## సంజయయాన పర్వము - 2

### వింశోఽధ్యాయః - ఇరువదవ అధ్యాయము

ద్రుపదపురోహితస్య కౌరవసభాయాం భాషణమ్.
ద్రుపదపురోహితుడు కౌరవసభయందు భాషించుట.

వైశమ్పాయన ఉవాచ-వైశంపాయను డిట్లు చెప్పెను.

స చ కౌరవ మాసాద్య ద్రుపదస్య పురోహితః,
సత్కృతో ధృతరాష్ట్రేణ భీష్మేణ విదురేణ చ. 1

ఆ ద్రుపదపురోహితుడు కురురాజును సమీపించి-ధృతరాష్ట్రుడు, భీష్ముడు, విదురుడు చేసిన మన్ననల నందెను.

సర్వం కౌశల్య ముక్త్వాదౌ పృష్ట్వా చైవ మనామయమ్,
సర్వసేనాప్రణేతౄణాం మధ్యే వాక్య మువాచ హ. 2

మొదట అందరి కుశలమును చెప్పి, ఇచటి అందరి క్షేమము నడిగి, సేనానాయకు లందరు ఉన్న సభలో ఇట్లు పలికెను.

సర్వై ర్భవద్భి ర్విదితో రాజధర్మః సనాతనః,
వాక్యోపాదానహేతో స్తు వక్ష్యామి విదితే సతి. 3

---

3. వాక్య, ఉపాదాన, హేతోః - చెప్పవలసినది ఉన్న కారణమున - అని తాత్పర్యము.

మీరందరు సనాతనమైన రాజధర్మము నెరుగుదురు. అయినను, చెప్ప వలసినది కొంచెము కలదు కావున, తెలిసినప్పటికిని చెప్పుచున్నాను.

ధృతరాష్ట్రశ్చ పాణ్డుశ్చ సుతా వేకస్య విశ్రుతౌ,
తయోః సమానం ద్రవిణం పైతృకం నాత్ర సంశయః. 4

ధృతరాష్ట్రుడును, పాండురాజును ఒక్కని కొడుకులే; ఇది అందరకు తెలిసినదే. కావున, తండ్రి సొమ్ము వారిరువురకు సమానమే. ఇందు సంశయము లేదు.

ధృతరాష్ట్రస్య యే పుత్రాః ప్రాప్తం తైః పైతృకం వసు,
పాణ్డుపుత్రాః కథం నామ న ప్రాప్తాః పైతృకం వసు. 5

ధృతరాష్ట్రుని కొడుకులు తండ్రుల ధనమును అందుకొనిరి. మరి పాండుని కుమారుల కది అందకుండుట యెట్లు ?

ఏవం గతే పాండవేయై ర్విదితం వః పురా యథా,
న ప్రాప్తం పైతృకం ద్రవ్యం ధృతరాష్ట్రేణ సంవృతమ్. 6

ఇట్లుండగా తండ్రుల ఆస్తి ధృతరాష్ట్రుడు క్రమ్ముకొనియుండగా పాండవుల కది యెట్లు లభింపలేదో మీకు తెలిసిన విషయమే.

ప్రాణాన్తికై రప్యుపాయైః ప్రయతద్భి రనేకశః,
శేషవన్తో న శకితా నేతుం వై యమసాదనమ్. 7

పలువిధములుగా ప్రాణములు తీయు ఉపాయములు పన్నియు వీరు వారిని, (వారికి) ఆయువు మిగిలియుండుటవలన, యముని యింటికి పంపజాలక పోయిరి.

పునశ్చ వర్ధితం రాజ్యం స్వబలేన మహాత్మభిః,
ఛద్మనాఽపహృతం క్షుద్రై ర్ధార్తరాష్ట్రైః ససౌబలైః. 8

---

7. శేషవన్తః - ఆయువు మిగిలియున్నవారు.

మఱియు, ఆ మహాత్ములు తమ బలముతో రాజ్యమును ఎంతో పెంపొందించుకొనిరి. కాని, యీ ధృతరాష్ట్రపుత్రులు క్షుద్రులై శకునితో కూడి మోసముతో దానిని చేజిక్కించుకొనిరి.

తదప్యనుమతం కర్మ యథాయుక్త మనేన వై,
వాసితాశ్చ మహారణ్యే వర్షాణీహ త్రయోదశ. 9

ఆ పాడుపనికి ఈ ధృతరాష్ట్రుడు ఒప్పుకొనెను. పాండవులు కారడవులలో పదుమూడేండ్లు ఉండునట్లు వీరు చేసిరి.

సభాయాం క్లేశితై ర్వీరైః సహభార్యై స్తథా భృశమ్,
అరణ్యే వివిధాః క్లేశాః సంప్రాప్తా స్తైః సుదారుణాః. 10

వీరులగు వారికి భార్యతోపాటు సభలో నానాకష్టములు పెట్టిరి. మరల అడవిలో దారుణములైన పాట్లు పడవలసి వచ్చినది.

తథా విరాటనగరే యోన్యన్తరగతై రివ,
ప్రాప్తః పరమసంక్లేశో యథా పాపై ర్మహాత్మభిః. 11

అట్లే విరాటనగరమున ఆ మహాత్ములకు మరియొక గర్భమున పడిన పాపులకు వలె ఘోరమైన కష్టము దాపురించినది.

తే సర్వం పృష్ఠతః కృత్వా తత్ సర్వం పూర్వకిల్బిషమ్,
సామ్యైవ కురుభిః సార్ధ మిచ్ఛన్తి కురుపుఙ్గవాః. 12

మునుపటి ఆ పాపము నంతటిని వెనుకకు నెట్టి ఆ కురుపుంగవులు కౌరవులతో మంచితనమునే కోరుచున్నారు.

---

9. త్రయోదశ - అరణ్యాజ్ఞాతవాసములను సామాన్యాకారముగా చెప్పిన మాట.

11. యోన్యన్తరగతై రివ—ఈమాటవలన వారు పెట్టిన కష్టములను పాండవులు పూర్వజన్మవృత్తాంతములను వలె స్మరింపకున్నారని భావము వ్యక్తమగుచున్నది.

తేషాం చ వృత్త మాజ్ఞాయ వృత్తం దుర్యోధనస్య చ,
అనునేతు మిహార్హన్తి ధార్తరాష్ట్రం సుహృజ్జనాః. 13

వారి నడవడిని, దుర్యోధనుని వైఖరిని చక్కగా నెరిగి అందరకు మేలు కోరు మీరందరు దుర్యోధనుని చక్కజేయవలయును.

న హి తే విగ్రహం వీరాః కుర్వన్తి కురుభిః సహ,
అవినాశేన లోకస్య కాఙ్క్షన్తే పాణ్డవాః స్వకమ్. 14

ఆ వీరులు కౌరవులతో విరోధమును కోరరు. లోకమునకు నాశము కలుగని పద్ధతిలో తమ దానిని పాండవులు అపేక్షించుచున్నారు.

య శ్చాపి ధార్తరాష్ట్రస్య హేతుః స్యాద్విగ్రహం ప్రతి,
స చ హేతు ర్న మన్తవ్యో బలీయాంస స్తథా హి తే. 15

ఒకవేళ దుర్యోధనునకు పగకు కారణమున్నను దాని నీతడు మదిలో నిలుపరాదు. వారు వీరికంటె మిక్కిలి బలము గలవారు కదా!

అక్షౌహిణ్యశ్చ సప్తైవ ధర్మపుత్రస్య సంగతాః,
యుయుత్సమానాః కురుభిః ప్రతీక్షన్తేఽస్య శాసనమ్. 16

ధర్మపుత్రునకు ఏ డక్షౌహిణుల సేన రానే వచ్చినది. వారందరు కౌరవులతో తలపడుటకై అతని ఆజ్ఞకై ఎదురుచూచుచున్నారు.

అపరే పురుషవ్యాఘ్రాః సహస్రాక్షౌహిణీసమాః,
సాత్యకి ర్భీమసేనశ్చ యమౌ చ సుమహాబలౌ. 17

పురుషశ్రేష్ఠులు సాత్యకి, భీమసేనుడు, మిక్కిలి బలముగల కవలలు మరియు వేయి అక్షౌహిణుల పెట్టు.

ఏకాదశైతాః పృతనా ఏకతశ్చ సమాగతాః,
ఏకతశ్చ మహాబాహు ర్బహురూపీ ధనఞ్జయః. 18

ఇచటకు వచ్చిన పదునొక్క అక్షౌహిణుల సేన ఒక యెత్తు. మహాబాహువు, అనేక రూపములు గలవాడు నగు అర్జును డొక యెత్తు.

యథా కిరీటీ సర్వాభ్యః సేనాభ్యో వ్యతిరిచ్యతే,
ఏవ మేవ మహాబాహు ర్వాసుదేవో మహాద్యుతిః. 19

ఆ అర్జునుడు సమస్తసేనలను మించినట్లే - మహాబాహువు, గొప్ప తేజస్సు కలవాడు నగు వాసుదేవుడును సర్వమును మించును.

బహులత్వం చ సేనానాం విక్రమం చ కిరీటినః,
బుద్ధిమత్త్వం చ కృష్ణస్య బుద్ధ్వా యుధ్యేత కో నరః ? 20

సేనలు పెల్లుగా నుండుట, అర్జునుని పరాక్రమము, కృష్ణుని బుద్ధినేర్పు ఎరిగియు, ఏ నరుడు యుద్ధమునకు సిద్ధపడును?

తే భవన్తో యథాధర్మం యథాసమయ మేవ చ,
ప్రయచ్ఛన్తు ప్రదాతవ్యం మా వః కాలోఽత్యగా దయమ్. 21

అట్టి మీరందరు ధర్మమును, ఆడిన మాటను పాటిగా బట్టి, వారి కీయ వలసినది యిండు. ఇప్పటికిని మీకు సమయము మించిపోలేదు.

ఇతి శ్రీమహాభారతే ఉద్యోగపర్వణి సఞ్జయయానపర్వణి
పురోహితయానే వింశోఽధ్యాయః.

ఇది శ్రీమహాభారతము ఉద్యోగపర్వమున సంజయయానపర్వమున
పురోహితయాన మను ఇరువదవ అధ్యాయము.

—(౦)—

## ఏకవింశోఽధ్యాయః - ఇరవదియొకటవ అధ్యాయము

ద్రుపదపురోహితవార్తాయా అనుమోదనం కుర్వతా భీష్మేణార్జునస్య ప్రశంసనమ్, కర్ణస్యాక్షేపణపూర్ణం వచనమ్, భీష్మకథనం సమర్థయతా ధృతరాష్ట్రేణ దూతస్య ససమ్మానం ప్రస్థాపనమ్.

ద్రుపదపురోహితుని వార్తను మెచ్చుకొని భీష్ము డర్జునుని పొగడుట, కర్ణు డాక్షేపము నిండిన పలుకు పలుకుట, భీష్ము డాడినదానిని సమర్థించుచు ధృతరాష్ట్రుడు దూతను మన్ననతో పంపుట.

వైశమ్పాయన ఉవాచ-వైశంపాయను డిట్లు చెప్పెను.

తస్య తద్వచనం శ్రుత్వా ప్రజ్ఞావృద్ధో మహాద్యుతిః,
సంపూజ్యైనం యథాకాలం భీష్మో వచన మబ్రవీత్. 1

ఆ పురోహితుని ఆ పలుకు విని పండిన బుద్ధియు, గొప్పతేజస్సును గల భీష్ముడు ఆతనిని సమయమునకు తగిన తీరున గౌరవించి ఇట్లు పలికెను.

దిష్ట్యా కుశలినః సర్వే సహ దామోదరేణ తే,
దిష్ట్యా సహాయవన్తశ్చ దిష్ట్యా ధర్మే చ తే రతాః. 2

భాగ్యవశమున వారందరు కృష్ణునితోపాటు కుశలముతో నున్నారు. అదృష్టవశమున వారికి సహాయులు కూడ లభించిరి. అదృష్టవశమున వారు ధర్మమునందు ప్రీతికలిగియే యుండిరి.

దిష్ట్యా చ సన్ధికామా స్తే భ్రాతరః కురునన్దనాః,
దిష్ట్యా న యుద్ధమనసః పాణ్డవాః సహ బాన్ధవైః. 3

కురువంశము వారగు ఆ పాండవసోదరులు తమ చుట్టములతోపాటు అదృష్టవశమున సంధినే కోరుచున్నారు. కయ్యమున మనసు పెట్టకున్నారు.

భవతా సత్య ముక్తం తు సర్వమేత న్న సంశయః,
అతితీక్ష్ణం తు తే వాక్యం బ్రాహ్మణ్యాదితి మే మతిః. 4

తాము పలికినది సత్యమే. ఇందు సందియము లేదు. కాని బ్రాహ్మణ స్వభావమువలన మీ మాట చాల వాడిగా నున్నదనుకొందును.

అసంశయం క్లేశితా స్తే వనే చేహ చ పాణ్డవాః,
ప్రాప్తాశ్చ ధర్మతః సర్వం పితు ర్ధన మసంశయమ్. 5

పాండవులు అడవియందును, ఇక్కడను బహుకష్టములకు లోనయిరి. నిజమే. మరియు ధర్మమునుబట్టి, పితృధనమును పొందవలసినదాని నంతటిని పొందిరి. సందియము లేదు.

కిరీటీ బలవాన్ పార్థః కృతాస్త్రశ్చ మహారథః,
కో హి పాణ్డుసుతం యుద్ధే విషహేత ధనఞ్జయమ్. 6

కిరీటి యగు అర్జునుడు బలవంతుడు. అస్త్రములలో పరిశ్రమ చేసినవాడు. మహారథుడు. పాండుకుమారుడగు ఆ ధనంజయుని యుద్ధమున తట్టుకొనగలవాడెవ్వడు?

అపి వజ్రధరః సాక్షాత్ కిముతాన్యే ధనుర్భృతాః,
త్రయాణా మపి లోకానాం సమర్థ ఇతి మే మతిః. 7

మూడులోకములలో వజ్రము పట్టిన యింద్రుడైనను చాలదని నా తలపు. ఇక వేరు విలుకాండ్ర మాట చెప్పవలెనా?

భీష్మే బ్రువతి తద్వాక్యం ధృష్ట మాక్షిప్య మన్యునా,
దుర్యోధనం సమాలోక్య కర్ణో వచన మబ్రవీత్. 8

భీష్ము డట్లు పలుకుచుండగా కర్ణుడు కోపముతో బెదరింపు తీరున నాక్షేపించి, దుర్యోధనునివైపు చూచి యిట్లు పలికెను.

న తత్రావిదితం బ్రహ్మన్ లోకే భూతేన కేనచిత్,
పునరు క్తేన కిం తేన భాషితేన పునః పునః. 9

---

8. ధృష్టమ్ - ధర్షణా యుక్తమ్ - బెదరింపుతో కూడునట్లు.

ఓయీ బాపడా! వారినిగూర్చి ఎరుగనివా రీ లోకమున ఎవ్వరును లేరు. పాడినదే పాటగా ఆ మాట మాటిమాటికి పలుకనేల?

దుర్యోధనార్థే శకుని ర్ద్యూతే నిర్జితవాన్ పురా,
సమయేన గతోఽరణ్యం పాణ్డుపుత్రో యుధిష్ఠిరః. 10

దుర్యోధనుని పనిగా శకుని మున్ను జూదమున ధర్మజు నోడించెను. పందెము ప్రకారము పాండునికొడుకు యుధిష్ఠిరుడు అడవి కరిగెను.

స తం సమయ మాశ్రిత్య రాజ్యం నేచ్ఛతి పైతృకమ్,
బల మాశ్రిత్య మత్స్యానాం పాఞ్చాలానాం చ మూర్ఖవత్. 11

ఆ ధర్మరాజు సమయమునుబట్టి కాదు పితృధనమగు రాజ్యమును కోరుట. విరాటుని, ద్రుపదుని బలమును నమ్ముకొని మూర్ఖునివలె రాజ్యమును పొంద గోరుచున్నాడు.

దుర్యోధనో భయా ద్విద్వ న్న దద్యాత్ పాద మన్తతః,
ధర్మత స్తు మహీం కృత్స్నాం ప్రదద్యా చ్ఛత్రవేఽపి చ. 12

ఓయి పండితుడా! దుర్యోధనుడు భయమువలన కడకు నాలుగవ వంతు నైన నొసగడు. ధర్మమువలన నన్నునో భూమి నంతటిని శత్రువున కైన నొసగును.

యది కాఙ్క్షన్తి తే రాజ్యం పితృపైతామహం పునః,
యథాప్రతిజ్ఞం కాలం తం చరన్తు వన మాశ్రితాః. 13

వారు తండ్రితాతల రాజ్యమును మరల పొందగోరుదురేని చేసిన ప్రతిజ్ఞను బట్టి మిగిలిన కాలమున అడవుల బడి తిరుగవలయును.

తతో దుర్యోధనస్యాఙ్కే వర్తన్తా మకుతోభయాః,
అధార్మికీం తు మా బుద్ధిం మౌర్ఖ్యాత్ కుర్వన్తు కేవలాత్. 14

---

11. సమయమ్- 'సంకేతే కాలభాషయోః' అని మేదిని. పెట్టుకొన్న కాలపు హద్దునుబట్టి, అనుకొన్న మాటనుబట్టి అని తాత్పర్యము.

13. వీరి లెక్కల ప్రకారము అజ్ఞాతవాసము భంగమైనదని -భావము.

అటుపై దుర్యోధనుని ఆశ్రయించి, ఎందును భయము లేనివారై తిరుగ వచ్చును. అంతేకాని, కేవలము మొరకుతనముతో ధర్మవిరుద్ధమైన భావన చేయకుందురు గాక!

అథ తే ధర్మ ముత్సృజ్య యుద్ధ మిచ్ఛన్తి పాణ్డవాః,
ఆసాద్యేమాన్ కురుశ్రేష్ఠాన్ స్మరిష్యన్తి వచో మమ. 15

అటుగాక ధర్మము నుజ్జగించి, పాండవులు యుద్ధమును కోరుదురేని ఈ కురుశ్రేష్ఠులను తాకునపుడు నా మాటను స్మరింతురు గాక !

భీష్మ ఉవాచ-భీష్ము డిట్లు పలికెను.

కిం ను రాధేయ వాచా తే కర్మ తత్ స్మర్తు మర్హసి,
ఏక ఏవ యదా పార్థః షడ్రథాన్ జితవాన్ యుధి. 16

ఓయీ! రాధేయా! నీ కీ పలుకేల? అర్జునుడొక్కడే యుద్ధమున ఆరుగురు మహారథులను గెలిచె నను మాట నీవు స్మరింపదగును.

బహుశో జేయమానస్య కర్మ దృష్టం తదైవ తే,
పలుమారు ఓడుచున్న నీ ఘనకార్యము నప్పుడే చూచితిమి.

న చే దేవం కరిష్యామో యదయం బ్రాహ్మణోఽబ్రవీత్,
ధ్రువం యుధి హతా స్తేన భక్షయిష్యామ పాంసుకాన్. 17

ఈ బ్రాహ్మణుడు పలికిన పలుకును పాటింపమేని తప్పక వానిచేత చావు దెబ్బ తిని మట్టి గరతుము.

వైశమ్పాయన ఉవాచ - వైశంపాయను డిట్లు చెప్పెను.

ధృతరాష్ట్ర స్తతో భీష్మ మనుమాన్య ప్రసాద్య చ,
అవభర్త్స్య చ రాధేయ మిదం వచన మబ్రవీత్. 18

అంత ధృతరాష్ట్రుడు భీష్ముని బ్రతిమాలి ప్రసన్నుని చేసికొని, కర్ణుని మందలించి యిట్లు పలికెను.

అస్మద్ధితం వాక్య మిదం భీష్మః శాన్తనవోఽబ్రవీత్,
పాణ్డవానాం హితం చైవ సర్వస్య జగత స్తథా. 19

శంతనుని కొడుకు ఈ భీష్ము డాడినమాట మనకు, పాండవులకు సర్వలోకమునకు హితమైనది.

చిన్తయిత్వా తు పార్థేభ్యః ప్రేషయిష్యామి సఞ్జయమ్,
స భవాన్ ప్రతియా త్వద్య పాణ్డవా నేవ మా చిరమ్. 20

నే నాలోచించి పాండవులకడకు సంజయుని పంపుదును. ఇప్పుడు తమరు జాగుసేయక పాండవులకడ కరుగుడు.

స తం సత్కృత్య కౌరవ్యః ప్రేషయామాస పాండవాన్,
సభామధ్యే సమాహూయ సంజయం వాక్య మబ్రవీత్. 21

ఆ ధృతరాష్ట్రుడు ఆ పురోహితుని సత్కరించి, పాండవులకడ కంపెను. పిమ్మట సంజయుని సభలోనికి పిలిచి యిట్లు పలికెను.

ఇతి శ్రీమహాభారతే ఉద్యోగపర్వణి సంజయయానపర్వణి
పురోహితయానే ఏకవింశోఽధ్యాయః.

ఇది శ్రీమహాభారతము ఉద్యోగపర్వమునందు సంజయయానపర్వమున
పురోహితు డరుగుట అను ఇరువదియొకటవ అధ్యాయము.

—(o)—

# ద్వావింశోఽధ్యాయః-ఇరువది రెండవ అధ్యాయము.

పాణ్డవానాం ప్రభావం ప్రతిమాం చోపవర్ణ్య ధృతరాష్ట్రేణ
సఞ్జయద్వారా పాణ్డవసంనిధౌ సన్దేశప్రేషణమ్.

**పాండవుల ప్రభావమును, ప్రమాణమును వర్ణించి ధృతరాష్ట్రుడు**
**సంజయునిద్వారా పాండవులకడకు సందేశము నంపుట.**

ధృతరాష్ట్ర ఉవాచ-ధృతరాష్ట్రు డిట్లు పలికెను.

ప్రాప్తా నాహుః సఞ్జయ పాణ్డుపుత్రా
నుపప్లవ్యే తాన్ విజానీహి గత్వా,
అజాతశత్రుం చ సభాజయేథా
దిష్ట్యాఽనహ్యా స్థాన ముపస్థిత స్త్వమ్. 1

సంజయా! పాండుపుత్రులు తిరిగి వచ్చినట్లుగా చెప్పుచున్నారు. నీవు ఉపప్లావ్యమునకరిగి విషయము తెలిసికొనుము. భాగ్యవశమున తగు ఏర్పాటులను చేసికొని, ఒక స్థితికి వచ్చితివని ధర్మరాజును మన్నన సేయుము.

సర్వాన్ వదేః సఞ్జయ స్వస్తిమన్తః
కృచ్ఛ్రం వాస మతదర్హా న్నిరుష్య,
తేషాం శాన్తి ర్విద్యతేఽస్మాసు శీఘ్రం
మిథ్యోపేతానా ముపకారిణాం సతామ్. 2

ఇచటి వా రందరు కుశలముగా నున్నా రని చెప్పుము. వారు, పాపము! పొందరాని కష్టము పొంది దానిని గడచి గట్టెక్కిరి. నిష్కారణముగా ఓటమి

---

1. దిష్ట్యా - అదృష్టవశమున; అనహ్యా-తగు ఏర్పాటులను చేసికొని; స్థాన ముపస్థితః - స్థితిని పొందితివి; సభాజయేథాః-మన్నన సేయుము.

2. స్వస్తిమన్తః - మేము సుఖముగా నున్నామని; కృచ్ఛ్రమ్-కష్టముగా; నిరుష్య-బ్రదికియు; మిథ్యాపేతానాం-[ఒక పాఠము] కపటము లేనివారు.

పొందిరి. (కపటము ఎఱుగని వారు. అయినను) ఉపకారమే చేయుదురు. సజ్జను లగు పాండవులకు మనయందు శాంతభావమే కలదు.

నాహం క్వచిత్ సఞ్జయ పాణ్డవానాం
మిథ్యావృత్తిం కాఞ్చన జాత్వపశ్యమ్,
సర్వాం శ్రియం హ్యాత్మవీర్యేణ లబ్ధాం
పర్యాకార్షుః పాణ్డవా మహ్య మేవ. 3

సంజయా! పాండవులలో కల్లకపటములు మచ్చునకైనను ఒక్కనాడును నాకు కానరావు. తమశక్తితో సమస్తమగు సంపదను సాధించి ఆ పాండవులు నా కొఱకుగా మొత్తము తెచ్చి యిచ్చిరి.

దోషం హ్యేషాం నాధ్యగచ్ఛం పరీచ్ఛ -
న్నిత్యం కఞ్చి ద్యేన గర్హేయ పార్థాన్
ధర్మార్థాభ్యాం కర్మ కుర్వన్తి నిత్యం
సుఖప్రియే నానురుధ్యన్తి కామాత్. 4

ఎంత వెదకినను నాకు వారిలో దోష మొక్కటియు కానరాదు. అట్టి కుంతీ తనయులను ఏమని నిందింతును ? ధర్మముకొఱకును, అర్థముకొఱకునే ఆ యా పనులను చేయుదురు. కామమువలన సుఖమును ప్రియమును పట్టి ప్రేలాడరు.

ఘర్మం శీతం క్షుత్పిపాసే తథైవ
నిద్రాం తన్ద్రిం క్రోధహర్షౌ ప్రమాదమ్,
ధృత్యా చైవ ప్రజ్ఞయా చాభిభూయ
ధర్మార్థయోగాత్ ప్రయతన్తి పార్థాః. 5

---

3. మహ్యమేవ-నాకొఱకే; పర్యాకార్షుః-అన్ని వైపులనుండి తెచ్చిరి.

4. ధర్మార్థాభ్యాం - ధర్మార్థములకొఱకు; సుఖప్రియే - సుఖ మనగా ప్రీతి, ప్రియ మనగా కొడుకులు మున్నగువారు. సుఖప్రియే నానురుధ్యన్తి కామాత్ -అనగా సుఖప్రియములను వాంఛించి కామమువలన ధర్మమును త్యజించువారు కారని తాత్పర్యము.

5. తన్ద్రి - మేలుకొని యున్నపుడే ఒడ లెఱుగక ప్రవర్తించుట.

వేడిని, చలిని, ఆకలిదప్పులను, నిద్రను, మూఢత్వమును, కోపమును, సంతోషమును, ప్రమాదమును - ధైర్యముచేతను, బుద్ధిబలముచేతను త్రోసి వైచి పాండవులు ధర్మార్థములను సాధించుటకే ప్రయత్నము చేయుదురు.

త్యజన్తి మిత్రేషు ధనాని కాలే
న సంవాసా జ్జీర్యతి తేషు మైత్రీ,
యథార్థమానార్థకరా హి పార్థా
స్తేషాం ద్వేష్టా నాస్త్యాజమీఢస్య పక్షే. 6
అన్యత్ర పాపాద్ విషమా న్మన్దబుద్ధే
ర్దుర్యోధనాత్ క్షుద్రతరాచ్చ కర్ణాత్.

ఆ పాండవులు స్నేహము గలవారికి పని పడినపుడు ధన మిత్తురు. వారి యందు స్నేహము ఎంత కాలము కలిసియున్నను తరుగదు. యోగ్యతనుబట్టి మన్నింతురు. ధన మిత్తురు. పాపాత్ముడు, సమబుద్ధి లేనివాడు నగు ఈ దుర్యోధనుడును, అంతకంటెను క్షుద్రుడగు ఈ కర్ణుడును తప్ప ఈ అజమీఢవంశమున పాండవులను ద్వేషించువాడు లేడు.

[పుత్రో మహ్యం మృత్యువశం జగామ
దుర్యోధనః సఞ్జయ రాగబుద్ధిః,
భాగం హర్తుం ఘటతే మన్దబుద్ధి-
ర్మహాత్మనాం సఞ్జయ దీప్తతేజసామ్.]

[ఈ నా కొడుకు దుర్యోధనుడు పేరాసతో మృత్యువునకు వశమైపోయెను. కావుననే బుద్ధి మందగించి గొప్ప పరాక్రమము గల మహాత్ములు పాండవుల వంతు రాజ్యమును కబళించుటకై తీవ్రప్రయత్నములు చేయుచున్నాడు.]

తేషాం హీమౌ హీనసుఖప్రియాణాం
మహాత్మనాం సఞ్జనయతో హి తేజః. 7

6. యథార్థమానార్థకరాః - వారివారికి తగిన విధముగా మన్నన చేయువారు, ధన మొసగువారు; అజమీఢస్య - అజమీఢుని వంశమున పుట్టిన వాని యొక్క; పక్షే - పక్షమున - ఆ వంశమునం దని తాత్పర్యము.

7. తేజః - క్రోధము.

సుఖమును, ప్రియమును పట్టించుకొనని ఆ పాండవులపై ఈ యిద్దరును క్రోధమును రేకెత్తించుచున్నారు.

ఉత్థానవీర్యః సుఖ మేధమానో
దుర్యోధనః సుకృతం మన్యతే తత్,
తేషాం భాగం యచ్చ మన్యేత బాలః
శక్యం హర్తుం జీవతాం పాణ్డవానామ్. 8

ఆరంభమునందు మాత్రమే మిడిసిపాటు గలవాడు, సుఖముగా వృద్ధి నందుచున్నవాడు నగు ఈ దుర్యోధనుడు పాండవులు బ్రదికియుండగా వారి భాగమును చేజిక్కించుకొనుట శక్య మనుకొనుచున్నాడు. అంతే కాదు. ఈ బాలు డది తగినపని యనియు తలచుచున్నాడు.

యస్యార్జునః పదవీం కేశవశ్చ
వృకోదరః సాత్యకోఽజాతశత్రోః,
మాద్రీపుత్రౌ సృఞ్జయా శ్చాపి యాన్తి
పురా యుద్ధాత్ సాధు తస్య ప్రదానమ్. 9

ఎవని అడుగుజాడలలో అర్జునుడు, కృష్ణుడు, భీముడు, సాత్యకి, నకుల సహదేవులు, సృంజయులు నడతురో అట్టి అజాతశత్రువునకు, యుద్ధము రాక ముందే, రాజ్యభాగ మిచ్చుట శ్రేయస్కరము.

స హ్యేవైకః పృథివీం సవ్యసాచీ
గాణ్డీవధన్వా ప్రణుదే ద్రథస్థః,

---

8. ఉత్థానవీర్యః - ఆరంభకాలమునందే కాని అవసరమైనపుడు వీర్యము లేనివాడు; సుకృతమ్ మన్యతే - పాండవుల రాజ్యమును హరించుట శక్య మనుకొనుట, యోగ్యమైనదిగా తెలివి తక్కువతనమువలన తలచు చున్నాడని భావము.

9. యస్య పదవీం యాన్తి - ఎవని అడుగుజాడలలో నడతురో; తస్య - అతనికొఱకు; ప్రదానమ్ - భాగమిచ్చుట.

తథా జిష్ణుః కేశవో ఒవ్యప్రధృష్యో
లోకత్రయ స్యాధిపతి ర్మహాత్మా. 10

ఆ కవ్వడి ఒక్కడే గాండీవమును చేపట్టి, రథమెక్కి భూమి సంతతిని నుగ్గు చేయగలడు. అట్లే ఆ కృష్ణుడు మూడులోకములకు అధిపతి,మహాత్ముడు, జయశాలి. ఎవ్వడు నాతని నేమియు చేయజాలడు.

తిష్ఠేత కస్తస్య మర్త్యః పురస్తా-
ద్యః సర్వలోకేషు వరేణ్య ఏకః,
పర్జన్య ఘోషాన్ ప్రవపన్ శరౌఘాన్
పతఙ్గసంఘానివ శీఘ్రవేగాన్. 11

లోకము లన్నింటిలో అర్జునుడు వరేణ్యుడు. ఉరుమువంటి ఘోష గలవియు, మిక్కిలి వడి గలవియు, పక్షులగుంపులవంటివియు, నగు బాణపు వెల్లువలను ప్రసరింపజేయుచున్న అర్జుననిముందు నిలువగల నరు డెవ్వడు?

దిశం హ్యుదీచీ మపి చోత్తరాన్ కురూన్
గాణ్డీవధన్వైకరథో జిగాయ,
ధనం చైషా మాహరత్ సవ్యసాచీ
సేనానుగాన్ ద్రవిడాంశ్చైవ చక్రే. 12

గాండీవమును చేపట్టి ఆ వీరుడు ఉత్తరదిక్కును,ఆపైనున్న ఉత్తరకురు భూములను ఒక్కడై జయించెను. వారి ధనమును కొల్లగొట్టెను. మరియు ద్రవిడులను సైనికులనుగా చేసికొనెను.

---

10. సవ్యసాచీ-కుడియెడమచేతులతో ఒకే విధముగా బాణప్రయోగము చేయగలవాడు; ప్రణుదేత్-నుగ్గుచేయును.

11. వరేణ్యః-భోగమోక్షకామములచేత వరణీయుడు.

12. ఉత్తరాన్ కురూన్-హిమాలయమునకు ఉత్తర దిక్కుగా నున్న దేశములను, స్వర్గభూమి లనుకొనువానిని; ఏకరథః-ఇతరుల సాయములేని ఏకవీరుడై;

యశ్చైవ దేవాన్ ఖాణ్డవే సవ్యసాచీ
గాణ్డీవధన్వా ప్రజిగాయ సేన్ద్రాన్,
ఉపాహరత్ పాణ్డవో జాతవేదసే
యశో మానం వర్ధయన్ పాణ్డవానామ్. 13

ఖాండవవనమున ఆ కవ్వడి గాండీవమును చేతఁబట్టి ఇంద్రునితోపాటు దేవతలను ఓడించెను. ఆ ఖాండవమును అగ్నిదేవున కర్పించెను. పాండవుల కీర్తిని, మన్ననను పెంపొందించుచుండెను.

గదాభృతాం నాస్తి సమోఽత్ర భీమా -
ద్ధస్త్యారోహో నాస్తి సమశ్చ తస్య,
రథేఽర్జునా దాహు రహీన మేనం
బాహ్వోర్బలే నాయుతనాగవీర్యమ్. 14

గదను పట్టువారిలో భీమునకు సాటి ఎవ్వఁడు నిండు లేడు. అట్లే ఏనుగు నెక్కి పోరువాడును వానికి సరియగువాడు లేడు. రథమునందును అత డర్జునుని కంటె తక్కువకా డందురు. భుజబలముచేత పదివేల యేనుగులంతటి శక్తికలవా డనియు చెప్పుదురు.

సుశిక్షితః కృతవైర స్తరస్వీ
దహేత్ క్షుద్రాం స్తరసా ధార్తరాష్ట్రాన్,
సదా త్యమర్షీ న బలాత్ స శక్యో
యుద్ధే జేతుం వాసవేనాపి సాక్షాత్. 15

ఆ భీముడు బాగుగా రాటుదేలినవాడు. పైగా పగబట్టెను. మంచి ఒడుపు ఉన్నవాడు. ఒక్కపెట్టున క్షుద్రులగు నా కొడుకులను కాల్చివేయును. ఎల్లప్పుడు

---

13. జాతవేదసే ఉపాహరత్-అగ్నికొరకై అర్పించెను అనుచోట 'ఖాణ్డవే' అను పదమును ద్వితీయాంతముగా మార్చికొని, 'ఖాండవమును అర్పించెను' అని అర్థమును చెప్పుకొనవలయును.

15. తరస్వీ - వడికాడు; అత్యమర్షీ - పెల్లుబ్రేగిన కోపము కలవాడు;

మనపై పెల్లురేగిన కోపముతో నుండును. యుద్ధమున వానిని బలముతో ఇంద్రుడైనను గెలువజాలడు.

సుచేతసౌ బలినౌ శీఘ్రహస్తౌ
సుశిక్షితౌ భ్రాతరౌ ఫాల్గునేన,
శ్యేనౌ యథా పక్షిపూగాన్ రుజన్తౌ
మాద్రీపుత్రౌ శేషయేతాం న శత్రూన్. 16

గట్టి గుండెదిటవు కలవారు, బలము కలవారు, చేతులలో బడుపు ఉన్నవారు, అర్జునుని శిక్షణలో ఆయుధములను ప్రయోగించుటలో ఆరితేరినవారు- అగు మాద్రికొడుకులు నకులసహదేవులు డేగలు పక్షిమూకలను విరిగి పోగులు పెట్టినట్లు పగవారిని మిగులు లేకుండ చేయుదురు.

ఏతద్బలం పూర్ణ మస్మాక మేవం
యత్సత్యం తాన్ ప్రాప్య నాస్తీతి మన్యే,
తేషాం మధ్యే వర్తమాన స్తరస్వీ
ధృష్టద్యుమ్నః పాణ్డవానా మిహైకః. 17

ఈ మనసేనయు నిండైనదియే. నిజమే. కాని వారిని ముట్టినపుడు దీనికి ఉనికియే లేదని తలంతును. ఆ పాండవుల నడుమ వేగరి ధృష్టద్యుమ్నుడొకడు తిరుగుచున్నాడు.

సహామాత్యః సోమకానాం ప్రబర్హః
సంత్యక్తాత్మా పాణ్డవార్థే శ్రుతో మే,
అజాతశత్రుం ప్రసహేత కోఽన్యో
యేషాం స స్యా దగ్రణీ ర్వృష్ణిసింహః. 18

---

17. నాస్తీతి మన్యే - లేనిదని, - తుచ్ఛ మని తలంతును.
18. ప్రబర్హః-శ్రేష్ఠుడు; సంత్యక్తాత్మా-దేహము విడచినవాడు, ఇది తెలుగునందలి 'ప్రాణమిచ్చును' అను నుడికారము వంటిది.

సోమకులలో శ్రేష్ఠు డగు ద్రుపదుడు మంత్రులతో పాటు పాండవులకొరకు ప్రాణములు విడుచు నని వింటిని. శ్రీకృష్ణుడు ముందు నిలిచి నడపించుచుండగా ఆ అజాతశత్రుని తట్టుకొనగలవా డెవ్వడు ?

సహోషిత శ్చరితార్థో వయస్థో
మాత్స్యేయానా మధిపో వై విరాటః,
స వై సపుత్రః పాణ్డవార్థే చ శశ్వ-
ద్యుధిష్ఠిరే భక్త ఇతి శ్రుతం మే. 19

కలసియున్నవాడు, రక్షణగొన్నవాడు, పెద్దవాడు అగు మత్స్యరాజు విరాటుడు తన కొడుకులతోపాటు పాండవులయందు నిష్ఠ గలవాడై ధర్మరాజు నందు భక్తుడై యున్నట్లు నాకు వినవచ్చినది.

అవరుద్ధా రథినః కేకయేభ్యో
మహేష్వాసా భ్రాతరః పఞ్చ సన్తి,
కేకయేభ్యో రాజ్య మాకాఙ్క్షమాణా
యుద్ధార్థిన శ్చానువసన్తి పార్థాన్. 20

కేకయదేశమునుండి వెడలగొట్టబడినవారు, గొప్ప విలుకాండ్రు, రథికులు నగు అయిదుగురు అన్నదమ్ములు కలరు. వారు మరల కేకయులనుండి రాజ్యమును పొందగోరినవారై కయ్యమునకు కాల్దువ్వుచు పాండవుల నాశ్రయించి యున్నారు.

---

19. సహోషితః - పాండవులతో కలసి సంవత్సరకాలము ఉన్నవాడు; చరితార్థః - దక్షిణగోగ్రహణమున వారిచేత రక్షింపబడి ప్రయోజన మందినవాడు; మాత్స్యేయానామ్-మత్స్యదేశమున పుట్టినవారికి;

20. కేకయేభ్యః - కేకయదేశముల నుండి; అవరుద్ధాః - వెడలగొట్టబడిన వారు; ఈ అయిదుగురు ఒకప్పుడు మనవారే కాని ఇప్పుడు పాండవ పక్షమున చేరిరని భావము. దానివలన మనపక్షమునకు హాని, పర పక్షమునకు పుష్టి కలిగినదని తాత్పర్యము.

సర్వాంశ్చ వీరాన్ పృథివీపతీనాం
సమాగతాన్ పాణ్డవార్థే నివిష్టాన్,
శూరా నహం భక్తిమతః శృణోమి
ప్రీత్యాయుక్తాన్ సంశ్రితాన్ ధర్మరాజమ్. 21

పాండవులకై వచ్చిన రాజుల యుద్ధవీరులందరు శూరులు, భక్తిగలవారు, ప్రేమగలవారు నై ధర్మరాజు నాశ్రయించినా రని వినుచున్నాను.

గిర్యాశ్రయా దుర్గనివాసిన శ్చ
యోధాః పృథివ్యాం కులజాతిశుద్ధాః,
మ్లేచ్ఛా శ్చ నానాయుధవీర్యవన్తః
సమాగతాః పాణ్డవార్థే నివిష్టాః. 22

కొండలయందు, దుర్గములందు నివసించు యోధులు, భూమిపై కులము చేతను జాతిచేతను శుద్ధులు, అనేకాయుధములలో గొప్పశక్తిగల మ్లేచ్ఛులు పాండవులకై వచ్చి నిలచియున్నారు.

పాణ్డ్య శ్చ రాజా సమితీన్ద్రకల్పో
యోధప్రవీరై ర్బహుభిః సమేతః,
సమాగతః పాణ్డవార్థే మహాత్మా
లోకప్రవీరోఽ ప్రతివీర్యతేజాః. 23

యుద్ధమున దేవేంద్రు నంతటివాడు, పెక్కండ్రు పోటుగాండ్రతోకూడినవాడు, మహావీరుడు, మహాత్ముడు, ఎదురులేని తేజము గలవాడు నగు పాండ్యరాజును పాండవులపనికై వచ్చెను.

అస్త్రం ద్రోణా దర్జునా ద్వాసుదేవాత్
కృపా ద్భీష్మా ద్యేన వృతం శృణోమి,

23. సమితి - యుద్ధమునందు, 'సమిత్యాజి సమిద్యుధః' అని నిఘంటువు.

యం తం కార్ష్ణిప్రతిమ మాహు రేకం
స సాత్యకిః పాణ్డవార్థే నివిష్టః. 24

ద్రోణుడు, అర్జునుడు, కృష్ణుడు, కృపుడు, భీష్ముడు అను వారివలన అస్త్ర విద్య నేర్చిన సాత్యకి యుండెనే అతనిని ప్రద్యుమ్ను సంతతివాడు, సాటిలేని వాడు అని యందురు. అతడు పాండవులకై వచ్చి మోహరించెను.

ఉపాశ్రితా శ్చేదికరూషకాశ్చ
సర్వోద్యోగై ర్భూమిపాలాః సమేతాః,
తేషాం మధ్యే సూర్య మివాతపన్తం
శ్రియా వృతం చేదిపతిం జ్వలన్తమ్. 25

అస్తమ్భనీయం యుధి మన్యమానో
జ్యాం కర్షతాం శ్రేష్ఠతమం పృథివ్యామ్,
సర్వోత్సాహం క్షత్రియాణాం నిహత్య
ప్రసహ్య కృష్ణ స్తరసా సంమమర్ద. 26

చేది, కరూషకరాజులు కూడ సర్వప్రయత్నములతో వచ్చి పాండవులను కలిసిరి. మునుపు ఆ చేదిరాజులలో ఒకడగు శిశుపాలుడు సూర్యునివలె వెలుగొందు చుండెడివాడు. గొప్ప సంపద గలవాడు, భూమిలో గొప్పవిలుకాడు, క్షత్రియులకు ఆత డన్నచో ఒక పెద్ద ఉత్సాహము. అట్టివాడు యుద్ధమున లొంగడని కృష్ణు డాతనిని బలాత్కారముగా చంపెను.

---

24. కార్ష్ణిః - కృష్ణుని కొడుకు - ప్రద్యుమ్నుడు. వానితో సాటి యగు వాడు; ఏకమ్ - పోలిక లేని వానిని;

25. ఇందలి 'చేదిపతిమ్' అను పదమునకు తరువాత శ్లోకములోని 'కృష్ణః సంమమర్ద' అను దానితో అన్వయము.

26. 'జ్యాం కర్షతాం శ్రేష్ఠతమమ్' - అల్లెత్రాటిని లాగువారిలో మిక్కిలి శ్రేష్ఠుడు; గొప్ప ధనుర్ధరు డని భావము.

యశోమానౌ వర్ధయన్ పాణ్డవానాం
పురాఽభిన చ్ఛిశుపాలం సమీక్ష్య,
యస్య సర్వే వర్ధయ న్తి స్మ మానం
కరూషరాజప్రముఖా నరేంద్రాః. 27

కృష్ణు డా శిశుపాలుని, పాండవుల కీర్తిని, మానమును వృద్ధి పొందించుటకై సంహరించెను. ఆ కరూషరాజు మున్నగు భూపతులు శిశుపాలుని మానమును పెంపొందించుచుండెడివారు.

త మసహ్యం కేశవం తత్ర మత్వా
సుగ్రీవయు క్తేన రథేన కృష్ణమ్,
కే ప్రాద్రవం శ్చేదిపతిం విహాయ
సింహం దృష్ట్వా క్షుద్రమృగా ఇవాన్యే. 28

సుగ్రీవమను గుఱ్ఱము పూన్చిన రథముతో నున్న ఆ కృష్ణుని ఎదుర్కొనుటకు శక్యముకాదని తలచి, సింహమును చూచిన అల్పమృగముల వలె, తక్కిన రాజులందరు ఎదుర్కొనరైరి. ఒక్క శిశుపాలుడుమాత్రము ఆతనిపైకి దుమికెను.

య స్తం ప్రతీప స్తరసా ప్రత్యుదీయా
దాశంసమానో ద్వైరథే వాసుదేవమ్,
సోఽశేత కృష్ణేన హతః పరాసు
ర్వాతేనే వోన్మథితః కర్ణికారః. 29

అట్టి శిశుపాలుడు ఎదురుతిరిగి పోరున కృష్ణునినుండి గెలుపు వచ్చు ననుకొనుచు, ఆతని దెబ్బకు ప్రాణములు కోల్పోయి, గాలికి పెల్లగిల్లిన కొండగోగు వలె నేలపై కూలెను.

---

28. కే ప్రాద్రవన్ - ఎవ్వరు (కృష్ణుని పైకి) దుమికిరి? ఎవ్వరును దుముకలేదని భావము.

29. ప్రత్యుదీయాత్-ఎదుర్కొనెను; ఆశంసమానః - జయము కల్గు ననుకొనుచున్నవాడై; ద్వైరథే - యుద్ధమున; అశేత - పండుకొనెను. నేలగూలెనని భావము. పరాసుః - ప్రాణములు పోయినవాడై.

పరాక్రమం మే య దవేదయన్త
తేషామర్థే సఞ్జయ కేశవస్య,
అనుస్మరం స్తస్య కర్మాణి విష్ణో
ర్గావల్గణే నాధిగచ్ఛామి శాన్తిమ్. 30

పాండవులకై కృష్ణుడు చేసిన పరాక్రమమును చారులు గుర్తునకు తెచ్చుచుండగా, ఆ విష్ణుని పనులు ఎల్లవేళల నా స్మృతికి వచ్చుచు, సంజయా! నాకు శాంతి కలుగకున్నది.

న జాతు తా ఇచ్ఛత్రు రన్యః సహేత
యేషాం స స్యా దగ్రణీ ర్వృష్ణిసింహః,
ప్రవేపతే మే హృదయం భయేన
శ్రుత్వా కృష్ణా వేకరథే సమేతౌ. 31

ఆ వృష్ణిసింహుడు నడపించుచుండగా ఆ పాండవులను శత్రు వెవ్వడును, ఎన్నటికిని ఎదుర్కొనజాలడు. ఆ కృష్ణులు ఇద్దరు ఒక్క రథమున కలసి రని విన్నంత నాగుండె భయముతో గుబులు పొందుచున్నది.

న చే ద్గచ్ఛేత్ సంగరం మన్దబుద్ధి-
స్తాభ్యాం లభే చ్ఛర్మ తదా సుతో మే,
నో చేత్ కురూన్ సఞ్జయ నిర్దహేతా
మిన్ద్రావిష్ణూ దైత్య సేనాం యథైవ. 32

బుద్ధితక్కువవా డగు నాకొడుకు వారిరువురితో పోరికి పోకున్నచో సుఖపడును. అట్లు కానియెడల, సంజయా! ఇంద్రుడును, విష్ణువును రాక్షస సేనను వలె వారిద్దరు కౌరవసేనను మాడ్చివేయుదురు.

మతో హి మే శక్రసమో ధనఞ్జయః
సనాతనో వృష్ణివీరశ్చ విష్ణుః,

---

30. యత్, అవేదయన్త - దేనిని (చారులు) గుర్తుకు తెచ్చిరో;
31. కృష్ణౌ - అర్జును డొక కృష్ణుడు, వాసుదేవుడు మరియొక కృష్ణుడు - ఇటిద్దరు కృష్ణులు;

ధర్మారామో హ్రీనిషేవ స్తరస్వీ
కున్తీపుత్రః పాణ్డవో౽జాతశత్రుః. 33

నాకు చూడగా అర్జునుడు ఇంద్రుడంతటివాడు. ఆవృష్ణివీరుడు కృష్ణుడు సనాతనుడైన విష్ణువు. ఇక కుంతికొడుకన్ననో ధర్మమునకు నెలవు. ఉచితమైన సిగ్గు కలవాడు, గొప్పబలము కలవాడు, శత్రుభావము లేనివాడు.

దుర్యోధనేన నికృతో మనస్వీ
నో చేత్ క్రుద్ధః ప్రదహేద్ధార్తరాష్ట్రాన్,
నాహం తథా హ్యర్జునా ద్వాసుదేవా-
ద్భీమా ద్వాహం యమయోర్వా బిభేమి. 34

ఆ ధర్మరాజు దుర్యోధను డింతగా మోసగించినను మనసును అదుపున పెట్టుకొని యుండెను. అట్లుగాక కోపించెనా? ఈ నా కొడుకుల నెల్లరను బూడిద చేసియుండెడివాడు. నేనా ధర్మరాజునకు భయపడినట్లు అర్జునునకు గాని, కృష్ణునకు గాని, భీమునకు గాని నకులసహదేవులకు గాని భయపడను.

యథా రాజ్ఞః క్రోధదీప్తస్య సూత
మన్యో ర్రహం భీతతరః సదైవ,
మహాతపా బ్రహ్మచర్యేణ యుక్తః
సఙ్కల్పో౽యం మానస స్తస్య సిద్ధ్యేత్. 35

సూతా! కోపముతో మండిపోవు ఆరాజు క్రోధమునకు నే నెంతగా భీతిల్లు చున్నానో అతడంతగా గొప్పతపస్సు గలవా డగుచున్నాడు. అతని మనస్సు లోని సంకల్పము తప్పక నెరవేరును.

తస్య క్రోధం సఞ్జయాహం సమీక్ష్య
స్థానే జానన్ భృశ మస్మ్యద్య భీతః,

33. ఇంద్రసమః - ఇంద్రునకు సాటియైనవాడు-ఇంద్రుని కుమారుడు కనుక;
ధర్మారామః-ధర్మమునకు నెలవు-ధర్ముని పుత్రుడు కనుక;

34. నికృతః-వంచింపబడినవాడు; మనస్వీ-మనస్సును గెలిచినవాడు.

35. మన్యోః- క్రోధమువలన; మానసః - మనస్సునకు సంబంధించిన;

స గచ్ఛ శీఘ్రం ప్రహితో రథేన
పాఞ్చాలరాజస్య చమూనివేశనమ్. 36

సంజయా! ఆతని క్రోధమును పరికించి అది తగినదే యని తలచుచు నేడు మిక్కిలి భయమందుచున్నాను. నీవు త్వరగా రథముతో బయలుదేరి పాంచాలరాజు సేనాశిబిరముల కడ కరుగుము.

అజాతశత్రుం కుశలం స్మ పృచ్ఛేః
పునః పునః ప్రీతియుక్తం వదే స్త్వమ్,
జనార్దనం చాపి సమేత్య తాత
మహామాత్రం వీర్యవతా ముదారమ్. 37

ధర్మరాజును కుశల మడుగుము. ప్రీతితో కూడిన పలుకు మరియు మరియు పలుకుము. అట్లే వీర్యము గలవారిలో గొప్పవాడు, మహాపుణ్యాత్ముడు నగు జనార్దనుని కలిసి, నాయనా! సుఖ మడుగుము.

అనామయం మద్వచనేన పృచ్ఛే -
ర్ధృతరాష్ట్రః పాణ్డవైః శాన్తి మీప్సుః,
న తస్య కిఞ్చి ద్వచనం న కుర్యాత్
కున్తీపుత్రో వాసుదేవస్య సూత. 38

నా మాటగా కుశల మడిగి ధృతరాష్ట్రుడు పాండవులతో శాంతినే కోరుచున్నాడని కృష్ణునకు చెప్పుము. ఆ కుంతికొడుకు వాసుదేవు డాడినమాట, ఎట్టిదైనను, చేయడని లేదు.

ప్రియ శ్చైషా మాత్మసమశ్చ కృష్ణో
విద్వాం శ్చైషాం కర్మణి నిత్యయుక్తః,

---

36. స్థానే జానన్ - తగిన దని తెలిసికొనుచు;
37. మహామాత్రం - గొప్ప పుణ్యాత్ముడు;
38. న కుర్యాత్ (ఇతి)న - చేయడని లేదు - తప్పక చేయునని భావము; శాన్తిమ్, ఈప్సుః - శాంతిని పొందగోరుచున్నవాడు - అని పలుకు మని భావము.

ఆ పాండవులకు కృష్ణుడు మిక్కిలి ప్రియుడు. ఆత్మవంటివాడు. అన్నియు నెరిగినవాడు. వారి పనులు తీర్చిదిద్దుటలో ఎల్లప్పుడు తగిలియుండును.

సమానీతాన్ పాణ్డవాన్ సృఞ్జయాంశ్చ
జనార్దనం యుయుధానం విరాటమ్,
అనామయం మద్వచనేన పృచ్ఛేః
సర్వాం స్తథా ద్రౌపదేయాంశ్చ పఞ్చ. 39

పాండవులు, సృంజయులు, కృష్ణుడు, సాత్యకి, విరాటుడు, ద్రౌపది కుమారు లయిదుగురు, మరియు తక్కిన అందరు ఒక్కచో నుండగా నా మాటగా వారి సుఖవార్తల నడుగుము.

యద్య త్తత్ర ప్రాప్తకాలం పరేభ్య -
స్త్వం మన్యేథా భారతానాం హితం చ,
తద్భాషేథాః సఞ్జయ రాజమధ్యే
న మూర్ఛయే ద్యన్న చ యుద్ధహేతుః. 40

సంజయా! అచట పరులాడిన మాటలనుబట్టి ఏది ఏది సమయమునకు తగిన దని నీ వెంతువో అది పలుకుము. అది భారతవంశమువా రందరికి హితము కాదగును. సభలో నీమాట వారికి కోపము రేపరాదు. పోరునకు కారణము కారాదు.

ఇతి శ్రీమహాభారతే ఉద్యోగపర్వణి సఞ్జయయానే
ధృతరాష్ట్రసందేశే ద్వావింశోఽధ్యాయః.
ఇది శ్రీమహాభారతము ఉద్యోగపర్వమున సంజయయానమున
ధృతరాష్ట్రుని సందేశ మను ఇరువది రెండవ అధ్యాయము.

-: o :-

39. సమానీతాన్ - ఒకచోట నున్నవారిని;
40. న మూర్ఛయేత్—ఆ నీ మాట వారికి క్రోధము రేకెత్తించునది కా రాదని భావము. ఇందు క్రోధ మను మాటను కలుపుకొన వలయును.

## త్రయోవింశోఽ ధ్యాయః- ఇరువది మూడవ అధ్యాయము

యుధిష్ఠిరం దృష్ట్వా సఞ్జయేన తదీయకుశలం ప్రతి
జిజ్ఞాసాకరణం, కౌరవ పక్షీయ జనానాం కుశలం
జిజ్ఞాసతో యుధిష్ఠిరస్య సారగర్భః ప్రశ్నః.

యుధిష్ఠిరుని చూచి సంజయుడు కుశలము తెలియగోరుట,
కౌరవపక్షము నందలి జనముల కుశల మెరుగగోరి
యుధిష్ఠిరుడు తమ సత్తువ తెలియునట్లు ప్రశ్నించుట.

వైశమ్పాయన ఉవాచ - వైశంపాయను డిట్లు చెప్పెను.

రాజ్ఞస్తు వచనం శ్రుత్వా ధృతరాష్ట్రస్య సంజయః,
ఉపప్లవ్యం యయౌ ద్రష్టుం పాణ్డవా నమితౌజసః.

ధృతరాష్ట్రమహారాజు మాట విని సంజయుడు గొప్ప శక్తిగల పాండవులను చూచుటకై ఉపప్లవ్యమున కరిగెను.

స తు రాజాన మాసాద్య కున్తీపుత్రం యుధిష్ఠిరమ్,
అభివాద్య తతః పూర్వం సూతపుత్రోఽభ్యభాషత. 2

ఆ సంజయుడు కుంతీకుమారు డగు యుధిష్ఠిరుని సమీపించి ముందుగా పేరు చెప్పి నమస్కరించి యిట్లు పలికెను.

గావల్గణిః సఞ్జయః సూతసూను -
రజాతశత్రు మవదత్ ప్రతీతః,
దిష్ట్యా రాజం స్త్వామరోగం ప్రపశ్యే
సహాయవన్తం చ మహేన్ద్రకల్పమ్. 3

గవల్గణుని కొడుకు, సూతకులమువాడు నగు సంజయుడు హర్షముతో ధర్మరాజును గాంచి యిట్లు పలికెను. రాజా! భాగ్యవశమున కుశలముగా నున్న

---

3. ప్రతీతః-హర్షము పొందినవాడనై

వాడవు, సహాయులు కలవాడవు. మహేంద్రునితో సమానుడవు - అగు నిన్ను చూడగంటిని.

అనామయం పృచ్ఛతి త్వాఽఽమ్బికేయో
వృద్ధో రాజా ధృతరాష్ట్రో మనీషీ,
కచ్చి ద్భీమః కుశలీ పాణ్డవాగ్ర్యో
ధనఞ్జయ స్తౌ చ మాద్రీతనూజౌ. 4

అంబికాపుత్రుడు, వృద్ధుడు, బుద్ధికుశలత కలవాడు నగు ధృతరాష్ట్ర మహారాజు నిన్ను కుశల మడుగుచున్నాడు. పాండవులలో శ్రేష్ఠుడు భీముడు, అర్జునుడు, ఆ మాద్రికొడుకులు కుశలముగా నున్నారు గదా!

కచ్చిత్ కృష్ణా ద్రౌపదీ రాజపుత్రీ
సత్యవ్రతా వీరపత్నీ సపుత్రా,
మనస్వినీ యత్ర చ వాఞ్ఛసి త్వ -
మిష్టాన్ కామాన్ భారత స్వస్తికామః. 5

రాజపుత్రి, సత్యమున పట్టుదల గలది, వీరులకు పత్ని, కొడుకులను గన్నది, ద్రుపదుని కూతురు అభిమానవతియు అగు కృష్ణ కుశలముగా నున్నది గదా! మరియు నీవు శుభములను కోరుచు ఇష్టములగు భోగములను పొందుచో టగు నీ ఆప్తుల సముదాయమునకు కుశలమా?

యుధిష్ఠిర ఉవాచ - ధర్మరా జిట్లు పలికెను.

గావల్గణే సఞ్జయ స్వాగతం తే
ప్రీయామహే తే వయం దర్శనేన,
అనామయం ప్రతిజానే తవాహం
సహానుజైః కుశలీ చాస్మి విద్వన్ : 6

---

4. ఆమ్బికేయః - అంబిక కొడుకు - ధృతరాష్ట్రుని తల్లిపేరు అంబిక;

5. యత్ర - ఏ ఆప్తుల వర్గమునందు; స్వస్తికామః - శుభమును పొంద గోరినవాడవై;

గవల్గణకుమారా! సంజయా! నీకు స్వాగతము. నీ దర్శనమువలన ప్రీతులమైతిమి. నీ క్షేమము నెరిగితిని. పండితుడా! తమ్ములతోపాటు కుశలముగా నున్నాను.

చిరా దిదం కుశలం భారతస్య
శ్రుత్వా రాజ్ఞః కురువృద్ధస్య సూత,
మన్యే సాక్షా ద్దృష్ట మహం నరేన్ద్రం
దృష్ట్వైవ త్వాం సఞ్జయ ప్రీతియోగాత్. 7

కురువంశమున పెద్దయు, భరతవంశమువాడును అగు రాజు క్షేమమును వినియు నిన్ను చూచియు పొందిన ప్రీతివలన, సాక్షాత్తు రాజును చూచినట్లే తలచుచున్నాను.

పితామహో నః స్థవిరో మనస్వీ
మహాప్రాజ్ఞః సర్వధర్మోపపన్నః,
స కౌరవ్యః కుశలీ తాత భీష్మో
యథాపూర్వం వృత్తి రస్త్యస్య కచ్చిత్ ? 8

మా తాత, ముదుసలి, మానధనుడు, ప్రజ్ఞాశాలి, ధర్మము లన్నియు తెలిసినవాడు, కురువంశమువాడు అగు భీష్ముడు, అయ్యా! కుశలముగా నున్నాడా? ఆయనకు మాయందు స్నేహము మునుపటివలెనే యున్నదా?

కచ్చి ద్రాజా ధృతరాష్ట్రః సపుత్రో
వైచిత్రవీర్యః కుశలీ మహాత్మా,
మహారాజో బాహ్లికః ప్రాతిపేయః
కచ్చి ద్విద్వాన్ కుశలీ సూతపుత్ర. 9

సూతసుతా! విచిత్రవీర్యుని కొడుకు. మహాత్ముడు అగు ధృతరాష్ట్రమహారాజు కొడుకులతోపాటు క్షేమముతో నున్నాడా? ప్రతీపుని కుమారుడగు బాహ్లిక మహారాజు అన్నియు నెరిగినవాడు, కుశలముతో నున్నాడా?

---

8. స్థవిరః - ముదుసలి; వృత్తిః - మాయందలి స్నేహము.
9. ప్రాతిపేయః - ప్రతీపమహారాజు కుమారుడు.

స సోమదత్తః కుశలీ తాత కచ్చిద్
భూరిశ్రవాః సత్యసన్ధః శలశ్చ,
ద్రోణః సపుత్రశ్చ కృపశ్చ విప్రో
మహేష్వాసాః కచ్చి దేతేఽప్యరోషాః ? 10

తండ్రీ! ఆ సోమదత్తుడు సుఖముతో నున్నాడా? భూరిశ్రవుడు, సత్యసంధుడు, శలుడు, పుత్రునితోపాటు ద్రోణుడు, విద్యావంతు డగు కృపుడు - గొప్ప విలుకాండ్రగు వీరందరు కుశలముగా నున్నారా?

సర్వే కురుభ్యః స్పృహయన్తి సఞ్జయ
ధనుర్ధరా యే పృథివ్యాం ప్రధానాః,
మహాప్రజ్ఞాః సర్వశాస్త్రావదాతా
ధనుర్భృతాం ముఖ్యతమాః పృథివ్యామ్. 11

భూమియందలి విలుకాండ్రలో పేరున్నవారు, ప్రజ్ఞ కలవారు, అన్ని శాస్త్రములలో ఆరితేరినవారు, వింటివిద్యలో మిక్కిలి ప్రముఖులు అగు వీరందరు కౌరవుల శుభమును కోరుచున్నారా?

కచ్చి న్మానం తాత లభన్త ఏతే
ధనుర్భృతః కచ్చి దేతేఽప్యరోగాః
యేషాం రాష్ట్రే నివసతి దర్శనీయో
మహేష్వాసః శీలవాన్ ద్రోణపుత్రః. 12

బాబూ! వీరందరు మన్నన పొందుచున్నారా? ఈ విలుకాండ్రందరికి కుశలమా? గొప్ప విల్లు పట్టి చూడముచ్చటగొలుపు శీలవంతుడు ద్రోణునికొడుకు అశ్వత్థామ వారి రాష్ట్రమున నివసించుచున్నాడు.

---

10. కురుభ్యః స్పృహయన్తి-పోరురాకుండ కౌరవుల శుభమును కోరుచున్నారా? అని తాత్పర్యము.

12. యేషామ్ - అంత గొప్పవిలుకాడుగల రాష్ట్రములో ఇతరులకు మన్నన కలుగుచున్నదా? అని తాత్పర్యము.

వైశ్యాపుత్రః కుశలీ తాత కచ్చి-
న్మహాప్రాజ్ఞో రాజపుత్రో యుయుత్సుః,
కర్ణోఽమాత్యః కుశలీ తాత కచ్చిత్
సుయోధనో యస్య మన్దో విధేయః. 13

నాయనా! మిక్కిలి బుద్ధిగలవాడు, రాజునకు వైశ్యస్త్రీయందు బుట్టినవాడు అగు యుయుత్సువు బాగుగా నున్నాడా? మంతనములు చెప్పు కర్ణుడు కుశలముగా నున్నాడా? ఈ బుద్ధిలేని దుర్యోధనుడు వానికే కదా విధేయుడు!

స్త్రియో వృద్ధా భారతానాం జనన్యో
మహానస్యో దాసభార్యాశ్చ సూత,
వధ్వః పుత్రా భాగినేయా భగిన్యో
దౌహిత్రా వా కచ్చి దప్యవ్యలీకాః. 14

వయసు పైబడిన స్త్రీలు, భరత వంశమువారి తల్లులు, వంటయింటి పరిచారికలు, దాసుల భార్యలు, కోడండ్రు, కొడుకులు, మేనల్లుండ్రు, అక్క-చెల్లెండ్రు, కూతుల కొడుకులు-వీరందరు మోసములేకుండ మెలగుచున్నారా?

కచ్చి ద్రాజా బ్రాహ్మణానాం యథావత్
ప్రవర్తతే పూర్వవత్ తాత వృత్తిమ్,
కచ్చి ద్దాయాన్ మామకాన్ ధార్తరాష్ట్రో
ద్విజాతీనాం సఞ్జయ నోపహన్తి. 15

రాజు బ్రాహ్మణులకు మునుపువలె బ్రదుకు తెరువును చెల్లించుచున్నాడా? బ్రాహ్మణులకు మే మొసగిన మాన్యములను దుర్యోధనుడు ఊడగొట్టలేదు గదా!

కచ్చి ద్రాజా ధృతరాష్ట్రః సపుత్ర
ఉపేక్షతే బ్రాహ్మణాతిక్రమాన్ వై,

---

13. అమాత్యః - ఎల్లప్పుడు దగ్గరగానుండి మంతనములు చెప్పువాడు; విధేయః-చెప్పినదెల్ల విని పాటించువాడు.

14. మహానస్యః-వంటయింటి పనివారు (స్త్రీలు) భాగినేయాః-అక్కచెల్లెండ్ర బిడ్డలు; అవ్యలీకాః-కపటములేక మెలగువారు.

స్వర్గస్య కచ్చి న్న తథా వర్త్మభూతా-
ముపేక్షతే తేషు సదైవ వృత్తిమ్. 16

ఆ ధృతరాష్ట్రుడును, కొడుకులును బ్రాహ్మణులకు జరిగిన అన్యాయములను పట్టించుకొనకుండుట లేదు గదా! స్వర్గమునకు దారివంటి వారి జీవికను ఎన్నడు ఏమరకున్నాడు గదా!

ఏతజ్జ్యోతి శ్శోత్తమం జీవలోకే
శుక్లం ప్రజానాం విహితం విధాత్రా,
తే చే ద్దోషం న నియచ్ఛన్తి మన్దాః
కృత్స్నో నాశో భవితా కౌరవాణామ్. 17

బ్రహ్మవేత్తల బ్రదుకుతెరువును పరిరక్షించుట యనునది పరలోకమునకు ఉత్తమమైన కరదీపిక (కాగడా) వంటిది. ఇచట ప్రాణిలోకమున ప్రజలకు కీర్తిని కలిగించునది - ఇది బ్రహ్మ చేసిన ఏర్పాటు. ఆ బుద్ధిహీనులు బ్రాహ్మణ వృత్తులయందలి లోభమును అదుపులో పెట్టకున్నచో కౌరవులకు సంపూర్ణ వినాశము తప్పక కలుగును.

కచ్చి ద్రాజా ధృతరాష్ట్రః సపుత్రో
బుభూషతే వృత్తి మమాత్యవర్గే,
కచ్చి న్న భేదేన జిజీవిషన్తి
సుహృద్రూపా దుర్హృదై శ్చైకమత్యాత్. 18

---

16. ఉపేక్షతే - క్రింది వాక్యమునుండి 'న' శబ్దమును పైకి తెచ్చికొని 'ఉపేక్షింపరుగదా!' అను నర్థము చెప్పుకొనవలయును.

17. ఏతత్ - ఇది - బ్రాహ్మణుల జీవికను పరిరక్షించుట; జ్యోతిః- పరలోకమునకు వెలుగు చూపునది; శుక్లమ్ - కీర్తిని కలిగించునది; దోషమ్- లోభమును;

18. బుభూషతే - పొందింపగోరుచున్నారు; భేదేన జిజీవిషన్తి - శత్రువులచేత తమలో తాము పగవారై వారిచ్చు లంచపుసొమ్ములతో బ్రదుకగోరుచున్నారా? అని భావము.

ధృతరాష్ట్రుడును, ఆతని కొడుకులును, మంత్రిమండలియందలి వృత్తిని పరిరక్షింపగోరుదురా? వారు మిత్రులవలె నుండి పగవారితో ఐకమత్యముతో వ్యవహరించుచు భేదోపాయముతో బ్రతుకగోరరు కదా!

కచ్చి న్న పాపం కథయన్తి తాత
తే పాణ్డవానాం కురవః సర్వ ఏవ,
ద్రోణః సపుత్రశ్చ కృపశ్చ వీరో
నాస్మాసు పాపాని వదన్తి కచ్చిత్. 19

ఆ కౌరవు లందరు కూడి పాండవులనుగూర్చి పాపపుమాటలు పలుకరు గదా! ద్రోణుడు అతని కొడుకు, వీరుడగు కృపుడు మాయందు చెడుమాటలు ఆడకుందురుగదా!

కచ్చి ద్రాజ్యే ధృతరాష్ట్రం సపుత్రం
సమేత్యాహుః కురవః సర్వ ఏవ,
కచ్చి ద్దృష్ట్వా దస్యుసఙ్ఘాన్ సమేతాన్
స్మరన్తి పార్థస్య యుధాం ప్రణేతుః. 20

రాజ్యమున కౌరవు లందరు కలసి ధృతరాష్ట్రునకును, ఆతని కొడుకులకును శాంతి పొందుడని హితము చెప్పుదురా? ఒక్కుమ్మడిగా దొంగల మూకలను గాంచినపు డైనను, యుద్ధములను సమర్థముగా నిర్వహించు అర్జునుని వీరకృత్యములను వారు స్మరింతురు గదా!

మౌర్వీ భుజాగ్రప్రహితాన్ హి తాత
దోధూయమానేన ధనుర్ధరేణ,
గాణ్డీవనున్నాం స్తనయిత్నుఘోషా
నజిహ్మగాన్ కచ్చి దనుస్మరన్తి. 21

---

20. పార్థస్య - పార్థుని కృత్యమును అని భావము. యుధామ్ - యుద్ధముల యొక్క; ప్రణేతుః - నిర్వాహకుడైన అర్జునునియొక్క;

21. మౌర్వీ, భుజ, అగ్ర, ప్రహితాన్ - అల్లెత్రాడు బలముతో లాగగా ఏర్పడిన వంపు మౌర్వీభుజము - దాని అగ్ర మనగా - అంచువంటి ప్రదేశము. బాణపు పిడితగిలించు చోటు - దానినుండి, ప్రహితాన్ - ప్రయోగింపబడినవానిని;

శత్రువులను చెల్లాచెదురు చేయు మేటివిలుకాడగు అర్జునుని అల్లెత్రాటి పంపు కొననుండి వెలువడునవియు, గాండీవమునుండి దూసికొని వచ్చునవియు, ఉరుమువంటి ఘోష కలవియు నగు బాణములను వారు నిత్యము స్మరించుచుందురుగదా!

న చాపశ్యం కఞ్చిదహం పృథివ్యాం
యోధం సమం వాధిక మర్జునేన,
యస్యైకషష్టి ర్నిశితా స్తీక్ష్ణధారాః
సువాససః సంమతో హస్తవాపః. 22

భూమిపై అర్జునునకు దీటైనవాడు లేక మించువాడు అగు యోధుడు ఒక్కడును నాకు కానరాడు. మిక్కిలి పదునైనవి, మంచి పిడులుగలవియు నగు అరువదియొక్క బాణముల నాతడు ఒక్కచేతితో ఒక్కమారు ప్రయోగింపగలడు.

గదాపాణి ర్భీమసేన స్తరస్వీ
ప్రవేపయ ఞ్ఛత్రుసఙ్ఘా ననీకే,
నాగః ప్రభిన్న ఇవ నడ్వలేషు
చఙ్క్రమ్యతే కచ్చి దేనం స్మరన్తి. 23

గద చేత బట్టు మహాబలశాలి భీముడు శత్రువుల మూకలను వణకించుచు మదగజము పచ్చికబయళ్లలో గంతులు వేయునట్లు విహరించుచుండును. అట్టి యాతనిని స్మరింతురు గదా!

మాద్రీపుత్రః సహదేవః కలిఙ్గాన్
సమాగతా నజయ ద్దన్తకూరే,

22. సువాససః - దృఢమైన పిడులుగలవి; తీక్ష్ణధారాః - పదునెక్కిన అంచులు గలవి; హస్తవాపః - చేతి వాటము; అరువదియొక్క బాణముల నొక్కుమ్మడిగా అర్జునుడు గుప్పింపగలడని తాత్పర్యము.

23. నడ్వలేషు - పచ్చిక బయళ్లయందు;

వామే నాస్యన్ దక్షిణేనైవ యో వై
మహాబలం కచ్చిదేనం స్మరన్తి. 24

మాద్రికొడుకు సహదేవుడు ఎదురువచ్చిన కలింగులను యుద్ధమున, కుడియెడమచేతులతో బాణములను గుప్పించుచు, గెలిచెను. గొప్ప బలముగల ఆతనిని (కౌరవులు) స్మరింతురా?

పురా జేతుం నకులః ప్రేషితోఽయం
శిబీం స్త్రిగర్తాన్ సఞ్జయ పశ్యత స్తే,
దిశం ప్రతీచీం వశ మానయ న్మే
మాద్రీసుతం కచ్చి దేనం స్మరన్తి. 25

సంజయా ! నీవు చూచుచుండగా నకులుని శిబిత్రిగర్తదేశరాజులను గెలుచుటకు పంపితిని. అతడు పడమటి దిక్కు నంతటిని నా వశమునకు తెచ్చెను. అట్టి మాద్రికొడుకును (వారు) స్మరింతురా?

పరాభవో ద్వైతవనే య ఆసీ-
ద్దుర్మన్త్రితే ఘోషయాత్రాగతానామ్,
యత్ర మన్దా న్ఛత్రువశం ప్రయాతా
నమోచయ ద్భీమసేనో జయశ్చ. 26

పాడుబుద్ధితో ఘోషయాత్రకు వచ్చినపుడు ద్వైతవనమున వారికి గొప్ప అవమానము జరిగినది. అందు పగవారికి జిక్కి ఆ బుద్ధిహీనులు పోవుచుండగా భీముడును, అర్జునుడును వారిని విడిపించిరి.

అహం పశ్చా దర్జున మభ్యరక్షం
మాద్రీపుత్రౌ భీమసేనోఽభ్యరక్షత్,

---

24. దన్తకూరే—కూర మనగా అన్నము. పోరున క్రోధవశమున దంతములను కూరమునువలె కొరుకుదురు, గాన దంతకూర మనగా యుద్ధము (భారతీయ నిఘంటువు లన్నియు నీ యర్థమునే వ్రాసినవి. మోనియర్ విలియమ్సు మాత్రము అది ఒకచోటునకు పేరనెను).

26. జయః-అర్జునుడు.

గాండీవధన్వా శత్రుసఙ్ఘా నుదస్య
స్వస్త్యాగమ త్కచ్చి దేనం స్మరన్తి. 27

అపుడు నేను అర్జునుని వెనుక రక్షకుడనై యుంటిని. భీమసేనుడు నకులసహదేవుల వెనుక రక్షకుడై యుండెను. గాండీవము పట్టిన అర్జునుడు పగవారి మూకలను చెదరగొట్టి, క్షేమముతో తిరిగివచ్చెను. కౌరవులు దీనిని తలచుచుందురా?

న కర్మణా సాధు నైకేన నూనం
సుఖం శక్యం వై భవతీహ సఞ్జయ;
సర్వాత్మనా పరిజేతుం వయం చే-
న్న శక్నుమో ధృతరాష్ట్రస్య పుత్రమ్. 28

సంజయా! దానము, భేదము, దండము అను వానితో దుర్యోధనుని లొంగదీసుకొనజాలమేని, మంచితనముతో ఆతడు బొత్తుగా లొంగడు.

ఇతి శ్రీమహాభారతే ఉద్యోగపర్వణి సఞ్జయయానపర్వణి
యుధిష్ఠిరప్రశ్నే త్రయోవింశోఽధ్యాయః.

ఇది శ్రీమహాభారతము ఉద్యోగపర్వమున సంజయయానపర్వమున
యుధిష్ఠిరుని ప్రశ్నముగల ఇరువదిమూడవ అధ్యాయము.

—(౦)—

---

27. పృష్ఠరక్షకః-వెనుకనుండి రక్షించువాడు; అనగా పోయి వారిని రక్షింపుమని వెనుకనుండి ఎగదోసిన వాడని యర్థము; అట్లే భీమసేనుడును నకులసహదేవులను పురికొల్పెను. ఇట్లు ఆయిదుగురము కలిసి వారిని రక్షించితి మని తాత్పర్యము.

28. సర్వాత్మనా - అన్నివిధములగు ఉపాయములచేత; దానము, భేదము, దండము అనువానిచేత; న శక్నుమః చేత్ సుఖేన- సుఖముగా; జేతుం- గెలుచుటకు; నైవ శక్యం భవతి- శక్యము కానేకాదు; చేత్-అట్లయినచో

# చతుర్వింశోఽధ్యాయః - ఇరువదినాలుగవ అధ్యాయము

యుధిష్ఠిరప్రశ్నానా ముత్తరం వివృణ్వతః సఞ్జయస్య తం ప్రతి
రాజ్ఞో ధృతరాష్ట్రస్య సన్దేశం శ్రావయితుం ప్రతిజ్ఞానమ్.

**యుధిష్ఠిరుని ప్రశ్నములకు సమాధానము వివరించుచు సంజయుడు ఆతనికి ధృతరాష్ట్రుని సందేశమును వినిపించుటకు పూనుకొనుట.**

సఞ్జయ ఉవాచ-సంజయు డిట్లు పలికెను.

యదాఽఽత్థ మే పాణ్డవ తత్తథైవ
కురూన్ కురుశ్రేష్ఠ జనం చ పృచ్ఛసి,
అనామయా స్తాత మనస్విన స్తే
కురుశ్రేష్ఠాన్ పృచ్ఛసి పార్థ యాం స్త్వమ్. 1

పాండుతనయా! కురుశ్రేష్ఠా! కురువంశమువారినిగూర్చియు, అచటి జనమునుగూర్చియు నీవు పలికినదంతయు నట్టిదే. నీవు కుశల మడిగిన ఆ మాన ధను లందరు క్షేమముతో నున్నారు.

సన్త్యేవ వృద్ధా స్సాధవో ధార్తరాష్ట్రే
సన్త్యేవ పాపాః పాణ్డవ తస్య విద్ధి,
దద్యా ద్రిపుభ్యోఽపి హి ధార్తరాష్ట్రః
కుతో దాయాం ల్లోపయే ద్బ్రాహ్మణానామ్. 2

ఆ ధృతరాష్ట్రునికొడుకునొద్ద మంచితనముగల పెద్దలును ఉన్నారు. పాపులును ఉన్నారు. ఆ దుర్యోధనుడు పగవారికైనను ఇచ్చును. బ్రహ్మవేత్తల మాన్యములకు లోపము రానిచ్చునా?

యద్యుష్మాకం వర్తతే సౌనధర్మ్య
మద్రుగ్ధేషు ద్రుగ్ధవ త్తన్న సాధు,

మిత్రధ్రుక్ స్యాత్ ధృతరాష్ట్రః సపుత్రో
యుష్మాన్ ద్విషన్ సాధువృత్తా నసాధుః. 3

ఆ ధృతరాష్ట్రుని కొడుకులు మీ రే యపకారమును చేయలేదు. చేసినట్లు వారు మీయందు క్రూరముగా ప్రవర్తించుచున్నారు. అది మంచిది కాదు. కొడుకులతో కలిసి ఆ ధృతరాష్ట్రుడు మంచి నడవడి కల మిమ్ము ద్వేషించుచు మిత్రద్రోహియై తానే చెడును.

న చానుజానాతి భృశం చ తప్యతే
శోచత్యన్తః స్థవిరోఽజాతశత్రో,
శృణోతి హి బ్రాహ్మణానాం సమేత్య
మిత్రద్రోహః పాతకేభ్యో గరీయాన్. 4

అజాతశత్రూ! ఆ ముసలడు సంధికి ఒప్పుకొనడు. మరియు మిక్కిలిగా ఉడికిపోవుచున్నాడు. లోలోపల కుమిలిపోవుచుండును. కూడిన బ్రాహ్మణు లందరు మిత్రద్రోహము పాతకము లన్నింటికంటె మిన్న అని చెప్పగా వినుచునే యుండును.

స్మరన్తి తుభ్యం నరదేవ సంయుగే
యుద్ధే చ జిష్ణోశ్చ యుధాం ప్రణేతుః,
సముత్కృష్టే దున్దుభిశఙ్ఖశబ్దే
గదాపాణిం భీమసేనం స్మరన్తి. 5

---

3. అద్రుగ్ధేషు - అపకారము చేయబడనివారు; ద్రుగ్ధవత్ - అపకారము చేయబడిన వానికివలె; సౌనః - హింసకుల; సౌనధర్మ్యమ్ - హింసకుల ధర్మమునుండి తొలగని (క్రౌర్యము అని భావము) మీరు వారివలన అపకారము పొందియు వారియందు ద్రోహము తలపెట్టలేదు. ఇప్పుడు అసలే పెట్టరాదని తాత్పర్యము.

4. న చ అనుజానాతి - సంధిని అనుమతింపడు. తప్యతే-పుత్రనాశభయము వలన కుములుచున్నాడని భావము.

మహాప్రభూ! వారు నిన్ను యుద్ధవిషయమున స్మరింతురు. యుద్ధములలో ఆరితేరిన అర్జునుని కూడ స్మరింతురు. దుందుభులు, శంఖములు మ్రోయునప్పుడు గద చేపట్టిన భీమసేనుని కూడ స్మరింతురు.

మాద్రీసుతౌ చాపి రణాజిమధ్యే
సర్వా దిశః సంపతన్తౌ స్మరన్తి,
సేనాం వర్షన్తౌ శరవర్షై రజస్రం
మహారథౌ సమరే దుష్ప్రకమ్పౌ. 6

యోధుల సింహనాదములతో కూడిన యుద్ధరంగమున అన్నివైపులకు ఉరుకుచు, సేనపై బాణముల వర్షమును ఎడతెగని విధమున కురియుచు, నిలుపదొరికకొని పోరెడు మహారథు లగు నకుల సహదేవులను కూడ వారు తలచుచునే యున్నారు.

న త్వేవ మన్యే పురుషస్య రాజ -
న్ననాగతం జ్ఞాయతే యద్భవిష్యమ్,
త్వం చే త్తథా సర్వధర్మోపపన్నః
ప్రాప్తః క్లేశం పాణ్డవ కృచ్ఛ్రరూపమ్. 7

పాండుకుమారా! సర్వధర్మముల నెరిగి యాచరించువాడవైన నీకు ఇంత ఘోరమగు కష్టము దాపురించె నన్నచో, పురుషునకు ముందేమి జరుగునో యెఱుగరాదని సంభావింతును.

త్వమే వైతత్ కృచ్ఛ్రగతశ్చ భూయః
సమీకుర్యాః ప్రజ్ఞయాఽజాతశత్రో! 7

---

6. రణ, ఆజి, మధ్యే-రణమనగా యోధులఅరపుల ధ్వని, రణాజి అనగా అట్టి అరపులతోకూడిన యుద్ధము - దాని మధ్యమున - "రక్షణస్త్రాణే రణః క్వణే"-అమరము; సంపతన్తౌ - జంకుగొంకులు లేక శత్రువులపై పడువారు;

7. అనాగతమ్-తెలియనిది, అదృష్ట మని భావము.

ఓయీ! అజాతశత్రూ! ఇంత కష్టము పొందిన నీవే స్వయముగా నీ బుద్ధిబలముతో అంతటిని చక్కజేయవలయును.

న కామార్థం సన్త్యజేయు ర్హి ధర్మం
పాణ్డోః సుతాః సర్వఏ వేన్ద్రకల్పాః,
త్వమే వైతత్ ప్రజ్ఞయాఽజాతశత్రో
సమీకుర్యా యేన శర్మాప్నుయు స్తే. 8

ధార్తరాష్ట్రాః పాణ్డవాః సృఞ్జయాశ్చ
యే చాప్యన్యే సంనివిష్టా నరేన్ద్రాః,

పాండునికొడుకు లందరు దేవేంద్రునంతటివారు. ఏవో కోరికలకొరకు ధర్మము నెన్నటికిని విడువరు. ఓ అజాతశత్రూ: నీ ప్రజ్ఞ నుపయోగించి, ఆ ధార్తరాష్ట్రులు, పాండవులు, సృంజయులు, మరియు వచ్చిన రాజులు సుఖ మొందు మార్గమును సరిజేయవలయును.

యన్మాం బ్రవీ ద్ధృతరాష్ట్రో నిశాయా
మజాతశత్రో వచనం పితా తే. 9

సహామాత్యః సహపుత్రశ్చ రాజన్
సమేత్య తాం వాచ మిమాం నిబోధ. 10

రాజా ! అజాతశత్రూ ! మీ నాయన మంత్రులు, కొడుకులు ఉన్న సమయమున రాత్రి నాకు చెప్పిన మాటలు చెప్పుదును. వినుము.

ఇతి శ్రీమహాభారతే ఉద్యోగపర్వణి సఞ్జయవాక్యే
చతుర్వింశోఽధ్యాయః.

ఇది శ్రీమహాభారతము ఉద్యోగపర్వమున సంజయవాక్యము గల
ఇరువది నాల్గవ అధ్యాయము.

—(o)—

8. సమీకుర్యాః-ఈ కలహరూపమైన విషయము అణగునట్లు సమస్థితిని నీవు చేయవలయునని భావము.

## పఞ్చవింశోఽధ్యాయః - ఇరువది యైదవ అధ్యాయము

సఞ్జయస్య యుధిష్ఠిరం ప్రతి ధృతరాష్ట్ర
సన్దేశశ్రావణం స్వతః శమాయ ప్రార్థనం చ.

సంజయుడు ధర్మరాజునకు ధృతరాష్ట్రుని సందేశమును
వినిపించుట. తానై శాంతికొరకు ప్రార్థించుట.

యుధిష్ఠిర ఉవాచ - యుధిష్ఠిరు డిట్లు పలికెను.

సమాగతాః పాణ్డవాః సృంజయాశ్చ
జనార్దనో యుయుధానో విరాటః,
యత్ తే వాక్యం ధృతరాష్ట్రానుశిష్టం
గావల్గణే బ్రూహి తత్ సూతపుత్ర ! 1

ఓయీ! గావల్గణీ! సంజయా! ఇదిగో పాండవులు,సృంజయులు,జనార్దనుడు. సాత్యకి, విరాటుడు - అందరు వచ్చియే యున్నారు. ధృతరాష్ట్రుడు నీకు చెప్పిన ఆ మాట యేమో చెప్పుము.

సఞ్జయ ఉవాచ - సంజయు డిట్లు చెప్పెను.

అజాతశత్రుం చ వృకోదరం చ
ధనఞ్జయం మాద్రవతీసుతౌ చ,
ఆమన్త్రయే వాసుదేవం చ శౌరిం
యుయుధానం చేకితానం విరాటమ్. 2

ధర్మరాజును, భీముని, అర్జునుని, మాద్రికొడుకులను, శ్రీకృష్ణుని, సాత్యకిని, చేకితానుని, విరాటుని సంబోధించుచున్నాను.

పఞ్చాలానా మధిపం చైవ వృద్ధం
ధృష్టద్యుమ్నం, పార్షతం యాజ్ఞసేనిమ్,

సర్వే వాచం శృణుతేమాం మదీయాం
వక్ష్యామి యాం భూతి మిచ్ఛన్ కురూణామ్. 3

పాంచాలరాజు పెద్దవాడు నగు ద్రుపదుని, అతని కొడుకు ధృష్టద్యుమ్నుని కూడ సంబోధింతును. మీ రందరు నాదైన మాట వినుడు. ఇది కురువంశము వారికి శుభమును గోరి పలుకుచున్నాను.

శమం రాజా ధృతరాష్ట్రోఽభినన్ద-
న్నయోజయ త్త్వరమాణో రథం మే,
సభ్రాతృపుత్రస్వజనస్య రాజ్ఞ
స్తద్రోచతాం పాణ్డవానాం శమోఽస్తు. 4

ఆ ధృతరాష్ట్రమహారాజు శాంతినే అభిలషించుచు నా రథమును వడి వడిగా సిద్ధము చేయించెను. అత డప్పుడు తమ్మునితో కొడుకులతో తనవారితో కలసియే యున్నాడు. అట్టి రాజుపలుకు మీకు రుచించుగాక! దానివలన శాంతి ఏర్పడుగాక!

సర్వే ర్ధర్మైః సముపేతాః స్థ పార్థాః
సంస్థానేన మార్దవేనార్జవేన,
జాతాః కులే అనృశంసా వదాన్యా
హ్రీనిషేవాః కర్మణాం నిశ్చయజ్ఞాః. 5

కుంతికొడుకులగు మీరు అన్ని ధర్మములు కలవారు. చక్కని ఆకారము, మెత్తదనము, ఋజుత్వము—వీరియందు కలవు. మంచి కులమున పుట్టిన వారు.

---

4. రథ మయోజయత్-తనంత తాను సేవకుడగు నాకు ఇక్కడకు వచ్చుటకు రథము సిద్ధము చేయించె ననగా శాంతిమీద నాతని కెంత పట్టుదలయో ఊహింపుడని భావము.

5. సంస్థానేన - ఆకారముచేత; మార్దవేన - కృపచేత; ఆర్జవేన-వంచనలేనితనముచేత: హ్రీనిషేవాః-తప్పుడు పనులకు సిగ్గు పడువారని తాత్పర్యము; వదాన్యాః-ముచ్చట గొలుపు మాటలుగలవారు లేక దానగుణము గలవారు.

మిడిసిపడువారు కారు. మాటపొందికతనము, ఉచిత మగు సిగ్గు కలవారు. ఆయా కార్యముల నిశ్చయములు చక్కగా నెఱిగినవారు.

న యుజ్యతే కర్మ యుష్మాసు హీనం
సత్త్వం హి వ స్తాదృశం భీమసేనాః,
ఉద్భాసతే హ్యఞ్జనబిందువత్ త-
చ్ఛుభ్రే వస్త్రే యద్భవేత్ కిల్బిషం వః. 6

మీకు హీనమగు కార్యము తగదు గదా! ఏలయన మీ మంచితన మటువంటిది. ఇప్పుడు మీరు భయంకరమైన సేనను కూర్చుకొనియున్నారు. మీదైన యీ తప్పు తెల్లనిగుడ్డయందు కాటుక మచ్చవలె తెల్లమగుచున్నది.

సర్వక్షయో దృశ్యతే యత్ర కృత్స్నః
పాపోదయో నిరయోఽభావసంస్థః,
కస్తత్ కుర్యా జ్జాతు కర్మ ప్రజానన్
పరాజయో యత్ర సమో జయశ్చ. 7

ఇందు (యుద్ధమునందు) సంపూర్ణముగా సర్వనాశనము కానవచ్చుచున్నది. ఇందు పాపములే ఉదయించును. చివరకు మిగులునది సున్న. సుఖము బొత్తుగా లేదు. ఎఱిగి యెఱిగి యిట్టి పని నెవ్వడు చేయును? అందు గెలుపును ఓటమియును సమానమే.

తే వై ధన్యా యైః కృతం జ్ఞాతికార్యం
యే వః పుత్రాః సుహృదో బాన్ధవాశ్చ,

---

6. హీనమ్-క్రూరమగు పని; సత్త్వం = బుద్ధిబలము లేక మంచితనము; భీమసేనాః-భయము గొల్పు సేనగలవారు; అంజనబిందువత్-కాటుక మరకవలె;

7. నిరయః - సుఖములేనిది. అభావసంస్థః - శూన్యమునందు నిలుచునది. అనగా తుదకేమియు మిగులదని భావము; జయః పరాజయః సమః - బంధువులు నశించుటవలన గెలిచినను అది ఓటమివంటిదే యని భావము.

ఉపక్రుష్టం జీవితం సంత్యజేయు-
స్తతః కురూణాం నియతో వైభవః స్యాత్. 8

జ్ఞాతులకు మేలు చేసిన మీరు ధన్యులరు. అంతలివారు మీకు పుత్రులు, మిత్రములు, చుట్టములే కదా! లేనిచో వారు తమ పాడుబ్రదుకును వీడవలసి వచ్చెడిది. మీ రక్షణవలన కురువంశము వారికి బ్రదుకు నిలిచినది.

తే చేత్ కురూ ననుశిష్యాథ పార్థా
నిర్ణీయ సర్వాన్ ద్విషతో నిగృహ్య,
సమం వ స్తజ్జీవితం మృత్యునా స్యా-
ద్య జ్జీవధ్వం జ్ఞాతివధే న సాధు. 9

అట్టి మీరే, ఓ పార్థులారా! కురువంశము వారిని శాసించి, యుద్ధమును నిర్ణయించి, పగవారి నందరిని చంపుదురేని, ఆ మీబ్రతుకు చావుతో సమానము. దగ్గర చుట్టములను జంపి జీవించుట మేలు కాదు గదా!

కో హ్యేవ యుష్మాన్ సహ కేశవేన
సచేకితానాన్ పార్షతబాహుగుప్తాన్,
ససాత్యకీన్ విషహేత ప్రజేతుం
లబ్ధ్వాపి దేవాన్ సచివాన్ సహేన్ద్రాన్. 10

ఇంద్రునితోపాటు దేవతలందరు తోడై వచ్చినను, కృష్ణునితోపాటు, చేకితానుడు, సాత్యకి, సహాయులుగా నున్న మిమ్ము, ధృష్టద్యుమ్నుని భుజము రక్షించుచున్న మిమ్ము గెలువగలవా డెవ్వడు?

---

8. జ్ఞాతికార్యమ్ - ఘోషయాత్రలో గంధర్వులవలన రక్షించుట మొదలగు నది; ఉపక్రుష్టం - నిందింపబడినది.
9. నిర్ణీయ - (యుద్ధము చేయుటకే) నిర్ణయించి; నిగృహ్య - చంపి; జ్ఞాతి వధే - దగ్గర బంధువులను చంపుటయందు;
10, 11 - రెండు శ్లోకములందలి కః, హి - అను పదములు యుద్ధమున జయము, అపజయము అనునవి అనిత్యము లను అర్థమును సూచించు చున్నవి.

కో వా కురూన్ ద్రోణభీష్మాభిగుప్తా
నశ్వత్థామ్నా శల్యకృపాదిభిశ్చ,
రణే విజేతుం విషహేత రాజన్
రాధేయగుప్తాన్ సహ భూమిపాలైః. 11

అట్లే ఆ కౌరవులను, ద్రోణుడు, భీష్ముడు, అశ్వత్థామ, శల్యుడు, కృపుడు, కర్ణుడు - ఇంకను పెక్కురు రాజులు ప్రాణములొడ్డి రక్షించుచున్నారు. అట్టివారిని గెలువగలవా డెవ్వడు?

మహద్బలం ధార్తరాష్ట్రస్య రాజ్ఞః
కో వై శక్తో హన్తు మక్షీయమాణః,
సోఽహం జయే చైవ పరాజయే చ
నిఃశ్రేయసం నాధిగచ్ఛామి కిఞ్చిత్. 12

రాజైన దుర్యోధనుని సేన చాల పెద్దది. తాను తరుగువోకుండ దానిని పరిమార్చుటకు చాలినవా డెవ్వడు? గెలుపో, ఓటమియో నిశ్చయము పొంద జాలకున్నాను.

కథం హి నీచా ఇవ దౌష్కులేయా
నిర్ధర్మార్థకం కర్మ కుర్యుశ్చ పార్థాః. 13

ధర్మమునకు, అర్థమునకు కాని పనిని నీచులు, పాడుకులమున పుట్టినవారు చేసినట్లు పృథకొడుకు లెట్లు చేయుదురు?

సోఽహం ప్రసాద్య ప్రణతో వాసుదేవం
పఞ్చాలానా మధిపం చైవ వృద్ధమ్. 13
కృతాఞ్జలిః శరణం వః ప్రపద్యే
కథం స్వస్తి స్యాత్ కురుసృఞ్జయానామ్,

---

12. నిః శ్రేయసమ్ - నిశ్చయము;

13. నిర్ధర్మార్థమ్ - ధర్మమునకు, అర్థమునకు విరుద్ధమైన దానిని; దౌష్కులేయాః - కులముచెడిన దానికి పుట్టినవారు;

న హ్యేన మేవం వచనం వాసుదేవో
ధనఞ్జయో వా జాతు కించి న్న కుర్యాత్. 14

అట్లు శాంతికై వచ్చిన నేను, వాసుదేవుని, పెద్దవాడైన ద్రుపదుని ప్రసన్నుల చేసికొని, మ్రొక్కి, చేతులు మోడ్చి, మిమ్ము శరణు వేడుకొనుచున్నాను. లేనిచో, కౌరవులకు, సృంజయులకు స్వస్తి ఎట్లు సమకూడును? ఇట్లుకా దిట్లు కాదని వాసుదేవుడు కాని అర్జునుడు కాని మరొకమాట పలుకరాదు.

ప్రాణాన్ దద్యా ద్యాచమానః కుతోఽన్య-
దేత ద్విద్వన్ సాధనార్థం బ్రవీమి,
ఏత ద్రాజ్ఞో భీష్మపురోగమస్య
మతం యద్వః శా న్తిరిహోత్తమా స్యాత్. 15

ఈ కృష్ణుడు, ఈ అర్జునుడు వేడినచో ప్రాణమైన నిత్తురు. తక్కినదాని సంగతి చెప్పనేల? అన్నియు నెఱిగినవాడా! ఇది యంతయు కార్యసాధనకై పలుకుచున్నాను. మీకు శాంతియే ఉత్తమమైనది. భీష్ముని ముందిడుకొనిన ధృతరాష్ట్రున కిది సమ్మతమైన విషయము.

ఇతి శ్రీమహాభారతే ఉద్యోగపర్వణి సఞ్జయయానపర్వణి
సఞ్జయవాక్యే పఞ్చవింశోఽధ్యాయః.

ఇది శ్రీమహాభారతమున ఉద్యోగపర్వమున సంజయయానపర్వమున
సంజయవాక్యము గల ఇరువదియైదవ అధ్యాయము.

—(౦)—

# షడ్వింశోఽధ్యాయః - ఇరువదియాఱవ అధ్యాయము

ఇన్ద్రప్రస్థప్రదానేనైవ శాన్తి రితి యుధిష్ఠిరస్య
సఞ్జయం ప్రత్యుక్తిః.

ఇంద్రప్రస్థము నొసగినప్పుడే శాంతి యని ధర్మరాజు
సంజయునకు బదులు చెప్పుట

ఈ అధ్యాయమునందలి సంజయుని పలుకులలో ఎన్నో ధోరణులు కన్పట్టుచున్నవి. 'జయముకూడ పరాజయమే' అనుటలో దీనముగా ప్రార్థించుట, "కౌరవుల నెవ్వడు గెలుచును?" అనుటలో బెదరించుట, "స్వస్తి యెట్లగును?" అనుటలో రెండు పక్షములు నశించు నని సూచించుట, "కార్యసాధనకై పలుకుచున్నాను" అనుటలో సంధికార్యము సిద్ధించుటకే కాని మిమ్ములను భయపెట్టుటకు కాదనుట వ్యక్తము లగుచున్నవి.

యుధిష్ఠిర ఉవాచ - యుధిష్ఠిరు డిట్లు పలికెను.

కాం ను వాచం సఞ్జయ మే శృణోషి
యుద్ధైషిణీం యేన యుద్ధా ద్బిభేషి.
అయుద్ధం వై తాత యుద్ధా ద్గరీయః
క స్తల్లబ్ధ్వా జాతు యుధ్యేత సూత ! 1

సంజయా! యుద్ధమును కోరిన యే మాటను నావలన వింటివి? యుద్ధమునుగూర్చి బెదరుచున్నావు. యుద్ధముకంటె యుద్ధము కాకుండుటయే గొప్పది. అది సమకూడినచో ఎవ్వడైన ఎప్పుడైన యుద్ధము చేయునా?

అకుర్వత శ్చేత్ పురుషస్య సఞ్జయ
సిద్ధ్యేత్ సఙ్కల్పో మనసోఽయం యమిచ్ఛేత్,
న కర్మ కుర్యా ద్విదితం మమైత
దన్యత్ర యుద్ధా ద్బహు యల్లఘీయః. 2

---

2. అకుర్వతః - చేయని వానికి సంకల్పము నెరవేరినచో పనియే చేయడు. అట్లు నెరవేరనిచో ఎట్టి చిన్నపనినైనను చేయును.

ఏ పనియు చేయకయే మనసున కోరిన సంకల్పమెల్ల నెరవేరినచో పురుషు దేపనియు చేయడు. ఇది నే నెఱుగుదును. యుద్ధమే యేల? దానికన్న చాల చిన్నపనియు చేయడు.

కుతో యుద్ధం జాతు నరోఽవగచ్ఛేత్
కో దేవశప్తో హి వృణీత యుద్ధమ్,
సుఖైషిణః కర్మ కుర్వన్తి పార్థా
ధర్మా దహీనం యచ్చ లోకస్య పథ్యమ్. 3

నరుడు ఊరక యుద్ధము నే కారణమున వాంఛించును? ఎవడో దేవతల శాపమొందినవాడు పోరు గోరును. పాండవులు సుఖమునే కోరుదురు. ధర్మము నుండి భ్రష్టముకానిది, లోకమునకు హితమైనది యగు పనినే చేయుదురు.

ధర్మోదయం సుఖ మాశంసమానాః
కృచ్ఛ్రోపాయం తత్త్వతః కర్మ దుఃఖమ్,
సుఖం ప్రేప్సు ర్విజిఘాంసు శ్చ దుఃఖం
య ఇన్ద్రియాణాం ప్రీతిరసానుగామీ. 4

పాండవులు ధర్మమునుండి పుట్టిన సుఖమును మాత్రమే ఆశించువారు. ఇంద్రియముల రుచి మరగి, వానివెంట బోవు నరుడు సుఖము పొందగోరిన వాడై దుఃఖమును రూపుమాపగోరినవాడై నిజమునకు దుఃఖమును కలిగించునదే యగు కర్మమును చేయుచుండును. కర్మము కష్టపడి సాధింపవలసినది కనుక దుఃఖకరము.

కామాభిధ్యా స్వశరీరం దునోతి
యయా ప్రముక్తో న కరోతి దుఃఖమ్,

కామములపై వాంఛ తన శరీరమును పీడించును. దానిని విడచిన వాడు దుఃఖము పొందడు.

---

3. అహీనమ్ - తొలగనిది.
4. ధర్మోదయమ్ - ధర్మమునుండి పుట్టినది - వేసవి కాలమున గంగా స్నానము వలన కలుగునట్టిది; హింస వలన పుట్టునది ధర్మోదయము కాదు; కృచ్ఛ్రోపాయమ్ - క్లేశములతో సాధింపబడినది.

యథేధ్యమానస్య సమిద్ధతేజసో
భూయో బలం వర్ధతే పావకస్య. 5
కామార్థలాభేన తథైవ భూయో
న తృప్యతే సర్పిషే వాగ్నిరిద్ధః.

మండుచున్న అగ్నికి కట్టెలు వేయుచున్నకొలది బలము పెరుగుచునే యుండును. అట్లే కోరిన అర్థములు సిద్ధించుచున్నచో నేతితో మండెడు అగ్నివలె మానవుడు తృప్తి నొందడు.

సంపశ్యేమం భోగచయం మహాన్తం
సహాస్మాభి ర్ధృతరాష్ట్రస్య రాజ్ఞః. 6

మాతో కూడిన ధృతరాష్ట్రమహారాజుయొక్క భోగముల సముదాయ మెంత గొప్పదో పరికించి చూడుము.

నాశ్రేయా నీశ్వరో విగ్రహాణాం
నాశ్రేయా న్వై గీతశబ్దం శృణోతి,
నాశ్రేయా న్వై సేవతే మాల్యగన్ధా
న్నచాప్యశ్రేయా ననులేపనాని. 7

---

5. కామ + అభిధ్యా - విషయములను గూర్చి ధ్యానించుట యయా - విషయములను విస్మరించినచో వానికి దుఃఖమే లేదని తాత్పర్యము. భోగముల నుండి విడివడుట సంభవింపదని భావము.

6. సంపశ్య - ధృతరాష్ట్రుడు తన కొడుకులు నూరుగురితో పాటు మా అయిదుగురిని కలుపుకొన్నను తరుగున దేమియు లేదు. కాని అత డంతయు తనకే కావలయునన్న బుద్ధితో మమ్ము దూరముగా తరిమెను. అయినను తృప్తి నొందడు; అని తాత్పర్యము.

7. పెద తండ్రిని నిందించుచున్నాడ నను భీతితో ధర్మరాజు ఇట్లు పలుకు చున్నాడు. మహా భాగ్యము వలననే విరోధము పెట్టుకొని శత్రువును సాధింప గలుగుట, గీతాదులు వినుట మొదలగు మహాభోగము లనుభ వించుట జరుగును. కానీ, అట్టివి ఊరక లభించునా? మేము అడవులలో కష్టములు పొందుట మొదలగున దంతయు మా దోషము వలననే కాని పరుల అపరాధము వలన కాదని ధర్మజుని తాత్పర్యము.

ఎంతో పుణ్యము చేసికొన్నవాడే విరోధములపై ప్రభువు కాగలడు. అట్టి వానికి గీతశబ్దములు, మాల్యగంధములు, మైపూతలు లభించును.

నాశ్రేయాన్ వై ప్రావారాన్ సంవివసే
కథం త్వస్మాన్ సంప్రణుదేత్ కురుభ్యః,
అత్రైవ స్యా దబుధస్యైవ కామః
ప్రాయః శరీరే హృదయం దునోతి. 8

శుభములు పొందజాలనివాడు శ్రేష్ఠములగు వస్త్రములు ధరింపజాలడు. (మేము పుణ్యవంతులమైనచో) రాజు (ధృతరాష్ట్రుడు) మమ్ములను కురు వంశమునుండి ఏల దూరము చేయును? అయినను రాజ్యమునందలి యీ కామము అవివేకి యైన వానికే ఉచితము. ఏలయన అది దేహము నడుమ నున్న గుండెను పిండి చేయుచుండును.

స్వయం రాజా విషమస్థః పరేషు
సామర్థ్య మన్విచ్ఛతి తన్న సాధు,
యథాత్మనః పశ్యతి వృత్త మేవ
తథా పరేషామపి సోఽభ్యుపైతి. 9

---

7-8 శ్లోకముల భావ మిట్లు గ్రహింపనగును. మాకు తగినంత పుణ్యము లేదు. కావుననే భోగములకు దూరమైతిమి. ధృతరాష్ట్రుడు మమ్మును దూరము చేయుట కూడ మా భాగ్యహీనత వలననే. రాజ్యవాంఛ తెలివితక్కువవాడగు దుర్యోధనుని వంటి వానికే ఉచితము. నావంటి వాని కది పనికిరాదు. ఇట్టిది అంతయు కోపముతో కూడిన అధి క్షేపణముగా భావింపదగును.

8. సంప్రణుదేత్ - దూర మొనర్చును; శరీరే హృదయమ్ - శరీరము నడుమ నున్న హృదయమును; దునోతి - పీడించును.

9. విషమస్థః - సంకటములలో నున్నవాడు, కనుకనే యితరుల సాయ మర్థించుచున్నాడని భావము; ఆత్మనః వృత్తమ్ - తన ప్రవృత్తిని అనగా అశక్తత్వమును; పరేషామ్ - కర్ణుడు మొదలగు వారి అశక్తతను, అభ్యుపైతి - పొందును. అనగా కర్ణుడు మొదలగువారు వాని కొరగ బెట్టునది యేమియు నుండదని తాత్పర్యము.

ఆ రాజు దుర్యోధనుడు స్వయముగా సంకటములలో నున్నవాడై పరులగు కర్ణుడు మొదలగువారియందలి సామర్థ్యమును వాంఛించుచున్నాడు. అది మంచిది కాదు. తన అశక్తత యెట్టిదో యట్టిదానినే పరులగు కర్ణాదులవలన బొందును.

ఆసన్న మగ్నిం తు నిదాఘకాలే
గంభీరకక్షే గహనే విసృజ్య,
యథా వివృద్ధం వాయువశేన శోచేత్
క్షేమం ముముక్షుః శిశిరవ్యపాయే. 10

వసంతర్తువున మట్టమధ్యాహ్నమున తనకడ నున్న నిప్పును దట్టముగా గడ్డియున్న అడవిలో పడవైచి అది గాలిపాటునకు బాగుగా మండుచుండగా దాని నుండి బయటపడి క్షేమము నొందగోరెడు మూర్ఖుని వంటివాడు ఆ దుర్యోధనుడు.

ప్రాప్తైశ్వర్యో ధృతరాష్ట్రోఽద్య రాజా
లాలప్యతే సఞ్జయ కస్య హేతోః,
ప్రగృహ్య దుర్బుద్ధి మనార్జవే రతం
పుత్రం మన్దం మూఢ మమన్త్రిణం తు. 11

ఐశ్వర్యమును చేజిక్కించుకొన్న ధృతరాష్ట్రుడు, దుష్టబుద్ధియు, వంకర పనులయందు ప్రీతిగలవాడు, బుద్ధిహీనుడు, చెప్పినను తెలియనివాడు, చక్కగా బుద్ధిచెప్పువారు లేనివాడు నగు కొడుకునుబట్టి ప్రాకులాడుచు సిప్పుడు వగ పలుకులు పలుకనేల?

అనాప్తవ చ్చాప్తతమస్య వాచః
సుయోధనో విదుర స్యావమత్య,

---

10. శిశిరవ్యపాయే - శిశిరము గడచిన పిమ్మట వసంతకాలమున (అగ్ని ప్రజ్వరిల్లుట నిది సూచించును) నిదాఘకాలే - మధ్యాహ్నకాలమున (తీవ్రతను సూచించును). గంభీరకక్షే-మిక్కుటమగు గడ్డికల, గహనే-అడవియందు, ముముక్షుః-మంటనుండి బయటపడ గోరినవాడు.

11. మన్దమ్-బుద్ధిహీనుని, లాలప్యతే-దీనమైన పలుకులు పలుకుచున్నాడు.

సుతస్య రాజా ధృతరాష్ట్రః ప్రియైషీ
సంబుధ్యమానో విశతేఽధర్మమేవ. 12

ఆ విదురుడు వారికి మిక్కిలి ఆప్తుడు. దుర్యోధనుడును, కొడుకు నిచ్చకమునే కోరెడు ధృతరాష్ట్రుడును, అహితునివలె అతనిని (విదురుని) లెక్కసేయక, ఎంత చెప్పినను అధర్మమునే పట్టి వ్రేలాడుచున్నాడు.

మేధావినం హ్యర్థకామం కురూణాం
బహుశ్రుతం వాగ్మినం శీలవన్తం,
స తం రాజా ధృతరాష్ట్రః కురుభ్యో
న సస్మార విదురం పుత్రకామ్యాత్. 13

నిండైన ప్రజ్ఞగలవాడు, కురువంశమువారి అర్థకామములనే ఎల్లప్పుడు కాంక్షించువాడు, అనేకశాస్త్రములను చక్కగా నేర్చినవాడు, పొందికగా పలుక నేర్చినవాడు, మంచిశీలము గలవాడు నగు విదురుని-కొడుకుమీది పిచ్చిప్రేమతో ధృతరాష్ట్రుడు - కౌరవులకొరకైనను తలపకున్నాడు.

మానఘ్నస్యాసౌ మానకామస్య చేర్ష్యోః
సంరంభిణ శ్చార్థధర్మాతిగస్య,
దుర్భాషిణో మన్యువశానుగస్య
కామాత్మనో దౌర్హృదై ర్భావితస్య. 14

అనేయస్యాశ్రేయసో దీర్ఘమన్యో
ర్మిత్రద్రుహః సంజయ పాపబుద్ధేః,
సుతస్య రాజా ధృతరాష్ట్రః ప్రియైషీ
ప్రపశ్యమానః ప్రాజహౌ ధర్మకామౌ. 15

---

14. ఈర్ష్యోః - ఇతరుల గొప్పతనమును సహింపనివాడు; సంరంభిణః-క్రోధము గలవాడు; మన్యువశానుగస్య - దీనులగు కర్షాదులకు వశమై తిరుగువాడు; దౌర్హృదైః - పాపములచేత; భావితస్య - పూజింపబడువాడు;

15. అనేయస్య - ఒకరు చక్కదిద్దుటకు వీలులేనివాడు; అశ్రేయసః - భాగ్యహీనుడు, ప్రపశ్యమానః - చూచుచుండియు;

ఆ దుర్యోధనుడు ఇతరుల మానమును రూపుమాపువాడు. తన మానమునే కాంక్షించువాడు, ఇతరుల గొప్పతనమును సహింపనివాడు, కోపిష్ఠుడు, అర్థమును ధర్మమును లెక్క చేయనివాడు, నీచముగా మాటాడువాడు, దీనులైన వారి వెంట బోవువాడు, కోరికలు నిండిన ఎదద కలవాడు, పాపుల మన్ననలను పొందువాడు, ఎవ్వరి శిక్షణమును లొంగనివాడు, భాగ్యహీనుడు, పట్టినపట్టు విడువనివాడు, మిత్రులకును ద్రోహము చేయువాడు, పాపబుద్ధి. సంజయా ! ఈ ధృతరాష్ట్రుడు అట్టి కొడుకు ప్రియమును కోరుచు తెలిసి తెలిసి అర్థకామములను విడనాడెను.

తదైవ మే సఞ్జయ దీవ్యతోఽభూ -
న్మతిః కురూణా మాగతః స్యాదభావః,
కావ్యాం వాచం విదురో భాషమాణో
న విన్దతే యద్ధార్తరాష్ట్రాత్ ప్రశంసామ్. 16

సంజయా ! జూదమాడుచున్న నా కానాడే ఈ కౌరవులకు వినాశకాలము దాపురించిన దని తోచినది. ఏల యన ఋషిపలుకువంటి పలుకు పలుకుచున్న విదురుడు దుర్యోధనునినుండి ప్రశంసను పొందజాలకపోయెను.

క్షత్తు ర్యదా నాన్వవర్తన్త బుద్ధిం
కృచ్ఛ్రం కురూన్ సూత తదాభ్యాజగామ,
యావత్ ప్రజ్ఞా మన్వవర్తన్త తస్య
తావ త్తేషాం రాష్ట్రవృద్ధి ర్బభూవ. 17

సూతా! ఏనాడు వారు విదురుని బుద్ధిని పాటింపలేదో ఆ నాడే కౌరవులకు కీడు మూడినది. అతని ప్రజ్ఞ ననుసరించినంతకాలము వారికి రాజ్యవృద్ధియే జరిగినది.

తదర్థలుబ్ధస్య నిబోధ మేఽద్య
యే మన్త్రిణో ధార్తరాష్ట్రస్య సూత,

---

16. ప్రశంసామ్ - విదురుడు మంచిమాట పలికెననుస్తుతి దుర్యోధనునినోట వెలువడలేదని భావము.

దుఃశాసనః శకునిః సూతపుత్రో
గావల్గణే పశ్య సంమోహ మస్య. 18

గావల్గణీ! ధనమునకై కక్కుర్తిపడు నా దుర్యోధనుని మంత్రు లెవ్వరో నేను చెప్పెదను వినుము. దుశ్శాసనుడు, శకుని, కర్ణుడు. చూడు! వాని వెఱ్ఱితనము.

సోఽహం న పశ్యామి పరీక్షమాణః
కథం స్వస్తి స్యాత్ కురుసృఞ్జయానామ్,
ఆత్తైశ్వర్యో ధృతరాష్ట్రః పరేభ్యః
ప్రవ్రాజితే విదురే దీర్ఘదృష్టౌ. 19

ఎంత పరికించి చూచినను కౌరవులకు సృంజయులకు సుఖ మెట్లు కలుగునో నాకు తోచుటలేదు. దీర్ఘదృష్టి యగు విదురుని దూరమునకు పారద్రోలి ధృతరాష్ట్రుడు పరులనుండి సంపదను కొల్లగొట్టెను.

ఆశంసతే వై ధృతరాష్ట్రః సపుత్రో
మహారాజ్య మసపత్నం పృథివ్యామ్,
తస్మిన్ శమః కేవలం నోపలభ్యః
సర్వం స్వకం మద్గతే మన్యతేఽర్థమ్. 20

కొడుకుతోపాటు ధృతరాష్ట్రుడు ఈ నేలపై తన రాజ్యము పగవారు లేనిదిగా భావించుచున్నాడు. నే నడవులకు పోగా అంతయు తనసొమ్మే యని తలచుచున్న అతనియందు శాంతి బొత్తుగా లభింపదు.

యత్తత్ కర్ణో మన్యతే పారణీయం
యుద్ధే గృహీతాయుధ మర్జునం వై,

20. తస్మిన్-ఆ కక్కుర్తి వానియందు, మద్గతే-నేను అడవికి పోయినపుడు సర్వమర్థమ్-సొమ్మంతయు, స్వకమ్-తనదిగా; మన్యతే-తలచుచున్నాడు

ఆసంశ్చ యుద్ధాని పురా మహా న్తి
కథం కర్ణో నాభవ ద్ద్వీప ఏషామ్. 21

యుద్ధమున ఆయుధము చేపట్టిన అర్జునునిగెలువ వచ్చునని కర్ణుడు తలచును. మును పెన్నో మహాయుద్ధములు జరిగినవి. వానిలో కర్ణుడు వీరిని గట్టెక్కింపలేకపోయె నేల?

కర్ణశ్చ జానాతి సుయోధన శ్చ
ద్రోణశ్చ జానాతి పితామహ శ్చ,
అన్యే యే కురవ స్తత్ర స న్తి
యథార్జునా న్నా స్త్యపరో ధనుర్ధరః. 22

అర్జునుని మించిన విలుకాడు లేడు. ఇది కర్ణు డెఱుగును. సుయోధను డెఱుగును. ద్రోణు డెఱుగును. తాత యెఱుగును, మరియు నచట గల కౌరవు లందరు నెఱుగుదురు.

జాన న్త్యేతత్ కురవః సర్వ ఏవ
యే చాప్యన్యే భూమిపాలాః సమేతాః,
దుర్యోధనే రాజ్యమిహాభవ ద్యథా
అరిందమే ఫాల్గునేఽవిద్యమానే. 23

పగవారిని పరిమార్చు అర్జునుడు లేని సమయమున దుర్యోధనునకు రాజ్యమెట్లు చిక్కెనో కౌరవు లందరకు, అచట కూడిన రాజులందరకు తెలియును.

తే నానుబన్ధం మన్యతే ధార్తరాష్ట్రః
శక్యం హర్తుం పాణ్డవానాం మమత్వమ్,

---

21. పారణీయమ్-గెలువ శక్యమగు వానినిగా; యుద్ధాని ఆసన్-గోగ్రహణము మొదలగు సందర్భములలో పెక్కు యుద్ధములు జరిగెను గదా! ద్వీపః-యుద్ధప్రవాహములో కొట్టుకొని పోవుచున్నవానికి ద్వీపమువలె ఆశ్రయమైనవాడు.

22. యథా-గంధర్వులు పట్టుకొన్న సందర్భమున నిది యనుభవమైన విషయమని భావము.

కిరీటినా తాలమాత్రాయుధేన
తద్వేదినా సంయుగం తత్ర గత్వా. 24

నాలుగుచేతుల పొడవుగల విల్లు చేబట్టినవాడు, ధనుర్విద్యలో ఆరితేరిన వాడు అగు అర్జునునితో రాజ్యవిషయమున యుద్ధమునకు తలపడి, పాండవులకు రాజ్యాదికము నందున్న మమకారమును హరించివేయుట శక్యమగు నని దుర్యోధనుడు తలచుచున్నాడు.

గాణ్డీవవిస్ఫారితశబ్ద మాజా
వశృణ్వానా ధార్తరాష్ట్రా ధ్రియన్తే,
క్రుద్ధం న చే దీక్షతే భీమసేనం
సుయోధనో మన్యతే సిద్ధమర్థమ్. 25

యుద్ధమున గాండీవముయొక్క విస్ఫారిధ్వని విననంతవరకే ధృతరాష్ట్రుని కొడుకులు బ్రదికియుందురు. క్రోధముతో పెల్లురేగిన భీమసేనుని చూడనంతవరకే దుర్యోధనుడు సొమ్ము తనకు దక్కె నని తలచును.

ఇన్ద్రోఽప్యేత న్నోత్సహే తాత హర్తు-
మైశ్వర్యం నో జీవతి భీమసేనే,
ధనఞ్జయే నకులే చైవ సూత
తథా వీరే సహదేవే సహిష్ణౌ. 26

సూతా! భీమసేనుడు, అర్జునుడు, నకులుడును, వీరుడును సహనశీలియు నగు సహదేవుడును బ్రదికియుండగా నింద్రు డైనను మా సంపదను హరించుటకు ఉత్సహింపడు.

స చే దేతాం ప్రతిపద్యేత బుద్ధిం
వృద్ధో రాజా సహపుత్రేణ సూత,
ఏవం రణే పాణ్డవకోపదగ్ధా
న నశ్యేయుః సఞ్జయ ధార్తరాష్ట్రాః. 27

---

24. అనుబన్ధమ్ - సంబంధము గలది - రాజ్యము మొదలగునది; తత్ర - రాజ్యము నిమిత్తముగా; సంయుగం గత్వా - యుద్ధమును పొంది; తాలమాత్రః - నాలుగు చేతుల పొడవు గలది; తద్వేదినా - ధనుర్విద్య బాగుగా ఎఱిగినవానిచేత;

25. ధ్రియన్తే - జీవింతురు.

ఆ ముసలిరాజును, వాని కొడుకును (రాజ్యమీనిచో సర్వనాశమగు నను) ఈ బుద్ధిని పొందుదురు గాక! అట్లైనచో నా ధృతరాష్ట్రుని కొడుకులు యుద్ధమున పాండవుల కోపమునకు మాడి నశింపకుందురు.

జానాసి త్వం క్లేశమస్మాసు వృత్తం
త్వాం పూజయన్ సఞ్జయాహం క్షమేయమ్,
యచ్చాస్మాకం కౌరవై ర్భూతపూర్వం
యా నో వృత్తి ర్ధార్తరాష్ట్రే తదాసీత్. 28

సంజయా! మాయందు మునుపు వారు చూపిన నడవడి యెట్టిదో నీ వెఱుగుదువు. నిన్ను మన్నించి నే నది యంతయు సహింతును. అప్పుడును వానియందు మా ప్రవర్తన యట్టిదే గదా!

అద్యాపి తత్తత్ర తథైవ వర్తతాం
శాన్తిం గమిష్యామి యథా త్వ మాత్థ.
ఇన్ద్రప్రస్థే భవతు మమైవ రాజ్యం
సుయోధనో యచ్ఛతు భారతాగ్ర్యః. 29

అది నేటికిని అట్లే యుండుగాక! నీవు పలికినట్లే నేను శాంతిని బొందెదను. ఇంద్రప్రస్థమునందే నాకు రాజ్య మగుగాక! ఆ దుర్యోధనుడు భరత కులమున గొప్పవాడై మాకు రాజ్యభాగ మొసగుగాక!

ఇతి శ్రీమహాభారతే ఉద్యోగపర్వణి సఞ్జయయానపర్వణి
యుధిష్ఠిరవాక్యే షడ్వింశో౽ధ్యాయః.

ఇది శ్రీమహాభారతము ఉద్యోగపర్వమున సంజయయానపర్వమున
యుధిష్ఠిరవాక్యము గల ఇరువదియాఱవ అధ్యాయము.

—(o)—

28. భూతపూర్వమ్ - మునుపు చేసిన భీముని బంధించుట, లక్కయిల్లు కాల్చుట మొదలగునది.

29. భారతాగ్ర్యః - నేను పెద్దవాడను, నాకు హస్తినాపురరాజ్యము రావలయును. పోనీ వాడే పెద్దవాడయి దానిని తీసికొననిమ్ము. నాకు ఉపరాజ్యమే రానిమ్ము. అన్న భావన యిందు సూచితము.

# సప్తవింశోఽధ్యాయః - ఇరువదియేడవ అధ్యాయము

**యుద్ధే దోషాన్ సంభావ్య సఞ్జయస్య యుధిష్ఠిరం తతో విరమయితుం ప్రయత్నః.**

**యుద్ధమునందలి దోషముల నెత్తి చూపి సంజయుడు యుధిష్ఠిరుని దానినుండి మరలింప యత్నించుట.**

సఞ్జయ ఉవాచ - సంజయు డిట్లు పలికెను.

ధర్మనిత్యా పాణ్డవ తే విచేష్టా
లోకే శ్రుతా దృశ్యతే చాపి పార్థ !
మహాస్రావం జీవితం చాప్యనిత్యం
సంపశ్య త్వం పాణ్డవ మా వ్యనీనశః. 1

పాండుకుమారా! కుంతీతనయా! నీ ప్రవర్తన ధర్మము తప్పనిది. లోకమున నెల్ల రెరిగినదియే. ఇప్పటికిని కానవచ్చుచునే యున్నది. జీవిత మెంత కీర్తికల దైనను అనిత్యమే. అట్టిదానిని చూచి నీవు వారిని నాశము చేయవలదు.

న చేద్భాగం కురవోఽన్యత్ర యుద్ధాత్
ప్రయచ్ఛేరం స్తుభ్య మజాతశత్రో,
భైక్షచర్యా మన్ధకవృష్ణిరాజ్యే
శ్రేయో మన్యే న తు యుద్ధేన రాజ్యమ్. 2

శత్రువులు పుట్టని మహానుభావా! కౌరవులు నీకు యుద్ధమువలన కాక మరియొకవిధముగా రాజ్యభాగము ఒసగరే యందము. అయినను ఏ అంధకుల రాజ్యముననో, వృష్ణివంశమువారి రాజ్యముననో బిచ్చమెత్తుకొనుటయు మేలే. కాని యుద్ధమువలన వచ్చెడు రాజ్యముమాత్రము వలదు.

---

1. మహాస్రావం - గొప్ప శ్రవణము - కీర్తిగలది, మా వ్యనీనశః - క్రోధముతో ధృతరాష్ట్రసుతులను నాశము చేయవలదు.

అల్పకాలం జీవితం యన్మనుష్యే
మహాస్రావం నిత్యదుఃఖం చలం చ,
భూయశ్చ తద్యశసో నానురూపం
తస్మాత్ పాపం పాణ్డవ మా కృథా స్త్వమ్. 3

పాండుతనయా! మనుష్యుడు బ్రదికియుండునది చాల తక్కువకాలము. జీవితము అతిచంచలము. నిత్యము దుఃఖములతో నిండినది. మరియు కీర్తికి సాటివచ్చునది కాదు. కావున నీవు పాపము చేయవలదు.

కామా మనుష్యం ప్రసజన్త ఏతే
ధర్మస్య యే విఘ్నమూలం నరేన్ద్ర,
పూర్వం నర స్తాన్ మతిమాన్ ప్రణిఘ్నన్
లోకే ప్రశంసాం లభతేఽనవద్యామ్. 4

ఇవిగో ఈ కామము లున్నవే, ఇవి మనుష్యుని పట్టుకొని యుండును. మరియు నవి ధర్మము నశించుటకు మూలకారణములు. బుద్ధిమంతు డగు నరుడు ముందు వానిని గట్టిగా రూపుమాపి లోకమున స్వచ్ఛమైన ప్రశంసను పొందును.

నిబన్ధనీ హ్యర్థతృష్ణేహ పార్థ
తా మిచ్ఛతాం బాధ్యతే ధర్మ ఏవ,
ధర్మం తు యః ప్రవృణీతే స బుద్ధః
కామే గృధ్రో హీయతేఽర్థానురోధాత్. 5

పార్థా! అర్థములపై దాహము మానవుని కట్టి పడవేయును. దానిని కోరువారి ధర్మమే బాధ నొందును. కావున ధర్మమును వరించువాడే తెలివి గలవాడు. కామమున లోభము గలవాడు అర్థముల వెంటబడి నాశ మొందును.

---

3. మహాస్రావం - గొప్ప గతి గలది - మిక్కిలి చంచలమని భావము.

4. ప్రసజన్తే - స్పృశించును.

5. గృధ్రః - లోభము కలవాడు; అర్థానురోధాత్ - అర్థములవెంట బడుట వలన.

ధర్మం కృత్వా కర్మణాం తాత ముఖ్యం
మహాప్రతాపః సవితేవ భాతి,
హీనో హి ధర్మేణ మహీ మపీమాం
లబ్ధ్వా నరః సీదతి పాపబుద్ధిః. 6

ఆచరింపవలసిన అర్థము కామము మొదలంగువానిలో ముఖ్యమగు ధర్మము నాచరించి మానవుడు గొప్ప ప్రతాపము గల సూర్యునివలె వెలుగొందును. ధర్మము లేనివా డన్ననో ఈ భూమండల మంతయు పొందియు పాపబుద్ధి కావున నశించుచున్నాడు.

వేదోఽధీత శ్చరితం బ్రహ్మచర్యం
యజ్ఞైరిష్టం బ్రాహ్మణేభ్యశ్చ దత్తమ్,
పరం స్థానం మన్యమానేన భూయ
ఆత్మా దత్తో వర్షపూగం సుఖేభ్యః. 7

వేదమును చక్కగా చదువుకొంటివి. బ్రహ్మచర్యమును పాలించితివి. యజ్ఞములు చేసితివి. బ్రహ్మము నెఱిగినవారికి దానము లిచ్చితివి. పరలోకము నందు మక్కువ కలిగి పెక్కేండ్లు ఆ సుఖములకై నిన్నర్పించుకొంటివి.

సుఖప్రియే సేవమానోఽతివేలం
యోగాభ్యాసే యో న కరోతి కర్మ,
విత్తక్షయే హీనసుఖోఽతివేలం
దుఃఖం శేతే కామవేగప్రణున్నః. 8

---

6. కర్మణామ్ - సాధించవలసిన అర్థకామాదుల నడుమ.
7. పరం స్థానమ్ - పరలోకమును, మన్యమానేన - మన్నించిన; వర్ష పూగం - పెక్కు సంవత్సరములు; సుఖేభ్యః - అక్కడి సుఖముల కొఱకు, ఆత్మా దత్తః - ఆత్మార్పణము చేసికొంటి వని భావము.
8. సుఖప్రియే - సుఖము లనగా ఐహిక భోగములు; ప్రియము లనగా పుత్రాదులు - వీనిని; సేవమానః - అనుభవించుచు, యోగ - అభ్యాసే- చిత్తవృత్తిని నిరోధించుట కభ్యసించుటకైన; కర్మ - ఆసనము ప్రాణాయామము మొదలగుదానిని.

సుఖమును, ప్రియమును హద్దు మీరి యనుభవించుచు, చిత్తవృత్తిని అరికట్టుటకైన ప్రాణాయామము మొదలగు పనులను చేయనివాడు-ఉన్న ధనము ఊడిన పిదప సుఖమును కోల్పోయి కామవేగము మిక్కిలి పీడింపగా హద్దుమీరిన దుఃఖమును పొందును.

ఏవం పున ర్బ్రహ్మచర్యాప్రసక్తో
హిత్వా ధర్మం యః ప్రకరో త్యధర్మమ్,
అశ్రద్దధత్ పరలోకాయ మూఢో
హిత్వా దేహం తప్యతే ప్రేత్య మన్దః. 9

పరబ్రహ్మమునం దాత్మను లగ్నము చేయుటయందు నిమగ్నుడు కాక ధర్మమును వదలి అధర్మము కూడబెట్టు మూఢుడు పరలోక విషయమున విశ్వాసము పెట్టక దేహమును వదలి చనిపోయినపుడు పరితపించును.

న కర్మణాం విప్రణాశో౽ స్త్యముత్ర
పుణ్యానాం వా ప్యథవా పాపకానామ్,
పూర్వం కర్తు ర్గచ్ఛతి పుణ్యపాపం
పశ్చాత్త్వేన మనుయాత్యేవ కర్తా. 10

---

9. బ్రహ్మచర్య, అప్రసక్తః - బ్రహ్మమునందు చర్య అనగా చరించుట (దీనినే ఆత్మానుసంధాన మందురు) దానియందు తగులువడనివాడై; ధర్మమ్-యజ్ఞాదిరూపమైనదానిని; హిత్వా-వదలి; అధర్మమ్-అధర్మమును ప్రకరోతి-కూడబెట్టెనో;

10. 'ధర్మేణ పాప మపనుదతి' - ధర్మముచేత పాపమును తొలగించుకొనుచున్నాడు, అని శ్రుతి. కావున కాలాంతరమున అధర్మము నశించుటకు ధర్మమును కూడ చేయుదుము. ఇప్పుడు పాపకర్మమును వదలనేల? అను శంకకు సమాధాన మీ శ్లోకము. కర్మములు ఫల మొసంగక నశింపవు. నశించుటకు రెండే మార్గములు. ఒకటి అనుభవించుట, రెండవది ఆత్మజ్ఞానము. 'నాభుక్తం క్షీయతే కర్మ' - అనుభవింపక కర్మము క్షీణింపదు. 'క్షీయన్తే చాస్య కర్మాణి తస్మిన్ దృష్టే పరావరే'-పరమాత్మదర్శనమువలన అతని కర్మములు క్షీణించును అని శ్రుతులు

పరలోకమునందును కర్మములు - అవి పుణ్యములే అయినను లేక పాపములే అయినను-నశింపవు. కర్మము చేసిన వానిముందు పుణ్యపాపములు నడచుచుండును. వెంట నంటియే కర్త పోవుచుండును.

న్యాయ్యోపేతం బ్రాహ్మణేభ్యోఽథ దత్తం
శ్రద్ధాపూతం గన్ధరసోపపన్నమ్,
అన్వాహార్యే ష్వూత్తమదక్షిణేషు
తథారూపం కర్మ విఖ్యాయతే తే. 11

న్యాయముతో కూడినదియు, బ్రాహ్మణులకు దాన మొసగినదియు, శ్రద్ధతో పవిత్రమైనది, సారమైన గంధములతో ఒప్పారినది యగు యజ్ఞరూప మగు నీ కర్మము ఉత్తమ దక్షిణలు గల అన్వాహార్యకార్యములందు ప్రసిద్ధి కెక్కినది.

ఇహ క్షేత్రే క్రియతే పార్థ కార్యం
న వై కిఞ్చిత్ క్రియతే ప్రేత్య కార్యమ్,
కృతం త్వయా పారలౌక్యం చ కర్మ
పుణ్యం మహత్ సద్భి రతిప్రశస్తమ్. 12

---

చెప్పుచున్నవి. అట్లైనచో 'ధర్మేణ పాప మపనుదతి' అను పై శ్రుతి వాక్యమునకు గతి యేమి యన్నచో ప్రాయశ్చిత్తాదికము వలన పాపము నశించును. అదియు నిహలోకమున పాపములేనివాడను వ్యవహారమును గలిగించునే కాని పరలోకమున పాపస్పర్శ లేదనుటకు చాలదను నర్థమును మాత్రమే ప్రతిపాదించును.

11. అన్వాహార్యేషు - అనుమాట శ్రౌతకర్మములను సూచించును. అందు అన్వాహార్యము దక్షిణగా నొసగబడును గదా! అన్వాహార్యము - యజ్ఞములలో ప్రత్యేకముగా వండు అన్నము మొదలగునది. గన్ధరసోపపన్నమ్ - చక్కగా పూచిన చెట్టు (పూవుల) వాసన దూరమునకు వ్యాపించునట్లు పుణ్యకర్మముయొక్క వాసనయు బహుదూరము వ్యాపించునని శ్రుతి చెప్పుచున్నది.

12. కార్యమ్-ధర్మము; ప్రేత్య-చనిపోయి.

పార్థా! మానవుడు ఏ కర్మము నైనను ఇచటనే చేయును. చచ్చిన పిదప చేయున దేమియు లేదు. నీవు పరలోకమునకు సంబంధించిన కర్మమును కూడ చక్కగా చేసితివి. అది మహాపుణ్యము. సజ్జను లందరు మిక్కిలిగా దానిని కొనియాడిరి.

జహాతి మృత్యుం చ జరా భయం చ
న క్షుత్పిపాసే మనసోఽప్రియాణి,
న కర్తవ్యం విద్యతే తత్ర కిఞ్చి -
దన్యత్ర వై చేన్ద్రియప్రీణనా ద్ధి. 13

జీవునకు పరలోకమున మృత్యువు, ముసలితనము, ఆకలిదప్పులు, మనసునకు అప్రియములైన విషయములు, ఉండవు. ఇంద్రియములను తృప్తి పరచుటకంటె మరియొక కర్తవ్య మచట లేదు.

ఏవంరూపం కర్మఫలం నరేన్ద్ర
మాఽత్రావహం హృదయస్య ప్రియేణ,
స క్రోధజం పాణ్డవ హర్షజం చ
లోకావుభౌ మా ప్రహాసీ శ్చిరాయ. 14

13. పరలోకమున ధర్మాధర్మాదికర్మములు లేవని తాత్పర్యము.

14. హృదయస్య ప్రియేణ - హృదయమునకు ప్రియమైనది, కామము. దాని చేత పొందిన; ఏవంరూపం - ఇట్టిదగు నశించునదగు; ఇంద్రియములకు ప్రీతిని మాత్రము కలిగించునదగు; కర్మఫలమును; అత్ర - ఈ లోకమున, మా అవహమ్ - మోయను, భరింపను. కర్మ మొనరించుచు కామవశమువలన పరలోకఫలమును కోరరాదని తాత్పర్యము. అయినచో లాభమేమి యన్నచో శ్లోకము రెండవభాగమున చెప్పుచున్నారు. సః-అట్టి నీవు, క్రోధజం లోకమ్ - నరకలోకమును; హర్షజం లోకమ్ - స్వర్గలోకమును; చిరాయ-తిరిగివచ్చుట లేనితనమునకు, అని తాత్పర్యము; మా ప్రహాసీః-పొందకుము - కర్మములవలన కలిగెడు ఫలమును వదలి మహావైరాగ్యసంపదను బొంది మోక్షముకొఱకు యోగాభ్యాసము నాచరింపుము. బంధువుల నాశముచే లభించు రాజ్యముతో నీ కేమి పని యని సంజయుని బోధసారము.

హృదయమునకు ప్రియమైన కామముచేత సిద్ధించిన యీ విధమైన (ఇంద్రియప్రీతిరూపమైన) కర్మఫలమును ఈ లోకమున నేను నెత్తికెత్తుకొనన ను తలపుతో పాండవా! క్రోధమువలన పుట్టెడు నరకమును గాని,హర్షము వలన నయ్యెడు స్వర్గమునుగాని ఎన్నటికిని పొందకుము.

అన్తం గత్వా కర్మణాం మా ప్రజహ్యాః
సత్యం దమం చార్జవ మానృశంస్యమ్,
అశ్వమేధం రాజసూయం తథేజ్యాః
పాపస్యాన్తం కర్మణో మా పునర్గాః. 15

ఇట్లు కర్మముల వినాశమును బొందిన నీవు సత్యము, నిగ్రహము, వక్రస్వభావము - క్రూరస్వభావము లేకుండుట అను మంచిగుణములను విడనాడకుము. అశ్వమేధము, రాజసూయము మున్నగు సత్కార్మముల నాచరింపుము. పాపకర్మముల పొంతకు మాత్రము పోకుము.

తచ్చేదేవం ద్వేషరూపేణ పార్థాః
కరిష్యధ్వం కర్మ పాపం చిరాయ,

---

15. అన్తం గత్వా - ఇట్టి జ్ఞానముతో కర్మముల నాశమును సాధించి, 'జ్ఞానాగ్నిః సర్వకర్మాణి భస్మసాత్కురుతేఽర్జున' - అర్జునా! జ్ఞానమను అగ్ని కర్మము లన్నింటిని బూది చేసివేయును. అని భగవద్వచనము. అట్లు తత్త్వ మెఱిగినవాడవయ్యు సత్యము మొదలగు మంచి ధర్మములను అశ్వమేధాదులగు యజ్ఞములను లోకమునకు ఆదర్శప్రాయమగుటకై ఆచరింపుము. అంతేకాని,పాపస్య కర్మణః అన్తమ్-పాపకర్మము యొక్క దాపునకు; పునః మా గాః - తిరిగి వెళ్ళకుము అని భావము. జ్ఞానము సిద్ధించిన వెనుక చేసిన కర్మము జ్ఞాని నంటదు. "తద్యథా పుష్కరపలాశ ఆపో న శ్లిష్యన్త ఏవ మేవంవిది పాపకం కర్మ న శ్లిష్యతే"-తామరాకునకు నీటిబిందువు లంటనట్లు తత్త్వజ్ఞానము పొందిన వానిని పాపకర్మ మంటదు-అని శ్రుతి.

నివసధ్వం వర్షపూగాన్ వనేషు
దుఃఖం వాసం పాణ్డవా ధర్మ ఏవ. 16

కుంతిబిడ్డలారా! పాండుని కొడుకులారా! మీరు కౌరవులందు ద్వేషముతో పాపపుపని చేసితిరో పెక్కేండ్లు అడవులలో బడి యుండుటయు, ఘోరమగు అజ్ఞాతవాసము చేయుటయు మీయెడ ధర్మములే యగును.

అప్రవ్రజ్యే మా స్మ హిత్వా పురస్తా-
దాత్మాధీనం యద్బలం హ్యేతదాసీత్,
నిత్యం చ వశ్యాః సచివా స్తవేమే
జనార్దనో యుయుధానశ్చ వీరః. 17

మొదటినుండియు ఈ బలమంతయు మనకు వశమైనదియే కదా! ఆ బలము నండగా గొని ముందు మనము వనవాసమునకు పోకయే యుండవలసినది.

---

16. తత్, పాపం కర్మ-కులమువారిని చంపుట యను ఆ పాపపు పనిని; చిరాయ-చాలకాలమునకుముందే; కరిష్యధ్వం తర్హి-చేసియుండితి రేని; 'యద్ వనేషు వర్షపూగాన్ దుఃఖం వాసం న వసధ్వమ్'—అడవులలో బహుకాలము దుఃఖముగా నివసించితి రనునది; ధర్మ ఏవ-ధర్మమే. మీరు రాజ్యముకొఱకు సర్వలోకవినాశము కోరుట ధర్మమైనచో దుర్యోధనుడు అదే కోరికతో మిమ్ముల నడవులపాలు చేయుట ధర్మమే యగును గదా! యని తాత్పర్యము.

17. జూదమునాడు మాకు సరియైన సహాయులు లేక వనవాసమున కరిగితిమి. దుర్యోధనుని యాజ్ఞపై కాదని యందు వేమో అది సరికాదు. అన్న భావముతో సంజయుడు ఈ మాట పలికెను. ఇమే-ఈ రాజ్యము మొదలగువానిని; పురస్తాత్-అడవికి పోకముందే; హిత్వా-పట్టుకొని; అప్రవ్రజ్య-అడవి కరుగకయే, అస్మ (మనము) ఉండవలసినది; ఇందు మనము మనకు-అనువానిని మీరు, మీకు అను నర్థమున లోకసామాన్యముగా ప్రయోగించెను. యత్-ఏల యనగా; ఈ బలము, జనార్దనుడు, సాత్యకి, క్రొత్తగా వచ్చిన సహాయులు కారు గదా! మొదటినుండియు నున్నవారే కదా! అని భావము.

ఈ కృష్ణుడు, వీరుడగు సాత్యకియు ఇతరులగు మంత్రులును ఎప్పుడును నీకు వశ్యులే కదా!

మత్స్యో రాజా రుక్మరథః సపుత్రః
ప్రహారిభిః సహపుత్రై ర్విరాటః,
రాజానశ్చ యే విజితాః పురస్తాత్
త్వామేవ తే సంశ్రయేయుః సమస్తాః. 18

మత్స్యరాజగు ఈ విరాటుడు, ఆతని పుత్రులు, సేనాభటులు ఇంకను నీకు వశమైన యితరరాజులు గుమిగూడి అప్పుడును నిన్నే ఆశ్రయించి యుండెడివారు.

మహాసహాయః ప్రతపన్ బలస్థః
పురస్కృతో వాసుదేవార్జునాభ్యామ్,
పరాన్ హనిష్యన్ ద్విషతో రంగమధ్యే
వ్యనేష్యథా ధార్తరాష్ట్రస్య దర్పమ్. 19

నీకు గొప్పసహాయు లుండిరి. గట్టిసేన గలదు. కోపముతో మండిపడు చున్నవాడవు. కృష్ణుడు, అర్జునుడు ముందు నిలిచియుండిరి. అట్టి నీ వానాడే ద్యూతము ప్రవర్తిల్లిన రంగస్థలము నడుమ గొప్ప శత్రువులను పరిమార్చి, దుర్యోధనుని గర్వమును అడగద్రొక్కి యుండవచ్చును గదా!

బలం కస్మా ద్వర్ధయిత్వా పరస్య
నిజాన్ కస్మాత్ కర్శయిత్వా సహాయాన్,
నిరుష్య కస్మా ద్వర్షపూగాన్ వనేషు
యుయుత్ససే పాణ్డవ హీనకాలమ్. 20

18. రుక్మరథః - బంగారురథముగలవాడు; విజితాః - వశమైనవారు;
20. హీనకాలమ్ - కాని కాలమున; యుయుత్ససే - యుద్ధము చేయగోరు చున్నావు.

అప్పుడు పరుని బలము పెంపొందించితివి. నీ సహాయులను నీరు గార్చితివి. పెక్కేండ్లడవుల నిడుముల బడితివి. కానికాలమున నిప్పుడు పోరగోరు చున్నావు. ఇది యేల?

అప్రాజ్ఞో వా పాణ్డవ యుధ్యమానో
ఽధర్మజ్ఞో వా భూతి మథోఽభ్యుపైతి,
ప్రజ్ఞావాన్ వా బుధ్యమానోఽపి ధర్మం
సంస్తమ్భాద్వాసోఽపి భూతై రపైతి. 21

తెలివి యేమియు లేనివాడు గాని, ధర్మ మించుకయు నెరుగనివాడు గాని యుద్ధ మొనరించి సంపదను పొందుచున్నాడు. గొప్ప ప్రజ్ఞ కలిగినవాడును, సర్వ ధర్మముల నెఱిగినవాడును యుద్ధము చేయకుండియు సంపదలను పోగొట్టుకొను చున్నాడు.

నాధర్మే తు ధీయతే పార్థ బుద్ధి-
ర్న సంరంభాత్ కర్మ చకర్థ పాపమ్,
అత్థ కిం తత్కారణం యస్య హేతోః
ప్రజ్ఞావిరుద్ధం కర్మ చికీర్షసీదమ్. 22

కుంతీతనయా! అధర్మమున నీ బుద్ధి నిలువదు. కావుననే పూర్వము నీవు కోపము పూని పాపపు పని చేయలేదు. ఇప్పు డే కారణమున నీ ప్రజ్ఞకు విరుద్ధ మైన పని చేయగోరితివో అది చెప్పుము.

---

21. మునుపు యుద్ధము చేయలేదు గావున నిప్పుడును నీకు యుద్ధము కర్తవ్యము కాదని తాత్పర్యము. యుద్ధ మెన్నటికిని కర్తవ్యము కాదు. ఏల యన జయాపజయములు దైవాధీనములు. మూఢుడు, అధర్మజ్ఞుడు యుద్ధము వలన నైశ్వర్యము పొందుట, ప్రాజ్ఞుడు, ధర్మజ్ఞుడు యుద్ధము చేయకయే దైవవశమున ఐశ్వర్యము కోల్పోవుట చూచుచున్నాము - అని శ్లోక భావము.

22. పూర్వమే పాపభయమువలన నీవు చేయబూనని యుద్ధమును ప్రజ్ఞకు విరుద్ధముగా నిపు డేల చేయదలతు వని గ్రంథతాత్పర్యము; సంరంభాత్ కోపమువలన;

అవ్యాధిజం కటుకం శీర్షరోగి
యశోముషం పాపఫలోదయం వా,
సతాం పేయం యన్న పిబన్త్యసన్తో
మన్యుం మహారాజ పిబ ప్రశామ్య. 23

రోగమువలన పుట్టనిదై చేదైనది, తలకు నొప్పి పుట్టించునది, కీర్తిని రూపుమాపునది, పాప మనెడు ఫలమును వెలువరించునది, సజ్జనులు మాత్రమే మ్రింగగలిగినది, దుర్జనులు మ్రింగజాలనిది అగు కోపమును మహారాజా! మ్రింగుము. శాంతి నొందుము.

పాపానుబన్ధం కో ను తం కామయేత
క్షమైవ తే జ్యాయసీ నోత భోగాః,
యత్ర భీష్మః శాన్తనవో హతః స్యా -
ద్యత్ర ద్రోణః సహపుత్రో హతః స్యాత్. 42

పాపము చుట్టుకొని వచ్చు ఆ కోపమును కోరువా డెవడు? నీకు ఓర్పే మిన్న. భోగములు కావు. భోగములే అయినచో శంతనుని కొడుకు భీష్ముడు చావవలయును. కొడుకుతోపాటు ద్రోణుడు చావవలయును.

కృపః శల్యః సౌమదత్తి ర్వికర్ణో
వివింశతిః కర్ణదుర్యోధనౌ చ,
ఏతాన్ హత్వా కీదృశం తత్సుఖం స్యా -
ద్య ద్విన్దేథా స్తదను బ్రూహి పార్థ. 25

కృపుడు, శల్యుడు, బాహ్లికుడు, వికర్ణుడు, వివింశతి, కర్ణదుర్యోధనులు- వీరిని చంపి పొందు సుఖ మెట్టిది? దానివలన నీవు బాముకొనున దేమి? చెప్పుము.

---

23. అవ్యాధిజం కటుకమ్ - పైత్యము మొదలగునవి లేకయే చేదైనది; యశోముషం - కీర్తిని హరించునది; పేయమ్ - మ్రింగదగినది; మన్యుమ్ - క్రోధమును; ప్రశామ్య - శాంతుడవు కమ్ము;

లబ్ధ్వా సీమాం పృథివీం సాగరాన్తాం
జరామృత్యూ నైవ హి త్వం ప్రజహ్యాః,
ప్రియాప్రియే సుఖదుఃఖే చ రాజ -
న్నేవం విద్వాన్నైవ యుద్ధం కురు త్వమ్. 26

సముద్రము హద్దుగా గల భూమి నంతటిని పొందెదవో యనుము. ముదిమిని చావును తప్పించుకొనలేవు గదా! ప్రియము, అప్రియము, సుఖము, దుఃఖము తప్పవుగదా! ఇది చక్కగా ఎఱిగిన నీవు యుద్ధమును చేయనే వలదు.

అమాత్యానాం యది కామస్య హేతో -
రేవం యుక్తం కర్మ చికీర్షసి త్వమ్,
అపక్రామేః స్వం ప్రదాయైవ తేషాం
మాగాస్త్వం వై దేవయానాత్ పథోఽద్య. 27

నీ సన్నిహితుల కోరికను బట్టి తగినపని చేయగోరుదువేని నీకున్నదానిని వారికి ఇచ్చివేసి నీవు తొలగిపొమ్ము. అంతేకాని, దేవయానమార్గమునుండి నేడు తొలగిపోకుము.

ఇతి శ్రీమహాభారతే ఉద్యోగపర్వణి సఞ్జయయానపర్వణి
సఞ్జయవాక్యే సప్తవింశోఽధ్యాయః.

ఇది శ్రీమహాభారతము ఉద్యోగపర్వమున సంజయయానపర్వమున
సంజయునివాక్య మను ఇరువదియేడవ అధ్యాయము.

—(०)—

27. దేవయానాత్ పథః - అర్చిరాదిమార్గమునుండి - ఆ మార్గమున బోపు వారు సంసారమున తిరిగి ప్రవేశింపరు - మోక్షమందుదు రని భావము; కులధ్వంసముచేత ఆ ఫలము నశించు నని తాత్పర్యము.

# అష్టావింశోఽధ్యాయః-ఇరువది యెనిమిదవ అధ్యాయము

సఞ్జయం ప్రతి యుధిష్ఠిర స్యోత్తరమ్.
సంజయునికి ధర్మజుడు బదులు చెప్పుట.

యుధిష్ఠిర ఉవాచ - యుధిష్ఠిరు డిట్లు పలికెను.

అసంశయం సఞ్జయ సత్యమేత -
ద్ధర్మో వరః కర్మణాం యత్త్వ మాత్థ,
జ్ఞాత్వా తు మాం సఞ్జయ గర్హయే స్త్వం
యది ధర్మం యద్యధర్మం చరేయమ్. 1

సంజయా! నీ వన్నట్లు కర్మములలో ధర్మమే శ్రేష్ఠమైన దనుట సత్యము. సందియము లేదు. నేను ధర్మమున నడతునో అధర్మమున నడతునో చక్కగా ఎఱిగి నన్ను నీవు నిందింపుము.

యత్రాధర్మో ధర్మరూపాణి ధత్తే
ధర్మః కృత్స్నో దృశ్యతేఽధర్మరూపః,
బిభ్రద్ధర్మో ధర్మరూపం తథా చ
విద్వాంస స్తం సమ్ప్రపశ్యన్తి బుద్ధ్యా. 2

1. సంశయము తీరునట్లు నేను ధర్మ మాచరింతునో, యధర్మ మాచరింతునో తుదిముట్ట పరీక్షించి, అధర్మాచరణ మున్నచో నిందింపు మని భావము.

2. ధర్మము, అధర్మము అనువానిని పరీక్షించునపుడు మూడు పద్ధతులు గోచరించును. 1. ఒక్కొక్క పురుషుడు ఆడంబరముకొఱకై యితరులకు కీడుచేయు మంత్రజపాదులు చేయుచుండును. అది అధర్మము, అయినను దానిని కొందరు ధర్మముగా భావింతురు. 2. ప్రచ్ఛన్నయోగి యగు దత్తాత్రేయుడు రాగద్వేషములు లేనివాడై యోగధర్మము నవలంబించెను. కాని పైకి ఉన్మత్తునివలె కానవచ్చుటచే అది అధర్మముగా

కొన్ని యెడల అధర్మము ధర్మరూపములను ధరించును. అట్లే ధర్మము మొత్తముగా అధర్మరూపమై కానవచ్చును. మరియు ధర్మము ధర్మరూపమునే తాల్చుటయు గలదు. దానిని విద్వాంసులు బాగుగా ఎరిగి నిశ్చయబుద్ధిని పొందుదురు.

ఏవం తథై వాపది లిఙ్గమేత
ధర్మాధర్మౌ నిత్యవృత్తీ భజేతామ్,
ఆద్యం లిఙ్గం యస్య తస్య ప్రమాణ
మాపద్ధర్మం సఞ్జయ తం నిబోధ. 3

---

కొందరికి కన్పట్టెను. ఇట్లు ధర్మ మధర్మముగా భావించుట రెండవ పద్ధతి. 3. వశిష్ఠుడు మొదలగువారియందు ధర్మము ధర్మరూపముగనే గోచరించును. చండాలునియందు అధర్మము అధర్మముగనే కన్పట్టును. ఇది మూడవ ధోరణి. ఈ మూడును ఈ శ్లోకమున వరుసగా చెప్పబడినవి.

3. రెండవ శ్లోకమున మూడు పద్ధతులు చూపబడినవి. అందు మొదటి రెండును ప్రచ్ఛన్నములు(దాగియున్నవి). కాన అందు తత్త్వనిర్ణయము బహుకాలమునకు గాని జరుగదు. చివరిదానియందు మాత్రము గుర్తింపు ప్రత్యక్షమే యయినను, ఆపదలందు ధర్మాధర్మములు తారుమారగు చుండును. దాని నీ శ్లోకము వివరించుచున్నది.

ఏతదేవమ్-ఇది యిట్లని లోకమునకు సాధారణముగా కానవచ్చు, లింగమ్

---

గుర్తు-బ్రాహ్మణునికి వేదములు వల్లించుట; బోధించుట; క్షత్రియునకు శౌర్యము మొదలగునది; వైశ్యునకు వ్యవసాయము మొదలగునది. శూద్రునకు ఆ యా వృత్తులు (చాకలి, కమ్మరి మొదలగునవి) తథైవ - అట్లే - అనగా ఆ యా పనులు చేయువాడే ఆ యా వర్ణ ధర్మమును పాటించుచున్నా డని గుర్తింపు పొందు నని భావము. (తథాపి-అయినను) నిత్యవృత్తీ-ఇట్లు ఒకరియందు నిత్యముగా ప్రవర్తిల్లు నవియు; ధర్మాధర్మౌ-ధర్మము, అధర్మము అనునవి; తల్లిఙ్గమ్ – ఆ గుర్తును, భజేతామ్ – పొందును. భావ మిది. క్షత్రియుని ధర్మము; బ్రాహ్మణ వైశ్యులకు ఆపదయందు ధర్మము. ఆపద కాని వేళ అధర్మము.

లోకమున ప్రత్యక్షమైన ధర్మము నట్లే యాచరింపవలయును. నిత్యము వర్తించు ధర్మాధర్మములు అపదయందు ఆ లింగమును పొందును. అయినను మొదటిలింగము ఎవనిదో వానినుండి తప్పిపోరాదు. కావున, సంజయా! ఆపద్ధర్మ మనునది చక్కగా ఎఱుగుము.

లుప్తాయాం తు ప్రకృతౌ యేన కర్మ
నిష్పాదయేత్ తత్ పరీప్సే ద్విహీనః,
ప్రకృతిస్థ శ్చాపది వర్తమాన
ఉభౌ గర్హ్యౌ భవతః సఙ్జయైతౌ. 4

---

ఆ విధముగా ఒకే ధర్మము అవస్థయందలి భేదమును బట్టి యితర వర్ణమునందు ధర్మమగుటయు అధర్మ మగుటయు జరుగుచున్నది. అందు మఱియొకవిశేషము గలదు. ఆద్యం-మొదటి దైన బ్రాహ్మణధర్మ మగు యజ్ఞము చేయించుట మొదలగునది; యస్య-ఎవనికో; తస్య ఏవ - వానికే; తత్-అది; ప్రమాణమ్-విడిచిపోరానిది. అనగా ఆపదయందును ఇతరుడు తన కలవికాని పైధర్మము నవలంబింపరాదని తాత్పర్యము. ఈ విధముగా నున్న ఆపద్ధర్మమును పై చూపుతోగాక శాస్త్రమును బట్టి సంజయా ఎఱుగవలయు నని భావము.

4. మీరు క్షత్రియులై యుండి ఏకచక్రపురమున బ్రాహ్మణధర్మమగు భిక్షాటన మెట్లు చేసితి రను ఆక్షేపణకు సమాధానము- ఈ శ్లోకము. ప్రకృతౌ-బ్రదుకు తెరువునకైన ధనము-క్షత్రియునకు భూమి నేలుట, ఆయుధము పట్టుట మొదలగునది, వైశ్యునకు ధనము, పశువులు మొదల గునది, లుప్తాయాం-సంపూర్ణముగా నశింపగా; యేన-దేనితో, కర్మ-సంధ్యోపాసన మొదలగు కర్మము; నిష్పాదయేత్-సమకూర్చుకొనునో; తత్-ఆ భిక్షాటనము మొదలగుదానిని; పరీప్సేత్-చేయగోర వలయును. అట్లు కానిచో బ్రదుకుమార్గము లేక నిత్యమగు కర్మము నశించును, ప్రాణముకూడ పోవును. కావున గొప్ప ఆపదయందు ఆ మాత్రము విప్రధర్మము నాచరించుట క్షత్రియునకు తప్పుకాదు. ఆపది-ఆపద్ధర్మము నందు; ప్రకృతిస్థః - సహజస్థితియం దున్నవాడును; గర్హ్యౌ - (లోభ మునుబట్టి అట్లు ప్రవర్తించును కాన) నింద్యుడు; అట్లే ఆపదయం

సహజమైన ధనము బొత్తుగా నశించినపుడు దేనితో కర్మము సిద్ధించునో దానిని (ఇతర ధర్మము నైనను) పొందదగును. సహజస్థితియం దున్నవాడు ఆపద్ధర్మమును, ఆపదయం దున్నవాడు సహజధర్మమును ఆచరింతురేని ఆ యిరువురు నిందింపదగినవారే.

అవినాశ మిచ్ఛతాం బ్రాహ్మణానాం
ప్రాయశ్చిత్తం విహితం యద్విధాత్రా,
సంపశ్యేథాః కర్మసు వర్తమానాన్
వికర్మస్థాన్ సఞ్జయ గర్హయే త్వామ్. 5

ఆపదలయందు అన్యధర్మము చేపట్టవలసిన సమయములలో భ్రష్టులు కాకుండుటకై బ్రాహ్మణులకు బ్రహ్మ ప్రాయశ్చిత్తమును విధించెను. ఇట్లు సహజ

---

దున్నవాడు సహజధర్మమునుబట్టి ప్రాకులాడినచో, జీవనలోపము, కుటుంబహింస జరుగును కనుక నింద్యుడగును. 'చ' అనుదానిచే ఈ అర్థము సిద్ధించును.

5. యత్ - ఏకారణమున, విధాత్రా - బ్రహ్మచేత; అవినాశమ్ - ఇతర ధర్మము నవలంబించుటచేత వచ్చెడు నష్టము లేకుండుటను; ఇచ్ఛతామ్- కోరుచున్న; బ్రాహ్మణానామ్ - బ్రాహ్మణులకు; ప్రాయశ్చిత్తమ్ - ప్రాయశ్చిత్తము (చేసిన తప్పును దిద్దుకొనుటకు చేయు వైదికప్రక్రియ); విహితమ్ - కల్పింపబడినదో ఆకారణమువలన ఆపదయందు అన్యధర్మాశ్రయణము తప్పదని తెలియుచున్నది. కావుననే ఏకచక్రపురమున మేము భిక్షాటనము చేయుట అనుచితము కాదు. ఏవమ్-ఇట్లు (అనాపది- ఆపదలేని వేళ) కర్మసు-సహజకర్మలందు; వర్తమానాన్-ప్రవర్తించు వారిని; (ఆపది - ఆపదయందు) వికర్మస్థాన్ - ఇతరధర్మములం దున్నవారిని; సంపశ్యేథాః - ఇది మంచిదే యను భావముతో చూడుము. విపరీతమైనచో-అనగా ఆపదలలో తనకర్మములనే పట్టి ప్రేలాడువారిని, ఆపద లేని సమయములలో అన్యధర్మముల నవలంబించువారిని నిందింపుము. ఏలయన ఇందు మొదటివారు తన్ను పరులను హింసించువారు. రెండవజాతివారు కక్కుర్తిబ్రదుకు బ్రదుకువారు.

స్థితిలో తమ తమ కర్మము లాచరించువారిని సరియగు చూపుతో చూడవలయును. అట్లుకానిచో నీవు నిందింపదగును.

మనీషిణాం సత్వవిచ్ఛేదనాయ
విధీయతే సత్సు వృత్తిః సదైవ,
అబ్రాహ్మణాః సన్తి తు యే న వైద్యాః
సర్వోత్సజ్గం సాధు మన్యేత తేభ్యః. 6

6. భిక్షాటన మెట్టివారు దేనికై చేయదగునో యిందు వివరించుచున్నాడు.

మనీషిణామ్ - మనస్సును నాశము చేయగోరువారికి (ఈషధాతువునకు గతి, హింస, దర్శనము అను నర్థములు గలవు. సత్వవిచ్ఛేదనాయ-బుద్ధిసత్త్వము వేరగుటకై, చిదాత్మతో కలసి యొక్కటిగా నైన బుద్ధిని రెల్లుగడ్డినుండి కాడను లాగిన విధముగా వేరు చేయుటకై; సత్సు - సజ్జనుల యిండ్లయందు; వృత్తిః-జీవిక, బిచ్చమెత్తుకొనుట వంటిది; సదా + ఏవ - ఎప్పటికిని; విధీయతే-శాస్త్రముచేత విధింపబడుచున్నది. అబ్రాహ్మణాః - బ్రాహ్మణులు కానివారు; యే-ఎవరు; వైద్యాః - విద్యయందు నిష్ఠ గలవారు; న సన్తి-కారో; తేభ్యః - అట్టివారికి; సర్వ-ఉత్సజ్గమ్-తమ తమ ధర్మముల నంటిపెట్టుకొని యుండుట; సాధు - మేలని మన్యతే-భావింపబడుచున్నది.

మనస్సును నాశము చేయగోరువారు బుద్ధిని చిదాత్మనుండి వేరు చేయుటకై సన్న్యాసవృత్తి నవలంబించి భిక్షాటనము సజ్జనులయింట చేయుట తప్పుకాదు. "వేదా నిమం లోకమముం చ పరిత్యజ్య ఆత్మ నాత్మాన మన్విచ్ఛేత్" వేదములను, ఈ లోకమును, ఆలోకమును పరిత్యజించి ఆత్మలో ఆత్మ నన్వేషింపవలయును అని శ్రుతి. కావున ఆత్మాన్వేషణకై సర్వసంన్యాసపూర్వకమైన భిక్షాటనవృత్తిని శాస్త్రము విధించుటచే బ్రాహ్మీవృత్తి ఎవరికిని నింద్యము కాదు; వైద్యాః - విద్యానిష్ఠ గలవారు; అట్టి బ్రహ్మీవృత్తియు, విద్యానిష్ఠయు లేనివారు; సర్వోత్సజ్గమ్-అన్ని విధములైన తమ తమ ధర్మముల నంటిపెట్టికొని యుండుట; సాధు - మేలు;

మనస్సును నిగ్రహింపదలచినవారికి బుద్ధిసత్త్వము తెగిపోవుటకై సత్పురుషులయందు బ్రదుకుతెరువు నపేక్షించుటను ఎల్లవేళల శాస్త్రము విధించుచున్నది. బ్రాహ్మణులు కానివారు, విద్యయందు నిష్ఠ లేనివారు తమ ధర్మము లందు నిలిచియుండుటయే మే లని తలపవలయును.

తదధ్వానః పితరో యే చ పూర్వే
పితామహా యే చ తేభ్యః పరేఽన్యే,
యజ్ఞైషిణో యే చ హి కర్మ కుర్యు-
ర్నాన్యం తతో నాస్తికోఽస్మీతి మన్యే. 7

తండ్రులు, తాతలు, అందుకు ముందున్నవారు యజ్ఞములను చేయువారై ఆ మార్గమున ప్రవర్తించిరి. కర్మత్యాగము చేసిన యితరులు ఆ మార్గము గలవారైరి. నేనును ఆస్తికుడ నను భావముతో దానికంటె వేరుమార్గమును భావింపను.

యత్ కిఞ్చనేదం విత్తమస్యాం పృథివ్యాం
యద్దేవానాం త్రిదశానాం పరం యత్,
ప్రాజాపత్యం త్రిదివం బ్రహ్మలోకం
నాధర్మతః సఞ్జయ కామయేయమ్. 8

7. మా వంశమున పూర్వులలో రెండు మార్గములవా రున్నారు. అందొకరు యజ్ఞాదికర్మములను వాంఛించి యా మార్గమున ప్రవర్తించిరి. మఱికొందరు సన్యాసమార్గము నవలంబించిరి. ఇది యంతయు విశేషమగు ఆపద్ధర్మాదిమార్గము. నేనును ఆస్తికుడను. పరలోక మున్న దను విశ్వాసము కలవాడను. కావున వారి మార్గములకంటె భిన్నమైన మార్గములను అవలంబింపను-అని ధర్మజుని అభిప్రాయము.

8. పై శ్లోకములలో ధర్మరాజు తాను నీతిజ్ఞుడే యను విషయమును ప్రతిపాదించు తాత్పర్యముతో ఆపద్ధర్మములను, యోగిధర్మములను వక్కాణించి ప్రకృతవిషయములోనికి వచ్చుచున్నాడు.

సంజయా ! ఈ భూమియందున్న ధనము మొత్తమును, త్రిదశులగు దేవతల ధన మంతయును, కడకు ప్రజాపతిత్వమో, స్వర్గమో, బ్రహ్మలోకమో అయినను అధర్మమార్గమున దొరకినయెడల నేను దానిని కోరను.

ధర్మేశ్వరః కుశలో నీతిమాం శ్చా-
పృపాసితా బ్రాహ్మణానాం మనీషీ,
నానావిధాంశ్చైవ మహాబలాం శ్చ
రాజన్యభోజా ననుశాస్తి కృష్ణః. 9

ఈ కృష్ణుడు ధర్మమునకు ప్రభువు; నేర్పరి, నీతిమంతుడు, బ్రహ్మవేత్తలను ఉపాసించువాడు, ధీశాలి; మహాబలము గలవారు, అనేకస్వభావములు గలవారును అగు భోజాదివంశమువారిని శాసించుచున్నాడు.

యది హ్యహం విసృజన్ సామ గర్హ్యో
నియుధ్యమానో యది జహ్యాం స్వధర్మమ్,
మహాయశాః కేశవ స్తద్బ్రవీతు
వాసుదేవ స్తూభయో రర్థకామః. 10

నేను సామమార్గమును వదలి నింద పొందవలసినవాడనో, యుద్ధము చేయుచు స్వధర్మమును విడచి నింద పొందుదునో, గొప్పకీర్తి కలవాడు, వాసుదేవుడు నగు నీ కేశవుడు చెప్పవలయును. ఆయన రెండు పక్షములవారికి మేలు కోరువాడు గదా !

శైనేయోఽయం చేదయ శ్చాన్ధకాశ్చ
వార్ష్ణేయభోజాః కుకురాః సృఞ్జయాశ్చ,
ఉపాసీనా వాసుదేవస్య బుద్ధిం
నిగృహ్య శత్రూన్ సుహృదో నన్దయన్తి. 11

ఈ సాత్యకి చేది, అంధక, వృష్ణి, భోజ, కుకుర, సృంజయవంశముల వారు వాసుదేవుని బుద్ధిని అంటిపెట్టుకొని యుందురు. వీరందరు శత్రువులను పరిమార్చి మిత్రములను ఆనందపెట్టుదురు.

---

9. ధర్మేశ్వరః - ధర్మఫలము నొసగువాడు;
10. నేను సామమార్గమును వదలిన కారణమున నింద నందుదునో, యుద్ధము చేసిన కారణమున ధర్మభ్రష్టుడనై నింద నొందుదునో ప్రమాణీకరించి చెప్పగలవాడు కృష్ణు డొక్కడే. అత డెట్లు నిర్ణయించినను నా కభిమతమే యని తాత్పర్యము.

వృష్ణ్యన్ధకా హ్యుగ్రసేనాదయో వై
కృష్ణప్రణేతాః సర్వ ఏవేన్ద్రకల్పాః,
మనస్వినః సత్యపరాయణాశ్చ
మహాబలా యాదవా భోగవన్తః. 12

వృష్ణి, అంధక, వంశములవారైన ఉగ్రసేనుడు మొదలగువా రందరు కృష్ణుని బట్టి నడచుకొనువారు. ఒక్కొక్కడు దేవేంద్రునంతటివాడు. అభిమానమే వారి ధనము. మాట మీద నిలబడువారు. ఈ యాదవు లెల్లరు గొప్పబలము, మహాభోగములు గలవారు.

కాశ్యో బభ్రుః శ్రియ ముత్తమాం గతో
లబ్ధ్వా కృష్ణం భ్రాతర మీశితారమ్,
యస్మై కామాన్ వర్షతి వాసుదేవో
గ్రీష్మాత్యయే మేఘ ఇవ ప్రజాభ్యః. 13

సర్వేశ్వరుడగు కృష్ణుని సోదరునిగా పొందిన బభ్రువు ఉత్తమసంపద నంది వెలుగొందుచున్నాడు. వాసుదేవు డాతనికి, వర్షకాలమున మేఘము ప్రజలకు వర్ష మొసగినట్లు, కోరిన కోరికల నెల్ల వర్షించును.

ఈదృశోఽయం కేశవ స్తాత విద్వాన్
విద్ధి హ్యేనం కర్మణాం నిశ్చయజ్ఞమ్,
ప్రియశ్చ నః సాధుతమశ్చ కృష్ణో
నాతిక్రామే వచనం కేశవస్య. 14

బాబూ! కేశవు డిట్టివాడు; అన్నియు తెలిసినవాడు; సర్వ కార్యముల నిశ్చయములను ఎఱిగినవాడు; మాకు మిక్కిలి యిష్టుడు; అంత మంచివాడు మఱియొకడు లేడు; అతని మాటను నేను జవదాటను.

ఇతి శ్రీమహాభారతే ఉద్యోగపర్వణి సఞ్జయయానపర్వణి
యుధిష్ఠిరవాక్యే అష్టావింశోఽధ్యాయః.

ఇది శ్రీమహాభారతము ఉద్యోగపర్వమున సంజయయానపర్వమున
యుధిష్ఠిరవాక్య మను ఇరువది యెనిమిదవ అధ్యాయము.

—(౦)—

12. కృష్ణప్రణేతాః- కృష్ణుడే వారికి నీతిమార్గమును బోధించె నని భావము. మనస్వినః, సత్యపరాయణాః మొదలగు మాటలవలన వారి నెట్టివారును ఏ విధముగను, ప్రలోభపెట్టజాల రను విషయము వ్యక్తమగుచున్నది.

# ఏకోనత్రింశోఽధ్యాయః - ఇరువది తొమ్మిదవ అధ్యాయము

సఞ్జయకథనస్య ప్రత్యుత్తరం దదతా శ్రీకృష్ణేన తం
ప్రతి ధృతరాష్ట్రకర్తవ్యస్య విజ్ఞప్తిః.

**సంజయుడు చెప్పిన దానికి బదులు పలుకుచు శ్రీకృష్ణుడు అతనితో ధృతరాష్ట్రుడు చేయవలసినదానిని విన్నవించుట.**

వాసుదేవ ఉవాచ - వాసుదేవు డిట్లు పలికెను.

అవినాశం సఞ్జయ పాణ్డవానా -
మిచ్ఛా మ్యహం భూతి మేషాం ప్రియం చ,
తథా రాజ్ఞో ధృతరాష్ట్రస్య సూత
సమాశంసే బహుపుత్రస్య వృద్ధిమ్. 1

సంజయా! నేను పాండవుల క్షేమమును కాంక్షింతును. వీరికి సంపదను, ప్రియమును అభిలషింతును. అట్లే చాలమంది కొడుకులున్న ధృతరాష్ట్ర మహారాజు అభివృద్ధిని కూడ కోరుదును.

కామో హి మే సఞ్జయ నిత్యమేవ
నాన్య ద్బ్రూయాం తాన్ ప్రతి శామ్యతేతి,
రాజ్ఞశ్చ హి ప్రియ మేత చ్ఛృణోమి
మన్యే చైతత్ పాణ్డవానాం సమక్షమ్. 2

సంజయా! నాదియు నెల్లప్పుడు అదియే కోరిక. శాంతింపుడని కాక మరియొక మాట పాండవులకు చెప్పను. రాజైన ధర్మజుడును, పాండవుల

---

2. శామ్యత ఇతి వచనాత్ అన్యత్ తాన్ ప్రతి న బ్రూయామ్. - శాంతి నొందుడు అను మాటకంటె వేరు మాటను వారితో ననను; పాణ్డవానామ్, సమక్షమ్ - తక్కిన భీముడు మొదలగువారి యెదుట, యుధిష్ఠిరాచ్చ ఏతదేవ శృణోమి - ధర్మజుని వలన దీనినే వినుదును. ఏతత్ మన్యే - దీనినే మన్నింతును; -

యెదుట ఆ ప్రియమైన మాటనే పలుకుచుండగా వినుచున్నాను. దానిని నేనును మన్నింతును.

సుదుష్కర స్త్వత్ర శమో హి నూనం
ప్రదర్శితః సఞ్జయ పాణ్డవేన,
యస్మిన్ గృధ్రో ధృతరాష్ట్రః సపుత్రః
కస్మాదేషాం కలహో నావమూర్ఛేత్. 3

సంజయా! ఈ పాండుతనయుడు వారియందు ఎవ్వరికిని సాధ్యముకాని శాంతిని చూపియే యున్నాడు గదా! కాని కొడుకులవాడైన ధృతరాష్ట్రుడు రాజ్యమును మ్రింగివేయ జూచుచున్నాడు. ఇక కురువంశమువారికి ఏకారణమున యుద్ధము కాకుండును?

న త్వం ధర్మం విచరం సఞ్జయేహ
మత్తశ్చ జానాసి యుధిష్ఠిరాచ్చ,
అథో కస్మాత్ సఞ్జయ పాణ్డవస్య
ఉత్సాహినః పూరయతః స్వకర్మ. 4

సంజయా! నీవు నావలనకాని ధర్మరాజువలనగాని ధర్మము చెదరిపోవుట చూడవు గదా! అట్టియెడ తనధర్మమును పాలించుచున్న ఉత్సాహవంతుడు ధర్మరాజును ఏ కారణమున కాదందువు?

యథా ఖ్యాత మావసతః కుటుమ్బే
పురా కస్మాత్ సాధు విలోప మాత్థ,
అస్మిన్ విధౌ వర్తమానే యథావ -
దుచ్చావచా మతయో బ్రాహ్మణానామ్. 5

---

3. గృధ్నః - లోభి.
4. పూరయతః - పాలించుచున్న; విచరమ్ - విచలితమైన;
5. యథాఖ్యాతమ్ - లోకప్రసిద్ధి ననుసరించి; కుటుమ్బే - గృహస్థధర్మమున, ఆవసతః - నిలిచియున్న, (యుధిష్ఠిరే - ధర్మరాజునందు) సాధు విలోపమ్ - ధర్మలోపమును; కస్మాత్ - దేనిని చూచి; ఆత్థ - పలికి

లోకప్రసిద్ధి ననుసరించి గృహస్థధర్మమున నున్న ధర్మరాజునందు ధర్మలోపమునుగూర్చి నీ వెట్లు పలికితివి? ఈ విధి యిట్లున్నను బ్రాహ్మణుల అభిప్రాయములు ఎక్కువ తక్కువలుగా అనేకవిధములుగా నున్నవి.

కర్మణాహుః సిద్ధి మేకే పరత్ర
హిత్వా కర్మ విద్యయా సిద్ధి మేకే,
నాభుఞ్జానో భక్ష్యభోజ్యస్య తృప్యే -
ద్విద్వానపీహ విహితం బ్రాహ్మణానామ్. 6

కర్మమువలననే పరలోకమున మోక్ష మని కొందరు చెప్పుదురు. కర్మమును వదలి జ్ఞానము పొందిననే మోక్షమని మరికొందఱును వక్కాణింతురు. జ్ఞానము పొందినవాడైనను తినవలసిన దానిని తినక తృప్తి నందుటలేదు. సంన్యాసులకును గృహస్థునియింట భోజనమును శాస్త్రము విధించినది గదా!

---

తివి? అస్మిన్ విధౌ వర్తమానే - అపి - ఈవిధి ఇట్లున్నను "శుచియైనవాడు, ఇతరులకు ద్రోహము చేయనివాడునై నరుడు పవిత్రమగు దేశమున వేదములను పఠించుచు జీవిత మున్నంతవరకు నడచుకొనవలయును' అను ధర్మము ఉన్నప్పటికిని; బ్రాహ్మణానామ్-బ్రాహ్మణులలో; ఉచ్చావచా - హెచ్చుతగ్గులైన; మతయః-అభిప్రాయములు; యథావత్ - ఆ యా విధములుగా నున్నవి; గృహస్థుడు పరిగ్రహము చేయదగునా? త్యాగము నవలంబింపవలయునా ? నైష్ఠికబ్రహ్మచర్యమా ? సన్న్యాసమా ? అనునవి మతభేదములు.

6. సిద్ధిమ్ - మోక్షమును, విద్యయా - జ్ఞానముచేత: కర్మణా - కర్మముచేత-"కర్మణైవ హి సంసిద్ధి మాస్థితా జనకాదయః." జనకాదులు కర్మముచేతనే సంసిద్ధిని పొందిరి-అని కొందరు. "న కర్మణా న ప్రజయా ధనేన త్యాగేనై కే అమృతత్వ మానశుః"-కర్మముచేత, ప్రజచేత,ధనముచేతకాదు, త్యాగముచేతనే అమృతత్వమును పొందిరి-అని కొందరు. ఇట్లు గృహస్థధర్మము, సంన్యాసము - అనునవి రెండును శాస్త్రము చెప్పినవే యైనను, మొత్తముమీద చూడగా సంన్యాసాశ్రమముచేత సాధ్యమగు జ్ఞానమును గృహస్థుడు కూడా సాధింపగలడు గాని, గృహస్థునకు సాధ్యమైన యజ్ఞాదికము ఇతర ఆశ్రమములవారికి సాధ్యము కాదను భావముతో గృహస్థ

యా వై విద్యాః సాధయన్తీహ కర్మ
తాసాం ఫలం విద్యతే నేతరాసామ్,
తత్రేహ వై దృష్టఫలం తు కర్మ
పీత్వోదకం శామ్యతి తృష్ణయాఽఽర్తః. 7

ఏ విద్యలు కర్మమును సాధించుచున్నవో వానికే ఫలము కానవచ్చుచున్నది. ఇతరములకు కాదు. కర్మమునకు ఫలము ప్రత్యక్షముగా కన్పించుచున్నది కదా! దప్పిగొన్నవాడు నీరు త్రాగి ఉపశాంతి పొందుచున్నాడు గదా!

---

ధర్మమే మేలైనదను తాత్పర్యముతో చెప్పుచున్నారు - విద్వాంసుడు కూడ తినక తృప్తినొందడు. బ్రహ్మవిద్యావేత్తలగు సంన్యాసులకును గృహస్థుని యింట భోజనాదికమును శాస్త్రము విధించుచున్నది.

7. కర్మములకు అనుకూలములైన విద్యలే, ఫలవంతములు కాని ప్రతికూలములు కావని ఈ శ్లోకము ద్వారా చెప్పుచున్నారు. ఛాందోగ్య - ఉపనిషత్తులో 'సర్వాణి హ వా ఇమాని భూతాని ప్రాణమేవాభిసంవిశన్తి' మొదలగు మంత్రములు సర్వభూతములలో ప్రవేశించుట, బయలు వెడలుట అను గుర్తులద్వారా జగత్కారణముగా ప్రాణమును నిరూపించినవి. అట్టి ప్రాణరూపపరమాత్మకు సంబంధించిన విద్య కర్మ వలన సాధింపదగు ననుట వ్యక్తమే. అట్లు కర్మసాధకములగు విద్యలకే ఫలము కాని యితరములగు స్వతంత్ర విద్యలకు కాదు. ఇచట భావ మిది-గృహస్థుడు తన్ను ఇతరులగు పిత్రాదులను తరింపజేయుచున్నాడు; యతులను పోషించుచున్నాడు. యతియో తన్నుమాత్రమే తరింపజేసి కొనుచున్నాడు. పిత్రాదులను తరింపజేయుట లేదు. తన పోషణము కూడ తాను చేసికొనుట లేదు. అతని బ్రదుకుతెరువు భిక్షాటనమే కదా! ఆ విధముగా గార్హస్థ్యమే శ్రేష్ఠమని యిందు శ్రీకృష్ణుని ఆశయము. తత్ర... మరియు నిష్కర్మత దృష్టవిరుద్ధము కూడా నగుచున్నది. తత్ర-కర్మము, అది లేకుండుట అను వాని తారతమ్యము-విచారింపగా కర్మఫలమును ఇచ్చుటనే చూడవచ్చును. దృష్టాంతము దప్పిగొన్నవాడు నీరు త్రావుట.

సోఽయం విధిర్విహితః కర్మణైవ
సంవర్తతే సఞ్జయ తత్ర కర్మ,
తత్ర యోఽన్యత్ కర్మణః సాధు మన్యే -
న్మోఘం తస్యాలపితం దుర్బలస్య. 8

సంజయా! ఆ జ్ఞానమార్గమును కర్మముతో కలిపియే విధించిరి. దాని నాచరించినచో కర్మము తెగిపోవును. కర్మముకంటె భిన్నముగా సంన్యాసమును ఎవ్వడైన సంభావించినచో ఆ బలహీనుని వాగుడు నిలువదు.

కర్మణాఽమీ భాన్తి దేవాః పరత్ర
కర్మణైవేహ ప్లవతే మాతరిశ్వా,
అహోరాత్రే విదధత్ కర్మణైవ
అతన్ద్రితో నిత్య ముదేతి సూర్యః. 9

పరలోకమున దేవత లందరు కర్మముతోడనే ప్రకాశించుచున్నారు. వాయువు కర్మముతోడనే కదలాడుచున్నది. రాత్రి, పగలు అనువానిని ఏర్పరచుచు సూర్యుడు ఏమరుపాటులేక కర్మమును బట్టియే ప్రతిదినము ఉదయించుచున్నాడు.

మాసార్ధమాసా నథ నక్షత్రయోగా -
నతన్ద్రిత శ్చన్ద్రమా శ్చాభ్యుపైతి,
అతన్ద్రితో దహతే జాతవేదాః
సమిధ్యమానః కర్మ కుర్వన్ ప్రజాభ్యః. 10

---

8. సః అయమ్-ఆ జ్ఞానవిధి; కర్మణా సహ ఏవ-కర్మముతో కూడియే; విహితః- విధింపబడినది. తత్ర చ - అట్టి దాని నాచరించినచో; కర్మ- కర్మము; సంవర్తతే-తెగిపోవును. కర్మముతో కలిసిన జ్ఞానము కర్మమును త్రెంపగలదని భావము.

9. ఈ శ్లోకమున కర్మముతో కూడిన జ్ఞానమును ప్రశంసించుచున్నాడు.

చంద్రుడును, అలసత యెఱుగక నక్షత్రములతో కలియుచు నెలలు, పక్షములు చేయుచున్నాడు. అట్లే అగ్నిదేవుడును ప్రజలకొఱకు తనవిధిని నిర్వహించుచు మంటబెట్టినపుడు మండుచున్నాడు.

అతన్ద్రితా భార మిమం మహాన్తం
బిభర్తి దేవీ పృథివీ బలేన,
అతన్ద్రితా శీఘ్ర మపో వహన్తి
సన్తర్పయన్త్యః సర్వభూతాని నద్యః. 11

భూదేవి అలసతలేనిదై ఈ మహాభారము నంతటిని తన బలముతో మోయుచున్నది. అట్లే జలములు నదీరూపమున సర్వభూతములను ఆప్యాయనము చేయుచు వేగముతో ప్రవహించుచున్నవి.

అతన్ద్రితో వర్షతి భూరితేజాః
సన్నాదయ న్నన్తరిక్షం దిశశ్చ,
అతన్ద్రితో బ్రహ్మచర్యం చచార
శ్రేష్ఠత్వ మిచ్ఛన్ బలభి ద్దేవతానామ్. 12

గొప్పతేజముగల మేఘుడు ఏమరక దిక్కులను ఆకసమును పిక్కటిల్ల జేయుచు వర్షము కురియుచున్నాడు. దేవేంద్రుడును దేవతలలో శ్రేష్ఠత్వమును గోరుచు పొరపాటు లేనివాడై బ్రహ్మచర్యమును పాటించెను.

హిత్వా సుఖం మనసశ్చ ప్రియాణి
తేన శక్రః కర్మణా శ్రైష్ఠ్య మాప,
సత్యం ధర్మం పాలయ న్నప్రమత్తో
దమం తితిక్షాం సమతాం ప్రియం చ. 13

ఆ యింద్రుడు కొంచెమైన పొరపాటు పడక, సుఖమును పరిత్యజించి, మనసునకు ప్రియమైన వానిని వర్జించి, సత్యమును, ధర్మమును, ఇంద్రియ నిగ్రహమును, తితిక్షను పాలించుచు, సమత్వబుద్ధితో ప్రియముతో ఆ కర్మ మార్గము నవలంబించి అందరికంటె గొప్పవా డయ్యెను.

---

13. తితిక్షామ్ - చలి, ఎండ, వాన మొదలగువాని నన్నింటిని సహించుట;

ఏతాని సర్వా ణ్యుపసేవమానః
స దేవరాజ్యం మఘవాన్ ప్రాప ముఖ్యమ్.

పై చెప్పిన మహాగుణము లన్నింటిని శ్రద్ధతో పాటించుచు దేవేంద్రుడు గొప్పదైన దేవరాజ్యమును పొందెను.

బృహస్పతి ర్బ్రహ్మచర్యం చచార
సమాహితః సంశితాత్మా యథావత్. 14
హిత్వా సుఖం ప్రతిరుధ్యేన్ద్రియాణి
తేన దేవానా మగమ ద్గౌరవం సః.

దృఢనిశ్చయము, చలించని మనస్సుగల బృహస్పతియు అదేవిధముగ సుఖమును విడనాడి యింద్రియముల నరికట్టి బ్రహ్మచర్యమును పాటించెను. దానిచేత అతడు దేవతలకు గురువయ్యెను.

తథా నక్షత్రాణి కర్మణాఽముత్ర భాన్తి
రుద్రాదిత్యా వసవోఽథాపి విశ్వే. 15

అట్లే నక్షత్రములు, రుద్రులు, ఆదిత్యులు, వసువులు, విశ్వేదేవతలు పరలోకమున తమ తమ కర్మలతోనే వెలుగొందుచున్నారు.

యమో రాజా వైశ్రవణః కుబేరో
గన్ధర్వరక్షాప్సరసశ్చ సూత,
బ్రహ్మవిద్యాం బ్రహ్మచర్యం క్రియాం చ
నిషేవమాణా ఋషయోఽముత్ర భాన్తి. 16

యమరాజు, విశ్రవణుని కుమారుడగు కుబేరుడు, గంధర్వులు, రక్షులు, అప్సరసలు కర్మముతో ప్రకాశించుచున్నారు. అట్లే బ్రహ్మవిద్యను, బ్రహ్మచర్యమును, కర్మములను చక్కగా ఆచరించుచు ఋషులు విరాజిల్లుచున్నారు.

---

16. బ్రహ్మవిద్య - జ్ఞానము; బ్రహ్మచర్యము-ఆచరణ; క్రియామ్ - యజ్ఞాది కర్మము.

జాన న్నిమం సర్వలోకస్య ధర్మం
విప్రేన్ద్రాణాం క్షత్రియాణాం విశాం చ,
స కస్మా త్త్వం జానతా జ్ఞానవాన్ సన్
వ్యాయచ్ఛసే సఞ్జయ కౌరవార్థే. 17

సమస్తలోకము ధర్మము నీ వెఱుగుదువు. ఉత్తములైన బ్రహ్మవేత్తలయు, క్షత్రియులయు, ఇతరజనులయు ధర్మము లేవో యెఱుగుదువు. అట్టి నీవు చక్కని జ్ఞానము గలవాడవై యుండియు, జ్ఞానవంతులగు పాండవులను, కౌరవుల కొఱకై, పట్టి పాలార్తు వేల ?

ఆమ్నాయేషు నిత్యసంయోగ మస్య
తథాశ్వమేధే రాజసూయే చ విద్ధి,
సంయుజ్యతే ధనుషా వర్మణా చ
హస్త్యశ్వాద్యై రథశస్త్రైశ్చ భూయః. 18

ఈ ధర్మరాజునకు వేదములతో వీడని ముడి గలదు. అశ్వమేధము, రాజసూయము, మున్నగువానితో సంబంధము గలదు. ఎఱుగుము. విల్లు, కవచము ధరించియే యున్నాడు. ఏనుగులు, గుఱ్ఱములు, రథములు, ఆయుధములు మొదలగువానితో కూడియే యున్నాడు.

తే చే దిమే కౌరవాణా ముపాయ -
మవగచ్ఛేయు రవధేనైవ పార్థాః,
ధర్మత్రాణం పుణ్య మేషాం కృతం స్యా -
దార్యే వృత్తే భీమసేనం నిగృహ్య. 19

---

17. వ్యాయచ్ఛసే - అదిమి పెట్టుచున్నావు;

18. విద్యలు, ధర్మము, శౌర్యము అనునవి యుధిష్ఠిరునియందు పుష్కలముగా గలవు. ఆయనకు మఱియొకడు బోధింపనక్కరలేదు. ఆతనిని గెలుచుటకు సాధ్యము కాదు అని భావము.

19. రాజ్యప్రాప్తికై కౌరవులను చంపనక్కరలేని ఉపాయమున్నచో వీరికి పుణ్యము దక్కును గదా! భీమసేనుడు క్రూరమైన హింస నేల చేయును? అని భావము.

ఈ పాండవులు కౌరవులను చంపకయే రాజ్యమును పొందు ఉపాయ మును గాంచి రేని, భీమసేనుని ఎట్లో అర్యుల ప్రవర్తన యగు అహింసయందు పట్టి నిలిపి, ధర్మమును రక్షించుకొందురు గదా! పుణ్యమును సాధించుకొందురు గదా!

తే చేత్ పిత్ర్యే కర్మణి వర్తమానా
ఆపద్యేరన్ దిష్టవశేన మృత్యుమ్,
యథాశక్త్యా పూరయన్తః స్వకర్మ
తదప్యేషాం నిధనం స్యాత్ ప్రశస్తమ్. 20

మఱియు, తండ్రితాతల వరుసను వచ్చిన క్షత్రియధర్మమునందు నిలబడి శక్తికొలది తమధర్మమును పాలించుచు, విధివశమున మృత్యువును పొందినను వీరికి అట్టి చావుకూడ మేలైనదే కదా!

ఉతాహో త్వం మన్యసే శామ్యమేవ
రాజ్ఞాం యుద్ధే వర్తతే ధర్మతన్త్రమ్,
అయుద్ధే వా వర్తతే ధర్మతన్త్రం
తథైవ తే వాచ మిమాం శృణోమి. 21

శమించుటయే నీవు మేలందువు. రాజులకు ధర్మమును పాలించుట యుద్ధమునందో, యుద్ధము చేయకుండుటయందో నీవే చెప్పుము. ఆ నీమాట నేను విందును.

చాతుర్వర్ణ్యస్య ప్రథమం సంవిభాగ -
మవేక్ష్య త్వం సఞ్జయ స్వం చ కర్మ,

---

20. పిత్ర్యే కర్మణి - వంశమునుబట్టి వచ్చిన యుద్ధకర్మమునందు: స్వకర్మ పూరయన్తః-తమ ధర్మమును పాలించుకొనుచు;

21. శామ్యమేవ మన్యసే - శమించుటయే కార్యమని నీవు తలచినచో; ధర్మతన్త్రమ్-ధర్మము ననుష్ఠించుట; ఇమాం తే వాచం శృణోమి - ఈ నీ మాటను విందును. అనగా ఆచరింతు నని భావము.

నిశమ్యాథో పాణ్డవానాం చ కర్మ
ప్రశంస వా నిన్ద వా యా మతి స్తే. 22

ముందు నాలుగు వర్ణములవారికి వేరువేరుగా నిర్ణయింపబడిన కర్మములను పరికింపుము. నీ కర్మమేమో పాండవుల కర్మమేమో చక్కగా వినుము. అటుపై నీ బుద్ధిని బట్టి పొగడుము లేదా తెగడుము.

అధీయీత బ్రాహ్మణో వై యజేత
దద్యా దీయా త్తీర్థముఖ్యాని చైవ,
అధ్యాపయే ద్యాజయే చ్చాపి యాజ్యాన్
ప్రతిగ్రహాన్ వా విహితాన్ ప్రతీచ్ఛేత్. 23

బ్రాహ్మణుడు వేదములను పఠింపవలయును, యజ్ఞములు చేయవలయును. దానము లొసగవలయును. తీర్థములు మున్నగువానిని సేవింపవలయును. వేదముల నితరులకు బోధింపవలయును. ఇతరులచేత యజ్ఞములను చేయింపవలయును. యోగ్యములగు దానములను గ్రహింపవలయును.

తథా రాజన్యో రక్షణం వై ప్రజానాం
కృత్వా ధర్మేణాప్రమత్తోఽథ దత్త్వా,
యజ్ఞై రిష్ట్వా సర్వవేదా నధీత్య
దారాన్ కృత్వా పుణ్యకృదావసే ద్గృహాన్. 24

అట్లే రాజవంశమున బుట్టినవాడు, ప్రజలను ధర్మముతో మెలకువతో రక్షించుచు, దానము లిచ్చుచు, యజ్ఞములు చేయుచు, సకల వేదములను పఠించుచు, భార్యను స్వీకరించి, పుణ్యము నాచరించుచు గృహస్థాశ్రమమున నిలువవలయును.

స ధర్మాత్మా ధర్మ మధీత్య పుణ్యం
యదిచ్ఛయా వ్రజతి పుణ్యలోకమ్,

22. క్షత్రియధర్మము లోపించునని వంశమువారిని చంపుట న్యాయమా? అను ఆశంకకు సమాధానము ఈ శ్లోకములో వివరించుచున్నారు.
23. ప్రతీచ్ఛేత్ - స్వీకరింపవలయును;

అట్టి ధర్మాత్ము డగు క్షత్రియుడు పుణ్యమైన ధర్మమును పొంది ఆ ధర్మబలముతో పుణ్యలోకమున కరుగును.

వైశ్యోఽధీత్య కృషిగోరక్షపణ్యై -
ర్విత్తం చిన్వన్ పాలయ న్నప్రమత్తః. 25
ప్రియం కుర్వన్ బ్రాహ్మణక్షత్రియాణాం
ధర్మశీలః పుణ్యకృ దావసే ద్గృహాన్.

వైశ్యుడు వేదములను చదివి వ్యవసాయము, గోపాలనము, వ్యాపారము అనువానితో ధనమును కూడబెట్టుచు మెలకువతో దానిని రక్షించుచు బ్రాహ్మణుల కును, క్షత్రియులకును ప్రియ మాచరించుచు ధర్మశీలుడై పుణ్యకార్యము లాచరించుచు గృహమునం దుండవలయును.

పరిచర్యా వన్దనం బ్రాహ్మణానాం
నాధీయీత ప్రతిషిద్ధోఽస్య యజ్ఞః,
నిత్యోత్థితో భూయతేఽతన్ద్రితః స్యా -
దేవం స్మృతః శూద్రధర్మః పురాణః. 26

శూద్రుడు పరిచర్య చేయవలయును. బ్రహ్మవేత్తలకు వందనము చేయ వలయును. వేదములను చదువరాదు. యజ్ఞ మాతడు చేయరాదు. ఎల్లప్పుడు మెలకువతో ప్రవర్తింపవలయును.

ఏతాన్ రాజా పాలయ న్నప్రమత్తో
నియోజయన్ సర్వవర్ణాన్ స్వధర్మే,
అకామాత్మా సమవృత్తిః ప్రజాసు
నాధార్మికా ననురుధ్యేత కామాన్. 27

రాజు ఈ ధర్మముల నన్నిటిని మిక్కిలి జాగరూకతతో పరిరక్షింపవల యును. అన్నివర్ణములవారిని వారి వారి ధర్మములందు నెలకొల్పవలయును.

---

25. సః-ఆక్షత్రియుడు; ధర్మమ్, అధీత్య-ధర్మమును పొంది; యదిచ్ఛయా-ఏధర్మము బలముతో; పుణ్యలోకం వ్రజతి-బ్రహ్మలోకమును పొందునో అట్టి శాస్త్రధర్మము విడువనే రాదని తాత్పర్యము.

మనసునందు కోరికలను విడనాడి ప్రజలయందు సమభావముతో మెలగవల యును. ధర్మవిరుద్ధములగు కామముల వెంటబడి పోరాదు.

శ్రేయాం స్తస్మాద్యది విద్యేత కశ్చి -
దభిజ్ఞాతః సర్మధర్మోపపన్నః,
స తం ద్రష్టు మనుశిష్యన్ ప్రజానాం
న చైత ద్బుధ్యే దితి తస్మి న్నసాధుః. 28

సర్వధర్మములతో కూడినవాడు, లోకమున బాగుగా ప్రసిద్ధికెక్కిన వాడు, ధర్మరాజుకంటె గొప్పవాడును ఎవ్వడైన నున్నయెడల నట్టివాడు ఆ

---

27. గృహస్థధర్మము, ఆశ్రమము లన్నింటిని పరిరక్షించును గాన అన్నిటి కంటె మిన్నయైనట్లు సర్వవర్ణధర్మములను ధర్మమార్గమున రక్షించు రాజ్యపాలనము మిక్కిలి శ్రేష్ఠ మని తాత్పర్యము.

28. సర్వధర్మోపపన్నః—అన్నిధర్మములను తనయందు ప్రతిష్ఠించుకొనిన వాడును; అభిజ్ఞాతః-జ్ఞానమును బట్టియు, ధర్మమును బట్టియు, ప్రసిద్ధి కెక్కినవాడును; తస్మాత్-ఆ ధర్మరాజుకంటె; శ్రేయాన్-ప్రశస్తతరుడు; కశ్చిత్, అస్తి యది-ఒక డున్నయెడల; సః-అట్టివాడు; తం-ఆ ధర్మ రాజును; ప్రజానామ్-ప్రజలను (కర్మార్థమున షష్ఠి) ద్రష్టుమ్-చూచుటకు (ప్రజాపాలనరూపమైన రాజ్యమును పొందుటకు) అనుశిష్యన్ - అను శాసింపగోరుచు; ఏతత్—ఇప్పుడు నేను చెప్పిన ధర్మసముదాయ మంతయు యుధిష్ఠిరునియందు గల దను నంశమును; బుద్ధ్యేత్-తెలిసి కొనవలయును; తస్మిన్-ఆ ధర్మజునియందు; అసాధుః-సాధువు కాని ధర్మము, న, ఇతి-లేదనియు; బుద్ధ్యేత్-తెలియవలయును.

'తస్మిన్నసాధుః న' అనుదానికి మఱియొక విధముగాను అర్థము సంభా వింపదగును.

ధర్మరాజుకంటె గొప్పధర్మము లెరిగినవాని విషయమున ధర్మరాజు సాధువుకాడని కాదు. అనగా విశేషజ్ఞుని దృష్టిలోకూడ ధర్మరాజు సాధువే యని తాత్పర్యము. అట్టి మహానుభావుడు ఇంతకంటె విశేషముగా నెఱిగి బోధించినచో ధర్మరా జాతని మాటను తప్పక మన్నించు నని భావము.

యుధిష్ఠిరుని ప్రజలను చూచుటకై శాసింపగోరుచు, నేను చెప్పిన ధర్మసము దాయమంతయు నతనియం దున్నదని యెఱుంగవలయును. ఆతనియందు అసాధుధర్మము ఆవంతయు లేదనియు నెఱుగవలయును.

యదా గృధ్యేత్ పరభూతౌ నృశంసో
విధిప్రకోపా ద్బల మాదధానః,
తతో రాజ్ఞా మభవ ద్యుద్ధమేత -
త్తత్ర జాతం వర్మ శస్త్రం ధనుశ్చ. 29

ఆవలివానికి విధి వక్రించినందువలన తాను బలము పుంజుకొని యొకానొక క్రూరుడు ఇతరుని సంపదను గుంజుకొనగోరినపుడు రాజులకు యుద్ధ మనునది పుట్టెను. ఆ కారణముగనే కవచము, ఆయుధము, విల్లు అనునవి యేర్పడెను.

ఇన్ద్రేణైత ద్దస్యువధాయ కర్మ
ఉత్పాదితం వర్మ శస్త్రం ధనుశ్చ. 30

ఇట్టి దొంగమూకలను పరిమార్చుటకై యింద్రుడు ఈ యుద్ధ కర్మమును, కవచము, ఖడ్గము, విల్లు అనువానిని సృజించెను.

---

29. ధర్మమును బట్టి క్రూరాత్ముడగు దుర్యోధనుని ధార్మికుడైన ధర్మరాజు చంపనే వలయునని తాత్పర్యము నీ శ్లోకమును, తరువాతి అర్ధ శ్లోకమును ప్రతిపాదించుచున్నవి. పరభూతౌ - ఇతరుని యైశ్వర్యము నందు; నృశంసః - దొంగవలె క్రూరుడై. విధిప్రకోపాత్ - దైవ మనుకూలింపకపోవుటవలన;

30. కర్మ - యుద్ధమను కర్మము;
ఇంద్రుడు దస్యులను చంపుటకే కవచాదులను సృజించెను గావున వీనితో అధర్మప్రవర్తకులగు దుర్యోధనాదుల నణచుట ధర్మమే యని తాత్పర్యము.
ఒకవేళ దుర్యోధనుడే వీరిని యుద్ధమున చంపినచో అదియే ధర్మమగు ననియు భావము.

తత్ర పుణ్యం దస్యువధేన లభ్యతే
సోఽయం దోషః కురుభి స్తీవ్రరూపః,
అధర్మజ్ఞై ర్ధర్మ మబుధ్యమానైః
ప్రాదుర్భూతః సఞ్జయ సాధు తన్న. 31

అట్లు యుద్ధమున దొంగమూకలను చంపుటవలన పుణ్యము లభించును. ధర్మము నెఱుగనివారు, చెప్పినను తెలిసికొనుటకు ప్రయత్నింపనివారు నగు కౌరవులవలన ఈ వంచన యను దోషము చాల తీవ్రరూపముతో పుట్టినది. సంజయా! అది మేలుకాదు.

తత్ర రాజా ధృతరాష్ట్రః సపుత్రో
ధర్మ్యం హరేత్ పాణ్డవానా మకస్మాత్,
నావేక్షన్తే రాజధర్మం పురాణం
తదన్వయాః కురవః సర్వ ఏవ. 32

పాండవులకు ధర్మమును బట్టి వచ్చిన రాజ్యమును రాజైన ధృతరాష్ట్రుడు కొడుకులతో కూడి నిష్కారణముగా చేజిక్కించుకొనెను. అతనిని బట్టి పోవు కౌరవులు అందరును సనాతనమైన రాజధర్మమును పరికింపకున్నారు.

స్తేనో హరే ద్యత్ర ధనం హ్యదృష్టః
ప్రసహ్య వా యత్ర హరేత దృష్టః,
ఉభౌ గర్హ్యౌ భవతః సంజయైతౌ
కిం వై పృథక్త్వం ధృతరాష్ట్రస్య పుత్రే. 33

---

31. దుర్యోధనుడు దొంగ యనుటను నిరూపించుచున్నారు. ఈ తప్పంతటికిని కౌరవులే కారణము. ఇంద్రునివలన పారదార్యదోషము సంభవించినట్లు;

32. ధర్మ్యమ్-ధర్మమునుబట్టి వంశక్రమమున వచ్చిన దానిని; తదన్వయాః-అతని ననుసరించువారు,

33. పృథక్త్వం - దొంగకంటె వేరగుట.

ఒక దొంగ దొంగచాటుగా గాని, ప్రత్యక్షముగనే బలాత్కారముగా గానీ సొమ్మును దొంగిలించెనేని లోకము ఆ రెండువిధములవారిని నిందించుచునే యున్నది గదా! ధృతరాష్ట్రుని కొడు కింతకంటె నెట్లు భిన్న డగుచున్నాడు:

సోఽయం లోభా న్మన్యతే ధర్మమేతం
యమిచ్ఛతి క్రోధవశానుగామీ,
భాగః పునః పాణ్డవానాం నివిష్ట -
స్తం నః కస్మా దాదదీరన్ పరే వై. 34

ఈ దొంగతనమును లోభమువలన నా దుర్యోధనుడు ధర్మ మనుకొను చున్నాడు. పట్టుదల త్రిప్పినట్లు తిరుగుచు ఆ దొంగసొమ్మునే కోరుచున్నాడు. పాండవుల రాజ్యభాగము కౌరవులకడ ఇల్లడపెట్టిన సొమ్ము. అట్టి మా సొమ్మును వారేల చేజిక్కించుకొనిరి?

అస్మిన్ పదే యుధ్యతాం నో వధోఽపి
శ్లాఘ్యః పిత్ర్యం పరరాజ్యా ద్విశిష్టమ్,
ఏతాన్ ధర్మాన్ కౌరవాణాం పురాణా
నాచక్షీథా స్సఞ్జయ రాజమధ్యే. 35

ఇట్లు తప్పక పొందవలసిన రాజ్యము కారణముగా పోరుచున్న మాకు చావైనను మెచ్చదగినదే. తండ్రుల వరుసనుబట్టి వచ్చిన రాజ్యము పరుల రాజ్యము కన్న మేలైనది. ఈ పురాణధర్మములను. కౌరవులకు రాజు లందరు నున్నపుడు బోధింపుము.

ఏతే మదా న్మృత్యువశాభిపన్నాః
సమానీతా ధార్తరాష్ట్రేణ మూఢాః,
ఇదం పునః కర్మ పాపీయ ఏవ
సభామధ్యే పశ్య వృత్తం కురూణామ్. 36

---

34. ఏతం - వంచించి రాజ్యము పొందుట యనునది; నివిష్టమ్ - దాపుకకై ఒకని కిచ్చిన సొమ్ము.
35. పదే - తప్పక గ్రహింపదగిన రాజ్యభాగము కారణముగా.

దుర్యోధనుడు తెచ్చిన ఈ మూఢు లందరు పొగరెక్కి చావుమూడి యున్నారు. ఆ కౌరవులు నిండుసభలో చేసిన తప్పుడు పని ఎంత పాపమైనదో నీవే చూడు.

ప్రియాం భార్యాం ద్రౌపదీం పాణ్డవానాం
యశస్వినీం శీలవృత్తోపపన్నామ్,
య దుపైక్షన్త కురవో భీష్మముఖ్యాః
కామానుగే నోపరుద్ధాం వ్రజన్తీమ్. 37

ద్రుపదరాజు బిడ్డ, పాండవులకు ప్రియమైన భార్య, పేరెన్నిక కన్నది, చక్కని శీలము నడవడియు కలది. అట్టి సాధ్విని, రజస్వలయై యున్నదానిని దిక్కుతోచక పరువిడుచున్నదానిని భీష్మాదులగు కౌరవులు పట్టించుకొనరైరి.

తం చే త్తదా తే సకుమారవృద్ధా
అవారయిష్యన్ కురవః సమేతాః,
మమ ప్రియం ధృతరాష్ట్రోఽకరిష్యత్
పుత్రాణాం చ కృత మస్యాభవిష్యత్. 38

ఆ నీచుడగు దుశ్శాసనుని ఆనాడే పిన్నలు,పెద్దలు అందరు కలసి వారించి యున్నయెడల ధృతరాష్ట్రుడు నాకు ప్రియ మొనర్చియుండెడివాడు. వాని కొడుకులకు మే లయ్యెడిది.

దుశ్శాసనః ప్రాతిలోమ్యా న్నినాయ
సభామధ్యే శ్వశురాణాం చ కృష్ణామ్,

---

37. కామానుగేన - రజస్సుచేత; ఉపరుద్ధామ్ - గృహకృత్యములనుండి నిరోధింపబడిన (రజస్వల అయిన) వ్రజన్తీమ్ - దిక్కులేక పారిపోవుచున్న దానిని;

38. దుశ్శాసనుని నిలుపకపోవుటవలనను, నా కప్రియము చేసిన కారణమునను ధృతరాష్ట్రుని పుత్రులకు నాశము తప్పదని భావము.

సా తత్ర నీతా కరుణం వ్యపేక్ష్య
నాన్యం క్షత్తు ర్నాథ మవాప కిఞ్చిత్. 39

ఆ దుశ్శాసనుడు అక్రమముగా మామలున్న సభనడుమకు కృష్ణ నీడ్చుకొని వచ్చెను. అట్లు ఆమెను తెచ్చుచుండగా విదురు డొక్కడుతప్ప మఱి యెవ్వడును కొంచెమైనను దయతలచి ఆమెను రక్షింపరాలేదు.

కార్పణ్యాదేవ సహితా స్తత్ర భూపా
నాశక్నువన్ ప్రతివక్తుం సభాయామ్,
ఏకః క్షత్తా ధర్మ్యమర్థం బ్రువాణో
ధర్మబుద్ధ్యా ప్రత్యువా చాల్పబుద్ధిమ్. 40

ఆ సభలో కూడిన రాజులందరు దైన్యముతో వాని కెదురాడజాలరైరి. ఆ బుద్ధితక్కువ వానికి ఒక్క విదురుడు మాత్రము ధర్మబుద్ధితో ధర్మము వీడని పలుకు పలుకుచు ఎదురాడెను.

అబుద్ధ్వా త్వం ధర్మ మేతం సభాయా-
మథేచ్ఛసే పాణ్డవ స్యోపదేష్టుమ్,

నిండు సభలో జరిగిన యీ ధర్మమును నీ వెఱుగక నేడు ధర్మజునకు నీతులు చెప్పగోరుచున్నావు.

కృష్ణా త్వేతత్ కర్మ చకార శుద్ధం
సుదుష్కరం తత్ర సభాం సమేత్య. 41

---

39. ప్రాతిలోమ్యాత్ - వదినగారన్న గౌరవమును పాటింపక అక్రమముగా, కిఞ్చిత్ కరుణం వ్యపేక్ష్య - కొంచెమైనను జాలి తలచి; క్షత్తుః అన్యమ్- విదురునికంటె ఇతరుని; నాథమ్-రక్షించువానిని; న అవాప-పొందలేదు;

40. కార్పణ్యాత్ - దీనభావమువలన.

41. అంతటి తప్పుడుపని గావించిన వారి కేమియు బోధింపని నీవు ఇక్కడకు వచ్చి అన్ని ధర్మముల నెఱిగిన ధర్మరాజునకు నీతులు చెప్పుచున్నావు ఎంత అవివేకమో పరిశీలించు మను భావము ఇట వ్యక్తమగును.

యేన కృచ్ఛ్రాత్ పాణ్డవా నుజ్జహార
తథాత్మానం నౌరివ సాగరౌఘాత్.

ద్రౌపది సభలో ప్రవేశించి యెవ్వరికిని సాధ్యముకాని పవిత్రమగు పని నాచరించెను. దానితో నామె ఆ కష్టమునుండి, తన్ను, పాండవులను, సముద్ర కల్లోలమునుండి ఓడ జనుల నుద్ధరించినట్లు, బయటకు లాగెను.

యత్రాబ్రవీత్ సూతపుత్రః సభాయాం
కృష్ణాం స్థితాం శ్వశురాణాం సమీపే. 42

అప్పుడు సభలో మామల కడ నున్న కృష్ణను ఆ సూతుని కొడుకు ఏమని యాడెను ?

న తే గతి ర్విద్యతే యాజ్ఞసేని
ప్రపద్య దాసీ ధార్తరాష్ట్రస్య వేశ్మ,
పరాజితాస్తే పతయో న సన్తి
పతిం చాన్యం భావిని త్వం వృణీష్వ. 43

యజ్ఞసేనపుత్రీ ! నీకు వేఱొక గతి లేదు. దుర్యోధను నింట దాసి వగుము. పద, ఓడిన యీ పాండవులు నీ మగలు కారు. చక్కగా భావించి మరియొకనిని భర్తగా వరింపుము. (అని కర్ణుడు పలికెను).

యో బీభత్సో ర్హృదయే ప్రోత ఆసీ -
దస్థి చ్ఛిన్ద న్మర్మఘాతీ సుఘోరః,
కర్ణా చ్ఛరో వాఙ్మయ స్తిగ్మతేజాః
ప్రతిష్ఠితో హృదయే ఫాల్గునస్య. 44

కర్ణుడు ప్రయోగించిన ఆ పలుకుములికి మిక్కిలి పదునైనదై ఎముకలను చీల్చుకొని పోయి అర్జునుని గుండెలో మిక్కిలి ఘోరముగా దిగబడి ఆయువు పట్టులను పీడించుచు నాటియున్నది.

---

43. ప్రపద్య - పద.
44. ప్రోతః - ములికి; తిగ్మతేజాః - మిక్కిలి పదునెక్కినది;

కృష్ణాజినాని పరిధిత్సమానాన్
దుఃశాసనః కటుకా నభ్యభాషత్,
ఏతే సర్వే షణ్ఢతిలా వినష్టాః
క్షయం గతా నరకం దీర్ఘకాలమ్. 45

లేడి చర్మములను కట్టుకొన గోరుచున్న వీరిని దుశ్శాసనుడు, 'వీరందరు నపుంసకులు, చచ్చినవారు, పెక్కేండ్లు నరకమున బడిపోయిరి' అని కాఱులు కూసెను.

గాన్ధారరాజః శకుని ర్నికృత్యా
య దబ్రవీత్ ద్యూతకాలే స పార్థమ్,
పరాజితో నన్దనః కిం తవాస్తి
కృష్ణయా త్వం దీవ్య వై యాజ్ఞసేన్యా. 46

గాంధారరాజు శకుని పగతో జూదమాడునపుడు ధర్మజునితో నేమనెనో తెలియునా? 'నీ నందనుని కూడ ఓడితివి. ఇంక నీ కేమున్నది? యజ్ఞసేనుని బిడ్డను కృష్ణను పందెముగా పెట్టుము' అనెను.

జానాసి త్వం సఞ్జయ సర్వమేతత్
ద్యూతే వాక్యం గర్హ్య మేవం యథోక్తమ్,
స్వయం త్వహం ప్రార్థయే తత్ర గన్తుం
సమాధాతుం కార్య మేత ద్విపన్నమ్. 47

సంజయా! ద్యూతమునాటి ఈ పలుకు లన్నియు ఎంత నీచములో నీ వెరుగుదువు. ఈ భ్రష్టవ్యవహారమును చక్కదిద్దుటకు నేనే అక్కడకు రాగోరుచున్నాను.

---

45. పరిధిత్సమానాన్ - ధరింపగోరుచున్నవారిని; షణ్ఢతిలాః - పేడివాండ్రు.
46. నన్దనః - ఆనందింపజేయువాడు - చిట్టి తమ్ముడు సహదేవుడు.
47. విపన్నమ్ - చెడిన; సమాధాతుమ్ - చక్కదిద్దుటకు. స్వయం ప్రార్థయే- నేను స్వయముగా కోరుచున్నాను. ఇంతవరకు నన్నెవ్వరు నడుగలేదని భావము.

అహాపయిత్వా యది పాణ్డవార్థం
శమం కురూణా మపిచే చ్ఛకేయమ్,
పుణ్యం చ మే స్యా చ్చరితం మహోదయం
ముచ్యేరంశ్చ కురవో మృత్యుపాశాత్. 48

పాండవుల ప్రయోజనము తప్పిపోనీక కౌరవులకు నేను శాంతిని కూర్పగలుగుదునేని నా చరిత్రము, గొప్ప అభ్యుదయము గలదై పుణ్యమై వెలుగొందును. కురువంశము వారును మృత్యుపాశమునుండి ముక్తి పొందుదురు.

అపి చ వాచం భాషమాణస్య కావ్యాం
ధర్మారామా మర్థవతీ మహింస్రామ్,
అవేక్షేరన్ ధార్తరాష్ట్రాః సమక్షం
మాం చ ప్రాప్తం కురవః పూజయేయుః. 49

ధర్మమునకు పట్టైనదియు, చక్కని ప్రయోజనములను సాధించునదియు ఎవరిని బాధింపనిదియు, నీతితో కూడినదియు నగు నాపలుకును ధృతరాష్ట్రుని కొడుకులు పట్టించుకొందురు గాక! అటకు వచ్చిన నన్ను మన్నింతురు గాక!

అతోఽన్యథా రథినా ఫల్గునేన
భీమేన చైవాహవదంశితేన,
పరాసిక్తాన్ ధార్తరాష్ట్రాం శ్చ విద్ధి
ప్రదహ్యమానాన్ కర్మణా స్వేన పాపాన్. 50

అట్లుగాక మరియొకవిధముగా నైనచో మహారథి యగు అర్జునుడు యుద్ధమే అలంకారముగా గల భీముడును, ధృతరాష్ట్రసుతులను నుగ్గు నూచ గావింతురని యెఱుగుము. ఆ పాపాత్ములు చేతులార చేసికొన్న పాపముచేత కాలిపోవుచునే యున్నారనియు నెఱుగుము.

---

48. అహాపయిత్వా-చెడిపోనీక; శకేయమ్-సమర్థుడ నగుదునేని;
49. కావ్యామ్-కవి యనగా శుక్రుడు, అతనికి సంబంధించినది, నీతియుక్తమైనదని భావము.

పరాజితాన్ పాణ్డవేయాంస్తు వాచో
    రౌద్రా రూక్షా భాషతే ధార్తరాష్ట్రః,
గదాహస్తో భీమసేనోఽప్రమత్తో
    దుర్యోధనం స్మారయితా హి కాలే. 51

ఓడిన కుంతికొడుకులను దుర్యోధనుడు క్రూరములు, ఆయువుపట్టులను చీల్చునవియు నగు కాఱులు కూసెను. భీమసేనుడు గద చేపట్టి మెలకువతో తగు కాలమున ఆ దుర్యోధనునకు వానిని అప్పజెప్పును.

సుయోధనో మన్యుమయో మహాద్రుమః
    స్కన్ధః కర్ణః శకుని స్తస్య శాఖా,
దుఃశాసనః పుష్పఫలే సమృద్ధే
    మూలం రాజా ధృతరాష్ట్రోఽమనీషీ. 52

దుర్యోధనుడు కోపము రూపెత్తిన చెట్టు. దానికి బోదె కర్ణుడు. కొమ్మ శకుని. చక్కగా పూచిన కాచిన పూలు, పండ్లు దుశ్శాసనుడు. వ్రేళ్ళు బుద్ధిహీనుడగు ధృతరాష్ట్రుడు.

యుధిష్ఠిరో ధర్మమయో మహాద్రుమః
    స్కన్ధోఽర్జునో భీమసేనోఽస్య శాఖా,
మాద్రీపుత్రౌ పుష్పఫలే సమృద్ధే
    మూలం త్వహం బ్రహ్మ చ బ్రాహ్మణాశ్చ. 53

---

51. రౌద్రాః - మర్మములందు గట్టిగా నాటి బాధించువానిని; రూక్షాః - ఏ కొంచెము ఆర్ద్రభావము లేనివానిని; భాషతే-జూదమునాడు పలికెను;

53. అహమ్ - నేను అనగా పరమేశ్వరుడను, బ్రహ్మ - వేదము. ధార్తరాష్ట్రుని పెకలించివైచినచో ధృతరాష్ట్రు డొక్కడే చెడును. పాండవులు చెడినచో మేము మువ్వురము చెడుదుము. పెక్కుమందిని రూపుమాపుట సంభవింపదు అని తాత్పర్యము.

ధర్మరాజు ధర్మము రూపొందిన పెద్ద చెట్టు. దానికి బోదె అర్జునుడు. కొమ్మ భీమసేనుడు. విరియ గాచిన పూలు పండ్లు నకులసహదేవులు. వ్రేళ్ళన్ననో నేను, వేదములు, బ్రాహ్మణులు.

వనం రాజా ధృతరాష్ట్రః సపుత్రో
వ్యాఘ్రా స్తే వై సఞ్జయ పాణ్డుపుత్రాః,
మా వనం ఛిన్ధి సవ్యాఘ్రం
మా వ్యాఘ్రా నీనశన్ వనాత్. 54

ధృతరాష్ట్రుడును, వాని కొడుకులును ఒక అడవి. పాండుపుత్రులు పులులు. పులులతో కూడిన వనమును నరుకకుము. వనమునుండి పులులు వెడలి నశింపకుండుగాక.

నిర్వనో వధ్యతే వ్యాఘ్రో
నిర్వ్యాఘ్రం ఛిద్యతే వనమ్,
తస్మా ద్వ్యాఘ్రో వనం రక్షే -
ద్వనం వ్యాఘ్రం చ పాలయేత్. 55

అడవినుండి వెలువడిన పులిని చంపుదురు. పులులు లేని అడవిని నరుకుదురు. కావున పులి అడవిని, అడవి పులిని కాచుకొనవలయును.

లతా ధర్మా ధార్తరాష్ట్రాః శాలాః సఞ్జయ పాణ్డవాః,
న లతా వర్ధతే జాతు మహాద్రుమ మనాశ్రితా. 56

ధృతరాష్ట్రుని కొడుకులు తీగలవంటివారు. పాండవులు పెద్ద చెట్లు. మహావృక్షములను ఆశ్రయింపక లత యెన్నటికిని పెరుగదు.

స్థితాః శుశ్రూషితుం పార్థాః స్థితా యోద్ధు మరిందమాః,
యత్కృత్యం ధార్తరాష్ట్రస్య తత్కరోతు నరాధిపః. 57

---

56. లత యనుటవలన పాండవుల నాశ్రయించుటవలననే ధృతరాష్ట్రుని కొడుకులకు బ్రదుకు, మరియొకవిధమున లేదని భావము.

పాండవులు సేవించుటకు సిద్ధముగ నున్నారు. పగవారిని రూపుమాపు ఆ పాండవులు పోరుటకును సిద్ధముగనే యున్నారు. దుర్యోధనుడు ఏది చేయ దగునో యది చేయుగాక!

స్థితాః శమే మహాత్మానః పాణ్డవా ధర్మచారిణః,
యోధాః సమర్థా స్తద్విద్వ న్నాచక్షీథా యథాతథమ్. 58

ధర్మమున ప్రవర్తిల్లు మహాత్ములు పాండవులు శాంతియందే నిలిచి యున్నారు. మరియు వారు యోధులు, సమర్థులు. అంతయు నెరిగిన సంజయా! ఉన్నదున్నట్లు వారికి చెప్పుము.

ఇతి శ్రీమహాభారతే ఉద్యోగపర్వణి సఞ్జయయానపర్వణి
కృష్ణవాక్యే ఏకోనత్రింశోఽధ్యాయః.

ఇది శ్రీమహాభారతము ఉద్యోగపర్వమున సంజయయానపర్వమున
కృష్ణవాక్యముగల ఇరువది తొమ్మిదవ అధ్యాయము.

—(ం)—

## త్రింశోఽధ్యాయః - ముప్పదియవ యధ్యాయము

**సఞ్జయస్య నివర్తనసమయే యుధిష్ఠిరస్య సన్దేశః.**

**సంజయుడు తిరిగిపోవునప్పటి యుధిష్ఠిరుని సందేశము.**

సఞ్జయ ఉవాచ - సంజయు డిట్లు పలికెను.

ఆమన్త్రయే త్వాం నరదేవ దేవ
గచ్ఛామ్యహం పాణ్డవ స్వస్తి తేఽస్తు,
కచ్చి న్న వాచా వృజినం హి కిఞ్చి -
దుచ్చారితం మే మనసోఽభిషఙ్గాత్. 1

రాజా! నీకడ సెలవు కైకొందును. నీకు మేలగుగాక! మనసు దూకుడు వలన నేను మాటతో ఏ చిన్న పాపమును చేయలేదు గదా!

జనార్దనం భీమసేనార్జునౌ చ
మాద్రీసుతౌ సాత్యకిం చేకితానమ్,
ఆమన్త్ర్య గచ్ఛామి శివం సుఖం వః
సౌమ్యేన మాం పశ్యత చక్షుషా నృపాః. 2

జనార్దనుడు, భీమసేనుడు, అర్జునుడు, నకులసహదేవులు, సాత్యకి, చేకితానుడు-ఈ అందరికడ సెలవు గైకొని పోయివత్తును. మీకు మంగళము, సుఖము కలుగుగాక! రాజులారా! నన్ను చల్లని చూపుతో చూడుడు.

యుధిష్ఠిర ఉవాచ - యుధిష్ఠిరు డిట్లు పలికెను.

అనుజ్ఞాతః సఞ్జయ స్వస్తి గచ్ఛ
న నః స్మరస్య ప్రియం జాతు విద్వాన్,
విద్మశ్చ త్వాం తే చ వయం చ సర్వే
శుద్ధాత్మానం మధ్యగతం సభాస్థమ్. 3

సంజయా! అనుమతి గొంటివి. శుభము. పోయి రమ్ము. అన్నియు తెలిసినవాడా! మాకు అప్రియము నెన్నటికిని తలపవు. వారును, మేమును, అందరును నీవు శుద్ధమైన ఆత్మ గలవాడవనియు, ఇరుపురకు కావలసినవాడవనియు, సభ్యత గలవాడవనియు నెఱుగుదుము.

ఆప్తో దూతః సఞ్జయ సుప్రియోఽసి
కల్యాణవాన్ శీలవాం స్తృప్తిమాం శ్చ,
న ముహ్యే స్త్వం సఞ్జయ జాతు మత్యా
న చ క్రుధ్యే రుచ్యమానో దురుక్తైః. 4

నీవు ఆప్తుడవైన దూతవు. అందరకు మిక్కిలి ప్రియుడవు. శుభమునే పలుకుదువు. శీలము కలవాడవు. తృప్తి గలవాడవు. నీ బుద్ధికి ఎన్నడును మోహము గలుగదు. కటువైన పలుకులు పలికినను కోపగింపవు.

న మర్మగాం జాతు వక్తాసి రూక్షం
నోపక్రతిం కటుకాం నోత ముక్తామ్,

ధర్మారామా మర్థవతీ మహింస్రా-
మేతాం వాచం తవ జానీమ సూత. 5

సూతా! నీ వొకప్పుడైనను సూటిపోటు మాటలాడవు. నీమాట పరుషము కాదు. నీరసముగా నుండదు. పొల్లు కాదు. అది ధర్మమునకు నెలవు. ప్రయోజనముల సాధించును. ఎవ్వరిని నొప్పింపదు. నీమాట యిట్టిదిగా మే మెఱుగుదుము.

త్వమేవ నః ప్రియతమోఽసి దూత
ఇహాగచ్ఛే ర్విదురో వా ద్వితీయః,
అభీక్ష్ణదృష్టోఽసి పురా హి న స్త్వం
ధనఞ్జయ స్యాత్మసమః సఖాఽసి. 6

నీవే మాకు ఇష్టుడైన దూతవు. నీవు కాక ఇక్కడకు రాదగిన రెండవవాడు విదురు డొక్కడే. నిన్ను మేము మునుపు పలుమారులు చూచితిమి. అర్జునునకు ఆత్మీయుడైన సఖుడవు.

ఇతో గత్వా సఞ్జయ క్షిప్ర మేవ
ఉపాతిష్ఠేథా బ్రాహ్మణాన్ యే తదర్హాః,
విశుద్ధవీర్యా శ్చరణోపపన్నాః
కులే జాతాః సర్వధర్మోపపన్నాః. 7

సంజయా! నీ విటనుండి అట కరిగిన వెంటనే పవిత్రమగు శక్తి కలవారు, బ్రహ్మచర్యమును పాటించి వేదములు చదినవివారు,మంచి కులమున పుట్టినవారు, సర్వధర్మములతో కూడినవారును అగు యోగ్యులైన బ్రాహ్మణులను నా పేరున అర్చింపుము.

---

5. ఉపశ్రుతిమ్ - వార్తను; మర్మగామ్ - సూటిపోటు మాటను; కటుకామ్- నీరసమైనదానిని; ముక్తామ్ - సందర్భశుద్ధిలేని పొల్లుమాటను; నో వక్తాఽసి - పలుకువాడవు కావు.

7. చరణమ్-బ్రహ్మచర్యముతోడి వేదము నధ్యయనము చేయుట.

స్వాధ్యాయినో బ్రాహ్మణా భిక్షవశ్చ
తపస్వినో యే చ నిత్యా వనేషు,
అభివాద్యా వై మద్వచనేన వృద్ధా-
స్తథేతరేషాం కుశలం వదేథాః. 8

వేదముల నధ్యయనము చేసి, బ్రహ్మము నెఱిగినవారు, భిక్షువులు, అడవులలో తపస్సుచేయువారు, పెద్దలు ఎవరు గలరో వా రందరికి నా పేరు చెప్పి మ్రొక్కుము. అట్లే యితరులను కుశల మడుగుము.

పురోహితం ధృతరాష్ట్రస్య రాజ్ఞ-
స్తథాచార్యా నృత్విజో యే చ తస్య,
తైశ్చ త్వాం తాత సహితై ర్యథార్హం
సంగచ్ఛేథాః కుశలేనైవ సూత. 9

ఓయి సూతా! ధృతరాష్ట్రమహారాజు పురోహితుని, అతని ఆచార్యులను, ఋత్విక్కులను, అందరు కలసియుండగా నేను కుశల మడిగితి నని పలుకుచు వారిని సమీపింపుము.

అశ్రోత్రియా యే చ వసన్తి వృద్ధా
మనస్వినః శీలబలోపపన్నాః,
ఆశంసన్తోఽస్మాక మనుస్మరన్తో
యథాశక్తి ధర్మమాత్రాం చరన్తః. 10

వేదములు చదువరాని యితరవర్ణమునందలి పెద్దలు, అభిమానవంతులు, శీలము-బలము కలవారు, మా అభివృద్ధిని , కోరుచు మమ్ములనే విడువక స్మరించుచు తమశక్తిమేరకు ఏ కొద్దిపాటి ధర్మమునో యాచరించుచుందురు.

శ్లాఘస్వ మాం కుశలినం స్మ తేభ్యో
హ్యనామయం తాత పృచ్ఛే ర్జఘన్యమ్,

---

10. అశ్రోత్రియాః-శ్రోత్రియు డనగా. వేదాధ్యయనము చేయువాడు-ఆ జాతికి చెందనివారు; ఆశంసన్తః-(మా) అభివృద్ధిని కోరువారు; ధర్మమాత్రామ్-శక్తినిబట్టి కొంచెమైన ధర్మమును;

యే జీవన్తి వ్యవహారేణ రాష్ట్రే
యే పాలయన్తో నివసన్తి రాష్ట్రే. 11

మరియు వ్యాపారము మొదలగు వృత్తుల నవలంబించి రాష్ట్రమున జీవించుచున్నవారును, ఆ యా స్థానములకు అధికారులై యున్నవారును, అగు వారికి ముందుగా నా క్షేమవార్తను తెలుపుము. పిమ్మట వారిక్షేమము నడుగుము.

ఆచార్య ఇష్టో నయగో విధేయో
వేదా నభీప్సన్ బ్రహ్మచర్యం చచార,
యోఽస్త్రం చతుష్పాత్ పునరేవ చక్రే
ద్రోణః ప్రసన్నోఽభివాద్య స్త్వయాఽసౌ. 12

మాకు ఆచార్యుడు,ఇష్టుడు, నీతిమార్గమున పోవువాడు, మాయందు మన్నన గలవాడు,వేదములను పొందగోరి బ్రహ్మచర్యమును పాటించినవాడు,అస్త్రవిద్యను మరల నాలుగు పాదములమీద నిలబెట్టినవాడు అగు ద్రోణుడు ప్రసన్నుడుగా నున్నవేళ నా మ్రొక్కు చెల్లింపుము.

అధీతవిద్య శ్చరణోపపన్నో
యోఽస్త్రం చతుష్పాత్ పునరేవ చక్రే,
గన్ధర్వపుత్రప్రతిమం తరస్వినం
త మశ్వత్థామానం కుశలం స్మ పృచ్ఛేః. 13

---

11. శ్లాఘస్వ-కొనియాడుము; - ప్రీతితో చెప్పుమని తాత్పర్యము. వ్యవహారేణ-వ్యాపారము మున్నగు వృత్తితో; పాలయన్తః-స్థానాధికారులు;

11, 12 - యోఽస్త్రం చతుష్పాత్ పునరేవ చక్రే - అస్త్రవిద్యకు నాలుగు పాదములు- 1. మంత్రము 2. ఉపచారము (అభ్యాసము) 3. ప్రయోగము 4. ఉపసంహారము, అనునవి. వీనికి చక్కనిస్థితి కల్పించినవారని భావము.

13. గన్ధర్వపుత్రప్రతిమమ్-గంధర్వజాతి సౌందర్యమునకు, సంగీతమునకు ప్రసిద్ధి కెక్కినది. అశ్వత్థామయందు దా రెండు లక్షణములు పుష్కలముగా గలవని తాత్పర్యము.

చక్కగా విద్యలు నేర్చినవాడు, బ్రహ్మచర్యముతో వేదముల నధ్యయనము చేసినవాడు, అస్త్రవిద్యను మరల నాలుగు పాదములపై నిలబెట్టినవాడు, గంధర్వ పుత్రునివలె వెలుగొందువాడు, బలశాలి అగు ఆ అశ్వత్థామను కుశల మడుగుము.

శారద్వత స్యావసథం స్మ గత్వా
మహారథ స్యాత్మవిదాం వరస్య,
త్వం మా మభీక్ష్ణం పరికీర్తయన్ వై
కృపస్య పాదౌ సఞ్జయ పాణినా స్పృశేః. 14

సంజయా! మహారథుడు, ఆత్మవేత్తలలో గొప్పవాడు, శరద్వంతుని పుత్రుడు నగు కృపాచార్యుని యింటి కరిగి, పలుమారులు నన్నుగూర్చి చెప్పుచు చేతితో ఆతని పాదములు తాకుము.

యస్మిన్ శౌర్య మానృశంస్యం తపశ్చ
ప్రజ్ఞా శీలం శ్రుతిసత్త్వే ధృతి శ్చ,
పాదౌ గృహీత్వా కురుసత్తమస్య
భీష్మస్య మాం తత్ర నివేదయేథాః. 15

శౌర్యము, మార్దవము, తపస్సు, ప్రజ్ఞ, శీలము, విద్య, బలము, ధైర్యము అనునవి నిండుగా గల భీష్మాచార్యుని పాదములు పట్టుకొని నన్ను ఎరిగింపుము. ఆతడు కురువంశమున శ్రేష్ఠుడు.

ప్రజ్ఞాచక్షు ర్యః ప్రణేతా కురూణాం
బహుశ్రుతో వృద్ధసేవీ మనీషీ,
తస్మై రాజ్ఞే స్థవిరా యాభివాద్య
ఆచక్షీథాః సఞ్జయ మా మరోగమ్. 16

---

15. ఆనృశంస్యమ్-క్రూరస్వభావము లేకుండుట;

16. ఇందలి మాట లన్నియు వ్యంగ్యథోరణిని సూచించుచున్నవి. వృద్ధసేవి, మనీషి మొదలగునవి వ్యతిరేకలక్షణచే ధృతరాష్ట్రుని నిందలో పర్యవసించును.

అతనికి ప్రజ్ఞయే చూపు. కురువంశమువారికి నాయకుడు. అనేకశాస్త్రములను చదువుకొన్నవాడు. పెద్దలను సేవించువాడు, బుద్ధిమంతుడు; అట్టి ముసలి రాజు, ధృతరాష్ట్రునకు ప్రణమిల్లి నేను బాగుగా నున్నట్లు తెలుపుము.

జ్యేష్ఠః పుత్రో ధృతరాష్ట్రస్య మన్దో
మూర్ఖః శఠః సఞ్జయ పాపశీలః,
ప్రశాస్తా వై పృథివీ యేన సర్వా
సుయోధనం వై కుశలం తాత పృచ్ఛేః. 17

ధృతరాష్ట్రుని పెద్దకొడుకు,బుద్ధితక్కువవాడు,మూర్ఖుడు,మొండివాడు,పాపములు చేయుటయే ఆతని శీలము.భూమి యంతయు నతని యేలుబడిలో నున్నది. నాయనా! సంజయా! అట్టి దుర్యోధనుని కుశల మడుగుము.

భ్రాతా కనీయానపి తస్య మన్ద-
స్తథాశీలః సోఽపి సఞ్జయ శశ్వత్,
మహేష్వాసః శూరతమః కురూణాం
దుఃశాసనః కుశలం తాత వాచ్యః. 18

వాని తమ్ముడు బుద్ధిహీనుడగు దుశ్శాసనుడు అచ్చము అన్నవంటివాడే. పెనువిల్లు బట్టినవాడు.కౌరవు లందరిని మించిన శూరుడు.వాడును కుశల మడుగదగినవాడు.

యస్య కామో వర్తతే నిత్యమేవ
నాన్యచ్ఛమా ద్భారతానా మితి స్మ,
స బాహ్లీకానా మృషభో మనీషీ
త్వయాఽభివాద్యః సఞ్జయ సాధుశీలః. 19

భరతవంశమువారు శాంతి బొందుటకంటె మరియొక కోరికయే లేనివాడు, బుద్ధిమంతుడు, మంచి నడవడి కలవాడు నగు బాహ్లీకశ్రేష్ఠునకు నా మ్రొక్కులు చెల్లింపుము.

---

19. శమాత్ అన్యః కామః యస్య న వర్తతే - శాంతికంటె మరియొక కోరిక యెవనికి లేదో,

గుణై రనేకైః ప్రవరైశ్చ యుక్తో
విజ్ఞానవా న్నైవ చ నిష్ఠురో యః,
స్నేహా దమర్షం సహతే సదైవ
స సోమదత్తః పూజనీయో మతో మే. 20

శ్రేష్ఠములగు గుణములు పెక్కులు అతనిలో కలవు. విజ్ఞానవంతుడు. ఎన్నడు నిష్ఠురుడు కాడు. స్నేహమువలన ఇతరుల కోపతాపములను సహించును. అట్టి సోమదత్తుడు పూజనీయు డని నా తలంపు.

అర్హత్తమః కురుషు సౌమదత్తిః
స నౌ భ్రాతా సఞ్జయ మత్సఖా చ,
మహేష్వాసో రథినా ముత్తమోఽర్హః
సహామాత్యః కుశలం తస్య పృచ్ఛేః. 21

కౌరవులలో మిక్కిలి మన్నన గలవాడు. మా యిరువైపులవారికి సోదరుడు, నాకు సఖుడు, గొప్ప విలుకాడు, రథికులలో ఉత్తముడు అగు భూరిశ్రవుని కుశల మడిగితి ననుము. ఆతని మంత్రులు నట్టివారే.

యే చైవాన్యే కురుముఖ్యా యువానః
పుత్రాః పౌత్రా భ్రాతరశ్చైవ యే నః,
యం య మేషాం మన్యసే యేన యోగ్యం
తత్ర ప్రోచ్యానామయం సూత వాచ్యాః. 22

ఇంకను ఆ కౌరవులలో ముఖ్యులు, యువకులు కొడుకుల, మనుమల, అన్నదమ్ముల వరుసలవా రున్నారు. వారి నందరిని ఏ యే పద్ధతివారికి తగిన దని నీ కనిపించునో ఆ యా పద్ధతులతో కుశలము నడుగుము.

యే రాజానః పాణ్డవాయోధనాయ
సమానీతా ధార్తరాష్ట్రేణ కేచిత్,
వశాతయః శాల్వకాః కేకయాశ్చ
తథాంబష్ఠాః యే త్రిగర్తాశ్చ ముఖ్యాః. 23

23. పాణ్డవ ఆయోధనాయ-పాండవులతోడి యుద్ధమునకు; వశాతులు మొదలగువారు: ఆ యా రాజవంశములవారు.

ప్రాచ్యోదీచ్యా దాక్షిణాత్యాశ్చ శూరా-
స్తథా ప్రతీచ్యాః పార్వతీయాశ్చ సర్వే,
అనృశంసాః శీలవృత్తోపపన్నా
స్తేషాం సర్వేషాం కుశలం సూత పృచ్ఛేః. 24

పాండవులతో తలపడుటకు దుర్యోధనుడు తెచ్చిన వసాతులు, శాల్వకులు, కేకయులు, అంబష్ఠులు, త్రిగర్తులు, తూర్పు, ఉత్తరము, దక్షిణము, పడమర దిక్కుల రాజులు, కొండరాజులు, దయగలవారు, చక్కని స్వభావము, ప్రవర్తన గలవారు నగు వారందరిని కుశల మడుగుము.

హస్త్యారోహా రథినః సాదిన శ్చ
పదాతయ శ్చార్యసంఘా మహాన్తః,
ఆఖ్యాయ మాం కుశలినం స్మ నిత్య
మనామయం పరిపృచ్ఛేః సమగ్రాన్. 25

ఏనుగులవారికి, రథములవారికి, గుఱ్ఱములవారికి, కాల్బలమువారికి, మఱియు గొప్ప వ్యాపారసంఘములవారికి నా క్షేమవార్త నెఱిగించి, వారి నందరిని కుశల మడిగితి నని చెప్పుము.

తథా రాజ్ఞో హ్యర్థయుక్తా నమాత్యాన్
దౌవారికాన్ యే చ సేనాం నయన్తి,
ఆయవ్యయం యే గణయన్తి నిత్య-
మర్థాంశ్చ యే మహత శ్చిన్తయన్తి. 26

అట్లే రాజుకడ ఆ యా విషయముల నరయు మంత్రులను, ద్వారపాలకులను, సేనానాయకులను ఆయమును, వ్యయమును లెక్కించు గణకులను, గొప్ప ప్రయోజనములను విచారించువారిని కుశల మడుగుము.

వృన్దారకం కురుముఖ్యే ష్వమూఢం
మహాప్రాజ్ఞం సర్వధర్మోపపన్నమ్,

---

26. అర్థయుక్తాన్-ప్రయోజనములను గూర్చువారిని;

న తస్య యుద్ధం రోచతే వై కదాచి-
దైవ్వైశ్యాపుత్రం కుశలం తాత పృచ్ఛేః. 27

కురుముఖ్యులలో శ్రేష్ఠుడు, మూఢత లేనివాడు, గొప్ప వివేకము గలవాడు, సర్వధర్మములతో నొప్పారువాడు నగు వైశ్యాపుత్రుడు యుయుత్సుని కుశల మడుగుము. అతనికి యుద్ధ మొక్కనాటికిని రుచింపదు.

నికర్తనే దేవనేఽద్వితీయ-
శ్ఛన్నోపధః సాధుదేవీ మతాక్షః,
యో దుర్జయో దేవరథేన సంఖ్యే
స చిత్రసేనః కుశలం తాత వాచ్యః. 28

ధనములను కొల్లగొట్టు జూదమున సాటిలేనివాడు, తెలియరాకుండ వంచించుటలో నిపుణుడు, చెప్పినట్లు వినెడి పాచికలు గలవాడు, సాధువులతో ద్యూతమాడువాడు, యుద్ధమున దేవతావీరులకుకూడ జయింపరానివాడు అగు చిత్రసేనుడు కుశల మడుగదగినవాడు.

గాన్ధారరాజః శకునిః పార్వతీయో
నికర్తనీయోఽద్వితీయోఽక్షదేవీ,
మానం కుర్వన్ ధార్తరాష్ట్రస్య సూత
మిథ్యాబుద్ధేః కుశలం తాత పృచ్ఛేః. 29

కొండలలో నివసించువారికి రాజు, గాంధారదేశమునకు ప్రభువు అగు శకుని ఇతరుల ధనమున కొల్లగొట్టుటలో ఆరితేరినవాడు, పాచికలలో సాటిలేనివాడు, దుర్యోధనున కెల్లవేళల పొగరెక్కించుచుండును. అట్టి బుద్ధిహీనుని కుశలము, నాయనా! అడుగుము.

---

27. వృన్దారకం = శ్రేష్ఠుని; వైశ్యాపుత్రమ్-ధృతరాష్ట్రునికి వైశ్యస్త్రీయందు బుట్టిన కుమారుడు. అతని పేరు యుయుత్సువు.

28. నికర్తనే - ధనము కొల్లగొట్టునట్టి; దేవనే - జూదమందు; ఛన్నోపధః - గుట్టుగా వంచించువాడు; ఈచిత్రసేనుడు ధృతరాష్ట్రుని కొడుకులలో నొకడు.

29. నికర్తనీయః-ధనముల కొల్లగొట్టు నేర్పు గలవాడు;

యః పాణ్డవా నేకరథేన వీరః
సముత్సహ త్యప్రధృష్యాన్ విజేతుమ్,
యో ముహ్యతాం మోహయితాఽద్వితీయో
వైకర్తనః కుశలం తస్య పృచ్ఛేః. 30

ఆ వీరుడు సూర్యతనయుడు కర్ణు డుండెనే ఒక్కరథముతో, ఎవ్వరికిని సాధింపజాలని పాండవులను గెలువ నుంకించుచుండును. మొదలే ఒడలెఱుగని దుర్యోధనాదులను మఱియింత మోహమున ముంచువాడు, సాటిలేనివాడు - అతని కుశల మడుగుము.

స ఏవ భక్తః స గురుః స భర్తా
స వై పితా స చ మాతా సుహృచ్చ,
అగాధబుద్ధి ర్విదురో దీర్ఘదర్శీ
స నో మన్త్రీ కుశలం తం స్మ పృచ్ఛేః. 31

ఆ విదురు డుండెనే అతడే మాయందు ప్రేమ గలవాడు, మాకు గురువు, పోషకుడు, తండ్రి, తల్లి, మిత్రము. అతనిబుద్ధి లోతెఱుగరానిది. అతడు దీర్ఘదర్శి, మాకు మంత్రి. అతనిని కుశల మడుగుము.

వృద్ధాః స్త్రియో యాశ్చ గుణోపపన్నా
జ్ఞాయన్తే నః సఞ్జయ మాతరః,
తాభిః సర్వాభిః సహితాభిః సమేత్య
స్త్రీభిః సవృద్ధాభి రభివాదం వదేథాః. 32

చక్కని గుణములుగల ముదుసలులు, మాకు తల్లు లన్నట్లు పేరుపొందిన వారు-అట్టివా రందరు కలిసియున్నప్పుడు దరిజేరి నాస్రమొక్కు తెలుపుము.

కచ్చిత్ పుత్రా జీవపుత్రాః సుసమ్యగ్-
వర్తన్తే వో వృత్తి మనృశంసరూపాః,
ఇతి స్మోక్త్వా సఞ్జయ బ్రూహి పశ్చా-
దజాతశత్రుః కుశలీ సపుత్రః. 33

30. ముహ్యతామ్ - మోహపడు ధృతరాష్ట్రసుతులను.

"కొడుకులున్న తల్లులారా! మీ కొడుకులు, క్రూరులు కాక మీకు తిండి గుడ్డ లిడుచున్నారా?" అని ముందు వారి నడిగి యటుపై ఆ మీ బిడ్డడు, పగ వాడు పుట్టనివాడు ధర్మరాజు కుశలముతో నున్నా డని పలుకుము.

యా నో భార్యాః సఞ్జయ వేత్థ తత్ర
తాసాం సర్వాసాం కుశలం తాత పృచ్ఛేః,
సుసంగుప్తాః సురభయోఽనవద్యాః
కశ్చి ద్గృహా నావసథాఽప్రమత్తాః. 34

అట నున్న మా వధువులను నీ వెరుగుదువు కదా! వారి నందరిని కుశల మడుగుము. మీకు తగిన రక్షణ కలదా? మీరు బాగుగా నున్నారా? ఏ దోషములు లేవు గదా! ఇండ్లలో ఏమరుపాటు లేక కాపురములు చక్కదిద్దుకొనుచున్నారా? అని యడుగుము.

కశ్చి ద్వృత్తిం శ్వశురేషు భద్రాః
కల్యాణీం వర్తధ్వ మనృశంసరూపామ్,
యథా చ వః స్యుః పతయోఽనుకూలా
స్తథా వృత్తి మాత్మనః స్థాపయధ్వమ్. 35

"అమ్మలారా! అత్తమామలయందు దురుసుతనము లేని మంచిపద్ధతిని నడపుచున్నారా? మీ మగలు మీయం దనుకూలముగా నడచు విధమున మీ నడ వడిని నిలుపుకొనుచున్నారా?" అనియు నడుగుము.

యా నః స్నుషా సఞ్జయ వేత్థ తత్ర
ప్రాప్తాః కులేభ్యశ్చ గుణోపపన్నాః,
ప్రజావత్యో బ్రూహి సమేత్య తాశ్చ
యుధిష్ఠిరో వోఽభ్యవదత్ ప్రసన్నః. 36

---

34. యా,నః,భార్యాః-మా భార్యలు-ఇచట ఈ మాట దుర్యోధనాదులను కలుపు కొని యన్నమాట. ప్రధానముగా దుర్యోధనాదుల భార్యలను మర వండ్రుగా సంభావించి అన్నమాట; సుసంగుప్తాః-చక్కని రక్షణ గల వారు; సురభయః-గుణవతులు.

మంచి కులముల నుండి వచ్చినవారు, చక్కని గుణములు గలవారు, బిడ్డలను గన్నవారు నగు మా కోడం[డను నీ వెరుగుదువు కదా! వారిని సమీపించి యుధిష్ఠిరుడు విశుద్ధమైన బుద్ధితో మిమ్ములను పలుకరించె నని చెప్పుము.

కన్యాః స్వజేథాః సదనేషు సఞ్జయ
అనామయం మద్వచనేన పృష్ట్వా,
కల్యాణా వః సన్తు పతయోఽనుకూలా
యూయం పతీనాం భవతానుకూలాః. 37

సంజయా! ఆ యా భవనములలో ఉన్న రాజకన్యలను దరిజేరి నా మాటగా కుశల మడుగుము. "బిడ్డలారా! మీకు అనుకూలు రగు భర్తలు లభింతురు గాక! మీరు భర్తలకు అనుకూలవతు లగుదురు గాక!" అని నామాటగా చెప్పుము.

అలంకృతా వస్త్రవత్యః సుగన్ధా
అబీభత్సాః సుఖితా భోగవత్యః,
లఘు యాసాం దర్శనం వాక్ చ లఘ్వీ
వేశస్త్రియః కుశలం తాత పృచ్ఛేః. 38

నాయనా! మంచి భూషణములు, వస్త్రములు, గంధములు, భోగములు గలవారు, ఒక్కపెట్టున మగవాని నాకట్టుకొనగల చూపు, పలుకు గలవారు నగు వేశ్యలను కుశల మడుగుము.

దాస్యః స్యు ర్యా యే చ దాసాః కురూణాం
తదాశ్రయా బహవః కుబ్జఖఞ్జాః,
ఆఖ్యాయ మాం కుశలినం స్మ తేభ్యోఽ
వ్యనామయం పరిపృచ్ఛే ర్జఘన్యమ్. 39

కౌరవుల దాసులకు, దాసీ జనమునకు మరియు వారి యండతో బ్రదుకుచున్న గూనివారికి, కుంటివారికి ముందుగా నా క్షేమము నెరిగించి పిదప వారి క్షేమము నడుగుము.

38. లఘు, లఘ్వీ - శీఘ్రముగా హరించునది; వేశస్త్రియః - భోగపు పడతులు;

39. కుబ్జాః - గూనివారు; ఖఞ్జాః - కుంటివారు; జఘన్యమ్ - పిమ్మట;

కచ్చి ద్వృత్తిం వర్తతే వై పురాణీం
కచ్చి ద్భోగాన్ ధార్తరాష్ట్రో దదాతి,
అఙ్గహీనాన్ కృపణాన్ వామనాన్ వా
యా నానృశంస్యో ధృతరాష్ట్రో బిభర్తి. 40

జాలి గల ఆ ధృతరాష్ట్రుడు చిన్నతనమునుండి పోషించుచున్న అవిటివారిని, తిండిగుడ్డలు లేనివారిని, పురుగుజ్జులను దుర్యోధనుడు మనుచుచున్నాడా? వారికి తగిన సుఖములను కూర్చుచున్నాడా?

అన్ధాం శ్చ సర్వాన్ స్థవిరాం స్తథైవ
హస్త్యాజీవా బహవో యేఽత్ర సన్తి,
ఆఖ్యాయ మాం కుశలినం స్మ తేభ్యో
ఉప్యనామయం పరిపృచ్ఛే ర్జఘన్యమ్. 41

గ్రుడ్డివారు, ముసలివారు, ఏనుగులను చూచుకొనుకు బ్రదుకు మావటివారు-ఇట్టి వారచట పెక్కుమంది కలరు. వా రందఱికి నా క్షేమ మెఱిగించి, వారి క్షేమ మడిగితి నని చెప్పుము.

మా భైష్ట దుఃఖేన కుజీవితేన
నూనం కృతం పరలోకేషు పాపమ్,
నిగృహ్య శత్రూన్ సుహృదోఽనుగృహ్య
వాసోభి రన్నేన చ వో భరిష్యే. 42

"బాబూ! సుఖములేని పాడుబ్రదుకును గూర్చి భయపడకుడు. పాపము! పరలోకములలో ఏవో పాపములు చేసియుందురు. (అందువలననే మీ కీ నికృష్టపు బ్రదుకు ఏర్పడినది). పగవారిని పరిమార్చి, నెయ్యము గలవారిని కూడగట్టుకొని అన్నవస్త్రము లొసగి మిమ్ములను పోషింతును." అని వారికి చెప్పుము.

---

40. ఆనృశంస్యః - దయచూపవలసినవాడు; జాలిగలవాడు;

42. నూనం కృతమ్...... ఎప్పుడో చేసిన పాపము, ఇప్పుడు మిమ్ములను కట్టి కుడుపుచున్నది-అయినను మీరు బెంగపడకుడు. నేను శత్రువులగు కౌరవులను నిగ్రహించి మిమ్ములను పోషింతును.

సన్త్యేవ మే బ్రాహ్మణేభ్యః కృతాని
భావీ న్యథో నో బత వర్తయన్తి,
తాన్ పశ్యామి యుక్తరూపాం స్తథైవ
తామేవ సిద్ధిం శ్రావయేథా నృపం తమ్. 43

నేను బ్రహ్మజ్ఞానము గలవారికి ఎన్నో వార్షికముల నేర్పాటు చేసితిని. కాని వానిని దుర్యోధనుని అధికారులు సక్రమముగా సాగనిచ్చుటలేదు. "ధర్మరాజా! నేను నీవలెనే వాని నన్నింటిని క్రమము తప్పక సాగునట్లు చేయుదును" అని నాకు వార్త పెట్టవలసినదిగా ఆ రాజునకు చెప్పుము.

యే చానాథా దుర్బలాః సర్వకాల
మాత్మన్యేవ ప్రయతన్తేఽథ మూఢాః,
తాంశ్చాపి త్వం కృపణాన్ సర్వథైవా-
స్మద్వాక్యాత్ కుశలం తాత పృచ్ఛేః. 44

ఇంకను దిక్కులేనివారు, సత్తువలేనివారు, గాలిమేడలు కట్టుకొను మూఢులు,- ఇట్టి దీను లందరిని నా మాటగా అన్నివిధముల కుశల మడుగుము.

యే చాప్యన్యే సంశ్రితా ధార్తరాష్ట్రా-
న్నానాదిగ్భ్యోఽభ్యాగతాః సూతపుత్ర,
దృష్ట్వా తాం శ్చైవార్హత శ్చాపి సర్వాన్
సంపృచ్ఛేథాః కుశలం చావ్యయం చ. 45

ఇంకను ఆ ధృతరాష్ట్రుని కొడుకులను ఆశ్రయించుకొని నానాదిక్కుల నుండి వచ్చి నిలిచినవారిని, పూజ్యులయినవారిని గాంచి కుశలము నడిగి, మీ కెట్టి లోపము లేదు గదా? అని ప్రశ్న చేయుము.

---

44. ఆత్మన్యేవ ప్రయతన్తే-భావములో ఎన్నో ప్రయత్నములు చేయుదురు. కాని ఆచరణకు తీసికొని రాజాలరు. గాలిమేడలు కట్టుకొనుట యనగా నిట్టిదియే. కృపణాన్-దీనులను;

45. అర్హతః-యోగ్యులను; అవ్యయమ్-లోటుపాటులు లేకుండుటను;

ఏవం సర్వానాగతాభ్యాగతాం శ్చ
రాజ్ఞో దూతాన్ సర్వదిగ్భ్యోఽభ్యు పేతాన్,
పృష్ట్వా సర్వాన్ కుశలం తాం శ్చ సూత
పశ్చా దహం కుశలీ తేషు వాచ్యః. 46

అట్లే అన్నిదెసలనుండి వచ్చి చేరిన రాజులను, దూతలను ముందు కుశల మడిగి పిదప నేను కుశలినై యున్నవాడ నని యెఱిగింపుము.

న హీదృశాః సన్త్యపరే పృథివ్యాం
యే యోధకా ధార్తరాష్ట్రేణ లబ్ధాః,
ధర్మస్తు నిత్యో మమ ధర్మ ఏవ
మహాబలః శత్రునిబర్హణాయ. 47

దుర్యోధనుడు సాధించిన యోధులవంటివా రితరులు భూమిపై లేరు. అయినను, ధర్మము చెడని ఫల మొసగును. పగవారిని రూపుమాపుటకు నాకు ధర్మమే పెద్ద అండ.

ఇదం పున ర్వచనం ధార్తరాష్ట్రం
సుయోధనం సఞ్జయ శ్రావయేథాః,
యస్తే శరీరే హృదయం దునోతి
కామః కురూ నసపత్నోఽనుశిష్యామ్. 48

మరియు సంజయా! దుర్యోధనునకు ఈ మాట ఒక్కటి వినిపింపుము. 'ఓయీ! నేను కౌరవు లందరిని జ్ఞాతి యన్న మ్మాట లేకుండ పాలింతునను కోరిక నీ గుండెను పిండివేయుచున్నది'.

న విద్యతే యుక్తి రేతస్య కాచి-
న్నైవంవిధాః స్యామ యథా ప్రియం తే,
దదస్వ వా శక్రపురీం మమైవ
యుద్ధస్వ వా భారతముఖ్యవీర ! 49

---

47. నిత్యః-చెడని ఫలము గలది; ధర్మబలముతోడనే జయ మగును గాని సహాయులవలన గాదని శ్లోకతాత్పర్యము;

49. యుక్తిః-భావన-ఏతస్య యుక్తిః న విద్యతే-ఇది తేలికగా సిద్ధించు నని భావింపకు మని భావము. శక్రపురీమ్-ఇంద్రప్రస్థపురమును;

దీనికి ఏవిధమైన జరుగుబాటు లేదు. మేము నీ ప్రియమును జరుపువారము కాము. మాకు ఇంద్రప్రస్థపురము నైన నిమ్ము. లేదా, భారతులలో మొనగాడా! పోరికైన రమ్ము.

ఇతి శ్రీమహాభారతే ఉద్యోగపర్వణి సఞ్జయయానపర్వణి
యుధిష్ఠిరసన్దేశే త్రింశోఽధ్యాయః.

ఇది శ్రీ మహాభారతము ఉద్యోగపర్వమున సంజయయానపర్వమున
యుధిష్ఠిరుని సందేశము గల ముప్పదియవ అధ్యాయము.

—(౦)—

## ఏకత్రింశోఽధ్యాయః - ముప్పది యొకటవ అధ్యాయము

### యుధిష్ఠిరస్య కురుముఖ్యాన్ ప్రతి సన్దేశః
### యుధిష్ఠిరుడు కురుముఖ్యులకు పంపిన సందేశము.

యుధిష్ఠిర ఉవాచ - యుధిష్ఠిరు డిట్లు పలికెను.

ఉత సన్త మసన్తం వా బాలం వృద్ధం చ సఞ్జయ :
ఉతాబలం బలీయాంసం ధాతా ప్రకురుతే వశే. 1

సంజయా! మంచివాడో - చెడ్డవాడో, బాలుడో - వృద్ధుడో, బలహీనుడో - బలవంతుడో, ఎవ్వనినైనను ఈశ్వరుడు లోగొనును.

ఉత బాలాయ పాణ్డిత్యం పణ్డితా యోత బాలతామ్,
దదాతి సర్వమీశానః పురస్తా చ్ఛుక్ర ముచ్చరన్. 2

పసివానిలో పాండిత్యము, పండితునిలో పిల్లతనము అనునిట్టి ఎల్లదానిని ఈశ్వరుడు, పూర్వజన్మమున చేసిన కర్మమును విత్తనముగా చేసి యొసగుచుండును.

---

1. సన్తమ్-మంచివానిని; అసన్తమ్-దుష్టుని, ధాతా-ఈశ్వరుడు; ప్రకురుతే వశే-తన వశమున బెట్టుకొనును.
2. పురస్తాత్-మునుపటి కర్మమును; శుక్రమ్-విత్తనము వంటి దానినిగా; ఉచ్చరన్-ప్రకాశింపజేయుచు;

బలం జిజ్ఞాసమానస్య ఆచక్షీథా యథాతథమ్,
అథ మన్త్రిం మన్త్రియిత్వా యథాతథ్యేన హృష్టవత్. 3

సంజయా! పరిస్థితులను చక్కగా ఆకళింపు చేసికొని తృప్తిపడి నా బలము నెరుగగోరిన ఆ దుర్యోధనునకు ఉన్నది ఉన్నట్లు తెలియజేయుము.

గావల్గణే ! కురూన్ గత్వా ధృతరాష్ట్రం మహాబలమ్,
అభివాద్యోపసంగృహ్య తతః పృచ్ఛే రనామయమ్. 4

ఓయీ! గవల్గణకుమారా! కౌరవులకడ కరిగి మహాబలుడైన ధృతరాష్ట్రునికి పాదము లంటి మ్రొక్కి పిదప కుశల మడుగుము.

బ్రూయాశ్చైనం త్వమాసీనం కురుభిః పరివారితమ్,
తవైవ రాజన్ వీర్యేణ సుఖం జీవన్తి పాణ్డవాః. 5

కౌరవు లందరు కొలువు దీరియుండగా సింహాసనము నలంకరించిన ధృతరాష్ట్రునితో, 'రాజా! నీశక్తివలననే పాండవులు సుఖముగా బ్రదుకుచున్నా' రని పలుకుము.

తవ ప్రసాదా ద్బాలాస్తే ప్రాప్తా రాజ్య మరిందమ!
రాజ్యే తాన్ స్థాపయిత్వాగ్రే నోపేక్షస్వ వినశ్యతః. 6

శత్రుమర్దనుడా! నీ దయవలన వారు పిన్ననాడే రాజ్యమును పొందిరి. ముందు వారిని రాజ్యమున పాదుకొలిపి, యిపుడు వారు రాజ్యభ్రష్టులు కాగా, నీవు ఊరకుండరాదు" అని పలుకుము.

సర్వమ ప్యేత దేకస్య నాలం సఞ్జయ కస్యచిత్,
తాత సంహత్య జీవామో ద్విషతాం మా వశం గమః. 7

'ఈ బ్రహ్మాండ మంతయు కలసివచ్చినను ఏ ఒక్కడు చాలు ననడు. కావున, నాయనా! కలసి బ్రదుకుదము. పగవారికి లోబడవలదు' అని చెప్పుము.

తథా భీష్మం శాన్తనవం భారతానాం పితామహమ్,
శిరసాభివదేథా స్త్వం మమ నామ ప్రకీర్తయన్. 8

---

7. సర్వమ్-ఈ బ్రహ్మాండ మంతయు, సంహత్య-ఒకటిగానై కలిసి, జీవామః-బ్రదుకుదము.

అట్లే శంతనుని కొడుకు, భరతవంశమువారికి తాత అయిన భీష్మునికి నాపేరు చెప్పి తలతో ప్రణమిల్లుము.

అభివాద్య చ వక్తవ్య స్తతోఽస్మాకం పితామహః,
భవతా శన్తనో ర్వంశో నిమగ్నః పున రుద్ధృతః. 9

అట్లు మ్రొక్కి, పిమ్మట ఆతని కిట్లనుము, 'మునిగిపోయిన శంతనుని వంశమును నీవు మరల ఉద్ధరించితివి.'

స త్వం కురు తథా తాత! స్వమతేన పితామహ!
యథా జీవన్తి తే పౌత్రాః ప్రీతిమన్తః పరస్పరమ్. 10

"తాతా! అట్టి నీవు నీ మనుమ లందరు ఒకరియెడ నొకరు ప్రీతి గలిగి బ్రదుకునట్లు, నీకు తోచిన మార్గమున చేయుము"

తథైవ విదురం బ్రూయాః కురూణాం మన్త్రధారిణమ్,
అయుద్ధం సౌమ్య భాషస్వ హితకామో యుధిష్ఠిరే. 11

కౌరవులకు మేలుగీళ్ళ నుపదేశించు విదురునితో, "మంచివాడా! ధర్మజుని మేలు కోరువాడవై యుద్ధము కాకుండు మాటలాడు"మని చెప్పుము.

అథ దుర్యోధనం బ్రూయా రాజపుత్ర మమర్షణమ్,
మధ్యే కురూణా మాసీన మనునీయ పునః పునః. 12

అభిమానము మిక్కుటముగా గల రాచబిడ్డడు దుర్యోధనుడు కౌరవుల నడుమ కూర్చుండియున్నపుడు మరల మరల బ్రతిమాలుచు నిట్లు పలుకుము.

అపాపాం యదుపైక్ష స్త్వం కృష్ణామేతాం సభాగతామ్,
తద్దుఃఖ మతితిక్షామ మా వధీష్మ కురూ నితి. 13

'ఓయీ! ఏ పాప మెరుగని కృష్ణకు నిండుసభలో నీవు చేసిన ఘోరము వలని దుఃఖమును మేము భ్రమింగికొంటిమి. కౌరవులను చంపుకొనము.

---

13. అతితిక్షామ-క్షమించినవార మైతిమి. కౌరవుల వినాశము కాకుండుటకై యంత అవమానమునుకూడ భరించితి మని భావము.

ఏవం పూర్వాపరాన్ క్లేశా నతితిక్షన్త పాణ్డవాః,
బలీయాంసోఽపి సన్తో యత్ తత్సర్వం కురవో విదుః. 14

'బలవంతులయ్యు పాండవులు మంచివారై మీరు మునుపు పెట్టిన కష్టము లన్నింటిని సహించిరి. ఇది యంతయు కౌరవు లెరుగుదురు.'

య న్నః ప్రవ్రాజయేః సౌమ్య అజినైః ప్రతివాసితాన్,
తద్దుఃఖ మతితిక్షామ మా వధీష్మ కురూనితి. 15

'లేడితోళ్ళు గట్టిన మమ్ము దేశమునుండి వెడలగొట్టితివి. కౌరవులను పొట్టబెట్టుకొనజాలక ఆ దుఃఖము నంతటిని సహించితిమి.'

య త్కున్తీం సమతిక్రమ్య కృష్ణాం కేశే ష్వధర్షయత్,
దుఃశాసన స్తేఽనుమతే తచ్చాస్మాభి రుపేక్షితమ్. 16

'కుంతీదేవి నైనను మన్నింపక దుశ్శాసనుడు నీయిష్టమునుబట్టి ద్రౌపదిని జుట్టు పట్టుకొనెను. దానినికూడ మేము పట్టించుకొనలేదు.'

అథోచితం స్వకం భాగం లభేమహి పరంతప।
నివర్తయ పరద్రవ్యాద్ బుద్ధిం గృద్ధాం నరర్షభ। 17

అయిన దేదో అయినది. పరులను కాల్చుకొని తిను రాజోత్తమా! మేము మాకు రాదగిన రాజ్యభాగమును పొందవలయును. ఇతరుల సొమ్మునందు ఆస గొనుబుద్ధిని మరలించుకొనుము.

శాన్తి రేవం భవే ద్రాజన్ ప్రీతిశ్చైవ పరస్పరమ్,
రాజ్యైకదేశమపి నః ప్రయచ్ఛ శమ మిచ్ఛతామ్. 18

'రాజా! ఇట్లైనచో శాంతి యేర్పడును. మనలో ఒకరియెడ నొకరికి ప్రేమ కలుగును. శాంతినే కోరుచున్న మాకు రాజ్యములో కొంతభాగమునైన నిమ్ము.'

అవిస్థలం వృకస్థలం మాకందీం వారణావతమ్,
అవసానం భవత్వత్ర కిఞ్చిదేకం చ పఞ్చమమ్. 19

---

17. పరంతప - ఇది సాభిప్రాయపు పలుకు;
గృద్ధామ్ - ఆశించునట్టి,
19. అవసానమ్-నివసించుటకు తగిన చోటు;

'అవిస్థలము, వృకస్థలము, మాకంది, వారాణావతము, అయిదవదిగా నేదో యొక్కటిగా మాకు నెలవులు ఈ రాజ్యమం దేర్పడుగాక!'

భ్రాతౄణాం దేహి పఞ్చానాం పఞ్చగ్రామాన్ సుయోధన ।
శాన్తి ర్నోఽస్తు మహాప్రాజ్ఞ జ్ఞాతిభిః సహ సఞ్జయ । 20

'సుయోధనా! ఈ అయిదుగు రన్నదమ్ములకు అయిదు పల్లెలనైన నిమ్ము!' బుద్ధిశాలీ! సంజయా! బంధువులతో మాకిట్లు శాంతి కలుగుగాక!

భ్రాతా భ్రాతర మన్వేతు పితా పుత్రేణ యుజ్యతామ్,
స్మయమానాః సమాయాన్తు పఞ్చాలాః కురుభిః సహ. 21

సోదరుడు సోదరుని, తండ్రి కొడుకును కలిసి సుఖమందుగాక! పాంచాలురు నవ్వుమొగములతో కౌరవులను కలియవత్తురు గాక!

అక్షతాన్ కురుపాఞ్చాలాన్ పశ్యేయ మితి కామయే,
సర్వే సుమనస స్తాత శామ్యామ భరతర్షభ. 22

కౌరవులను, పాంచాలురను, చెక్కుచెదరని స్థితిలో చూడగోరుదును. అందరము మంచిమనసులతో శాంతి నొందుదము.

అల మేవ శమాయాస్మి తథా యుద్ధాయ సఞ్జయ,
ధర్మార్థయో రలం చాహం మృదవే దారుణాయ చ. 23

సంజయా! శాంతి కెట్లో యుద్ధమునకును అట్లే నేను సమర్థుడను. ధర్మమునకు, అర్థమునకును నేను చాలుదును. మెత్తనివానికిని, గట్టివానికిని చాలుదును.

ఇతి శ్రీ మహాభారతే ఉద్యోగపర్వణి సఞ్జయయానపర్వణి
యుధిష్ఠిరసన్దేశే ఏకత్రింశోఽధ్యాయః.

ఇది శ్రీమహాభారతము ఉద్యోగపర్వమున సంజయయానపర్వమున
యుధిష్ఠిరసందేశముగల ముప్పది యొకటవ అధ్యాయము.

—(౦)—

## ద్వాత్రింశోఽధ్యాయః - ముప్పదిరెండవ అధ్యాయము

**అర్జునస్య కౌరవాన్ ప్రతి సన్దేశః, సఞ్జయేన హాస్తినపురం గత్వా ధృతరాష్ట్రేన సహ సంగమ్య తం ప్రతి యుధిష్ఠిరసన్దేశం శ్రావయిత్వా ధృతరాష్ట్రకృత్యనిన్దనమ్.**

**అర్జునుడు కౌరవులకు సందేశ మొసగుట-సంజయుడు హస్తినాపురమున కరిగి ధృతరాష్ట్రుని కలసి ధర్మరాజు సందేశమును వినిపించి ధృతరాష్ట్రుని కృత్యములను నిందించుట.**

వైశంపాయన ఉవాచ - వైశంపాయను డిట్లు చెప్పెను.

ధర్మరాజస్య తు వచః శ్రుత్వా పార్థో ధనఞ్జయః,
ఉవాచ సఞ్జయం తత్ర వాసుదేవస్య శృణ్వతః.

ధర్మరాజు మాట విని అర్జునుడు శ్రీకృష్ణుడు వినుచుండగా సంజయునితో ఇట్లు పలికెను.

అర్జున ఉవాచ - అర్జును డిట్లు పలికెను

పితామహం శాన్తనవం ధృతరాష్ట్రం చ సఞ్జయ
ద్రోణం సపుత్రం శల్యం చ మహారాజం చ బాహ్లికమ్,
వికర్ణం సోమదత్తం చ శకునిం చాపి సౌబలమ్.
వివింశతిం చిత్రసేనం జయత్సేనం చ సఞ్జయ
భగదత్తం తథా చైవ శూరం రణకృతాం వరమ్.
యే చాప్యన్యే కురవ స్తత్ర సన్తి
రాజాన శ్చేద్ భూమిపాలాః సమేతాః,
యుయుత్సవః పార్థివాః సైన్ధవాశ్చ
సమానీతా ధార్తరాష్ట్రేణ సూత.
యథాన్యాయం కుశలం వన్దనం చ
సమాగమే మద్వచనేనవాచ్యాః,
తతో బ్రూయాః సఞ్జయ రాజమధ్యే
దుర్యోధనం పాపకృతాం ప్రధానమ్.

సంజయా! తాతయగు భీష్మని, ధృతరాష్ట్రుని, కొడుకుతోపాటు ద్రోణుని, శల్యుని, మహారాజును, బాహ్లికుని, వికర్ణుని, సోమదత్తుని, సుబలరాజు శకునిని, వివింశతిని, చిత్రసేనుని, పోటుగాండ్రలో గొప్పవాడగు భగదత్తుని, మరియు నచటకు వచ్చిన భూమినేలు రాజులను, దుర్యోధనుడు పిలువగా యుద్ధము చేయ గోరి వచ్చిన రాజులను, సింధుదేశాధిపతులను-వారివారికి తగిన విధముగా కుశల మడిగి నామాటగా నమస్కరించి వారందరు కొలువుదీరి యుండగా సభలో పాప కర్తలలో ప్రముఖుడగు దుర్యోధనునితో మాటాడుము.

వైశంపాయన ఉవాచ - వైశంపాయను డిట్లు చెప్పెను.

ఏవం ప్రతిష్ఠాప్య ధనంజయ స్తం
తతోఽర్థవద్ ధర్మవ చ్చైవ పార్థః,
ఉవాచ వాక్యం స్వజనప్రహర్షం
విత్రాసనం ధార్తరాష్ట్రాత్మజానామ్.

ఇట్లు ధనంజయు డాతనిని కుదురుకొల్పి తనవారికి ఆనందమును, ధృత రాష్ట్రుని కొడుకులకు వెరపును కలిగించు పలుకును అర్థయుక్తముగా ధర్మ యుక్తముగా పలికెను.

అర్జునేన సమాదిష్ట స్తథేత్యుక్త్వా తు సఞ్జయః,
పార్థా నామన్త్రయామాస కేశవం చ యశస్వినమ్.

ఇట్లర్జునుడు ఆదేశింపగా సంజయు డట్లే యని పలికి పాండవుల కడ కీర్తిశాలియగు కృష్ణుని కడ సెలవు గైకొనెను.]

వైశమ్పాయన ఉవాచ - వైశంపాయను డిట్లు చెప్పెను.

అనుజ్ఞాతః పాణ్డవేన ప్రయయౌ సంజయ స్తదా,
శాసనం ధృతరాష్ట్రస్య సర్వం కృత్వా మహాత్మనః. 1

ధర్మరా జనుమతింపగా నంత సంజయుడు మహాత్ముడగు ధృతరాష్ట్రుని పనుపంతయు నెరవేర్చి యటనుండి బయిలుదేరెను.

సంప్రాప్య హాస్తినపురం శీఘ్రమేవ ప్రవిశ్య చ,
అన్తఃపురం సమాస్థాయ ద్వాఃస్థం వచన మబ్రవీత్. 2

హస్తిన చేరుకొని త్వరతో ప్రవేశించి, అంతఃపురము దరి జేరి ద్వార పాలకునితో నిట్లు పలికెను.

ఆచక్ష్వ ధృతరాష్ట్రాయ ద్వాఃస్థ మాం సముపాగతమ్,
సకాశాత్ పాణ్డుపుత్రాణాం సఞ్జయం మా చిరం కృథాః. 3

'ద్వారపాలా! పాండుకుమారుల కడనుండి సంజయుడు తిరిగివచ్చె నని ధృతరాష్ట్రునకు తెలుపుము. జాగు సేయకుము;

జాగర్తి చే దభివదే స్త్వం హి ద్వాఃస్థ
ప్రవిశేయం విదితో భూమిపస్య,
నివేద్య మత్రాత్యయికం హి మేఽస్తి
ద్వాస్థోఽథ శ్రుత్వా నృపతిం జగాద. 4

'రాజు మేల్కొనియున్నచో నాతనికి చెప్పుము. నారాక రాజెరిగిన పిదప నేను ప్రవేశింతును. తప్పనిసరిగా చెప్పవలసినది కలదు.' అన విని దౌవారికుడు రాజున కిట్లు చెప్పెను.

ద్వాఃస్థ ఉవాచ - ద్వారపాలకు డిట్లు పలికెను.

సఞ్జయోఽథ భూమిపతే నమస్తే
దిదృక్షయా ద్వార ముపాగత స్తే,
ప్రాప్తో దూతః పాణ్డవానాం సకాశాత్
ప్రశాధి రాజన్ కిమయం కరోతు. 5

మహారాజా! నీకు నమస్సు. దూతగా పాండవులనుండివచ్చిన సంజయుడు నిన్ను చూడగోరి ద్వారముకడ వేచియున్నాడు. ఆత డేమి చేయవలయునో ఆనతిమ్ము.

ధృతరాష్ట్ర ఉవాచ - ధృతరాష్ట్రు డిట్లు పలికెను.

ఆచక్ష్వ మాం కుశలినం కల్ప మస్మై
ప్రవేశ్యతాం స్వాగతం సఞ్జయాయ,

4. ఆత్యయికమ్ - అవశ్యకమైన పని;

న చాహ మేతస్య భవా మ్యకల్పః
స మే కస్మా ద్ద్వారి తిష్ఠే చ్చ సక్తః. 6

నేను కుశలముగా దృఢముగా నున్నానని అతనికి చెప్పు. సంజయునకు స్వాగతము. ప్రవేశపెట్టు. ఇతనికి ఏసమయమునందైనను చూడరానివాఁడను కానే! అత డేల ద్వారముకడ ఆగిపోవలయును?

వైశమ్పాయన ఉవాచ – వైశంపాయను డిట్లు చెప్పెను

తతః ప్రవిశ్యానుమతే నృపస్య
మహద్ వేశ్మ ప్రాజ్ఞశూరార్యగుప్తమ్,
సింహాసనస్థం పార్థివ మాససాద
వైచిత్రవీర్యం ప్రాఞ్జలిః సూతపుత్రః. 7

రా జట్లు అనుమతింపగా సంజయుడు బుద్ధిమంతులు, శూరులు, సజ్జనులు కాపాడుచున్న గొప్పభవనములోనికి ప్రవేశించి సింహాసనమున నున్న ధృతరాష్ట్రుని, దోసిలి యొగ్గి, సమీపించెను.

సఞ్జయ ఉవాచ – సంజయు డిట్లు పలికెను.

సఞ్జయోఽహం భూమిపతే నమస్తే
ప్రాప్తోఽస్మి గత్వా నరదేవ పాణ్డవాన్,
అభివాద్య త్వాం పాణ్డుపుత్రో మనస్వీ
యుధిష్ఠిరః కుశలం చాన్వపృచ్ఛత్. 8

మహారాజా! నేను సంజయుడను. నీకు నమస్సు. పాండవులకడకు పోయి వచ్చితిని. దొడ్డబుద్ధిగల ధర్మరాజు నీకు మ్రొక్కి కుశల మడిగెను.

స తే పుత్రాన్ పృచ్ఛతి ప్రీయమాణః
కచ్చి త్పుత్రైః ప్రీయసే నప్తృభి శ్చ,

6. కల్పమ్-దృఢమైన వానిని; అకల్పః-చూచుటకు వీలులేనివాడు; సక్తః-తగులుకొన్నవాడు;

7. ప్రాజ్ఞ, శూర, ఆర్య, గుప్తమ్ - బుద్ధిమంతులు, పౌరుషము గలవారు, సజ్జనులు రక్షించుచున్నదానిని; వైచిత్రవీర్యమ్-విచిత్రవీర్యునికొడుకు ధృతరాష్ట్రుని;

తథా సుహృద్భిః సచివైశ్చ రాజన్
యే చాపి త్వా ముపజీవన్తి తైశ్చ. 9

రాజా! ఆతడు నీకొడుకులనుగూర్చి ప్రీతితో అడుగును. కొడుకులతో, మనుమలతో, చెలులతో, మంత్రులతో, సేవకులతో నీవు సుఖముగా నున్నావా? యని యడుగుచున్నాడు.

ధృతరాష్ట్ర ఉవాచ- ధృతరాష్ట్రు డిట్లు పలికెను.

అభినన్ద్య త్వాం తాత వదామి సఞ్జయ
అజాతశత్రుం చ సుఖేన పార్థమ్,
కచ్చిత్ స రాజా కుశలీ సపుత్రః
సహామాత్యః సానుజః కౌరవాణామ్. 10

పగవాని నెరుగని యా కుంతికొడుకును ఆనందముతో మదిలో మెచ్చి, సంజయా! ని న్నడుగుచున్నాను. నాయనా! ఆ కురురాజు కొడుకులతో, మంత్రులతో, తమ్ములతో సుఖముగా నున్నాడా?

సఞ్జయ ఉవాచ-సంజయు డిట్లు పలికెను.

సహామాత్యః కుశలీ పాణ్డుపుత్రో
బుభూషతే యచ్చ తేఽగ్రేఽఽత్మనోఽభూత్,
నిర్ణిక్తధర్మార్థకరో మనస్వీ
బహుశ్రుతో దృష్టిమాఞ్ఛీలవాంశ్చ. 11

---

9. నప్తృభిః - కొడుకు కొడుకులతో;

10. "అజాతశత్రుం సుఖేన అభినంద్య త్వాం ప్రతి వదామి - అని అన్వయము - సుఖముతో అభినందించుట యనగా సుఖముగనే యున్నారుకదా అభినందించుట అని తాత్పర్యము.

11. తే-నీ నుండి; అగ్రే-మునుపు; ఆత్మనః-తనకు; యత్-ఏరాజ్య ధనాదికము కలదో; తత్ - దానిని, బుభూషతే - పొందగోరుచున్నాడు; నిర్ణిక్తధర్మ, అర్థకరః - దోషములు లేని అర్థ ధర్మములను సాధించువాడు; మనస్వీ - ఉదారుడు; దృష్టిమాన్ - క్రాంతదర్శి - ఇంద్రియగోచరము కానివానిని చూచు సామర్థ్య మున్నవాడని భావము.

పాండుపుత్రుడు తనవారితో కూడి కుశలముగా నున్నాడు. పాపము పొంతబోని ధర్మమును, అర్థమును కూడబెట్టుకొనువాడు, దొడ్డబుద్ధి గలవాడు, చక్కని పాండిత్యము గలవాడు, ముందుచూపు, మంచినడవడి కలవాడు నగు పాండుపుత్రుడు జూదమునకు ముందు తనకుగల రాజ్యము మొదలైనదానిని నీనుండి పొందగోరుచున్నాడు.

పరో ధర్మాత్ పాణ్డవ స్యానృశంస్యం
ధర్మః పరో విత్తచయా న్మతోఽస్య,
సుఖప్రియే ధర్మహీనేఽనపార్థే
ను రుధ్యతే భారత తస్య బుద్ధిః. 12

పాండుపుత్రునకు ధర్మము తరువాతనే జాలి మొదలగునవి. ధనముల ప్రోవుకంటె ధర్మమే అతని కిష్టమైనది, అతనిబుద్ధి ధర్మము కొరవడనివియు, ప్రయోజనము కలవియు నగు సుఖప్రియములనే అనుసరించును.

పరప్రయుక్తః పురుషో విచేష్టతే
సూత్రప్రోతా దారుమయీవ యోషా,
ఇమం దృష్ట్వా నియమం పాణ్డవస్య
మన్యే పరం కర్మ దైవం మనుష్యాత్. 13

---

12. పరః - ముఖ్యమైనది; ఆనృశంస్యమ్ - దయ, జాలి మొదలగునది; విత్తచయాత్ - ధనముల ప్రోవుకంటె - ధనములచేత సిద్ధించు యజ్ఞము, దానము మొదలగువానికంటె నని భావము. తస్య బుద్ధిః - ఆతని బుద్ధి; అనపార్థే-న అపార్థే-పనికిమాలినవి కాని - అనగా ప్రయోజనవంతము లయిన; అధర్మహీనే - ధర్మము కొరవడని; సుఖప్రియే - సుఖమును, ప్రియమును-అన్నము మొదలగువానివలన కలుగు దేహపుష్టి మొదలగునది సుఖము, పుత్రులు కలుగుట మొదలగునది ప్రియము - వీనిని కూడ అతడు పరోపకారార్థమే అనుసరించును గాని కామదృష్టితో కాదని తాత్పర్యము.

13. దారుమయీ యోషా-కొయ్యబొమ్మ; సూత్రప్రోతా-త్రాడుగట్టి లాగబడుచున్నది; పరప్రయుక్తః - ఈశ్వరుడు త్రిప్పినట్లు, పురుషః - నరుడు, విచేష్టతే-త్రిప్పులకు లోనగును;

మానవుడు త్రాడుకట్టి లాగుచున్న కొయ్యబొమ్మవలె ఈశ్వరుడు త్రిప్పి నట్లు తిరుగుచున్నాడు. ఆ ధర్మరాజు అదుపును చూచి మానవుడు తానై చేయు కర్మముకంటె దైవమగు కర్మము మిన్న యని నేను తలచుచున్నాను.

ఇమం చ దృష్ట్వా తవ కర్మదోషం
పాపోదర్కం ఘోర మవర్ణరూపమ్,
యావత్ పరః కామయతేఽతివేలం
తావన్నరోఽయం లభతే ప్రశంసామ్. 14

పాపము పెల్లుగా గల నీ యీ కర్మదోషమును మాటలలో చెప్ప శక్యము కానిదానిని చూచినపుడును నా కట్లే యనిపించును.

బలవంతు డగు శత్రువు పగవానిని ఉపేక్ష చేసినంతకాలము వాడు గొప్పవా డగుచుండును.

అజాతశత్రుస్తు విహాయ పాపం
జీర్ణాం త్వచం సర్ప ఇవాసమర్థామ్,

---

14. అవర్ణరూపమ్-పలుకరానిది;పరః- గొప్పశత్రువు;యావత్ - ఎంతకాలము; కామయతే-వీడు కొంతకాల మిట్లుండును గాక యని కోరునో;తావత్- అంతకాలము;అయం నరః-ఈ అల్పమానవుడు;అతివేలమ్ - హద్దులు మీరు నట్లు;ప్రశంసామ్-ప్రశంసను;లభతే-పొందును.

ధర్మరాజు మిమ్ము పోనీ లెమ్మన్నట్లు చూచుచుండెను,గాన మీరు గొప్పవారుగా నైతిరి గాని లేకున్నచో మీకు ఈపాటికి చావు మూడి యుండెడి దని భావము.

అంత నిగ్రహము గల ధర్మరాజు ఇడుముల బడుటయు,నింత పాపులగు మీరు సుఖమొందుట అనునవి యీశ్వరచేష్టలే కాని వారి లోపమువలన గాని, మీ గొప్పదనమువలన గాని గాదని - ఈరెండు శ్లోకముల తాత్పర్యము.

విరోచతేఽహార్యవృత్తేన వీరో
యుధిష్ఠిర స్త్వయి పాపం విసృజ్య. 15

అజాతశత్రువు మాత్రము,పాము పనికిమాలిన ఎండిపోయిన కుబుసమును వదలిన విధముగా,పాపమును వదలియున్నాడు.వీరుడగు ఆ యుధిష్ఠిరుడు పాపమును నీకు వదలివైచి తనకు సహజమైన నడవడితో విరాజిల్లుచున్నాడు.

హన్తాత్మనః కర్మ విబోధ రాజన్
ధర్మార్థయుక్తా దార్యవృత్తా దపేతమ్,
ఉపక్రోశం చేహ గతోఽసి రాజన్
భూయశ్చ పాపం ప్రసజే దముత్ర. 16

అయ్యో!రాజా!ధర్మముతో,అర్థముతో కూడిన సజ్జనుల స్వభావమునకు వెలియైన నీచేష్టను గమనింపుము.దీనివలన నీవు ఇక్కడ నింద బొందుచున్నావు. పరలోకమున పాపము నొందుచున్నావు.

స త్వ మర్థం సంశయితం వినా తై
రాశంససే పుత్రవశానుగోఽస్య,
అధర్మశబ్దశ్చ మహాన్ పృథివ్యాం
నేదం కర్మ త్వత్సమం భారతాగ్ర్య. 17

---

15. జీర్ణామ్-చివికినది,అందుకే;అసమర్థామ్-దేహమున నిలువజాలనిది;అహార్యవృత్తేన-హార్యమనగా తీసివేయదగినది.అది కానిది అహార్యము అనగా సహజమైన,వృత్తేన-నడవడితో-ఎవ్వడు స్వస్వరూపమున నిలిచి యుండునో వానిపాపము శత్రువును చేరును. శ్రుతి యిట్లు చెప్పుచున్నది. "తస్య పుత్రా దాయ ముపయన్తి,సుహృదః సాధుకృత్యాం, ద్విషన్తః పాపకృత్యామ్" - స్వస్వరూపమున నిలుచువాని ధనాదికమును, పుత్రులు, సత్కార్యఫలమును మిత్రములు,పాపకృత్యమును శత్రువులును పొందుదురు.

16. హన్త-ఇది జాలి గొలుపు మాట;ఉపక్రోశమ్ = నింద;అముత్ర-పరలోకమున;పాపమ్-దుఃఖము-నరక మని భావము,ప్రసజేత్-కలుగును.

17. సంశయితమ్-పరుని సొమ్ము నాశించినవానికి అది తప్పక తనవశమగునను నమ్మకము లేదు కావున సంశయితము;

అట్టి నీవు వారలకు కాకుండ, కొడుకు త్రిప్పినట్లు తిరుగుచు, నమ్మకము లేని ఆతని సొమ్మంతయు మ్రింగ జూచుచున్నావు. దీనివలన నీకు ధర్మహీను డన్న అపకీర్తి భూమిపై వ్యాపించును. భరతవంశమున శ్రేష్ఠుడవగు ఓ రాజా! నీ కిది తగిన పనికాదు.

హీనప్రజ్ఞో దౌష్కులేయో నృశంసో
దీర్ఘం వైరీ క్షత్రవిద్యా స్వధీరః,
ఏవంధర్మా నాపదః సంశ్రయేయు
ర్హీనవీర్యో యశ్చ భవే దశిష్టః. 18

తెలివిమాలినవాడు, చెడిపెకు పుట్టినవాడు, క్రూరుడు, పట్టిన పగ విడువని వాడు, క్షత్రియవిద్యలలో బుద్ధిచాలనివాడు, మగతనము లేనివాడు, మంచితనము గచ్చినవాడు - ఇట్టి ధర్మములు కలవారిని ఆపదలు చుట్టుముట్టును.

కులే జాతో బలవాన్ యో యశస్వీ
బహుశ్రుతః సుఖజీవీ యతాత్మా,
ధర్మాధర్మౌ గ్రథితౌ యో బిభర్తి
స హ్యస్య దిష్టస్య వశా దుపైతి. 19

---

18. ఏవంధర్మాన్ - ఇట్టి ధర్మము గల మానవులను.

19. ధర్మాధర్మౌ - సత్యమును, అనృతమును; గ్రథితౌ - కలుపుకొని; సత్యములేనిదే అనృతము ఉండదు. ఆధారము లేకుండ భ్రమ యనునది కలుగదు గదా! త్రాటిని చూచి పాము అనుకొనినచో త్రాడు సత్యము, పాము అసత్యము. పాము అను భ్రమ కలుగుటకు త్రాడు ఉండవలయును గదా! అట్లే అనృతము లేక సత్యము నిలువదు. ఇచట అనృత మనగా దేహము - సత్య మనగా బ్రహ్మము. బ్రహ్మమును అసత్తయిన దేహము నందే పట్టుకొనవలయును. ఇట్లు రెంటిని కలిపి పట్టుకొన్నవాడే యోగ్యుడు అనగా కేవలము బాహ్యనిష్ఠుడు కానివాడు; దిష్టస్య వశాత్-భాగ్యవశము వలన; అస్య- పైని చెప్పిన ఆరు లక్షణముల సముదాయమును; ఉపైతి- పొందును;

ధర్మాధర్మముల నెవడు కలసికట్టుగా భరించునో వాడు భాగ్యవశమున సత్కులమున పుట్టును. బలవంతు డగును. కీర్తికలవా డగును. పండితు డగును. సుఖమైన జీవితము కలవా డగును. ఇంద్రియములపై అదుపు కలవా డగును.

కథం హి మన్త్రాగ్ర్యధరో మనీషీ
ధర్మార్థయో రాపది సంప్రణేతా,
ఏవ ముక్తః సర్వమన్త్రై రహీనో
నరో నృశంసం కర్మ కుర్యా దమూఢః. 20

మంత్రిశ్రేష్ఠులను భరించువాడు, ప్రజ్ఞ గలవాడు, ఆపదలో ధర్మార్థములను చక్కగా ప్రయోగించువాడు, సకలవిధములగు మంత్రాంగములందే లోపము లేనివాడు, మూఢబుద్ధి కానివాడును, ఎవడైన, ఒకరు చెప్పిన తరువాత కూడ, ఇంత క్రూరకార్యము నెట్లు చేయును?

తవ హ్యమీ మన్త్రవిదః సమేత్య
సమాసతే కర్మసు నిత్యయుక్తాః,
తేషా మయం బలవా న్నిశ్చయశ్చ
కురుక్షయే నియమే నోదపాది. 21

---

నీవు సత్కులమున పుట్టినవాడవయ్యు అనృతమునే పట్టి ప్రేలుట వలన తక్కిన అయిదు గుణములు (1) బలము. (2) యశస్సు. (3) పాండిత్యము. (4) సుఖజీవనము. (5) ఇంద్రియ నిగ్రహము - పొందకున్నా వని భావము.

20. మన్త్ర, అగ్ర్య, ధరః - మంత్రమే శ్రేష్ఠమగు ధర్మముగా గలవారు, భీష్మాదులు - అట్టివారిని భరించువాడు; ఏవమ్ ఉక్తః - వారిచే పలుమారులు చెప్పబడినవాడ వయ్యు, ద్యూతము వలదని వారు పలుమారులు చెప్పినను, నృశంసం కర్మ - పాండవులను వెడలనడచుట యను క్రూర కర్మమును, కథం కుర్యాత్ - (నీ వంటివాడు కాక మరియొకడు) ఎట్లు చేయును ?

21. అమీ-వీరు-కర్ణుడు, శకుని మొదలగువారు; తేషామ్-వారికి; కురుక్షయే-కురువంశము సర్వనాశమగుట నిమిత్తముగా; అయం నిశ్చయః-పాండ

కర్ణుడు మొదలగు నీ మంత్రవేత్తలు కలిసికట్టుగా ఎడతెరపి లేకుండ నీపనులను నిర్వహించుచున్నారు. ఈ కురువంశము సర్వనాశ మగుటకై పట్టుదలతో (పాండవులకు రాజ్య మీరా దన్న) నిశ్చయము వారికి పుట్టినది.

అకాలికం కురవో నాభవిష్యన్

పాపేన చేత్ పాప మజాతశత్రుః,

ఇచ్ఛే జ్జాతు త్వయి పాపం విస్పృజ్య

నిన్దా చేయం తవ లోకేఽభవిష్యత్. 22

నీ పాపకర్మమువలన కౌరవులకు కాని కాలమున వినాశము దాపురించెను. కావుననే శత్రువులే లేని ధర్మరాజు పాపపుపని (యుద్ధము) చేయగోరుచున్నాడు. ఆ పాపము నాతడు నీ యందే నిలుపును. వానివలన లోకమున నీకు నిందయు తప్పదు.

కి మన్యత్ర విషయా దీశ్వరాణాం

యత్ర పార్థః పరలోకం స్మ ద్రష్టుమ్,

---

వులకు రాజ్య మొసగరాదను నిశ్చయము; నియమేన-పట్టుదలతో; ఉదపాది-పుట్టెను;

22. అకాలికమ్-కానికాలమున-హఠాత్తుగా, కురవః, న, అభవిష్యన్-కౌరవులు నశింతు రన్నచో; పాపేన-నీ పాపకర్మముచేత (ప్రేరితుడై) అజాతశత్రుః - శత్రువులే లేని ధర్మరాజు; పాపమ్ - పాపమును; ఇచ్ఛేత్ - కోరును. శత్రువులు పుట్టని ధర్మజుడు పాపమైన యుద్ధమునకు పూనుకొనుచున్నా డనగా అది నీ పాపమువలననే. దానివలన సర్వకురువంశమునకు వినాశము తప్పదని తాత్పర్యము. అయినను, అతనికి వంశనాశమువలన పాపము రాదా యన్నచో, తన చావు తెచ్చుకొను దొంగయందువలె ఆ పాపము నీయందే నిలుపును. నీకు లోకనిందయు తప్పదు అట్లాతడు పాపము నిందలేనివాడై వెలుగొందును అని తాత్పర్యము.

అత్యక్రామత్ స తథా సమ్మతః స్యా-
న్న సంశయో నాస్తి మనుష్యకారః. 23

దేవతల విషయముకంటె మించిన దేమి కలదు? అట్టి దేవలోకమును గూడ అర్జునుడు చూడ నరిగెను. అట్టి సాధుజనప్రియుడుకూడ అట్లాయె ననగా మనుష్యుడు తానై సాధించునది యేమియు లేదనుటలో సంశయము లేదు.

ఏతాన్ గుణాన్ కర్మకృతా నవేక్ష్య
భావాభావౌ వర్తమానా వనిత్యౌ,
బలిర్హి రాజా పార మవిన్దమానో
నాన్యత్ కాలాత్ కారణం తత్ర మేనే. 24

---

23. ఈశ్వరాణామ్ - దేవతలయొక్కయు; విషయాత్ - విషయముకంటె; అన్యత్ర - ఇతరముగా; కిమ్-ఏమిగలదు? - అంతయు దైవాధీనమని భావము; యత్ర - ఎట్లనగా; పార్థః-అర్జునుడు; పరలోకం-స్వర్గలోకమును; ద్రష్టుమ్-చూచుటకు (స్వశరీరముతోడనే) అత్యక్రామత్-అరిగెను; సః-అట్టివాడు-నారదునివలె ఉభయలోకసంచారము చేయగలవాడు; తథా-అట్లు వనవాసము మొదలగు కష్టము లనుభవించె ననగా; మనుష్యకారః-పురుషుడు చేయదగినవి; న-అస్తి-లేదు అను నర్థమున; సంశయః న-సంశయము లేదు;

24. ఏతాన్ గుణాన్-ఈశౌర్యము మొదలగు గుణములను; కర్మకృతాన్-పూర్వకర్మనుబట్టి పెరుగుచు తరుగుచు నుండువానినిగా; అవేక్ష్య-చూచి; భావాభావౌ-భావ మనగా కలిమి, అభావ మనగా లేమి-వీనిని; అనిత్యౌ-వచ్చుచు పోవుచు నుండును గనుక అస్థిరములనియు, అవేక్ష్య-పరికించి; బలిః రాజా-బలి యను రాజు; పారమ్-అంతమును-ఇప్పటి అనుభవమునకు పూర్వకర్మము కారణము, దానికి దానిపూర్వము కారణము-అని యిట్లు వెదకికొనుచు పోయి, అంతమును; అవిన్దమానః-పొందనివాడై; కాలాత్-కాలరూపు డగు ఈశ్వరునికంటె; తత్ర-కర్మఫలానుభవమునందు; కారణమ్-కారణము, అన్యత్-మరియొకటి; న-లేదని; మేనే-నిశ్చయించెను;

ఇట్టి గుణములు శౌర్యము మొదలగునవి కర్మమువలన నేర్పడునవియు, ఇప్పటి కలిమిలేములు వచ్చును, పోవును అనియు గుర్తించి బలియను రాజు పూర్వపూర్వకర్మముల కారణముల అంతమును గనజాలక సుఖదుఃఖాదుల విషయమున ఈశ్వరునికంటె కారణము మరియొకటి లేదని నిశ్చయించెను.

చక్షుః శ్రోత్రే నాసికా త్వక్ చ జిహ్వా
జ్ఞాన స్యైతా న్యాయతనాని జన్తోః,
తాని ప్రీతాన్యేవ తృష్ణా క్షయాన్తే
తాన్యవ్యథో దుఃఖహీనః ప్రణుద్యాత్. 25

కన్ను, చెవి, ముక్కు, చర్మము, నాలుక-ఇవి ప్రాణికి జ్ఞానము పొందు నెలవులు. కోరికలు పూర్తిగా చచ్చినపుడే యవి ప్రీతి నొందును. ఆటుపోటులు లేక దుఃఖము నందక యుండువాడే వానిని అణచివేయగలడు.

న త్వేవ మన్యే పురుషస్య కర్మ
సంవర్తతే సుప్రయుక్తం యథావత్,
మాతుః పితుః కర్మణాభిప్రసూతః
సంవర్ధతే విధివద్ భోజనేన. 26

25. సర్వము దైవమునకు వశమైనదియే యగుటవలన కోరికలను ఎండగట్టియే యింద్రియతృప్తిని సాధింపవలయును. అంతే కాని బహుయత్నములతో సాధ్యమగు విషయములను ఇంద్రియముల కర్పించుటవలన కాదు. అయినచో వాని వాని విషయములు దొరకనిచో వానికి తృప్తి యెక్కడిది? అన్నచో విషయములవలన దాహము పెరుగుటయే కాని తరగదు కావున, విషయములనుండి మరలించుటయే కర్తవ్య మని చెప్పుచున్నారు. అవ్యథః-దొరికినచో పొంగుట; దొరకనిచో క్రుంగుట అనునవి లేనివాడై; తాని-వానిని, ప్రణుద్యాత్ - విషయములనుండి మరలింపవలయును; అదే సుఖమని తాత్పర్యము.

26. ఏవమ్-ఇట్లు కాగా;అన్యే-కొందరు; పురుషస్య-మానవుని, కర్మ-కర్మము; యథావత్-చేయవలసిన తీరులో; సుప్రయుక్తమ్-చక్కగా చేయబడినప్పటికిని, న సంవర్తతే-చక్కగా ఫలమునకు వచ్చుటలేదు;- మాతుః-

ఇట్లుండగా కొందరు 'పురుషుని కర్మము ఫలవంత మగుట లేదు. తల్లి దండ్రుల కర్మమును బట్టి పురుషుడు పుట్టుచున్నాడు. విహితమైన భోజనముచేత పెరుగుచున్నాడు' అందురు.

ప్రియాప్రియే సుఖదుఃఖే చ రాజన్
నిన్దాప్రశంసే చ భజన్త ఏవ,
పర స్త్వేనం గర్హయతేఽ పరాధే
ప్రశంసతే సాధువృత్తం తమేవ. 27

మానవులు ప్రియమును-అప్రియమును,సుఖమును-దుఃఖమును,ప్రశంసను నిందను, పొందుచునే యున్నారు. దోస మున్నయెడల ఇతరుడు వీనిని ఆడిపోసి కొనుచున్నాడు. మంచినడవడి గలవానినే పొగడుచున్నాడు.

స త్వాం గర్హే భారతానాం విరోధా-
దన్తో నూనం భవితాఽయం ప్రజానామ్,
నోచేదిదం తవ కర్మాపరాధాత్
కురూన్ దహేత కృష్ణవర్త్మేవ కక్షమ్. 28

కావున నేను నిన్ను నిందించుచున్నాను.భరతవంశమువారి పోరువలన ప్రజలకు వినాశము తప్పక కలుగును. నా యీ మాట నీ కిష్టము కానియెడల ఈ

---

తల్లియొక్కయు; పితుః-తండ్రియొక్కయు; కర్మణా = కర్మముచే; అభిప్రసూతః - పుట్టుచున్నాడు; భోజనేన-అన్నముచేత; విధివత్-తగు విధముగా; సంవర్ధతే-పెరుగుచున్నాడు; ఇతి ఆహుః-అని పలుకుదురు.

27. వివేకముగలవాడు; ఎల్లవేళల ప్రియము, సుఖము, ప్రశంసలనే పొందుదు ననుకొనడు. తనప్రవృత్తిని బట్టి అప్రియాదులును వచ్చుచుండును. కాన నేను నీ స్వభావమునుబట్టి నిందించినను నీవు కోపగించరాదను భావ ముతో ఈ శ్లోకార్థమును చెప్పుచున్నాడు.

28. నోచేత్-కానిచో-పాండవులకు రాజ్య మిమ్మను నా మాట నీ కిష్టము కానిచో అని తాత్పర్యము; కృష్ణవర్త్మా-అగ్ని; కక్షమ్-ఎండిపోయిన అడవిని; ఇవ-వలె; కృష్ణవార్త్మా-కృష్ణు ననుసరించి ప్రవర్తించు వాడగు నర్జునుడు; కురూన్-కౌరవులను, దహేత-కాల్చివేయును.

నీ తప్పువలన అగ్ని అడవిని కాల్చివేయు విధమున అర్జునుడు మిమ్ములను మంట బెట్టును.

త్వ మే వైకో జాతు పుత్రస్య రాజన్
వశం గత్వా సర్వలోకే నరేన్ద్ర,
కామాత్మనః శ్లాఘనో ద్యూతకాలే
నాగాః శమం పశ్య విపాక మస్య. 29

రాజా! ఆనాడు జూదమాడునపుడు నీ వొక్కడవే స్వార్థపరుడగు నీపుత్రునకు లొంగిపోయి నా పంట పండిన దని తలచితివి.ఎంతకు శాంతింపవైతివి.ఆ పాపపుపంట నిప్పుడు చూడుము.

అనాప్తానాం సంగ్రహాత్త్వం నరేన్ద్ర
తథాప్తానాం నిగ్రహాచ్చైవ రాజన్,
భూమిం స్ఫీతాం దుర్బలత్వా దనన్తా-
మశక్త స్త్వం రక్షితుం కౌరవేయ. 30

ఆప్తులు కానివారిని కూడదీసియు,ఆప్తులను దూరము చేసికొనియు,మహారాజా!సత్తువ కోల్పోయితివి.సమృద్ధితో పచ్చగా నున్న అనంతమైన యీ భూమిని రక్షింపజాలనివాడ వైతివి.

అనుజ్ఞాతో రథవేగావధూతః
శ్రాన్తోఽభిపద్యే శయనం నృసింహ,
ప్రాతః శ్రోతారః కురవః సభాయా-
మజాతశత్రో ర్వచనం సమేతాః. 31

---

29. శ్లాఘనః - తనపంట పండినదని భావించుకొన్నవాడవై; కామాత్మనః- స్వార్థపరుడైన.

30. అనాప్తానామ్-మేలుకోరని కర్ణాదులను; ఆప్తానామ్-మేలుకోరెడు విదురాదులను; నిగ్రహాత్-దూరము చేసికొనుటవలన; స్ఫీతామ్-సమృద్ధితోనున్న;

31. అవధూతః-కుదిలించివేయబడిన;

రాజా! బండివేగమునకు ఒడలు అట్టిట్టయి బదలియుంటిని. అనుమతించినచో పోయి పడక నెక్కుదును. రేపకడ సభలో కౌరవు లందరు కలసి అజాతశత్రుని పలుకులు విందురుగాక!

ధృతరాష్ట్ర ఉవాచ - ధృతరాష్ట్రు డిట్లు పలికెను.

అనుజ్ఞాతోఽస్యావసథం పరేహి
ప్రపద్యస్వ శయనం సూతపుత్ర!
ప్రాతః శ్రోతారః కురవః సభాయా-
మజాతశత్రో ర్వచనం త్వయోక్తమ్. 32

సంజయా! అనుమతి గొంటివి. ఇంటి కరుగుము. పండుకొనుము. అజాతశత్రుని మాటను-నీవు చెప్పుదానిని-సభలో రేపు కౌరవులు విందురు.

ఇతి శ్రీ మహాభారతే ఉద్యోగపర్వణి సఞ్జయయానపర్వణి
ధృతరాష్ట్రసఞ్జయసంవాదే ద్వాత్రింశోఽధ్యాయః

ఇది శ్రీ మహాభారతము ఉద్యోగపర్వమున సంజయయానపర్వమున
ధృతరాష్ట్రసంజయసంవాదము గల ముప్పది రెండవ అధ్యాయము.

సమాప్తం సఞ్జయయానపర్వ
సంజయయానపర్వము సమాప్తము.

—(o)—

32. ఆవసథమ్ - గృహమునకు; పరేహి - వెళ్లు; శయనమ్ - పడకను; ప్రపద్యస్వ - చేరుము;

## ప్రజాగరపర్వ - 3
## ప్రజాగరపర్వము - 3

### త్రయస్త్రింశోఽధ్యాయః - ముప్పదిమూడవ అధ్యాయము

వైశంపాయన ఉవాచ-వైశంపాయను డిట్లు చెప్పెను.

ద్వాఃస్థః ప్రాహ మహాప్రాజ్ఞో ధృతరాష్ట్రో మహీపతిః,
విదురం ద్రష్టు మిచ్ఛామి తమిహానయ మా చిరమ్. 1

గొప్పతెలివిగల ధృతరాష్ట్రమహారాజు ద్వారపాలకునితో 'ఓయీ! విదురుని చూడగోరుదును. అతని నిటకు తెమ్ము. ఆలసింపకుము' అని పలికెను.

ప్రహితో ధృతరాష్ట్రేణ దూతః క్షత్తార మబ్రవీత్,
ఈశ్వరస్త్వా మహారాజో మహాప్రాజ్ఞ దిదృక్షతి. 2

అట్లు ధృతరాష్ట్రుడు పంపిన దూత విదురునితో 'ఓయీ బుద్ధిశాలి ప్రభువు మహారాజు నిన్ను చూడగోరుచున్నాడు' అని పలికెను.

ఏవ ముక్తస్తు విదురః ప్రాప్య రాజనివేశనమ్,
అబ్రవీ ద్ధృతరాష్ట్రాయ ద్వాఃస్థం మాం ప్రతివేదయ. 3

ఇట్లు చెప్పగనే విదురుడు రాజభవనముకడకు చేరి ద్వారపాలకునితో ధృతరాష్ట్రునకు నన్నెరిగింపుమని పలికెను.

ద్వాఃస్థ ఉవాచ-కావలివా డిట్లు పలికెను.

విదురోఽయ మనుప్రాప్తో రాజేన్ద్ర తవ శాసనాత్,
ద్రష్టుమిచ్ఛతి తే పాదౌ కిం కరోతు ప్రశాధి మామ్. 4

ఓ రాజేన్ద్రా! నీ ఆనతివలన విదురు డేతెంచెను. నీ పాదములను దర్శింప గోరుచున్నాడు. అత డేమి చేయవలయునో నానతిమ్ము.

ధృతరాష్ట్ర ఉవాచ-ధృతరాష్ట్రు డిట్లు పలికెను.

ప్రవేశయ మహాప్రాజ్ఞం విదురం దీర్ఘదర్శినమ్,
అహం హి విదురస్యాస్య నాకల్పో జాతు దర్శనే. 5

గొప్ప ప్రజ్ఞ కలవాడు, ముందుచూపు కలవాడు అగు ఆ విదురుని ప్రవేశ పెట్టుము. ఆ విదురుడు ఎప్పుడైనను నన్ను చూడవచ్చును గదా!

ద్వాఃస్థ ఉవాచ - ద్వారపాలకు డిట్లు పలికెను.

ప్రవిశాన్తఃపురం క్షత్త ర్మహారాజస్య ధీమతః,
న హి తే దర్శనే కల్పో జాతు రాజాఽబ్రవీద్ధి మామ్. 6

అయ్యా విదురా! ధీమంతుడగు మహారాజు అంతఃపురములోనికి ప్రవేశిం పుము. నీవు దర్శనమునకై సంశయింప నక్కరలేదట. మహారాజు నాతో చెప్పెను.

వైశమ్పాయన ఉవాచ - వైశంపాయను డిట్లు చెప్పెను.

తతః ప్రవిశ్య విదురో ధృతరాష్ట్రనివేశనమ్,
అబ్రవీత్ ప్రాఞ్జలి ర్వాక్యం చిన్తయానం నరాధిపమ్. 7

అంత విదురుడు ధృతరాష్ట్రుని మందిరములోని కరిగి చేతులు మోడ్చి విచారముతో నున్న రాజుతో ఇట్లు పలికెను.

విదురోఽహం మహాప్రాజ్ఞ సంప్రాప్త స్తవ శాసనాత్,
యది కిఞ్చన కర్తవ్య మయమస్మి ప్రశాధి మామ్. 8

ఓ మహామేధావీ! విదురుడను. నీ శాసనమువలన వచ్చితిని. ఏదైన పని యున్నచో ఇదిగో ఉన్నాను. సెలవిమ్ము.

ధృతరాష్ట్ర ఉవాచ - ధృతరాష్ట్రు డిట్లు పలికెను.

సంజయో విదుర ప్రాజ్ఞో గర్హయిత్వా చ మాం గతః,
అజాతశత్రోః శ్వో వాక్యం సభామధ్యే చ వక్ష్యతి. 9

5. అకల్పః = అసమర్థుడు; న అకల్పః = అసమర్థుడు కానివాడు-సమర్థుడే యని భావము. దర్శనమున సమర్థు డనగా అడ్డులేనివా డని తాత్పర్యము.

6. కల్ప మనగా నిచట సంశయము.

విదురా! ఆ బుద్ధిమంతుడు సంజయుడు నన్ను తిట్టి పోయెను. అజాత శత్రు వాడిన మాటను రేపు కొలువులో చెప్పునట.

తస్యాద్య కురువీరస్య న విజ్ఞాతం వచో మయా,
తన్మే దహతి గాత్రాణి తదకార్షీత్ ప్రజాగరమ్. 10

ఆ కురువీరుడు చెప్పిన మాట ఏదియో నేడు నాకు తెలియలేదు. అందు వలన నా అవయవములు కాలిపోవుచున్నవి. నిద్ర పట్టుటలేదు.

జాగ్రతో దహ్యమానస్య శ్రేయో యదనుపశ్యసి,
తద్బ్రూహి త్వం హి న స్తాత ధర్మార్థకుశలో హ్యసి. 11

నిద్ర లేదు, ఒడలు కాలిపోవుచున్నది.ఇట్టి నాకు శ్రేయ మేదో చూడుము. నాయనా! నీవు ధర్మార్థములు బాగుగా తెలిసినవాడవు. నాకు బోధ చేయుము.

యతః ప్రాప్తః సఞ్జయః పాణ్డవేభ్యో
న మే యథావ న్మనసః ప్రశాన్తిః,
సర్వేన్ద్రియా ణ్యప్రకృతిం గతాని
కిం వక్ష్యతీత్యేవ మేఽద్య ప్రచిన్తా. 12

సంజయుడు పాండవుల కడనుండి వచ్చినది మొదలు నాకు మునుపువలె మనస్సునకు ప్రశాంతి లేదు. ఇంద్రియము లన్నియు కలతపడుచున్నవి. అతడు రేపేమి చెప్పునో యనియే నాకు పెద్దచింత.

విదుర ఉవాచ - విదురు డిట్లు చెప్పెను.

అభియుక్తం బలవతా దుర్బలం హీనసాధనమ్,
హృతస్వం కామినం చోర మావిశ న్తి ప్రజాగరాః. 13

బలవంతుడు ఎత్తివచ్చిన సాధనములు లేని బలహీనుడు, సొమ్ము కోల్పోయినవాడు, కాముకుడు, దొంగ వీరికి నిద్రపట్టదు.

---

10. ప్రజాగరమ్-నిద్ర లేకపోవుట.

12. యతః = ఎప్పుడు. యథావత్ = మునుపటివలె.

కచ్చి దేతై ర్మహాదోషై ర్న స్పృష్టోఽసి నరాధిప,
కచ్చిచ్చ పరవిత్తేషు గృధ్య న్న పరితప్యసే. 14

రాజా! ఈ పెనుదోసములు నిన్నంట లేదు గదా! ఇతరుల సొమ్ములందు లోభపడి నీవు తపించుటలేదు గదా!

ధృతరాష్ట్ర ఉవాచ - ధృతరాష్ట్రు డిట్లనెను.

శ్రోతు మిచ్ఛామి తే ధర్మ్యం పరం నైఃశ్రేయసం వచః,
అస్మిన్ రాజర్షివంశే హి త్వమేకః ప్రాజ్ఞసమ్మతః. 15

విదురా! ధర్మముతో కూడినదియు, మిక్కిలి శుభము నొసగునదియు నగు పలుకు నీనుండి వినగోరుచున్నాను. ఈ రాజర్షివంశమున నీ వొక్కడవే పండితుల కిష్టుడవు. (నీవు చెప్పిన దానిని పండితులును సమ్మతింతు రని భావము)

విదుర ఉవాచ - విదురు డిట్లు చెప్పెను.

[రాజా లక్షణసంపన్న స్త్రైలోక్య స్యాధిపో భవేత్,
ప్రేష్య స్తే ప్రేషిత శ్చైవ ధృతరాష్ట్ర యుధిష్ఠిరః. 1

ధృతరాష్ట్రా! ఆ యుధిష్ఠిరుడు మంచి లక్షణములు సమృద్ధిగా గలవాడు. ముల్లోకములకు ప్రభువు కాదగినవాడు. నీవు కోరి తెచ్చుకొనదగినవాడు. అట్టి వానిని అడవులకు పంపితివి.

విపరీతతరశ్చ త్వం భాగధేయేన సమ్మతః,
అర్చిషాం ప్రక్షయాచ్చైవ ధర్మాత్మా ధర్మకోవిదః. 2

---

15. గృధ్యన్ = లోభముతో ఉన్నవాడగుచు.
1. ప్రేష్యః - మిక్కిలిగా ప్రార్థింపబడవలసినవాడు. ప్రేషితః-వనములకు పంపబడినవాడు.
2. విపరీతతరః = ధర్మరాజులో ఉన్న రాజలక్షణములు ఏ కొంచెము లేని కారణమున అందరకు ద్వేషింపదగినవాడు; భాగధేయే = రాజ్యభాగము విషయమున; అర్చిషామ్ = నేత్రకాంతులయొక్క; ప్రక్షయాత్ = నాశనమువలన; ఇందలి ధర్మాత్ముడవు, ధర్మకోవిదుడవు అను పదములలో వెక్కిరింత కలదు.

నీవన్ననో (పెడసరపు కట్టెవు) ఏ మంచి లక్షణము లేని కారణమున అందరకు సరిపడనివాడవు. చూపులేని కారణమున రాజ్య మేలుటకు నిన్నెవ్వరు ఒప్పుకొనలేదు. నీవు మరి ధర్మాత్ముడవు! ధర్మతత్త్వ మెరిగినవాడవు!

ఆనృశంస్యా దనుక్రోశాద్ ధర్మాత్ సత్యాత్ పరాక్రమాత్,
గురుత్వా త్త్వయి సంప్రేక్ష్య బహూన్ క్లేశాం స్తితిక్షతే. 3

ధర్మరాజు క్రూరుడు కాకపోవుటవలనను,నీయందు దయకలిగిన కారణముననను,ధర్మమువలనను సత్యమునుబట్టియు,పరాక్రమమునుబట్టియు, పెద్దవాడవు కావునను, నీవు పెట్టిన పాటు లన్నియు సహించుచున్నాడు.

దుర్యోధనే సౌబలే చ కర్ణే దుఃశాసనే తథా,
ఏతే ష్వైశ్వర్య మాధాయ కథం త్వం భూతి మిచ్ఛసి. 4

నీవు దుర్యోధనునకు,శకునికి,కర్ణునకు, దుశ్శాసనునకు వశమైతివి.ఇంక నీకు మే లెట్లు కలుగును.

ఆత్మజ్ఞానం సమారమ్భ స్తితిక్షా ధర్మనిత్యతా,
యమర్థా న్నాపకర్షన్తి స వై పణ్డిత ఉచ్యతే.] 5

ఆత్మజ్ఞానము,కార్యములందు శక్తి,వైరాగ్యము,ధర్మ మెడతెగకుండుట అనునని పురుషార్థమునుండి ఎవనిని దూరముగా తొలగింపవో అతడు గదా పండితుడు.

---

3. ఆనృశంస్యాత్ = క్రౌర్యములేకపోవుటవలన;అనుక్రోశాత్ = దయవలన, తితిక్షతే = సహించుచున్నాడు.

4. ఏతేషు = వీరియందు;ఐశ్వర్యమ్ = ఈశ్వరభావమును(ప్రభుత్వమును) ఆధాయ = ఉంచి;భూతిమ్ = సంపదను;ఇచ్ఛసి = కోరుదువు.

5. ఆత్మజ్ఞానమ్-శాస్త్రముల సిద్ధించు గొప్ప జ్ఞానము; తితిక్షా = అన్నింటిని సహింపగలుగుట; ధర్మనిత్యతా - ఒకప్పుడును ధర్మము తప్పకుండుట (సత్కార్యములందు చెదరని శ్రద్ధ) - పైని చెప్పిన దుర్యోధనాదులలో ఈ లక్షణములు ఏ మాత్రము లేవు. కనుక వారిచే చిక్కిన నీకు సంపద యెట్లు కలుగునని భావము.

నిషేవతే ప్రశస్తాని నిందితాని న సేవతే,
అనాస్తికః శ్రద్ధధాన ఏతత్ పండితలక్షణమ్. 16

మేలైనవానిని చేయుట, కీడులను చేయకుండుట, నాస్తికత్వము లేకుండుట, శ్రద్ధ గలిగియుండుట- ఇది పండితుని లక్షణము.

క్రోధో హర్షశ్చ దర్పశ్చ హ్రీ స్తంభో మాన్యమానితా,
యమర్థా న్నాపకర్షన్తి స వై పణ్డిత ఉచ్యతే. 17

మితిమీరిన కోపము, పొంగిపోవుట, మిడిసిపాటు, సిగ్గు లేకుండుట, తన్ను తాను పూజ్యు డనుకొనుట-వీనివలన పురుషార్థములకు దూరము కానివాడే పండితుడు.

యస్య కృత్యం న జానన్తి మంత్రం వా మంత్రితం పరే,
కృతమే వాస్య జానన్తి స వై పణ్డిత ఉచ్యతే. 18

ఆత డేమి చేయునో యెవ్వరు నెఱుగరు. చేసిన ఊహ యేమో తెలియరాదు. ముగిసిన పనిని మాత్రమే యితరు లెఱుగుదురు. అట్టివానినే పండితు డందురు.

యస్య కృత్యం న విఘ్నన్తి శీతముష్ణం భయం రతిః,
సమృద్ధి రసమృద్ధి ర్వా స వై పణ్డిత ఉచ్యతే. 19

ఆతడు చేయబోవుపనికి చలి వేడి, భయము, కామము, కలిమి-లేమి అనునవి విఘ్నము కలిగింపజాలవు. వాడే పండితుడు.

యస్య సంసారిణీ ప్రజ్ఞా ధర్మార్థా వనువర్తతే,
కామా దర్థం వృణీతే యః స వై పణ్డిత ఉచ్యతే. 20

---

16. అనాస్తికః - పరలోకము మున్నగునది కలదని విశ్వాసము కలవాడు; శ్రద్దధానః - శ్రద్ధ యనగా గురువులయు వేదములయు పలుకులయందు సత్ఫలముండు నన్న నిశ్చయము - అది కలవాడు.

17. హ్రీ స్తంభః - సిగ్గులేనితనము, మాన్యమానితా-తన్ను తాను పూజ్యుడుగా భావించుకొనుట.

20. సంసారిణీ = స్వభావమునుబట్టి నిలకడలేనిది; కామాత్ = కామమును వదలి;

ప్రజ్ఞకు నిలుకడలేదు. అయినను ఒకని ప్రజ్ఞ ధర్మమును అర్థమును వెంటనంటి ప్రవర్తిల్లును. అట్టి ప్రజ్ఞకలవాడు కామమును వదలి నాల్గవ పురుషార్థమైన మోక్షమునే వరించును. వాడే పండితుడు.

యథాశక్తి చికీర్షన్తి యథాశక్తి చ కుర్వతే,
న కిఞ్చి దవమన్యన్తే నరాః పండితబుద్ధయః. 21

పండితమైన బుద్ధి గలవారు శక్తిమేరకు ఆ యా పనులను చేయగోరుదురు. చేయుదురు. దేనిని తేలికగా కొట్టివేయరు.

క్షిప్రం విజానాతి చిరం శృణోతి
విజ్ఞాయ చార్థం భజతే న కామాత్,
నాసంపృష్టో వ్యుపయుఙ్క్తే పరార్థే
తత్ప్రజ్ఞానం ప్రథమం పణ్డితస్య. 22

విషయమును త్వరగా ఎఱుగును. జ్ఞానము గట్టిపడుటకై చాలకాలము వినును. చక్కగా తెలిసికొనియే దేనినైనను సేవించును. అంతేకాని కామముతో కాదు. ఇతరులు అడుగకుండ నోరు పారవేసికొనడు. పండితుని తొలి చిహ్న మిది.

నాప్రాప్య మభివాఞ్ఛన్తి నష్టం నేచ్ఛన్తి శోచితుమ్,
ఆపత్సు చ న ముహ్యన్తి నరాః పణ్డితబుద్ధయః. 23

పండితబుద్ధిగల నరులు పొందరాని దానిని కోరరు. పోయినదానినిగూర్చి ఏడువరు. ఆపదలలో వివేకము కోల్పోవరు.

---

22. అసంపృష్టః - అడుగవలసిన తీరున నడుగఁబడనివాడు; వ్యుపయుఙ్క్తే - వ్యర్థముగా పలుకును; ప్రజ్ఞానమ్ = గుర్తు.

23 వ శ్లోకము మొదలుకొని ఈ ధృతరాష్ట్ర విదుర సంవాదములోని విదురుని మాటలు కొన్ని ధృతరాష్ట్రుని దోషములను నిందించునవి. కొన్ని ధర్మరాజును ప్రశంసించునవి. కొన్ని సాధారణములు.

నిశ్చిత్య యః ప్రక్రమతే నాన్తర్వసతి కర్మణః,
అవన్ధ్యకాలో వశ్యాత్మా స వై పణ్డిత ఉచ్యతే. 24

నిశ్చయముగాని పనికి పూనుకొనును. నడుమ వదలడు. మనసు నదుపున పెట్టుకొని ప్రయోజనమును సాధింపక వదలదు. అట్టివానిని పండితు డందురు.

ఆర్యకర్మణి రజ్యన్తే భూతికర్మాణి కుర్వతే,
హితం చ నాభ్యసూయన్తి పణ్డితా భరతర్షభ. 25

శిష్టుల కార్యమున రాగము పొందుదురు. సంపదల నొసగు పనుల నాచరింతురు. హితమును చెడుచూపు చూడరు. అట్టివారు పండితులు.

న హృష్య త్యాత్మసంమానే నావమానేన తప్యతే,
గాఙ్గో హ్రద ఇవాక్షోభ్యో యః స పణ్డిత ఉచ్యతే. 26

తనకు సమ్మానము కలిగినపుడు పొంగిపోడు. అవమానమున ఉడికిపోడు. గంగ మడుఁవువలె నిశ్చలముగా నుండువానిని పండితు డందురు.

తత్త్వజ్ఞః సర్వభూతానాం యోగజ్ఞః సర్వకర్మణామ్,
ఉపాయజ్ఞో మనుష్యాణాం నరః పణ్డిత ఉచ్యతే. 27

సర్వభూతముల తత్త్వము నెరిగియుండును. సర్వకార్యముల రచనా ప్రణాళిక నెరిగియుండును. అన్ని యుపాయములు తెలిసియుండును. మనుష్యులలో అట్టివానిని పండితు డందురు.

---

24. నిశ్చిత్య-తమ ప్రయత్నముతో సాధ్యమగునా యనుదానిని నిశ్చయించి; అంతః-మధ్య;న వసతి-అగిపోడు; అవన్ధ్యకాలః-ఫలము పొందకుండు నట్లుగాక;

25. ఆర్యకర్మణి-శిష్టుల పనియందు; భూతికర్మాణి-సంపదలొసగు పనులను.

27. సర్వభూతానామ్-సృష్టిలో పుట్టిన అన్నింటియొక్క; తత్త్వజ్ఞః-తత్త్వము-నశించు లక్షణమును, ఎరిగినవాడు; యోగజ్ఞః-యోగ మనగా చేయవలసిన తీరు-అది యెరిగినవాడు; ఉపాయః-పనికి కావలసిన సాధనసంపత్తి.

ప్రవృత్తవాక్ చిత్రకథ ఊహవాన్ ప్రతిభానవాన్,
ఆశు గ్రన్థస్య వక్తా చ యః స పణ్డిత ఉచ్యతే. 28

వాక్కులు చక్కగా సాగువాడు, లోకమునందలి యా యా కథలను చక్కగా నెఱిగినవాడు, తర్కశక్తి కలవాడు, సమయస్ఫూర్తికలవాడు, అక్కడి కక్కడ గ్రంథమును చెప్పగలవాడు పండితు డనబడును.

శ్రుతం ప్రజ్ఞానుగం యస్య ప్రజ్ఞా చైవ శ్రుతానుగా,
అసంభిన్నార్యమర్యాదః పణ్డితాఖ్యాం లభేత సః. 29

శాస్త్రజ్ఞానము బుద్ధికి, బుద్ధి శాస్త్రజ్ఞానమునకు వశమై యుండువాడు, ఆర్యుల కట్టడిని చెడగొట్టనివాడును పండితనామము పొందును.

అశ్రుతశ్చ సమున్నద్ధో దరిద్రశ్చ మహామనాః,
అర్థాం శ్చాకర్మణా ప్రేప్సు ర్మూఢ ఇత్యుచ్యతే బుధైః. 30

శాస్త్రజ్ఞానము లేకయు మిడిసిపడువానిని దరిద్రుడై గాలిమేడలు కట్టు చుండువానిని నీచపుపనితో సొమ్ములను పొందగోరువానిని బుధులు మూఢు డందురు.

స్వ మర్థం యః పరిత్యజ్య పరార్థ మనుతిష్ఠతి,
మిథ్యా చరతి మిత్రార్థే యశ్చ మూఢః స ఉచ్యతే. 31

---

28. ప్రవృత్తవాక్ - నంగిమాటలు లేనివాడు, ధారాళముగా పలుకనేర్చినవాడు; చిత్రకథః - లౌకికకథలను బాగుగా తెలిసినవాడు; ఊహః - తర్కము; ఊహవాన్ - తర్కించుశక్తి గలవాడు; ప్రతిభానవాన్ - ప్రతిభాన మనగా - సమయస్ఫూర్తి - అది గలవాడు.

29. ప్రజ్ఞానుగమ్ - బుద్ధికి వశ్యమైనది; శ్రుతానుగా - శాస్త్రము ననుసరించి ప్రవర్తించునది.

30. ఇందలి లక్షణము లన్నియు దుర్యోధనునకు వర్తించును. పెద్ద పండితుడు కాడు కాని మిక్కిలి మిడిసిపడుచుండును. ఇతరుల సొమ్ముపై చూపుగలవా డగుటచే దరిద్రుడు. మరియు ధర్మరాజును గెలుతు ననును. హీనమైన ద్యూతకర్మముచే పరులసొమ్మును వశపరచుకొనెను.

31. ఇందు శకునిని గూఢముగా చూడవచ్చును.

తన పని పూనుకొని యితరుల పనికై పూసికొని తిరుగువాడు, మిత్రుని కార్యమును పాడుచేయువాడు మూఢుడు.

అకామాన్ కామయతి యః కామయానాన్ పరిత్యజేత్,
బలవన్తం చ యో ద్వేష్టి, తమాహు ర్మూఢచేతసమ్. 32

కానివారిని చేరదీయువాడు, అయినవారిని దూరము చేసికొనువాడు, బలవంతుని ద్వేషించువాడు మూఢబుద్ధి.

అమిత్రం కురుతే మిత్రం మిత్రం ద్వేష్టి హినస్తి చ,
కర్మ చారభతే దుష్టం తమాహు ర్మూఢచేతసమ్. 33

ద్రోహము చేయువానిని మిత్రముగా భావించును. మిత్రుని ద్వేషించును. హింసించును. దుష్టకార్యముల నారంభించును. అట్టివానిని మూఢబుద్ధి యందురు.

సంసారయతి కృత్యాని సర్వత్ర విచికిత్సతే,
చిరం కరోతి క్షిప్రార్థే స మూఢో భరతర్షభ. 34

తన పనులను ఇతరులపై పెట్టును. అన్నియెడల సందేహించుచుండును. శీఘ్రముగా చేయవలసినచోట ఆలసించును. రాజా! అట్టివాడు మూఢుడు.

శ్రాద్ధం పితృభ్యో న దదాతి దైవతాని న చార్చతి,
సుహృన్మిత్రం న లభతే తమాహు ర్మూఢచేతసమ్. 35

పితృదేవతలకు శ్రాద్ధము పెట్టడు. దైవతముల నర్చింపడు. మక్కువగల మిత్రుని పొందడు. అట్టివానిని మూఢబుద్ధి యందురు.

అనాహూతః ప్రవిశతి అపృష్టో బహు భాషతే,
అవిశ్వస్తే విశ్వసితి మూఢచేతా నరాధమః. 36

---

32. అకామాన్-భక్తిహీనులగు కర్ణాదులను; కామయానాన్-నీయందు భక్తిగల పాండవులను; బలవన్తమ్-యుధిష్ఠిరుని.
33. దుష్టం కర్మ-లక్కయిల్లు కాల్చుట మొదలగునది.
34. సంసారయతి-సేవకుడు మొదలగువారిద్వారా చేయించును.

పిలువని పేరంటమునకు బోవును. అడుగకయే పెల్లు వాగును. నమ్మరానివానిని నమ్మును. ఇట్టి నరాధముడు మూఢబుద్ధి.

పరం క్షిపతి దోషేణ వర్తమానః స్వయం తథా,
యశ్చ క్రుధ్యత్యనీశానః స చ మూఢతమో నరః. 37

తానై తప్పు చేసి దానిని ఇతరునిపై మోపును.అధికారములు లేక కోపగించుచుండును.అట్టి నరుడు మూఢులలో తుదిమెట్టు.

ఆత్మనో బల మజ్ఞాయ ధర్మార్థపరివర్జితమ్,
అలభ్య మిచ్ఛ న్నైష్కర్మ్యా న్మూఢబుద్ధి రిహోచ్యతే. 38

తన సత్తువ యెరుగక, ధర్మార్థ రహితము, దుర్లభమగు వస్తువును ఎట్టిప్రయత్నము లేకయే పొందగోరువానిని మూఢబుద్ధి యందురు.

అశిష్యం శాస్తి యో రాజన్ యశ్చ శూన్య ముపాసతే,
కదర్యం భజతే యశ్చ తమాహు ర్మూఢచేతసమ్. 39

రాజా!శాసింపరానివారిని శాసించును.తెలియరాకుండ రాజభార్య మొదలగు వారిని సేవించుచుండును. దానగుణములేనివానిని పట్టి ప్రేలుచుండును.ఇట్టివాడు మూఢబుద్ధి.

అర్థం మహా న్త మాసాద్య విద్యా మైశ్వర్య మేవ వా,
విచర త్యసమున్నద్ధో యః, స పణ్డిత ఉచ్యతే. 40

గొప్ప ధనమును, విద్యను, ప్రభుత్వమును పొందియు మిడిసిపడక తిరుగువాడు పండితుడు.

ఏకః సంపన్న మశ్నాతి వస్తే వాసశ్చ శోభనమ్,
యోఽసంవిభజ్య భృత్యేభ్యః కో నృశంసతర స్తతః. 41

---

38. నైష్కర్మ్యాత్-ప్రయత్నము చేయకయే.
39. శూన్యముపాసతే-రాజులభార్యలను,ఇంకను అట్టివారిని గుట్టుగా పొందగోరుచుండును;
కదర్యమ్-దానగుణములేనివానిని;
40. అసమున్నద్ధః-మిడిసిపాటులేనివాడై;

సంపద సమృద్ధిగా గలిగియు నొక్కడై తినును.మంచిగుడ్డలు తాను మాత్రమే ధరించును.దేనిని తన్నాశ్రయించినవారికి పంచి యొసగడు.అంతకంటె మిక్కిలి క్రూరు డెవ్వడుండును?

ఏకః పాపాని కురుతే ఫలం భుఙ్క్తే మహాజనః,
భోక్తారో విప్రముచ్యన్తే కర్తా దోషేణ లిప్యతే. 42

ఒక్కడు పాపముల చేయును. వాని ఫలములను మంది యనుభవింతురు. అట్లనుభవించువారు పాపఫలమునుండి విడివడుదురు.చేసినవానికి ఆ దోషము తప్పక యంటును.

ఏకం హన్యా న్న వా హన్యా దిషుర్ముక్తో ధనుష్మతా,
బుద్ధి ర్బుద్ధిమతోత్సృష్టా హన్యాద్రాష్ట్రం సరాజకమ్. 43

విలుకాడు వదలిన బాణ మొకనిని చంపును. తప్పిపోయినను పోవచ్చును. నీతిశాలి ప్రయోగించిన నీతి పరుని రాష్ట్రమును రాజుతోపాటు చెరచును.

ఏకయా ద్వే వినిశ్చిత్య త్రీం శ్చతుర్భి ర్వశే కురు,
పఞ్చ జిత్వా విదిత్వా షట్ సప్త హిత్వా సుఖీ భవ. 44

ఒకదానిచే రెంటిని నిర్ణయించి మూటిని నాల్గింటితో వశపరచుకొనుము. అయిదింటిని గెలిచి, ఆరింటి నెరిగి, ఏడింటిని వదలి సుఖవంతుడవు కమ్ము.

---

44\. 1. ఏకయా-ఒకదానితో-పైశ్లోకమున బుద్ధినిగూర్చి చెప్పెను. కావున ఒక దానితో అనగా బుద్ధితో అని అర్థము.

2\. ద్వే-రెంటిని-నీతిపక్షమున కార్యము, అకార్యము అను రెంటిని, ఆధ్యాత్మ పక్షమున నిత్యము, అనిత్యము అనువానిని; వినిశ్చిత్య - చక్కగా నిర్ణయించి;

3\. త్రీన్-నీతిపక్షమున-శత్రువులను, మిత్రులను, ఉదాసీనులను; అధ్యాత్మ విషయమున-కామక్రోధలోభములను.

4\. చతుర్భిః-నీతిపక్షమున-సామదానభేదదండము లను నాలుగు ఉపాయములతో.

మిత్రుని సామముచేతనే, ఉదాసీనుని దానభేదములచేత, శత్రువును అన్నింటిచేతను వశము చేసికొనుమని భావము.

ఏకం విషరసో హన్తి శస్త్రేణైకశ్చ వధ్యతే,
సరాష్ట్రం సప్రజం హన్తి రాజానం మన్త్రవిప్లవః. 45

విషపు సార యొక్కనిని మాత్రము చంపును. శస్త్ర మొక్కనిని వధించును. మంత్రాలోచన పుట్టించు కల్లోలము - రాష్ట్రముతో ప్రజలతో కలిపి రాజును రూపుమాపును.

ఏకః స్వాదు న భుఞ్జీత ఏకశ్చార్థా న్న చిన్తయేత్,
ఏకో న గచ్ఛే దధ్వానం నైకః సుప్తేషు జాగృయాత్. 46

---

అధ్యాత్మపక్షమున-శమము, దమము, ఉపరమము, శ్రద్ధ అను వానిచేత కామాదులను వశము చేసికొనుము.

5. పఞ్చ జిత్వా-రెండర్థములయందును, అయిదు ఇంద్రియములను జయించి.
6. షడ్, విదిత్వా - ఆరింటి నెరిగి - రాజనీతి పక్షమున, సంధి, విగ్రహము, యానము, ఆసనము, ద్వైధీభావము, సంశ్రయము అనువాని నెరిగి. రెండవ పక్షమున-ఆకలి, దప్పి, శోకము, మోహము, ముదిమి, మృత్యువు-అనువాని నెరిగి.
7. సప్త హిత్వా-స్త్రీ, వేట, ద్యూతము, పానము. పరుషముగా పలుకుట, కఠినదండనము, ధనమును వ్యర్థపరచుట అను ఏడు వ్యసనములను వదలి.

రెండవ పక్షమున - అయిదు ఇంద్రియములు, బుద్ధి, మనస్సు అనువానిని వదలి.

సుఖీ భవ - సుఖవంతుడవు కమ్ము.

శ్రుతియు నిట్లు చెప్పుచున్నది.

"యదా పఞ్చావతిష్ఠన్తే జ్ఞానాని మనసా సహ,
బుద్ధిశ్చ న విచేష్టేత తామాహుః పరమాం గతిమ్''

ఎపుడు అయిదు జ్ఞానేంద్రియములు మనస్సుతో పాటు నిలుకడ చెందునో, బుద్ధియు కదలకుండునో అట్టిస్థితిని పరమగతి యందురు.

'పంచ జిత్వా' అనుచోట ఇంద్రియములను విషయములనుండి మరలించుటయనియు,సప్త హిత్వా-అనుచోట ఇంద్రియములను బ్రహ్మమునందు విలీనము చేయుట యనియు భేదము గమనింపదగును.

రుచిగల పదార్థమును ఒక్కడై తినరాదు. ఆ యా విషయముల నొక్కడై యాలోచింపరాదు. బాటలో ఒంటరియై పోరాదు. తక్కినవారు నిద్రించుచున్నపు డొకడు మేల్కొనరాదు.

ఏకమే వాద్వితీయం తద్యద్రాజ న్నావబుధ్యసే,
సత్యం స్వర్గస్య సోపానం పారావారస్య నౌరివ. 47

రాజా! అది ఒక్కటే. దానికి రెండవది లేదు. అదియే సత్యము. సముద్రమునకు నావవలె స్వర్గమునకు మెట్టు. దీని నెరుగకున్నావు.

ఏకః క్షమావతాం దోషో ద్వితీయో నోపపద్యతే,
యదేనం క్షమయా యుక్త మశక్తం మన్యతే జనః. 48

ఓర్పు గలవారికి సంబంధించిన దోష మొక్కటియే కలదు. రెండవది దొరకదు. అది యేమన ఓర్పుగలవానిని చేతకానివాడని జనుడు తలచును.

సోఽస్య దోషో న మన్తవ్యః క్షమా హి పరమం బలమ్,
క్షమా గుణో హ్యశక్తానాం శక్తానాం భూషణం క్షమా. 49

అదియును అతని తప్పునుకొనరాదు. ఏలయన ఓర్పే గొప్ప బలము. శక్తిహీనుల కది గుణము. శక్తిగలవారి కది అలంకారము.

క్షమా వశీకృతి ర్లోకే క్షమయా కిం న సాధ్యతే,
శాన్తిఖడ్గః కరే యస్య కిం కరిష్యతి దుర్జనః. 50

ఓర్పు లోకమున సన్నింటిని వశమునకు తెచ్చును. క్షమతో సాధ్యము కానిది లేదు. శాంతి యను కత్తి చేతబట్టినవానిని దుర్జను డేమి చేయును?

అతృణే పతితో వహ్నిః స్వయమే వోపశామ్యతి,
అక్షమావాన్ పరం దోషై రాత్మానం చైవ యోజయేత్. 51

గడ్డిపరకలు లేనిచోట పడిన నిప్పు తనంత తానే అణగిపోవును. ఓర్పు లేనివాడు మాత్రము తనదోషములతో తన్నే అంటించుకొనును.

---

47. సత్యమ్-యథార్థమును పలుకుట; స్వర్గస్య-స్వర్గమునకు; సోపానమ్-మెట్టు; మఱొకవిధముగా; సత్యమ్ = బ్రహ్మము; స్వర్గస్య-మోక్షమునకు; సోపానమ్-మెట్టు.

ఏకో ధర్మః పరం శ్రేయః క్షమైకా శాన్తి రుత్తమా,
విద్యైకా పరమా తృప్తి రహింసైకా సుఖావహా. 52

మిక్కిలి శ్రేయమైనది ధర్మ మొక్కటియే. సహన మొక్కటియే ఉత్తమమైన శాంతి నొసగును. విద్య యొక్కటియే పరమమైన తృప్తి నిచ్చునది. అహింస యొక్కటియే పరమసుఖమును గూర్చునది.

[పృథివ్యాం సాగరాన్తాయాం ద్వావిమౌ పురుషాధమౌ,
గృహస్థశ్చ నిరారమ్భః సారమ్భశ్చైవ భిక్షుకః.

సముద్రము ఎల్లగా గల భూమి మొత్తమున పురుషులలో అధము లిద్దరే. గృహస్థుడై చేతులు కట్టుకొని కూర్చుండువా డొకడు. సన్యాసియై సర్వకార్యములను చేయువా డొకడు.]

ద్వావిమౌ గ్రసతే భూమిః సర్పో బిలశయానివ,
రాజానం చావిరోద్ధారం బ్రాహ్మణం చాప్రవాసినమ్. 53

పుట్టలోని ప్రాణులను సర్పమువలె భూమి యిద్దరిని మ్రింగివైచును. ఒకడు పగసాధింపని రాజు. రెండవవాడు ఇల్లు వదలని బ్రాహ్మణుడు.

ద్వే కర్మణీ నరః కుర్వ న్నస్మింల్లోకే విరోచతే,
అబ్రువన్ పరుషం కిఞ్చి దసతోఽనర్చయం స్తథా. 54

పురుషుడు ఈలోకమున పరుషములు పలుకకుండుట, చెడ్డవారిని మన్నింపకుండుట అను రెండు పనులచేత ఉత్తము డగుచున్నాడు.

---

52. అహింస అనుటలో పుత్రులకు కలహము పెట్టి కులమును రూపు మాపకు మన్న భావము కలదు.

53. ద్వావిమౌ-ఇత్యాదిశ్లోకములలో కొంత ప్రకృతమునకు తగినట్లుగను, కొంతభాగము ప్రసంగమువలన దృష్టాంతరూపముగను చెప్పుచున్నట్లు గమనింపదగును. ఈ శ్లోకమున ఇల్లు వదలుట యనగా సన్న్యసించుట యని తాత్పర్యము.

54. అసతః అర్చయన్-శకుని మొదలగువారిని నీవు మన్నించుచున్నాడవని భావము.

ద్వావిమౌ పురుషవ్యాఘ్ర పరప్రత్యయకారిణౌ,
స్త్రియః కామితకామిన్యో లోకః పూజితపూజకః. 55

పురుషశ్రేష్ఠా! ఇతరుల నమ్మకమునుబట్టి ప్రవర్తించువారు ఇద్దఱు గలరు. స్త్రీలు ఇతరవనితలు కామించినవానినే కామింతురు. జనుడు ఇతరులు పూజించిన వానినే పూజించును.

ద్వావిమౌ కణ్టకౌ తీక్ష్ణౌ శరీరపరిశోషిణౌ,
యశ్చాధనః కామయతే యశ్చ కుప్య త్యనీశ్వరః. 56

దరిద్రుడై కోరికలు పెంచుకొనుట, ఏమియు చేయజాలక కోపించుట అను నీరెండును శరీరము నెండగట్టు రెండు వాడిములుకులు.

ద్వావేవ న విరాజేతే విపరీతేన కర్మణా,
గృహస్థశ్చ నిరారమ్భః కార్యవాంశ్చైవ భిక్షుకః. 57

గృహస్థుడై యుండి కర్మము లాచరింపనివాడును, సన్న్యాసియై కార్యము లొనరించువాడును-ఈ యిరువురు కానిపనులచేత వన్నెకెక్కరు.

ద్వావిమౌ పురుషౌ రాజన్ స్వర్గస్యోపరి తిష్ఠతః,
ప్రభుశ్చ క్షమయా యుక్తో దరిద్రశ్చ ప్రదానవాన్. 58

సమర్థుడై యుండియు సహనము కలవాడు, దరిద్రుడై యుండియు దాన మొసగువాడు ఈ యిరువురు స్వర్గమునకు పైభాగమున నిలుతురు.

న్యాయాగతస్య ద్రవ్యస్య బోద్ధవ్యౌ ద్వా వతిక్రమౌ,
అపాత్రే ప్రతిపత్తిశ్చ పాత్రే చాప్రతిపాదనమ్. 59

---

55. పూజితపూజకః-నీకొడుకు ఆదరించిన కర్ణుని నీవును ఆదరించుచున్నాడ వని భావము.
56. అనీశ్వరః-పుత్రునివిషయమున నీవు చేతకానివాడ వైతివని భావము.
57. నిరారమ్భః-కొడుకులపోరును వారింపక నీవు ఉదాసీనుడవై యున్నాడ వని భావము.
58. ప్రభుః-సమర్థుడై యుండియు సహనము చూపువాడు ధర్మరాజు.
59. పాత్రే-ధర్మవిషయమున.

న్యాయమార్గమున ఆర్జించిన ధనమునకు చేటులు రెండు. అధర్మమునకు వినియోగించుట. ధర్మమునకు వినియోగింపకుండుట.

ద్వా వమ్భసి నివేష్టవ్యౌ గళే బద్ధ్వా దృఢాం శిలామ్,
ధనవన్త మదాతారం దరిద్రం చాతపస్వినమ్. 60

దానములు చేయని ధనవంతుని, తపస్సు చేయని దరిద్రుని ఈ యిరువురిని మెడలో గట్టిరాతిని గట్టి నీట ముంచవలయును.

ద్వావిమౌ పురుషవ్యాఘ్ర సూర్యమణ్డలభేదినౌ,
పరివ్రా డ్యోగయుక్తశ్చ రణే చాభిముఖో హతః. 61

యోగము వదలని పరివ్రాజకుడు, యుద్ధమున శత్రువున కెదురేగి మరణించిన వీరుడును - ఈ యిరువురు సూర్యమండలమును చీల్చుకొని పరమపురుషుని జేరుదురు.

త్రయోపాయా మనుష్యాణాం శ్రూయన్తే భరతర్షభ,
కనీయా న్మధ్యమః శ్రేష్ఠ ఇతి వేదవిదో విదుః. 62

వేద మెరిగినవారు గుర్తించిన ఉపాయములు మనుష్యులకు సంబంధించి మూడు వినవచ్చుచున్నవి. అవి అధమము, మధ్యమము, శ్రేష్ఠము అని మూడు తీరులు.

త్రివిధాః పురుషా రాజ న్నుత్తమాధమమధ్యమాః,
నియోజయే ద్యథావ త్తాం స్త్రివిధేష్వేవ కర్మసు. 63

---

60. అదాతారమ్ - దాత కానివాడు - నీకొడుకువంటివానిని అని భావము.
61. సూర్యమండలమధ్యమున శ్రీమన్నారాయణుడు కలడని వేదవేత్తలందురు. భేదించుట యనగా పరమపురుషునిలో లీనమగుట యని భావము.
62. త్రయః + ఉపాయాః అని పదవిభాగము. సంధి ఆర్షము. యుద్ధము - అధమోపాయము. భేదము, దానము-మధ్యమోపాయములు. సామము - ఉత్తమోపాయము; త్రయః, అపాయాః అనియు విడదీయ నగును; కామ్యయోగము, కామ్యధర్మము, ఇహలోకలోభము-అనునవి.
63. యథావత్-తగినట్లు. నీవు అధములైనవారిని మంత్రకార్యమున నియోగించితివని సూచన.

రాజా! మానవులు ఉత్తములు, మధ్యములు, అధములు నని మూడు విధములుగా నుందురు. వారిని ఆ మూడువిధములైన పనులయందే తగినవిధముస నియోగింపవలయును.

త్రయ ఏవాధనా రాజన్ భార్యా దాస స్తథా సుతః,
యత్తే సమధిగచ్ఛన్తి యస్య తే తస్య తద్ధనమ్. 64

రాజా! భార్య, సేవకుడు, కొడుకు ఈ ముగ్గురే ధనము లేనివారు. వారు సంపాదించినది వారి స్వామికి చెందిన ధనమగును.

హరణం చ పరస్వానాం పరదారాభిమర్శనమ్,
సుహృదశ్చ పరిత్యాగ స్త్రయో దోషాః క్షయావహాః. 65

పరుల సొమ్మును హరించుట, పరభార్యను స్పృశించుట, మిత్రులను వదలుకొనుట అను మూడు దోషములు నరుని నాశనమునకు కారణములు.

త్రివిధం నరక స్యేదం ద్వారం నాశన మాత్మనః,
కామః క్రోధ స్తథా లోభ స్తస్మా దేతత్త్రయం త్యజేత్. 66

తన్ను నాశనము చేయునట్టి నరకద్వారము మూడురూపములలో నుండును. అవి కామము, క్రోధము, లోభము అనునవి. కావన నీ మూటింటిని త్యజింపవలయును.

వరప్రదానం రాజ్యం చ పుత్రజన్మ చ భారత,
శత్రోశ్చ మోక్షణం కృచ్ఛ్రాత్ త్రీణి చైకం చ తత్సమమ్. 67

---

64. అధనాః- నీ వుండగా నీ కొడుకునకు ధనముపై అధికారము లేదు. కనుక పాండవులకు రాజ్య మొసగుట నీ చేతిలోని పని అని భావము.

65. పరులసొమ్మును అపహరించుట మొదలగు మూడు దోషములు మీయందే కలవు. కనుక మీకు నాశము తప్పదని సూచన.

67. నీవు పగవాడుగా భావించు ధర్మరాజును స్వవంశమును చంపవలసిన కష్టమునుండి తప్పింపవలయునని భావము.

వర మొసగుట, రాజ్య మేలుట, కొడుకును గనుట అను నీ మూటితో శత్రువును కష్టమునుండి తప్పించుట సమానమైనవి.

భక్తం చ భజమానం చ తవాస్మీతి చ వాదినమ్,
త్రీ నేతా ఞ్ఛరణం ప్రాప్తాన్ విషమేఽపి న సంత్యజేత్. 68

ఇంటికి వచ్చువారగు భక్తుని, సేవించుచున్నవానిని, నీవాడనని పలుకువానిని నెట్టి సంకటమునందును విడువరాదు.

చత్వారి రాజ్ఞా తు మహాబలేన
వర్జ్యా న్యాహుః పణ్డిత స్తాని విద్యాత్,
అల్పప్రజ్ఞైః సహ మన్త్రం న కుర్యా
న్న దీర్ఘ సూత్రై రభసై శ్చారణైశ్చ. 69

రాజు గొప్పబలము కలవాడై నాల్గింటిని వదలవలయు ననుదురు. పండితుడు వాని నెరుగవలయును. మందమతులతో సంప్రదింపులు చేయరాదు. అట్లే దీర్ఘసూత్రులతోడను, లఘుబుద్ధులతో స్తోత్రపాఠకులతో మంత్రాంగము చేయరాదు. (మంత్రవిషయమున ఈ నల్వురను విడువవలయునని భావము).

చత్వారి తే తాత గృహే వసన్తు
శ్రియాఽభిజుష్టస్య గృహస్థధర్మే,

---

68. భక్తాదులు-పాండవులు; శరణమ్ - గృహము; విషమేఽపి- ఎట్టి కష్టసమయమునం దైనను; నీలో నిట్టి లక్షణము లేదని అధిక్షేపణ.

69. దీర్ఘసూత్రైః - తేలికగా నగుపనిని సాగదీయువారితో, రభసైః - ఆర్భాటము చేయువారితో; అలసైః - అనియు పాఠము. అలసులతో; చారణైః- స్తోత్రపాఠకులతో; అరణైః అనియు విడదీయదగును. అప్పుడు రణము చేయజాలక ద్యూతాదులయందు తగుల్కొనువారితో అని భావము. అశనైః - అనియు పాఠము. అప్పుడు తిండిపోతులతో నని యర్థము.

వృద్ధో జ్ఞాతి రవసన్నః కులీనః
సఖా దరిద్రో భగినీ చానపత్యా. 70

గృహస్థధర్మమున నున్న నీవు, సంపద కలిగియున్నపుడు నల్వురను ఇంట నిలుపుకొనవలయును. వారు వృద్ధుడైన జ్ఞాతి, బ్రదికి చెడిన తన కులము వాడు, పేదవడిన సఖుడు, సంతులేని సోదరి అనువారు.

చత్వార్యాహ మహారాజ సాద్యస్కాని బృహస్పతిః,
పృచ్ఛతే త్రిదశేన్ద్రాయ తానీమాని నిబోధ మే. 71

దేవేంద్రు డడుగగా బృహస్పతి అప్పటికప్పుడు ఫలమునొసగు నాల్గింటిని చెప్పెను. వానిని నానుండి తెలిసికొనుము.

దేవతానాం చ సంకల్ప మనుభావం చ ధీమతామ్,
వినయం కృతవిద్యానాం వినాశం పాపకర్మణామ్. 72

దేవతల సంకల్పము, బుద్ధిమంతుల మహిమ, విద్యగలవారి వినయము, పాపకర్ముల వినాశము - ఇవి వాని వాని సద్యఃఫలములు.

---

70. వృద్ధుడు కులధర్మముల నుపదేశించును; కులీనుడు పిల్లలకు ఆచారము పట్టునట్లు చేయును; సఖుడు హితము చెప్పును; (భీష్మాదులవలె) సోదరి ధనము రక్షించును. నీయింట నించుమించుగా ఈ అందరు కలరు కాని నీవు వారి యుపదేశమును గ్రహింపకున్నావని భావము.

72. (1) దేవతానాం సంకల్పమ్ - దేవతల సంకల్పము - దేవత లనగా స్వర్గమున నున్నవారు. స్వర్గ మనగా-
'యన్న దుఃఖేన సంభిన్నం న చ గ్రస్త మనన్తరమ్,
అభిలాషోపనీతం చ తత్సుఖం స్వఃపదాస్పదమ్'
దుఃఖముచేత చెడనిది, మరియొకనికి గుంజుకొనరానిది, కోరినదాని నొసగునది యగు సుఖమే స్వర్గశబ్దమున కర్థము. కావున దేవతలు సత్యసంకల్పులు. (2) ధీమంతు లనగా అగస్త్యులవంటివారు. అగస్త్యుడు సముద్రమును త్రాగివైచెను. కావున అట్టివారు దేవతలతో తుల్యులు. (3) వినయము కూడ గురువు ననుగ్రహమును సాధించును గావున అప్పటి కప్పుడు ఫల మొసగును. పాపకర్ములు పాములు మున్నగు వానివలె వినాశము పొందుట చూచుచునే యున్నాము.

చత్వారి కర్మా ణ్యభయంకరాణి
భయం ప్రయచ్ఛ న్త్యయథాకృతాని,
మానాగ్నిహోత్ర ముత మానమౌనం
మానేనాధీత ముత మానయజ్ఞః. 73

మానాగ్నిహోత్రము, మానమౌనము, మానాధ్యయనము, మానయజ్ఞము అను నీ నాల్గును భయహేతువులు కానివి. సరిగా చేయకున్నచో అవియే భయమును కలిగించును. (భయంకరములగును.)

పఞ్చాగ్నయో మనుష్యేణ పరిచర్యాః ప్రయత్నతః,
పితా మాతాఽగ్ని రాత్మా చ గురుశ్చ భరతర్షభ. 74

తండ్రి, తల్లి, అగ్ని, ఆత్మ, గురువు అను నీ అయిదగ్నులను పట్టుదలతో మనుష్యుడు సేవింపవలయును.

పఞ్చైవ పూజయన్ లోకే యశః ప్రాప్నోతి కేవలమ్,
దేవాన్ పితౄన్ మనుష్యాంశ్చ భిక్షూ నతిథిపఞ్చమాన్. 75

దేవతలను, పితృదేవతలను, మనుష్యులను, సన్న్యాసులను, అతిథులను– ఈ అయిదు విధములవారిని పూజించువాడు చక్కని కీర్తిని పొందును.

---

73. మాన-అగ్నిహోత్రము మొదలగు నాలుగింటియందును మానశబ్దమునకు ఆదరపూర్వకమైన అని యర్థము చెప్పుకొనదగును. అనగా అగ్నిహోత్రము, మౌనము, అధ్యయనము, యజ్ఞము అనువానిని లోకప్రశంసకో ఆర్భాటమునకో కాక తన్నుద్ధరించు మహావిషయములుగా భావించి ఆదరముతో అనుష్ఠింపవలయు నని తాత్పర్యము

74. అగ్నయః-అగ్నులు అనగా అగ్నివంటివారు. పూజ్యులే కాని ధిక్కరింపదగినవారు కారని భావము. నీ కొడుకు గురువైన యుధిష్ఠిరుని మన్నింపకున్నాడని సూచన.

75. పితౄన్ - అగ్నిష్వాత్తాది పితృదేవతలను; మనుష్యాన్ - మనుష్యులైన తండ్రి మొదలగువారిని; 'జ్యేష్ఠో భ్రాతా పితృసమః' అన్న తండ్రివంటివాడు. కావున నీ కొడుకు ధర్మరాజును పూజింపవలయునని భావము.

పశ్చాత్త్వా ను గమిష్యన్తి యత్ర యత్ర గమిష్యసి,
మిత్రా ణ్యమిత్రా మధ్యస్థా ఉపజీవ్యోపజీవినః. 76

మిత్రములు, శత్రువులు, మధ్యస్థులు, తన బ్రదుకున కాధారమైనవారు, తనపై ఆధారపడి బ్రదుకువారు - ఈ అయిదుగురు నీవెందెందు బోదువో అచటికి వెంటనంటి వత్తురు.

పఞ్చేన్ద్రియస్య మర్త్యస్య ఛిద్రం చేదేక మిన్ద్రియమ్,
తతో౽స్య స్రవతి ప్రజ్ఞా దృతేః పాత్రాదివోదకమ్. 77

అయిదింద్రియములు గల నరునకు ఒక యింద్రియము పట్టుతప్పినను, తోలుతిత్తినుండి నీరు కారిపోయిన విధముగా, ప్రజ్ఞ జారిపోవును.

షడ్ దోషాః పురుషేణేహ హాతవ్యా భూతి మిచ్ఛతా,
నిద్రా తన్ద్రీ భయం క్రోధ ఆలస్యం దీర్ఘసూత్రతా. 78

నిద్ర, సోమరితనము, భయము, ద్వేషము, అలసత, దీర్ఘసూత్రత అను నీయాఱు దోషములను సంపదగోరు పురుషుడు విడనాడవలయును.

షడిమాన్ పురుషో జహ్యా ద్భిన్నాం నావ మివార్ణవే,
అప్రవక్తార మాచార్య మనధీయాన మృత్విజమ్. 79

---

76. ఉపజీవ్యాః-తన బ్రదుకున కాధారమైన గురువులు; ఉపజీవినః-సేవకులు; ఈ లోకమున నీవు సాధించిన మిత్రాదులు ఇహపరలోకముల యందును, మరియొక జన్మమునందును తమ తమ కార్యములను (నీకై) చేయుదు రని భావము. మిత్రులగు పాండవులయందు మైత్రి నెరపుమని యుపదేశము.

76. నీవు గ్రుడ్డివాడవు కనుక దుర్జనుల మాటలను విని మోసపోయి పాండవుల గుణములను కనకున్నావని తాత్పర్యము.

77. దృతిః - చర్మముతో చేసిన నీటిపాత్ర.

78. క్రోధః - ఇచట క్రోధమును పుట్టించు ద్వేషమును గ్రహింపవగును; తంద్రీ - సోమరితనము; దీర్ఘసూత్రతా-శీఘ్రముగా చేయవలసిన పనిని నిష్కారణముగా పొడిగింపుట.

79. ఋత్విజమ్-యజ్ఞాదులను చేయించు బ్రాహ్మణుని

అరక్షితారం రాజానం భార్యాం చాప్రియవాదినీమ్,
గ్రామకామం చ గోపాలం వనకామం చ నాపితమ్. 80

పగిలిన నావను సముద్రమున పారవైచినట్లు, బోధనచేయని ఆచార్యుని, వేదములు చదువని ఋత్విజుని, రక్షింపని రాజును, అప్రియములు పలుకు ఆలిని, గ్రామమున నుండగోరు గోపాలుని, అడవికి పోనెంచు మంగలిని– ఈ ఆర్వురను నరుడు వదలిపెట్టవలయును.

షడేవ తు గుణాః పుంసా న హాతవ్యాః కదాచన,
సత్యం దాన మనాలస్య మనసూయా క్షమా ధృతిః. 81

మానవు డెన్నటికిని ఆరు గుణములను మాత్రము వదలరాదు. అవి సత్యము, దానము, సోమరితనము లేకుండుట, అసూయ లేకుండుట, ఓర్పు, ధైర్యము అనునవి.

అర్థాగమో నిత్య మరోగితా చ
ప్రియా చ భార్యా ప్రియవాదినీ చ,
వశ్యశ్చ పుత్రోఽర్థకరీ చ విద్యా
షడ్ జీవలోకస్య సుఖాని రాజన్. 82

రాజా! ధనము రాబడి, ఎప్పుడును చెడని ఆరోగ్యము, ప్రియములు పలికెడు ప్రియమైన భార్య, అదుపులో మెలగు కొడుకు, ప్రయోజనవంతమైన విద్య అను నీ యాఱును ప్రాణికి సుఖములు.

---

80. గ్రామకామమ్ - గ్రామమున నుండగోరువాడు - గోపాలుడు గ్రామము వదలకున్నచో గోవులకు పుష్టికరమగు ఆహారము లభింపదు గదా! వనకామమ్ - అడవిలో నుండగోరు; నాపితమ్ - మంగలిని. మంగలి ఊరిలో నుండనిచో గ్రామవాసులకు క్షురకర్మ సాగదుకదా! పాండవులను రక్షింపని రాజగు నిన్ను ఇతరులును వదలివేయుదు రని భావము.

81. దుర్యోధనుని వదలు ధృతి - ధైర్యము నీకు లేదని భావము.

షణ్ణా మాత్మని నిత్యానా మైశ్వర్యం యోఽధిగచ్ఛతి,
న స పాపైః కుతోఽనర్థై ర్యుజ్యతే విజితేన్ద్రియః. 83

ఇంద్రియముల గెలిచినవాడై వదలిపోవని ఆరు దుర్గుణములను వశపరచు కొనువానికి పాపము లంటవు. అనర్థములు కలుగవు.

షడిమే షట్సు జీవన్తి సప్తమో నోపలభ్యతే,
చౌరాః ప్రమత్తే జీవన్తి వ్యాధితేషు చికిత్సకాః. 84
ప్రమదాః కామయానేషు యజమానేషు యాజకాః,
రాజా వివదమానేషు నిత్యం మూర్ఖేషు పండితాః. 85

ఏమరియున్నవా డుండగా దొంగలు, రోగులు కలుగగా వైద్యులు, కాముకులు లభింపగా కాంతలు, యజ్ఞము చేయువా రున్నచో చేయించువారు, వివాదములు పొందినవారు ఉండగా రాజులు, మూర్ఖులుండగా పండితులు - అట్టి యారుగు రుండగా నీయారుగురు నిలుకడతో బ్రదుకుచున్నారు. ఏడవవాడు లేడు.

షడిమాని వినశ్యన్తి ముహూర్త మనవేక్షణాత్,
గావః సేవా కృషి ర్భార్యా విద్యా వృషలసంగతిః. 86

గోవులు, సేవ, వ్యవసాయము, భార్య, విద్య, శూద్రుని మైత్రి యను నీ యారును క్షణ మేమరినచో చెడును.

---

83. నిత్యానామ్ - మనుజు నంటిపెట్టుకొని వదలిపోని; షణ్ణామ్ - ఆరింటి యొక్క-కామక్రోధలోభమోహమదమాత్సర్యములయొక్క, ఐశ్వర్యమ్ - వశిత్వమును.

85. మూర్ఖేషు పండితాః - పాండవులు పండితులు. నీ కొడుకులు మూర్ఖులు. కావున వారు రాజ్యము తప్పక కైకొందురని భావము.

86. విద్యా - నీవు పుత్రస్నేహమువలన చక్కగా అరయక సద్విద్యను ధ్వంసము చేసితివి. లేనిచో సత్యమును ప్రతిష్ఠించియుండెడివాడ వని భావము.

షడేతే హ్యవమన్యన్తే నిత్యం పూర్వోపకారిణమ్,
ఆచార్యం శిక్షితాః శిష్యాః కృతదారాశ్చ మాతరమ్, 87
నారీం విగతకామాస్తు కృతార్థాశ్చ ప్రయోజకమ్,
నావం నిస్తీర్ణకాన్తారా ఆతురాశ్చ చికిత్సకమ్. 88

విద్యనేర్చిన శిష్యులు ఆచార్యుని, పెండ్లాడిన కొడుకులు తల్లిని, మోజు తీరినవాడు స్త్రీని, ప్రయోజనము పొందినవాడు ప్రయోజనము కల్గించినవానిని, ఏరు దాటినవాడు నావను, రోగము కుదిరినవాడు వైద్యుని, ఇట్లు ముందు ఉపకారము చేసినవానిని ఈ ఆరుగురు లెక్కగొనరు.

ఆరోగ్య మానృణ్య మవిప్రవాసః
సద్భి ర్మనుష్యైః సహ సంప్రయోగః,
స్వప్రత్యయా వృత్తి రభీతవాసః
షడ్ జీవలోకస్య సుఖాని రాజన్. 89

ఆరోగ్యము, ఋణము లేకుండుట, పరదేశవాసము చేయనక్కర లేకుండుట, మంచివారితో కలిసియుండుట, స్వతంత్రమగు బ్రదుకుతెరువు, భయము లేని మనుగడ అను నీ యారును మనుష్యునకు సుఖము నొసగునవి.

ఈర్షు ర్ఘృణీ న సంతుష్టః క్రోధనో నిత్యశఙ్కితః,
పరభాగ్యోపజీవీ చ షడేతే నిత్యదుఃఖితాః. 90

---

88. ఆతురాశ్చ చికిత్సకమ్ - ఆతురులు రోగులు - సందర్భమును బట్టి ఆరోగ్యము పొందిన తరువాత అను నర్థమును గ్రహింప వలయును; కృతార్థాశ్చ ప్రయోజకమ్ - సర్వరాజ్యమును నీకు సాధించి పెట్టినది పాండురాజు. ఆ ప్రయోజనము పొందిన తరువాత వాని పుత్రులను నీవు లెక్కచేయకున్నావు - అని భావము.

89. సద్భిః...నీకు సజ్జనసంగతి లేదని సూచన; స్వప్రత్యయా - స్వతంత్రమైన, వృత్తిః-బ్రదుకుతెరువు.

90. ఈర్షుః-నీయందు ఈర్ష్య కలదు. కావున నీకు దుఃఖమే. ఘృణా-జాలి, దీన స్వభావము-నీకొడుకు కొక్కడును నిన్ను మన్నించని కారణమున నీవు దీనుడవని భావము.

ఈర్ష్య, దీనత, అతృప్తి, క్రోధము, ఎల్లపుడు శంకించుట, పరుల సొమ్ముపై బ్రదుకుట అను ఈ ఆరు లక్షణములు గలవారికి ఎప్పుడు దుఃఖమే.

సప్తదోషా స్సదా రాజ్ఞా హాతవ్యా వ్యసనోదయాః,
ప్రాయశో యై ర్వినశ్యన్తి కృతమూలా అపీశ్వరాః. 91

చెడుఅలవాటులను పుట్టించు ఏడుదోషములను రాజులు తప్పక విడనాడవలయును లేనిచో వారు వ్రేళ్లు పాతుకొనినవారైనను వానిచేత తప్పక నశింతురు.

స్త్రియోఽక్షా మృగయా పానం వాక్పారుష్యం చ పఞ్చమమ్,
మహచ్చ దణ్డపారుష్య మర్థదూషణ మేవ చ. 92

పై ఏడు దోషములు - స్త్రీ, ద్యూతము, వేట, మద్యపానము; మిరుసెక్కిన మాట, అతికఠినమైన దండనము, సొమ్ములను వ్యర్థముగా వెచ్చించుట.

అష్టౌ పూర్వనిమిత్తాని నరస్య వినశిష్యతః,
బ్రాహ్మణాన్ ప్రథమం ద్వేష్టి బ్రాహ్మణైశ్చ విరుధ్యతే. 93
బ్రాహ్మణస్వాని చాదత్తే బ్రాహ్మణాంశ్చ జిఘాంసతి,
రమతే నిన్దయా చైషాం ప్రశంసాం నాభినన్దతి. 94
నైనాన్ స్మరతి కృత్యేషు యాచిత శ్చాభ్యసూయతి,
ఏతాన్ దోషా న్నరః ప్రాజ్ఞో బుద్ధ్యే ద్బుద్ధ్వా విసర్జయేత్. 95

నరుడు నశించుటకు ముందు కనుపట్టు నిమిత్తము లెనిమిది కలవు. బ్రహ్మవేత్తలను ద్వేషించును. వారితో కలహించును. వారి సొమ్ముల నపహరించును. వారిని చంపజూచును. వారిని నిందించినచో ఆనందించును. వారిని పొగడినచో మెచ్చడు. చేయవలసిన పనులయందు వారిని స్మరింపడు. వారేదైన నడిగిన లేని తప్పుల నొప్పజెప్పును. బుద్ధిమంతుడగు నరు డీ దోషములను చక్కగా ఎఱుగవలయును. ఎఱిగి విడనాడవలయును.

---

93. ద్వేష్టి - ద్వేషించుట - మనస్సుతో అనిష్టమును భావించుట; విరుధ్యతే - చేష్టతో అపకారము చేయుట - యాచితశ్చ అభ్యసూయతి-దుర్యోధనుడు ముందు మైత్రేయుని నిందించు ఘట్టము దీనికి దృష్టాంతము.

అష్టౌ విమాని హర్షస్య నవనీతాని భారత।
వర్తమానాని దృశ్యన్తే తాన్యేవ స్వసుఖాన్యపి. 96
సమాగమశ్చ సఖిభి ర్మహాం శ్చైవ ధనాగమః,
పుత్రేణ చ పరిష్వజ్గః సన్నిపాతశ్చ మైథునే. 97
సమయే చ ప్రియాలాపః స్వయూథ్యేషు సమున్నతిః,
అభిప్రేతస్య లాభశ్చ పూజా చ జనసంసది. 98

ప్రాణమిత్రులతోడి కలయిక, ధనము మిక్కుటముగా లభించుట, కొడుకును కౌగలించుకొనుట, మిథునకర్మమున ప్రవర్తించుట, తగు సమయమున మంచిమాటలు వినుట, తోటివారిలో గౌరవము, కోరినది లభించుట, జన సముదాయమున సమ్మానము - అను నీ యెనిమిదియు ఆనందసారము; మరియు నివియే తత్కాలసుఖమునుగూడ కలిగించునవి.

అష్టౌ గుణాః పురుషం దీపయన్తి
ప్రజ్ఞా చ కౌల్యం చ దమః శ్రుతం చ,
పరాక్రమ శ్చాబహుభాషితా చ
దానం యథాశక్తి కృతజ్ఞతా చ. 99

తెలివి, సత్కులము, నిగ్రహము, పాండిత్యము, పరాక్రమము, మితముగా పలుకుట, శక్తికొలదిగా దాన మొసగుట, చేసిన మేలు మరువకుండుట అను నీ యెనిమిదిగుణములును పురుషుని ప్రకాశింపజేయును.

నవద్వార మిదం వేశ్మ త్రిస్థూణం పఞ్చసాక్షికమ్,
క్షేత్రజ్ఞాధిష్ఠితం విద్వాన్ యో వేద స పరః కవిః. 100

---

98. జనసంసది-నిండుసభలో ద్రౌపది నవమానించుటవలన నీకు సభాగౌరవము నశించిన దని భావము.

99. కౌల్యము-సత్కులమున పుట్టుట.

100. వేశ్మ-గృహము - దేహమే యిచట గృహము; దీనికి, నవద్వారమ్ - తొమ్మిది ద్వారములు కలవు. చెవి, కన్ను, చర్మము, నాలుక, ముక్కు అను అయిదింద్రియములు, మనస్సు, బుద్ధి, అహంకారము అను

ఈ దేహమను ఇంటికి తొమ్మిది ద్వారములు, మూడు స్తంభములు, అయిదు సాక్షులు, దీనియందు క్షేత్రజ్ఞుడు నెలకొని యున్నాడు. దీని తత్త్వమును చక్కగా ఎరిగిన విద్వాంసుడు అందరిని మించిన కవి.

దశ ధర్మం న జానన్తి ధృతరాష్ట్ర నిబోధ తాన్,
మత్తః ప్రమత్త ఉన్మత్తః శ్రాన్తః క్రుద్ధో బుభుక్షితః. 101
త్వరమాణశ్చ లుబ్ధశ్చ భీతః కామీ చ తే దశ,
తస్మా దేతేషు సర్వేషు న ప్రసజ్జేత పణ్డితః. 102

---

మూడును, స్థూలశరీరము - అను నీ తొమ్మిదియు దీనికి ద్వారములు - ద్వారములవలె విషయములను గ్రహించు మార్గములు కనుక వీనిని ద్వారము లందురు.

త్రిస్థూణం - మూడు స్తంభములు కలది-అనగా ఇంటిని స్తంభములవలె నివి దేహమును పట్టి నిలుపును. అవి అవిద్య, కామము, కర్మము అనునవి. వేశ్మ-స్థూలము, సూక్ష్మము అను రెండుతీరులైన దేహము. పఞ్చ సాక్షికమ్- దీనిని చూచుచుండువా రైదుగురు. శబ్దము, స్పర్శ, రూపము, రసము, గంధము-అనునవి. ఇవి యేమియు పట్టించుకొనక ఉదాసీనుల వలె నుండును కాన సాక్షిగా రూపింపబడినవి. పంచభూమిక మనియు పాఠము. అప్పుడు అయిదు ప్రచార (తిరుగుటకైన) స్థానములు కలది అని యర్థము. ఆ అయిదు పైన చెప్పిన శబ్దాదులే.

క్షేత్రజ్ఞ, అధిష్ఠితమ్-జ్ఞానరూపమగు ఆత్మ పదార్థము దీనియందు నెలకొని యున్నది - గృహస్వామి వలె.

ఇదమ్ - ఇట్టి యీ క్షేత్రమును; యః విద్వాన్ - ఏ పండితుడు, వేద-తత్త్వముతో ఎఱుగునో, సః - అతడు, పరః - అందరిని మించిన; కవిః-బ్రహ్మవేత్త.

101. మత్తః-మద్యము మున్నగువానిచేత ఒడలు తెలియనివాడు; ప్రమత్తః-పరధ్యానముచే మనసు నిలుకడ లేనివాడు; ఉన్మత్తః - ధాతుదోషముచే పిచ్చి యెక్కినవాడు- ఈ పదిమందిలో నీవు లుబ్ధుడ వని భావము.

ధృతరాష్ట్రా! పదిమంది ధర్మము నెఱుగరు. వారి నెరుగుము. 1. మత్తెక్కినవాడు 2. పొరపాటుపడువాడు 3. పిచ్చివాడు 4. అలసినవాడు 5. క్రోధముగలవాడు 6. ఆకలిగొన్నవాడు 7. తొందరపాటుపడువాడు 8. అత్యాశగలవాడు 9. భయపడినవాడు 10. కాముకుడు. కావున పండితు డెప్పటికిని వీరితో సంగతి చేయరాదు.

అత్రైవోదాహరన్తీమ మితిహాసం పురాతనమ్,
పుత్రార్థ మసురేన్ద్రేణ గీతం చైవ సుధన్వనా. 103

ఈ తావుననే ఈ పురాతనచారిత్రమును ఉదాహరింతురు. రాక్షసరాజు ప్రహ్లాదుడు సుధన్వునితో కలిసి దీనిని కొడుకున కుపదేశించెను.

యః కామమన్యూ ప్రజహాతి రాజా
పాత్రే ప్రతిష్ఠాపయతే ధనం చ,
విశేషవి చ్ఛ్రుతవాన్ క్షిప్రకారీ
తం సర్వలోకః కురుతే ప్రమాణమ్. 104

ఏ ప్రభువు కామక్రోధములను విడనాడునో, ధనమును సత్పాత్రమున వినియోగించునో, తరతమభేదములను చక్కగా నెరుగునో, విద్యాసంపన్ను డగునో, కార్యములను ఆలసింపక చేయునో అట్టివానిని లోకమంతయు ప్రమాణముగా స్వీకరించును.

జానాతి విశ్వాసయితుం మనుష్యాన్
విజ్ఞాతదోషేషు దధాతి దణ్డమ్,
జానాతి మాత్రాం చ తథా క్షమాం చ
తం తాదృశం శ్రీర్జుషతే సమగ్రా. 105

మనుష్యులకు నమ్మకము పుట్టింపజాలువాడు, నేరము రుజువైనవారియెడ తగిన శిక్షను ప్రయోగించువాడు, అపరాధమునకు తగిన ప్రమాణములో

104. కామమన్యూ-కామక్రోధములు; విశేషవిత్-తరతమభేదము తెలిసినవాడు.
105. మాత్రాం-శిక్షయొక్క ప్రమాణమును; క్షమామ్-అపరాధము చేసినను ఓర్వదగిన స్థితిని.

దండము నొసగుట, తప్పు చేసినను క్షమింపవలసినవారిని క్షమించుట యను వాని నెఱిగినవాడును సమగ్రమైన సంపదను పొందును.

సుదుర్బలం నావజానాతి కఞ్చి
ద్యుక్తో రిపుం సేవతే బుద్ధిపూర్వమ్,
న విగ్రహం రోచయతే బలస్థైః
కాలే చ యో విక్రమతే స ధీరః. 106

మిక్కిలి బలహీనునికూడ అవమానింపడు. తరియగువరకు బుద్ధిపూర్వకముగా పగవానిని సేవించును. బలవంతులతో విరోధమున కిష్టపడడు. తగుకాలమున పరాక్రమము చూపును. అట్టివాడు ధీరుడు.

ప్రాప్యాపదం న వ్యథతే కదాచి-
దుద్యోగ మన్విచ్ఛతి చాప్రమత్తః,
దుఃఖం చ కాలే సహతే మహాత్మా
ధురన్ధర స్తస్య జితాః సపత్నాః. 107

ఆపదలం దొకప్పుడును క్రుంగిపోడు. ప్రమాదపడక కార్యసాధనకై యత్నించును. దొడ్డబుద్ధితో కాలమునుబట్టి దుఃఖమును సహించును. అట్లు సర్వభారములను సహింపగలవాడు శత్రువులను గెలుచును.

అనర్థకం విప్రవాసం గృహేభ్యః
పాపైః సన్ధిం పరదారాభిమర్శమ్,
దమ్భం స్తైన్యం పైశునం మద్యపానం
న సేవతే యశ్చ సుఖీ సదైవ. 108

పనియేమియు లేక భార్యలను వదలి విదేశముల కరుగుట, పాపులతో సంధి, పరులభార్యలను స్పృశించుట, గర్వము, దొంగతనము, లోభితనము, మద్యపానము-అనువాని పొంత బోనివాడు ఎల్లప్పుడు సుఖవంతు డగును.

---

106. యుక్తః-శత్రువు లోపమును గనుగొనుటలో మెలకువ కలవాడై.
107. ధురంధరః-కార్యభారమునందు శక్తిగలవాడు;

న సంరంభే ణారభతే త్రివర్గ-
మాకారితః శంసతి తత్త్వమేవ,
న మిత్రార్థే రోచయతే వివాదం
నాపూజితః కుప్యతి చాప్యమూఢః. 109

న యోఽభ్యసూయ త్యనుకమ్పతే చ
న దుర్బలః ప్రాతిభావ్యం కరోతి,
నాత్యాహ కిఞ్చిత్ క్షమతే వివాదం
సర్వత్ర తాదృగ్ లభతే ప్రశంసాన్. 110

ధర్మ అర్థ, కామములను క్రోధముతో మొదలిడనివాడును, ఇతరులు పిలిచి ఏదైన తన్ను అడిగినపుడు తత్త్వమునే (సత్యమునే) చెప్పువాడును, మిత్రుల విషయమున వివాదమును ఇష్టపడనివాడును, ఆవలివాడు మన్నింపకున్నను మూఢుడు కాక కోపగింపనివాడును, ఇతరులను సమభావముతోచూచుచు, తప్పులు వెదుకకుండువాడును, బలహీనుడై యితరులతో విరోధము చేయనివాడును, హద్దుమీరి ఏ కొంచెము పలుకకుండువాడును, వివాదమున ఓర్పు చూపువాడును, అన్నియెడల మెప్పులను పొందును.

యో నోద్ధతం కురుతే జాతు వేషం
న పౌరుషేణాపి వికత్థతేఽన్యాన్,
న మూర్ఛితః కటుకా న్యాహ కిఞ్చిత్
ప్రియం సదా తం కురుతే జనో హి. 111

ఎన్నడు పెళపెళలాడు వేషము వేయనివానిని, పౌరుషము సమృద్ధిగానున్నను ఇతరులకడ తన గొప్పలు చెప్పుకొనని వానిని, ఒడలెఱుగక యితరులను కాఱులు కూయనివానిని లోకము ఎల్లవేళల ప్రేమపాత్రుని గావించుకొనును.

---

109. సంరంభేణ-క్రోధముతో-ఆర్భాటముతో నని భావము, త్రివర్గమ్-ధర్మ, అర్థ, కామములను; ఆకారితః-పిలువబడినవాడై;

110. ప్రాతిభావ్యమ్ - ప్రతికూలమైన - విరుద్ధమైన భావము - దాని భావము-ప్రాతిభావ్యము - విరోధమని తాత్పర్యము; న అత్యాహ - హద్దు మీరి పలుకడు.

111. మూర్ఛితః - ఒడలెఱుగనివాడు; కటుకాన్ - బాధపెట్టు మాటలను.

న వైర ముద్దీపయతి ప్రశాన్తం
న దర్ప మారోహతి నాస్తమేతి,
న దుర్గతోఽస్మీతి కరో త్యకార్యం
త మార్యశీలం పర మాహు రార్యాః. 112

అణగిన వైరమును రగుల్కొల్పనివానిని, పొగరెక్కి ప్రవర్తింపని వానిని, నీరు కారిపోవనివానిని, చేటు మూడెనని తప్పుడుపనులు చేయనివానిని గొప్ప ఆర్యశీలుడని చెప్పుదురు.

న స్వే సుఖే వై కురుతే ప్రహర్షం
నాన్యస్య దుఃఖే భవతి ప్రహృష్టః,
దత్త్వా న పశ్చాత్ కురుతే న తాపం
స కథ్యతే సత్పురుషార్యశీలః. 113

తనదైన సుఖమందు పొంగిపోవడు. ఇతరుడు దుఃఖము పొందగా సంతసింపడు. ఇచ్చిన దానినిగూర్చి పిదప వగవడు. అట్టివానిని సత్పురుషుడు, ఆర్యశీలుడు అందురు.

దేశాచారాన్ సమయాన్ జాతిధర్మాన్
బుభూషతే యః స పరావరజ్ఞః,
స యత్ర తత్రాభిమతః సదైవ
మహాజన స్యాధిపత్యం కరోతి. 114

ఆయా దేశముల ఆచారములను, పలుకుబడులను ఆయా జాతుల లక్షణములను తెలియగోరువాడును, ఉత్తమవివేకము గలవాడును నగు పురుషుడు ఏ దేశ మేగినను అందు ఎల్లవేళల నందరకు ఇష్టుడగును. గొప్పజనముపై అధికారమును గూడ బొందును.

112. అస్తమ్ - అణగిపోవుటను;
114. సమయాన్ - భాషాభేదములను; పలుకుధోరణులను; పరావరజ్ఞః - పరు డనగా ఉత్తముడు. అవరు డనగా నీచుడు. అట్టివారిని ఎరిగినవాడు.

దంభం మోహం మత్సరం పాపకృత్యం
రాజద్విష్టం పైశునం పూగవైరమ్,
మత్తోన్మత్తై ర్దుర్జన స్యాపి వాదం
యః ప్రజ్ఞావాన్ వర్జయేత్ స ప్రధానః. 115

ఆడంబరము, మోహము, ద్వేషము, పాపముల నాచరించుట, రాజ ద్రోహము, లోభిత్వము, మందితో కలహించుట, పొగరెక్కినవారితో, పిచ్చి వారితో, దుర్జనులతో వాదించుట అనువానిని దరికి రానీయనివాడు బుద్ధిమంతులలో మొదటివాడు.

దానం హోమం దైవతం మఙ్గళాని
ప్రాయశ్చిత్తాన్ విధివల్లోకవాదాన్,
ఏతాని యః కురుతే నైత్యకాని
తస్యోత్థానం దేవతా రాధయన్తి. 116

దానము, హోమము, దేవతార్చన, మంగళకార్యములు, శాస్త్రము చెప్పిన రీతిగా ప్రాయశ్చిత్తములు, లోకప్రసిద్ధములగు ఆచారములు అనువానిని ప్రతి దినము విడువక చేయువానికి దేవతలు ఇష్టసిద్ధి గావింతురు.

సమై ర్వివాహం కురుతే న హీనైః
సమైః సఖ్యం వ్యవహారం కథాం చ,
గుణై ర్విశిష్టాంశ్చ పురో దధాతి
విపశ్చిత స్తస్య నయాః సునీతాః. 117

---

115. దమ్భమ్ - పరవంచనకు ధర్మానుష్ఠానము; మోహమ్ - ఆత్మ కానిదాని నాత్మ యనుకొనుట;మత్సరమ్-ద్వేషము;పాపకృత్యమ్-అభిచారాదికర్మలు చేయుట; పూగవైరమ్ - మందితో కలహించుట; పైశునమ్ - పిశినిగొట్టు తనము.

116. నైత్యకాని-విడువక చేయు కార్యములు; ఉత్థానమ్ - అభివృద్ధిని; రాధయన్తి - కూర్తురు.

సంబంధము, సఖ్యము, వ్యవహారము, సంభాషణము అనువానిని సములతోడనే చేయును. హీనులతో చేయడు. గుణములతో వన్నెకెక్కినవారిని ముందుంచుకొనును. అట్టి పండితుని నీతులు సఫలము లగును.

మితం భుఙ్క్తే సంవిభజ్యాశ్రితేభ్యో
మితం స్వపిత్యమితం కర్మ కృత్వా,
దదాత్యమిత్రేష్వపి యాచితః సం
స్తమాత్మవన్తం ప్రజహత్యనర్థాః. 118

ఉన్నదానిని ఆశ్రితులకు పంచిపెట్టి మితముగా భుజించును. ఎక్కువ పనిచేసి తక్కువగా నిద్రించును. అడిగినచో పగవారికైనను ఇచ్చును. అట్టి ఆత్మవంతుని కీడులు దరిజేరవు.

చికీర్షితం విప్రకృతం చ యస్య
నాన్యే జనాః కర్మ జానన్తి కిఞ్చిత్,
మన్త్రే గుప్తే సమ్యగనుష్ఠితే చ
నాల్పోఽప్యస్య చ్యవతే కశ్చిదర్థః. 119

తన కభిమతమైనదియు, పగవానికి విరుద్ధమైనదియు నగు ఆతడు పూనిన పనిని కొంచెమేని ఇతరజను లెరుగజాలరు. అతడు రక్షించు మంత్రముగాని (పన్నుగడగాని) చక్కని ఆచరణముగాని యిసుమంతయు జారిపోదు.

యః సర్వభూతప్రశమే నివిష్టః
సత్యో మృదు ర్మానకృ చ్ఛుద్ధభావః,
అతీవ స జ్ఞాయతే జ్ఞాతిమధ్యే
మహామణి ర్జాత్య ఇవ ప్రసన్నః. 120

సర్వభూతములు శాంతి నొందుటలో ప్రయత్నపడువాడు, సత్యము పలుకువాడు, మెత్తని స్వభావము కలవాడు, ఇతరుల కాదర్శప్రాయముగా నుండువాడు, పవిత్రములగు భావములు కలవాడు, నగు మనుజుడు ఉత్తమ మగు జాతిరత్నమువలె, సాటివారిలో మిక్కిలిగా గణన కెక్కును.

---

120. జాత్యః-మంచిగనిలో పుట్టినది.

య ఆత్మనాఽపత్రపతే భృశం నరః
స సర్వలోకస్య గురు ర్భవ త్యుత,
అన న్తతేజాః సుమనాః సమాహితః
స తేజసా సూర్య ఇవావభాసతే. 121

పొరపాటుననైన తన దోషములకు తానే మిక్కిలిగా సిగ్గుపడు నరుడు సర్వలోకమునకు గురువగును. అనంతమైన తేజము, దొడ్డ మనస్సు, నిలుకడయు కలిగి ఆతడు సూర్యునివలె విరాజిల్లును.

వనే జాతాః శాపదగ్ధస్య రాజ్ఞః
పాణ్డోః పుత్రాః పఞ్చ పఞ్చేన్ద్రకల్పాః,
త్వయైవ బాలా వర్ధితాః శిక్షితాశ్చ
తవాదేశం పాలయ న్త్యామ్బికేయ. 122

ఓయి అంబికాతనయా! శాపముచే కాలిపోయిన పాండురాజు కొడుకు లయిదుగురు అయిదుగురైన యింద్రులవంటివారు. అడవిలో పుట్టినవారు. వారిని పసితనమున నీవే పెంచితివి. చదువుసంధ్యలు చెప్పించితివి. నీయాజ్ఞను వారు పాలింతురు.

ప్రదాయైషా ముచితం తాత రాజ్యం
సుఖీ పుత్త్రైః సహితో మోదమానః,
న దేవానాం నాపి చ మానుషాణాం
భవిష్యసి త్వం తర్కణీయో నరేంద్ర. 123

రాజా! అట్టివారికి తగిన రాజ్యభాగము నిచ్చి కొడుకులతో కూడి ఆనందించుచు, సుఖవంతుడవు కమ్ము. అట్లయినచో నిన్ను దేవతలుగాని మానవులుగాని శంకింపరు.

ఇతి శ్రీమహాభారతే ఉద్యోగపర్వణి ప్రజాగరపర్వణి
విదురనీతివాక్యే త్రయస్త్రింశోఽధ్యాయః.

ఇది శ్రీమహాభారతము ఉద్యోగపర్వమున ప్రజాగరపర్వమున
విదురనీతివాక్యముగల ముప్పదిమూడవ అధ్యాయము.

---

121. ఆత్మనా అపత్రపతే-తన దోషములకు తానే సిగ్గుపడును.
123. తర్కణీయః-శంకింపబడువాడు.

—(౦)—

# చతుస్త్రింశోఽధ్యాయః - ముప్పది నాలుగవ అధ్యాయము

ధృతరాష్ట్రం ప్రతి విదురస్య నీతియుతం వచనమ్-
ధృతరాష్ట్రునికి విదురుడు నీతిని బోధించుట.

ధృతరాష్ట్ర ఉవాచ - ధృతరాష్ట్రు డిట్లు పలికెను.

జాగ్రతో దహ్యమానస్య యత్కార్య మనుపశ్యసి,
తద్బ్రూహి త్వం హి నస్తాత ధర్మార్థకుశలో హ్యసి. 1

నాయనా! విదురా! నిద్రపట్టక కాలిపోవుచున్నాడను. అట్టి నేను చేయదగిన దేదో నీకు తోచినదానిని నాకు చెప్పుము. నీవు ధర్మమున, అర్థమున కుశలుడవు గదా.

త్వం మాం యథావ ద్విదుర ప్రశాధి
ప్రజ్ఞాపూర్వం సర్వ మజాతశత్రోః,
యన్మన్యసే పథ్య మదీనసత్త్వ
శ్రేయస్కరం బ్రూహి తద్వై కురూణామ్. 2

విదురా! బుద్ధిబలముతో నీకు తోచినదంతయు నాకు ఉపదేశింపుము. ఆ అజాతశత్రువునకు హితకరమైనదియు, కౌరవులకు శ్రేయస్కరమైనదియు విషయమును నాకు చెప్పుము. నీ స్వభావమున దీనభావము లేదు.

పాపాశఙ్కీ పాపమే వానుపశ్యన్
పృచ్ఛామి త్వాం వ్యాకులే నాత్మనాఽహమ్,
కవే తన్మే బ్రూహి సర్వం యథావ-
న్మనీషితం సర్వ మజాతశత్రోః. 3

---

1. దహ్యమానస్య-చింత యనెడు అగ్నితో కాలిపోవుచున్న-అని భావము.
2. అజాతశత్రోః పథ్యమ్, కురూణాం శ్రేయస్కరమ్ అని అన్వయము.
3. పాప,ఆశఙ్కీ-రాబోవు దుఃఖమునుగూర్చి గుండెలో కుములుచున్నవాడనై. పాపమ్, ఏవ, అనుపశ్యన్-స్వయముగా చేసిన మునుపటి అపరాధమును భావించుచు; కవే-సర్వజ్ఞుడా!

తొల్లి చేసిన దోసమునే స్మరించుచున్న నాకు ఏదో కీడు మూడు ననిపించు చున్నది. దానితో నా హృదయమంతయు గగ్గోలు పడుచున్నది. అట్టి మనసుతో నిన్నడుగుచున్నాను. సర్వజ్ఞుడా! ఇప్పుడా అజాతశత్రువు ఏమి సాధింపగోరు చున్నాడో అది యంతయు ఉన్నదున్నట్లు చెప్పుము.

విదుర ఉవాచ - విదురు డిట్లు చెప్పెను.

శుభం వా యది వా పాపం ద్వేష్యం వా యది వా ప్రియమ్,
అపృష్ట స్తస్య తద్ బ్రూయా ద్యస్య నేచ్ఛేత్ పరాభవమ్. 4

పుణ్యమో-పాపమో, అప్రియమో-ప్రియమో అడుగకున్నను, తా నెవనికి పరాభవము వాంఛింపడో, అట్టివానికి చెప్పనే వలయును.

తస్మాత్ వక్ష్యామి తే రాజన్ హితం యత్ స్యాత్ కురూన్ ప్రతి,
వచః శ్రేయస్కరం ధర్మ్యం బ్రువత స్తన్నిబోధ మే. 5

రాజా! ఆ కారణమున కౌరవులకు హితమైనదానిని చెప్పుచున్నాను. నామాట శ్రేయస్సును కూర్చును. ధర్మమును విడనాడదు. దానిని వినుము.

మిథ్యోపేతాని కర్మాణి సిద్ధ్యేయు ర్యాని భారత,
అనుపాయప్రయుక్తాని మా స్మ తేషు మనః కృథాః. 6

కపటముతో కూడినవి, చెడుదారులతో ప్రయోగింపగా సిద్ధించునవి యగు కర్మములందు మనసు పెట్టవలదు.

తథైవ యోగవిహితం యత్తు కర్మ న సిద్ధ్యతి,
ఉపాయయుక్తం మేధావీ న తత్ర గ్లపయే న్మనః. 7

అట్లే నేర్పుతో ఉపాయములతో చేసిన పని యొకప్పుడు నెరవేరదు. అయినను బుద్ధిమంతు డచట మనస్సును క్రుంగదీసికొనరాదు.

---

4. ద్వేష్యమ్-ద్వేషింపదగినది - అప్రియమని తాత్పర్యము.

6. మిథ్యా-ఉపేతాని-కపటముతో కూడినవి-జూదము మొదలగునవి; అనుపాయైః-నీచపు ఉపాయములతో.

అనుబన్ధా నవేక్షేత సానుబన్ధేషు కర్మసు,
సంప్రధార్య చ కుర్వీత న వేగేన సమాచరేత్. 8

ఒకపని చేయుచుండగా దానివెంబడి వచ్చు పనులయందలి ప్రయోజన ములను పరిశీలింపవలయును. చక్కగా నిర్ణయించుకొని చేయవలయును. తొందరపడి యే పనియు చేయరాదు.

అనుబన్ధం చ సంప్రేక్ష్య విపాకం చైవ కర్మణామ్,
ఉత్థాన మాత్మన శ్చైవ ధీరః కుర్వీత వా న వా. 9

ఆ యా పనుల ప్రయోజనమును, పరిపాకమును తనదైన ఉద్యమమును చక్కగా పరికించి ధీరుడు ఫలము పొందు నమ్మకమున్నచో చేయవలయును. లేనిచో మానవలయును.

యః ప్రమాణం న జానాతి స్థానే వృద్ధౌ తథా క్షయే,
కోశే జనపదే దణ్డే న స రాజ్యేఽవతిష్ఠతే. 10

స్థానము, వృద్ధి, నాశము, కోశము, జనపదము, సేన అనువాని ప్రమాణము నెరుగనివాడు రాజ్యమున నిలువజాలడు.

యస్త్వేతాని ప్రమాణాని యథోక్తా న్యనుపశ్యతి,
యుక్తో ధర్మార్థయో ర్జ్ఞానే స రాజ్య మధిగచ్ఛతి. 11

శాస్త్రము చెప్పిన రీతిగా వీని ప్రమాణములను చక్కగా నెరిగినవాడు ధర్మము, అర్థము అనువాని జ్ఞానమున-తగులుచెంది రాజ్యమును పొందును.

---

8. అనుబన్ధాన్-ప్రయోజనములను; సంప్రధార్య-చక్కగా నిశ్చయించి;

9. కర్మణాం విపాకమ్ - ఆ యా పనులు చక్కగా ఫల మిచ్చుటను; ఉత్థానమ్ - ప్రయత్నమును;

10. ప్రమాణమ్-నిర్ణయించుదారిని; స్థానే-కోట మొదలగు దానియందు; జనపదే-గ్రామాదికమునందు:

11. ఏతాని ప్రమాణాని - పైని చెప్పిన స్థానము మున్నగు వానిని చక్కగా బోధించు శాస్త్రప్రమాణములను;

న రాజ్యం ప్రాప్త మిత్యేవ వర్తితవ్య మసాంప్రతమ్,
శ్రియం హ్యవినయో హన్తి జరా రూప మివోత్తమమ్. 12

రాజ్యము చేజిక్కెనని తగనివిధమున ప్రవర్తింపరాదు. ముసలితనము చక్కని రూపమును చెరచునట్లు అవినయము సంపదను రూపు మాపును.

భక్ష్యోత్తమప్రతిచ్ఛన్నం మత్స్యో బడిశ మాయసమ్,
లోభానుపాతీ గ్రసతే నానుబన్ధ మవేక్షతే. 13

చేప చక్కని తిండివలె కన్పట్టు ఇనుపగాలమును పేరాసకు బోయి మ్రింగును. రానున్న కీడును గుర్తింపదు.

యచ్ఛక్యం గ్రసితుం గ్రస్యం గ్రస్తం పరిణమేచ్చ యత్,
హితం చ పరిణామే య త్తదాద్యం భూతి మిచ్ఛతా. 14

తినుటకు వీలైనది, తినుటకు యోగ్యమైనది, తిన్న తరువాత తగిన విధమున జీర్ణమగునది, జీర్ణమై మేలు చేయునది యగు పదార్థమును మేలు కోరువాడు తినదగును.

వనస్పతే రపక్వాని ఫలాని ప్రచినోతి యః,
స నాప్నోతి రసం తేభ్యో బీజం చాస్య వినశ్యతి. 15

చెట్టునుండి పసరుకాయలు కోయువాడు వానినుండి రసమును పొందడు. పైగా వాని విత్తులు కూడ నశించును.

యస్తు పక్వ ముపాదత్తే కాలే పరిణతం ఫలమ్,
ఫలాద్రసం స లభతే బీజా చ్చైవ ఫలం పునః. 16

---

12. అసాంప్రతమ్ - అయుక్తమైన - తగని - విధముగా;

13. పైకి రుచిగా కానవచ్చి కడకు ప్రాణములను హరించు కార్యములను మానవుడు చేయరాదని భావము; అనుబన్ధమ్-వెంటనంటి వచ్చు బంధనమును - గాలములో చిక్కుటను.

14, (గ్రసితుం శక్యమ్ - తినజాలినదానిని; గ్రస్యమ్ - తినదగినదానిని (ఉమ్మెత్త మొదలగునవి తినదగనివి) పరిణమేత్ - జీర్ణమగునో;అద్యమ్ తినదగినది. (ఇచట తినుట యనగా అనుభవించుట అని భావము)

15, 16. దురాశతో తనకుకాని సంపదలను అనుభవింపరాదని భావము.

చక్కగా కాచి తగుకాలమున పండిన పండును కైకొనువా దన్ననో, ఆ పండు రసమును పొందును. దాని విత్తునుండి మరల చెట్టును, పండ్లను కూడ పొందును.

యథా మధు సమాదత్తే రక్షన్ పుష్పాణి షట్పదః,
తద్వ దర్థా న్మనుష్యేభ్య ఆదద్యా దవిహింసయా. 17

తుమ్మెద పూవులు కందకుండ తేనెను గ్రహించునట్లు రాజు నొప్పింపక మనుజులనుండి ధనములను (ప్రయోజనములను) గ్రహింపవలయును.

పుష్పం పుష్పం విచిన్వీత మూలచ్ఛేదం న కారయేత్,
మాలాకార ఇవారామే న యథాఽఙ్గారకారకః. 18

మాలలు కట్టువాడు తోటలో పువ్వుపువ్వును కోసెడు తీరున రాజు ధనములను గ్రహింపవలయును. బొగ్గులు చేయువానివలె మొదటికి మోసము తేరాదు.

కిన్ను మే స్యా దిదం కృత్వా కిన్ను మే స్యాదకుర్వతః,
ఇతి కర్మాణి సంచిన్త్య కుర్యాద్వా పురుషో న వా. 19

ఈ పని చేసిన నా కేమగును? చేయకున్న నా కేమగును? అని చక్కగా విచారించి పురుషుడు ఆ యా కార్యములను చేయదగును. చేయరానివానిని మానదగును.

అనారభ్యా భవన్త్యర్థాః కేచిన్నిత్యం తథాఽగతాః,
కృతః పురుషకారో హి భవేద్యేషు నిరర్థకః. 20

ఎన్నటికిని ఫలమునకు రాని పనులను మానవుడు మొదలిడనే రాదు. వానియందు చేసిన పురుషప్రయత్నము వ్యర్థమే యగును గదా!

---

18. పుష్పం పుష్పం విచిన్వీత - పూవువలె చక్కగా రూపొందిన ఫలమునే గ్రహింపవలయునని తాత్పర్యము.

19. కుర్యాత్, వా, న, వా - చేయదగినవానిని చేయును. కూడనిదానిని మానును అని తాత్పర్యము.

20 అనారభ్యాః - పనికిమాలినవి - ప్రబలులతో పగవంటివి; అగతాః - ఎన్నటికిని పొందరానివి;

ప్రసాదో నిష్ఫలో యస్య క్రోధశ్చాపి నిరర్థకః,
న తం భర్తార మిచ్ఛన్తి షణ్డం పతిమివ స్త్రియః. 21

పేడివానిని స్త్రీలు భర్తగా కోరనివిధమున పనికిమాలిన అనుగ్రహము, వ్యర్థమగు క్రోధము గలవానిని ప్రజలు రాజుగా నిష్టపడరు.

కాంశ్చిదర్థా న్నరః ప్రాజ్ఞో లఘుమూలా న్మహాఫలాన్,
క్షిప్ర మారభతే కర్తుం న విఘ్నయతి తాదృశాన్. 22

కొద్దియత్నము గొప్పఫలము గల విషయములను ప్రజ్ఞ కలవాడు వెను వెంటనే చేయ నుంకించును. అట్టివానికి విఘ్నము రానీయడు.

ఋజు పశ్యతి యః సర్వం చక్షుషాఽనుపిబన్నివ,
ఆసీనమపి తూష్ణీక మనురజ్యన్తి తం ప్రజాః. 23

ప్రేమతో ఆస్వాదించుచున్నట్లు కంటితో సర్వమును సమదృష్టితో చూచు రాజునెడ, ఆతడు ఊరక కూర్చున్నప్పటికిని, ప్రజలు అనురాగము కలిగియుందురు.

సుపుష్పితః స్యాదఫలః ఫలితః స్యాద్దురారుహః,
అపక్వః పక్వసంకాశో న తు శీర్యేత కర్హిచిత్. 24

---

21. అనుగ్రహము చూపినచో అవతలివాడేదో ప్రయోజనము పొందవలయును. కోపగించినచో అవలివాని కేదో నష్టము కలుగవలయును. ఇవి రెండును లేనిచో వాడు నపుంసకుడైన భర్తవంటివాడని తాత్పర్యము.

22. లఘుమూలాన్ -స్వల్పమగు ఉపాయములు కలవానిని;

23. చక్షుషా - ప్రీతిమయమగు చూపుతో; అనుపిబన్నివ - వదలక త్రావుచున్నట్లున్న; తూష్ణీకమ్ - ఊరక; అనురజ్యన్తి - అనురాగము గలవారగుదురు.

24. ఇచట రాజొక చెట్టువలె రూపింపబడుచున్నాడు. సుపుష్పితః - మాటతో చూపుతో అనుగ్రహము చూపుచున్నప్పటికి; అఫలః - సేవకుని ధనముతో ముంచి యెత్తడు; ఫలితః - ధన మొసగినను; దురారుహః - భృత్యులకు వశమై పోవడు; అపక్వః - లోపల తగినబలము లేనివాడైనను; పక్వసంకాశః - బలమున్నవానివలె కానవచ్చును.

చక్కగా పూచియు పండక, పండియు నితరులకు వశముకాక, పండకయు పండినట్లు కనబడినచో - ఎన్నటికిని నాశము కలుగదు.

చక్షుషా మనసా వాచా కర్మణా చ చతుర్విధమ్,
ప్రసాదయతి యో లోకం తం లోకోఽను ప్రసీదతి. 25

చూపుతో, మనసుతో, మాటతో, చేష్టతో లోకమును ఆకట్టుకొనువానిని లోకము చల్లగా చూచును.

యస్మాత్ త్రస్యన్తి భూతాని మృగవ్యాధా న్మృగా ఇవ,
సాగరాన్తామపి మహీం లబ్ధ్వా స పరిహీయతే. 26

బోయవానిని చూచి మృగములు బెదరినట్లు ఎవనిని చూచి ప్రాణులు బెదరిపోవునో యట్టివాడు సముద్రము కడదాక గల భూమిని పొందియు రూపు మాసిపోవును.

పితృపైతామహం రాజ్యం ప్రాప్తవాన్ స్వేన కర్మణా,
వాయు రభ్ర మివాసాద్య భ్రంశయ త్యనయే స్థితః. 27

తండ్రీ తాతల వరుసతో రాజ్యము పొందినవాడు, అవినీతిపరుడైనచో, గాలివాటుకు చెదరిన మేఘమువలె చేజేతుల దానిని పోగొట్టుకొనును.

ధర్మ మాచరతో రాజ్ఞః సద్భిశ్చరిత మాదితః,
వసుధా వసుసంపూర్ణా వర్ధతే భూతివర్ధనీ. 28

సత్పురుషులు మొదటినుండియు నాచరించిన ధర్మము నాచరించు రాజునకు సర్వసంపదలతో నిండిన భూమి సంపదల పెంపొందించుచు వృద్ధి నొందుచుండును.

అథ సంత్యజతో ధర్మ మధర్మం చానుతిష్ఠతః,
ప్రతిసంవేష్టతే భూమి రగ్నౌ చర్మాహితం యథా. 29

25. కర్మణా-దానముచేత; లోకమ్-సేవకసముదాయమును.
27. అనయే స్థితః - నీతిమాలినవాడు;
29. ప్రతిసంవేష్టతే-ముడుచుకొనిపోవును-ఫలముల మొసగదని భావము.

ధర్మమును విడనాడి అధర్మము నాచరించుచున్న రాజు భూమి, నిప్పున బడిన తోటవలె ముడుచుకొనిపోవును.

య ఏవ యత్నః క్రియతే పరరాష్ట్రవిమర్దనే,
స ఏవ యత్నః కర్తవ్యః స్వరాష్ట్రపరిపాలనే. 30

పొరుగున నున్న రాష్ట్రమును అణగద్రొక్కుటలో ఏ ప్రయత్నము రాజు చేయునో, తన రాష్ట్రమును రక్షించుకొనుటలో అదే ప్రయత్నము చేయవలయును.

ధర్మేణ రాజ్యం విన్దేత ధర్మేణ పరిపాలయేత్,
ధర్మమూలాం శ్రియం ప్రాప్య న జహాతి న హీయతే. 31

ధర్మముతో రాజ్యము పొందవలయును. ధర్మముతో పరిపాలింప వలయును. అట్లు ధర్మము మూలకారణముగా సిద్ధించిన సంపద వదలదు; తరుగదు.

అప్యున్మత్తాత్ ప్రలపతో బాలాచ్చ పరిజల్పతః
సర్వతః సార మాదద్యా దశ్మభ్య ఇవ కాఞ్చనమ్. 32

నోటికి వచ్చినట్లు వాగుచున్న పిచ్చివానినుండియు, పొంతనలేని మాటలు పలుకు బాలునినుండియును, అన్నిటినుండియు మట్టినుండి బంగారమును వలె, సారమును గ్రహింపవలయును.

సువ్యాహృతాని సూక్తాని సుకృతాని తతస్తతః,
సంచిన్వన్ ధీర ఆసీత శిలాహారీ శిలం యథా. 33

---

33. సువ్యాహృతాని - పాండిత్యపు పలుకులను; సూక్తాని - చక్కగా పలికిన పలుకులను; సుకృతాని-వారు వారు చేసిన మంచిపనులను; తతస్తతః - ఆ యా తావులనుండి-తల్లి, తండ్రి, గురువు మొదలగు వారినుండి యని భావము; శిల - ఆహారీ-శిలమనగా రాలిపడిన ధాన్యపుకంకులను అనేక జాతులకు చెందిన వానిని ఏరుకొని జీవించువ్రతము. ఆమార్గమున జీవితము గడుపుకొనువాడు. తన తండ్రికై యితరులను బాధింపనివాడని తాత్పర్యము - నీవును మావంటివారి మాటలసారము నెరుగుమని ఉపదేశము.

అందందు రాలిపడిన ధాన్యపుకంకుల నేరుకొని తినువాడు ఆ కంకులను జాగ్రత్తగా ఏరుకొనువిధమున మానవుడు చక్కని సూక్తులను, మంచి పనులను ఆ యా తావులనుండి కూడబెట్టుకొనుచు ధీరుడై యుండవలయును.

గన్ధేన గావః పశ్యన్తి వేదైః పశ్యన్తి బ్రాహ్మణాః,
చారైః పశ్యన్తి రాజాన శ్చక్షుర్భ్యా మితరే జనాః. 34

పశువులు వాసనతో విషయజ్ఞానము పొందును. బ్రాహ్మణులు వేదములతో, రాజులు గూఢచారులతో, ఇతరజనులు కనులతో పొందుదురు.

భూయాంసం లభతే క్లేశం యా గౌర్భవతి దుర్దుహా,
అథ యా సుదుహా రాజన్నైవ తాం వితుద న్త్యపి. 35

చక్కగా పాలీయని గోవు నానాయాతనలు పడును. చక్కగా పాలిచ్చు ఆవును ఎవ్వరు నొప్పింపరు.

యదతప్తం ప్రణమతి న తత్ సంనమయ న్త్యపి,
యచ్చ స్వయం నతం దారు న తత్ సంతాపయ న్త్యపి. 36

కాల్పకయే కరిగినదాని నెవ్వరు నిప్పుబెట్టరు. తనంత తాను వంపు తిరిగిన కఱ్ఱను ఎవ్వరు వంపరు.

ఏతయోపమయా ధీరః సన్నమేత బలీయసే,
ఇన్ద్రాయ స ప్రణమతే నమతే యో బలీయసే. 37

---

34. పాండవుల బలము నెరుగుటకై తగిన చారులను నియోగింపు మని హెచ్చరిక.

35,36,37 - ఈ మూడు శ్లోకముల తాత్పర్య మేమనగా నీవు నీకంటె బలవంతులైన పాండవులకు లోబడి యుండవలయును. దానివలన బలాధిష్ఠానదేవత యగు ఇంద్రుడు నిన్ననుగ్రహించును. - అనునది. నీవు పాలీకున్నచో పాలీని ఆవునువలె నిన్ను చావగొట్టుదురు. ఇచ్చినచో నీజోలికి రారు. నీవు అర్థసితకంవాతవైనచో నిన్ను కాల్చుటకు వారు ప్రయత్నింపరు. నీవు లొంగి వచ్చినచో నిన్ను లొంగదీసికొను పని వారికి లేదు గదా! అని తాత్పర్యము.

ఈ పోలికతో ధీరుడు తనకంటె బలముగలవాని విషయమున అణగి యుండవలయును. అట్లు బలవంతునకు లొంగియుండుట యనగా ఇంద్రునకు ప్రణమిల్లుటయే.

పర్జన్యనాథాః పశవో రాజానో మన్త్రిబాన్ధవాః,
పతయో బాన్ధవాః స్త్రీణాం బ్రాహ్మణా వేదబాన్ధవాః. 38

పశువులకు పర్జన్యుడే దిక్కు. రాజులకు మంత్రులే చుట్టములు. స్త్రీలకు భర్తలే బంధువులు. బ్రాహ్మణులకు వేదములే బంధువులు.

సత్యేవ రక్ష్యతే ధర్మో విద్యా యోగేన రక్ష్యతే,
మృజయా రక్ష్యతే రూపం కులం వృత్తేన రక్ష్యతే. 39

ధర్మమును సత్యము, విద్యను అభ్యాసము, రూపమును నలుగుబెట్టుటయు, కులమును మంచినడవడియు రక్షించును.

మానేన రక్ష్యతే ధాన్య మశ్వాన్ రక్ష త్యనుక్రమః,
అభీక్ష్ణదర్శనం గాశ్చ స్త్రియో రక్ష్యాః కుచేలతః. 40

ధాన్యమును కొలత రక్షించును. గుఱ్ఱములను పరామరిక రక్షించును. గోవులను మాటిమాటికి చూచుకొనుట రక్షించును. స్త్రీలను మైలగుడ్డలు రక్షించును.

న కులం వృత్తహీనస్య ప్రమాణ మితి మే మతిః,
అన్త్యేష్వపి హి జాతానాం వృత్తమేవ విశిష్యతే. 41

---

38. మన్త్రిబాన్ధవాః-నీవు రాజవు కాన మంత్రులతో చక్కగా ఆలోచించి సత్యమును సంరక్షింపవలయునని బోధ.

39. యోగేన-అభ్యాసముచేత; మృజయా-నలుగుబెట్టుట, మైపూత మొదలగువానిచేత;

40. మానేన - కొలతచేత - సరియైన కొలతలేనిచో ధాన్యము నెవరికి వారు చేజిక్కించుకొందురని భావము; అనుక్రమః-వ్యాయామము చేయించుట మొదలగునది; అభీక్ష్ణదర్శనమ్- మాటిమాటికి చూచుచుండుట; కుచేలతః-మాసినచీరలుగల స్త్రీని ఎవ్వరు మోహింపరని భావము.

41. కులము, శీలము అను నీరెంటిలో శీలము నాశ్రయింపుము. ఈర్ష్య విడనాడుమని బోధ.

చక్కని నడవడి లేనివానికి కులము ప్రవ్వి తలకెత్తున దేమియు లేదని నా అభిప్రాయము. కడజాతులలో పుట్టినవారికైనను నడవడియే వన్నె తెచ్చును.

య ఈర్షుః పరవిత్తేషు రూపే వీర్యే కులాన్వయే,
సుఖసౌభాగ్యసత్కారే తస్య వ్యాధి రనన్తకః. 42

పరుల ధనమునకు, రూపమునకు, బలమునకు, కులమునకు, సుఖమునకు' సౌభాగ్యమునకు, సత్కారమునకు ఈసు పొందువాని రోగమునకు అంతము లేదు.

అకార్యకరణాత్ భీతః కార్యాణాం చ వివర్జనాత్,
అకాలే మన్త్రభేదాచ్చ యేన మాద్యే న్న తత్పిబేత్. 43

చేయరాని పనులు చేయుటకును, చేయవలసిన పనులను వదలుటకును. పని నెరవేరక ముందే ఆలోచనను బయలుపరచుటకు భయపడినవాడై లోభము మొదలగు మదమెక్కించువానిని మానవుడు లోగొనరాదు.

విద్యామదో ధనమద స్తృతీయోఽభిజనో మదః,
మదా ఏతేఽవలిప్తానా మేత ఏవ సతాం దమాః. 44

పొగరెక్కినవారికి చదువు, ధనము, వంశము అనునవి మరింత మద మెక్కించును. ఇవియే సజ్జనులను హద్దున నిలుపును.

అసన్తోఽభ్యర్థితాః సద్భిః క్వచిత్కార్యే కదాచన,
తావన్న తస్య సుకృతం కించిత్కార్యం కదాచన.
మన్యన్తే సన్త మాత్మాన మసన్తమపి విశ్రుతమ్. 45

ఒకప్పుడు సజ్జనులు దుర్జనులను ఏదో పనియందు సాయ మడుగుదురు. అంతమాత్రమున వారికి ఏ చిన్న మెత్తు పనియు జరుగదు. అయినను దుర్జనుడని లోకమున పేరొందినవాడును దానిచేత తన్ను సత్పురుషునిగా తలపోయును.

---

43. యేన-దేనితో-ఏ లోభాదిగుణముతో; మాద్యేత్-ఒడ లెరుగక ప్రవర్తించునో; తత్-దానిని; న పిబేత్-త్రాగరాదు-ఆశ్రయింపరాదని భావము.

44. అభిజనః-సహాయుడు లేక వంశము.

43,44. నీకు అట్టి భయమును, నిగ్రహమును లేవని తాత్పర్యము.

గతిరాత్మవతాం సన్తః సన్త ఏవ సతాం గతిః,
అసతాం చ గతిః సన్తో న త్వసన్తః సతాం గతిః. 46

ఆత్మవంతులకు సత్పురుషులే గతి. సజ్జనులకును సజ్జనులే గతి. దుర్జనులకును సజ్జనులే గతి. కాని సజ్జనులకు దుర్జను లెన్నటికిని గతి కాజాలరు.

జితా సభా వస్త్రవతా మిష్టాశా గోమతా జితా,
అధ్వా జితో యానవతా సర్వం శీలవతా జితమ్. 47

చక్కని వస్త్రములు గలవాడు సభలో రాణించును. గోవులు మిక్కిలిగా గలవాడు తిండియాసను జయించును. గొప్ప వాహన మున్నవాడు బాటను గెలుచును. శీలవంతుడు సర్వమును గెలుచును.

శీలం ప్రధానం పురుషే తద్యస్యేహ ప్రణశ్యతి,
న తస్య జీవితే నార్థో న ధనేన న బన్ధుభిః. 48

పురుషునికి శీలము ముఖ్యము. ఈ లోకమున అది నశించినవాడు బ్రదికి సాధించున దేమియు లేదు. వానికి ధనముగాని చుట్టములుగాని చేయున దేమియు లేదు.

ఆఢ్యానాం మాంసపరమం మధ్యానాం గోరసోత్తరమ్,
తైలోత్తరం దరిద్రాణాం భోజనం భరతర్షభ. 49

ధనమదము గలవారు మాంసము నిండిన అన్నమును, మధ్యవిధము వారు పాలు నేయి మొదలగువానితో కూడిన భోజనమును, దరిద్రులు నూనెలు నిండిన కూటిని ప్రధానముగా తీసికొందురు.

---

46. ఎన్నటికైన సజ్జనులగు పాండవులే నీకు ఉపకరింతురుగాని, నీవు వారి కొరిగించున దేమియు లేదని బోధ.

47, 48. నీవు శీలమును రక్షించుకొనవలయునని హితబోధ.

49. ఆఢ్యానామ్ - ధనముచే మదించినవారికి; మాంసపరమమ్ - మాంసము అధితముగాగల; గోరసోత్తరమ్-గోవుల రసము-పాలు, పెరుగు, వెన్న, నేయి-అనునది అధికముగాగల; తైల-ఉత్తరమ్-నూనె అధికముగాగల. శీలవంతుడైనచో దరిద్రుడైనను మేలే అని తాత్పర్యము.

సంపన్నతర మేవాన్నం దరిద్రా భుఞ్జతే సదా,
క్షుత్ స్వాదుతాం జనయతి సా చాఢ్యేషు సుదుర్లభా. 50

దరిద్రు లెల్లవేళల రుచిగల అన్నమునే తినుచుందురు. ఆకలియే రుచిని పుట్టించును. ధనవంతులలో అది లభించుట మిక్కిలి కష్టము.

ప్రాయేణ శ్రీమతాం లోకే భోక్తుం శ క్తి ర్న విద్యతే,
జీర్య న్త్యపి హి కాష్ఠాని దరిద్రాణాం మహీపతే. 51

రాజా! సాధారణముగా లోకమున శ్రీమంతులకు తినుటకు శక్తియే యుండదు. దరిద్రుల కడుపులలో కట్టెలైనను జీర్ణమగును.

అవృత్తి ర్భయ మన్త్యానాం మధ్యానాం మరణాద్భయమ్,
ఉత్తమానాం తు మర్త్యానా మవమానాత్ పరం భయమ్. 52

అధమజనులకు బ్రదుకుతెరువు లేకపోవుట భయము. మధ్యములకు చావు భయము. ఉత్తములగు నరులకన్ననో అవమానమువలననే మహాభయము.

ఐశ్వర్యమదపాపిష్ఠా మదాః పానమదాదయః,
ఐశ్వర్యమదమత్తో హి నాపతిత్వా విబుధ్యతే. 53

త్రాగుడుమదము మొదలగు మదము లన్నింటిలో ఐశ్వర్యమదము అన్నింటికన్న మిన్న. ఏలయన ఐశ్వర్యముచే పొగరెక్కినవాడు మొత్తముగా పతనము చెందక తెలివి నొందడు.

---

50. సంపన్నతరమ్-మిక్కిలి రుచికరమైన దానిని;

51. దరిద్రాణామ్-దరిద్రుల కడుపులలో అని భావము.

52. అవృత్తిః-బ్రదుకు తెరువు లేకుండుట.

53. ఐశ్వర్యమదపాపిష్ఠాః - ఐశ్వర్యము - ధనము - అధికారము అనువాని వలన కలిగిన మదము తక్కిన పాపములకెల్ల మించిన పాపమని భావము. ఐశ్వర్యమదము వేనికంటె మిక్కిలి పాపిష్ఠమో అవి - అని బహువ్రీహి సమాసము.

ఇన్ద్రియై రిన్ద్రియార్థేషు వర్తమానై రనిగ్రహైః,
తైరయం తాపితో లోకో నక్షత్రాణి గ్రహైరివ. 54

శబ్దము, స్పర్శ, రూపము, రసము, గంధము, అను విషయములందు అదుపాజ్ఞలు లేక తిరిగెడు ఇంద్రియములు, గ్రహములు నక్షత్రములనువలె, లోకమును కాల్చివేయుచున్నవి. (చెవి, చర్మము, కన్ను, నాలుక, ముక్కు-ఇవి యింద్రియములు).

యో జితః పఞ్చవర్గేణ సహజేనాత్మకర్షిణా,
ఆపద స్తస్య వర్ధన్తే శుక్లపక్ష ఇవోడురాట్. 55

ఈ అయిదింద్రియముల సముదాయము తనతో పుట్టినది, మనస్సును లాగుచుండును. అట్టి దీనికి లోబడినవానికి, శుక్లపక్షమున చంద్రుడు వృద్ధినొందిన విధముగా ఆపదలు వృద్ధినొందును.

అవిజిత్య యథాత్మాన మమాత్యాన్ విజిగీషతే,
అమిత్రాన్ వా జితామాత్యః సోఽవశః పరిహీయతే. 56

మనసును గెలువక మంత్రులను గెలువగోరినవాడును, మంత్రులను గెలువక పగవారిని గెలువగోరువాడును పట్టు దప్పి భ్రష్టు డగును.

ఆత్మానమేవ ప్రథమం ద్వేష్యరూపేణ యోజయేత్,
తతోఽమాత్యా నమిత్రాంశ్చ న మోఘం విజిగీషతే. 57

---

54. గ్రహైః - సూర్యుడు మొదలగు గ్రహములచేత; నక్షత్రాణి - ఇవ - నక్షత్రములవలె - నక్షత్రములు కనబడకుండ అడ్డుపడుటయే యిచట కాల్చివేయుట.

55. ఈ శ్లోకములలో ఆత్మ యనగా మనస్సని చెప్పదగును.

56. అమాత్యాన్-మంత్రులను-అనగా దగ్గరివారిని-కొడుకులు మొదలగువారిని అజితామాత్యః-తనవారిని గెలువలేనివాడు;

57. ఆత్మానమ్ - మనస్సును; ద్వేష్యరూపేణ - శత్రువువలె; అమాత్యాన్, అమిత్రాన్ విజిగీషతే, తత్-న మోఘమ్-అమాత్యులను అమిత్రులను గెలువ గోరుట వ్యర్థము కాదు.

55,56,57 నీవు మనస్సును గెలిచినవాడవు కావు. ఐశ్వర్యమదమత్తుడవు. కావున తప్పక ఆపద నొందుదు వని తాత్పర్యము.

తనమనస్సునే మొదటి శత్రువుగా మానవుడు భావింపవలయును. అటుపై అమాత్యులను శత్రువులను గెలువగోరినచో అది వ్యర్థము కాదు.

వశ్యేన్ద్రియం యతాత్మానం ధృతదణ్డం వికారిషు,
పరీక్ష్యకారిణం ధీర మత్యన్తం శ్రీ ర్నిషేవతే. 58

ఇంద్రియముల నదుపున పెట్టుకొని, మనస్సును చెదరిపోనీక, వికారములు పొందినపుడు చక్కగా శిక్షించుచు, పరీక్షించి పనులుచేయు ధీరుని శ్రీదేవి వదలక అంటిపెట్టుకొని యుండును.

రథః శరీరం పురుషస్య రాజ-
న్నాత్మా నియన్తేన్ద్రియా ణ్యస్య చాశ్వాః,
తై రప్రమత్తః కుశలీ సదశ్వై-
ర్దాన్తైః సుఖం యాతి రథీవ ధీరః. 59

రాజా! పురుషునకు శరీరము రథము. మనస్సును, వశమైన యింద్రియములును దానికి గుఱ్ఱములు. ఏమరుపాటు లేక, నేర్పుగలవాడై తనకు లొంగిన ఆ మంచి గుఱ్ఱములతో ధీరుడు రథికునివలె సుఖముగా ప్రయాణించును.

ఏతాన్యనిగృహీతాని వ్యాపాదయితు మప్యలమ్,
అవిధేయా ఇవాదాన్తా హయాః పథి కుసారథిమ్. 60

తనకు లొంగని పొగరుబోతు గుఱ్ఱములు బాటయందు నీచసారథిని మట్టుపెట్టునట్లు ఈ మనస్సును, ఇంద్రియములును పురుషుని సర్వనాశనము చేయుటకును సమర్థములు.

అనర్థ మర్థతః పశ్య న్నర్థం చైవా ప్యనర్థతః,
ఇన్ద్రియై రజితై ర్బాలః సుదుఃఖం మన్యతే సుఖమ్. 61

---

58. నిగ్రహము లేని నీవు కొడుకులు త్రిప్పినట్లు తిరుగుచున్నకారణమున లక్ష్మి నీయందు నిలువదని సూచన.
59. పైభావమునే రథము-రథికుడు అను దృష్టాంతముచే బోధించుచున్నాడు.
60. వ్యాపాదయితుమ్ - నాశన మొనరించుటకు; అవిధేయాః - వశముకాని.
61. అర్థతః - అర్థము - ధనము - కారణముగా; అనర్థతః - న్యాయము కాని విధమున; బాలః-తనమేలుగీడులను గుర్తించువివేకము లేనివాడు.

అర్థము నాశించి యనర్థమును, అన్యాయమార్గమున అర్థమును పరికించుచు వశముకాని యింద్రియములతో మానవుడు పసితనము వీడక పెను దుఃఖమును సుఖ మని తలపోయును.

ధర్మార్థౌ యః పరిత్యజ్య స్యా దింద్రియవశానుగః,
శ్రీప్రాణధనదారేభ్యః క్షిప్రం స పరిహీయతే. 62

ధర్మమును, అర్థమును జారవిడచుకొని యింద్రియములు త్రిప్పినట్లు తిరుగువాడు ఒక్కపెట్టున ఐశ్వర్యమును, ప్రాణమును, ధనమును, పెండ్లమును కోల్పోవును.

అర్థానా మీశ్వరో యః స్యా దిన్ద్రియాణా మనీశ్వరః,
ఇన్ద్రియాణా మనైశ్వర్యా దైశ్వర్యాద్ భ్రశ్యతే హి సః. 63

ధనములపై ప్రభువై యుండియు ఇంద్రియముల నదుపున పెట్టుకొననివాడు, ఆ దోషమువలన, ఐశ్వర్యమునుండి భ్రష్టుడగును.

ఆత్మనాత్మాన మన్విచ్ఛే న్మనోబుద్ధీన్ద్రియైర్యతైః,
ఆత్మా హ్యే వాత్మనో బన్ధు రాత్మైవ రిపు రాత్మనః. 64

బుద్ధితో ఆత్మను పట్టుకొనవలయును, దానికి నిగ్రహముగల మనస్సు, బుద్ధి, ఇంద్రియములు సాధనములు. ఆత్మయే ఆత్మకు బంధువు. ఆత్మయే ఆత్మకు శత్రువు.

---

62. ఇన్ద్రియవశ, అనుగః - ఇంద్రియముల కోరికల వెంబడిపోవువాడు.

64. ఈ పై మొత్తము ఉపదేశమునకు ఫలమును ఈ శ్లోకమున వివరించుచున్నారు.
ఆత్మనా = వివేకముగల బుద్ధిచేత; ఆత్మా - ప్రతిదేహమునందు చైతన్యరూపమున నున్న ఆత్మను; అన్విచ్ఛేత్ - పొందదగును. దానికి సాధనములు మనస్సు, బుద్ధి, ఇంద్రియములు. మనస్సనగా సంకల్పము దేనినుండి పుట్టునో అది. బుద్ధి యనగా-నిశ్చయము దేనివలన కలుగునో అది - వీని నిగ్రహముచేతనే ఆత్మపదార్థము లభించునని తాత్పర్యము. ఈ విషయములో నిన్ను ఉద్ధరించువాడు మరియొకడులేడు. బుద్ధిజయమే పురుషుడు సాధింపవలసినది అని ఉపదేశము.

బన్ధు రాత్మాత్మన స్తస్య యేనైవాత్మాత్మనా జితః.
స ఏవ నియతో బన్ధుః స ఏవ నియతో రిపుః. 65

వివేకముతో తన్ను తాను గెలిచినవానికి ఆ బుద్ధియే చుట్ట మగును. గెలువజాలనిచో అదియే శత్రువగును.

క్షుద్రాక్షేణేవ జాలేన ఝషా వపిహితా వురూ,
కామశ్చ రాజన్ క్రోధశ్చ తౌ ప్రజ్ఞానం విలుమ్పతః. 66

రాజా! రెండు పెద్దచేపలు, సన్నని రంధ్రములుగల వలను కొరికివేసి బయటబడ్డ విధమున కామము, క్రోధము అనునవి వివేకమును హరించివేయును.

సమవేక్ష్యేహ ధర్మార్థౌ సంభారాన్ యోఽధిగచ్ఛతి,
స వై సంభృతసంభారః సతతం సుఖ మేధతే. 67

ధర్మార్థములను చక్కగా చూచుకొనుచు జయసాధనములను సమకూర్చుకొనువాడు ఎల్లప్పుడు సుఖముగా వృద్ధినొందును.

యః పఞ్చాభ్యంతరాన్ శత్రూ నవిజిత్య మనోమయాన్,
జిగీషతి రిపూ నన్యాన్ రిపవోఽభిభవన్తి తమ్. 68

---

65. మనస్సు, బుద్ధి మొదలగునవి అదుపులో లేనిచో బంధువులు లేనిచో శత్రువులవలె సర్వనాశనము చేయునని తాత్పర్యము.

66. చేపలు రెండును మోహమువలన వలలో చిక్కినవి. నిజమున కవి ఒకదానికొకటి శత్రువులయ్యు, వల త్రెంచుకొని బయటపడుటకై మిత్రములగును. కార్యసాధనపిదప మరల శత్రువులు కావచ్చును. అట్లే బుద్ధి చిదాత్మకు సంసారమును కల్పించుటవలన శత్రువైనను మోహమును త్రెంచువిషయమున మిత్రముకూడ నగును. క్షుద్ర + అక్షేణ—సన్నని రంధ్రములుగల; కామక్రోధములు - చేపలు, వానిని కప్పివైచు ప్రజ్ఞానము - వల. వలనుండి బయటపడిన చేపలవలె ప్రజ్ఞానపు అదుపులేని కామక్రోధములు ప్రమాదకరములుగా మారునని తాత్పర్యము.

67. సమవేక్ష్య - అనుసరించి అని తాత్పర్యము.
సంభారాన్ - సామగ్రిని - జయసాధనములను.

68. మనోమయాన్-మనస్సుయొక్క మరియొకరూపములైన; ఆభ్యంతరాన్, శత్రూన్-లోని శత్రువులను. శ్రుతియు అట్లే చెప్పుచున్నది. 'మనసా హ్యేవ పశ్యతి మనసా శృణోతి' అని. మనసుచేతనే చూచుచున్నాడు. మనసుతోడనే వినుచున్నాడు.

మనస్సు వికారములైన చెవి, కన్ను, ముక్కు, చర్మము, నాలుక అను అయిదు లోనిశత్రువులను గెలువక యితరశత్రువులను గెలువగోరువానిని శత్రువులే రూపుమాపుదురు.

దృశ్యన్తే హి మహాత్మానో బధ్యమానాః స్వకర్మభిః,
ఇన్ద్రియాణా మనీశత్వాద్ రాజానో రాజ్యవిభ్రమైః. 69

ఐశ్వర్యవిలాసములచేత ఇంద్రియములపై పట్టుదప్పినవారై తమ కర్మములతో చిక్కువడిన గొప్ప గొప్ప రాజులను కొందరు కానవచ్చుచున్నారు గదా.

అసంత్యాగాత్ పాపకృతా మపాపాం
స్తుల్యో దణ్డః స్పృశతే మిశ్రభావాత్,
శుష్కేణార్ద్రం దహ్యతే మిశ్రభావాత్
తస్మాత్ పాపైస్సహ సన్ధిం న కుర్యాత్. 70

పాపము చేయువారిని వదలని కారణమున పాపము చేయనివారికిని సమానమగు శిక్ష తగులుచున్నది. ఇది వారితో కలసియున్న దోషము. ఎండిన దానితో తడిసినదియు సంపర్కమువలన కాలిపోవుచున్నది. కావున పాపులతో కలయిక చేయనే రాదు.

నిజా నుత్పతతః శత్రూన్ పఞ్చ పఞ్చ ప్రయోజనాన్,
యో మోహా న్న నిగృహ్ణాతి తమాప ద్గ్రసతే నరమ్. 71

69. రాజానః-రావణాదులు; రాజ్యవిభ్రమైః - రాజ్యము,సంపద మొదలగునవి కలిగించెడు వికారములచేత; స్వకర్మభిః-సీతను హరించుట మొదలగు తమ చేష్టలచేత;

71. పంచప్రయోజనాన్ - అయిదు ప్రయోజనములుగల - శబ్దము - స్పర్శ, రూపము, రసము, గంధము అనునవి అయిదింద్రియముల ప్రయోజనములు; ఉత్పతతః - అక్రమమార్గమున పోవుచున్న - నీవు చిత్తమును గెలువవు. దుష్టసంపర్కము విడువవు. కావున నిన్ను ఆపద మ్రింగునని ఉపదేశము.

అయిదు ప్రయోజనములుగల అయిదు శత్రువులను, పెదదారిని పోవు చున్నవానిని, ఒదలెరుగనితనముతో పట్టి నిలుపజాలనివానిని ఆపద మ్రింగి వైచును.

అనసూయాఽర్జవం శౌచం సంతోషః ప్రియవాదితా,
దమః సత్య మనాయాసో న భవన్తి దురాత్మనామ్. 72

అసూయ లేకుండుట, సూటిగా ప్రవర్తించుట, శుచిగా నుండుట, సంతోషము, ప్రియములు పలుకుట, ఇంద్రియనిగ్రహము, సత్యము, చంచలత లేకుండుట అను గుణములు దురాత్ములకు పట్టువడవు.

ఆత్మజ్ఞాన మనాయాస స్తితిక్షా ధర్మనిత్యతా,
వాక్ చైవ గుప్తా దానం చ నైతాన్యన్త్యేషు భారత. 73

ఆత్మజ్ఞానము, స్థైర్యము, సుఖదుఃఖములను సహించుట, ధర్మము తప్పకుండుట, పలుకును పరిరక్షించుకొనుట, దానము అను గుణములు నీచుల యందు నిలిచియుండవు.

అన్త్యేషు-నీచులయందు నీపుత్రులయందు. ఆర్జవము-కపటస్వభావము లేకుండుట-వాక్పరిరక్షణము మొదలగు గుణములు లేవు. కావున వారు నీచులని సూచన.

ఆక్రోశపరివాదాభ్యాం విహింస న్త్యబుధా జనాన్,
వక్తా పాప ముపాదత్తే క్షమమాణో విముచ్యతే. 74

---

72. అసూయ యనగా గుణములయందు దోషము నారోపించుట; అనాయాసః-చంచలత్వము లేకుండుట.

73. తితిక్షా-సర్వదుఃఖములను ఓర్పుతో సహించుట; అనాయాసః-స్థిరముగా నుండుట; వాక్‌గుప్తా-అసంబద్ధప్రలాపములనుంచి వాక్కును రక్షించుట.

74. ఆక్రోశః-దురుసుగా పలుకుట; పరివాదః-నిందించుట-నీ కొడుకు పలుకులలో నివి రెండును గలవు. కావున నాతనికి జయము గలుగదని సూచన.

కటువైన మాట, నిందలువేయుట అను రెంటిచేత జ్ఞానము లేనివారు జనులను హింసింతురు. పలికినవానినే పాప మంటును. క్షమించినవాడు పాపము నుండి విడివడును.

హింసా బల మసాధూనాం రాజ్ఞాం దణ్డవిధి ర్బలమ్,
శుశ్రూషా తు బలం స్త్రీణాం క్షమా గుణవతాం బలమ్. 75

దుర్జనులకు హింసయే బలము. రాజులకు దండనవిధియే బలము. స్త్రీలకు పరిచర్యయే బలము. గుణవంతులకు ఓర్పే బలము.

వాక్సంయమో హి నృపతే సుదుష్కరతమో మతః,
అర్థవచ్చ విచిత్రం చ న శక్యం బహు భాషితుమ్. 76

పలుకును పట్టియుంచుకొనుట, రాజా! మిక్కిలి దుష్కరమైన కార్యము. అర్థవంతముగా, చమత్కారముగా ఎక్కువ పలుకుట సాధ్యము కాదు.

అభ్యావహతి కల్యాణం వివిధం వాక్ సుభాషితా,
సైవ దుర్భాషితా రాజ న్ననర్థా యోపపద్యతే. 77

రాజా! చక్కగా పలికిన పలుకు పలుతీరుల మంగళమును సమకూర్చును. అదియే చెడుగా పలికినచో కీడొదవించును.

రోహతే సాయకై ర్విద్ధం వనం పరశునా హతమ్,
వాచా దురుక్తం బీభత్సం న సంరోహతి వాక్క్షతమ్. 78

గొడ్డటితో, బాణములతో పొడువగా నేలగూలిన తోట మరల చిగురింప వచ్చును. కాని కారుకూతలచే చెడినది మాత్రము తిరిగి బ్రదుకదు.

కర్ణినాలీకనారాచా న్నిర్హరన్తి శరీరతః,
వాక్శల్యస్తు న నిర్హర్తుం శక్యో హృదిశయో హి సః. 79

---

76. వాక్సంయమః-తూనినట్లు మాటలాడుట; అర్థవత్-పొల్లుమాటలు లేనిది; విచిత్రమ్-చమత్కారముతో కూడినది;

78. బీభత్సమ్ - నిందితమైనది - అందువలననే, న సంరోహతి- మొలకెత్తదు.

79. కర్ణి-పశువులచెవివంటి రూపముగల బాణము; నాలీకః-గట్టి ఇనుపకాడతో బలముగా దేహమున గుచ్చుకొనునట్టి బాణము; నిర్హరన్తి-వెలువరింతురు.

చెవివంటి రూపముతో పలకవలె నున్న బాణములను, ఇనుపకాడగల బాణములను శరీరమునుండి పెకలింతురు. కాని పలుకు ములుకును వెలువరించుటకు శక్యముకాదు. ఏల యన అది గుండెలో కూర్చున్నది గదా!

వాక్సాయకా వదనా న్నిష్పతన్తి
యై రాహతః శోచతి రాత్ర్యహాని,
పరస్యా నా మర్మసు తే పతన్తి
తాన్ పణ్డితో నావసృజేత్ పరేభ్యః. 80

కొందరి నోటినుండి పలుకు లనెడు ములుకులు వెలికి వచ్చిపడును. వాని దెబ్బ తిన్నవాడు రేయింబవళ్ళు శోకించును. అవి ఇతరుల ఆయువుపట్టులందే వచ్చిపడును. ఎఱుకగలవాడు వానిని ఇతరులపై ప్రయోగింపరాదు.

యస్మై దేవాః ప్రయచ్ఛన్తి పురుషాయ పరాభవమ్,
బుద్ధిం తస్యాపకర్షన్తి సోఽవాచీనాని పశ్యతి. 81

దేవతలు ఏ పురుషునికి పరాభవము నొసగుదురో వానిబుద్ధిని క్రిందికి గుంజివేయుదురు. వాడు నీచకార్యములనే చేయజూచును.

బుద్ధౌ కలుషభూతాయాం వినాశే ప్రత్యుపస్థితే,
అనయో నయసఙ్కాశో హృదయా న్నాపసర్పతి. 82

బుద్ధి మలినమైనపుడు, వినాశము దాపురించినపుడు, నీతివలె కన్పట్టు అవినీతి హృదయమునుండి తొలగిపోదు.

సేయం బుద్ధిః పరీతా తే పుత్రాణాం భరతర్షభ,
పాణ్డవానాం విరోధేన న చైనా నవబుధ్యసే. 83

భరతశ్రేష్ఠా! నీబుద్ధియు, నీకొడుకులదియు పాండవులపై పగతో చుట్టుకొనిపోయినది. కావుననే వారిసంగతి నెరుగకున్నావు.

---

80. అమర్మసు న పతంతి- ఆయువుపట్టులు కానిచోట పడవు-అనగా ఆయువుపట్టులలోనే తగులునని భావము - సభలో ద్రౌపదినిగూర్చి నీ కొడుకులు కాఱులు కూసిరి. ఆ అపరాధము క్షమింపరానిదని భావము.

81. అవాచీనాని - నీచకర్మములను.

83. పరీతా-ఆవరించినదైనది, క్రమ్మినదైనది.

రాజా లక్షణసంపన్న స్త్రైలోక్యస్యాపి యో భవేత్,
శిష్యస్తే శాసితా సోఽస్తు ధృతరాష్ట్ర యుధిష్ఠిరః. 84

ధృతరాష్ట్రమహారాజా! యుధిష్ఠిరునిలో మంచిలక్షణము లన్నియు నిండుగా గలవు. ఆతడు ముల్లోకములకును రాజు కాగల యోగ్యుడు. పైగా నీమాటను మన్నించును. అతడీ భూమికి శాసకు డగుగాక:

అతీవ సర్వాన్ పుత్రాంస్తే భాగధేయపురస్కృతః,
తేజసా ప్రజ్ఞయా చైవ యుక్తో ధర్మార్థతత్త్వవిత్ 85

ఆ ధర్మజుడు నీకొడుకు లందరిని మించి రాజ్యవిషయమున మన్నన నొందిన వాడు. తేజస్సు, ప్రజ్ఞ అతనిలో మిక్కుటముగా గలవు. ధర్మము, అర్థము అను వాని తత్త్వ మెరిగినవాడు.

అనుక్రోశా దానృశంస్యా ద్యోఽసౌ ధర్మభృతాం వరః,
గౌరవాత్తవ రాజేన్ద్ర బహూన్ క్లేశాం స్తితిక్షతి. 86

ధర్మమును పాటించువారిలో ఉత్తముడగు ఆధర్మరాజు నీపై జాలి వలనను,క్రూరస్వభావము లేని కారణమునను,నీయందలి పెద్దరికమును బట్టియు పలుకష్టము లనుభరించుచున్నాడు.

ఇతి శ్రీ మహాభారతే ఉద్యోగపర్వణి ప్రజాగరపర్వణి
విదురనీతివాక్యే చతుస్త్రింశోఽధ్యాయః.

ఇది శ్రీ మహాభారతము ఉద్యోగపర్వమున ప్రజాగరపర్వమున
విదురనీతివాక్యమున ముప్పదినాలుగవ అధ్యాయము.

---

84. తే శిష్యః-నీ ఆజ్ఞ పాలించువాడు; శాసితా- (పృథివిని) శాసించువాడు.

85. భాగధేయపురస్కృతః - రాజ్యాంశమున మన్నన గన్నవాడు. పట్టాభిషేకము పొందిన పాండుని కొడుకులు గాన ధర్మరాజాదులే రాజ్యము పొంద నర్హులు. కాని అట్లుకాని అంధుడవైన నీకొడుకులు కారని తాత్పర్యము.

86. అనుక్రోశాత్-దయగలతనమువలన; ఆనృశంస్యాత్ - క్రూరస్వభావము లేకపోవుటవలన; తవ గౌరవాత్-నిన్ను గురువుగా-తండ్రిగా-భావించుట వలన; బహూన్ క్లేశాన్-మీరు పెట్టెడు పలుకష్టములను; తితిక్షతి-సహించుచున్నాడు. శక్తిచాలని కారణమున సహించుచున్నవాడని తలపవలదని భావము.

—(౦)—

# పఞ్చత్రింశోఽధ్యాయః - ముప్పదియైదవ అధ్యాయము

**కేశినీనిమిత్తకం సుధన్వవిరోచనయో ర్వివాదముపవర్ణ్య విదురేణ ధృతరాష్ట్రం ప్రతి ధర్మస్యోపదేశః - కేశిని కారణముగా సుధన్వునకు విరోచనునకు వచ్చిన వివాదమును వర్ణించి విదురుడు ధృతరాష్ట్రునకు ధర్మము నుపదేశించుట.**

ధృతరాష్ట్ర ఉవాచ - ధృతరాష్ట్రు డిట్లు పలికెను.

బ్రూహి భూయో మహాబుద్ధే ధర్మార్థసహితం వచః,
శృణ్వతో నాస్తి మే తృప్తి ర్విచిత్రాణీహ భాషసే. 1

ఓయి! మహామతీ! ధర్మము,అర్థము అనువానితోకూడిన మాటల నింకను చెప్పుము. ఎంత విన్నను నాకు తనివి తీరుట లేదు. నీవు మిక్కిలి చమత్కారములు పలుకుచున్నావు.

విదుర ఉవాచ - విదురు డిట్లు చెప్పెను.

సర్వతీర్థేషు వా స్నానం సర్వభూతేషు చార్జవమ్,
ఉభే త్వేతే సమే స్యాతా మార్జవం వా విశిష్యతే. 2

తీర్థములన్నింట స్నానమాడుట,అన్నిప్రాణులయందును సమబుద్ధి కలిగియుండుట అను నీ రెండును సమానములగును. ఒకప్పుడు సమబుద్ధియే మిన్నయగును.

ఆర్జవం ప్రతిపద్యస్వ పుత్రేషు సతతం విభో,
ఇహ కీర్తిం పరాం ప్రాప్య ప్రేత్య స్వర్గ మవాప్స్యసి. 3

ప్రభూ! కొడుకులందు ఎల్లవేళల సమబుద్ధిని సాధింపుము. దానివలన ఈ లోకమున కీర్తి నొంది, చనిపోయిన పిమ్మట స్వర్గము నందుదువు.

---

2. ఆర్జవమ్ - భేదబుద్ధి లేకుండుట.

యావత్ కీర్తి ర్మనుష్యస్య పుణ్యా లోకే ప్రగీయతే,
తావత్ స పురుషవ్యాఘ్ర స్వర్గలోకే మహీయతే. 4

మనుష్యుని కీర్తి లోకమున కొనియాడబడునంతకాలము ఆతడు స్వర్గలోకమున గొప్పవాడై నిలుచును.

అత్రాప్యుదాహర న్తీమ మితిహాసం పురాతనమ్,
విరోచనస్య సంవాదం కేశిన్యర్థే సుధన్వనా. 5

కేశినివిషయమున విరోచనుడు సుధన్వునితో చేసిన సంవాదమును, ఎన్నడో జరిగినదానిని ఈవిషయమున పెద్దలు దృష్టాంతముగా చెప్పుదురు.

స్వయంవరే స్థితా కన్యా కేశినీ నామ నామతః,
రూపేణాప్రతిమా రాజన్ విశిష్టపతికామ్యయా. 6

రూపమున సాటిలేనిది కేశిని యను పేరుగల కన్నియ శ్రేష్ఠుడగు పతిని కోరినదై స్వయంవరమున నిలిచెను.

విరోచనోఽథ దైతేయ స్తదా తత్రాజగామ హ,
ప్రాప్తు మిచ్ఛం స్తత స్తత్ర దైత్యేన్ద్రం ప్రాహ కేశినీ. 7

అంత విరోచను డను రాక్షసజాతివాడు ఆమెను పొందగోరి అటకు వచ్చెను. అంత నాకేశిని ఆ దైత్యవరునితో నిట్లు పలికెను.

కేశిన్యువాచ - కేశిని యిట్లాడెను.

కిం బ్రాహ్మణాః స్విచ్ఛ్రేయాంసో దితిజాః స్విద్విరోచన,
అథ కేన స్మ పర్యఙ్కం సుధన్వా నాధిరోహతి. 8

విరోచనా! బ్రహ్మజ్ఞానసంపన్నులు గొప్పవారా? దితిసంతానమువారు గొప్పవారా? సుధన్వుడు నా పానుపు నేల యెక్కరాదు?

8. సుధన్వుడు బ్రహ్మవేత్త కనుక అతడే పానుపు నెక్కును. (నన్ను వివాహమాడును.) దైత్యుడవైన నీవు నీచుడవై యుండి సుధన్వుని త్రోసిరా జందు వేల? అని భావము.

విరోచన ఉవాచ - విరోచను డిట్లు పలికెను.

ప్రాజాపత్యాస్తు వై శ్రేష్ఠా వయం కేశిని సత్తమాః,
అస్మాకం ఖల్విమే లోకాః కే దేవాః కే ద్విజాతయః. 9

కేశినీ! మేము ప్రజాపతిసంతతివారము. కాన మేమే గొప్పవారము. ఈ లోకము లన్నియు మావే. దేవత లెవ్వరు? బ్రాహ్మణు లెవ్వరు?

కేశిన్యువాచ - కేశిని యిట్లు పలికెను.

ఇహైవావాం ప్రతీక్షావ ఉపస్థానే విరోచన,
సుధన్వా ప్రాతరాగన్తా పశ్యేయం వా సమాగతౌ. 10

విరోచనా! ఈ తావుననే మన మిరువురము వేచియుందము. రేపకడ సుధన్వుడు వచ్చును. అపుడు మీయిరువురను నేను పరికింతును.

విరోచన ఉవాచ - విరోచను డిట్లు పలికెను.

తథా భద్రే కరిష్యామి యథా త్వం భీరు భాషసే,
సుధన్వానం చ మాం చైవ ప్రాతర్ద్రష్టాసి సంగతౌ. 11

భీరూ! నీవు పలికినట్లే చేయుదును. ఒకచో కలిసిన సుధన్వుని, నన్నును రేపు ప్రొద్దున చూతువు.

విదుర ఉవాచ-విదురు డిట్లు పలికెను.

అతీతాయాం చ శర్వర్యా ముదితే సూర్యమణ్డలే,
అథాజగామ తం దేశం సుధన్వా రాజసత్తమ. 12

రాజవరేణ్యా! రాత్రి గడచినపిదప సూర్యబింబము ఉదయించినంత సుధన్వు డా తావునకు వచ్చెను.

విరోచనో యత్ర విభో కేశిన్యా సహితః స్థితః,
సుధన్వా చ సమాగచ్ఛత్ ప్రాహ్లాదిం కేశినీం తథా.

విరోచనుడు కేశినితోపాటు ఉన్నచోటికి సుధన్వుడు వచ్చి వారిరువుర యెదుటి కేతెంచెను.

---

10. ఇహ ఉపస్థానే - ఈ తావునందు; నన్ను వరించుటకు వచ్చిన దైత్యుడవగు నిన్ను బ్రాహ్మణుడగు నాతనిని నేను చూతును అని తాత్పర్యము.

సమాగతం ద్విజం దృష్ట్వా కేశినీ భరతర్షభ,
ప్రత్యుత్థాయాసనం తస్మై పాద్య మర్ఘ్యం దదౌ పునః. 13

అట్లు తనకడకు వచ్చిన బ్రాహ్మణుని గాంచి కేశిని యెదురేగి యాతనికి ఆసన మొసగెను. పిదప కాళ్ళు కడుగుకొనుటకు నీరు, పూజాద్రవ్యములు సమర్పించెను.

సుధన్వోవాచ-సుధన్వు డిట్లు పలికెను.

అన్వాలభే హిరణ్మయం ప్రాహ్లాదే తే వరాసనమ్,
ఏకత్వ ముపసంపన్నో నత్వాసేఽహం త్వయా సహ. 14

ప్రహ్లాదకుమారా! నీ మేలైన బంగారుపీటను నేను తాకుదును. నీతో సమానముగ నీకు సాటివాడనై కూర్చుండను.

విరోచన ఉవాచ-విరోచను డిట్లు పలికెను.

తవార్హతే తు ఫలకం కూర్చం వాప్యథవా బ్రుసీ,
సుధన్వ న్న త్వ మర్హోఽసి మయా సహ సమాసనమ్. 15

సుధన్వుడా! నీకు చెక్కపలకయో, దర్భలతో నేసిన చాపయో తగును. నాతోపాటు సాటి ఆసనముపై నీవు కూర్చుండదగవు.

సుధన్వోవాచ-సుధన్వు డిట్లనెను.

పితాపుత్రౌ సహాసీతాం ద్వౌ విప్రౌ క్షత్రియావపి,
వృద్ధౌ వైశ్యౌ చ శూద్రౌ చ న త్వన్యా వితరేతరమ్. 16

తండ్రి-కొడుకు, ఇద్దరు విప్రులు, ఇద్దరు క్షత్రియులు, ఇద్దరు ముదుసలి వైశ్యులు, ఇద్దరు శూద్రులు కలసి ఒక ఆసనమున కూర్చుండదగును. ఇతరులు ఒకరినొకరు కలసి కూర్చుండరాదు.

---

13. సమాగచ్ఛత్ - ఇరువురకు ఎదురుగా వచ్చెను.

14. ఇచట సందర్భమునుబట్టి విరోచనుడు తనతోపాటు ఏకాసనమున సుధన్వుని కూర్చుండవలసినదిగా అడిగినట్లు భావింపవలయును. అన్వాలభే-తాకుదును; న తు, ఆసే-కూర్చుండను.

15. ఫలకమ్-చెక్కపలక; కూర్చం బ్రుసీ-దర్భలుపేని నేసిన చాప; తవ అర్హతే-నీకు యోగ్యమగును.

పితా హి తే సమాసీన ముపాసీతైవ మామధః,
బాలః సుఖైధితో గేహే న త్వం కిఞ్చన బుధ్యసే. 17

నీ తండ్రియు, నేనాసనముపై కూర్చుండగా, నేలపై కూర్చుండి నన్ను సేవించును. పసివాడవు. గారాబముగా పెరిగితివి. పాపము! నీకేమియు తెలియదు.

విరోచన ఉవాచ-విరోచను డిట్లు పలికెను.

హిరణ్యం వా గవాశ్వం వా యద్విత్త మసురేషు నః,
సుధన్వాన్ విపణే తేన ప్రశ్నం పృచ్ఛావ యే విదుః. 18

సుధన్వా! బంగారము, గోవు లేక గుఱ్ఱము లేదా మా రాక్షసుల సొమ్ము ఏదియైన గానిమ్ము. దానితో పందెము వేయుదును. మనలో ఎవరు శ్రేష్ఠులో తెలిసినవారి నడుగుదము.

సుధన్వోవాచ - సుధన్వు డిట్లు పలికెను.

హిరణ్యం చ గవాశ్వం చ తవైవాస్తు విరోచన,
ప్రాణయోస్తు పణం కృత్వా ప్రశ్నం పృచ్ఛావ యే విదుః. 19

విరోచనా! సువర్ణమో, గోవు గుఱ్ఱములో నీకడనే యుండనిమ్ము. మన యిరువురి ప్రాణములను పందెముగా ఒడ్డి తెలిసిన వారిని అడుగుదము.

విరోచన ఉవాచ - విరోచను డిట్లనెను.

ఆవాం కుత్ర గమిష్యావః ప్రాణయో ర్విపణే కృతే,
న తు దేవే ష్వహం స్థాతా న మనుష్యేషు కర్హిచిత్. 20

ప్రాణముల మీద పందె మొడ్డి మన మెక్కడి కేగుదము? నేను దేవతల కడకు గాని, మానవుల యొద్దకుగాని ఎన్నటికిని రాను.

సుధన్వోవాచ - సుధన్వు డిట్లు వచించెను.

పితరం తే గమిష్యావః ప్రాణయో ర్విపణే కృతే,
పుత్రస్యాపి స హేతోర్హి ప్రహ్లాదో నానృతం వదేత్. 21

---

17. ఉపాసీత-సేవించును; అధః-అధః స్థిత్వా-నేలపై కూర్చుండి అని భావము.

18. తేన-దానితో; విపణే - పందెము వేసెదను; ప్రశ్నమ్-మా యిరువురలో శ్రేష్ఠు దెవ్వరు? అను ప్రశ్నను; యే విదుః-ఎవరెరిగినవారో, తాన్-అట్టి వారిని; పృచ్ఛావ-అడుగుదము.

ప్రాణములను పణముగా పెట్టిన మనము నీ తండ్రికడ కరుగుదము. ఆ ప్రహ్లాదుడు కొడుకుకొరకును అసత్యము పలుకడు.

విదుర ఉవాచ - విదురు డిట్లు చెప్పెను.

ఏవం కృతపణౌ క్రుద్ధౌ తత్రాభిజగ్మతు స్తదా,
విరోచనసుధన్వానౌ ప్రహ్లాదో యత్ర తిష్ఠతి 22

ఇట్లు పందెము వైచికొని వారిరువురు తీవ్రకోపముతో ప్రహ్లాదుడున్న చోటి కరిగిరి.

ఇమౌ తౌ సంప్రదృశ్యేతే యాభ్యాం న చరితం సహ,
ఆశీవిషావివ క్రుద్ధౌ వేకమార్గా విహాగతౌ. 23

వీరు మునుపెన్నడు కలసి తిరుగలేదు. ఇప్పుడు కలిసి కానవచ్చు చున్నారు. కోపించిన త్రాచులవలె ఒక్క దారిని ఇక్కడకు వచ్చిరి.

కిం వై సహైవం చరథో న పురా చరథః సహ,
విరోచనై తత్ పృచ్ఛామి కిం తే సఖ్యం సుధన్వనా. 24

మీరు మునుపెన్నడు కలసి తిరుగరు. ఇట్లు కలసి వచ్చితి రేల? విరోచన! నీకు సుధన్వునితో చెలిమి కలిగెనా యేమి?

విరోచన ఉవాచ - విరోచను డిట్లనెను.

న మే సుధన్వనా సఖ్యం ప్రాణయో ర్విపణావహే,
ప్రహ్లాద తత్త్వం పృచ్ఛామి మా ప్రశ్న మనృతం వదేః. 25

నాయనా! నాకు సుధన్వునితో చెలిమి లేదు. మేము ప్రాణములపై పందె మొడ్డితిమి. నిన్ను నిజ మడుగుచున్నాను. ప్రశ్నకు అబద్ధము చెప్పకుము.

ప్రహ్లాద ఉవాచ - ప్రహ్లాదు డిట్లాడెను.

ఉదకం మధుపర్కం వాఽప్యానయన్తు సుధన్వనే,
బ్రహ్మ న్నభ్యర్చనీయోఽసి శ్వేతా గౌః పీవరీకృతా. 26

---

23. యాభ్యాం న చరితం సహ- వీరిరువురు ఎన్నడు కలసి తిరుగలేదు. ఒకరి మీద ఒకరికి పగయున్న కారణమున అని భావము.

26. మధుపర్కమ్-తేనె మొదలగు పదార్థములతో చేసిన పూజాద్రవ్యము; పీవరీ-బలిసినది. కృతా-మధుపర్కసమయమున ఇచ్చుటకై సిద్ధము చేయబడినది,

సుధన్వునికై ఉదకము మధుపర్కము కొనిరండు. ఓయి బ్రాహ్మణో త్తమా! నీవు పూజింపదగినవాడవు. నీకై యిదిగో తెల్లని బలిసిన ఆవు సిద్ధముగా నున్నది.

సుధన్వోవాచ - సుధన్వు డిట్లు పలికెను.

ఉదకం మధుపర్కం చ పథిష్వే వార్పితం మమ,
ప్రహ్లాద త్వం తు మే తథ్యం ప్రశ్నం ప్రబ్రూహి పృచ్ఛతః,
కిం బ్రాహ్మణాః స్విచ్ఛ్రేయాంస ఉతాహో స్విద్విరోచనః. 27

ప్రహ్లాదా! ఉదకము, మధుపర్కము నాకు దారులందే దొరికినవి. నీవు నేనడగు ప్రశ్నకు సత్యము పలుకుము. బ్రాహ్మణులా శ్రేష్ఠులు?లేక యీ విరోచనుడా?

ప్రహ్లాద ఉవాచ - ప్రహ్లాదు డిట్లు వాక్రుచ్చెను.

పుత్ర ఏకో మమ బ్రహ్మం స్త్వం చ సాక్షా దిహాస్థితః,
తయో ర్వివదతోః ప్రశ్నం కథ మస్మద్విధో వదేత్. 28

ఓయీ బ్రాహ్మణా! నాకొక్కడే కొడుకు. మరియు నీవు సాక్షాత్తుగా నిట నిలిచియున్నావు. మీ యిరువురకు వివాదము రాగా నావంటివా డెట్లు చెప్పును?

సుధన్వోవాచ - సుధన్వు డిట్లనెను.

గాం ప్రదద్యా స్త్వౌరసాయ యద్వాన్యత్ స్యాత్ ప్రియం ధనమ్,
ద్వయో ర్వివదతో స్తథ్యం వాచ్యం చ మతిమం స్త్వయా. 29

అయ్యా! నీకన్నకొడుకునకు గోవునే యిమ్ము. మరియేదైన ప్రియమైన ధనమునే యిమ్ము. కాని మతిమంతుడా! మాటకు మాట వచ్చినపుడు నీవు ఉన్న దున్నట్లు చెప్పవలయును.

ప్రహ్లాద ఉవాచ - ప్రహ్లాదుడు వచించెను.

అథ యో నైవ ప్రబ్రూయాత్ సత్యం వా యది వాऽనృతమ్,
ఏత త్సుధన్వన్ పృచ్ఛామి దుర్వివక్తా స్మ కిం వసేత్. 30

---

27. పథిషు,ఏవ,అర్పితం,మమ-ఇది ఒక నుడికారము. వానితో నాకు పనిలేదు. ప్రశ్నను నిర్ణయించినచో అవి యన్నియు మాకు లభించినట్లే యని భావము.

సుధన్వా! ఒకవేళ సత్యమో అసత్యమో పలుకడే యనుకొనుము. లేక ఏదో పలికినచో అట్టివాడేమి పొందును?

సుధన్వోవాచ - సుధన్వు డిట్లనెను.

యాం రాత్రి మధివిన్నా స్త్రీ యాం చైవాక్షపరాజితః,
యాం చ భారాభితప్తాఙ్గో దుర్వివక్తా స్మ తాం వసేత్. 31

భర్త యాదరము కోల్పోయిన యింతియు, జూదమున నోడినవాడును, బరువు మోసి బడలిన శరీరము కలవాడును ఎట్టి రాత్రిని పొందుదురో అన్యాయము చెప్పువాడు అట్టి రాత్రిని, పొందును.

నగరే ప్రతిరుద్ధః సన్ బహిర్ద్వారే బుభుక్షితః,
అమిత్రాన్ భూయసః పశ్యేద్యః సాక్ష్య మనృతం వదేత్. 32

నగరమున నిలువనీడలేక ద్వారము వెలుపలనుండి ఆకలితో బాధ నొందుచు, చుట్టును, పగవారిని చూచుచున్న వాని అవస్థను, తప్పుడు సాక్ష్యము చెప్పువాడు పొందును.

పఞ్చ పశ్వనృతే హన్తి దశ హన్తి గవానృతే,
శత మశ్వానృతే హన్తి సహస్రం పురుషానృతే. 33

మేక, గొఱ్ఱె మొదలగువానికై అబద్ధమాడువాడు అయిదుతరములవారిని, గోవుకొఱకు అసత్యము చెప్పువాడు పది తరములవారిని, గుఱ్ఱములకై అనృత

---

31. అధివిన్నా-క్రొత్తగా సవతివచ్చిన యిల్లాలు; రాత్రిం వసేత్ అట్టి రాత్రి యందు సవతి, జూదమున నోడినవాడు, బరువులుమోసి యొడలు నుగ్గయినవాడు ఎంతెంత తీవ్రవేదన ననుభవింతురో అట్టి తీవ్రవేదనను బొందుదురని తాత్పర్యము.

32. నగరము చొచ్చుటకు వీలులేదు. ఆకలిబాధ, చుట్టును శత్రువులు పెక్కురు మూగి యున్నారు. అట్టి వ్యక్తి ఎంత వేదన చెందునో అసత్యమాడువాడట్టి వేదన చెందునని తాత్పర్యము.

33. పశ్వనృతే-పశువులకొఱకైన అబద్ధము పలుకగా; ఇట్లే గవానృతే మొదలగునవి; పఞ్చ-అయిదు పూర్వతరములవారిని; హన్తి-పరలోకమునుండి పతితులను చేయును.

మాడువాడు నూరుతరములవారిని, మనుష్యుల విషయమున కల్లలాడువాడు వేయి తరములవారిని పరలోకమునుండి పతితులను జేయును.

హన్తి జాతా నజాతాంశ్చ హిరణ్యార్థేఽనృతం వదన్,
సర్వం భూమ్యనృతే హన్తి మా స్మ భూమ్యనృతం వదేః. 34

సువర్ణవిషయమున కల్లలాడువాడు పుట్టినవారిని, పుట్టబోవువారిని కూడ నాశన మొనర్చును. భూమి విషయమున కల్లలాడువాడు సర్వమును చంపుకొనును. రాజా! భూమి విషయమున అసత్యము పలుకకుము.

ప్రహ్లాద ఉవాచ - ప్రహ్లాదు డిట్లు పలికెను.

మత్తః శ్రేయా నఙ్గిరా వై సుధన్వా త్వద్విరోచన,
మతాఽస్య శ్రేయసీ మాతు స్తస్మాత్త్వం తేన వై జితః. 35

విరోచనా! అంగిరుడు నాకంటె మిన్న. సుధన్వుడు నీకంటె గొప్పవాడు. అతని తల్లి నీ తల్లికంటె శ్రేష్ఠురాలు. కావున నీవు సుధన్వుని కోడితివి.

విరోచన సుధన్వాయం ప్రాణానా మీశ్వర స్తవ,
సుధన్వన్ పునరిచ్ఛామి త్వయా దత్తం విరోచనమ్. 36

విరోచన! ఈ సుధన్వుడు నీ ప్రాణములకు స్వామి. సుధన్వా! విరోచనుని సమర్పింపుమని నిన్ను కోరుకొనుచున్నాను.

సుధన్వోవాచ - సుధన్వు డిట్లనెను.

యద్ధర్మ మవృణీథా స్త్వం న కామా దనృతం వదీః,
పునర్దదామి తే పుత్రం తస్మాత్ ప్రహ్లాద దుర్లభమ్. 37

ప్రహ్లాదా! నీవు ధర్మమును వరించితివి. కామవశమున అసత్య మాడకుంటివి. ఆకారణమున దుర్లభుడైన కొడుకును తిరిగి నీకొసగుచున్నాను.

---

34. భూమ్యనృతమ్-కేశిని భూమి-క్షేత్రము వంటిది. కావున ఆమె విషయమున కల్ల పలుకకుమని భావము.
35. అఙ్గిరాః-సుధన్వుని తండ్రి అంగిరుడు; త్వత్-నీకంటె,
36. ప్రాణానామీశ్వరః - నీ చావుబ్రదుకులు సుధన్వుని చేతిలో నున్నవని భావము.

ఏష ప్రహ్లాద పుత్రస్తే మయా దత్తో విరోచనః,
పాదప్రక్షాళనం కుర్యాత్ కుమార్యాః సంనిధౌ మమ. 38

ప్రహ్లాదా! ఈ విరోచనుడు నీకు నేనొసగిన పుత్రుడు. కుమారియగు కేశిని పాదములను నాయెదుట కడుగవలయును.

విదుర ఉవాచ-విదురు డిట్లు చెప్పెను.

తస్మాద్ రాజేన్ద్ర భూమ్యర్థే నానృతం వక్తు మర్హసి,
మాగమః ససుతామాత్యో నాశం పుత్రార్థ మబ్రువన్. 39

కావున రాజేంద్రా! భూమివిషయమున అసత్యము పలుకవలదు. కొడుకు కొరకు అసత్యమాడి కొడుకులతో హితులతో నాశము పొందకుము.

న దేవా దణ్డ మాదాయ రక్షన్తి పశుపాలవత్,
యం హి రక్షితు మిచ్ఛన్తి బుద్ధ్యా సంవిభజన్తి తమ్. 40

దేవతలు కఱ్ఱ బట్టుకొని గొల్లవానివలె రక్షింపరు, ఎవరిని రక్షింప నెంతురో వానిని బుద్ధిచేత వేరుపరుచుదురు.

యథా యథా హి పురుషః కల్యాణే కురుతే మనః,
తథా తథాఽస్య సర్వార్థాః సిద్ధ్యన్తే నాత్ర సంశయః. 41

---

38. పాదప్రక్షాళనమ్ - పసుపు పాదములకు పూయుట. కుమార్యాః - కుమారియగు కేశిని పాదములకు పసుపు పూయవలయును. వివాహములో దంపతులు ఒకరికాళ్ళ కొకరు పసుపు రాయుట ఆచారము - దీనినిబట్టి సుధన్వుడు కేశినిని ఉదారబుద్ధితో విరోచనునకు భార్యగా నొసగెనని తాత్పర్యము.

39. ఆఖ్యాయికకు ఫలమును వివరించుచున్నారు. అబ్రువన్ - సత్యము పలుకుచు. సత్యము పలికినచో నీవు నీకులముతోపాటు నశింపకుందు వని భావము.

40. నీకు చెడుబుద్ధి పుట్టె ననగా దైవము నీవైపు లేదని తాత్పర్యముతో నీశ్లోకమును విదురుడు మరల ఉగ్గడించెను. బుద్ధ్యా సంవిభజన్తి - బుద్ధితో వేరు పరుతురు అనగా వివేకము కలిగించుటయే రక్షించుట యని తాత్పర్యము.

మనుజు డెట్లెట్లు మంగళమైనదానియందు మనసు పెట్టునో అట్లట్లు ఆతని సర్వప్రయోజనములు నెరవేరును. ఇందు సందియము లేదు.

నైనం ఛన్దాంసి వృజినా త్తారయన్తి
మాయావినం మాయయా వర్తమానమ్,
నీడం శకున్తా ఇవ జాతపక్షా-
శ్ఛన్దాంస్యేనం ప్రజహ త్యన్తకాలే. 42

కపటస్వభావముగల మాయవానిని వేదములు పాపమునుండి తరింప జేయవు. రెక్కలు వచ్చిన పక్షులు గూడు వదలి పోయినట్లు పోగాలమున వానిని వేదములు వదలిపోవును.

మద్యపానం కలహం పూగవైరం
భార్యాపత్యో రన్తరం జ్ఞాతిభేదమ్,
రాజద్విష్టం స్త్రీపుంసయో ర్వివాదం
వర్జ్యాన్యాహు ర్యశ్చ పన్థాః ప్రదుష్టః. 43

మద్యము త్రావుట, పోరు, పదిమందితో పగ, భార్యాభర్తల యెడబాటు కలిగించుట, జ్ఞాతులకు పోరాదవించుట, రాజునకు ద్రోహము చేయుట, స్త్రీపురుషులకు కలహము పెట్టుట, చెడుమార్గమున పోవుట అనువానిని వదలవలసినవిగా వక్కాణింతురు.

సాముద్రికం వణిజం చోరపూర్వం
శలాకధూర్తం చ చికిత్సకం చ,

42. ఛందాంసి - వేదములు - వేదములు ఇష్టప్రాప్తికి, అనిష్టపరిహారమునకు కావలసిన అలౌకికమగు నుపాయమును బోధించును. అవి వదలిపోవుట యనగా సర్వనాశన మగుట యని తాత్పర్యము.

43. పూగవైరమ్-పలువురతో వైరము; అన్తరమ్-ఎడబాటు; వివాదమ్-కలహము గావించుట; జ్ఞాతులను బాధపెట్టుట, పోరాటము అనువానియందు సత్ప్రవృత్తి యోగ్యముగా లేదని తాత్పర్యము.

అరిం చ మిత్రం చ కుశీలవం చ
నైతాన్ సాక్ష్యే త్వధికుర్వీత సప్త. 44

చేతిరేఖలనుబట్టి ఫలమును చెప్పువానిని. దొంగతనము విడిచి వ్యాపారము చేపట్టినవానిని (లేక తప్పుడుకొలతలతో వ్యాపారము చేయువానిని), శకునములతో వంచించువానిని, వైద్యుని, శత్రువును, మిత్రుని, నటుని – ఈ యేడుగురిని సాక్ష్యమున నిలుపరాదు.

మానాగ్నిహోత్ర ముత మానమౌనం
మానేనాధీత ముత మానయజ్ఞః,
ఏతాని చత్వా ర్యభయజ్కరాణి
భయం ప్రయచ్ఛ న్త్యయథాకృతాని. 45

---

44. సాముద్రికమ్ - చేతిరేఖలను పరికించువానిని; వణిజం చోరపూర్వమ్ - మునుపు దొంగయై యుండి పిదప వ్యాపారము చేయుచున్నవానిని (లేక తప్పుడుకొలతలతో వ్యాపారము చేయువానిని) శలాకధూర్తమ్-ఇనుప చువ్వ లేక త్రాడు మొదలగువానితో శకునములను చెప్పి లోకమును వంచించువానిని, పైని పేర్కొన్నవారు వంచకులు కావున సాక్ష్యమునకు పనికిరారు; అరిమ్-శత్రువును - వీడు విపరీతసాక్ష్యము చెప్పవచ్చును; మిత్రమ్-హితుని - పరీక్షకులు మిత్రులుచెప్పు సాక్ష్యమును నమ్మరు; కుశీలవమ్-కుత్సితమైన శీలమును అనుసరించువానిని కుశీలవుడందురు. నర్తకీదాసుడు-అట్టివానిని సాక్ష్యమున నిలుపరాదు. - ధృతరాష్ట్రా! కపట ద్యూతము చేయు శకుని నీకు ప్రమాణమయ్యెను-అని యిట అధిక్షేపము.

45. ఒకప్పుడు కొందరు సత్కర్మలు లోకము మెప్పునకు చేయుచుందురు. అంతమాత్రమున వారిని సజ్జనులుగా భావింపరాదను దృష్టితో ఈ శ్లోకము చెప్పుచున్నారు; మానః-ఆదరము, భక్తిశ్రద్ధలు కలిగియుండుట అని యొక యర్థము; ఆర్భాటమునకై చేయునది యని మరియొక అర్థము; మౌనమ్ - ధ్యానము - జనుల మెప్పుకొఱకు చేయు అగ్నిహోత్రాదులు భయంకర ఫలితముల నొసగుననీ తాత్పర్యము.

భక్తిశ్రద్ధలతో అర్చించు అగ్నిహోత్రము, పాటించు మౌనము, ఆర్జించు విద్య, ఆచరించు యజ్ఞము అను నీనాల్గును అభయమును ప్రసాదించును. దంభము కొఱకైనచో అవియే భయమును కలిగించును.

అగారదాహీ గరదః కుణ్డాశీ సోమవిక్రయీ,
పర్వకారశ్చ సూచీ చ మిత్రధ్రుక్ పారదారికః. 46
భ్రూణహా గురుతల్పీ చ యశ్చ స్యాత్పానపో ద్విజః,
అతితీక్ష్ణశ్చ కాకశ్చ నాస్తికో వేదనిన్దకః. 47
స్రువప్రగ్రహణో వ్రాత్యః కీనాశశ్చాత్మవానపి,
రక్షేత్యుక్తశ్చ యో హింస్యాత్ సర్వే బ్రహ్మహభిః సమాః. 48

ఇండ్లు కాల్చువారు, విషము పెట్టువాడు, కుండుడు పెట్టు కూడు తినువాడు, సోమము నమ్మి బ్రదుకువాడు, ఆయుధములు చేయువాడు, కొండెములు చెప్పువాడు, నమ్మినవారిని చెరుపువాడు, పరభార్యలతో విహరించువాడు, కడుపులోని బిడ్డలను చంపువాడు, గురుభార్యను కామించువాడు, ద్విజుడై యుండి మద్యము త్రావువాడు, మిక్కిలి తీవ్రస్వభావము కలవాడు, కాకివలె నొప్పివడు

---

46. కుణ్డాశీ - మగడు బ్రదికియుండగా రంకుమగనివలన ఒక స్త్రీ కొడుకును గన్నచో వానిని కుండు డందురు. వానివలన జీవించువాడు కుండాశి; పర్వకారః - బాణములు చేయువాడు; సూచీ - నక్షత్రాదుల ఫలములను చెప్పు జ్యోతిషికుడు లేదా ఇతరుల దోషములను కొండెములుగా చెప్పువాడు;

47. కాకః - పుండును ముక్కుతో పొడుచు కాకివలె బాధలో నున్నవారిని బాధించు స్వభావము గలవాడు; నాస్తికః - పరలోకము మొదలగువానిని ద్వేషించువాడు;

48. స్రువప్రగ్రహణః - అధికారబలమువలన వర్తకులు మొదలగువారినుండి ధాన్యము మొదలగునవి తనతిండికై దోచుకొనువాడు - గ్రామపురోహితు డనియు కొంద రందురు; వ్రాత్యః-సకాలమున ఉపనయనసంస్కారము పొందనివాడు (లేక) గాయత్రీమంత్రమును జపించుట మానినవాడు; కీనాశః - క్రూరుడు; ఆత్మవాన్ అపి - సమర్థుడై యుండియు.

వారిని నొప్పించువాడు, పరలోకము లేదని నమ్మువాడు, వేదములను నిందించు వాడు, రాజకీయవృత్తిబలముతో అందరినుండి 'మామూళ్ళ' కైకొనువాడు, తగు సమయమున ఉపనయనము పొందనివాడు, (లేక) గాయత్రి జపింపని వాడు, కర్షకుడు, తగిన శక్తి కలిగియు రక్షింపుమని వేడినవానిని హింసించు వాడు- వీరందరు బ్రహ్మహత్య చేసినవారితో సమానులు.

తృణోల్కయా జ్ఞాయతే జాతరూపం
వృత్తేన భద్రో వ్యవహారేణ సాధుః,
శూరో భయే ష్వర్థకృచ్ఛ్రేషు ధీరః
కృచ్ఛ్రేష్వాపత్సు సుహృద శ్చారయశ్చ. 49

చీకటిలో రూపమున్న వస్తువు గడ్డిమంటచేతను తెలియవచ్చును. ధర్మము నడవడికచేతను, మంచితనము వ్యవహారముచేతను, శూరుడు భయములు ఏర్పడు సమయములందును, ధీరుడు కష్టములలో, మిత్రులు శత్రువులు అతి ఘోరములగు ఆపదలలో తెలియవత్తురు.

జరా రూపం హరతి హి ధైర్య మాశా
మృత్యుః ప్రాణాన్ ధర్మచర్యా మసూయా,
క్రోధః శ్రియం శీల మనార్యసేవా
హ్రియం కామః సర్వమే వాభిమానః. 50

---

49. తృణఉల్కయా - గడ్డిపరకకు అంటిన మంట వెలుగుచేత, జాతరూపమ్- రూపముగల వస్తువు లేక సువర్ణము; భద్రః - ధర్మము; వృత్తేన - శీలముచేత; సాధుః-సజ్జనుడు; వ్యవహారేణ-అహింస మున్నగు దానిచేత; కృచ్ఛ్రేషు - కరవు మొదలగు కష్టములయందు; ఇది ధర్మమా? కాదా? మున్నగు వానిని నిర్ణయించుటకు శీలము, వ్యవహారము మున్నగునవి సాధనము లని తాత్పర్యము. నీకొడుకులయందు ధర్మము, సాధుత్వము మొదలగు మంచి గుణములు లేవని ప్రకృతార్థసూచన.

50. అభిమానః-తన్నుగురించి గొప్పగా భావించుట; నీ కొడుకులలో అభిమాన దోషము గలదని సూచన.

ముసలితనము రూపమును, ఆశ ధైర్యమును, మృత్యువు ప్రాణములను, అసూయ ధర్మ ఆచరణమును, క్రోధము సంపదను, నీచులసేవ శీలమును, కామము లజ్జను, అభిమానము సర్వమును హరించివేయును.

శ్రీర్మఙ్గళాత్ ప్రభవతి ప్రాగల్భ్యాత్ సంప్రవర్ధతే,
దాక్ష్యాత్తు కురుతే మూలం సంయమాత్ ప్రతితిష్ఠతి. 51

సంపద శుభకార్యమువలన పుట్టును, నేర్పువలన పెరుగును. సమర్థత వలన కుదురు చేసికొనును. మిడిసి పడకుండుటవలన నిలువద్రొక్కుకొనును.

అష్టౌ గుణాః పురుషం దీపయన్తి
ప్రజ్ఞా చ కౌల్యం చ దమః శ్రుతం చ,
పరాక్రమ శ్చాబహుభాషితా చ
దానం యథాశక్తి కృతజ్ఞతా చ. 52

ప్రజ్ఞ, మంచికులము, నిగ్రహము, చదువు, పరాక్రమము, మితముగా పలుకుట, శక్తిమేరకు దాన మొసగుట, చేసినమేలు మరవకుండుట అను ఈ ఎనిమిది గుణములు మనుజుని ప్రకాశింపజేయును.

ఏతాన్ గుణాం స్తాత మహానుభావా
నేకో గుణః సంశ్రయతే ప్రసహ్య,
రాజా యదా సత్కురుతే మనుష్యం
సర్వాన్ గుణానేష గుణో విభాతి. 53

నాయనా! మహిమగల యీగుణముల నన్నింటిని ఒక్కగుణము హఠాత్తుగా ఆశ్రయించుచున్నది. రాజొకమనుజుని సత్కరించినచో ఆసత్కారమే గుణము లన్నింటిని వెలిగించుచున్నది.

---

51. దాక్ష్యమ్ - సమర్థత, శీఘ్రముగా ఆ యా పనులు చేయు సమర్థత - నీయందు నిగ్రహము లేదు కావున సంపద నిలువదని సూచన.

53. ఏష గుణః - ఈ రాజసత్కారమను గుణము; విభాతి - వెలిగించుచున్నదని భావము; నీవును నీకొడుకులు కర్ణాదులను గొప్ప గావించిరి. కావున మీకు ఉపయోగపడవని తాత్పర్యము.

అష్టౌ నృపేమాని మనుష్యలోకే
స్వర్గస్య లోకస్య నిదర్శనాని,
చత్వార్యేషా మన్వవేతాని సద్భి -
శ్చత్వారి చైషా మనుయాన్తి సన్తః. 54

రాజా! చెప్పబోవు ఈ ఎనిమిది గుణములు మనుష్యలోకమున స్వర్గలోకమును చూపగలట్టివి. వీనిలో నాల్గు సత్పురుషుల నంటిపెట్టుకొని యుండును. తక్కిన నాల్గింటిని సత్పురుషులు వెంటబడి సాధింతురు.

యజ్ఞో దాన మధ్యయనం తపశ్చ
చత్వా ర్యేతా న్యన్వవేతాని సద్భిః,
దమః సత్య మార్జవ మానృశంస్యం
చత్వార్యేతా న్యనుయాన్తి సన్తః. 55

యజ్ఞము, దానము, అధ్యయనము, తపస్సు అను నీ నాల్గును సత్పురుషుల నంటిపెట్టికొని యుండునవి. నిగ్రహము, సత్యము, ఋజువర్తనము, దయ అను నీ నాల్గింటిని సజ్జనులు ప్రయత్నపడి సాధింతురు.

ఇజ్యాధ్యయనదానాని తపః సత్యం క్షమా ఘృణా,
అలోభ ఇతి మార్గోఽయం ధర్మస్యాష్టవిధః స్మృతః. 56

యజ్ఞము, అధ్యయనము (వేదములు చదువుట) దానము, తపస్సు, సత్యము, ఓర్పు, జాలి, అత్యాశ లేకుండుట అను నెనిమిది తీరులు గల మార్గము ధర్మమునకు సంబంధించినది.

తత్ర పూర్వచతుర్వర్గో దమ్భార్థమపి సేవ్యతే,
ఉత్తరశ్చ చతుర్వర్గో నామహాత్మసు తిష్ఠతి. 57

---

54. అన్వవేతాని - నిత్యసంబంధము గలవి - అనగా ఈలక్షణములు సజ్జనులను విడిచిపోని వని తాత్పర్యము. అనుయాన్తి - యత్నముతో సాధింతురని భావము.

55. పై అర్థము నిందు సమన్వయము చేసికొనవలయును.

57. దంభార్థమపి సేవ్యతే-నిగ్రహము, సత్యము మొదలగునవి లేకుండ పరుల మెప్పునకై యజ్ఞము మొదలగు దానిని చేయుట కానవచ్చును. అట్లు సత్యాదులను నిర్వహించుట సామాన్యులకు సాధ్యము కాదు.

అందు మొదటి నాల్గింటి సముదాయమును కొందరు లోకపు మెప్పుకొరకును ఆచరింతురు. కాని తుది నాల్గింటి సముదాయము మాత్రము దొడ్డబుద్ధి లేని వారియందు నిలువదు.

న సా సభా యత్ర న సన్తి వృద్ధా
న తే వృద్ధా యే న వదన్తి ధర్మమ్,
నాసౌ ధర్మో యత్ర న సత్య మస్తి
న తత్ సత్యం యత్ ఛలేనాభ్యుపేతమ్. 58

వృద్ధులు లేనిచో అది సభ కాదు. ధర్మము చెప్పనిచో వారు వృద్ధులు కారు. సత్యము లేనిది ధర్మముకాదు. కపటముతో కూడినచో అది సత్యముకాదు.

సత్యం రూపం శ్రుతం విద్యా కౌల్యం శీలం బలం ధనమ్,
శౌర్యం చ చిత్రభాష్యం చ దశమే స్వర్గయోనయః. 59

సత్యము, రూపము, చదువు, ఉపాసన, మంచికులమున పుట్టుట, శీలము, బలము, ధనము, పరాక్రమము, యుక్తితోకూడిన పలుకు - అను ఈ పదియు స్వర్గమునకు కారణములు.

పాపం కుర్వన్ పాపకీర్తిః పాపమేవాశ్నుతే ఫలమ్,
పుణ్యం కుర్వన్ పుణ్యకీర్తిః పుణ్య మత్యన్త మశ్నుతే. 60

పాపము చేయుచు పాపి యను పేరుపొంది పాపఫలమే నరుడు పడయును. పుణ్యము చేయుచు పుణ్యమైన కీర్తికలవాడై పుణ్యఫలమునే మిక్కిలిగా అనుభవించును.

---

59. రూపమ్-వినయము; శ్రుతమ్-అధ్యయనము, విద్యా-దేవతాదులను ఉపాసించురీతి; చిత్రభాష్యమ్ - యుక్తిపూర్వకముగా మాటాడుట; 'దశ సంసర్గజా గుణాః' అనియు పాఠము. అనగా ఈ పదియు సంసర్గము వలన-మైత్రి మున్నగు భావములతో కూడి యుండుటవలన - కలుగు గుణములని భావము. కావున ఎల్లవేళల సత్సంగము చేయవలయునని హితబోధ.

60. పాపకీర్తిః-పాపాత్ముడని లోకమునందు తెలిసినవాడు.

తస్మాత్ పాపం న కుర్వీత పురుషః శంసితవ్రతః,
పాపం ప్రజ్ఞాం నాశయతి క్రియమాణం పునః పునః.
నష్టప్రజ్ఞః పాపమేవ నిత్య మారభతే నరః. 61

చెడనివ్రతము కలవాడై పురుషుడు, అకారణమున పాపమును చేయనే రాదు. పాపము తిరిగి తిరిగి చేయుచున్నయెడల తెలివి నశించును. అట్లు ప్రజ్ఞ నశింపగా నరుడు పాపమునే ఎల్లవేళల చేయ దొరకొనును.

పుణ్యం ప్రజ్ఞాం వర్ధయతి క్రియమాణం పునః పునః,
వృద్ధప్రజ్ఞః పుణ్యమేవ నిత్య మారభతే నరః. 62

పుణ్యము మాటిమాటికి చేయుచుండగా ప్రజ్ఞ వృద్ధినొందును. అట్లు పెరిగిన ప్రజ్ఞగల నరుడు పుణ్యమునే ఎల్లవేళల చేయ నుంకించును.

పుణ్యం కుర్వన్ పుణ్యకీర్తిః పుణ్యం స్థానం స్మ గచ్ఛతి,
తస్మాత్ పుణ్యం నిషేవేత పురుషః సుసమాహితః. 63

పుణ్యము చేయుచు పుణ్యాత్ము డను ప్రసిద్ధి బడసి నరుడు పుణ్యమైన తావునకు చేరుకొనును. కావున ఏమరుపాటు కొంచెమైనను లేక పుణ్యమునే పట్టి యుండవలయును.

అసూయకో దన్దశూకో నిష్ఠురో వైరకృచ్ఛఠః,
స కృచ్ఛ్రం మహ దాప్నోతి నచిరాత్ పాప మాచరన్. 64

అసూయ కలవాడు, ఆయువు పట్టులందు హింసించువాడు, అప్రియములు పలుకువాడు, పగ పెట్టువాడు, మోసకాడు-అను వీరు పాపము చేయుచు వెను వెంటనే గొప్ప దుఃఖమును బొందుదురు.

అనసూయః కృతప్రజ్ఞః శోభనా న్యాచరన్ సదా,
నకృచ్ఛ్రం మహ దాప్నోతి సర్వత్ర చ విరోచతే. 65

---

61. నష్టప్రజ్ఞః - ప్రజ్ఞ చచ్చినవాడు; ప్రజ్ఞ యనగా, మూడుకాలములకు సంబంధించిన బుద్ధి విశేషము.

64. దన్దశూకః-ఆయువుపట్టులందు కొట్టువాడు; నిష్ఠురః-అప్రియములు పలుకు వాడు; నచిరాత్-వెంటనే;

65. నకృచ్ఛ్రమ్-ఇది సమాసము. సుఖము అని యర్థము;

అసూయ లేనివాడు, ప్రజ్ఞను పెంపొందించుకొన్నవాడు మంచిపనుల నెల్ల వేళల చక్కగా చేయువాడు, గొప్ప సుఖమును పొందును. అన్నియెడల అందరకు ఇష్టుడగును.

ప్రజ్ఞామే వాగమయతి యః ప్రాజ్ఞేభ్యః స పణ్డితః,
ప్రజ్ఞో హ్యవాప్య ధర్మార్థౌ శక్నోతి సుఖమేధితుమ్. 66

గొప్పప్రజ్ఞ గలవారినుండి ప్రజ్ఞనే సాధించుకొనువాడు పండితుడు. అట్లు ప్రజ్ఞతో విరాజిల్లువాడు ధర్మార్థములను సంపాదించు సుఖమును వృద్ధి పొందించుకొనగలుగును.

దివసేనైవ తత్ కుర్యా ద్యేన రాత్రౌ సుఖం వసేత్,
అష్టమాసేన తత్ కుర్యాద్యేన వర్షాః సుఖం వసేత్. 67

పూర్వే వయసి తత్కుర్యా ద్యేన వృద్ధః సుఖం వసేత్,
యావజ్జీవేన తత్కుర్యా ద్యేన ప్రేత్య సుఖం వసేత్. 68

రాత్రి సుఖముగా ఉండు ఏర్పాటును పగటియందే చేసికొనవలయును. వానకాలమున సుఖముగా నుండు ప్రయత్నమును తక్కిన యెనిమిది నెలల యందే చేయవలయును. ముసలితనమునందు సుఖమునకై పడుచుదనముననే ప్రయత్నింపవలయును. చనిపోయిన తరువాత సుఖమందుటకై జీవితమంతయు ప్రయత్నింపవలయును.

జీర్ణ మన్నం ప్రశంసన్తి భార్యాం చ గతయౌవనామ్,
శూరం విజితసంగ్రామం గతపారం తపస్వినమ్. 69

---

66. ఆగమయతి-తెచ్చును.

69. జీర్ణమన్నం ప్రశంసన్తి-తిన్నపిదప చక్కగా జీర్ణమైనదే సరియగు అన్నమని తాత్పర్యము. భార్యాం చ గతయౌవనామ్-మంచి వయసులో శీలము కాపాడుకొనుట మిక్కిలి కష్టము. అట్లు శీలము పరిరక్షించుకొనుచు యౌవనము దాటిన అలివ ఉత్తమురాలని ఫలితార్థము; గతపారమ్-ఒడ్డు చేరినవానిని-తపస్సు ఏ లక్ష్యముతో చేయునో ఆ లక్ష్యము సిద్ధించినవానిని అని తాత్పర్యము.

అరగిన అన్నమును కొనియాడుదురు. పరువముపోయిన పెండ్లమును మెత్తురు. యుద్ధమున గెలుపొందిన వీరుని ప్రశంసింతురు. తత్త్వము పొందిన తాపసుని అభినందింతురు.

ధనే నాధర్మలబ్ధేన యచ్ఛిద్ర మపిధీయతే,
అసంవృతం తద్భవతి తతోఽన్య దవదీర్యతే. 70

ధర్మముకాని మార్గమున పొందిన ధనముతో కప్పిపుచ్చిన లోసుగు దాగనే దాగదు. దానివలన తక్కినదియు చెల్లచెదరగును.

గురు రాత్మవతాం శాస్తా శాస్తా రాజా దురాత్మనామ్,
అథ ప్రచ్ఛన్నపాపానాం శాస్తా వైవస్వతో యమః. 71

హృదయము అదుపున నున్నవారికి గురువు శాసించువాడు. చెడుబుద్ధి గలవారిని రాజు శిక్షించువాడు. గుట్టుగా పాపముల నాచరించువారిని శిక్షించువాడు సూర్యుని కొడుకగు యముడు.

ఋషీణాం చ నదీనాం చ కులానాం చ మహాత్మనామ్,
ప్రభవో నాధిగన్తవ్యః స్త్రీణాం దుశ్చరితస్య చ. 72

ఋషులయు, నదులయు, కులములయు, మహాత్ములయు, స్త్రీల చెడు నడవడియొక్కయు మహిమ తెలిసికొన శక్యముకానిది.

ద్విజాతిపూజాభిరతో దాతా జ్ఞాతిషు చార్జవీ,
క్షత్రియః శీలభాగ్ రాజం శ్చిరం పాలయతే మహీమ్. 73

ద్విజన్ములను మన్నించుటలో చక్కని ప్రీతి గలవాడు, దాత, కులము వారి విషయమున వంచనలేనివాడు, చక్కని శీలము గలవాడు అగు క్షత్రియుడు రాజా! భూమిని బహుకాల మేలును.

---

70. అపిధీయతే-కప్పబడును-నీ కొడుకులు పరిపాక సుఖమగు పనిని చేయుట లేదు-న్యాయము తప్పిన మార్గమున సుఖము పొందగోరుచున్నారు. ఇది విపరీతమని భావము.

71. ఆత్మవతామ్-చిత్తమును గెలిచినవారికి; మనసు నదుపున నుంచుకొను వారికి; దుర్యోధనుడు ప్రచ్ఛన్నముగా పాపము చేయువాడు - వానికి శాసకుడు యముడే-అనగా తప్పక నశించును-అని సూచన.

72. ప్రభవః-పుట్టుక, మహిమ అనియు.

73. ఆర్జవీ - కపటస్వభావము లేనివాడు; దుర్యోధనుడు జ్ఞాతులవిషయమున కపటి అని భావము.

సువర్ణపుష్పాం పృథివీం చిన్వన్తి పురుషాస్త్రయః,
శూరశ్చ కృతవిద్యశ్చ యశ్చ జానాతి సేవితుమ్. 74

శూరుడు, విద్యలను చక్కగా నేర్చినవాడు, సేవించుట యెట్లో యెఱిగినవాడు అను నీ మూవురు పురుషులు భూమినుండి బంగారుపూవులను ప్రోగుచేసికొందురు.

బుద్ధిశ్రేష్ఠాని కర్మాణి బాహుమధ్యాని భారత!,
తాని జఙ్ఘాజఘన్యాని భారప్రత్యవరాణి చ. 75

నరులు చేయు పనులు నాలుగు విధములు. బుద్ధితో చేయునవి శ్రేష్ఠములు. చేతుల బలముతో సాధించునవి మధ్యములు. పిక్కలతో చేయునవి నీచములు. తలకు బరువగునవి మరియు నీచములు.

దుర్యోధనేఽథ శకునౌ మూఢే దుఃశాసనే తథా,
కర్ణే చైశ్వర్య మాధాయ కథం త్వం భూతి మిచ్ఛసి. 76

దుర్యోధనుడు, శకుని, మూఢుడగు దుశ్శాసనుడు, కర్ణుడు అను వీరియందు సంపదను బెట్టి నీవు ఎట్లు మంగళమును కోరుదువు.

సర్వై ర్గుణై రుపేతాస్తు పాణ్డవా భరతర్షభ
పితృవ త్త్వయి వర్తన్తే తేషు వర్తస్వ పుత్రవత్ 77

భరతవరేణ్యా! పాండవులు సద్గుణములన్నియు కలవారు. నీయందు తమ తండ్రియందువలె ప్రవర్తింతురు. నీవు వారియందు కొడుకులందువలె ప్రవర్తింపుము.

ఇతి శ్రీమహాభారతే ఉద్యోగపర్వణి ప్రజాగరపర్వణి
విదురహితవాక్యే పఞ్చత్రింశోఽధ్యాయః.

ఇది శ్రీమహాభారతము ఉద్యోగపర్వమున ప్రజాగరపర్వమున
విదురుని హితవాక్యముగల ముప్పదియైదవ అధ్యాయము.

---

74. సువర్ణపుష్పామ్-బంగారుపూవులు గలదానిని;
75. బుద్ధిశ్రేష్ఠాని-బుద్ధిసాధనముగాగల పనులు శ్రేష్ఠములు; బాహుమధ్యాని-భుజబలముతో సాధించునవి మధ్యమజాతివి. జఙ్ఘాజఘన్యాని - పిక్కలు దాచుకొనదగినవి కనుక కపటపు పనులు అను నర్థము సిద్ధించును; అట్టివి నీచములు; భారప్రత్యవరాణి-తలకు బరువుచే టగునవి అతినీచములు.
76. పైశ్లోకమున చెప్పిన తుదిరెండువిధముల పనులు దుర్యోధనాదులందు గలవని వారిని నమ్ముకొనుటవలన నీసంపదకు చేటు మూడుననియు భావము.

## అథ షట్త్రింశోఽధ్యాయః - ముప్పది ఆరవ అధ్యాయము

దత్తాత్రేయ సాధ్యదేవ సంవాద ముపస్థాయ మహాకులీనానాం లక్షణ
ముపవర్ణయతా విదురేణ ధృతరాష్ట్రం ప్రత్యుపదేశః -

దత్తాత్రేయుడు సాధ్యదేవుల సంవాదమును వివరించి మహాకులమువారి లక్షణములు వర్ణించుచు విదురుడు ధృతరాష్ట్రునకు ఉపదేశ మొనరించుట.

విదుర ఉవాచ - విదురు డిట్లు చెప్పెను.

అత్రైవోదాహర న్తీమ మితిహాసం పురాతనమ్,
ఆత్రేయస్య చ సంవాదం సాధ్యానాం చేతి నః శ్రుతమ్. 1

ఈ సందర్భమున పురాతనమైన ఈ ఇతిహాసమును ఉదాహరింతురు. ఇది ఆత్రేయునకు సాధ్యులకు నడుమ జరిగిన సంవాదమని మేము విని యుంటిమి.

చర న్తం హంసరూపేణ మహర్షిం సంశితవ్రతమ్,
సాధ్యా దేవా మహాప్రాజ్ఞం పర్యపృచ్ఛ న్త వై పురా. 2

మును వొకనాడు దత్తాత్రేయముని గొప్ప నిష్ఠకలవాడై సన్యాసిరూపమున తిరుగుచుండగా సాధ్యులను దేవులు గొప్ప ప్రజ్ఞగల ఆ మహర్షిని ఇట్లు ప్రశ్నచేసిరి.

సాధ్యా ఊచుః-సాధ్యు లిట్లు పలికిరి.

సాధ్యా దేవా వయ మేతే మహర్షే
దృష్ట్వా భవ న్తం న శక్ను మోఽనుమాతుమ్,
శ్రుతేన ధీరో బుద్ధిమాం స్త్వం మతో నః
కావ్యాం వాచం వక్తు మర్హ స్యుదారామ్. 3

---

2. హంసరూపేణ - పరివ్రాజకరూపముతో; సన్యాసిగా తిరుగుచున్నపు డని భావము.

3. అనుమాతుమ్ - గుర్తునుబట్టి యెఱుగుటకు; కావ్యామ్, వాచమ్ - ఎఱిగిన వాఁడు పలుకు పలుకును,

మహర్షీ! ఈ మేము సాధ్యులను పేరుగల దేవజాతివారము. నిన్ను చూచి నీ స్వరూపమును గుర్తింపజాలకున్నాము. శాస్త్రబలము, బుద్ధిబలము, ప్రజ్ఞాబలము కలవాడ వనిపించుచున్నది. శ్రేష్ఠమగు పాండిత్యపు మాట పలుకగలవు.

హంస ఉవాచ-సన్యాసి యిట్లు పలికెను.

ఏతత్కార్య మమరాః సంశ్రుతం మే
ధృతిః శమః సత్యధర్మానువృత్తిః,
గ్రన్థిం వినీయ హృదయస్య సర్వం
ప్రియాప్రియే చాత్మసమం నయీత. 4

అమరులారా! చేయవలసిన దిది యని నేను గురువులవలన వింటిని. ధృతి, శమము, సత్యధర్మములను విడువక ఆచరించుట, హృదయపుముడి నంతటిని వీనితో విప్పుకొని ప్రియమును, అప్రియమును ఆత్మకు సమానముగా పొందింపవలయును.

ఆక్రుశ్యమానో నాక్రోశే న్మన్యురేవ తితిక్షతః,
ఆక్రోష్టారం నిర్దహతి సుకృతం చాస్య విన్దతి. 5

---

4. మే సంశ్రుతమ్ - గురువులవలన నేను వింటినని భావము; ధృతిః - దుఃఖముల దెబ్బ తగిలినను చెదరకుండుట; శమః - ఇంద్రియములన్నింటిని గెలుచుట; సత్యధర్మ, అనువృత్తిః - బ్రహ్మమును పొందించు ధారణ, ధ్యానము, సమాధి అనువానిని వదలక ఆచరించుట; గ్రన్థిమ్ - ముడిని - చేతన పదార్థ మేదో జడ మేదో తెలియక, ఆత్మ మేదో, అంతఃకరణ మేదో తెలియక అదియే యిదిగా భావించుటవలన నైన అజ్ఞానపు ముడిని-; వినీయ-విప్పుకొని; - ఆపై జంటలను వేరువేరుగా ఎఱుగుటయే ముడి విప్పుకొనుట; ప్రియ - అప్రియే - సుఖదుఃఖములను; ఆత్మసమమ్ - ఆత్మతో సమమైనవానినిగా; నయీత - పొందింపవలయును.

5. ఆక్రుశ్యమానః- తిట్టబడుచున్నవాడై: న ఆక్రోశేత్-తిట్టరాదు; తితిక్షతః- సహించువాని; మన్యుః, ఏవ - కోపమే; ఆక్రోష్టారం - తిట్టువానిని; నిర్దహతి - కాల్చివేయును.

మానవుడు తన్ను ఇతరుడు తిట్టుచున్నను తిరిగి శపింపరాదు. దానిని సహించిన వానికోపమే తిట్టువానిని కాల్చివేయును. మరియు తిట్టు వాని పుణ్యము సహించినవానిని చేరును.

నాక్రోశీ స్యా న్నావమానీ పరస్య
మిత్రద్రోహీ నోత నీచోపసేవీ,
న చాభిమానీ న చ హీనవృత్తో
రూక్షాం వాచం రుషతీం వర్జయీత. 6

ఇతరుని నిందింపరాదు. అవమానింపరాదు. మిత్రునకు ద్రోహము చేయరాదు. తన్ను గొప్పవాడని భావించుకొనరాదు. నీచమైన నడవడి కూడదు. క్రోధముతో కూడిన పరుసపుమాటను వదలవలయును.

మర్మాణ్యస్థీని హృదయం తథాసూన్
రూక్షా వాచో నిర్దహ న్తీహ పుంసామ్,
తస్మా ద్వాచ ముషతీం రూక్షరూపాం
ధర్మారామో నిత్యశో వర్జయీత. 7

పరుషపు పలుకులు మానవుల ఆయువుపట్టులను, ఎముకలను, గుండెను, ప్రాణములను కాల్చివేయును. కావున ధర్మమునకు నెలవైనవాడు పరుషమై కాల్చివేయు మాటను, క్షణమైన ఏమరక వదలవలయును.

అరుంతుదం పరుషం రూక్షవాచం
వాక్కణ్టకై ర్వితుద న్తం మనుష్యాన్,
విద్యా దలక్ష్మీకతమం జనానాం
ముఖే నిబద్ధాం నిరృతిం వై వహ న్తమ్. 8

---

6. రుషతీమ్ - రోషముకల, ఉషతీమ్ అని పాఠాంతరము - అప్పుడు కాల్చుదానిని అని యర్థము.

8. అరుంతుదమ్- పుండును కెలికినట్లు పీడనొందిన వానిని మఱియు పీడించు వానిని; రూక్షవాచమ్- కారులు కూయువానిని; వాక్కణ్టకైః-పలుకు లనెడు ములుకులతో; వితుద న్తమ్ - పొడుచువానిని; నిరృతిమ్-దరిద్ర దేవతను లేక మృత్యువును.

పుండును కెలికినట్లు నొప్పించువాడును, కఠినచిత్తుడును, ములుకుల వంటి పలుకులు కలవాడును, పలుకుల ములుకులతో జనులను హింసించువాడును నగు నరుని దరిద్రపుగొట్టు వారిలో తలదన్నినవానినిగా నెరుగవలయును. వాడు మొగమున మిత్తిని కట్టుకొని మోయుచుండును.

పరశ్చే దేన మభివిధ్యేత బాణై
ర్భృశం సుతీక్ష్ణై రనలార్కదీప్తైః,
స విధ్యమానోఽప్యతిదహ్యమానో
విద్యాత్ కవిః సుకృతం మే దధాతి. 9

పరుడు తన్ను నిప్పువలె సూర్యునివలె మండుచున్న మిక్కిలి వాడియగు పలుకుల ములుకులతో ఒడలెల్ల నొప్పించుచున్నను, తాను దెబ్బలు తినుచు, కాలి పోవుచున్నప్పటికిని, వాడు తన పున్నెమును పండించుచున్నాడని పండితుడు భావించును.

యది సన్తం సేవతి యద్యసన్తం
తపస్వినం యది వా స్తేన మేవ,
వాసో యథా రఙ్గవశం ప్రయాతి
తథా స తేషాం వశ మభ్యుపైతి. 10

మనుజుడు సజ్జనుని, దుర్జనుని, తాపసుని, దొంగను - ఇట్లు ఏవిధము వానిని అంటిపెట్టుకొని యుండునో, అట్టివానికి గుడ్డకు రంగంటినట్లు, వశమై పోవును.

---

9. కవిః - లోకతత్త్వ మెరిగిన ప్రజ్ఞావంతుడు; మే, సుకృతమ్ - నాపుణ్యమును; దధాతి - పండించుచున్నాడు, (ఇతి - అని) విద్యాత్ - ఎరుగును - భావించును.

10. నీకొడుకులు కాలుకూతలు కూయుచుందురు. వారికి వశుడవై నీవును అట్టివాడవే యగుదువు అను భావముతో నీశ్లోకము చెప్పుచున్నాడు. గుడ్డకు సహజముగా నే రంగును ఉండదు. ఏరంగు పులిమిన ఆరంగే దాని దగును. అట్లే ఎట్టివారిని సేవించిన అట్టివా డగునని భావము.

అతివాదం న ప్రవదే న్న వాదయే
　　ద్యోఽనాహతః ప్రతిహన్యా న్న ఘాతయేత్,
హన్తుం చ యో నేచ్ఛతి పాతకం వై
　　తస్మై దేవాః స్పృహయ న్త్యాగతాయ. 11

చొల్లువాగుడు వాగరాదు. వాగింపరాదు. ఆవలివాడు కొట్టక కొట్టరాదు. కొట్టింపరాదు. దెబ్బకొట్టి పాపము చేసిన వానినికూడ కొట్టగోరనివానిని దేవతలు కూడ ఇతడు మనకడ కెన్నడు వచ్చునా అని ప్రేమతో ఎదురుచూతురు.

అవ్యాహృతం వ్యాహృతాచ్ఛ్రేయ ఆహుః
　　సత్యం వదేద్ వ్యాహృతం తద్ద్వితీయమ్,
ప్రియం వదేద్ వ్యాహృతం త త్తృతీయం
　　ధర్మ్యం వదే ద్వ్యాహృతం తచ్చతుర్థమ్. 12

మాటాడుటకంటె మౌనము మేలందురు. మాటాడినది సత్యమే యగుట రెండవపద్ధతి. సత్యమై ప్రియమైనది పలుకుట మూడవపద్ధతి. సత్యము, ప్రియము నైనది ధర్మమును వీడనిదగుట నాలుగవవిధము.

యాదృశైః సంనివిశతే యాదృశాం శ్చోప సేవతే,
యాదృ గిచ్ఛేచ్చ భవితుం తాదృగ్భవతి పూరుషః. 13

మనుజుడు ఎట్టివారితో సహవాసము చేయునో, ఎట్టివారిని సేవించునో, ఎట్టివాడు కాగోరునో యట్టివా డగును.

---

11. అతివాదమ్ - మేరమీరి పలుకుట, పనికిమాలిన పలుకులు పలుకుట; అనాహతః - ఇతరులచే కొట్టబడక; తస్మై... ఆగతాయ - ఎంతో పుణ్యము చేసినవారు దేవతలు. వారు ఆతనిరాకకు అభిలషింతు రనగా నెంత పుణ్యాత్ముడో అని భావము.

12. అవ్యాహృతమ్ - పలుకకుండుట - మౌనము. మౌనము కంటె సత్య వచనము, అది ప్రియవచన మగుట; అట్టిది ధర్మబద్ధ మగుట మిక్కిలి శ్రేయస్కరమని తాత్పర్యము.

13. కావున, నీవు సజ్జనులతో సంగము పొందుట శ్రేయమని ధృతరాష్ట్రునకు హితబోధ.

యతో యతో నివర్తతే తత స్తతో విముచ్యతే,
నివర్తనాద్ధి సర్వతో న వేత్తి దుఃఖ మణ్వపి. 14

మనుజుడు దేనిదేనినుండి మరలునో దానిదానినుండి విముక్తు డగును. అన్నింటినుండి మరలుటవలననే కదా అణుమాత్రము దుఃఖ మెరుగకుండును.

న జీయతే చాను జిగీషతేఽన్యాన్
న వైరకృ చ్చాప్రతిఘాతకశ్చ,
నిన్దాప్రశంసాసు సమస్వభావో
న శోచతే హృష్యతి నైవ చాయమ్. 15

తానై ఓడడు. ఇతరులను గెలువగోరడు. పగ పెట్టుకొనడు. పగను త్రిప్పికొట్టడు. నిందలయందును, పొగడ్తలయందును సమమగు స్వభావముతో నుండును. అట్టి నరుడు శోక మందడు. సంతోషమును పొందడు.

భావ మిచ్ఛతి సర్వస్య నాభావే కురుతే మనః,
సత్యవాదీ మృదు ర్దాన్తో యః స ఉత్తమపూరుషః. 16

ఎల్లవానికి మంగళమునే కోరును. అమంగళమునందు మనసు పెట్టడు. నిజమే పలుకును. మెత్తగా నుండును. ఇంద్రియములపై నదుపు గలిగి యుండును. అట్టివాడు ఉత్తమపురుషుడు.

నానర్థకం సాన్త్వయతి ప్రతిజ్ఞాయ దదాతి చ,
రన్ధ్రం పరస్య జానాతి యః స మధ్యమపూరుషః 17

---

14. కలలో బాహ్యవిషయములనుండి మరలుటవలన బాహ్యదుఃఖమునుండి విడుదల కలిగినది. మెలకువలో స్వప్నసుఖాదులనుండి విడుదల కలిగినది. గాఢనిద్రలో, సమాధిలో అన్నింటి సంగము వదలుచున్నది. కాన దుఃఖలేశముకూడ కలుగుటలేదు. కావున నివృత్తియే పరమసుఖమని తాత్పర్యము. నీవు దాని నవలంబింపవలయునని హితబోధ.

15. ఇట్టిస్థితిలో పురుషునకు దుఃఖమనునదియే లేదని తాత్పర్యము.

16. భావమ్-శుభము; అభావే-అమంగళమునందు.

17. అనర్థకమ్-పనికిమాలినది; న సాన్త్వయతి-సాంత్వనమనగా ఒకదానికై పట్టుదలతో పెనగులాడుట-అది-చేయడు.

పనికిమాలినదానిని పట్టి త్రేండు. ఇత్తునని చెప్పినపిదప తప్పక ఇచ్చును. ఇతరుని దోష మెరిగియుండును. అట్టివాడు మధ్యముడు.

దుఃశాసన స్తూపహతోఽభిశస్తో
నావర్తతే మన్యువశాత్ కృతఘ్నః,
న కస్యచి న్మిత్ర మథో దురాత్మా
కలాశ్చైతా అధమస్యేహ పుంసః. 18

దుశ్శాసను డన్ననో చావుదెబ్బలు తినెను. ఆతనియొడ లంతయు కుళ్ళబొడిచిరి. అయినను స్వభావమగు కోపమునుండి మరలడు. చేసిన మేలు గుర్తింపడు. ఆ దురాత్ముడు ఒక్కనికిని మిత్రుడు కాడు. అధముడగు నరుని చిత్తవృత్తు లిట్లుండును.

న శ్రద్ధధాతి కల్యాణం పరేభ్యోఽప్యాత్మశంకితః,
నిరాకరోతి మిత్రాణి యో వై సోఽధమపూరుషః. 19

తనపై తనకే నమ్మకము లేనివాడై పెద్దవారు బోధించు శుభములను మనసున పెట్టడు. మిత్రులను నిరాకరించును. అట్టివాడు అధమపురుషుడు.

ఉత్తమానేవ సేవేత ప్రాప్తకాలే తు మధ్యమాన్,
అధమాం స్తు న సేవేత య ఇచ్ఛే ద్భూతి మాత్మనః. 20

---

18. దుశ్శాసను దనగా తిరుగులేని ఆజ్ఞ గలవాడు అను నర్థమునుబట్టి దుర్యోధనునే యిట గ్రహించుట యుక్తము. ఉపహతః-ఘోషయాత్ర సందర్భమున గంధర్వులచేత చావుదెబ్బలు తినెను! అభిశస్తః - శస్త్రములచేత నొడలెల్ల చీలినవా డాయెను; మన్యువశాత్ న నివర్తతే-క్రోధముపట్టు నుండి మరలడు-స్వభావమున మార్పురాలేదని తాత్పర్యము. కృతఘ్నః- ఆసమయమున పాండవులు గంధర్వులనుండి తన్ను రక్షించిన మేలును గుర్తింపకున్నాడు. పైగా వారిని సాధింప నెంచుచున్నాడు. ఏతాః, కలాః - ఇవి (అధమపురుషుని) చిత్తవికారములు;

19. ఆత్మశంకితః-తనయందు తనకే నమ్మకములేనివాడు; పరేభ్యః - పెద్దల వలన; కల్యాణమ్ - శుభమైనదానిని; న శ్రద్ధధాతి - విశ్వసింపడు;

తనశుభము కోరు మనుజుడు ఉత్తములనే సేవింపవలయును. గతిలేని వేళ మధ్యములను సేవింపనగును. అధములను మాత్ర మెన్నటికిని సేవింపరాదు.

ప్రాప్నోతి వై విత్త మసద్బలేన
నిత్యోత్థానాత్ ప్రజ్ఞయా పౌరుషేణ,
న త్వేవ సమ్యగ్ లభతే ప్రశంసాం
న వృత్త మాప్నోతి మహాకులానామ్. 21

మనుజుడు చెడుబలముచేతను, నిరంతరప్రయత్నమువలనను, ప్రజ్ఞచేతను ధనము పొందవచ్చును. కాని మంచిపొగడ్త నందజాలడు. గొప్పవారి ప్రవర్తనను పొందజాలడు.

ధృతరాష్ట్ర ఉవాచ-ధృతరాష్ట్రు డిట్లు పలికెను.

మహాకులేభ్యః స్పృహయన్తి దేవా
ధర్మార్థనిత్యాశ్చ బహుశ్రుతాశ్చ,
పృచ్ఛామి త్వాం విదుర ప్రశ్న మేతం
భవన్తి వై కాని మహాకులాని. 22

ధర్మము, అర్థము వీడనివారు, శాస్త్రము లన్నింటిని బాగుగా నేర్చినవారు నగు దేవతలు గొప్పకులమువారిని కాంక్షింతురట. విదురా! నిన్నీ ప్రశ్న నడుగుదును. గొప్పకులమువా రనగా నెట్టివారు?

విదుర ఉవాచ-విదురు డిట్లు చెప్పెను.

తపో దమో బ్రహ్మ విత్తం వితానాః
పుణ్యా వివాహాః సతతాన్నదానమ్,
యేష్వేవైతే సప్త గుణా వసన్తి
సమ్యగ్వృత్తా స్తాని మహాకులాని. 23

---

21. నిత్యోద్యోగము, ప్రజ్ఞ, పౌరుషము మున్నగువానిచేత ధనము సంపాదించిన విధముగా సజ్జను డన్న ప్రశంస, గొప్పవారి ప్రవృత్తివంటి ప్రవృత్తియు పొందుట తేలిక కాదని తాత్పర్యము.
22. ధర్మ, అర్థనిత్యాః-ధర్మము, అర్థము ఎవరిని క్షణమేని వదలకుండునో వారు; బహుశ్రుతాః-గొప్ప పాండిత్యము కలవారు;

తపస్సు, ఇంద్రియనిగ్రహము, బ్రాహ్మణధనము, యజ్ఞకర్మములు, పుణ్యములగు వివాహములు, ఎడతెగని అన్నదానము, సత్ప్రవర్తన అను నీ యేడుగుణములు ఎవరియందు నెలకొనియుండునో వారు గొప్పకులమువారు.

యేషాం న వృత్తం వ్యథతే న యోని -
శ్చిత్తప్రసాదేన చరన్తి ధర్మమ్,
యే కీర్తి మిచ్ఛన్తి కులే విశిష్టాం
త్యక్తానృతా స్తాని మహాకులాని. 24

ఎవరి నడవడి స్థిరముగా నుండునో, ఎవరి తల్లిదండ్రులు తమవలన వ్యథనొందరో, కల్మషములేని హృదయముతో ఎవరు ధర్మము నాచరింతురో ఎవరు కులమునందు విశిష్టమగు కీర్తిని అపేక్షింతురో, ఎవరు అనృతమార్గమును పరిత్యజింతురో అట్టివారు మహాత్ములజాతికి చెందినవారు.

అనిజ్యయా కువివాహై ర్వేద స్యోత్సాదనేన చ,
కులా న్యకులతాం యాన్తి ధర్మస్యాతిక్రమేణ చ. 25

యజ్ఞములు చేయకుండుట, చెడువివాహములు, వేదములను వదలి పెట్టుట, ధర్మము తప్పి నడచుకొనుట అనువానిచేత కులములకు చేటు వాటిల్లును.

దేవద్రవ్యవినాశేన బ్రహ్మస్వహరణేన చ,
కులా న్యకులతాం యాన్తి బ్రాహ్మణాతిక్రమేణ చ. 26

దేవతలసొమ్ము పాడుచేయుట, బ్రహ్మమెఱిగినవాని సొమ్మును గుంజుకొనుట, బ్రహ్మమెఱినవానివిషయమున హద్దుమీరుట అనువానిచే కులములు చెడును.

బ్రాహ్మణానాం పరిభవాత్ పరీవాదాచ్చ భారత,
కులా న్యకులతాం యాన్తి న్యాసాపహరణేన చ. 27

---

24. న వ్యథతే-చలింపదో; యోనిః-తల్లిదండ్రులు.

27. పరిభవాత్-కొట్టుట మున్నగుదానివలన; పరీవాదాత్ - నిందించుటవలన; న్యాస-అపహరణేన - కాపాడుకొనుటకై భద్రత ఉన్నచోట ఉంచిన సొమ్మును న్యాస మందురు-దానిని తొలగించుటచేత.

బ్రాహ్మణులను కొట్టుట, నిందించుట రక్షింపుమని కోరి యిచ్చినదానిని దొంగిలించుట-అనువానివలన కులములకు చేటు మూడును.

కులాని సముపేతాని గోభిః పురుషతోఽర్థతః,
కులసంఖ్యాం న గచ్ఛన్తి యాని హీనాని వృత్తతః. 28

విద్యలచేతను, సత్పురుషులవలనను, ధనములవలనను, కులమను పేరు సిద్ధించును. చక్కని నడవడి లేకున్నచో వానికి కులమను పేరు సిద్ధింపదు.

వృత్తత స్త్వవిహీనాని కులా న్యల్పధనాన్యపి,
కులసంఖ్యాం చ గచ్ఛన్తి కర్షన్తి చ మహద్యశః. 29

ధనమంతగా లేకున్నను మంచినడవడిని వదలనివైనచో కులములు, కులగౌరవమును పొందును. గొప్పకీర్తినికూడ సాధించును.

వృత్తం యత్నేన సంరక్షే ద్విత్తమేతి చ యాతి చ,
అక్షీణో విత్తతః క్షీణో వృత్తతస్తు హతో హతః. 30

నడవడిని యత్నముతో రక్షించుకొనవలయును. ధనము వచ్చును. పోవును. ధనము పోయినవాడు క్షీణుడుకాడు. నడవడి విషయమున భ్రష్టుడైనవాడు సర్వవిధముల చచ్చినవాడే.

గోభిః పశుభి రశ్వైశ్చ కృష్యా చ సుసమృద్ధయా,
కులాని న ప్రరోహన్తి యాని హీనాని వృత్తతః. 31

నడవడి చెడిన కులములు విద్యలతోగాని, పశువులతోగాని, గుఱ్ఱములతోకాని పుష్కలమైన వ్యవసాయముతోగాని మరల మొలకెత్తవు.

---

28. గోభిః-వాక్కులతో-విద్యలతో నని తాత్పర్యము; పురుషతః-సత్పురుషులవలన; అర్థతః-ధనములచేత; కులసంఖ్యామ్-కులములందు-సాటివారిలో-ఎన్నిక; సముపేతాని-కలవి యగును.

30. వృత్తతః-ధర్మమువలన; కర్షన్తి-సంపాదించును.

31. గోభిః-విద్యలచేత నని తాత్పర్యము; న ప్రరోహన్తి-మొలకెత్తవు. అనగా వానికి మరల అభ్యుదయము లేదని తాత్పర్యము.

మా నః కులే వైరకృత్ కశ్చిదస్తు
రాజాఽమాత్యో మా పరస్వాపహారీ,
మిత్రద్రోహీ నైకృతికోఽనృతీ వా
పూర్వాశీ వా పితృదేవాతిథిభ్యః. 32

మన కులమున పగ రేపువాడు, రాజో మంత్రియో అయి పరులసొమ్మును మ్రింగువాడు, మిత్రులకు ద్రోహము చేయువాడు, వంచకుడు, 'అబద్ధాల కోరు' పితృదేవతలకు, దేవతలకు, అతిథులకు పెట్టక ముందుగా అన్నము తినువాడు- ఒక్కడును లేకుండుగాక!

యశ్చ నో బ్రాహ్మణాన్ హన్యాద్యశ్చ నో బ్రాహ్మణాన్ ద్విషేత్,
న నః స సమితిం గచ్ఛేద్యశ్చ నో నిర్వపేత్ కృషిమ్. 33

మనకు సంబంధించినవాడై యుండి ఎవడు బ్రాహ్మణులను హింసించునో, ద్వేషించునో, మన కృషిని ధ్వంసము చేయునో వాడు మనసమాజమున చేర కుండుగాక!

తృణాని భూమి రుదకం వాక్ చతుర్థీ చ సూనృతా,
సతా మేతాని గేహేషు నోచ్ఛిద్యన్తే కదాచన. 34

గడ్డిపరకలు, నేల, నీరు, నిజము తప్పనిమాట అను నీ నాల్గును సజ్జనుల యిండ్లలో ఎన్నటికిని ఎడతెగక నిలుచును.

శ్రద్ధయా పరయా రాజ న్నుపనీతాని సత్కృతిమ్,
ప్రవృత్తాని మహాప్రాజ్ఞ ధర్మిణాం పుణ్యకర్మిణామ్. 35

---

32. రాజాఽమాత్యో... పరుల సొమ్ము నపహరించి రాజో, మంత్రియో యైనవాడును-అను నర్థమును కూడ సంభావింపనగును; నైకృతికః- మోసగించువాడు; అనృతీ-అబద్ధము లాడువాడు.

34. తృణాదులు అతిథులు మున్నగువారి సత్కారము కొరకని భావము; న ఉచ్ఛిద్యన్తే-ఎడతెగవు. అనగా అతిథులను ఎల్లవేళల చేరుచునే యుండు నని తాత్పర్యము.

35. సత్కృతిమ్-సత్కారము చేయుటకు;

ధర్మము తప్పని పుణ్యకర్మల నదవడు మిక్కిలి శ్రద్ధతో సత్కారము చేయుటకే సాధించినట్టివి.

సూక్ష్మోఽపి భారం నృపతే స్యన్దనో వై
శక్తో వోఢుం న తథాన్యే మహీజాః,
ఏవం యుక్తా భారసహా భవన్తి
మహాకులీనా న తథాఽన్యే మనుష్యాః. 36

రథము చిన్నదైనను పెద్దబరువు మోయజాలును. కాని పెద్దవృక్షము లట్లు మోయజాలవు. అట్లే మహాకులమున పుట్టినవారు బెదరక బెదరక ఎట్టి బరువునైన మోయగలుగుదురు. అట్లితరజనులు మోయజాలరు.

న తన్మిత్రం యస్య కోపా ద్బిభేతి
యద్వా మిత్రం శఙ్కితే నోపచర్యమ్,
యస్మిన్ మిత్రే పితరీ వాశ్వసీత
తద్వై మిత్రం సఙ్గతా నీతరాణి. 37

తనకోపమువలన నితరుని భయపెట్టువాడు మిత్రుడు కాడు. అనుమానముతో సేవించువాడును మిత్రుడు కాడు. తండ్రియందువలె నమ్మక ముంచదగినవాడు మిత్రుడు. తక్కినవారు బంధుగులవంటివారు.

యః కశ్చిద ప్యసంబద్ధో మిత్రభావేన వర్తతే,
స ఏవ బన్ధు స్తన్మిత్రం సా గతి స్తత్పరాయణమ్. 38

---

36. యుక్తాః-కలతపాటు లేనివారై; భారసహాః-బరువును భరించువారు. ఇం బరువనగా బాధ్యత యనియు భావింపనగును.

37. శఙ్కితేన - నీవు నిత్యశంకితుడవు. ఎల్లప్పుడు నీహితమునే కోరు నాయందుకూడ మిత్రుడను భావము నీకు లేదని అధిక్షేపణ. సఙ్గతాని - బంధుత్వము మాత్రము గలవారు. రక్తసంబంధముచే నగు చుట్టరికము సర్వదా మేలుచేయునదియే కాకపోవచ్చును.

38. అసంబద్ధః-రక్తసంబంధమునుబట్టి యేర్పడు చుట్టరికము లేనివాడైనను దుర్యోధనునకు కర్ణు డట్లే అన్నియు నయ్యెనని అధిక్షేపణ.

చుట్టరికము లేకున్నను ఎవడైన మిత్రభావముతో ప్రవర్తించునేని వాడే బంధువు, వాడే మిత్రుడు, వాడే గతి, వాడే చివరిదిక్కు.

చలచిత్తస్య వై పుంసో వృద్ధా ననుపసేవతః,
పారిప్లవమతే ర్నిత్య మధ్రువో మిత్రసంగ్రహః. 39

చపలచిత్తుడు, పెద్దలను సేవింపనివాడు, బుద్ధిలో నిలుకడలేనివాడు నగు పురుషునకు మిత్రు లేర్పడినను కడదాక నిలువరు.

చలచిత్త మనాత్మాన మిన్ద్రియాణాం వశానుగమ్,
అర్థాః సమభివర్తన్తే హంసాః శుష్కం సరో యథా. 40

మనసు నిలుకడలేనివానిని, జ్ఞానము లేనివానిని, ఇంద్రియములు త్రిప్పినట్లు తిరుగువానిని సంపదలు, ఎండిన సరస్సును హంసలు పైపైని తిరిగిన విధముగా, చేరకుండును.

అకస్మాదేవ కుప్యన్తి ప్రసీద న్త్యనిమిత్తతః,
శీల మేత దసాధూనా మభ్రం పారిప్లవం యథా. 41

కారణములేకయే కోపగింతురు. కారణము లేకయే ప్రసన్నులగుదురు. గాలివాటునకు చలించు మేఘమువంటిది దుర్జనుల శీలము.

సత్కృతాశ్చ కృతార్థాశ్చ మిత్రాణాం న భవన్తి యే,
తాన్ మృతానపి క్రవ్యాదాః కృతఘ్నా న్నోపభుఞ్జతే. 42

ఒకరివలన సత్కారములు పొంది, తమపనులు నెరవేర్చుకొని, వారి మేలుకోరని కృతఘ్నులను చచ్చినపుడు క్రూరమృగములు కూడ తినవు.

---

39. పారిప్లవమతేః-నిలుకడలేని బుద్ధిగలవానియొక్క.

40. అనాత్మానమ్ - ఆత్మలేనివా డనగా ఆత్మజ్ఞానము లేనివా డను నర్థము గ్రహింపదగును; సమభివర్తన్తే - దరిదాపులలో తిరుగుచుండును కాని చేతికందవని భావము.

41. పారిప్లవమ్ - నిలుకడలేని; అభ్రమ్ - మేఘము.

42. మిత్రాణామ్ - మిత్రుల హిత విషయమున అని భావము.

అర్చయేదేవ మిత్రాణి సతి వాఽసతి వా ధనే,
నానర్థయన్ ప్రజానాతి మిత్రాణాం సారఫల్గుతామ్. 43

ధనమున్నను లేకున్నను మిత్రులను ఆదరింపనేవలయును. యాచింపని వాడే మిత్రుల సారమును, బొల్లుదనమును ఎఱుగును.

సంతాపాద్ భ్రశ్యతే రూపం సంతాపాద్ భ్రశ్యతే బలమ్,
సంతాపాద్ భ్రశ్యతే జ్ఞానం సంతాపాద్ వ్యాధి మృచ్ఛతి. 44

ఏడుపువలన రూపము చెడును. బలము తగ్గును. జ్ఞానము నశించును. రోగము ప్రబలును.

అనవాప్యం చ శోకేన శరీరం చోపతప్యతే,
అమిత్రాశ్చ ప్రహృష్యన్తి మా స్మ శోకే మనః కృథాః. 45

ఏడుపువలన రాగోరినది రాదు. పైగా శరీరము మండిపోవును. పగవారు సంతసింతురు. కనుక శోకమున మనసు పెట్టకుము.

పునర్నరో మ్రియతే జాయతే చ
పునర్నరో హీయతే వర్ధతే చ,
పునర్నరో యాచతి యాచ్యతే చ
పునర్నరః శోచతి శోచ్యతే చ. 46

నరుడు మరల మరల పుట్టును చచ్చును. హాని పొందును, వృద్ధిపొందును. బిచ్చ మెత్తును. బిచ్చ మొసగును. ఒకరికై యేడ్చును. తనకై యితరు లేడ్తురు.

సుఖం చ దుఃఖం చ భవాభవౌ చ
లాభాలాభౌ మరణం జీవితం చ,

---

43. అనర్థయన్-ప్రార్థింపకున్నవాడై-అడిగినచో ఇచ్చుట వ్యాపారమువంటిది. అట్లిచ్చువాడు మిత్రుడు కాడని తాత్పర్యము.

44. సంతాపాత్ - కోరినది లభింపకపోవుటవలన కలిగెడు శోకమువలన.

45. అనవాప్యమ్ - కోరినది లభింపదు - ఏడిచినంతమాత్రమున కోరిన పదార్థము వచ్చిపడదని భావము.

46. ఏదియు నిత్యము కాదు కనుక దేనికిని ఏడువరాదని తాత్పర్యము,

పర్యాయశః సర్వ మేతే స్పృశన్తి
తస్మా ద్ధీరో న చ హృష్యే న్న శోచేత్. 47

సుఖము - దుఃఖము, లాభము - నష్టము, - చావు బ్రదుకు అనునివి యన్నియు నెల్లవారిని 'మతుల వారీగా' తాకుచుండును. కావున ధీరుడు వీనివిషయమున పొంగరాదు. క్రుంగరాదు.

చలాని హీమాని షడిన్ద్రియాణి
తేషాం యద్య ద్వర్ధతే యత్ర యత్ర,
తత స్తతః స్రవతే బుద్ధి రస్య
ఛిద్రోదకుమ్భాదివ నిత్య మమ్భః. 48

మనసును, అయిదు ఇంద్రియములును మిక్కిలి చంచలములు. వానిలో నేది యేది ఎందెందు విజృంభించునో ఆ యా దానినుండి బుద్ధి చిల్లులుగల నీటికుండనుండి నీరు ఎడతెగక కారినవిధముగా జారిపోవును.

ధృతరాష్ట్ర ఉవాచ - ధృతరాష్ట్రు డిట్లు పలికెను.

తనురుద్ధః శిఖీ రాజా మిథ్యోపచరితో మయా,
మన్దానాం మమ పుత్రాణాం యుద్ధే నా న్తం కరిష్యతి. 49

ఆ ధర్మరాజు లోలోపల కుములుచున్న నిప్పు. నేను వానిని వంచించితిని. బుద్ధిలేని నా కొడుకులను యుద్ధమున వాడు నాశనము చేయును.

---

47. సర్వమ్ - పుట్టిన ప్రతినరుని.

48. షట్-ఆరు - మనస్సుతోపాటు అయిదింద్రియములు; స్రవతే - స్వార్థము నుండి జారును. విషయసేవనమునుండియు జారును.

49. తనురుద్ధః - తను వనగా శరీరము-నిప్పునకు శరీరము కట్టె మొదలగునది. అందు, రుద్ధమనగా వెలికిరాక నిలువరింపబడినది; ఏక్షణముననైనా మంటు ఒకు సిద్ధముగా నున్నదని భావము; శిఖీ - అగ్ని;

నిత్యోద్విగ్న మిదం సర్వం నిత్యోద్విగ్న మిదం మనః,
యత్తత్పద మనుద్విగ్నం తన్మే వద మహామతే. 50

ఇది యెల్ల ఎల్లవేళల కళవళపాటు చెందుచున్నది. ఈ మనస్సును అట్లే భీతితో చికాకుపడుచున్నది. ఓ మహామతీ! కలతనొందని స్థాన మేదో నాకు బోధింపుము.

విదుర ఉవాచ - విదురు డిట్లు పలికెను.

నాన్యత్ర విద్యాతపసో ర్నాన్యత్రేన్ద్రియనిగ్రహాత్,
నాన్యత్ర లోభసంత్యాగా చ్ఛాన్తిం పశ్యామి తేఽనఘ. 51

పుణ్యాత్ముడా! విద్య, తపస్సు, ఇంద్రియనిగ్రహము, దురాశను పూర్తిగా విడనాడుట అను వానికంటె వేరైనచోట నీకు శాంతి సమకూడుట నాకు కానరాకున్నది.

బుద్ధ్యా భయం ప్రణుదతి తపసా విన్దతే మహత్,
గురుశుశ్రూషయా జ్ఞానం శాన్తిం యోగేన విన్దతి. 52

---

50. విద్యా - అధ్యయనమువలన పుట్టు జ్ఞానము, తపః - తనధర్మమును శ్రద్ధతో నాచరించుట; విద్య, తపస్సు, ఇంద్రియనిగ్రహము, లోభమును విడుచుట అనునవి శాంతిసాధనములు. అవి నీయందు లేవు కనుక నీకు ఉద్విగ్నతలేని పదము లభింపదని భావము.

52. బుద్ధ్యా - ఆత్మజ్ఞానముచేత; భయమ్ - సంసారమును; ప్రణుదతి - తొలగించుకొనును; మహత్ - గొప్పతనమును - అనగా మంచి గురువును, శాస్త్రజ్ఞానము మొదలగుదానిని; విన్దతే - పొందును; దానివలన గురుశుశ్రూషయా - గురువులను సేవించుటచేత, జ్ఞానమ్ - గ్రంథములలో చెప్పిన పరమార్థమును; విన్దతే - పొందును: యోగేన - అన్ని విధములగు మనోవికారములను నిలిపివేయుటచేత; శాన్తిమ్ - నిశ్చలస్థితిని; విన్దతి - పొందును.

52. శాంతి లభించినయెడల దానపుణ్యము, వేదపుణ్యము మొదలగునవి తుచ్ఛములుగా కన్పట్టునని భావము. దానపుణ్యవేదపుణ్యము లనగా దానాదులవలన కలుగు స్వర్గమని తాత్పర్యము.

నరుడు బుద్ధిబలముచే భయమును త్రోసివేయును. తపస్సుచేత గొప్ప స్థితి నందును. గురుపులను సేవించుటచేత జ్ఞానమును, యోగముచేత శాంతిని పొందును.

అనాశ్రితా దానపుణ్యం వేదపుణ్య మనాశ్రితాః,
రాగద్వేషవినిర్ముక్తా విచర న్తీహ మోక్షిణః. 53

దానమువలన కలిగిన పుణ్యమును, వేదమువలన కలిగిన పుణ్యమును ఆశ్రయింపక రాగము ద్వేషము అనువాని పట్టునుండి విడివడిన పుణ్యాత్ములు ఇందే ముక్తులై ఇష్టము వచ్చినట్లు తిరుగుదురు.

స్వధీతస్య సుయుద్ధస్య సుకృతస్య చ కర్మణః,
తపసశ్చ సుత ప్తస్య తస్యా న్తే సుఖ మేధతే. 54

చక్కగా నేర్చిన చదువు, చక్కగా చేసిన యుద్ధము, చక్కగా చేసిన పని, చక్కగా నిర్వహించిన తపస్సు - అనునవి అంతమైన పిదప నరుడు పరమానందము పొందును.

స్వాస్తీర్ణాని శయనాని ప్రపన్నా
న వై భిన్నా జాతు నిద్రాం లభ న్తే,
న స్త్రీషు రాజన్ రతి మాప్నువ న్తి
న మాగధైః స్తూయమానా న సూతైః. 55

భేదదృష్టిగలవారు చక్కగా పరచిన పరపులు పొందియు నిద్రను పొందనే పొందరు. స్త్రీలెందరున్నను ప్రీతినందరు. వందిమాగధులు స్తోత్రములు చేయుచున్నను తృప్తి నందరు.

---

54. తస్య - అన్తే - అది నశించినవెనుక - అనగా కర్మము నశించినపుడే జగత్కారణమును దర్శించినపుడే పరమానందము లభించునని తాత్పర్యము.

55. భిన్నాః - భేదదృష్టి గలవారు - అద్వైతభావన సిద్ధింపనివారు, లేక పగగలవారు; ద్వితీయాద్వై భయం భవతి - అని శ్రుతి. రెండవదాని వలన భయము కలుగును.

న వై భిన్నా జాతు చరన్తి ధర్మం
న వై సుఖం ప్రాప్నువన్తీహ భిన్నాః,
న వై భిన్నం గౌరవం ప్రాప్నువన్తి
న వై భిన్నాః ప్రశమం రోచయన్తి. 56

భేదభావన కలవారు ఒక్కనాటికిని ధర్మ మాచరింపరు. ఈ లోకమున సుఖమును గౌరవమును పొందరు. వారికి శాంతి రుచింపదు.

న వై తేషాం స్వదతే పథ్య ముక్తం
యోగక్షేమం కల్పతే నైవ తేషామ్,
భిన్నానాం వై మనుజేన్ద్ర పరాయణం
న విద్యతే కిఞ్చి దన్య ద్వినాశాత్. 57

వారికి హితమగు పలుకు రుచింపదు. యోగము క్షేమము వారికి లభింపవు. భేదభావన కలవారికి, రాజేంద్రా! వినాశముకంటె తుదిగతి మరి యొకటి కొంచెమేని లేదు.

సంపన్నం గోషు సంభావ్యం సంభావ్యం బ్రాహ్మణే తపః,
సంభావ్యం చాపలం స్త్రీషు సంభావ్యం జ్ఞాతితో భయమ్. 58

గోవులయందు పాడిసంపదయు, బ్రాహ్మణునియందు తపస్సును, స్త్రీల యందు చంచలత్వమును, జ్ఞాతినుండి భయమును భావింపదగినవి.

తన్తవోఽప్యాయితా నిత్యం తనవో బహులాః సమాః,
బహూన్ బహుత్వా దాయాసాన్ సహన్తీ త్యుపమా సతామ్. 59

---

57. యోగ మనగా మునుపు లభింపనిది లభించుట; క్షేమమనగా లభించినది రక్షింపబడుట; న కల్పతే-ఈరెండును వారికి దుర్లభములని తాత్పర్యము.

58. సంపన్నమ్-పాలు, నేయి మొదలగునవి సమృద్ధిగా నుండుట-అవి యవి వాని వాని సహజలక్షణములని తాత్పర్యము.

59. తన్తవః-కులమును విస్తరింపజేయువారు; ఆప్యాయితాః-నీ చేతనే పెంప బడినవారు; (పూర్వరూపసంధి ఆర్షము) తనవః-చిన్నవారు; బహుత్వాత్-బంధువులు, ఋషులు మున్నగువారు పెద్దసంఖ్యలో ఉన్న

వారు కులవిస్తారకులు. నీవే వారిని పెంచి పెద్దచేసితివి. పిన్నపాపలు. పెక్కేండ్లు ఎన్నోకష్టములను,చుట్టములు పెద్ద సంఖ్యలో ఉన్న కారణముగా, సహించుచున్నారు. కావున వారు సత్పురుషులకు ఉపమానము లగుచున్నారు.

ధూమాయన్తే వ్యపేతాని జ్వలన్తి సహితాని చ,
ధృతరాష్ట్రోల్ముకానీవ జ్ఞాతయో భరతర్షభ. 60

భారతశ్రేష్ఠా! ధృతరాష్ట్రా! జ్ఞాతులు నిప్పుకణములవలె విడివిడిగా నున్నచో పొగలు గ్రక్కుదురు. కలిసియున్నచో మండుదురు.

బ్రాహ్మణేషు చ యే శూరాః స్త్రీషు జ్ఞాతిషు గోషు చ,
వృన్తాదివ ఫలం పక్వం ధృతరాష్ట్ర పతన్తి తే. 61

బ్రాహ్మణులయందు, స్త్రీలయందు, దగ్గరచుట్టములయందు, గోవులందు పరాక్రమము చూపువారు తొడిమనుండి పండినపండు రాలినట్లు పడుదురు.

మహా నప్యేకజో వృక్షో బలవాన్ సుప్రతిష్ఠితః,
ప్రసహ్య ఏవ వాతేన సస్కన్ధో మర్దితుం క్షణాత్. 62

---

కారణమున తాము విజృంభించినచో అందరకు కీడగునను తలంపుతో; బహులాః సమాః-పెక్కేండ్లు; బహూన్ ఆయాసాన్-ఎన్నో కష్టములను; సహన్తి-సహించుచున్నారు. ఇతి-అను నీకారణముచేత;సతామ్-సత్పురుషులకు; ఉపమా-పోలిక; భవన్తి-అగుచున్నారు. సజ్జను లనగా పాండవుల వంటివారు అని లోకోక్తి ఏర్పడినదని భావము-అందువలన ఉత్తములగు పాండవులను నీవు వంచింపరాదని హెచ్చరిక.

60. లోకమున జ్ఞాతులు పాండవులవలె మంచివారు కారు. నీ అదృష్టము బాగుగా నున్నదను భావముతో ఈశ్లోకమున ఇతరజ్ఞాతుల లక్షణము చెప్పుచున్నారు. జ్ఞాతులు కలిసియున్నను, విడిగా నున్నను ప్రమాదమే యని తాత్పర్యము.

61. ఇక్కడ జ్ఞాతులను బ్రాహ్మణులతో, స్త్రీలతో, గోవులతో, కలిపి చెప్పుట వలన కలహింపగోరని జ్ఞాతునే గ్రహింపవలయును. పాండవు లట్టి వారు. వారిని చంపగోరు మీకు వినాశము తప్పదని సూచన.

62. ఏకజః-ఒంటరిదై పుట్టినది; ప్రసహ్యః-శక్యమైనది. నీవు బలవంతుడనని గర్వింపరా దని సూచన.

ఎంతబలముగల, ప్రేళ్ళు పాదుకొన్న పెనువృక్షమునైనను పెనుగాలి ఒక్కక్షణమున కాండముతోపాటు పెకలించివైచును.

అథ యే సహితా వృక్షా సంఘశః సుప్రతిష్ఠితాః,
తే హి శీఘ్రతమాన్ వాతాన్ సహన్తేఽన్యోన్యసంశ్రయాత్. 63

మూకఉమ్మడిగా కలసి గట్టిగా కుదురుకొన్న చెట్లన్ననో వడిగల పెను గాలులను, ఒకదానినొకటి అంటిపెట్టికొనియున్న కారణమున, తట్టుకొనును.

ఏవం మనుష్య మ ప్యేకం గుణైరపి సమన్వితమ్,
శక్యం ద్విషన్తో మన్యన్తే వాయు ర్ద్రుమ మివైకజమ్. 64

ఇట్లే అన్నిగుణములు గలవాని నైనను, ఒంటరియైనచో, గాలి యొంటరి చెట్టును పెకలించినట్లు పెకలింపనగునని శత్రువులు భావింతురు.

అన్యోన్యసముపష్టమ్భా దన్యోన్యాపాశ్రయేణ చ,
జ్ఞాతయః సంప్రవర్ధన్తే సరసీ వోత్పలాన్యుత. 65

ఒకరికొకరు అండగా నుండుటవలనను, ఒకరినొకరు కలిసియుండుట చేతను జ్ఞాతులు, కొలనియందలి కలువలవలె పెంపొందుదురు.

అవధ్యా బ్రాహ్మణా గావో జ్ఞాతయః శిశవః స్త్రియః,
యేషాం చాన్నాని భుఞ్జీత యే చ స్యుః శరణాగతాః. 66

బ్రహ్మవేత్తలు, గోవులు, జ్ఞాతులు, పసివాండ్రు, స్త్రీలు, అన్నము పెట్టిన వారు, శరణువేడినవారు చంపరానివారు.

న మనుష్యే గుణః కశ్చి ద్రాజన్ సధనతామృతే,
అనాతురత్వాద్ భద్రం తే మృతకల్పా హి రోగిణః. 67

ధనవంతుడగుట, రోగములేనివాడగుట అనువానికంటె మనుష్యునియందు మిన్నయగు గుణ మొక్కటియు లేదు. రోగులు చచ్చినవారితో సమానము. నీకు మేలగుగాక!

---

67. సధనతామృతే-ధనవంతుడగుటకంటె; అనాతురత్వాద్ ఋతే-రోగము లేనివా డగుటకంటె; భద్రంతే-ఇది అప్పుడైన విదురునిమాట. నీయందు బంధువుల హింసించు రోగము లేకుండుగాక! అని ఆశంస.

అవ్యాధిజం కటుకం శీర్షరోగి
పాపానుబన్ధం పరుషం తీక్ష్ణ ముష్ణమ్,
సతాం పేయం యన్న పిబన్త్యసన్తో
మన్యుం మహారాజ పిబ ప్రశామ్య. 68

మనునది, రోగమువలన పుట్టనిది, రుచింపనిది, తలభారము కలిగించునది, వెంటవెంట పాపములను పుట్టించునది, బిరుసైనది, వాడియైనది, వేడియైనది, సజ్జనులు మ్రింగగలిగినది, దుర్జనులు మ్రింగజాలనిది అగు దీనతను మహారాజా! మ్రింగుము. శాంతి నొందుము.

రోగార్దితా న ఫలా న్యాద్రియన్తే
న వై లభన్తే విషయేషు తత్త్వమ్,
దుఃఖోపేతా రోగిణో నిత్యమేవ
న బుధ్యన్తే ధనభోగా న్న సౌఖ్యమ్. 69

రోగపీడితులు ఫలముల నాదరింపరు. వారికి విషయముల తత్త్వము ఒంటబట్టదు. రోగులకు నిత్యము దుఃఖమే వారికి ధనమువలన కలుగు భోగములు, సుఖము తెలియరావు.

---

68. ధనము, ఆరోగ్యము గల నీవు గుణవంతుడవై శాంతినొందుమని చెప్పుచున్నారు. కటుకమ్-చేదుగా నుండినది;పరుషమ్-రాతివలె బిరుసెక్కినది; తీక్ష్ణమ్-వాడిగానుండి కోసివేయునది; ఉష్ణమ్-వేడిమివలన అంటరానిది; పేయమ్-మ్రింగదగినది; మన్యుం - దైన్యమును-మన్యు వనగా కోప మనియు; కాని యిచట ధృతరాష్ట్రుని ప్రకృతస్థితినిబట్టి జాలి యను నర్థము గ్రహింపదగును.

69. సంతాపమువలన వ్యాధి కలుగునని ముందు చెప్పియున్నారు. (44) కావున ఆరెంటిని ఈశ్లోకమున నిరసించుచున్నారు. ఫలాని-పుత్రులు, పశువులు మొదలగువానిని; తత్త్వమ్-ఇష్టమేదో, అనిష్టమేదో యెఱుగుట; పైత్యమువలన నాలుకకు రుచిని గుర్తించుశక్తి పోవును; భోగాన్ - స్త్రీ సమాగమాది సుఖములను; కావున నిద్రపట్టనితనమువలన రోగమును పెంచు సంతాపమును విడనాడుమని బోధ.

పురా హ్యుక్తం నాకరో స్త్వం వచో మే
ద్యూతే జితాం ద్రౌపదీం ప్రేక్ష్య రాజన్,
దుర్యోధనం వారయే త్యక్షవత్యాం
కితవత్వం పణ్డితా వర్జయన్తి. 70

జూదమున ఓడిన ద్రౌపదిని చూచి, రాజా! జూదమునుండి దుర్యోధనుని వారింపుమని నేను మున్నే చెప్పితిని. నామాట వినకుంటివి. పండితులు జూదము నందు ఆదరమును వదలివైచెదరు.

న తద్బలం యన్మృదునా విరుధ్యతే
సూక్ష్మో ధర్మ స్తరసా సేవితవ్యః,
ప్రధ్వంసినీ క్రూరసమాహితా శ్రీ-
ర్మృదుప్రౌఢా గచ్ఛతి పుత్రపౌత్రాన్. 71

మెత్తనివానితో పగగొను బలము బలముకాదు. సూక్ష్మమగు ధర్మమును అలసింపక ఆచరింపవలయును. క్రూరునియందున్న సంపద రూపుమాసిపోవును. మెత్తనివాడు ఆదరింపగా వానిపుత్రులను పౌత్రులను క్రమముగా చేరును.

ధార్తరాష్ట్రాః పాణ్డవాన్ పాలయన్తు
పాణ్డోః సుతా స్తవ పుత్రాంశ్చ పాన్తు,

---

70. కితవత్వమ్-మీకు ద్యూతప్రియత్వము కలదు కావున మీరు పండితులు గారని నిష్కర్ష.

71. మృదునా-సహనము గలవానితో; ధర్మః-ప్రకృతమున దాయవిభాగము-సంపద పంచుకొనుట అనునది; క్రూరసమాహితా-క్రూరస్వభావముగల నీపుత్రునియందు నెలకొనియున్న; శ్రీః-సంపద; ప్రధ్వంసినీ - రూపుమాసిపోవునది; మృదుప్రౌఢా - సర్వమును సహింపగల ధర్మరాజుచేత తీర్చిదిద్దబడినదై; శ్రీః-సంపద; పుత్రపౌత్రాన్ గచ్ఛతి-వంశపారంపర్యముగా చెదరక,చెడక నిలుచునని తాత్పర్యము. భవిష్యత్తున నిది యిట్లే యగుట గమనింపదగినది.

ఏకారిమిత్రాః కురవో హ్యేకకార్యా
జీవన్తు రాజన్ సుఖినః సమృద్ధాః. 72

రాజా! నీకొడుకులు పాండవులను రక్షింపవలయును. పాండునికొడుకులు నీకొడుకులను రక్షింపవలయును. కౌరవులకు ఇతరులు మిత్రులుగాని శత్రువులు గాని యగుట యొక్కవిధముగనే జరుగవలయును. వారు సాధింపవలసిన దొక్కటియే కానగును. ఇట్లు వారు సర్వసంపదలు గలవారై సుఖమునంది బ్రదుకుదురు గాక!

మేఢీభూతః కౌరవాణాం త్వమద్య
త్వయ్యాధీనం కురుకుల మాజమీఢ!
పార్థాన్ బాలాన్ వనవాసప్రతప్తాన్
గోపాయస్వ స్వయశ స్తాత రక్షన్. 73

ఈనాడు నీ వీ కురుకులమువా రందరకు పట్టుకొమ్మవంటివాడవు. అజమీఢ వంశవర్ధనుడా! ఈ వంశమంతయు నీకు వశమై యున్నది. కుంతి కొడుకులను పాపము పసివారిని, అడవిలో నిలిచి మాడిమ్రగ్గినవారిని, బాబూ! నీకీర్తిని కాపాడుకొనుచు, రక్షింపుము.

సంధత్స్వ త్వం కౌరవ పాణ్డుపుత్రైః-
ర్మా తేఽన్తరం రిపవః ప్రార్థయన్తు,

---

72. ఏకఅరిమిత్రాః - మీకును వారికిని మిత్రులో శత్రువులో ఇతరులే కావలయునుగాని, మీలో మీరు అట్టివారు కారాదని తాత్పర్యము.

73. మేఢీభూతః-మేఢి యనగా పెద్ద కట్టుకొయ్యవంటిది. అది సహజముగా నేపనియు చేయదు. కాని తనచుట్టు తిరుగు ఎద్దులు మున్నగువానిని ఇష్టము వచ్చినట్లు తిరుగనీక ఆపినవిధముగా నీవును నీకొడుకులను హద్దులలోనుంచి వంశమును రక్షింపుమని భావము. అజమీఢ అను సంబోధనము మీవంశమున పెద్దలను స్మరించియైన బుద్ధి తెచ్చుకొనుమను నర్థమున సాభిప్రాయము; స్వయశః రక్షన్ - అనుటలో ఇట్లు చేయుటవలన నీవే లాభపడుదు వను నర్థము తోచును.

సత్యే స్థితా స్తే నరదేవ సర్వే
దుర్యోధనం స్థాపయ తే నరేంద్ర. 74

కురువంశప్రభూ! పాండుని కొడుకులతో నీవు ఒక్కటి యగుము. నీపగవారు నీయందు లొసుగును వెదుకకుందురుగాక! వారందరు, మహారాజా! సత్యమున నిలిచియున్నారు. నరేంద్రా! దుర్యోధనుని పోరునకు పోకుండ నిలుపుము.

ఇతి శ్రీమహాభారతే ఉద్యోగపర్వణి ప్రజాగరపర్వణి
విదురహితవాక్యే షట్త్రింశోఽధ్యాయః.

ఇది శ్రీమహాభారతము ఉద్యోగపర్వమున విదురుని
హితవాక్యముగల ముప్పదియారవ అధ్యాయము.

— (౦) —

74. సంధత్స్వ-సంధి చేయుము; అన్తరం-లొసుగును, లోపమును-పొందవు లను విడనాడినచో మీయందు లొసుగును గాంచి శత్రువులు మిమ్ము మర్దింతురని భావము. స్థాపయ-యుద్ధమునుండి మరలింపుము.

# సప్తత్రింశోఽధ్యాయః-ముప్పదియేడవ అధ్యాయము

## ధృతరాష్ట్రాయ విదురస్య హితోపదేశః
## ధృతరాష్ట్రునకు విదురుడు హితము నుపదేశించుట.

విదుర ఉవాచ - విదురు డిట్లు పలికెను.

సప్తదశేమాన్ రాజేన్ద్ర మనుః స్వాయంభువోఽబ్రవీత్,
వైచిత్రవీర్య పురుషా నాకాశం ముష్టిభి ర్ఘ్నతః. 1

రాజేంద్రా! స్వాయంభువమనువు ఈపదునేడుగురిని బయలు పిడికిళ్ళతో పొడుచువారినిగా చెప్పెను.

దానవేన్ద్రస్య చ ధను రనామ్యం నమతోఽబ్రవీత్,
అథో మరీచినః పాదా నగ్రాహ్యాన్ గృహ్ణత స్తథా. 2

వంపనలవికాని యింద్రధనుస్సును వంచువారినిగా, సూర్యచంద్రాదుల కిరణములను-పట్టనలవికానిని-పట్టువారినిగా పలికెను.

యశ్చాశిష్యం శాస్తి వై యశ్చ తుష్యేద్
యశ్చాతివేలం భజతే ద్విషన్తమ్,

---

1. ఆకాశం ముష్టిభి ర్ఘ్నతః - ఆకాశమును పిడికిళ్ళతో పొడుచువారిని అనగా మూర్ఖులను అని తాత్పర్యము.
2. దానవేన్ద్రస్య-దానవు లనగా మేఘములు-వాని సముదాయము దానవము-వానికి ప్రభువు అనగా ఇంద్రుడు - అతని ధనువు; అనామ్యమ్ - పొగ వెలుగు నీరు గాలి అనువానివలన నేర్పడు ఇంద్రధనుస్సును వంచుట అసాధ్యముగదా! అట్లు వంపరానిదానిని, నమతః-వంచువారిని - మూర్ఖుల నని భావము. మరీచినః-మరీచులనగా కిరణములు-అవి గలవారు సూర్య చంద్రాదులు, వారియొక్క; పాదాన్-కిరణములను; అగ్రాహ్యాన్ - పట్ట శక్యముకానివానిని; గృహ్ణతః-పట్టుచున్నవారిని-మూర్ఖులని భావము.

స్త్రియశ్చ యో రక్షతి భద్ర మశ్నుతే
యశ్చాయాచ్యం యాచతే కత్థతే వా. 3

1) శాసింపనలవికానివానిని శాసించువాడు 2) ఏకొంచెము లభించినను సంతసించువాడును, 3) పొంగివచ్చు శత్రువును సేవించువాడును 4) స్త్రీలను రక్షించుచు మేలుపొందువాడును 5) యాచింపదగనివానిని బిచ్చమెత్తువాడును 6) తన్ను పొగడుకొనువాడును-

యశ్చాభిజాతః ప్రకరో త్యకార్యం
యశ్చాబలీ బలినా నిత్యవైరీ,
అశ్రద్ధధానాయ చ యో బ్రవీతి
యశ్చాకామ్యం కామయతే నరేన్ద్ర. 4

7) మంచికులమున పుట్టి పాడుపనులు చేయువాడును, 8) బలహీనుడై బలవంతునితో ఎడతెగనిపగ పెట్టుకొనువాడును 9) శ్రద్ధలేనివానికి ఉపదేశములు చేయువాడును 10) కోరదగనిదానిని కోరువాడును-

వవధ్వాహాసం శ్వశురో మన్యతే యో
వధ్వాఽవసన్నభయో మానకామః,
పరక్షేత్రే నిర్వపతి యశ్చ బీజం
స్త్రియం చ యః పరివదతేఽతివేలమ్. 5

---

3. అశిష్యమ్-శాసింపశక్యముగానివానిని-దుర్యోధనునివంటివానిని; తుష్యేత్ - అల్పలాభముచేత అనుదాని నిట కలుపుకొనవలయును - లేకివాడని తాత్పర్యము; భద్ర మశ్నుతే-ఇది 3, 4 రకములకు రెంటికిని అన్వయించును. అనగా శత్రుసేవతో, స్త్రీరక్షణముతో మేలుపొందగోరువారు మూర్ఖులని తాత్పర్యము. కత్థతే-కొంచెము చేసి గొప్ప చెప్పుకొనువాడని భావము.

4. అభిజాతః-మంచికులమున పుట్టినవాడు.

5. శ్వశురః సన్ - మామయై యుండి; వధ్వా సహ-కోడలితో; అవహాసమ్-పరిహాసమును; మన్యతే-ఉచితమని తలచువాడు; వధ్వా - కోడలిచేత; అవసన్నభయః - పోయినభయముగలవాడై - కోడలిచేతనో; ఆమెబంధువుంచేతనో

(11) మామయై కోడలితో వెకిలి మాటలు పలుకుచు ఉచితకార్యముగా తలచువాడును, (12) కోడలివలన భయము పోగొట్టుకొని మరల ఆమెయందే గౌరవము కోరువాడును(13)పరునిక్షేత్రమున విత్తనము నాటువాడును(14)స్త్రీని హద్దుమీరి కారులు కూయువాడును.

యశ్చాపి లబ్ధ్వా న స్మరామీతి వాదీ
దత్వా చ యః కత్థతి యాచ్యమానః,
యశ్చాసతః సత్త్వ ముపానయీత
ఏతా న్నయన్తి నిరయం పాశహస్తాః. 6

(15) ఒకనినుండి దేనినైన తీసికొని గుర్తులేదని పలుకువాడును (16) ఇత్తునని మాట యిచ్చి అడిగినపుడు ఈయక దాతనని పొగడుకొనువాడును (17) దుష్టునినుండి మంచితనమును (లేక) సత్యమును సాధించువాడును - ఈ పదునేడుగురిని పాశముచేత ధరించిన యమకింకరులు నరకమునకు లాగికొని పోవుదురు.

యస్మిన్ యథా వర్తతే యో మనుష్య-
స్తస్మిం స్తథా వర్తితవ్యం స ధర్మః,
మాయాచారో మాయయా వర్తితవ్యః
సాధ్వాచారః సాధునా ప్రత్యుపేయః. 7

---

రక్షింపబడినవాడై;(మరల వారికడనే) మానకామః-గౌరవమును అపేక్షించువాడును;కొందరు,కోడలిని కామించియు సిగ్గుపడక నలుగురిలో ప్రతిష్ఠను కోరువాడు అను నర్థమును భావింతురు. పరక్షేత్రవిషయము తరువాతచెప్పినకారణమున ఆ అర్థము సరికాదు;పరక్షేత్రే-పరునిభార్య యందు;బీజమ్ - వీర్యమును;నిర్వపతి - ఉంచువాడు-పరభార్యలయందు సంతానము కనువాడని తాత్పర్యము.

6. దత్వా చ...మానః - ఏ పుణ్యస్థలముననో, ఏ యోగ్యునకో దానమును మాటరూపమున ఇచ్చి యింటికి వచ్చినపుడు ఈయకయే యిచ్చితినని బొంకువాడు; అసతః - దుష్టునివలన; సత్త్వమ్ - మంచితనమును లేక సత్యమును; ఉపానయీత - సాధించును - దుష్టత్వమును మంచితనముగా, అసత్యమును సత్యముగా సమర్థించువాడని తాత్పర్యము.

7. సాధువులగు పాండవులవిషయమున నీవును సాధుమార్గమున ప్రవర్తింపవలయునని ధృతరాష్ట్రునకు హితబోధ.

మనుష్యుడు ఇతరులయం దెట్లు ప్రవర్తించునో యితరులు వానియం దట్లు ప్రవర్తింప వలయును. మాయలు పన్నువానియందు మాయలే పన్న వలయును. మంచినడవడి కలవాని విషయమున మంచిమార్గముననే నడువ వలయును.

జరా రూపం హరతి హి ధైర్యమాశా
మృత్యుః ప్రాణాన్ ధర్మచర్యా మసూయా,
కామో హ్రియం వృత్త మనార్యసేవా
క్రోధః శ్రియం సర్వమే వాభిమానః. 8

ముసలితనము రూపమును, ఆశ ధైర్యమును, మృత్యువు ప్రాణములను, అసూయ ధర్మాచరణమును, కామము సిగ్గును, నీచులసేవ నడవడిని, క్రోధము సంపదను అభిమానము సర్వమును రూపుమాపును.

ధృతరాష్ట్ర ఉవాచ - ధృతరాష్ట్రు డిట్లు పలికెను.

శతాయు రుక్తః పురుషః సర్వవేదేషు వై యదా,
నాప్నో త్యథ చ తత్సర్వ మాయుః కేనేహ హేతునా. 9

వేదము లన్నియు మానవునకు నూరేండ్లు ఆయువని పలుకుచున్నవి. మనుజు డేకారణమున దాని నంతటిని పొందకున్నాడు?

విదుర ఉవాచ-విదురు డిట్లు చెప్పెను.

అతిమానోఽతివాదశ్చ తథాఽత్యాగో నరాధిప,
క్రోధ శ్చాత్మవిధిత్సా చ మిత్రద్రోహశ్చ తాని షట్. 10

---

8. అభిమానః-పనికిమాలిన పట్టుదల-నీవు అభిమానమును వదలుమని బోధ.

9. పై శ్లోకమున అభిమానము సర్వమును హరించునని విదురులు చెప్పిరి. నాకొడుకులు అభిమానము కలవారు కావున అల్పాయుష్కులు కావున, ఇప్పుడు అభిమానము వదలుకొన్నను బ్రదుకరు. లేదా వారికి పూర్వ మగు అయువు ఉన్నయెడల అభిమానమున్నను చావరు' అను తాత్పర్య ముతో ధృతరాష్ట్రు డీ ప్రశ్న నడుగుచున్నాడు.

10. అత్యాగః - అతి + ఆగః. ఆగ మనగా అపరాధము. అత్యాగమనగా మహాపాతకమని యర్థము; ఆత్మవిధిత్సా - తన్ను మాత్రమే పోషించు కొనగోరుట - 'చిన్ని నా పొట్టకు శ్రీరామరక్ష' అనుకొను తత్త్వము.

ఏత ఏ వాసయ స్తీక్ష్ణాః కృన్తత్యాయూంషి దేహినామ్,
ఏతాని మానవాన్ ఘ్నన్తి న మృత్యు ర్భద్ర మస్తు తే. 11

మిక్కిలి గర్వము, హద్దుమీరి పలుకుట, మహాపాపములు చేయుట, క్రోధము, తనసుఖమే చూచుకొనుట, నమ్మినవారిని చెరచుట అను నీ ఆరును పదునైన కత్తులు. దేహుల ఆయువులను కోసివేయును. నిజమునకు మానవులను చంపునవి యివియే. మృత్యువు కాదు. నీకు మేలగుగాక!

విశ్వస్త స్యైతి యో దారాన్ యశ్చాపి గురుతల్పగః,
వృషలీపతి ర్ద్విజో యశ్చ పానపశ్చైవ భారత. 12
ఆదేశకృద్ వృత్తిహన్తా ద్విజానాం ప్రేషకశ్చ యః,
శరణాగతహా చైవ సర్వే బ్రహ్మహణః సమాః.
ఏతైః సమేత్య కర్తవ్యం ప్రాయశ్చిత్తమితి శ్రుతిః. 13

నమ్మినవాని పెండ్లమును పొందువాడు, గురుభార్యను పొందువాడు, ద్విజుడై యుండి శూద్రస్త్రీని పెండ్లియాడువాడు, త్రాగుబోతు, గ్రామాధికారి, ఇతరుల బ్రదుకుతెరువును పాడుచేయువాడు, ద్విజులను దాస్యవృత్తియందు నియమించువాడు, శరణుజొచ్చినవారిని చెఱుచువాడు-వీరందరు బ్రహ్మహత్య చేసిన వారితో సమానులు. వీరి సహవాసము చేయువాడుకూడ ప్రాయశ్చిత్తము చేసికొనవలయునని వేదము చెప్పుచున్నది.

గృహీతవాక్యో నయవిద్ వదాన్యః
శేషాన్నభోక్తా హ్యవిహింసకశ్చ,

11. అసయః - ఖడ్గములు; భద్రమస్తు తే - ఈయారింటిని వదలుటవలన నీవును నీకొడుకులును పూర్ణాయువు లగుదురుగాక! అని భావము.
12. విశ్వస్తస్య - నమ్మినవానియొక్క; దారాన్ - భార్యను; ఏతి-పొందును; వృషలీ-శూద్రస్త్రీ; ద్విజః-మొదటిమూడు వర్ణములకు చెందినవాడు.
13. ఆదేశకృత్-గ్రామాధికారి; ద్విజానాం ప్రేషకః-ద్విజులను పనులయందు నియోగించువాడు; సమేత్య-కూడియుండి; ఒకవేళ నీకొడుకులు అతిమానాదిదోషములను వదలక విఱ్ఱవీగుచురేని పాండవులవృత్తులను పాడుచేసిన అట్టివారిని నీవు పరిత్యజింపవలయునని బోధ.

నానర్థకృత్యాకులితః కృతజ్ఞః
సత్యో మృదుః స్వర్గ ముపైతి విద్వాన్. 14

పెద్దల వాక్యమును గ్రహించినవాడు, నీతివేత్త, దాత, అతిథులకు, దేవతలకు పెట్టగా మిగిలిన అన్నము తినువాడు, ఎవరిని హింసింపనివాడు, కీడొనర్పించు పనులు చేసి కలతనొందనివాడు, చేసినమేలు ఎఱుగువాడు, సత్యమున నిలుచువాడు, మెత్తనివాడు అన్నింటితత్త్వ మెరిగినవాడు స్వర్గము పొందును.

సులభాః పురుషా రాజన్ సతతం ప్రియవాదినః,
అప్రియస్య తు పథ్యస్య వక్తా శ్రోతా చ దుర్లభః. 15

రాజా! ఎల్లప్పుడు ఇచ్చకములాడు మనుజులు తేలికగా దొరకుదురు. కాని ప్రియము కాకున్నను హితమగు మాట పలుకువాడు, దానిని వినువాడు దొరకుట చాల అరుదు.

యో హి ధర్మం సమాశ్రిత్య హిత్వా భర్తుః ప్రియాప్రియే,
అప్రియాణ్యాహ పథ్యాని తేన రాజా సహాయవాన్. 16

ధర్మమునే యాశ్రయించి ప్రియమును, అప్రియమును పట్టించుకొనక, ప్రభువునకు అప్రియములైనను మేలొనరించు పలుకులు పలుకువాడు రాజునకు నిజమైన సహాయుడు.

త్యజేత్ కులార్థే పురుషం గ్రామస్యార్థే కులం త్యజేత్,
గ్రామం జనపదస్యార్థే ఆత్మార్థే పృథివీం త్యజేత్. 17

---

14. గృహీతవాక్యః - విద్యావంతుడని భావము; నయవిత్-నీతియెరిగినవాడు; వదాన్యః - దాత;

15. ప్రియ మనగా అప్పటికి రుచించునది. హితమనగా భవిష్యత్తును సుఖమయము చేయునది.

17. కులముకొరకు పురుషుని విడువవలయు ననగా ఆ మనుజునివలన కులమే చెడుపరిస్థితి యున్నచో అని భావము. తక్కిన యంశముల నిట్లే భావించునది.

కులముకొరక కాక పురుషుని విడనాడవచ్చును. గ్రామముకొరకు కులమును, దేశముకొరకు గ్రామమును, తనకొరకు భూమినంతటిని వదల వలయును.

ఆపదర్థే ధనం రక్షే ద్దారాన్ రక్షే ద్ధనైరపి,
ఆత్మానం సతతం రక్షే ద్దారైరపి ధనైరపి. 18

ఆపదలు కలుగువేళకై ధనము రక్షింపవలయును. ధనమంతయు వెచ్చించియు భార్యను రక్షించుకొనవలయును. భార్యను, ధనమును ఉపయోగించియైనను తన్ను రక్షించుకొనవలయును.

ద్యూత మేతత్ పురాకల్పే దృష్టం వైరకరం నృణామ్,
తస్మాత్ ద్యూతం న సేవేత హాస్యార్థమపి బుద్ధిమాన్. 19

ఈ జూదము పూర్వకాలమున రాజులలో పగలు రగిలించినది. కావున బుద్ధిగలవాడు నవ్వులాటకును జూదమాడరాదు.

ఉక్తం మయా ద్యూతకాలేఽపి రాజ
న్నేదం యుక్తం వచనం ప్రాతిపేయ!
తదౌషధం పథ్య మివాతురస్య
న రోచతే తవ వైచిత్రవీర్య. 20

రాజా! ప్రతీపవంశ్యా, విచిత్రవీర్యతనయా! ఆనాడు జూదమాడునప్పుడం ఈ జూదము తగదని నేను మొత్తుకొంటిని.రోగికి మేలుచేయు మందువలె ఆ మాట నీకు రుచింపలేదు.

కాకైరిమాం శ్చిత్రబర్హాన్ మయూరాన్
పరాజయేథాః పాణ్డవాన్ ధార్తరాష్ట్రైః,
హిత్వా సింహాన్ క్రోష్టుకాన్ గూహమానః
ప్రాప్తే కాలే శోచితా త్వం నరేంద్ర. 21

---

18. ఇది స్వార్థమని సంభావింపరాదు. తన పురుషార్థమునకు తానే గతి కనుక అట్లు చెప్పవలసివచ్చినది. 17,18, దుష్టుడగు నీ కొడుకును త్యజించుట కర్తవ్యము. లేనిచో నీవు మిగులవని హెచ్చరిక.

రాజా!అందమైన పింఛములుగల నెమళ్ళవంటి పాండవులను నీకొడుకు లనెడు కాకులతో ఓడింతువా? సింహములను పారద్రోలి నక్కలను ఒడిలో నిడుకొని సమయ మాసన్నమైనపుడు ఏడ్చుచున్నావు.

యస్మాత న క్రుధ్యతి సర్వకాలం
భృత్యస్య భక్తస్య హితే రతస్య,
తస్మిన్ భృత్యా భర్తరి విశ్వసన్తి
న చైన మాపత్సు పరిత్యజన్తి. 22

చక్కగా సేవించుచు, ప్రభువు మేలే కోరు సేవకుని యెడ నెన్నడు కోపిం పని ప్రభువునందు సేవకులు నమ్మక ముంతురు.ఆవదలలో ఆతనిని విడిచిపోరు.

న భృత్యానాం వృత్తిసంరోధనేన
రాజ్యం ధనం సంజిఘృక్షే దపూర్వమ్,
త్యజన్తి హ్యేనం వఞ్చితా వై విరుద్ధాః
స్నిగ్ధా హ్యమాత్యాః పరిహీనభోగాః. 23

సేవకుల పొట్టకొట్టి యితరుల రాజ్యమును,ధనమును మ్రింగజూడరాదు. ఇట్లు వంచించినచో మంత్రులు మొదలగు దగ్గరివారు స్నేహముకల వారైనను, భోగములు నశించినవారైన కారణమున పగవారై వానిని వదలిపోవుదురు.

కృత్యాని పూర్వం పరిసంఖ్యాయ సర్వా-
ణ్యాయవ్యయే చానురూపాం చ వృత్తిమ్,
సంగృహ్ణీయా దనురూపాన్ సహాయాన్
సహాయసాధ్యాని హి దుష్కరాణి. 24

---

22. భక్తస్య- సేవచేయుచున్న
23. అపూర్వమ్ - పూర్వము తనదికానిది - అనగా ఇతరులది; స్నిగ్ధాః హి,- స్నేహము కలవారైనను;
24. కృత్యాని, పరిసంఖ్యాయ-సాధ్యములా, అసాధ్యములా యని చక్కగా నిశ్చయించుకొని; వృత్తిమ్-అనురూపాం- సేవకుల వేతనములను ఖర్చు వెచ్చములకు తగినవిధముగా చేసికొని అని భావము; దుష్కరాణి-పరుల రాష్ట్రములను ఒడుచుకొనుట మొదలగునవి.

పనులన్నింటిని ముందుగనే చక్కగా నిర్ణయించుకొని, (రాబడి, ఖర్చు వెచ్చములను, వ్యయములను) గమనించి, తగిన ప్రవృత్తిని కూర్చుకొని యోగ్యులను సహాయులను కూర్చుకొనవలయును. సాధింపరాని పనులన్నియు సహాయులవలన సాధ్యములగును గదా!

అభిప్రాయం యో విదిత్వా తు భర్తుః
సర్వాణి కార్యాణి కరో త్యతన్ద్రీ,
వక్తా హితానా మనురక్త ఆర్యః
శక్తిజ్ఞ ఆత్మేవ హి సోఽనుకమ్ప్యః. 25

ప్రభుప్రభావము నెరిగి ఏమరుపాటులేక పనులన్నియు చేయువాడు, హితములు చెప్పువాడు, అనురాగము కలవాడు, సజ్జనుడు, శక్తి యెఱుగువాడు నగు సేవకుని రాజు తనవలెనే మన్నింపవలయును.

వాక్యం తు యో నాద్రియతేఽనుశిష్టః
ప్రత్యాహ యశ్చాపి నియుజ్యమానః,
ప్రజ్ఞాభిమానీ ప్రతికూలవాదీ
త్యాజ్యశ్చ తాదృక్ త్వరయైవ భృత్యః. 26

---

25. ఆత్మా, ఇవ-తనవిషయమం దెట్లు ప్రవర్తింపనో అట్లు స్వామిభక్తిగల సేవకునియందు ప్రవర్తింపవలయునని భావము, అనుకమ్ప్యః-అనుగ్రహింపదగినవాడు-ప్రకృతమున నేను నీకట్టి సేవకుడను. నేను ఉన్న దున్నట్లు చెప్పుచుండగా కోపము పూనకుమని ప్రార్థన.

26. అస్తబ్ధమ్-గర్వము లేనివానిని; అక్లీబమ్ - క్లీబత్వమనగా నిట పని సాధింపలేకపోవుట-కావున అసమర్థుని-అని భావము; అదీర్ఘసూత్రమ్ దీర్ఘసూత్రుడనగా త్వరగా ఒక నిశ్చయమునకు రానివాడు లేక సోమరిపోతు-అట్టివాడు కానివానిని; సానుక్రోశమ్-దయగలవానిని; శ్లక్ష్ణమ్-అందరకు ఇష్టుడైనవానిని; అన్యైః అహార్యమ్-ఇతరులు ఆశచూపగా లోబడనివానిని; అరోగజాతీయమ్-రోగము ఏ కొంచెమును లేనివానిని; ఉదారవాక్యమ్-యుక్తితోకూడిన, గొప్ప ప్రయోజనములు గల వాక్యములు గలవానిని;

చెప్పినమాటను లెక్కపెట్టనివాడు, పని చేయుమనగా చేయ ననువాడు, తన తెలివిని గొప్పదిగా భావించువాడు, చెప్పినపనిని విరుద్ధముగా చేయువాడు నగు భటుని వెనువెంటనే తొలగింపవలయును.

అస్తబ్ధ మక్లీబ మదీర్ఘసూత్రం
సానుక్రోశం శ్లక్ష్ణ మహార్య మన్యైః,
అరోగజాతీయ ముదారవాక్యం
దూతం వద న్త్యష్టగుణోపపన్నమ్. 27

గర్వములేనివాడు, సామర్థ్యముగలవాడు, పనులలో జాగు సేయనివాడు, దయగలవాడు, సొంపైన నడవడి కలవాడు, ఇతరుల కమ్ముడుపోనివాడు, ఆరోగ్యము కలవాడు, యుక్తితో కూడినవియు, గొప్పప్రయోజనము సాధించునవియు నగు మాటలుకలవాడు-ఇట్టి యెనిమిది లక్షణములు గలవానిని దూత అందురు.

న విశ్వాసా జ్జాతు పరస్య గేహే
గచ్ఛే న్నర శ్చేతయానో వికాలే,
న చత్వరే నిశి తిష్ఠే న్నిగూఢో
న రాజకామ్యాం యోషితం ప్రార్థయీత. 28

బుద్ధిగలవాడు, నమ్మకము పెట్టుకొని పరుని యింటికి సాయంకాలమున పోరాదు. కూడలియందు గుట్టుగా నిలువరాదు. రాజు కోరెడు ఇంతిని కామింపరాదు.

న నిహ్నవం మ న్త్రిగతస్య గచ్ఛేత్
సంసృష్టమ న్త్రస్య కుసంగతస్య,

---

28. చేతయానః-ఆలోచన కలవాడు-రాబోవు మేలుకీళ్ళను ముందుగా ఊహింపగలవాడు-అని తాత్పర్యము; వికాలే-సాయంకాలమున; విశ్వాసాత్ - ఏమగునులే అను ధీమాతో; పరస్య గేహే-పరునియింట; న గచ్ఛేత్ - పోరాదు-నిలువరాదు.

న చ బ్రూయా న్నాశ్వసిమి త్వయీతి
సకారణం వ్యపదేశం తు కుర్యాత్. 29

పలువురు దుష్టులు కలిసి చేసిన ఆలోచనను చట్టున కాదనరాదు. నీయందు నాకు నమ్మకములే దనరాదు. ఏదో నెపము చెప్పి తప్పించుకొనవలయును.

ఘృణీ రాజా పుంశ్చలీ రాజభృత్యః
పుత్రో భ్రాతా విధవా బాలపుత్రా,
సేనాజీవీ చోద్ధృతభూతి రేవ
వ్యవహారేషు వర్జనీయాః స్యు రేతే. 30

---

29. సంసృష్టమన్త్రస్య = అనేకులుచేసిన మంత్రము - గూఢాలోచనగల కుసంగతస్య-కుజనుల సంపర్కముగల; నిహ్నవమ్ - ఖండనను; న గచ్ఛేత్-చేయరాదు; కర్తాదులతో నీవుచేసిన మంత్రమును నావంటివాడు కాదనరాదని తాత్పర్యము- అన్నచో పగపట్టుదురని భావము. త్వయి-నీయందు; పెక్కురకు ఇష్టమగువానియందని భావము; న ఆశ్వసిమి - నమ్మను అని; న బ్రూయాత్ - పలుకరాదు; తు-కాని; సకారణమ్ - కారణము లుండునట్లుగా; వ్యపదేశమ్ - నెపమును; కుర్యాత్ - చేయవలయును-ఆవలివాడు చెప్పిన దురాలోచనను చట్టున కాదనరాదు. అట్లని స్వీకరింపనురాదు. ఏదో నెపముపెట్టి దానిని సుకుమారముగా త్రోసివేయవలయునని తాత్పర్యము.

30. ఘృణీ - జాలి, సిగ్గుకలవాడు - తప్పుచేసినవానిని సూటిగా శిక్షింపజాలడని భావము; ఉద్ధృతభూతిః - తొలగింపబడిన, భూతిః - అధికారము కలవాడు. వ్యవహారే - ధనము మొదలగునది యిచ్చి పుచ్చుకొనుట మొదలగు పనియందు; వర్జనీయాః - విడనాడవలసినవారు. వీరికి ధనాదికము ఒసగరాదు - వారినుండి పుచ్చుకొననురాదు - అని భావము. మిక్కిలి సిగ్గుగలవాడు, అప్పు పుచ్చుకొన్నచో గట్టిగా అడిగినప్పుడు ఏమియు చెప్పజాలక ప్రాణములే వదలవచ్చును. ఇట్లే తక్కినవారి విషయమునను హేతువుల నూహించుకొనదగును.

మిక్కిలి దయగలరాజు, శీలములేని యింతి, రాజసేవకుడు, కొడుకు, సోదరుడు, విధవ, చిన్నపిల్లలతల్లి, సేనయందు బ్రతుకువాడు, అధికారము కోల్పోయినవాడు - వీరిని వ్యవహారములయందు విడనాడవలయును.

అష్టౌ గుణాః పురుషం దీపయన్తి
ప్రజ్ఞా చ కౌల్యం చ శ్రుతం దమశ్చ,
పరాక్రమ శ్చాబహుభాషితా చ
దానం యథాశక్తి కృతజ్ఞతా చ. 31

తెలివి, సత్కులము, విద్య, నిగ్రహము, పరాక్రమము, మితిమీరి పలుకకుండుట, ఉన్నమేరకు దాన మొసగుట, చేసినమేలు గుర్తించుకొనుట - అను నీ ఎనిమిదిలక్షణములును పురుషుని వెలుగొందజేయును.

ఏతాన్ గుణాం స్తాత మహానుభావా-
నేకో గుణః సంశ్రయతే ప్రసహ్య,
రాజా యదా సత్కురుతే మనుష్యం
సర్వాన్ గుణానేష గుణో బిభర్తి. 32

గొప్పప్రభావముగల ఈ గుణము లన్నింటిని ఒక్కగుణము గట్టిగా పట్టుకొనును. రాజసత్కారము పొందినచో ఆగుణమే అన్నిగుణములను మించి మనుజుని పట్టి నిలుపును.

గుణా దశ స్నానశీలం భజన్తే
బలం రూపం స్వరవర్ణప్రశుద్ధిః,
స్పర్శశ్చ గన్ధశ్చ విశుద్ధతా చ
శ్రీః సౌకుమార్యం ప్రవరాశ్చ నార్యః. 33

---

32. రాజుమన్నన యున్నచో అన్నియు నున్నట్లే యని భావము.

33. స్వర, వర్ణప్రశుద్ధిః-కంఠధ్వని అక్షరముల ఉచ్చారణ అనువానియందు దోషము లేకుండుట; స్పర్శ అనగా మృదుత్వము; సౌకుమార్య మనగా దేహము నిగనిగలాడుట;

బలము, రూపము, విస్పష్టమైన వర్ణముల ఉచ్చారణ, చక్కనిస్పర్శ, సువాసన, పరిశుద్ధి, శోభ, సౌకుమార్యము, శ్రేష్ఠురాండ్రగు స్త్రీలు లభించుట అను నీపదిగుణములు యోగ్యకాలమున స్నానముచేయుట స్వభావమైన వానిని సేవించును.

గుణాశ్చ షణ్ మితభుక్తం భజన్తే
ఆరోగ్య మాయుశ్చ బలం సుఖం చ,
అనావిలం చాస్య భవత్యపత్యం
న చైన మాద్యూన ఇతి క్షిపన్తి. 34

ఆరోగ్యము, ఆయువు, బలము, సుఖము, రోగాదులులేని సంతానము, 'తిండిపోతు' అని జనులు వెక్కిరింపకుండుట-అను నీ యాఱు గుణములు మితముగా భుజించువానిని పొందును.

అకర్మశీలం చ మహాశనం చ
లోకద్విష్టం బహుమాయం నృశంసమ్,
అదేశకాలజ్ఞ మనిష్టవేష-
మేతాన్ గృహే న ప్రతివాసయీత. 35

సోమరిపోతు, తిండిపోతు, లోకులను ద్వేషించువాడు, పలుమాయలు కలవాడు, క్రూరుడు, దేశకాలముల నెరుగనివాడు, పిచ్చివేషములు వేయువాడు అను వీరిని ఇంట నిలువనీయరాదు.

కదర్య మాక్రోశక మశ్రుతం చ
వనౌకసం ధూర్త మమాన్యమానినమ్,

---

34. మితభుక్తమ్-మితముగా ఆహారము తీసుకొనువానిని; ఆద్యూనః-తిండిపోతు; క్షిపన్తి-ఆక్షేపింతురు;

35. అనిష్టవేషమ్-పొట్టకొరకు సన్యాసాది వేషములు వేయువానిని;

నిష్ఠూరిణం కృతవైరం కృతఘ్న-
మేతాన్ భృశార్తోఽపి న జాతు యాచేత్. 36

పిసినిగొట్టు, వదరుబోతు, మూర్ఖుడు, అడవి 'మనిషి', జూదగాడు, నీచులను మన్నించువాడు, దయలేనివాడు, పగగొన్నవాడు, చేసిన మేలు మరచువాడు-వీరిని ఎంత బాధలోనున్నను ఎన్నటికిని వేడుకొనరాదు.

సంక్లిష్టకర్మాణ మతిప్రమాదం
నిత్యానృతం చాదృఢభక్తికం చ,
విసృష్టరాగం పటుమానినం చా-
ప్యేతా న్న సేవేత నరాధమాన్ షట్. 37

ఆతతాయి, మేర మీరిన మైమరపు గలవాడు, ఎల్లప్పుడు బొంకువాడు, భక్తియందు నిలుకడ లేనివాడు, స్నేహము వదలువాడు, తన్ను నేర్పరిగా భావించువాడు అను నీ నరాధముల నారుగురిని దరికి చేరనీరాదు.

---

36. కదర్యమ్-లోభిని; ఆక్రోశకమ్-ఇతరులను చెడుమాటలతో నిందించువానిని; అశ్రుతమ్-చదువులేని మూర్ఖుని; వనౌకసమ్-అడవిమానిసిని-దయాదిభావములు లేనివానిని అని భావము; ధూర్తమ్-జూదగానిని; అమాన్యమానినమ్-నీచులను మన్నించువానిని; నిష్ఠూరిణమ్ - క్రూరస్వభావుని; కృతవైరమ్-పగగొన్నవానిని; భృశార్తః-అపి-మిక్కిలి పీడనొందియున్నవాడైనను;

37. సంక్లిష్టకర్మాణమ్- ఘోరమగు పనులు చేయువానిని-ఇట్టివానిని 'ఆతతాయి' అందురు. ఇండ్లకు నిప్పుపెట్టువాడు, ఇతరులకు విషము పెట్టువాడు, ఆయుధములు దాల్చువాడు, ధనము దొంగిలించువాడు, పరుల భూములను భార్యలను హరించువాడు - ఈ ఆర్వురు ఆతతాయులు; అతిప్రమాదమ్-ఎల్లవేళల పొరపాట్లు చేయువానిని; విసృష్టరాగమ్ వదలిన స్నేహము కలవానిని; పటుమానినమ్-అన్నింట నారితేరిన వాడనని చెప్పుకొనువానిని;

సహాయబన్ధనా హ్యర్థాః సహాయా శ్చార్థబన్ధనాః,
అన్యోన్యబన్ధనా వేతౌ వినాఽన్యోన్యం న సిధ్యతః. 38

అర్థములు సహాయుల నంటిపెట్టుకొని యుండును. సహాయులు అర్థముల నంటిపెట్టుకొని యుందురు. ఇట్టివి రెండు నొకదానికొకటి కూడి యుండును. వేరైనచో అవి ఫలింపవు.

ఉత్పాద్య పుత్రా ననృణాంశ్చ కృత్వా
వృత్తిం చ తేభ్యోఽనువిధాయ కాఞ్చిత్,
స్థానే కుమారీః ప్రతిపాద్య సర్వా
అరణ్యసంస్థోఽథ ముని ర్బుభూషేత్. 39

మనుజుడు కొడుకుల గని,వారిపై ఋణభారము నిడక వారికి తగిన జీవనోపాధిని కల్పించి,పుత్రికలను యోగ్యులగు వరుల కొసగి పిదప అడవుల యందుండి మునివృత్తి నవలంబింపవలయును.

హితం యత్ సర్వభూతానా మాత్మనశ్చ సుఖావహమ్,
తత్కుర్యా దీశ్వరే హ్యేత న్మూలం సర్వార్థసిద్ధయే. 40

సర్వభూతములకు మేలైనది,తనకు సుఖము కూర్చునదియు,భావికాలమున వచ్చు ఫలమునకు మూలకారణమైనదియు నగుదానిని,అన్ని ప్రయోజనములు సిద్ధించుటకై, చేయవలయును.

---

38. అర్థాః-ధనములు, ప్రయోజనములు; ఉత్తమ గుణములు గల పాండవులను సహాయులుగా గ్రహించుట వలన నీకే లాభము. గ్రహింపకున్నచో నీకే నష్టము-అన్న తాత్పర్యముతో నీ శ్లోకమును చెప్పుచున్నారు.

39. బుభూషేత్-వాంఛింపవలయును.

40. ఈశ్వరే-కాలాంతరమున వచ్చు కర్మముల ఫలమునకు 'పూచీ'అయిన ఈశ్వరునియందు;ఏతత్-ఇది. తనకును ఇతరులకు మేలైనదానినే చేయుటయనునది;మూలమ్-మూలము. స్వపరహితాచరణము లేనిచో ఈశ్వరుడు కూడ మంచిఫలము నొసగజాలడని తాత్పర్యము.

వృద్ధిః ప్రభావ స్తేజశ్చ సత్త్వ ముత్థాన మేవ చ,
వ్యవసాయశ్చ యస్య స్యా త్తస్యావృత్తిభయం కుతః. 41

వృద్ధి, ప్రభావము, తేజము,సత్త్వము,ప్రయత్నము,నిశ్చయము-అనునవి కలవానికి బ్రదుకుతెరువునుగూర్చిన భయ మెక్కడిది?

పశ్య దోషాన్ పాణ్డవై ర్విగ్రహే త్వం
యత్ర వ్యథేయు రపి దేవాః సశక్రాః,
పుత్రై ర్వైరం నిత్య ముద్విగ్నవాసో
యశఃప్రణాశో ద్విషతశ్చ హర్షః. 42

పాండవు లన్నచో ఇంద్రునితోపాటు దేవతలందరు భీతితో తల్లడిల్లుదురు. అట్టివారితో నీవు వైరముపెట్టుకొంటివి.ఇందుగల దోషములను పరికింపుము. కొడుకులతో పగ,ప్రతిక్షణము గుండెదిగులుతో బ్రదుకుట,కీర్తి చచ్చుట,పగవారు కులుకుట.

భీష్మస్య కోప స్తవ చై వేన్ద్రకల్ప
ద్రోణస్య రాజ్ఞశ్చ యుధిష్ఠిరస్య,
ఉత్సాదయే ల్లోక మిమం ప్రవృద్ధః
శ్వేతో గ్రహ స్తిర్యగి వాపతత్ ఖే. 43

---

41. పరహితము నాచరించినచో అది తనకు హితమగుట యెట్లు అను శంకకు సమాధానముగా ఈశ్లోకము చెప్పుచున్నారు.వృద్ధిః - సహాయుల కలయిక వలన సంపద మొదలగునది పెరుగుట;ప్రభావః-శత్రువుల నోడించుట; తేజః - దానికి కారణమైన పరాక్రమము;సత్త్వమ్ - ధర్మము, జ్ఞానము, ఐశ్వర్యము మొదలగునది,ఉత్థానమ్-ప్రయత్నము-పురుషకారము;వ్యవసాయః-నిశ్చయము; అవృత్తిభయమ్-బ్రదుకుతెరువు లేదను భయము-ఈ లక్షణము లున్నవాడు పరహితమునకు పాటుపడినను స్వహితమునకు క్షతి లేదని తాత్పర్యము.

43. శ్వేతః గ్రహః - తోకచుక్క-

ఇంద్రునివంటి ఓ ధృతరాష్ట్రా! భీష్ముడు, నీవు, ద్రోణుడు, రాజైన యుధిష్ఠిరుడు అనువారి కోపము పెరిగి, పెరిగి ఆకసమున అడ్డముగా పడిన తోకచుక్కవలె ఈలోకమును రూపుమాపనున్నది.

తవ పుత్రశతం చైవ కర్ణః పఞ్చ చ పాణ్డవాః,
పృథివీ మనుశాసేయు రఖిలాం సాగరామ్బరామ్. 44

నీ నూరుగురు కొడుకులు, కర్ణుడు, పాండుని కొడుకులు అయిదుగురు కలిసి సముద్రమే కట్టుబట్టగాగల ఈనేల నంతటిని ఏలుదురుగాక!

ధార్తరాష్ట్రా వనం రాజన్ వ్యాఘ్రాః పాణ్డుసుతా మతాః,
మా వనం ఛిన్ధి సవ్యాఘ్రం మా వ్యాఘ్రా నీనశన్ వనాత్. 45

ధృతరాష్ట్రుని కొడుకులు వనము. పాండుని కొడుకులు బెబ్బులులు. పులులున్న అడవిని కొట్టకుము. వనమునుండి పులులు నశింపకుండుగాక!

న స్యా ద్వనమృతే వ్యాఘ్రాన్ వ్యాఘ్రా న స్యు రృతే వనమ్,
వనం హి రక్ష్యతే వ్యాఘ్రై ర్వ్యాఘ్రాన్ రక్షతి కాననమ్. 46

పులులు లేక అడవి నిలువదు అడవిలేక పులులు బ్రదుకవు. వ్యాఘ్రములు వనమును, వనము వ్యాఘ్రములను రక్షించును.

న తథేచ్ఛన్తి కల్యాణాన్ పరేషాం వేదితుం గుణాన్,
యథైషాం జ్ఞాతు మిచ్ఛన్తి నైర్గుణ్యం పాపచేతసః. 47

పాపబుద్ధిగలవారు ఇతరుల గుణహీనతను ఎఱుగగోరునట్లుగా, ఇతరుల మేలిమిగుణములను ఎఱుగగోరరు.

అర్థసిద్ధిం పరా మిచ్ఛన్ ధర్మ మేవాదిత శ్చరేత్,
న హి ధర్మా దపైత్యర్థః స్వర్గలోకా దివామృతమ్. 48

గొప్పదియగు అర్థముల సిద్ధిని గోరుచున్నవాడు మొదట ధర్మమునే ఆచరింపవలయును. అమృతము స్వర్గలోకమునుండి తొలగిపోవని విధమున,

---

45. వనాత్ - వనమున నుండి; మానీనశన్ - నశింపకుండుగాక!
46. న స్యాత్ - లేదు - బ్రదుకు లేదని తాత్పర్యము;

అర్థము ధర్మమునుండి తొలగి చనదు. (ధర్మ మెచట నుండునో యచటనే యర్థము ఉండునని తాత్పర్యము.)

యస్యాత్మా విరతః పాపాత్ కల్యాణే చ నివేశితః
తేన సర్వమిదం బుద్ధం ప్రకృతి ర్వికృతిశ్చ యా. 49

ఎవని చిత్తము పాపమునుండి మరలునో, శుభమునందు చెదరక నిలుచునో వానికి ప్రకృతి, వికృతి అనురూపమున సర్వము ఎరుకవడును.

యో ధర్మ మర్థం కామం చ యథాకాలం నిషేవతే,
ధర్మార్థకామసంయోగం సోఽముత్రేహ చ విన్దతి. 50

ధర్మము, అర్థము, కామము అనువానిని వాని వాని కాలములకు తగినట్లు ఆచరించువాడు ఇహపరములలో వానిని కలిసికట్టుగా అనుభవించును.

సంనియచ్ఛతి యో వేగ ముత్థితం క్రోధహర్షయోః,
స శ్రియో భాజనం రాజన్ యశ్చాపత్సు న ముహ్యతి. 51

పొడుచుకొనివచ్చు కోపము, సంతోషము అనువాని వేగమును నిలువరింపగలవాడును, ఆపదలందు చెదరనివాడును సంపదలకు పాత్రుడగును.

బలం పఞ్చవిధం నిత్యం పురుషాణాం నిబోధ మే,
యత్తు బాహుబలం నామ కనిష్ఠం బల ముచ్యతే. 52

---

49. ఆత్మా-చిత్తము; పాపాత్-ఇది నాది, ఇది నాకు కావలయును అను విధమైన సంకల్పమునుండి (అహంకారమమకారములనుండి) విరతః-మరలునో; కల్యాణే-పరమానందరూపమైన బ్రహ్మమునందు; నివేశితః-ప్రవేశపెట్టబడునో; తేన-అతనిచేత; ఇదం సర్వమ్-ఇది యంతయు-తత్త్వమంతయు; బుద్ధమ్-ఎఱుగబడును. ప్రకృతిః-త్రిగుణముల కలయికతోనగు మాయ; వికృతిః-దానినుండి ఏర్పడు మహత్తు మొదలగునది. ఆత్మజ్ఞానమువలన సర్వజ్ఞానములు కలుగునుగదా!

50. ధర్మార్థకామములనే సర్వదా ఆచరించువాడు మోక్షమునకు కొరగాడని శ్లోకభావము.

అమాత్యలాభో భద్రం తే ద్వితీయం బల ముచ్యతే,
తృతీయం ధనలాభం తు బలమాహు ర్మనీషిణః. 53

య త్త్వస్య సహజం రాజం పితృపైతామహం బలమ్,
అభిజాతబలం నామ తచ్చతుర్థం బలం స్మృతమ్. 54

యేన త్వేతాని సర్వాణి సంగృహీతాని భారత
యద్బలానాం బలం శ్రేష్ఠం తత్ప్రజ్ఞాబల ముచ్యతే. 55

రాజా! పురుషులకు బలము అయిదు తెరగులుగా నుండును. దానిని చెప్పుదును. వినుము. చేతులసత్త్వ యనునది చిట్టచివరిది. మంచి మంత్రులు దొరకుట రెండవబలము. నీకు మేలగుగాక! తెలివిగలవానికి ధనము లభించుట మూడవది. తండ్రితాతలవరుసను వచ్చిన కులబలము నాలుగవది. ఈ అన్నింటి మొత్తమువంటిది, మిక్కిలి గొప్పది అగు ప్రజ్ఞాబలము అయిదవది. అది అన్ని బలములకు బలము.

మహతే యోఽపకారాయ నరస్య ప్రభవే న్నరః,
తేన వైరం సమాసజ్య దూరస్థోఽస్మీతి నాశ్వసేత్. 56

గొప్పకీడు చేయజాలు నరునితో శత్రుత్వము పెట్టుకొని నరుడు దూరముగా నున్నానని నెమ్మదితో నుండరాదు.

స్త్రీషు రాజసు సర్పేషు స్వాధ్యాయ ప్రభు శత్రుషు,
భోగే ష్వాయుషి విశ్వాసం కః ప్రాజ్ఞః కర్తు మర్హతి. 57

స్త్రీలయందు, రాజులయందు, పాములయందు, వేదాధ్యయనమునందు, సమర్థునియందు, శత్రువునందు, భోగములయందు, ఆయువునందు నమ్మకముంచు బుద్ధిమంతు డెవడు?

---

54 అభిజాతబలమ్-కులబలము.

56. బలవంతుడగు శత్రువు ఎంతదూరమున నున్నను ప్రాణాంతకమే యని భావము. ధర్మరాజు విషయమున నీవు అపకారము జరుగదని భావింపరాదని తాత్పర్యము.

ప్రజ్ఞాశరేణాభిహతస్య జన్తో-
శ్చికిత్సకాః సన్తి న చౌషధాని,
న హోమమన్త్రా న చ మఙ్గళాని
నాథర్వణా నాప్యగదాః సుసిద్ధాః. 58

ప్రజ్ఞ యను బాణపుదెబ్బ తిన్న ప్రాణికి రోగము కుదుర్చు వైద్యులు లేరు. మందులు లేవు. హోమమంత్రములు లేవు. శుభకార్యములు లేవు. వేద మంత్రములు లేవు. పేరొందిన పాదరసమువంటి దినుసులు లేవు.

సర్పశ్చాగ్నిశ్చ సింహశ్చ కులపుత్రశ్చ భారత,
నావజ్ఞేయా మనుష్యేణ సర్వే హ్యేతేఽతితేజసః. 59

పాము, నిప్పు, సింహము, జ్ఞాతి-అనువానిని మనుష్యుడు చులకనగా చూడరాదు. ఇవి యన్నియు గొప్ప తేజము గలవి.

అగ్నిస్తేజో మహల్లోకే గూఢ స్తిష్ఠతి దారుషు,
న చోపయుఙ్క్తే తద్దారు యావన్నోద్దీప్యతే పరైః. 60

లోకమున అగ్ని గొప్పతేజము. అది కట్టెలలో గుట్టుగా నుండును. ఇతరులు దానిని మండింపకున్నంతవరకు ఆకట్టె పనికిమాలిన దగును.

స ఏవ ఖలు దారుభ్యో యదా నిర్మథ్య దీప్యతే,
తద్దారు చ వనం చాన్య న్నిర్దహ త్యాశు తేజసా. 61

కట్టెలనుండి రాపిడివలన దానిని మండించినచో అదే కట్టె అడవినెల్ల ఒక్కపెట్టున మంటతో బూడిద చేయును.

---

58. అథర్వణాః-వేదమంత్రములు, ఇక సాధారణములగు మంత్రముల సంగతి చెప్పనేల? అని భావము. సుసిద్ధాః అగదాః-సిద్ధౌషధములయిన పాదరసము మొదలయినవి.

59. కులపుత్రః - జ్ఞాతి.

ఏవమేవ కులే జాతాః పావకోపమతేజసః,
క్షమావన్తో నిరాకారాః కాష్ఠేఽగ్నిరివ శేరతే. 62

ఇట్లే నిప్పువంటి తేజస్సు గలవారు, నీకులమున పుట్టినవారు నగు పాండవులు ఓర్పుగలవారై బయటపడక కట్టెలో నిప్పువలె నిద్రించుచున్నారు.

లతా ధర్మా త్వం సపుత్రః శాలాః పాణ్డుసుతా మతాః
న లతా వర్ధతే జాతు మహాద్రుమ మనాశ్రితా. 63

కొడుకులతోపాటు నీవు లతవంటివాడవు. పాండుని కొడుకులు మహా వృక్షములు. పెనుచెట్టును చుట్టుకొనక లత యెన్నటికిని పెరుగదు.

వనం రాజం స్తవ పుత్రోఽమ్బికేయ
సింహాన్ వనే పాణ్డవాం స్తాత విద్ధి,
సింహై ర్విహీనం హి వనం వినశ్యేత్
సింహా వినశ్యేయు ర్ఋతే వనేన. 64

రాజా! అంబికాపుత్రా! తాతా! నీకొడుకు వనము. పాండవు లావనమున నున్న సింహములు. సింహములు లేని వనము, వనములేని సింహములు నశించును గదా!

ఇతి శ్రీమహాభారతే ఉద్యోగపర్వణి ప్రజాగరపర్వణి
విదురవాక్యే సప్తత్రింశోఽధ్యాయః.

ఇది శ్రీమహాభారతము ఉద్యోగపర్వమున ప్రజాగరపర్వమున
విదురవాక్యముగల ముప్పదియేడవ అధ్యాయము.

— (౦) —

62. కులే జాతాః-నీకులమున బుట్టినవారు-పాండవు లని భావము.
63. పాండవుల నాశ్రయించి కొడుకులతోపాటు పెంపొందుమని భావము.
64. నీకొడుకులను చంపి పాండవులు స్నేహమువలన వారును నశింతురని తాత్పర్యము.

# అష్టాత్రింశోఽధ్యాయః-ముప్పదియెనిమిదవ అధ్యాయము

### విదురస్య నీతిపూర్ణ ఉపదేశః - విదురుని నీతితో నిండిన ఉపదేశము

విదుర ఉవాచ - విదురు డిట్లు చెప్పెను.

ఊర్ధ్వం ప్రాణా ఉత్క్రామన్తి యూనః స్థవిర ఆయతి,
ప్రత్యుత్థానాభివాదాభ్యాం పునస్తాన్ ప్రతిపద్యతే. 1

వయసున నున్నవాని ప్రాణములు వృద్ధుడు వచ్చుచున్నపుడు పైకి లేచి వచ్చును. ఎదురేగి వందన మాచరించుటవలన తిరిగి యువకుడు వానిని పొందు చున్నాడు.

పీఠం దత్వా సాధవేఽభ్యాగతాయ
ఆనీయాపః పరినిర్ణిజ్య పాదౌ,
సుఖం పృష్ట్వా ప్రతివేద్యాత్మసంస్థాం
తతో దద్యా దన్న మవేక్ష్య ధీరః. 2

బుద్ధిమంతుడు-ఎదురుగా వచ్చిన సజ్జనునకు పీఠమొసగి, నీరు తెచ్చి కాళ్లు చక్కగా కడిగి సుఖ మడిగి, తనస్థితిని భక్తితో ఎరుకపరచి, ఆపిమ్మట మెలకువతో అన్న మొసగవలయును.

యస్యోదకం మధుపర్కం చ గాం చ
న మన్త్రవిత్ ప్రతిగృహ్ణాతి గేహే,

---

1. స్థవిరే - వృద్ధుడు; ఆయతి - వచ్చుచుండగా;
2. నిర్ణిజ్య - కడిగి; ఆత్మసంస్థామ్ - తన స్థితిని - కుశలము నని భావము; ప్రతివేద్య - భక్తితో విన్నవించి.

లోభా ద్భయా దథ కార్పణ్యతో వా
తస్యానర్థం జీవిత మాహు రార్యాః. 3

పిసినిగొట్టుతనమువలననో, భయమువలననో, తనవారిపై జాలివలననో గృహస్థుడు వేదము లెరిగిన అభ్యాగతునకు ఉదకము, మధుపర్కము, గోవు అనువానిని ఈయకున్నచో వాని బ్రదుకు పనికిమాలినదని పెద్ద లందురు.

చికిత్సకః శల్యకర్తాఽవకీర్ణీ
స్తేనః క్రూరో మద్యపో భ్రూణహా చ,
సేనాజీవీ శ్రుతివిక్రాయకశ్చ
భృశం ప్రియోఽప్యతిథి ర్నోదకార్హాః. 4

వైద్యుడు, బాణములు చేయువాడు, భ్రష్టమైన బ్రహ్మచర్యము కలవాడు, దొంగ, క్రూరుడు, త్రాగుబోతు, గర్భముననున్న బిడ్డలను చంపువాడు, సేనతో బ్రదుకువాడు, వేదమును అమ్ముకొనువాడు-వీరు అతిథులుగా వచ్చినపుడు నీరు మొదలగునవి యొసగుటకు అర్హులు కారు. కాని వారియం దాదరము చూప నగును.

అవిక్రేయం లవణం పక్వ మన్నం
దధి క్షీరం మధు తైలం ఘృతం చ,

---

3. భయాత్-వచ్చిన అతిథుల కెల్ల గోవు మున్నగువాని నొసగి పూజించినచో అందరు తన్ను ధనవంతు డనుకొందురేమో యను భయమువలన; కార్పణ్యతః - దానము లెక్కువ యిచ్చినచో తనవారి కేమియు మిగుల దేమో యను జాలివలన; మధుపర్కమ్ - నెయ్యి, పాలు, చక్కెర, తేనె, నీరు అనువానిని కలిపి పూజ్యులు ఇంటికి వచ్చునపు డిచ్చు పదార్థము.

4. వైద్యుడు మొదలగువారు మిక్కిలి ప్రియులైనను ఉదకార్హులు కారు-అనియు నర్థము చెప్పవచ్చును గాని ఎట్టివారినైనను మన్నించుట, ప్రియమును సంభాషించుట యను ఉత్తమధర్మమును దృష్టిలో నిడుకొని యిట్లు శ్రీనీలకంఠులు వక్కాణించిరి.

తిలా మాంసం ఫలమూలాని శాకం
రక్తం వాసః సర్వగన్ధా గుడాశ్చ. 5

ఉప్పు, అన్నము, పెరుగు, పాలు, తేనె, నూనె, నెయ్యి, నువ్వులు, మాంసము, పండ్లు, దుంపలు, కూరలు, ఎఱ్ఱని వస్త్రములు, అన్నివిధములగు గంధములు, బెల్లము-అనునవి అమ్మదగినవి కావు.

అరోషణో యః సమలోష్టాశ్మకాఞ్చనః
ప్రహీణశోకో గతసన్ధివిగ్రహః,
నిన్దాప్రశంసోపరతః ప్రియాప్రియే
త్యజ న్నుదాసీనవ దేష భిక్షుకః. 6

రోషము లేనివాడు, మట్టి రాయి బంగారము అనువానియెడ సమబుద్ధి గలవాడు, శోకమును రూపుమాపుకొనినవాడు, స్నేహము పగ అను భావములు లేనివాడు, నింద ప్రశంస అనువానినుండి మరలినవాడు, ప్రియమును అప్రియమును త్యజించినవాడు, ఏదియు అంటనివాడు సన్యాసి యగును.

నీవారమూలేఙ్గుదశాకవృత్తిః
సుసంయతాత్మా ఽగ్నికార్యేషు చోద్యః,

---

5. 4వ శ్లోకమున శ్రుతి నమ్మువాని ప్రస్తావన వచ్చినది. ఆ వరుసలో ఉప్పు మొదలగు వాని నమ్మువారిని చెప్పుట జరిగినది. శ్రుతి విక్రాయకునివలె లవణ విక్రాయకాదులు కూడ అతిథులైనప్పుడు సాధారణ దృష్టితో మాన్యులే యని శ్లోక తాత్పర్యము.
6. దోషములు కలవాడు కూడ అతిథిగా వచ్చినచో పూజింపవలయునన్నచో గుణవంతుని విషయము వేర చెప్పనేల? యను భావముతో ఈరెండు శ్లోకములు చెప్పుచున్నారు; సమలోష్ఠ అశ్మకాంచనః-సమబుద్ధి కలుగుట యనగా మమకారముతో చెడకుండుట యని భావము; గతసన్ధి విగ్రహః-స్నేహము, వైరము లేనివాడు;

వనే వస న్నతిథిష్వప్రమత్తో
ధురంధరః పుణ్యకృదేష తాపసః. 7

నివ్వరిధాన్యము, దుంపలు, గార నూనె, కూరలు అనువానితో జీవించు వాడు, మనోనిగ్రహము గలవాడు, అగ్నికార్యములయందు శ్రద్ధ గలవాడు, అడవియందు నివసించుచు అతిథులయం దేమరుపాటు లేనివాడు, అన్ని భారములు సహించువాడు, పుణ్యకార్యములు చేయువాడు తాపసుడు.

అపకృత్య బుద్ధిమతో దూరస్థోఽస్మీతి నాశ్వసేత్,
దీర్ఘౌ బుద్ధిమతో బాహూ యాభ్యాం హింసతి హింసితః. 8

బుద్ధిమంతునకు అపకారము గావించి దూరముగా నున్నవాడ నని నెమ్మదితో నుండరాదు. బుద్ధిమంతుని బాహువులు మిక్కిలి పొడవైనవి. వానితో నతడు తన్ను హింసించిన వానిని హింసించును.

న విశ్వసే దవిశ్వస్తే విశ్వస్తే నాతివిశ్వసేత్,
విశ్వాసా ద్భయ ముత్పన్నం మూలాన్యపి నికృన్తతి. 9

నమ్మదగనివానియందు నమ్మక ముంచరాదు. నమ్మదగినవానిని కూడ హద్దుమీరి నమ్మరాదు. నమ్మకము వలన పుట్టిన భయము వ్రేళ్ళను కూడ త్రెంపివైచును.

అనీర్షు ర్గుప్తదారశ్చ సంవిభాగీ ప్రియంవదః,
శ్లక్ష్ణో మధురవాక్ స్త్రీణాం న చాసాం వశగో భవేత్. 10

---

7. చోద్యః-విధేయుడు; శ్రద్ధ కలవాడని భావము; తాపసు డనగా-ఏమియు లేనివాడు కూడ-అతిథులయందు శ్రద్ధతో వర్తింపవలయు నన్నచో భాగ్యవంతుని సంగతి చెప్పనేల? అని భావము.

8. దీర్ఘౌ - బుద్ధివిశేషముచేత దూరముగా నున్నవానిని కూడ పట్టుకొనజాలునని భావము.

9. అవిశ్వస్తే-నమ్మదగనివానియందు-ఏమి చేయును లెమ్మని భీమునియందు నీవు ఊరటతో నుండరా దని భావము.

మనుజుడు, ఈసులేనివాడు, భార్యను రక్షించుకొనువాడు, వివేకవంతుడు, ప్రియములు పలుకువాడు, ఆదరణీయుడు, స్త్రీల విషయమున మధురములగు మాటలు పలుకువాడు, వారికి వశము కానివాడు కావలయును.

పూజనీయా మహాభాగాః పుణ్యాశ్చ గృహదీప్తయః,
స్త్రియః శ్రియో గృహస్యోక్తా స్తస్మా ద్రక్ష్యా విశేషతః. 11

స్త్రీలు పూజింపదగినవారు. గొప్ప మహిమ గలవారు, పుణ్యవతులు, ఇంటికి వెలుగు నిచ్చువారు, ఇంటిలో ఉన్న లక్ష్మీదేవులు. కావున మిక్కిలి శ్రద్ధతో వారిని కాపాడవలయును.

పితు రన్తఃపురం దద్యా న్మాతు ర్దద్యా న్మహానసమ్,
గోషు చాత్మసమం దద్యాత్ స్వయమేవ కృషిం వ్రజేత్. 12

తండ్రికి అంతఃపురమును. తల్లికి వంటయింటిని తనతో సాటియగువానికి గోవులను రక్షణకై అప్పచెప్పవలయును. వ్యవసాయమునకు తానే పోవలయును.

భృత్యై ర్వాణిజ్యచారం చ పుత్రైః సేవేత చ ద్విజాన్.

సేవకులచేత వాణిజ్యమును, కొడుకులచేత ద్విజులసేవను నిర్వహింపజేయవలయును.

అద్భ్యోఽగ్ని ర్బ్రహ్మతః క్షత్ర మశ్మనో లోహ ముత్థితమ్. 13
తేషాం సర్వత్రగం తేజః స్వాసు యోనిషు శామ్యతి.

నీటినుండి నిప్పు, బ్రాహ్మణత్వమునుండి క్షత్రియత్వము, రాతినుండి లోహము పుట్టెను. అన్నియెడల ప్రసరించు వానితేజము తమ పుట్టుకతావుల యందు అణగియుండును.

---

10, 11. స్త్రీణాం మధురవాక్, గుప్తదారః అను నీమాటలవలన పాండవులు భార్యవిషయమున మిక్కిలి జాగరూకత గలవారు వారి భార్య లక్ష్మి వంటిది. తండ్రివలె వ్యవహరించవలసిన నీవు ఆమెకు ద్రోహము చేసితివి. అందువలన నీకు భయము పుట్టినదని తాత్పర్యము.

13. సందర్భవశమున ప్రకృతమునకు అంతగా పనికిరాని ధర్మములను చెప్పుచున్నారు. దుర్యోధనుడు ముందు మైత్రేయు నవమానించును గనుక అట్టి పద్ధతి క్షేమముకా దనియు సూచన.

నిత్యం సన్తః కులే జాతాః పావకోపమతేజసః, 14
క్షమావన్తో నిరాకారాః కాష్ఠేఽగ్నిరివ శేరతే.

ఎల్లప్పుడు మంచితనము కలవారు, అగ్నినిబోలు తేజస్సు గలవారు, ఓర్పుగలవారు, బయటబడక గుట్టుగా నున్నవారు నగు పాండవులు కట్టెయందు నిప్పువలె నిద్రించియున్నారు.

యస్య మన్త్రం న జానన్తి బాహ్యాశ్చాభ్యన్తరాశ్చ యే, 15
స రాజా సర్వతశ్చక్షు శ్చిర మైశ్వర్య మశ్నుతే.

వెలుపలివారుగాని,లోపలివారుగాని ఎవనిమంత్రమును (రాజకార్యమునకు సంబంధించిన ఆలోచనను)ఎరుగకుందురో,అట్టి రాజు అన్నియెడల చూపుగలవాడై చిరకాలము ఐశ్వర్యము ననుభవించును.

కరిష్య న్న ప్రభాషేత కృతాన్యేవ తు దర్శయేత్, 16
ధర్మకామార్థకార్యాణి తథా మన్త్రో న భిద్యతే.

రాజు ధర్మ, అర్థకామములకు సంబంధించిన పనులను చేయుచు వానిని గురించి ప్రసంగింపరాదు.చేసినవానినే వెలువరింపవలయును.అట్లు మంత్రము చెడకుండును.

గిరిపృష్ఠ ముపారుహ్య ప్రాసాదం వా రహోగతః, 17
అరణ్యే నిఃశలాకే వా తత్ర మన్త్రోఽభిధీయతే.
నాసుహృ త్పరమం మన్త్రం భారతార్హతి వేదితుమ్. 18

---

14. కులే జాతాః - నీకులమున, లేక సత్కులమున పుట్టిన పాండవులు; నిరాకారాః-తమ ఆకారములను బయలుపరచక గూఢముగా నున్నారని తాత్పర్యము.

16. సర్వతశ్చక్షుః-చారులే రాజులకు కన్నులు,వారిద్వారా పరుల మంత్రము నెరుగుచుండవలయునని తాత్పర్యము.

18. నిఃశలాకే-గడ్డి పెరుగని;తీగలు అల్లుకొనని-అట్టి తావు అయినచో ఎవడైన దాగియుండి మంత్రము నెరుగవచ్చునని భావము.

కొండకొమ్మెక్కియో,ఒంటరిగా నున్న భవనము నెక్కియో,గడ్డితీగలు అల్లుకొనని అడవియందో రాజకార్యముల ఆలోచన చేయవలెను.భారతా!మైత్రిలేని వాడు గొప్పమంత్రము నెరుగరాదు.

అపణ్డితో వాఽపి సుహృత్ పణ్డితో వాఽప్యనాత్మవాన్,
నాపరీక్ష్య మహీపాలః కుర్యాత్ సచివ మాత్మనః. 19

పండితుడుకాక మిత్రుడై యుండువానిని,పండితుడయ్యు చపలచిత్తుడైన వానిని రాజు మంత్రిగా చేసికొనరాదు.బాగుగా పరీక్షింపవలయును.

అమాత్యే హ్యర్థలిప్సా చ మన్త్రరక్షణ మేవ చ,
కృతాని సర్వకార్యాణి యస్య పారిషదా విదుః. 20
ధర్మే చార్థే చ కామే చ స రాజా రాజసత్తమః.
గూఢమన్త్రస్య నృపతే స్తస్య సిద్ధి రసంశయమ్. 21

అర్థములు సిద్ధించుట, మంత్రరక్షణము అనునవి మంత్రియందు ఆధారపడియుండును.

ధర్మము, అర్థము, కామము అనువానికి సంబంధించిన పనులన్నియు ముగిసినవెనుకనే సభ్యులు తెలిసికొందురేని అట్టిరాజు రాజులలో శ్రేష్ఠుడు. అట్లు గుట్టుగానున్న మంత్రముగల రాజునకు కార్యసిద్ధి యగుటలో సంశయము లేదు.

అప్రశస్తాని కార్యాణి యో మోహా దనుతిష్ఠతి,
స తేషాం విపరిభ్రంశా ద్భ్రశ్యతే జీవితాదపి. 22

పలువురు ఆడిపోసికొను పనులను ఒడలెరుగక చేయువాడు, అవి తలక్రిందుగా పడుటవలన వాడును జీవితమునుండియు భ్రష్టుడగును.

---

19. అనాత్మవాన్-వాగుడుకాయి అని భావము.

20. సభలోనున్నవారికే ముగిసినపిదప తెలియు ననగా ఇతరుల సంగతి చెప్పనేల?

22. విపరిభ్రంశాత్ - విపరీతముగా పడుట అనగా ఇతరుల నుద్దేశించి చేసిన కీడు తనకే మూడుట అని తాత్పర్యము. పాండవులకు మీరు చేసిన ద్రోహము లన్నియు మీకే వచ్చి చుట్టుకొనునని సూచన.

కర్మణాం తు ప్రశస్తానా మనుష్ఠానం సుఖావహమ్,
తేషా మేవాననుష్ఠానం పశ్చాత్తాపకరం మతమ్. 23

ఉత్తమములగు కార్యములను చేయుట యన్ననో సుఖమును గూర్చును. వానిని చేయకుండుట తుదకు, పశ్చాత్తాపము కలిగించును.

అనధీత్య యథా వేదా న్న విప్రః శ్రాద్ధ మర్హతి,
ఏవ మశ్రుతషాడ్గుణ్యో న మన్త్రం శ్రోతు మర్హతి. 24

వేదములను అధ్యయనము చేయని విప్రుడు శ్రాద్ధమునకు యోగ్యుడు కానట్లు రాజనీతికి సంబంధించిన ఆరుగుణములు చదువనివాడు మంత్రమును వినదగడు.

స్థానవృద్ధిక్షయజ్ఞస్య షాడ్గుణ్యవిదితాత్మనః,
అనవజ్ఞాతశీలస్య స్వాధీనా పృథివీ నృప. 25

తనస్థితియొక్క వృద్ధిక్షయము లెరిగినవాడు, షడ్గుణముచేత స్వరూపము నెరిగినవాడు, శీలమునందు మన్నన కలవాడు నగు రాజునకు భూమి వశమగును.

అమోఘక్రోధహర్షస్య స్వయం కృత్వాఽన్వవేక్షిణః,
ఆత్మప్రత్యయకోశస్య వసుధైవ వసున్ధరా. 26

---

23. ప్రశస్తములగు పనులు చేయకుండుటయు దోషమే యని తాత్పర్యము.

24. అశ్రుతషాడ్గుణ్యః - సంధి, విగ్రహము, యానము, ఆసనము, ద్వైధీభావము, సమాశ్రయణము అనువాని సముదాయమును అధ్యయనము చేయనివాడు.

25. స్థానవృద్ధిక్షయజ్ఞస్య-స్థాన మనగా తానున్న దశ - దానియొక్క పెంపు నాశము అనునవి యెరిగినవానికి;షాడ్గుణ్య విదిత, ఆత్మనః-షడ్గుణములచేత తెలియవచ్చిన స్వరూపము గలవానికి; అనవజ్ఞాతశీలస్య-శీలము నవమానింపనివానికి.

26. ఆత్మప్రత్యయకోశస్య - తనచేతనే విశ్వాసము పొందిన కోశముగల - కోశమును స్వయముగా పరిరక్షించుకొనువానియొక్క-అని భావము.

వ్యర్థముకాని కోపము, మెప్పు కలవాడు, చేసినపనిని స్వయముగా విమర్శించుకొనువాడు, స్వయముగా ధనాగారమును చక్కజూచుకొనువాడు నగు రాజునకు భూమి సర్వధనముల నొసగునదియే యగును.

నామమాత్రేణ తుష్యేత ఛత్రేణ చ మహీపతిః,
భృత్యేభ్యో విసృజే దర్థా న్నైకః సర్వహరో భవేత్. 27

రాజు రాజన్న పేరు మాత్రముతో, ఛత్రముతో తృప్తిపడవలయును. సొమ్ములన్నియు సేవకులకు వదలవలయును. ఒక్కడై యంతయు చేజిక్కించుకొనరాదు.

బ్రాహ్మణం బ్రాహ్మణో వేద భర్తా వేద స్త్రియం తథా,
అమాత్యం నృపతి ర్వేద రాజా రాజానమేవ చ. 28

బ్రాహ్మణుని సంగతి బ్రాహ్మణు డెరుగును. స్త్రీవిషయము భర్త యెరుగును. మంత్రినిగూర్చి రాజెరుగును. రాజునుగూర్చి రాజే యెరుగును.

న శత్రు ర్వశ మాపన్నో మోక్తవ్యో వధ్యతాం గతః
న్యగ్భూత్వా పర్యుపాసీత వధ్యం హన్యా ద్బలే సతి,
అహతాద్ధి భయం తస్మా జ్జాయతే నచిరాదివ. 29

చంపదగిన శత్రువు చిక్కినయెడల వదలరాదు. వానికంటె తక్కువవాడైనచో అణగియుండవలయును. బలమున అధికుడైనచో చంపదగిన శత్రువును చంపవలయును. చంపనిచో కొలదికాలములోనే వానివలన భయము కలుగును.

దైవతేషు ప్రయత్నేన రాజసు బ్రాహ్మణేషు చ,
నియన్తవ్యః సదా క్రోధో వృద్ధబాలాతురేషు చ. 30

దైవతములయందు, రాజులయందు, బ్రాహ్మణులయందు, ముసలివారియందు, పిన్నవారియందు, రోగులయందు క్రోధమును గట్టియత్నముతో అదుపున పెట్టుకొనవలయును.

---

27. ఏకః సర్వహరో భవేత్-భోగములను భృత్యులతో కలిసి అనుభవింపవలయునని తాత్పర్యము.

నిరర్థం కలహం ప్రాజ్ఞో వర్జయే న్మూఢసేవితమ్,
కీర్తిం చ లభతే లోకే న చానర్థేన యుజ్యతే. 31

బుద్ధిమంతుడు, మూఢులు మాత్రముచేసెడు పనికిమాలిన కయ్యమును వదలవలయును. దానివలన లోకమున కీర్తి కలుగును.కీడునందు చిక్కుకొనడు.

ప్రసాదో నిష్ఫలో యస్య క్రోధశ్చాపి నిరర్థకః,
న తం భర్తార మిచ్ఛన్తి షణ్ఢం పతిమివ స్త్రియః. 32

ఎవని అనుగ్రహము నిష్ఫలమో, క్రోధము పనికిమాలినదో అట్టివానిని, పేడివానిని స్త్రీలు పతినిగా కోరనివిధమున, రాజుగా వాంఛింపరు.

న బుద్ధి ర్ధనలాభాయ న జాడ్య మసమృద్ధయే,
లోకపర్యాయవృత్తాన్తం ప్రాజ్ఞో జానాతి నేతరః. 33

బుద్ధి ఉన్నంతమాత్రమున కలిమియు జడుడైనంతమాత్రమున లేమియు కలుగదు. ప్రజ్ఞకలవాడు లోకములతారుమారుస్థితిని ఎరుగును. ఇతరు డెరుగడు.

విద్యాశీలవయోవృద్ధాన్ బుద్ధివృద్ధాంశ్చ భారత,
ధనాభిజాతవృద్ధాంశ్చ నిత్యం మూఢోఽవమన్యతే. 34

విద్య, శీలము, బుద్ధి, ధనము, కులము అనువానిలో పెద్దలైనవారిని మూఢుడు ఎల్లవేళల అవమానించును.

అనార్యవృత్త మప్రాజ్ఞ మసూయక మధార్మికమ్,
అనర్థాః క్షిప్ర మాయాన్తి వాగ్దుష్టం క్రోధనం తథా. 35

సత్ప్రవర్తన లేనివానిని, తెలివితక్కువవానిని, అసూయ కలవానిని, ధర్మము పాటింపనివానిని, నోటిదురుసుతనము కలవానిని, కోపము అధికముగా గలవానిని కీడులు శీఘ్రముగా వచ్చి చేరును.

---

33. లోకపర్యాయవృత్తాన్తమ్-లోకములు క్రిందుమీదగుట యను సంగతిని-అన్నియు కర్మములనుబట్టి యేర్పడు నను జ్ఞానమును; కావుననే బుద్ధి గలవా రందరు ధనవంతులు, బుద్ధిలేనివా రందరు దరిద్రులు అగుట లేదు. తారమారగుట కానవచ్చుచున్నది.

34. అభిజాతః-సత్కులమున పుట్టినవాడు.

అవిసంవాదనం దానం సమయస్యావ్యతిక్రమః,
ఆవర్తయన్తి భూతాని సమ్యక్ ప్రణిహితా చ వాక్. 36

వంచనలేని దానము, మర్యాదను మీరకుండుట, చక్కగా పలికిన పలుకు అనునవి సర్వభూతములను తనవైపునకు మరలించును.

అవిసంవాదకో దక్షః కృతజ్ఞో మతిమా నృజుః,
అపి సంక్షీణకోశోఽపి లభతే పరివారణమ్. 37

వంచన చేయనివాడు, సమర్థుడు, కృతజ్ఞుడు, బుద్ధిమంతుడు, సరళ స్వభావము గలవాడు, కాలవశమున ధనము కోల్పోయినను అండదండలు కల వాడే యగును.

ధృతిః శమో దమః శౌచం కారుణ్యం వాగనిష్ఠురా,
మిత్రాణాం చానభిద్రోహః సప్తైతాః సమిధః శ్రియః. 38

ధైర్యము, మనస్సు-ఇంద్రియములు అదుపున నుండుట, పరిశుద్ధి, దయ, మెత్తనిమాట, మిత్రుల కెన్నడు ద్రోహము తలపకుండుట అను నీ యేడును లక్ష్మిని పెంపొందించునవి.

అసంవిభాగీ దుష్టాత్మా కృతఘ్నో నిరపత్రపః,
తాదృ ఙ్నరాధిపో లోకే వర్జనీయో నరాధిప. 39

రాజా! తనవారికి పెట్టక కుడుచువాడు, దుష్టబుద్ధి, కృతఘ్నుడు, సిగ్గుమాలినవాడు నగు రాజును పోనాడవలయును.

న చ రాత్రౌ సుఖం శేతే ససర్ప ఇవ వేశ్మని,
యః కోపయతి నిర్దోషం సదోషోఽభ్యన్తరం జనమ్. 40

---

36. అవిసంవాదమ్-వంచన లేనివానిని; సమయస్య-తా నితరునకు, ఇతరుడు తనకు చేసిన కట్టుబాటును; అవ్యతిక్రమః-దాటకుండుట; ప్రణిహితా-ప్రయోగింపబడిన; ఆవర్తయన్తి-మరలించును. శత్రువులనుగూడ తన వారిని గావించునని తాత్పర్యము.

37. పరివారణమ్-పరివారమును-బంధుమిత్రులను-అండదండలను.

38. సమిధః-పుడకలు-వృద్ధి పొందించునవని తాత్పర్యము.

39. అసంవిభాగీ - పంచి యీయనివాడు - తనపై ఆధారపడి బ్రదుకువారికి ఒసగక స్వయముగా తినువాడు.

తనయందు దోషము లన్నియు నుండగా ఏ తప్పులు లేని తనవారికి అలుకబుట్టించు నరుడు పామున్న యింటియందువలె రాత్రి సుఖముగా నిద్రింపడు.

యేషు దుష్టేషు దోషః స్యా ద్యోగక్షేమస్య భారత,
సదా ప్రసాదనం తేషాం దేవతానా మివాచరేత్. 41

ఎవరు చేటొందినచో తన యోగక్షేమములకు చేటు కలుగునో అట్టివారిని, దేవతలనువలె, ఎల్లవేళల, ప్రసన్నులను చేసికొనవలయును.

యేఽర్థాః స్త్రీషు సమాయుక్తాః ప్రమత్తపతితేషు చ,
యేచానార్యే సమాసక్తాః సర్వే తే సంశయం గతాః. 42

స్త్రీలయందు, మైమరపువారియందు, చెడినవారియందు, నీచులయందు ఉన్న అర్థము లన్నియు సంశయగ్రస్తములే.

యత్ర స్త్రీ యత్ర కితవో బాలో యత్రానుశాసితా,
మజ్జన్తి తేఽవశా రాజన్నద్యా మశ్మప్లవా ఇవ. 43

స్త్రీ, జూదగాడు, బాలుడు శాసించువారైనచో జనులు, నదిలో రాల తెప్పలవలె, పట్టుతప్పి మునిగి పోవుదురు.

ప్రయోజనేషు యే సక్తా న విశేషేషు భారత,
తా నహం పణ్డితా న్మన్యే విశేషా హి ప్రసఙ్గినః. 44

పనిపడినప్పుడు ఆదుకొనువారు, తక్కినపుడు దూరముగానుండువారు నగు సేవకులను నేను పండితులుగా పరిగణింతును. అట్లు కానివారు ఊరక త్రొక్కిసలాడువా రగుదురు.

---

41. దుష్టేషు - రాజువలన చేటు పొందినవారని భావము;
42. సంశయం గతాః - ప్రయోజనము కలుగుట సందేహాస్పదమని భావము
43. అశ్మప్లవాః - రాలతో చేసిన నావలు లేక తెప్పలు.
44. విశేషేషు - పనిచేయువారు ఉండవలసినదానికంటె నెక్కువగా ఉన్న సందర్భములందని భావము; ప్రసఙ్గినః - ప్రసంగ మనగా సంఘర్షము త్రొక్కిసలాట-అది చేయువారు - పని పాడుచేయువా రని తాత్పర్యము.

యం ప్రశంసన్తి కితవా యం ప్రశంసన్తి చారణాః,
యం ప్రశంసన్తి బన్ధక్యో న స జీవతి మానవః. 45

జూదగాండ్రు, స్తోత్రపాఠకులు, వేశ్యలు, ఎవనిని పొగడుదురో వానికి బ్రదుకు లేదు.

హిత్వా తాన్ పరమేష్వాసాన్ పాణ్డవా నమితౌజసః,
ఆహితం భారతైశ్వర్యం త్వయా దుర్యోధనే మహత్. 46

రాజా!గొప్ప విలుకాండ్రు,గొప్ప తేజస్సుగలవారు నగు పాండవులను వదలి,నీవు గొప్పదియగు ఐశ్వర్యమును దుర్యోధనునియం దుంచితివి.

తం ద్రక్ష్యసి పరిభ్రష్టం తస్మాత్త్వ మచిరాదివ,
ఐశ్వర్యమదసంమూఢం బలిం లోకత్రయాదివ. 47

ఐశ్వర్యమదముచే కన్నుగానని బలిచక్రవర్తి మూడులోకములలో నిలువజాలనివిధమున ఆదుర్యోధనుడు త్వరలోనే సర్వనాశనము చెందును.నీవది చూతువు.

ఇతి శ్రీమహాభారతే ఉద్యోగపర్వణి ప్రజాగరపర్వణి
విదురవాక్యే అష్టత్రింశోధ్యాయః.

ఇది శ్రీమహాభారతము ఉద్యోగపర్వమున ప్రజాగరపర్వమున
విదురవాక్యముగల ముప్పదియెనిమిదవ అధ్యాయము.

— (౦) —

---

45. ప్రశంసన్తి-ధనముకోసము పొగడి వానిని పీడకొని తిందురని భావము.
46. తస్మాత్ - అకారణమున; అచిరాదివ - త్వరలోనే; సర్వనాశనము దాపురించిన దని హెచ్చరిక.

# ఏకోనచత్వారింశోఽధ్యాయః- ముప్పది తొమ్మిదవ అధ్యాయము

**ధృతరాష్ట్రం ప్రతి విదురస్య నీతియుక్త ఉపదేశః.**
**ధృతరాష్ట్రునికి విదురుడు నీతియుక్తముగా ఉపదేశించుట.**

ధృతరాష్ట్ర ఉవాచ-ధృతరాష్ట్రు డిట్లు పలికెను.

అనీశ్వరోఽయం పురుషో భవాభవే
సూత్రప్రోతా దారుమయీవ యోషా,
ధాత్రా దిష్టస్య వశే కృతోఽయం
తస్మాద్ వద త్వం శ్రవణే ధృతోఽహమ్. 1

నాయనా! కలిమిలేములందు పురుషునకు స్వాతంత్ర్యము లేదు. త్రాడుకట్టి లాగుచున్న కొయ్యబొమ్మవంటివాడు. బ్రహ్మదేవుడు అంతటని దైవమునకు వశము చేసియున్నాడు. కావున నీవు చెప్పుచుండుము. నేను ధైర్యముతో వినుచుందును.

విదుర ఉవాచ-విదురు డిట్లు చెప్పెను.

అప్రాప్తకాలం వచనం బృహస్పతి రపి బ్రువన్,
లభతే బుద్ధ్యవజ్ఞాన మవమానం చ భారత. 2

అసందర్భమగు మాట పలుకుచు బృహస్పతియైనను, బుద్ధిహీను డన్న మాటను, అవమానమును పొందును.

---

1. అనీశ్వరః - పరతంత్రుడు; - భవాభవే - కలిమిలేములయందు; సూత్రప్రోతా-త్రాటికి గ్రుచ్చిన; దారుమయీ - చెక్కతో చేసిన; యోషా ఇవ-బొమ్మవలె;త్వం వద-నీవు చెప్పుచుండుము అనగా నన్ను నిందింపవలదని భావము;ధృతః-ధృతి-అన్నిటిని భరించు శక్తిగలవాడు.

2. బుద్ధ్యవజ్ఞానమ్-బుద్ధికి అవమానము.

ప్రియో భవతి దానేన ప్రియవాదేన చాపరః,
మన్త్రిమూలబలే నాన్యో యః ప్రియః ప్రియ ఏవ సః. 3

ఒకడు దానమువలన ప్రియు డగును. మరియొకడు ప్రియములు పలికి ప్రియు డగును. వేరొకడు మంత్రబలముచేతనో మూలబలముచేతనో ప్రియు డగును. కాని నిజమైన ప్రియు డెన్నటికిని ప్రియుడే.

ద్వేష్యో న సాధు ర్భవతి న మేధావీ న పణ్డితః,
ప్రియే శుభాని కార్యాణి ద్వేష్యే పాపాని చైవ హ. 4

నరు డొకనిని ద్వేషించునేని వానియందున్న మంచితనమును, తెలివిని, పాండిత్యమును ఒప్పుకొనడు. ప్రియుడైనచో కార్యము లన్నియు శుభములే. ఇష్టుడు కానిచో అన్నియు పాపములే.

ఉక్తం మయా జాతమాత్రేఽపి రాజన్
దుర్యోధనం త్యజ పుత్రం త్వమేకమ్,
తస్య త్యాగాత్ పుత్రశతస్య వృద్ధి-
రస్యాత్యాగాత్ పుత్రశతస్య నాశః. 5

రాజా! నేను దుర్యోధనుడు పుట్టినప్పుడే వీని నొక్కనిని విడువుము. వీనిని వదలుటవలన నూరుగురు కొడుకులు పెంపొందుదురు. వీనిని విడువకున్నచో నూరుగురు నాశనమగుదురు - అని చెప్పితిని.

---

3. ప్రియో భవతి-దానాదులవలన ప్రియుడైనవాడు అవి లేనిచో అప్రియు డగును. అట్లుకాక నిర్వ్యాజముగా ప్రియుడైనవాడు ఎన్నటికిని ప్రియుడే అగునని భావము. నేను నీకట్టివాడననియు సూచన.

4. ద్వేషముగలవాడు దానినే చూచును గాని మంచితనము మొదలగు దానిని చూడడని భావము. తాను వలచినది రంభ యన్నట్లు తన కిష్టము కానిచో మంచితనము మొదలగునవి యున్నను లేవనును. ఇష్టమైనచో లేకున్నను ఉన్నట్లు చెప్పును.

న వృద్ధి ర్బహుమన్తవ్యా యా వృద్ధిః క్షయ మావహేత్,
క్షయోఽపి బహుమన్తవ్యో యః క్షయో వృద్ధి మావహేత్. 6

అప్పుడున్న వృద్ధిని గొప్పదిగా భావింపరాదు. ఏలయన అది క్షయమును పొందవచ్చును. అట్లే క్షయమునుకూడ అట్లే యుండునని భావింపరాదు. అది వృద్ధిగా రూపొందవచ్చును.

న స క్షయో మహారాజ యః క్షయో వృద్ధి మావహేత్,
క్షయః సత్విహ మన్తవ్యో యం లబ్ధ్వా బహు నాశయేత్. 7

మహారాజా! వృద్ధిగా పరిణమించు క్షయము క్షయము కాదు. ఏది లభించి అధికమును నశింప జేయునో అదియే ఇట క్షయ మనదగును.

సమృద్ధా గుణతః కేచి ద్భవన్తి ధనతోఽపరే,
ధనవృద్ధాన్ గుణై ర్హీనాన్ ధృతరాష్ట్ర వివర్జయ. 8

కొందరు గుణములే గొప్ప సంపదగా గలవారు. మరికొందరు ధనముతో సంపన్నులు. ధృతరాష్ట్రా! ధనముతో గొప్పవారై గుణములు లేనివారలను విడిచి పుచ్చుము.

ధృతరాష్ట్ర ఉవాచ-ధృతరాష్ట్రు డిట్లు పలికెను.

సర్వం త్వ మాయతీయుక్తం భాషసే ప్రాజ్ఞసంమతమ్,
న చోత్సహే సుతం త్యక్తుం యతో ధర్మ స్తతో జయః. 9

నీవు బుద్ధిమంతు లంగీకరించు విధముగా అంతయు తుదికి మేలొనరించు దానిని చెప్పుచున్నావు. కాని నేను కొడుకును విడువజాలను. ధర్మమెటువైపో జయ మటువైపే అగుగాక!

విదుర ఉవాచ-విదురు డిట్లు చెప్పెను.

అతీవ గుణసంపన్నో నజాతు వినయాన్వితః,
సుసూక్ష్మమపి భూతానా ముపమర్ద ముపేక్షతే. 10

---

6. వృద్ధి-ధనాదులు పెంపొందుట; క్షయః - ధనాదులు తరిగిపోవుట.

9. ఆయతీయుక్తమ్-భావికాలమున మేలు చేయుదానిని; ప్రాజ్ఞసంమతమ్-గొప్ప తెలివికల వారందరు అంగీకరించు దానిని;

10. నీవు వదలుచున్నను మిక్కిలి గుణసంపన్నుడైన ధర్మరాజు నీ కొడుకును ఉపేక్షింపడు సుమా! అని హెచ్చరిక.

గొప్పగుణములు సమృద్ధిగా గలవాడు, వినయముతో కూడినవాడునగు నరుడు ప్రాణులకు వాటిల్లు అతి సూక్ష్మమగు పీడను కూడ ఎన్నటికిని ఉపేక్షింపడు.

పరాపవాదనిరతాః పరదుఃఖోదయేషు చ,
పరస్పరవిరోధే చ యతన్తే సతతోత్థితాః. 11

కొందరు ఇతరులను దూలనాడుటలో ఆసక్తి కలవారు. ఇతరులకు దుఃఖమును పుట్టించుటలో ఒకరికొకరికి కలహములు పెట్టుటలో ఎల్లవేళల జాగరూకులై యత్నించుచుందురు.

సదోషం దర్శనం యేషాం సంవాదే సుమహద్భయమ్,
అర్థాదానే మహాన్ దోషః ప్రదానే చ మహద్భయమ్. 12

అట్టివారిని చూచుట పాపము. వారితో కలిసియుండుటవలన గొప్ప భయము పుట్టును. వారినుండి ధనము కొనుటయు, వారికి ధనమిచ్చుటయు పెద్ద కీడు.

యే వై భేదనశీలాస్తు సకామా నిస్త్రపాః శఠాః,
యే పాపా ఇతి విఖ్యాతాః సంవాసే పరిగర్హితాః. 13

కొందఱకు తంపులు పెట్టుటయే స్వభావము. అట్టివారు స్వార్థపరులు. సిగ్గులేనివారు, మొండివారు. పాపులుగా లోకమంతయు చెప్పుకొనుచుండును. అట్టివారు సహవాసవిషయమున బొత్తిగా పనికిరానివారు.

యుక్తా శ్చాన్యై ర్మహాదోషై ర్యే నరా స్తాన్ వివర్జయేత్,
నివర్తమానే సౌహార్దే ప్రీతి ర్నీచే ప్రణశ్యతి. 14

మహాపాపములతో సంబంధముగల నరులను విడువనే వలయును. స్నేహము కలిగించిన కారణము మరలిన పిదప నీచునియందు ప్రీతి రూపు మాసిపోవును.

---

11,12,13. పోనీ కొడుకును వదలజాలనిచో తంపులమారివారగు కర్ణశకునాదుల నైన వదలుము. బాగుపడెద వను తాత్పర్యముతో ఈ శ్లోకములు చెప్పుచున్నారు.

14. సౌహార్దే-మైత్రికి గల హేతువు; నివర్తమానే సతి-మరలిపోగా.

యా చైవ ఫలనిర్వృత్తిః సౌహృదే చైవ యత్సుఖమ్.

మైత్రివలన రానగు ఫలము, మైత్రియందుండు సుఖముకూడ నశించును.

యతతే చాపవాదాయ యత్న మారభతే క్షయే, 15

అల్పేఽప్యపకృతే మోహా న్న శాన్తి మధిగచ్ఛతి.

అట్టి నీచుడు లేనిపోని నిందలు వేయుటకై ప్రయత్నించును. మన వినాశమునకు యత్నము మొదలిడును. ఒడ లెరుగక ఏకొంచెము అపకారము తోడనో శాంతిని పొందడు.

తాదృశైః సంగతం నీచై ర్నృశంసై రకృతాత్మభిః, 16

నిశమ్య నిపుణం బుద్ధ్యా విద్వాన్ దూరా ద్వివర్జయేత్.

క్రూరులు, హృదయము లేనివారు నగునట్టి నీచులతో సంబంధమును జాగ్రత్తగా బుద్ధితో విచారించి తెలివిగలవాడు దూరముగా వదలివేయవలయును.

యో జ్ఞాతి మనుగృహ్ణాతి దరిద్రం దీన మాతురమ్, 17

సపుత్రపశుభి ర్వృద్ధిః శ్రేయ శ్చాన న్త్య మశ్నుతే.

దరిద్రుడు, దీనుడు రోగి అయిన తన కులమువానిని చేపట్టువాడు పుత్రులతో పశువులతో వృద్ధిపొందును. అంతములేని శ్రేయస్సు పొందును.

జ్ఞాతయో వర్ధనీయా స్తై ర్య ఇచ్ఛ న్త్యాత్మనః శుభమ్. 18

కులవృద్ధిం చ రాజేన్ద్ర తస్మాత్ సాధు సమాచర,

శ్రేయసా యోక్ష్యతే రాజన్ కుర్వాణో జ్ఞాతిసత్క్రియామ్. 19

తమ మేలుకోరువారు కులవృద్ధిని కాంక్షించువారు, జ్ఞాతులను పెంపొందింతురు. కాన, రాజేంద్రా! దానిని లెస్సగా ఆచరింపుము. జ్ఞాతులకు మేలు చేయువాడు శ్రేయస్సు పొందును.

విగుణా హ్యపి సంరక్ష్యా జ్ఞాతయో భరతర్షభ,

కిం పున ర్గుణవ న్తస్తే త్వత్ప్రసాదాభికాఙ్క్షిణః. 20

16. సంగతమ్-సంబంధమును; నిశమ్య-విచారించి;

జ్ఞాతులను గుణము లేనివారినైనను రక్షింపవలయును. నీ అనుగ్రహము కోరుచున్న గుణవంతులగు ఆ పాండవుల సంగతి చెప్పనేల?

ప్రసాదం కురు వీరాణాం పాణ్డవానాం విశామ్పతే,
దీయన్తాం గ్రామకాః కేచిత్తేషాం వృత్త్యర్థ మీశ్వర. 21

రాజా! సమర్థుడా! వీరులైన పాండవులయెడ అనుగ్రహము చూపుము. వారిబ్రదుకునకై కొన్ని చిన్న పల్లియలనైన నిమ్ము.

ఏవం లోకే యశః ప్రాప్తం భవిష్యతి నరాధిప.

రాజా! ఇట్లైనచో నీకు లోకమున కీర్తి దక్కును.

వృద్ధేన హి త్వయా కార్యం పుత్రాణాం తాత శాసనమ్,
మయా చాపి హితం వాచ్యం విద్ధి మాం త్వద్ధితైషిణమ్. 22

నీవు పెద్దవాడవు. కొడుకులను అదుపున పెట్టుకొనవలయును. నేనును నీకు మేలైన మాట చెప్పవలయును. నేను నీమేలు కోరువాడనని యెఱుగుము.

జ్ఞాతిభి ర్విగ్రహ స్తాత న కర్తవ్యః శుభార్థినా,
సుఖాని సహ భోజ్యాని జ్ఞాతిభి ర్భరతర్షభ. 23

తనకు శుభము కోరువాడు తనకులమువారితో ఎన్నడు విరోధము పెట్టుకొనరాదు. సుఖములను జ్ఞాతులతో కలసి అనుభవింపవలయును.

సంభోజనం సంకథనం సంప్రీతిశ్చ పరస్పరమ్,
జ్ఞాతిభిః సహ కార్యాణి న విరోధః కదాచన. 24

జ్ఞాతులొకరి కొకరు కలిసి చక్కగా భుజించుట, ప్రియములు పలికికొనుట, ప్రీతినొందుట అనునవియే చేయవలయును. ఎన్నటికిని విరోధము పెట్టుకొనరాదు.

జ్ఞాతయ స్తారయ న్తీహ జ్ఞాతయో మజ్జయన్తి చ,
సువృత్తా స్తారయన్తీహ దుర్వృత్తా మజ్జయన్తి చ. 25

25. తారయన్తి-ఆపదలలో గట్టెక్కింతు రని భావము; మజ్జయన్తి-ఆపదలు కలుగునట్లు చేయుదురని భావము.

జ్ఞాతు లాకరినాకరు ఇహలోకమున తరింపజేసికొందురు. ముంచు కొనుటయు జరుగును. మంచినడవడిగలవారు తరింపజేయుదురు. చెడునడవడి గలవారు ముంచివేయుదురు.

సువృత్తో భవ రాజేన్ద్ర పాణ్డవాన్ ప్రతి మానద,
అధర్షణీయః శత్రూణాం తైర్వృత స్త్వం భవిష్యసి. 26

రాజేంద్రా! మన్నన నొసగువాడా! పాండవుల విషయమున మంచి వాడవు కమ్ము. వారితో కలసి యున్నచో నిన్ను శత్రువులు అణపజాలరు.

శ్రీమన్తం జ్ఞాతి మాసాద్య యో జ్ఞాతి రవసీదతి,
దిగ్ధహస్తం మృగ ఇవ స ఏన స్తస్య విన్దతి. 27

శ్రీమంతుడగు జ్ఞాతిని పొంది వానిని చెడగొట్టు జ్ఞాతి మృగమును చంపు విషపు బాణముగల బోయవంటివాడు. శ్రీమంతుడైనను వాడు ఆ పాపమును పొందును.

పశ్చాదపి నరశ్రేష్ఠ తవ తాపో భవిష్యతి,
తాన్ వా హతాన్ సుతాన్ వాఽపి శ్రుత్వా తదను చిన్తయ. 28

వారుగాని నీకొడుకులుగాని చచ్చిరని విని పిదప నీవు దుఃఖపడుదువు. దానిని అనుక్షణము స్మరింపుము.

యేన ఖట్వాం సమారూఢః పరితప్యేత కర్మణా,
ఆదావేవ న తత్ కుర్యా దధ్రువే జీవితే సతి. 29

ఏపని చేసిన చివరకు మూలగదిలో మంచమెక్కి కుమిలిపోవలసివచ్చునో ఆపనిని ముందే చేయకుండవలయును. బ్రదుకు స్థిరము కాదుగదా!

---

27. దిగ్ధహస్తమ్ - విషము పూసిన బాణము చేతియందుగల; మృగమును చంపిన పాపమును బోయవాడు పొందినట్లు జ్ఞాతిని చెరచిన పాపము జ్ఞాతి పొందునని భావము.

28. యుద్ధము జరిగినచో రెండు విధముల నీకే నష్టమని భావము.

29. ఖట్వాం సమారూఢః-శోకగృహమున మంచమెక్కి;

న కశ్చి న్నాపనయతే పుమా నన్యత్ర భార్గవాత్,
శేషసంప్రతిపత్తిస్తు బుద్ధిమత్స్వేవ తిష్ఠతి. 30

శుక్రాచార్యుని వదలినచో తక్కిన మానవమాత్రుడు నీతిమాలినపనులు చేయడని లేదు.కాని సందర్భమునకు తగినట్లు చక్కదిద్దుకొనుట బుద్ధిమంతుల యందే యుండును.

దుర్యోధనేన యద్యేతత్ పాపం తేషు పురాకృతమ్,
త్వయా తత్కులవృద్ధేన ప్రత్యానేయం నరేశ్వర. 31

పాండవుల విషయమున మునుపు దుర్యోధనుడు చేసిన పాపమును కులముపెద్దవు నీవు మరలింపవలయును.

తాం స్త్వం పదే ప్రతిష్ఠాప్య లోకే విగతకల్మషః,
భవిష్యసి నరశ్రేష్ఠ పూజనీయో మనీషిణామ్. 32

పాండవులను నీవు తగుతావున నెలకొల్పినచో రాజోత్తమా!నీపాపము తీరును.బుద్ధిమంతులు నిన్ను కొనియాడుదురు.

సువ్యాహృతాని ధీరాణాం ఫలతః పరిచిన్త్య యః,
అధ్యవస్యతి కార్యేషు చిరం యశసి తిష్ఠతి. 33

---

30. భార్గవాత్ - నీతిశాస్త్రకర్తయైన శుక్రునికంటె;అన్యత్ర-ఇతరుడు;పుమాన్-పురుషుడు;న అపనయతే-నీతిమాలినపని చేయడు;ఇతి న-అని లేదు.మానవుడన్నతర్వాత ఎప్పుడైనను నీతిమాలినపని చేయక తప్పకపోవచ్చునని తాత్పర్యము. శేషసంప్రతిపత్తిః - శేషస్య - మిగిలినదానియొక్క;సంప్రతిపత్తిః-విచారణ;తు-మాత్రము;బుద్ధిమత్సు,ఏవ-బుద్ధిమంతులయందే;తిష్ఠతి-నిలుచును.పొరపాటుననో,క్రోధాదులవలననో ఒకసమయమున తప్పుడు పని చేసినను,అయినదేదో అయినది,మిగిలినదానిని సరిచూచుకొని తప్పు దిద్దుకొనవలయునను భావన బుద్ధిమంతులలో నుండును. మీరట్లు భావింప కుండుటవలన బుద్ధిహీనులుగా లెక్కకు వత్తురని అధిక్షేపణ.

32. పదే ప్రతిష్ఠాప్య-రాజ్యభాగము నొసగుటచేత స్థిరులను గావించి;

33. ధీరాణామ్ - బుద్ధిబలముతో ఉపదేశించువారి;సువ్యాహృతాని - మంచిపలుకులను;అధ్యవస్యతి-నిశ్చయము చేయును-ఉత్తమఫలములనొసగు పనులను ప్రారంభించువానికి స్థిరమైన కీర్తి కలుగునని భావము,

ధీమంతుం చక్కని మాటలను ఫలములనుబట్టి చక్కగా విచారించి పనులయందు నిర్ణయము పొందువాడు బహుకాలము కీర్తితో నిలువగలడు.

అసమ్య గుపయుక్తం హి జ్ఞానం సుకుశలైరపి,
ఉపలభ్యం చావిదితం విదితం చాననుష్ఠితమ్. 34

పండిన ప్రజ్ఞ కలవారు ఉపదేశించిన జ్ఞానముకూడ, ఒక్కొక్కవేళ, పనికిరానిదే యగును. ఏలయన ఉపదేశించినది యేదో వానికి తెలిసినను ఆచరింపడు.

పాపోదయఫలం విద్వాన్ యో నారభతి వర్ధతే.

పాపమునకు కారణమైన ఫలమొసగు కర్మమును చక్కగా నెరిగి మొదలిడనివాడు వృద్ధిలోనికి వచ్చును.

యస్తు పూర్వకృతం పాప మవిమృ శ్యానువర్తతే,
అగాధపఙ్కే దుర్మేధా విషమే వినిపాత్యతే. 35

మునుపుచేసిన పాపమునందలి బాగోగులను విమర్శింపక దానినే మరల మరల చేయు పాడుబుద్ధివాడు ఘోరమగు లోతెరుగరాని బురదలో పడవేయబడును.

మన్త్రభేదస్య షట్ ప్రాజ్ఞో ద్వారాణీమాని లక్షయేత్,
అర్థసన్తతికామశ్చ రక్షే దేతాని నిత్యశః. 36

తెలివిగలవాడు మంత్రముచెడు ఈదారు లారింటిని గుర్తింపవలయును. అర్థము లెడతెగకుండ పొందగోరు వా డీయారింటిని క్షణమైన ఏమరక రక్షించు కొనవలయును.

---

34. నావంటివాని ఉపదేశము నీవంటివానియందు పనికిమాలిన దగుచున్నదని వేదన యిందు వ్యక్తము.

35. పాపోదయఫలమ్ - పాపమును పుట్టించు ఫలముగల కర్మమును; యః, న, ఆరభతే - ఎవడు మొదలు పెట్టడో; సః - వాడు; వర్ధతే - వృద్ధి పొందును.

36. అవిమృశ్య - విచారింపక; అనువర్తతే - మరల మరల వదలక చేయుచుండును.

మదం స్వప్న మవిజ్ఞాన మాకారం చాత్మసంభవమ్,
దుష్టామాత్యేషు విశ్రమ్భం దూతా చ్చాకుశలాదపి. 37

మదము, నిద్ర, చక్కని యెఱుక లేకుండుట, తననుండి యేర్పడు ఆకారము, దుష్టమంత్రులయందలి నమ్మకము, నేర్పులేని దూత-ఇవి మంత్రమును చెడగొట్టు ఆరుద్వారములు.

ద్వారాణ్యేతాని యో జ్ఞాత్వా సంవృణోతి సదా నృప,
త్రివర్గాచరణే యుక్తః స శత్రూ నధితిష్ఠతి. 38

రాజా! ఈదారులను చక్కగా నెరిగి ఎల్లపుడు మూసినవాడు ధర్మార్థ కామముల నిర్వహణలో యోగ్యుడై శత్రువులను లొంగదీసికొనును.

న వై శ్రుత మవిజ్ఞాయ వృద్ధా ననుపసేవ్య చ,
ధర్మార్థౌ వేదితుం శక్యౌ బృహస్పతిసమై రపి. 39

శాస్త్రము నెరుగక, పెద్దలను సేవింపక బృహస్పతియంతటివారు కూడ ధర్మార్థముల నెరుగజాలరు.

నష్టం సముద్రే పతితం నష్టం వాక్య మశృణ్వతి,
అనాత్మని శ్రుతం నష్టం నష్టం హుత మనగ్నికమ్. 40

సముద్రమున పడిన వస్తువు, వినని వానికి చెప్పిన వాక్యము, ఆత్మదృష్టి లేనివానికి లభించు శాస్త్రజ్ఞానము, అగ్నియందు పడని హోమద్రవ్యము నిష్ఫలములే యగును.

---

37. పఙ్కే - నరకమునందు.
38. అర్థసంతతికామః-అర్థములు ఎడతెగకుండ నుండగోరువాడు; మదమ్-మద్యము త్రాగుటవలన నేర్పడు తలతిరుగుడు; లేక మనసు నిలుకడలేనితనము; అవిజ్ఞానమ్-శత్రువుల గూఢచారుల స్థితిగతుల నెరుగకుండుట; ఆత్మసంభవమ్ ఆకారమ్-కన్ను, మొగము మొదలగువాని వికారములు-ముఖమున వ్యక్తమగు కొంచెపుమార్పుకూడ పరుల దూతలకు భావమును పట్టి యిచ్చునని భావము;
39. శ్రుతమ్-శాస్త్రమును;
40. అనాత్మని-ఆత్మజ్ఞానసాధనమగు ఇంద్రియనిగ్రహము లేనివానియందు;

మత్యా పరీక్ష్య మేధావీ బుద్ధ్యా సంపాద్య చాసకృత్,
శ్రుత్వా దృష్ట్వాఽథ విజ్ఞాయ ప్రాజ్ఞైర్మైత్రీం సమాచరేత్. 41

బుద్ధిమంతుడగు నరుడు ఉపపత్తులతో పరీక్షించి, అనుభవముతో మాటి మాటికి చేయదగినదని నిశ్చయించుకొని పరులవలన విని స్వయముగా చూచి చక్కగా ఎరిగి బుద్ధిమంతులతో మైత్రి చేయవలయును.

అకీర్తిం వినయో హన్తి హన్త్యనర్థం పరాక్రమః,
హన్తి నిత్యం క్షమా క్రోధ మాచారో హన్త్యలక్షణమ్. 42

వినయము అపకీర్తిని రూపుమాపును. పరాక్రమము కీడును తొలగ ద్రోయును. ఓర్పు క్రోధమును చంపును. ఆచారము చెడునడవడిని నాశనము చేయును.

పరిచ్ఛదేన క్షేత్రేణ వేశ్మనా పరిచర్యయా,
పరీక్షేత కులం రాజన్ భోజనాచ్ఛాదనేన చ. 43

ఉపయోగించు భోగవస్తువులు, జన్మస్థానము, ఇల్లు, ఆచారము, భోజనము, కట్టుగుడ్డలు అనువానితో కులమును పరీక్షింపవలయును.

ఉపస్థితస్య కామస్య ప్రతివాదో న విద్యతే,
అపి నిర్ముక్తదేహస్య కామరక్తస్య కిం పునః. 44

దేహమునందు అభిమానము వదలుకొన్నవాడును స్వయముగా వచ్చు పదార్థములందు అనురాగము కలవాడగుచున్నాడు. ఇక నిలువెల్ల కోరికలే అయినవాని విషయమున అపవాద ముండునా?

---

41. మత్యా-మననముచేత-యుక్తులను మాటిమాటికి భావించుటచేత; బుధ్యా-తన అనుభవముచేత; సంపాద్య-చేయదగినదా కాదా అని నిర్ణయించుకొని, శ్రుత్వా-విని-యితరులవలన నని యర్థము; దృష్ట్వా-స్వయముగా ఆకారమునుబట్టి చూచి; విజ్ఞాయ - తిరిగి ఆవలివాని ప్రాజ్ఞత్వమును బాగుగా ఎరిగి;

43. పరిచ్ఛదేన-భోగవస్తువుల సముదాయముచేత; క్షేత్రేణ-జన్మస్థానముచేత; పరిచర్యయా - ఆచారముచేత.

ప్రాజ్ఞోపసేవితం వైద్యం ధార్మికం ప్రియదర్శనమ్,
మిత్రవన్తం సువాక్యం చ సుహృదం పరిపాలయేత్. 45

తెలివిగలవారు ఆదరించు విద్యావంతుని, ధర్మమార్గమున ప్రవర్తించు వానిని, చూచుటకు ప్రియముగా నుండువానిని; మిత్రులు కలవానిని, మంచి మాటలు చెప్పువానిని, మిత్రుని ఎల్లవేళల రక్షించుకొనవలయును.

దుష్కులీనః కులీనో వా మర్యాదాం యో న లఙ్ఘయేత్,
ధర్మాపేక్షీ మృదుర్హ్రీమాన్ స కులీనశతా ద్వరః. 46

చెడుకులమునందు పుట్టినవాడైనను, మంచికులమున పుట్టినవాడైనను తన హద్దులు మీరకుండువాడు, ధర్మమునందు గట్టి నిష్ఠకలవాడు, మెత్తనివాడు, పాపపుపనులకు సిగ్గుపడువాడు నగు నరుడు సత్కులమున పుట్టిన వందమంది కంటె మిన్న యగును.

యయోశ్చిత్తేన వా చిత్తం నిభృతం నిభృతేన వా,
సమేతి ప్రజ్ఞయా ప్రజ్ఞా తయోర్మైత్రీ న జీర్యతి. 47

చిత్తముచేత చిత్తము, రహస్యముచేత రహస్యము, ప్రజ్ఞచేత ప్రజ్ఞ ఏ యిద్దరకు కలియునో వారిరువురి స్నేహము చెడదు.

దుర్బుద్ధి మకృతప్రజ్ఞం ఛన్నం కూపం తృణైరివ,
వివర్జయీత మేధావీ తస్మిన్ మైత్రీ ప్రణశ్యతి. 48

చెడుబుద్ధి కలవాడు, మంచి వివేకము లేనివాడు, గడ్డి అల్లుకొన్న నూతివలె హృదయ మెరుగరాని వాడునగు నరుని బుద్ధిమంతుడు వదలివేయవలయును. వానియందు స్నేహము తప్పక చెడును.

---

45. ప్రాజ్ఞ, ఉపసేవితమ్ - బుద్ధిమంతులచేత సన్నింపబడునట్టి; వైద్యమ్ - విద్యకలవానిని; సువాక్యమ్-ప్రియములు, హితములు పలుకువానిని;

47. చిత్తమ్ - పైకి తెలిసిన ప్రవృత్తి; నిభృతమ్ - పైకి తెలియరాని రహస్య ప్రవృత్తి; ప్రజ్ఞా - విశేషముగా విషయముల నూహింపజాలు శక్తి.

అవలిప్తేషు మూర్ఖేషు రౌద్రసాహసికేషు చ,
తథైవాపేతధర్మేషు న మైత్రీ మాచరేద్ బుధః. 49

తలబిరుసువారు, మూర్ఖులు, కోపిష్ఠులు, తొందరపాటువారు, ధర్మము పాటింపనివారు నగు మనుజులయందు బుద్ధిమంతుడు మైత్రిని నెరపరాదు.

కృతజ్ఞం ధార్మికం సత్య మక్షుద్రం దృఢభక్తికమ్,
జితేన్ద్రియం స్థితం స్థిత్యాం మిత్ర మత్యాగి చేష్యతే. 50

మిత్రు డనువాడు కృతజ్ఞుడు, ధార్మికుడు సత్యము తప్పనివాడు, నీచత లేనివాడు, చెదరని భక్తి కలవాడు, ఇంద్రియములను జయించినవాడు, మేరలు మీరనివాడు, ఆపదలయందు వదలిపోనివాడు కావలయును.

ఇన్ద్రియాణా మనుత్సర్గో మృత్యునాపి విశిష్యతే,
అత్యర్థం పునరుత్సర్గః సాదయేద్ దైవతాన్యపి. 51

ఇంద్రియములు విషయములపై పోకుండ నిలుపుట మృత్యువుకంటె గొప్ప విషయము. కాని మిక్కిలిగా ప్రవర్తించుట దేవతలనైనను నాశనము చేయును.

మార్దవం సర్వభూతానా మనసూయా క్షమా ధృతిః,
ఆయుష్యాణి బుధాః ప్రాహు ర్మిత్రాణాం చావిమాననా. 52

---

49. అవలిప్తేషు-గర్వముతో విఱ్ఱవీగువారియందు; రౌద్ర, సాహసికేషు-కోపము తొందరపాటుతనము ఎక్కువగా గలవారియందు;

50. స్థిత్యామ్-హద్దులో; స్థితమ్-ఉన్నవానిని; అత్యాగి-ఆపదలందు వదలిపోని వానిని;

51. అనుత్సర్గః-ఉత్సర్గ మనగా విషయములందు ప్రవృత్తి-అదిలేకుండుట - మృత్యునాఽపి, విశిష్యతే - బొత్తుగా ఇంద్రియములను విషయములపై ప్రసరింపకుండజేయుట చావుకంటె మిన్నయగు పని యని భావము; పునః-కాని; అత్యర్థమ్ ఉత్సర్గః-ఏ కొంచెము అదుపు లేక ఇచ్చవచ్చినట్లు ఇంద్రియములను విషయముల వెంబడి పోనిచ్చుట; దైవతాని, అపి - దేవతలను కూడ; సాదయేత్-నాశన మొసర్చును.

52. ఆయుష్యాణి-ఆయువును పెంపొందించునవి.

ప్రాణులన్నింటియందును మైత్త్రదనము, అసూయ లేకుండుట, ఓర్పు, ధైర్యము, మిత్త్రుల నవమానము చేయకుండుట అనునవి ఆయువును పెంపొందించునని తెలిసినవారు చెప్పుదురు.

అపనీతం సునీతేన యోఽర్థం ప్రత్యానినీషతే,
మతి మాస్థాయ సుదృఢాం తదకాపురుషవ్రతమ్. 53

అన్యాయముగా పోయిన అర్థమును మంచినీతితో, బుద్ధిబలముతో తిరిగి పొందగోరుట ఉత్తమపురుషుల వ్రతము.

ఆయత్యాం ప్రతికారజ్ఞ స్తదాత్వే దృఢనిశ్చయః
అతీతే కార్యశేషజ్ఞో నరోఽర్థైర్న ప్రహీయతే. 54

రాబోవుకాలమున వచ్చు అనర్థములను పోనాడు ఉపాయముల నెరిగినవాడు, అప్పటి పనులయందు దృఢమైన నిశ్చయము కలవాడు, గడచిన సమయమున మిగిలిన కార్యములను బాగుగా గుర్తించువాడు నగు నరుడు ప్రయోజనములను కోల్పోవడు.

కర్మణా మనసా వాచా యదభీక్ష్ణం నిషేవతే,
తదేవాపహర త్యేనం తస్మాత్ కల్యాణ మాచరేత్. 55

పనితో, భావనతో, పలుకుతో దేనిని ఎల్లవేళల నరుడు పట్టి యుండునో అదే వానిని లాగుకొనిపోవును. కావున ఎల్లప్పుడు శుభమునే చేపట్టవలయును.

---

53. అపనీతమ్-అన్యాయముగా చెడినదానిని; ప్రత్యానినీషతే-తిరిగి తెచ్చుకొనగోరుచున్నాడో;

54. ఆయత్యామ్-రాబోవుకాలమున; ప్రతికారజ్ఞః-వచ్చుకీడును తొలగించుకొను ఉపాయ మెరిగినవాడు-ముందుచూపు కలవాడని భావము; తదాత్వే-వర్తమానకాలమున; దృఢనిశ్చయః-దృఢమైన నిశ్చయజ్ఞానము కలవాడు. వచ్చిన దుఃఖములు అనుభవించినగాని నశింపవు అని యెరిగి అవి వచ్చినపుడు మనసు చెదరనివాడు-అని భావము. అతీతే-గడచిన కాలమునందలి; కార్యశేషజ్ఞః-పనుల మిగులును గుర్తించువాడు-మిగిలిన పనులను మరవక పూర్తిచేయువాడని తాత్పర్యము.

మఙ్గలాలమ్భనం యోగః శ్రుత ముత్థాన మార్జవమ్,
భూతి మేతాని కుర్వన్తి సతాం చాభీక్ష్ణదర్శనమ్. 56

మంగళవస్తువులను తాకుట, సహాయములతో కూడియుండుట, శాస్త్ర జ్ఞానము, ప్రయత్నము, ఋజుప్రవర్తనము, సత్పురుషులను మాటిమాటికి దర్శించుట అనునివి శుభమును చేకూర్చును.

అనిర్వేదః శ్రియో మూలం లాభస్య చ శుభస్య చ,
మహాన్ భవత్యనిర్విణ్ణః సుఖం చానన్త్యమశ్నుతే. 57

ప్రయత్నమును మానకుండుట లాభమునకు, శుభమునకు మూలమగును. అట్లు ఉద్యోగమును మాననివాడు గొప్ప వాడగును. అంతములేని సుఖమును పొందును.

నాతః శ్రీమత్తరం కిఞ్చి దన్యత్ పథ్యతమం మతమ్,
ప్రభవిష్ణో ర్యథా తాత క్షమా సర్వత్ర సర్వదా. 58

నాయనా! సమర్థునకు అన్నియెడల, అన్ని వేళల సహనముకంటె శుభమును గూర్చునది మరియొకటి లేదు. అన్నిటికంటె నది మిక్కిలి హితమైనది.

క్షమే దశక్తః సర్వస్య శక్తిమాన్ ధర్మకారణాత్,
అర్థానర్థౌ సమౌ యస్య తస్య నిత్యం క్షమా హితా. 59

---

56. మంగల-ఆలంభనమ్-మంగళవస్తువులగు పెరుగు, గరిక, గోవు మొదలగు వానిని స్పృశించుట, యోగః-కలయిక-సహాయులను విడువకుండుట యని భావము; ఉత్థానమ్-ప్రయత్నము; ఆర్జవమ్-సక్రమముగా-మోసములేని విధమున-ప్రవర్తించుట, అభీక్ష్ణదర్శనమ్-పలుమారులు చూచుట.

57. అనిర్వేదః-సోమరితనము లేకుండుట అని భావము; అనిర్విణ్ణః-ఉద్యోగపరుడు-నిరంతరము మంచిపనులలో నిమగ్నుడైన వాడు అని భావము.

59. ఇందు అశక్తుడు, శక్తిమంతుడు, మధ్యముడు అని మూడు విధముల వారు కలరు-అందరకు క్షమ శ్రేయస్సు కలిగించునని తాత్పర్యము.

అసమర్థుడు అన్నింటి యెడల ఓర్పు వహించి యుండవలయును. శక్తిమంతుడు ధర్మము కొరకై సహనము పాటింపవలయును. మేలు కీడులను సమముగా భావించువానికి ఎల్లవేళల సహనము మేలైనది.

యత్ సుఖం సేవమానోఽపి ధర్మార్థాభ్యాం న హీయతే,
కామం తదుపసేవేత న మూఢవ్రత మాచరేత్. 60

ఏ సుఖము ననుభవించుచున్నను ధర్మార్థములవలన నరుడు చెడకుండునో దానిని ఇచ్ఛవచ్చినట్లు అనుభవింపవచ్చును. కాని మొండి వ్రతములు చేయరాదు.

దుఃఖార్తేషు ప్రమత్తేషు నాస్తికేష్వలసేషు చ,
న శ్రీ ర్వసత్యదాన్తేషు యే చోత్సాహవివర్జితాః. 61

ఏడుపుగొట్టు వారియందు, ఒడలెరుగని వారియందు, పరలోకము లేదను వారియందు, సోమరులయందు, ఇంద్రియముల నదుపులో పెట్టని వారియందు, ఉత్సాహము లేనివారియందు లక్ష్మి నిలువదు.

ఆర్జవేన నరం యుక్త మార్జవాత్ సవ్యపత్రపమ్,
అశక్తం మన్యమానాస్తు ధర్షయన్తి కుబుద్ధయః. 62

సరళస్వభావముతో కూడియుండి, సరళత లోపించినచో సిగ్గుపడు నరుని చేతకాని వాడని భావించుచు నీచబుద్ధులు బెదరించుచుందురు.

అత్యార్య మతిదాతార మతిశూర మతివ్రతమ్,
ప్రజ్ఞాభిమానినం చైవ శ్రీ ర్భయా న్నోపసర్పతి. 63

మంచితనము, దానము, పరాక్రమము, వ్రతము అనునవి మేరమీరి చేయువానిని, తన తెలివిని గొప్పదిగా భావించువానిని చూచి లక్ష్మి భయమువలన దరి చేరదు.

---

60. మూఢవ్రతమ్-మొండిగా ఉపవాసాదులు ఇతరుల మెప్పుకై చేయుట.
61. అదాంతేషు-ఏదైన పొందవలయునను కోరికలేని వారియందు-అనునర్థము నీలకంఠులు చూపిరి.
61. ఆర్జవమ్-కల్లకపటములు లేకుండుట; సవ్యపత్రపమ్-సిగ్గు గలవానిని
63. అత్యార్యమ్-మేరమీరిన మంచితనము కలవానిని;

న చాతిగుణవత్స్వేషా నాత్యన్తం నిర్గుణేషు చ,
నైషా గుణాన్ కామయతే నైర్గుణ్యా న్నానురజ్యతే,
ఉన్మత్తా గౌరివాన్ధా శ్రీః క్వచిదే వావతిష్ఠతే. 64

లక్ష్మి మిక్కలి గుణవంతులయందును, బొత్తిగా గుణములు లేనివారి యందును నిలువదు. ఆమెకు గుణములపై మక్కువ లేదు. గుణములు లేని కారణమున అనురాగమును లేదు. పిచ్చిఆవువలె కనుగానని లక్ష్మి ఎందెందో నిలుచును.

అగ్నిహోత్రఫలా వేదాః శీలవృత్తఫలం శ్రుతమ్,
రతిపుత్రఫలా నారీ దత్తభుక్తఫలం ధనమ్. 65

వేదములు చదువుటకు ఫలము అగ్నిహోత్రము నర్చించుటయే. శాస్త్రము లకు ఫలము మంచిస్వభావమును నడవడియు నేర్పడుటయే. స్త్రీని పొందుటకు ఫలము సుఖము, సంతానము లభించుటయే. ధనమునకు ఫలము ఇచ్చుటయు, అనుభవించుటయునే.

అధర్మోపార్జితై రర్థై ర్యః కరో త్యౌర్ధ్వదైహికమ్,
న స తస్య ఫలం ప్రేత్య భుఙ్క్తేఽర్థస్య దురాగమాత్. 66

అధర్మముతో సంపాదించిన ధనముతో పరలోకమును సాధించుకార్యములు చేయువానికి చనిపోయినపిదప ఆఫలము అనుభవమునకు రాదు. ఏలయన ఆ అర్థములు చెడుమార్గమున వచ్చినవి కదా!

కాన్తారే వనదుర్గేషు కృచ్ఛ్రాస్వాపత్సు సంభ్రమే,
ఉద్యతేషు చ శస్త్రేషు నాస్తి సత్త్వవతాం భయమ్. 67

64. లక్ష్మి ఎవరిని చేరునో స్పష్టముగా చెప్పజాలమని తాత్పర్యము-లక్ష్మి యనగా సంపద, అధికారము మొదలైనది.

66. ఔర్ధ్వదైహికమ్-పరలోకమును సాధించు యజ్ఞము, దానము మొదలగు కార్యము.

67. వనదుర్గేషు-అడవులు, జలములు మున్నగుతావులందలి పోవశక్యముకాని తావులందు అని భావము; సంభ్రమే-ఊహింపని క్లిష్టసమస్య వచ్చినప్పుడు-అని అర్థము చెప్పుకొనదగును. సత్త్వవతామ్-సత్త్వగుణము కలవారికి-గుండెదిటవుకలవారికి అనియు నర్థము భావింపనగును.

అడవియందు, ఘోరములగు దారుణయందు అతికఠినములగు ఆపదల యందు, గుండెగుబులు కలుగు పరిస్థితులయందు, నెత్తిపై బడుటకు సిద్ధముగానున్న ఆయుధములయందును సత్వగుణము గలవారికి భయము లేదు.

ఉత్థానం సంయమో దాక్ష్య మప్రమాదో ధృతిః స్మృతిః,
సమీక్ష్య చ సమారంభో విద్ధి మూలం భవస్య తు. 68

పనులకు చొచ్చుకొనిపోవుట, ఇంద్రియనిగ్రహము, సమర్థత, పొరపాటు పడకుండుట, ధైర్యము, జాగరూకత, చక్కగా విచారించి కార్యమునకు దిగుట అనునవి సంపదకు మూలకారణములని యెరుగుము.

తపోబలం తాపసానాం బ్రహ్మ బ్రహ్మవిదాం బలమ్,
హింసా బల మసాధూనాం క్షమా గుణవతాం బలమ్. 69

తాపసులకు తపమే బలము, బ్రహ్మమెరిగినవారికి బ్రహ్మమే బలము. చెడ్డవారికి హింసయే బలము. గుణవంతులకు సహనమే బలము.

అష్టౌ తాన్యవ్రతఘ్నాని ఆపో మూలం ఫలం పయః,
హవి ర్బ్రాహ్మణకామ్యా చ గురోర్వచన మౌషధమ్. 70

నీరు, దుంపలు, పండ్లు, పాలు, హవిస్సు, బ్రహ్మమెరిగినవాని ఆజ్ఞ ననుసరించుట, గురువుమాటను పాటించుట, మంచి ఔషధమును సేవించుట అను నీ యెనిమిదియు వ్రతమును నాశనము చేయవు.

న తత్ పరస్య సందధ్యాత్ ప్రతికూలం యదాత్మనః,
సంగ్రహేణైష ధర్మః స్యాత్ కామాదన్యః ప్రవర్తతే. 71

---

68. ఉత్థానమ్ - చురుకుదనము; సంయమః - ఇంద్రియనిగ్రహము; దాక్ష్యమ్- దక్షత, భవస్య-సంపదకు;

69. బ్రహ్మవిదామ్-బ్రహ్మ మనగా తత్త్వము, తపస్సు, వేదము, యోగము అని నాలుగు. వానిలో నేదైనను-అన్నియును గ్రహింపవచ్చును.

70. బ్రాహ్మణకామ్యా-బ్రహ్మ మెరిగిన వాని యిచ్చబడి ప్రవర్తించుట.

71. అన్యః-ధర్మముకంటె ఇతరమైనది-అధర్మము.

ఒక్కమాటలో ధర్మమును చెప్పవలయునన్నచో తనకేది విరుద్ధమో యది పరునకు చేయకుండుటయే ధర్మము. ఇచ్చవచ్చినట్లు ప్రవర్తించుట అధర్మము.

అక్రోధేన జయేత్ క్రోధ మసాధుం సాధునా జయేత్,
జయేత్ కదర్యం దానేన జయేత్ సత్యేన చానృతమ్. 72

క్రోధమును శాంతముచేతను,చెడ్డతనమును మంచితనముచేతను,లోభమును దానముచేతను,అసత్యమును సత్యముచేతను గెలువవలయును.

స్త్రీధూర్తకేఽలసే భీరౌ చణ్డే పురుషమానిని,
చౌరే కృతఘ్నే విశ్వాసో న కార్యో న చ నాస్తికే. 73

స్త్రీలయందు దుడుకుగా ప్రవర్తించువానిని, సోమరిని, పిరికివానిని, మిక్కుటమగు కోపము కలవానిని, తన మగతనముగూర్చి పొగరుగా భావించువానిని, దొంగను, చేసినమేలు మరచువానిని, నాస్తికుని నమ్మరాదు.

అభివాదనశీలస్య నిత్యం వృద్ధోపసేవినః,
చత్వారి సంప్రవర్ధన్తే కీర్తి రాయుర్యశో బలమ్. 74

ఎల్లవేళల పెద్దలకు మ్రొక్కు స్వభావముగలవానికి, పెద్దలను కొలుచుచుండువానికి కీర్తి, ఆయువు, యశస్సు, బలము అను నాల్గును వృద్ధిపొందును.

అతిక్లేశేన యేఽర్థాః స్యు ర్ధర్మస్యాతిక్రమేణ వా,
అరేర్వా ప్రణిపాతేన మాస్మ తేషు మనః కృథాః. 75

మిక్కిలి కష్టపడి సాధింపదగినవి, ధర్మమును అతిక్రమించి సాధించునవి శత్రువు కాళ్లకుమ్రొక్కి సాధించునవి అగు అర్థములపై మనసు పెట్టకుము.

---

73. స్త్రీధూర్తకే - ఈ సమాసమునకు స్త్రీయందు, ధూర్తునియందు అని ఏకవద్భావసమాసముగా గ్రహింపవలయునని నీలకంఠులు. అప్పుడు స్త్రీయనగా శీలములేని స్త్రీయను నర్థము చెప్పుకొనుట యుక్తము.

74. కీర్తిః - మంచిని కొనియాడుట; యశః - సౌందర్యము.

75. శోకింపదగినవి యనగా అట్టివానివలన శోకము తప్ప మరియొక ప్రయోజనము లేదని తాత్పర్యము.

అవిద్యః పురుషః శోచ్యః శోచ్యం మైథున మప్రజమ్,
నిరాహారాః ప్రజాః శోచ్యాః శోచ్యం రాష్ట్ర మరాజకమ్. 76

చదువులేని పురుషుడు, సంతులేని సంసారము, తిండిలేని సంతానము, రాజులేని దేశము శోకింపదగినవి.

అధ్వా జరా దేహవతాం పర్వతానాం జలం జరా,
అసంభోగో జరా స్త్రీణాం వాక్శల్యం మనసో జరా. 77

పెద్దఒడలున్నవారికి మార్గము, పర్వతములకు నీరు, స్త్రీలకు సంభోగము లేకుండుట, మనస్సునకు పలుకుములుకు ముదిమిని గూర్చును.

అనామ్నాయమలా వేదా బ్రాహ్మణ స్యావ్రతం మలమ్, 78
మలం పృథివ్యా బాహ్లీకాః పురుష స్యానృతం మలమ్,
కౌతూహలమలా సాధ్వీ విప్రవాసమలాః స్త్రియః. 79

వేదములకు అభ్యాసము లేకుంటయే మలము. బ్రాహ్మణునకు నియమ నిష్ఠలు లేకుండుటయే మలము. భూమికి బాహ్లీకములే మలము. పురుషునకు అసత్యమే మలము. పతివ్రతకు కోరికలు మలము. స్త్రీలకు ఎడబాటు మలము.

సువర్ణస్య మలం రూప్యం రూప్యస్యాపి మలం త్రపు,
జ్ఞేయం త్రపుమలం సీసం సీసస్యాపి మలం మలమ్. 80

బంగారుమలము వెండి. వెండిమలము తగరము. తగరము మలము సీసము. సీసముమలము మలము.

న స్వప్నేన జయేన్నిద్రాం న కామేన జయేత్ స్త్రియః,
నేన్ధనేన జయే దగ్నిం న పానేన సురాం జయేత్. 81

---

77. ముదిమి అనగా పనికిమాలినతనము, బాధించునది అని భావము.

78, 79, 80 - మల మనగా దోషమని తాత్పర్యము. బాహ్లీకాః - పఞ్చానాం సిన్ధుషష్ఠానాం నదీనాం యత్ర సంగమః, బాహ్లీకా నామ తే దేశాః-సింధు నది ఆరవదిగా అయిదు నదులు - జీలమ్ మొదలగునవి - కలియుచోటున గల దేశములకు బాహ్లీకము అని పేరు.

81. నిద్ర, కామము, కట్టెలు, త్రాగుట అనునవి నిద్రాదులను పెంచునే కాని అణపవని తాత్పర్యము.

నిద్రతో నిద్రను, కామముతో స్త్రీలను, కట్టెలతో నిప్పును, త్రాగుటతో మద్యమును జయింపజాలరు.

యస్య దానజితం మిత్రం శత్రవో యుధి నిర్జితాః,
అన్నపానజితా దారాః సఫలం తస్య జీవితమ్. 82

మిత్రుని దానముతో తనిపినవాడు, యుద్ధమున శత్రువులను గెలిచినవాడు, అన్నపానములతో భార్యను తృప్తిపరచినవాడు బ్రదుకు పండినవాడు.

సహస్రిణోఽపి జీవన్తి జీవన్తి శతిన స్తదా,
ధృతరాష్ట్ర విముఞ్చేచ్ఛాం న కథఞ్చి న్న జీవ్యతే. 83

వేలకొలది ధనమున్నవారును బ్రదుకుచున్నారు. వందలున్న వారును బ్రదుకుచున్నారు. ధృతరాష్ట్రా! సంపదపై ఆశను వదలుము. ఎట్లో ఒక విధమున బ్రదుకవచ్చును.

యత్ పృథివ్యాం వ్రీహియవం హిరణ్యం పశవః స్త్రియః,
నాలమేకస్య తత్సర్వ మితి పశ్యన్న ముహ్యతి. 84

భూమియందున్న మొత్తము ధాన్యము, బంగారము, పశువులు, స్త్రీలు అన్నియు కలిసియు ఒక మనుష్యునకు చాలవు. దీనిని పరికించుచు నరుడు మోహ మందడు.

---

83. న కథంచి న్న జీవ్యతే - బ్రదుకుట ముఖ్యము, అది పగతో అయినచో సంశయాత్మకము అని భావము.

84. న, అలమ్, ఏకస్య - ఒక్కనికి చాలదు. అనగా ప్రపంచమంతయు చేజిక్కినను మానవునకు తృప్తి యుండదని భావము; న ముహ్యతి - మోహపడడు. ఎల్లవాడు అంతయు తనకే కావలయు ననుకొన్నచో అందరు పరస్పరము కొట్టుకొని చత్తురు. కావున అది కూడదని భావము.

రాజన్ భూయో బ్రవీమి త్వాం పుత్రేషు సమ మాచర,
సమతా యది తే రాజన్ స్వేషు పాణ్డుసుతేషు వా. 85

రాజా! నీకు మరల మరల చెప్పుచున్నాను. నీకు నీకొడుకులయందును, పాండుని కొడుకులయందును సమభావము ఉన్నయెడల కొడుకుల నందరిని సమముగా చూడుము.

ఇతి శ్రీ మహాభారతే ఉద్యోగపర్వణి ప్రజాగరపర్వణి
విదురవాక్యే ఏకోనచత్వారింశోఽధ్యాయః.

ఇది శ్రీ మహాభారతము ఉద్యోగపర్వమున ప్రజాగరపర్వమున
విదురవాక్యమున ముప్పదితొమ్మిదవ అధ్యాయము.

—(౦)—

85. సమమ్, ఆచర-పాండవులకు నీకొడుకుల కిచ్చినట్లు రాజ్యభాగ మిమ్ము-అని భావము.

## చత్వారింశోఽధ్యాయః - నలుబదియవ అధ్యాయము

ధర్మమహత్త్వ ప్రతిపాదనం, బ్రాహ్మణాదిచతుర్విధ
వర్ణానాం ధర్మస్య సంక్షేపతో వర్ణనమ్.

ధర్మము గొప్పదనమును ప్రతిపాదించుట, బ్రాహ్మణాది
చతుర్విధవర్ణముల ధర్మమును సంగ్రహముగా వర్ణించుట.

విదుర ఉవాచ - విదురు డిట్లు పలికెను.

యోఽభ్యర్చితః సద్భి రసజ్జమానః
కరోత్యర్థం శక్తి మహాపయిత్వా,
క్షిప్రం యశస్తం సముపైతి సన్త-
మలం ప్రసన్నా హి సుఖాయ సన్తః. 1

సజ్జనులు పూజించినను గొప్పవాడ ననుకొనక శక్తి యున్నంతవరకు ప్రయోజనములను సాధించు సత్పురుషునికడకు కీర్తి పరువున వచ్చి చేరును. ఏలయన ప్రసన్నులైన సుజనులు సుఖమును కూర్పజాలుదురు.

మహాన్త మప్యర్థ మధర్మయుక్తం
యః సన్త్యజ త్యనపాకృష్ట ఏవ,
సుఖం సుదుఃఖా న్యవముచ్య శేతే
జీర్ణాం త్వచం సర్ప ఇవావముచ్య. 2

1. అసజ్జమానః-అభిమానము చెందనివాడై-నేనింతవాడనని గర్వింపనివాడై యని భావము; అహాపయిత్వా-వదలిపోనీక-శక్తినంతటిని వినియోగించి యని యర్థము; ప్రసన్నాః-కల్లకపటములు లేని; సన్తః-సజ్జనులు; సుఖాయ-సుఖమునకు; అలమ్-చాలుదురు-సుఖమును గూర్పజాలుదు రని భావము.

2. అనపాకృష్టః-ఇతరులనుండి నింద మొదలగునవి పొందక,

అది యెంత గొప్పవిషయమైనను ధర్మమునకు విరుద్ధమైనచో ఇతరుల ప్రేరణలేకయే దానిని వదలివేయువాడు, పాము చివికిపోయిన కుబుసమును విడిచినవిధమున పెనుదుఃఖములను వదలి, సుఖముగా నిద్రించును.

అనృతే చ సముత్కర్షో రాజగామి చ పైశునమ్,
గురో శ్చాలీకనిర్బన్ధః సమాని బ్రహ్మహత్యయా. 3

అసత్యమార్గమున గెలిచిన గెలుపు, రాజుసొమ్మునందు లోభము, గురువును నెపముపెట్టి నిర్బంధించుట అనునవి బ్రహ్మహత్యతో సమమగు పాపములు.

అసూయైకపదం మృత్యు రతివాదః శ్రియో వధః,
అశుశ్రూషా త్వరా శ్లాఘా విద్యాయాః శత్రవ స్త్రయః. 4

అసూయ ఒక్కపెట్టున వచ్చు చావువంటిది. మేరమీరి పలుకుట సంపదను వధించుట వంటిది. గురువులను సేవింపకుండుట, తొందరపాటుతనము, తన్ను దాను పొగడుకొనుట-అను మూడును విద్యకు శత్రువులు.

ఆలస్యం మదమోహౌ చ చాపలం గోష్ఠిరేవ చ,
స్తబ్ధతా చాభిమానిత్వం తథాఽత్యాగిత్వమేవ చ,
ఏతే వై సప్త దోషాః స్యుః సదా విద్యార్థినాం మతాః. 5

సోమరితనము, పొగరు, పొరపాటు, చపలత, ఉబుసుపోక ప్రసంగము, తలబిరుసుదనము, గర్వము, లోభము-అను నీయేడును విద్యను కోరువారికి ఎల్లవేళల దోషములు.

సుఖార్థినః కుతో విద్యా నాస్తి విద్యార్థినః సుఖమ్,
సుఖార్థీ వా త్యజే ద్విద్యాం విద్యార్థీ వా త్యజేత్ సుఖమ్. 6

---

3. సముత్కర్షః-వృద్ధి-జయమని తాత్పర్యము.
4. అసూయా-గుణములను దోషములుగా వక్కాణించుట: ఏకపదమ్-మొత్తముగా; ఒక్కపెట్టున.
5. మదమోహములు రెండును కలిపి ఒక్కటిగా భావింపవలయును. స్తబ్ధతా-పొగరు; అభిమానిత్వమ్ - గర్వము కలిగియుండుట; అత్యాగిత్వమ్ - లోభము.

సుఖము కోరువానికి విద్య యెక్కడిది? విద్య కోరువానికి సుఖము లేదు. సుఖము కోరినవాడేని విద్యను వదలవలయును. విద్యార్థియైనచో సుఖమును వదలుకొనవలయును.

నాగ్ని స్తృప్యతి కాష్ఠానాం నాపగానాం మహోదధిః,
నాన్తకః సర్వభూతానాం న పుంసాం వామలోచనా. 7

నిప్పు కట్టెలతో, సముద్రము నదులతో, యముడు సర్వభూతములతో, కాముకి పురుషులతో తృప్తినందుట లేదు.

ఆశా ధృతిం హన్తి సమృద్ధి మన్తకః
క్రోధః శ్రియం హన్తి యశః కదర్యతా,
అపాలనం హన్తి పశూంశ్చ రాజ-
న్నేకః క్రుద్ధో బ్రాహ్మణో హన్తి రాష్ట్రమ్. 8

ఆశ ధైర్యమును,యముడు దేహపుష్టిని,క్రోధము సంపదను,లోభము కీర్తిని (సౌందర్యమును), పాలనలేకుండుట పశువులను,కోపించిన ఒక్క-బ్రాహ్మణుడు దేశమును-రూపు మాపుదురు.

అజాశ్చ కాంస్యం రజతం చ నిత్యం
మధ్వాకర్షః శకునిః శ్రోత్రియశ్చ,
వృద్ధో జ్ఞాతి రవసన్నః కులీన
ఏతాని తే సన్తు గృహే సదైవ. 9

మేకలు,కంచు,వెండి,తేనె,విషమును లాగివేయు మణిరాయి, పక్షి, వేదము నెరిగిన బ్రాహ్మణుడు, ముసలియగు దగ్గర చుట్టము,బ్రదికి చెడిన కులమువాడు-ఇంటిలో ఎల్లవేళల ఉండవలయును.

అజోక్షా చన్దనం వీణా ఆదర్శో మధుసర్పిషీ,
విష మౌదుమ్బరం శఙ్ఖః స్వర్ణనాభో౽థ రోచనా. 10

---

9. ఆకర్షః-విషమును లాగివేయు మణిరాయి.అవసన్నః-బ్రదికిచెడినవాడు;

10. అజోక్షా - అజముతో - మేకతో - కూడిన ఎద్దు.అనగా మేక,ఎద్దు అని తాత్పర్యము,విషమ్-లోహము;ఔదుమ్బరమ్-ఉదుంబర మనగా రాగి. రాగి పాత్రలు,'ఉదుమ్బరం స్మృతం తామ్రే'అని విశ్వనిఘంటువు;స్వర్ణనాభః-బొడ్డున బంగారము గలది-సాలగ్రామము;రోచనా-గోరోచనము;స్వర్ణనాభ మనగా దక్షిణావర్తశంఖమనియు కొందరు.

గృహే స్థాపయితవ్యాని ధన్యాని మను ర్బ్రవీత్,
దేవబ్రాహ్మణపూజార్థ మతిథీనాం చ భారత. 11

మేక,ఎద్దు,మంచిగంధపుచెక్క, వీణ,అద్దము,తేనె,నెయ్యి, లోహము, రాగి పాత్ర,శంఖము,సాలగ్రామము గోరోచనము - అను నీ మంగళద్రవ్యములను, దేవతలయు, బ్రాహ్మణులయు,అతిథులయు పూజకొరకు ఇంట నిలుపుకొనవలయు నని మనువు చెప్పెను.

ఇదం చ త్వాం సర్వపరం బ్రవీమి
పుణ్యం పదం తాత మహావిశిష్టమ్,
న జాతు కామా న్న భయా న్న లోభా-
ద్ధర్మం జహ్యా జ్జీవితస్యాపి హేతోః. 12

ఇదిగో! రాజా! నాయనా! అన్నింటికంటె ఉత్తమము మంగళకరము అగు పుణ్యమైన మాట చెప్పుచున్నాను. కామమువలననో, భయమువలననో లోభము వలననో కడకు బ్రదుకు కారణముగా నైనను ధర్మమును విడువరాదు.

నిత్యో ధర్మః సుఖదుఃఖే త్వనిత్యే
జీవో నిత్యో హేతు రస్య త్వనిత్యః,
త్యక్త్వాఽనిత్యం ప్రతితిష్ఠస్వ నిత్యే
సంతుష్య త్వం తోషపరో హి లాభః. 13

---

11. ధన్యాని-మంగళకరములు.

12. సర్వపరమ్-పుణ్యకారణము అన్నింటికంటె మిన్న అయినది;మహా+ అవిశిష్టమ్-మహా మనగా ఉత్సవము దానితో అవిశిష్టమ్-సమానమైనది; గొప్ప మంగళమును కూర్చునది అని భావము.

13. నిత్యః-ఎన్నటికిని నాశముకానిది; అనిత్యే-ఎప్పుడో ఒకప్పుడు నశించునవి. అస్య హేతుః-దాని కారణము-అజ్ఞానమని భావము; అనిత్యమ్ - చెడెడు సుఖదుఃఖములను, అజ్ఞానమును; త్యక్త్వా-వదలి; నిత్యే-ధర్మమునందు, ఏ దొసగులేని ఆత్మయందు; ప్రతితిష్ఠస్వ-గట్టిగా నిలుపుము; నిష్ఠ కలిగి యుండుము; సంతుష్య - సంతోషమును పొందుము; లాభః - (ఒకటి) లభించుట; తోషపరః-సంతోషమే ప్రధానముగా గలది; హి-కదా!-ఏదో పొంది సంతసింపవలయుననుటకంటె సహజముగా సంతుష్టినందుట శ్రేయస్కరమని భావము;

ధర్మము చెడనిది. సుఖదుఃఖములు చెడునవి. జీవుడు నిత్యుడు. దానికి కారణము అనిత్యము. అనిత్యమును విడనాడి నిత్యమునందు గట్టిగా నిన్ను నీవు నిలుపుకొనుము. తుష్టినందుము. ఏలయన ఏది పొందినను తుష్టికొరకే కదా!

మహాబలాన్ పశ్య మహానుభావాన్
ప్రశాస్య భూమిం ధనధాన్యపూర్ణామ్,
రాజ్యాని హిత్వా విపులాంశ్చ భోగాన్
గతా న్నరేన్ద్రాన్ వశ మన్తకస్య. 14

చూడు. ఎందరో గొప్పబలము, మహిమగల రాజులు ధనముతో ధాన్యముతో నిండిన భూమి నంతటిని ఏలి తుదికి రాజ్యములను, గొప్ప భోగములను వదలి యమునికి వశమైరి.

మృతం పుత్రం దుఃఖపుష్టం మనుష్యా
ఉత్క్షిప్య రాజన్ స్వగృహా న్నిర్హరన్తి,
తం ముక్తకేశాః కరుణం రుదన్తి
చితామధ్యే కాష్ఠమివ క్షిపన్తి. 15

మనుజులు ఎంతో కష్టపడి పెంచిన కొడుకు చావగా లేవనెత్తి తమ యిండ్లనుండి బయటకు లాగివేయుచున్నారు. వానిని చూచి వ్రేలెడు వెంట్రుకలతో జాలిగా ఏడ్చుచునే పాడె సడుము కట్టెవలె పారవేయుచున్నారు.

అన్యో ధనం ప్రేతగతస్య భుఙ్క్తే
వయాంసి చాగ్నిశ్చ శరీరధాతూన్,
ద్వాభ్యామయం సహగచ్ఛ త్యముత్ర
పుణ్యేన పాపేన చ వేష్ట్యమానః. 16

---

15. దుఃఖపుష్టమ్ - ఎన్నో దుఃఖములు సహించి పెంచినవానిని; గృహాత్ - ఇంటినుండి; నిర్హరన్తి - దూరముగా లాగివేయుదురు; ముక్తకేశాః - వ్రేలాడు వెంట్రుకలుగలవారై-దుఃఖముచేత కేశములు చెల్లాచెదరైనను దాని యందు దృష్టిలేనివారై అని భావము.

16. వయాంసి - పక్షులు; శరీరధాతూన్ - శరీరమునందలి రక్తము, మాంసము, అస్థి మజ్జ, వస మొదలగువానిని ; వేష్ట్యమానః - పెనవైచు కొనబడుచున్నవాడై.

చచ్చిన వాని ధన మెవడో యితరుడు అనుభవించును. శరీరములోని ధాతువులను వయస్సునందలి పక్షులు అగ్ని తినివేయును. జీవుడు పుణ్యము, పాపము అను రెంటితో పెనవైచుకొని పరలోకమునకు అరుగును.

ఉత్సృజ్య వినివర్తన్తే జ్ఞాతయః సుహృదః సుతాః,
అపుష్పా నఫలాన్ వృక్షాన్ యథా తాత పతత్రిణః. 17

పూవులు, కాయలు లేని చెట్లను పక్షులు వదలిపోయినట్లు దగ్గర చుట్టములు, చెలులు, కొడుకులు చచ్చిన వాని దేహమును వదలి మరలి పోవుదురు.

అగ్నౌ ప్రాస్తం తు పురుషం కర్మాన్వేతి స్వయం కృతమ్,
తస్మాత్తు పురుషో యత్నా ద్ధర్మం సంచినుయా చ్ఛనైః. 18

నిప్పులోనికి విసరిన పురుషుని తాను చేసిన కర్మము మాత్రమే వెంటనంటును. కావున పురుషుడు గట్టియత్నముతో ధర్మమును మెల్లమెల్లగా కూడబెట్టుకొనవలయును.

అస్మాల్లోకా దూర్ధ్వ మముష్య చాధో
మహత్తమ స్తిష్ఠ త్యన్ధకారమ్,
తద్వై మహామోహన మిన్ద్రియాణాం
బుధ్యస్వ మా త్వాం ప్రలభేత రాజన్. 19

ఈ లోకమునకు పైభాగమున, పరలోకమునకు దానికి క్రిందిభాగమున పెనుచీకటి కలదు. అది యింద్రియములను పెద్దపెట్టున మోహపెట్టును. బాగుగా తెలిసికొనుము. అది నిన్ను తాకకుండుగాక.

---

17. ఉత్సృజ్య - చచ్చిన వాని దేహమును వదలి అని భావము;
18. ప్రాస్తమ్ - విసరివేయబడిన;
19. అస్మాత్ లోకాత్ ఊర్ధ్వమ్ - ఈ లోకమునకు పైని అనగా స్వర్గమునందును; అముష్య - దానికి - ఆస్వర్గమునకు; 'చ' అనుట వలన ఈ లోకమునకు; అధః - క్రింద - పాతాళమున; మహత్తమః - తమోగుణము ఎక్కువగా గలవారు పొందెడు; అంధకారమ్ - అంధతామిస్రమను పేరుగల నరకము; తిష్ఠతి - కలదు; న ప్రలభేత - తాకకుండుగాక !

ఇదం వచః శక్ష్యసి చేద్యథావ-
న్నిశమ్య సర్వం ప్రతిపత్తుమేవ,
యశః పరం ప్రాప్స్యసి జీవలోకే
భయం న చాముత్ర న చేహ తేఽస్తి. 20

ఈమాట నీవు ఉన్నదున్నట్లు విని అంతయు అర్థము చేసికొనగలుగుదు వేని నీకు జీవలోకమున గొప్పకీర్తి లభించును. పరమునగాని, ఇహమునగాని భయముండదు.

ఆత్మా నదీ భారత పుణ్యతీర్థా
సత్యోదయా ధృతికూలా దయోర్మిః,
తస్యాం స్నాతః పూయతే పుణ్యకర్మా
పుణ్యో హ్యాత్మా నిత్య మలోభ ఏవ. 21

భరతకులమున పుట్టిన ధృతరాష్ట్రా! పుణ్య మను తీర్థముగల జీవుడు ఒకనది. అది సత్యమగు బ్రహ్మమునుండి పుట్టినది. ధీరస్వభావమే ఒడ్డు. దయయే అల. అందు స్నానమాడిన పుణ్యకర్ముడు పవిత్రుడగును. ఆత్మపుణ్య మగుట యనగా లోభము లేకుండుటయే.

కామక్రోధగ్రాహవతీం పఞ్చేన్ద్రియజలాం నదీమ్,
నావం ధృతిమయీం కృత్వా జన్మదుర్గాణి సంతర. 22

కామము క్రోధము అను మొసళ్ళు కలదియు, అయిదింద్రియము లనెడు నీరుకలదియు నగునదిని, ధీరతతో నిండిననావను ఏర్పరచుకొని, భవమనెడు దుర్గములను దాటుము.

---

20. ప్రతిపత్తుమ్-ఎరుగుటకు; శక్ష్యసి చేత్-చాలినవాడవైనచో;
21. ఆత్మా-జీవుడు; పుణ్యతీర్థా-ధర్మమే జలముగా గలది; సత్యం-బ్రహ్మము, సత్యోదయః-సత్యమునుండి పుట్టినది; తస్యాం స్నాతః-అందు మునిగిన వాడు; ప్రత్యగ్రూపమున-లోకమువైపు దృష్టిని మరలించుట మానుకొని-మునిగినవాడు; పూయతే-పవిత్రుడగును; పుణ్యః ఆత్మా-పుణ్యముయొక్క స్వరూపము; అలోభః, ఏవ-లోభము లేకుండుటయే.
22. నదీమ్-సంసారమనెడు నదిని; జన్మదుర్గాణి-పుట్టుకలనెడు కష్టఘట్టము లను;

ప్రజ్ఞావృద్ధం ధర్మవృద్ధం స్వబన్ధుం
విద్యావృద్ధం వయసా చాపి వృద్ధమ్,
కార్యాకార్యే పూజయిత్వా ప్రసాద్య
యః సంపృచ్ఛే న్న సముహ్యేత్ కదాచిత్. 23

ప్రజ్ఞచేత, ధర్మముచేత పెద్దయయిన తన బంధువును చేయదగిన చేయరాని పనుల విషయమున మన్నించి, ప్రసన్నుని చేసికొని, మంచిచెడు లడుగువాడు ఎన్నటికిని పొరపాటు పడడు.

ధృత్యా శిశ్నోదరం రక్షేత్ పాణిపాదం చ చక్షుషా,
చక్షుఃశ్రోత్రే చ మనసా మనోవాచం చ కర్మణా. 24

గుహ్యమును కడుపును ధైర్యముతో, కాలుసేతులను కంటితో, కంటిని చెవిని మనస్సుతో, మనసును వాక్కును మంచిపనులచేతను రక్షించుకొన వలయును.

నిత్యోదకీ నిత్యయజ్ఞోపవీతీ
నిత్యస్వాధ్యాయీ పతితాన్నవర్జీ,
సత్యం బ్రువన్ గురవే కర్మకుర్వ-
న్న బ్రాహ్మణ శ్చ్యవతే బ్రహ్మలోకాత్ 25

---

24. శిశ్నోదరమ్ - కామమును, ఆకలిని అని తాత్పర్యము; రక్షేత్ - రక్షించుటయనగా దోషములవైపు పోనీకుండుట; పాణిపాదం చ చక్షుషా- చక్కగాచూచి వస్తువులను గ్రహింపవలయును. బాగుగా చూచి కాలుంచ వలయును అని భావము; చక్షుఃశ్రోత్రే - పరస్త్రీలను చెడుబుద్ధితో చూడ కుండుట మొదలగువానిచేత కంటిని, చెడుమాటలు వినకుండుటచేత చెవిని రక్షింపవలయును. మనోబలముతో వానిని చెడువిషయముల నుండి మరలించుటయే రక్షించుట; మనో...కర్మణా - మనస్సును మాటను అదుపున పెట్టుకొనవలయునని తాత్పర్యము; కర్మణా - సంయ మనముచేత.

25. నిత్యోదకీ - ఉదకము అనగా నీటితో నిర్వహించవలసిన క్రియ - బాహ్యశుద్ధికొరకైన స్నానాదికము, లోపలిశుద్ధి కొరకయిన ఆచమనము మొదలగునది; పతిత - అన్నవర్జీ - పతితు లనగా ధర్మమునుండి జారిన వారు - అట్టివారు పెట్టిన అన్నమును భుజింపనివాడు;

స్నానము ఆచమనము తగువేళల తప్పక చేయువాడు, ఎల్లవేళల జన్నిదము తాల్చియుండువాడు, ఎల్లవేళల వేదము చదువు స్వభావము గలవాడు, పతితులుపెట్టు అన్నమును తిననివాడు, సత్యమునే పలుకుచుండువాడు, గురువునకు శుశ్రూష చేయుచుండువాడు నగు బ్రాహ్మణుడు బ్రహ్మలోకమునుండి జారడు.

అధీత్య వేదాన్ పరిసంస్తీర్య చాగ్నీ-
నిష్ట్వా యజ్ఞైః పాలయిత్వా ప్రజాశ్చ,
గోబ్రాహ్మణార్థం శస్త్రపూతాంతరాత్మా
హతః సంగ్రామే క్షత్రియః స్వర్గమేతి. 26

వేదములను చక్కగా చదివి, అగ్నులకు నాలుగువైపుల దర్భలను పరచి, యజ్ఞము లాచరించి, ప్రజలను పాలించి శస్త్రములతో పవిత్రమైన అంతరంగము గలవాడై గోవులకొరకు, బ్రాహ్మణులకొరకు మరణించినవాడు యుద్ధమున ప్రాణములు కోల్పోయినవాడు నగు క్షత్రియుడు స్వర్గమున కరుగును.

వైశ్యోఽధీత్య బ్రాహ్మణాన్ క్షత్రియాంశ్చ
ధనైః కాలే సంవిభజ్యాశ్రితాంశ్చ,
త్రేతాపూతం ధూమ మాఘ్రాయ పుణ్యం
ప్రేత్య స్వర్గే దివ్యసుఖాని భుఙ్క్తే. 27

---

26. పరిసంస్తీర్య-అగ్నుల నర్చించునపుడు నాలుగువైపుల దర్భలను ఉంచుదురు. ఆపనిచేసి-అనగా అగ్నిహోత్రములను పూజించి అని తాత్పర్యము; లేదా అగ్నులను వానివాని స్థానములందు చక్కగా అమర్చి దానిచేత; యజ్ఞైరిష్ట్వా-యజ్ఞము లొనర్చి అని అర్థము; శస్త్రపూతఅన్తరాత్మా-శస్త్రములనగా ఆయుధములు, వానిచేత పవిత్రమైన చిత్తము గలవాడు; శస్త్రములచేత పవిత్రము అనగా ధర్మబుద్ధితో మాత్రమే ఆయుధము ప్రయోగించుట; గోబ్రాహ్మణార్థమ్ - గోవులకొరకు, బ్రాహ్మణులకొరకు మృతి చెందినవాడని తాత్పర్యము; సంగ్రామే, హతః-యుద్ధమున చంపబడినవాడు;

27. అధీత్య - వేదమును శాస్త్రమును చదివి అని తాత్పర్యము. త్రేతాపూతమ్-మూడగ్నులతో పవిత్రమైన; ప్రేత్య - మరణించి.

వైశ్యుడు వేదములను శాస్త్రములను చదువుకొని, బ్రాహ్మణులను, క్షత్రియులను, ఇతరఆశ్రితులను ధనములతో తగు సమయమున ఆదుకొనుచు, మూడగ్నులతో పవిత్రమగు పుణ్యధూమమును ఆఘ్రాణించి, మరణించిన పిదప స్వర్గమున దివ్యసుఖముల ననుభవించును.

బ్రహ్మక్షత్రం వైశ్యవర్ణం చ శూద్రః
క్రమేణైతా న్న్యాయతః పూజయానః,
తుష్టేష్వేతే ష్వవ్యథో దగ్ధపాప-
స్త్యక్త్వా దేహం స్వర్గసుఖాని భుఙ్క్తే. 28

శూద్రుడు బ్రాహ్మణజాతిని, క్షత్రియజాతిని, వైశ్యజాతిని క్రమముగా న్యాయమార్గమున మన్నించుచు వారు సంతృప్తినందినచో వ్యథ నొందక పాపములను భస్మము గావించుకొని, శరీరము వదలిన పిదప స్వర్గసుఖముల ననుభవించును.

చాతుర్వర్ణ్యస్యైష ధర్మ స్తవోక్తో
హేతుం చానుబ్రువతో మే నిబోధ,
క్షాత్రాద్ ధర్మాద్ధీయతే పాణ్డుపుత్ర-
స్తం త్వం రాజన్ రాజధర్మే నియుఙ్క్ష్వ. 29

ఇదిగో నాలుగువర్ణములకు సంబంధించిన ధర్మము నీకు చెప్పితిని. అట్లు చెప్పుటలో కారణము తెలుపుచున్నాను. నీతమ్ముడగు పాండునికొడుకు క్షత్రియ ధర్మమునుండి హాని పొందియున్నాడు. నీ వాతనిని రాజధర్మమున నెలకొల్పుము.

ధృతరాష్ట్ర ఉవాచ - ధృతరాష్ట్రు డిట్లు పలికెను.

ఏవ మేతద్ యథా త్వం మా మనుశాససి నిత్యదా,
మమాపి చ మతిః సౌమ్య భవత్యేవం యదాత్థ మామ్. 30

28. క్రమేణ, న్యాయతః, పూజయానః-శూద్రుడు పైవర్ణములవారిని క్రమముగా న్యాయమార్గమున పూజించుట యనగా తనవృత్తిధర్మములను చక్కగా నిర్వహించుట యని తాత్పర్యము - వృత్తులనగా వడ్రంగము, బట్ట లుదుకుట, క్షురకర్మ చేయుట మొదలగునవి.

29. క్షాత్రాత్ ధర్మాత్-నేలనేలుట అను ధర్మమునుండి; రాజధర్మే-రాజ్యమున;

నీవు నాకు ఎల్ల వేళల నిట్లు ఉపదేశించుచు నే యున్నావు. నాబుద్ధి కూడ, ఓ మంచివాడా! నీవు చెప్పినట్లే యగును.

సా తు బుద్ధిః కృతాప్యేవం పాణ్డవాన్ ప్రతి మే సదా!
దుర్యోధనం సమాసాద్య పున ర్విపరివర్తతే. 31

పాండుని కొడుకులను గూర్చి ఎల్లప్పుడు అట్లే నాబుద్ధికి నిర్ణయము కలుగును. కాని దుర్యోధనుని కలిసినవెంటనే అది మరల మారిపోవుచున్నది.

న దిష్ట మప్యతిక్రాన్తుం శక్యం భూతేన కేనచిత్,
దిష్టమేవ ధ్రువం మన్యే పౌరుషం తు నిరర్థకమ్. 32

ఏప్రాణియు అదృష్టము మీరజాలదు. కావున అదియే స్థిరమైనదని నా భావన. పురుషయత్నము పనికి మాలినది.

ఇతి శ్రీ మహాభారతే ఉద్యోగపర్వణి ప్రజాగరపర్వణి
విదురవాక్యే చత్వారింశోఽధ్యాయః.

ఇది శ్రీ మహాభారతమున ఉద్యోగపర్వమున ప్రజాగరపర్వమున
విదురవాక్యముగల నలుబదియవ అధ్యాయము.

సమాప్తం ప్రజాగరపర్వ-
ప్రజాగరపర్వము ముగిసినది.

—(૦)—

30. అనుశాససి - ఇది ఆర్షప్రయోగము. లోకమున 'అనుశాస్సి' అనియే యుండవలయును.

# సనత్సుజాతపర్వ - 4
# సనత్సుజాతపర్వము - 4

## ఏకచత్వారింశోఽధ్యాయః - నలుబది యొకటవ అధ్యాయము.

**విదురవిహితస్మరణేన సమాగతం సనత్సుజాతం ప్రతి ధృతరాష్ట్రోపదేశం కర్తుం విదురస్య ప్రార్థనమ్.**

**విదురుడు స్మరింపగా విచ్చేసిన సనత్సుజాతుని ధృతరాష్ట్రున కుపదేశింపు మని విదురుడు ప్రార్థించుట.**

అవ. ఇంతవరకు విదురుడు బ్రహ్మవిద్య పొందుట కవసరమైన సాధన సంపత్తిని ధృతరాష్ట్రునకు ఉపదేశించెను. మరియు అందు సంక్షేపముగా అందందు 'యతో యతో నివర్తతే' మొదలగు వాక్యములతో బ్రహ్మవిద్యను స్పృశించెను. దానిని విస్తరముగా వినగోరిన ధృతరాష్ట్రు డడుగుచున్నాడు.

ధృతరాష్ట్ర ఉవాచ - ధృతరాష్ట్రు డిట్లు పలికెను.

అనుక్తం యది తే కిఞ్చిద్ వాచా విదుర విద్యతే,
తన్మే శుశ్రూషతో బ్రూహి విచిత్రాణి హి భాషసే. 1

ప్ర. అ. విదుర - విదురా!; తే - నీ; వాచా - పలుకుతో; అనుక్తమ్ - చెప్పఁబడనిది; కిఞ్చిత్-ఏ కొంచెమైనను; విద్యతే యది-ఉండెనేని; తత్-దానిని; శుశ్రూషతః - వినగోరుచున్న; మే - నాకు; బ్రూహి - చెప్పుము. హి - ఏం యన; విచిత్రాణి - ఆశ్చర్యము పుట్టించు క్రొంగ్రొత్తవిషయములను; భాషసే - పలుకుచున్నావు.

తా. విదురా! నీ వింతవరకు చెప్పనిదికాక చెప్పవలసిన దేమైన మిగిలి యున్నచో దానిని వినగోరుచున్న నాకు చెప్పుము. నీవు అచ్చెరువుగొలుపు విషయములు చెప్పుచున్నావు.

విదుర ఉవాచ - విదురు డిట్లు చెప్పెను.

ధృతరాష్ట్ర కుమారో వై యః పురాణః సనాతనః,
సనత్సుజాతః ప్రోవాచ మృత్యు ర్నాస్తీతి భారత. 2

ప్ర. అ. ధృతరాష్ట్ర! - ధృతరాష్ట్రా!; పురాణః - ప్రాతకాలమువాడు; సనాతనః-ఎల్లప్పుడు నుండువాడు అగు, యః కుమారః - ఏ కుమారుడు గలడో; సః-ఆ; సనత్సుజాతః - సనత్సుజాతుడు; భారత-భారతా!; మృత్యుః-మృత్యువు; న, అస్తి, ఇతి - లేదని; వై - నిశ్చయముగా; ప్రోవాచ - నొక్కి చెప్పెను.

తా. భరతవంశ మహారాజా! ధృతరాష్ట్రా! అతిప్రాచీనుడు, నిత్యుడు అగు సనత్సుజాతుడను కుమారుడు మృత్యువు లేదని నొక్కి వక్కాణించెను.

వ్యా. మృత్యుః - పుట్టుక, చావుల ప్రవాహరూపమైన సంసారము.

స తే గుహ్యాన్ ప్రకాశాంశ్చ సర్వాన్ హృదయసంశ్రయాన్,
ప్రవక్ష్యతి మహారాజ సర్వబుద్ధిమతాం వరః. 3

ప్ర. అ. మహారాజ! - మహారాజా; సర్వబుద్ధిమతామ్ - ప్రజ్ఞగల వారందరిలో; వరః - శ్రేష్ఠుడగు; సః - ఆ కుమారుడు; తే - నీకు; సర్వాన్ - సమస్తములయిన; గుహ్యాన్ - రహస్యములను; ప్రకాశాన్, చ - వెల్లడి అయిన వానిని కూడ; హృదయసంశ్రయాన్ - హృదయమున నెలకొన్నవానిని - (ధర్మములను); ప్రవక్ష్యతి - చక్కగా బోధింపగలడు.

తా. మహారాజా! ప్రజ్ఞగలవారిలో మిన్నయగు ఆసనత్సుజాతుడు రహస్యములు, ప్రకాశములు అగు ధర్మముల నన్నింటిని నీకు చక్కగా బోధింపగలడు.

వ్యా. తే - తుభ్యమ్ - నీకు; గుహ్యాన్ - దాచియుంచవలసిన యోగ కళలు మొదలగువానిని; ప్రకాశాన్ - అందరకు తెలియనగు శమము మొదలగు వానిని; హృదయసంశ్రయాన్ - హృదయమున నెలకొన్న ధర్మములను.

ధృతరాష్ట్ర ఉవాచ - ధృతరాష్ట్రు డిట్లు పలికెను.

కిం త్వం న వేద తద్భూయో యన్మే బ్రూయాత్ సనాతనః,
త్వమేవ విదుర బ్రూహి ప్రజ్ఞాశేషోఽస్తి చేత్తవ. 4

ప్ర. అ. సనాతనః - నిత్యుడగు సనత్సుజాతుడు; యత్ - దేనిని; మే - నాకు; బ్రూయాత్ - చెప్పునో; తత్ - దానిని; భూయః - మిక్కిలిగా;

త్వమ్ - నీవు; న, వేద, కిమ్ - ఎరుగవా? తవ - నీకు, ప్రజ్ఞాశేషః - ప్రజ్ఞ యొక్క మిగులు; అస్తి, చేత్ - ఉన్నచో; త్వమ్, ఏవ - నీవే; బ్రూహి - చెప్పుము.

తా. విదురా! ఆ సనాతనసనత్సుజాతుడు చెప్పుదానిని నీ వెరుగవా ? మిగిలిన ఆ బుద్ధివిశేషమును నీవే నాకు బోధింపుము.

వ్యా. వర్ణాశ్రమక్రమమును కాదని బ్రహ్మవిద్య నుపదేశింపరా దను నర్థమును కథాముఖమున ప్రతిపాదించుచున్నారు. సనాతనః - ఇది సనత్సుజాతునకు మరియొక పేరు.

విదుర ఉవాచ - విదురు డిట్లు చెప్పెను.

శూద్రయోనా వహం జాతో నాతోఽన్య ద్వక్తు ముత్సహే,
కుమారస్య తు యా బుద్ధి ర్వేద తాం శాశ్వతీమహమ్. 5

ప్ర. అ. అహమ్ - నేను; శూద్రయోనౌ - శూద్రస్త్రీకడుపున; జాతః - పుట్టితిని; అతః - అందువలన; అన్యత్ - మిగిలినదానిని; వక్తుమ్ - చెప్పుటకు; న, ఉత్సహే - ఇష్టపడను; తు - కాని; కుమారస్య - ఆ సనత్సుజాతుని; బుద్ధిః - తెలివి; యా - ఏది కలదో; తామ్ శాశ్వతీమ్ - ఆ నిత్యమగు దానిని; అహమ్ - నేను; వేద - ఎరుగుదును;

తా. ఆ సనత్సుజాతుడు బోధించు నిత్యమగు విద్యను నే నెరుగుదును. కాని నేను శూద్రస్త్రీకి పుట్టినవాడను కనుక చెప్పనొల్లను.

బ్రాహ్మీం హి యోని మాపన్నః సుగుహ్య మపి యో వదేత్,
న తేన గర్హ్యో దేవానాం తస్మా దేత ద్బ్రవీమి తే. 6

ప్ర. అ. యః - ఎవ్వడు; బ్రాహ్మీమ్ - బ్రాహ్మణసంబంధమగు; యోనిమ్ - గర్భమును; ఆపన్నః - పొందినవాడై; సుగుహ్యమ్, అపి - మిక్కిలి గూఢవిషయమునైనను; వదేత్ - చెప్పునో; సః - అతడు: తేన - దానిచేత (అట్లు చెప్పుటచేత) దేవానామ్ - దేవులకు; గర్హ్యః - నిందింపదగినవాడు; న(భవతి) - కాడు; తస్మాత్ - అందువలన; ఏతత్ - దీనిని; తే - నీకు; బ్రవీమి - చెప్పుచున్నాను.

తా. రాజా! బ్రాహ్మణగర్భమున పుట్టినవాడు మిక్కిలి గూఢములగు విషయములను బోధించినను దేవతలకు నింద్యుడు కాడు. అందువలన నీ కిట్లు చెప్పుచున్నాను.

ధృతరాష్ట్ర ఉవాచ - ధృతరాష్ట్రు డిట్లు పలికెను.

బ్రవీహి విదుర త్వం మే పురాణం తం సనాతనమ్,
కథ మేతేన దేహేన స్యా దిహైవ సమాగమః. 7

ప్ర. అ. విదుర - ఓయి విదురా!; పురాతనమ్ - ప్రాత వాడగు; సనాతనమ్-నిత్యుడైన ఆ సనత్సుజాతునిగూర్చి; మే - నాకు; బ్రవీహి - చెప్పుము; ఏతేన - ఈ; దేహేన - దేహముతో; ఇహ, ఏవ - ఇక్కడనే; సమాగమః - (ఆ ఋషితో) కలయిక; కథమ్ = ఎట్లు; స్యాత్ - అగును?

తా. విదురా! ఆ సనత్సుజాతుడు ప్రాతకాలము వా డంటివి. అతనితో కలయిక ఈ దేహముతో ఇక్కడనే ఎట్లు సంభవించును? చెప్పుము.

వైశమ్పాయన ఉవాచ - వైశంపాయనుడు చెప్పెను.

చిన్తయామాస విదుర స్త మృషిం శంసితవ్రతమ్,
స చ తచ్చిన్తితం జ్ఞాత్వా దర్శయామాస భారత. 8

ప్ర. అ. భారత - భారతా! విదురః -విదురుడు; శంసితవ్రతమ్ - కొనియాడబడు వ్రతము గల; తమ్ - ఆ; ఋషిమ్ - ఋషిని; చిన్తయామాస - స్మరించెను; సః, చ - అతడును; తద్ - ఆ; చిన్తితమ్ - భావనను; జ్ఞాత్వా - ఎరిగి; దర్శయామాస - కానవచ్చెను;

తా. భారతా! అంత ఆ విదురుడు పొగడదగు వ్రతములుగల ఆ ఋషిని హృదయమున స్మరించెను. ఆ భావన నెరిగి ఆ ఋషియు పొడసూపెను.

స చైనం ప్రతిజగ్రాహ విధిదృష్టేన కర్మణా,
సుఖోపవిష్టం విశ్రాన్త మథైనం విదురోఽబ్రవీత్. 9

ప్ర. అ. చ - మరియు; సః - ఆ విదురుడు; ఏనమ్ - ఈతనిని; విధిదృష్టేన - శాస్త్రమున కానవచ్చు; కర్మణా - విధానముతో; ప్రతిజగ్రాహ - ఎదురుకొనివచ్చెను; అథ - పిమ్మట; సుఖ-ఉపవిష్టమ్ - సుఖముగా కూర్చున్నవానిని; విశ్రాన్తమ్ - బడలికతీరిన వానిని; ఏనమ్ - ఈ ఋషిని గూర్చి; విదురః - విదురుడు, అబ్రవీత్ - పలికెను.

తా. అంత విదురుడు శాస్త్రము చెప్పిన మర్యాదలతో ఆ సనత్సుజాతుని పూజించెను. చక్కని ఆసనమున సుఖముగా కూర్చుండి, బడలికవాసిన ఆ ఋషితో విదురు డిట్లు పలికెను.

వ్యా. విధిదృష్టేన కర్మణా - శాస్త్రమువలన నెరిగిన పద్ధతితో మధుపర్కము మొదలగుదానితో;

భగవన్ సంశయః కశ్చిద్ ధృతరాష్ట్రస్య మానసః,
యో న శక్యో మయా వక్తుం త్వమస్మై వక్తు మర్హసి. 10

ప్ర. అ. భగవన్ - స్వామీ! ధృతరాష్ట్రస్య - ధృతరాష్ట్రుని; మానసః - మనస్సునకు సంబంధించిన; కశ్చిత్ - ఒకానొక; సంశయః - సంశయము కలదు; యః - ఏది; మయా - నాకు; వక్తుమ్ - చెప్పుటకు; న, శక్యః - శక్యముకాదో; (తమ్ - దానిని); త్వమ్ - నీవు; అస్మై - ఇతనికి; వక్తుమ్ - చెప్పుటకు; అర్హసి - తగుదువు.

తా. భగవానుడా! ఈ ధృతరాష్ట్రుని ఎదలో ఒక సంశయము కలదు. దానిని నేను తీర్పజాలను. కావున నీ వీతనికి దానిని దయతో చెప్పవలయును.

యం శ్రుత్వాఽయం మనుష్యేన్ద్రః సర్వదుఃఖాతిగో భవేత్,
లాభాలాభౌ ప్రియద్వేష్యౌ యథైనం న జరాన్తకౌ. 11
విషహేరన్ భయామర్షౌ క్షుత్పిపాసే మదోద్భవౌ,
అరతి శ్చైవ తన్ద్రీ చ కామక్రోధౌ క్షయోదయౌ. 12

ప్ర. అ. అయమ్ - ఈ; మనుష్యేన్ద్రః - రాజు; యమ్ - దేనిని; శ్రుత్వా - విని; సర్వ, దుఃఖ, అతిగః - దుఃఖముల నన్నింటిని దాటినవాడు; భవేత్ - అగునో; యథా - ఎట్లు; ఏనమ్ - ఈతనిని; లాభ-అలాభౌ - లాభనష్టములు; జరా-అన్తకౌ - ముసలితనమును, మృత్యువును; భయ - అమర్షౌ - భయము, అసహనమును; క్షుత్పిపాసే - ఆకలిదప్పులును; మద - ఉద్భవౌ - మదము, గొప్ప సంపదయు; అరతిః - ఆ యా విషయములందు ప్రీతి లేకుండుటయు; తన్ద్రీ, చ - అలసతయు; కామక్రోధౌ - కామము, క్రోధమును; క్షయ-ఉదయౌ - నాశనము, అభ్యుదయమును; న విషహేరన్ - బాధింపవో; దానిని ఉపదేశింపుము.

మహర్షీ! నీ ఉపదేశమును విని యీ మహారాజు సర్వదుఃఖములను విడనాడును. లాభనష్టములు, ముదిమి, చావు, భయము, తొందరపాటుతనము, ఆకలిదప్పులు, మదము, సంపద, హితములగువానియందు విరక్తి, అలసత, కామము, క్రోధము, పతనమునకు - అభివృద్ధికి కారణములగు పాపపుణ్యములు ఈతనిని బాధింపవు.

వ్యా. బ్రహ్మవిద్యవలన నగు ఫలము నీ రెండు శ్లోకములలో ప్రతిపాదించుచున్నారు. న విషహేరన్ -బాధింపవు; అమర్షః - సహనము లేకుండుట; ఉద్భవః - గొప్ప సంపద; క్షయ, ఉదయౌ - నాశనమునకు, అభ్యుదయమునకు కారణములగు పుణ్యపాపములు. (11, 12)

ఇతి శ్రీమహాభారతే ఉద్యోగపర్వణి సనత్సుజాతపర్వణి
విదురకృతసనత్సుజాతప్రార్థనే ఏకచత్వారింశోఽధ్యాయః.

ఇది శ్రీమహాభారతము ఉద్యోగపర్వమున సనత్సుజాతపర్వమున
విదురుడు సనత్సుజాతుని ప్రార్థించుట యను
నలుబదియొకటవ అధ్యాయము.

—:o:—

## ద్విచత్వారింశోఽధ్యాయః - నలుబది రెండవ అధ్యాయము

సనత్సుజాతేన ధృతరాష్ట్రస్య వివిధప్రశ్నానాముత్తరదానమ్
సనత్సుజాతుడు ధృతరాష్ట్రుని అనేక ప్రశ్నలకు బదులు చెప్పుట.

వైశమ్పాయన ఉవాచ - వైశంపాయను డిట్లు చెప్పెను.

తతో రాజా ధృతరాష్ట్రో మనీషీ
సంపూజ్య వాక్యం విదురేరితం తత్,
సనత్సుజాతం రహితే మహాత్మా
పప్రచ్ఛ బుద్ధిం పరమాం బుభూషన్. 1

ప్ర. అ. తతః - పిదప; మనీషీ - బుద్ధివిశేషము గల; రాజా - రాజైన; ధృతరాష్ట్రః - ధృతరాష్ట్రుడు; విదుర, ఈరితం - విదురుడు పలికిన; తత్ - ఆ; వాక్యమ్ - వాక్యమును; సంపూజ్య - చక్కగా మన్నించి; మహాత్మా - దొడ్డబుద్ధి కలవాడై; రహితే - ఏకాంతమున; పరమాం - గొప్పది యగు; బుద్ధిమ్ - జ్ఞానసంపదను; బుభూషన్ - పొందగోరినవా డగుచు; సనత్సుజాతమ్ - సనత్సుజాతుని; పప్రచ్ఛ - ప్రశ్నించెను.

తా. చక్కగా శాస్త్రశ్రవణము చేసినందువలన సంస్కారము పొందిన ధృతరాష్ట్రమహారాజు విదురుడు పలికినమాటను మిక్కిలిగా మన్నించి పరవిద్యను తెలియగోరినవాడై సనత్సుజాతు నిట్లు ప్రశ్నించెను.

వ్యా. ఉద్యోగపర్వమున సనత్సుజాతీయమునందు భాష్యకారాదులు వ్యాఖ్యానించిన శ్లోకములను, ఇప్పటి పుస్తకములందున్న పాఠములను, శ్లోకములను గుణములను గుదిగ్రుచ్చు పద్ధతితో ఒక్కటిగా చేసి వ్యాఖ్యానించుచున్నా నని శ్రీ నీలకంఠులు చెప్పుచు వ్యాఖ్యానము నారంభించుచున్నారు.

1. మనీషీ - శాస్త్రములు సంస్కరించిన బుద్ధివిశేషము గలవాడు. రహితే - ఏకాంతమున; పరమాం బుద్ధిమ్ - పరవిద్యను 'అథ పరా యయా తదక్షర మధిగమ్యతే' - ఇటుపై పరవిద్య చెప్పబడుచున్నది. దానితో అక్షర

రూపపరమాత్మ సందుకొనుచున్నారు - అను ప్రతిప్రసిద్ధమగు విషయమును గూర్చి అడిగెను. దీనితో ఈ గ్రంథము ప్రతిపాదించు విషయము చూపబడినది. 'మహాత్మా బుభూషన్' అను వాక్యభాగముతో - ప్రయోజనమును ప్రదర్శించుచున్నారు. మహాత్ముడగుటను కోరుచున్నవాడై - 'బ్రహ్మ వేద బ్రహ్మైవ భవతి' -బ్రహ్మము నెరిగినవాడు బ్రహ్మయే యగును - అని బ్రహ్మజ్ఞానమునకు బ్రహ్మ మగుటయే ఫలముగా వినవచ్చుచున్నదిగదా! విదురుడు పలికిన 'సనత్సుజాతుడు మృత్యువు లేదని పలికె' నన్న వాక్యమునుబట్టి మృత్యువు అనెడు బంధము లేదనుటను విని ధృతరాష్ట్రుడు అసంగమువలన కపటియైన తనకును పాపమువలన భయములేదని సంతోషము పొందెనని భావము. దీనిచేత జ్ఞానము సమస్తకర్మములను రూపుమాపునను విషయమును నిరూపించుచున్నారు. 'హత్వాఽపి స ఇమాన్ లోకాన్ న హన్తి న నిబధ్యతే' - అని గీత చెప్పుచున్నది గదా!

(అహంకారము లేనివాడు - ఈలోకములను చంపియు చంపనివాడే యగును. వానికి బంధము లేదు).

ధృతరాష్ట్ర ఉవాచ - ధృతరాష్ట్రు డిట్లు పలికెను.

సనత్సుజాత యదిదం శృణోమి
న మృత్యు రస్తీతి తవ ప్రవాదమ్,
దేవాసురా హ్యాచరన్ బ్రహ్మచర్య-
మమృత్యవే తత్కతరన్ను సత్యమ్. 2

ప్ర. అ. సనత్సుజాత। - ఓ సనత్సుజాతా!; మృత్యుః - మరణము; న, అస్తి, ఇతి - లేదని; తవ - నీ; ప్రవాదమ్ - గట్టివాదము; ఇతి యత్ - అనునదేది గలదో; తత్ - దానిని; శృణోమి - వినుచుందును; ను - అట్లయినచో; దేవ, అసురాః - దేవతలు, రాక్షసులును; అమృత్యవే-చావులేనిదానికై; బ్రహ్మచర్యమ్-బ్రహ్మచర్యమును; ఆచరన్, హి-పాటించిరి కదా; తత్-అందువలన; కతరత్-ఏది; సత్యమ్ - సత్యము.

తా. స్వామీ! సనత్సుజాతా! నీవు మృత్యువు లేదని నొక్కి వక్కాణింతువట! నేను ఆమాట వినుచుందును. మఱి దేవతలు, రాక్షసులును మృత్యువు లేకుండుటకై బ్రహ్మచర్యము నాచరించిరట. ఈరెంటిలో ఏది నిజము?

వ్యా : ధ్రువం జన్మ మృతస్య చ-చచ్చినవానికి పుట్టుక తప్పదు - అని చావుపుట్టుకల ప్రవాహరూపమైన బంధమే మృత్యువు. అట్టిది లేదని నీవు గట్టిగా వక్కాణింతు వని విదురాదులవలన వినుచున్నాను. సనత్సుజాతు డనగా సనత్-ఎల్లవేళల, సుజాతమ్ - జన్మము కలవాడు - నిత్యకుమారుడు కనుక ముదుసలితనము, చావు లేనివాడా! అని సంబోధనము. శ్రుతియు ఇట్లు చెప్పుచున్నది. "న నిరోధో న చోత్పత్తి ర్న బద్ధో న చ సాధకః, న ముముక్షు ర్న వై ముక్త ఇత్యేషా పరమార్థతా" నిరోధము లేదు. ఉత్పత్తి లేదు. బద్ధుడు కాడు. సాధకుడు కాడు. మోక్షకామి కాడు. ముక్తుడును గాడు. పరమార్థత యనగా నియ్యది. ను-అట్టియెడల; అమృత్యవే - మృత్యువు లేకుండుటకై. 'నూరేండ్లు ఇంద్రుడు ప్రజాపతినిగూర్చి బ్రహ్మచర్యవ్రత మాచరించెను' అని బంధము త్రెంచుకొను యత్నము వినవచ్చుచున్నది. లేనిదియు, ఎల్లవేళల మరలిపోయినదియు నగు దానినుండి మరలుట అను ప్రయత్నము కుదురనిదిగదా!

కావున నీరెండు పక్షములలో ఏది సత్యము? చెప్పుమని భావము.

సనత్సుజాత ఉవాచ - సనత్సుజాతు డిట్లు చెప్పెను.

అపృచ్ఛః కర్మణా యచ్చ మృత్యు ర్నాస్తీతి చాపరమ్,
శృణు మే బ్రువతో రాజన్ యథైతన్మా విశఙ్కథాః. 3

ప్ర.అ : కర్మణా- కర్మముతో బ్రహ్మచర్యముతో; మృత్యుః-మరణము న + అస్తి = లేదు; ఇతి యత్ - అనున దేదో; తత్ - దానిని; అపృచ్ఛః - అడిగితివి; చ - మరియు; అపరమ్ - మరియొకదానిని - అసలు స్వరూపము తోడనే మృత్యువు లేదు అనుదానిని; అపృచ్ఛః-అడిగితివి; ఏతత్ - దీనినిగూర్చి; మా విశఙ్కథాః - శంకింపవలదు; బ్రువతః, మే - నేను చెప్పుచుండగా; హే రాజన్ - ఓ రాజా; శృణు - వినుము.

తా : రాజా! బ్రహ్మచర్యముతో మృత్యువు లేకుండునా? లేక మృత్యువు నిజమునకే స్వరూపముతో లేకుండునా? అని అడిగితివి. ఈరెండును ఒకదాని కొకటి విరుద్ధములు గదా అని శంకింపకుము దానిని గురించి చెప్పుదును. వినుము.

వ్యా : కర్మణా - బ్రహ్మచర్యముచేత;-దీనిచేత సత్యమగు బంధమునకు సాధనముతో నాశమా? అని అడిగినట్లయినది; అపరమ్ - మరియొకదానిని -

నిజమునకు మరణమునకు స్వరూపమే లేదా? అనుదానిని; అపృచ్ఛః - ప్రశ్నించితివి; ఏతత్ - ఇట్లు ఒకదానికొకటి విరుద్ధముగా నున్నదని; మా విశఙ్క్థాః - తలంపకుము.

అమృత్యుః కర్మణా కేచిత్ - అని యొక పాఠము. ఆ పక్షమున అమృతత్వము కర్మమువలన సిద్ధించునా? జ్ఞానమువలననా? అని రెండుపక్షములను పేర్కొనుట. ఆ రెంటియందును ముక్తి క్రమమార్గముననా? కర్మజ్ఞానముల కూడిక వలననా? అని శంకింపవలదని తాత్పర్యము.

అవ. విరోధము లేకుండుటనే చెప్పుచున్నారు.

ఉభే సత్యే క్షత్రియైతస్య విద్ధి
మోహాన్మృత్యుః సంమతోఽయం కవీనామ్,
ప్రమాదం వై మృత్యు మహం బ్రవీమి
తథాఽప్రమాద మమృతత్వం బ్రవీమి. 4

ప్ర.అ. క్షత్రియ- క్షత్రియుడా! ఏతస్య- ఈ ఒక మనుజునకు; ఉభే - రెండును; సత్యే - సత్యములే అని; విద్ధి - ఎరుగుము; మోహాత్ - అజ్ఞానము వలన, అయం - ఈ; మృత్యుః - మృత్యువు అని; కవీనామ్ - ప్రజ్ఞ కలవారి యొక్క; సంమతః - భావన; అహమ్-నేను; ప్రమాదమ్, వై - ప్రమాదమునే- ఆత్మతత్త్వము నెరుగకుండుటనే; మృత్యుమ్-చావునుగా; బ్రవీమి - చెప్పుదును; తథా - అట్లే; అప్రమాదమ్ - ప్రమాదము లేకుండుటనే - జ్ఞానమునే; అమృతత్వమ్ - మరణములేనిదశకు హేతువుగా; బ్రవీమి - చెప్పుదును.

తా. ఓ క్షత్రియుడా! ఒకనికి ఈ రెండును సత్యములే యని యెరుగుము. బుద్ధివిశేషము కలవారు సరియగు జ్ఞానము లేకుండుటవలననే చావగునని భావింతురు. ఇక నేనో చూడవలసిన దానిని చక్కగా చూడకుండుట యను అజ్ఞానమువలననే మృత్యువగు నని చెప్పుదును. వస్తుతత్త్వమును చక్కగా నెరుగుట యను జ్ఞానమే మరణము లేకుండుటకు కారణమనియు చెప్పుదును.

వ్యా: ఏతస్య - ఒక పురుషునకే; వేరు వేరు అవస్థలలో; ఉభే-రెండును; సత్యే - సత్యములే; అజ్ఞానదశలో బంధమును సత్యమే. కర్మము నశించుటయు సత్యమే. కాని జ్ఞానము కలవారికి రజ్జుసర్పమువలె మూడుకాలములందును బంధ మనునది లేదు. మోహమువలన కనిపించు బంధము మాత్రము జ్ఞానము

వలన మరలిపోవునని భావము. 'క్షత్రియైతస్య విద్ధి' అనుచోట క్షత్రియాద్య ప్రవృత్తే - అని యొక పాఠము. అప్పుడు - ఆద్యప్రవృత్తే అనగా ఆ రెండును అనాదులు - నిత్యములు అని భావము. ఇక సిద్ధాంతమును చెప్పు చున్నారు - మోహములేనివారి కి మృత్యువు లేనే లేదు. మోహమును వివరించు చున్నారు. మోహ మనగా ప్రమాదమే. ఆత్మతత్త్వము నెరుగకుండుటయే ప్రమాదము. దానినే మూలజ్ఞాన మందురు ; అదియే మృత్యువు ; 'మృత్యుర్వై తమః' అని శ్రుతి. అప్రమాద మనగా - అవహితత్వము - జాగరూకత. తత్త్వమును చక్కగా నెరుగుట - జ్ఞానమని తాత్పర్యము - 'జ్ఞానం సమ్యగ వేక్షణ'మని శ్రుతి ; అమృతత్వమ్ - మృత్యువు లేకుండుటకు - మోక్షమునకు - హేతువు.

ప్రమాదాద్వై అసురాః పరాభవ-
న్నప్రమాదా ద్బ్రహ్మభూతా భవన్తి,
నైవ మృత్యు ర్వ్యాఘ్ర ఇవాత్తి జన్తూన్
న హ్యస్య రూప ముపలభ్యతే హి. 5

ప్ర. అ. అసురాః - అసురులు; ప్రమాదాత్, వై - ప్రమాదమువల ననే; పరాభవన్ - మృత్యువునకు వశమైరి; అప్రమాదాత్ - జ్ఞానమువలన; బ్రహ్మభూతాః - బ్రహ్మమే అయినవారు; భవన్తి - అగుచున్నారు; మృత్యుః - అజ్ఞానరూపమైన మృత్యువు; జన్తూన్ - ప్రాణులను; వ్యాఘ్రః, ఇవ - పెద్దపులి వలె; న, అత్తి - మ్రింగదు; హి - ఏలయన; అస్య - దీనికి; రూపమ్ - రూపము; న, ఉపలభ్యతే, హి - కానవచ్చుట లేదు గదా!

తా. కామము క్రోధము మున్నగు రాక్షసలక్షణములు కల అసురులు అజ్ఞానమువలననే మృత్యువునకు చేజిక్కిరి. అట్లు కాక జ్ఞానము కలవారైనచో బ్రహ్మమే యగుచున్నారు. మృత్యు వనబడు అజ్ఞానము ప్రాణులను చేజిక్కించు కొనును. కాని పులివలె మ్రింగదు. ఏలయన దానికి రూపమే లేదు గదా!

వ్యా. ఇచట ప్రమాద మనగా అజ్ఞానము. ఆత్మతత్త్వ మెరుగకుండుట; అసురు లనగా అసువులయందు రమించువారు - అనగా కామము, క్రోధము మొదలగు దుష్టలక్షణములు పైకొన్నవారు; పరాభవన్ - పరవశులైరి - మృత్యు వునకు చేజిక్కిరని భావము; తథా - అట్లే; అప్రమాదత్ - జ్ఞానమువలన;

బ్రహ్మభూతాః - మొదట బ్రహ్మమే అయినవారయ్యు అజ్ఞానముచేత బ్రహ్మము కానివారమని తలపోయుచు జ్ఞానముచేత మరల బ్రహ్మమే యగుచున్నారని భావము. 'బ్రహ్మైవ సన్ బ్రహ్మాప్యేతి' - బ్రహ్మమే అయి బ్రహ్మమును పొందుచున్నాడు - అని శ్రుతి. భవన్తి - అనుదానికి మారుగా 'సురాశ్చ' అని యొక పాఠము - అప్పుడు సురు లనగా శమము దమము మొదలగు లక్షణములు కలవారు; బ్రహ్మభూతాః - బ్రహ్మభావమును పొందినవారు - అని యర్థము; మృత్యువు అనగా అజ్ఞానము. జంతువులను తినుట యనగా సంసారమను సంకటమున పడవేయుటయే కాని పులివలె మ్రింగి వేయుట కాదు. అది చేయు పనియే కానవచ్చుచున్నది కాని దాని స్వరూపము తెలియవచ్చుటలేదు గదా! త్రాటియందు కలిగిన సర్పభ్రాంతి వంటి అజ్ఞానము నిజమైన పామువలె కానరాదు గదా! అని భావము.

అవ : మృత్యువునకు రూపమే లేదన్నచో అది ఉన్నదనుటకు ప్రమాణమేమిః అనుదానికి సమాధానము చెప్పుచున్నారు -

యమం త్వేకే మృత్యు మతోఽన్య మాహు-
రాత్మావసన్న మమృతం బ్రహ్మచర్యమ్,
పితృలోకే రాజ్య మనుశాస్తి దేవః
శివః శివానా మశివోఽశివానామ్. 6

ప్ర. అ : ఏకే - తు - కొందరు మూఢులన్ననో; అతః - ఈ మృత్యువు కంటె; అన్యమ్ - ఇతరుని; ఆత్మావసన్నమ్ - ఆత్మయందు లీనమై యున్న వానిని - ఆత్మయందు కల్పితమై యున్నవానిని; యమమ్ - యముని; మృత్యుమ్ - మృత్యువునుగా; ఆహుః - చెప్పుదురు; బ్రహ్మచర్యమ్ - బ్రహ్మచర్యమే - అనగా ఆత్మను అనుసంధించుకొనుటయే; అమృతమ్ - మోక్షమునకు హేతువు;

దేవః - ఆ యముడను దేవుడు; పితృలోకే - పితృలోకమున; శివానామ్ - మంగళకార్యములు చేయువారికి; శివః - మంగళకరుడును; అశివానామ్ - పాపకార్యములు చేయువారికి; అశివః - అశుభములు చేయువాడును అయి; రాజ్యమ్- రాజ్యమును; అనుశాస్తి - శాసించుచున్నాడు.

తా. కొందరు మూఢులు అజ్ఞానముకంటె వేరైన యమునే - ఆత్మ యందు భావించుకొని - మృత్యు వనుచున్నారు. నిజమునకు బ్రహ్మమును చక్కగా భావించి యందు లీనమగుటయే మోక్షము. ఇక ఆ యముడన్న దేవుడు పుణ్యులకు మంగళములను, పాపులకు అశుభములను కలిగించుచు పితృలోక మున రాజ్య మేలుచున్నాడు. (అతడు లేడని భావము).

వ్యా. అతః అనగా ఇంతకంటె - మన మనుకొనుచున్న అజ్ఞానముకంటె వేరుగా యము డను మృత్యువు కల డందురు. ఆత్మావసన్నమ్-అనగా ఆ యముని ఆత్మలో కల్పించుకొని చూచుచున్నారని భావము. "సత్యవంతుని దేహమునుండి పాశమునకు చిక్కి వశంగతుడైన అంగుష్ఠమాత్రపురుషుని యముడు వెలుపలికి గుంజెను" మొదలగు తావుల ఈ యమప్రస్తావన కలదు. ఈ యముడు ఆత్మయందు కల్పితుడే యను విషయమును 'ఆత్మావసన్నమ్' అను పదము చెప్పుచున్నది. ఇచట 'ఆత్మావాసమ్' అనియు పాఠము. అపుడు ఆత్మ నాశ్రయించుకొనిన వాడని యర్థము. అనగా త్రాటియందు సర్పమును తెలివితక్కువతనముచేత భావించినట్లు ఈయమునికూడ ఆత్మయందు అజ్ఞానముచేత నరుడు కల్పించుకొనె నని భావము.

ఈ యముని లేకుండచేయుట యెట్లనగా - బ్రహ్మచర్యమే ఉపాయమని చెప్పుచున్నారు. ఇచట బ్రహ్మచర్య మనగా బ్రహ్మమునందు చర్య - తానే ఆత్మ మను జ్ఞానమును పొందుట. సమస్తమైన కల్పనలను త్రోసివేయుట అని తాత్పర్యము. అదియే అమృతము - మోక్షమునకు హేతువు. యోగులకు యమ భయము లేదని యర్థము. 'న తస్య రోగో న జరా న మృత్యుః' అని శ్రుతి. (ఆత్మజ్ఞునకు రోగము, ముదిమి, చావు లేవు.)

అట్లయినచో ఎండమావులలో నీరుండని విధమున కల్పించుకొన్న యముడు ఏ పనియు చేయజాలడు కదా అన్న శంకకు 'పితృలోక' ఇత్యాది వాక్యార్థముచే సమాధానము చెప్పుచున్నారు. 'దెయ్య మెంతటిదో బలి యంత' అను న్యాయము ననుసరించి తనయందు గరుడత్వము నారోపించుకొన్నవాడు విషమును మరలించుట లోకమున చూచుచున్నాము కనుక కల్పించుకొన్న యముడు కూడ ఆ యా కార్యములను చేయుచున్నట్లే తోచుచున్నది.అది యెట్లన అతడు శివులకు శివుడు, అశివులకు అశివుడు అను వాక్యముతో ఒక యుక్తిని చెప్పుచున్నారు. శివత్వము, అశివత్వము విరుద్ధధర్మములు - చల్లదనము, వేడి

వంటివి. ఇవి రెండును ఒకచోట నుండవు. కాని త్రాటిని చూచి అది పామో, కఱ్ఱయో అని భ్రాంతిచెందిన వానికి త్రాటియందు ఆ రెండును కానవచ్చినట్లు కల్పితయమునియందు శివత్వము, అశివత్వము కానవచ్చుచున్నవి.

అస్యాదేశా న్నిస్సరతే నరాణాం
క్రోధః ప్రమాదో లోభరూపశ్చ మృత్యుః,
అహంగతే నైవ చరన్విమార్గా-
న్న చాత్మనో యోగ ముపైతి కశ్చిత్. 7

ప్ర. అ. అస్య - ఈ యమునియొక్క; ఆదేశాత్ - ఆజ్ఞవలన; నరాణామ్ - నరులయొక్క; క్రోధః - కోపరూపము; ప్రమాదః - పొరపాటు; లోభరూపః, చ - లోభమనెడు రూపమును గల; మృత్యుః - మృత్యువు; నిఃసరతే-వెలువడుచున్నది; అహంగతేన, ఏవ - అహంకారముతో కూడియే; విమార్గాన్ - ఆత్మకంటె వేరైన మార్గములను; చరన్ - తిరుగుచు; చ - మరియును; కశ్చిత్ - ఏ ఒక్కడును; ఆత్మనః - ఆత్మయొక్క; యోగమ్ - కలయికను, న ఉపైతి - పొందడు.

తా. ఈ యజ్ఞానరూపమైన యముడే నరులలో క్రోధము, పొరపాటు, లోభము అను రూపములుగల మృత్యువును వెలువరించుచున్నాడు. వీనివలన అహంకారము పుట్టి జీవుడు ఆత్మకంటె వేరైనమార్గములలో తిరుగుచున్నాడు. ఆ విధముగా జ్ఞానము లేకుండుటచే ఆత్మతో కలయికను పొందకున్నాడు.

వ్యా. ఈ యముని యాదేశమువలననే క్రోధము మున్నగు రూపములు గల మృత్యువు-మరణమునకు కారణమైనది పుట్టుచున్నది.అజ్ఞానాభిమానిని యగు దేవత యము డన్నట్లు, క్రోధాద్యభిమానినులగు దేవతలు యముని దాసీజనము వంటివారని యిచట అధిదైవమగు అర్థము. అధ్యాత్మమగు నర్థ మేమనగా- అజ్ఞానమువలననే క్రోధము మొదలగునవి పుట్టును; వానివలన నరుడు మృతి చెందును.

ఇట నొక శంక : అజ్ఞానము ఆత్మలో నెలకొన్నదియే యన్నచో అది ఆత్మకంటె వేరుగా నేర్పడునా? ఆత్మతో కలసియే యుండునా? ఆత్మతో కలసి యుండునన్న రెండవ పక్షమున ముక్తులకుకూడ మరల బంధము కలుగవలసి వచ్చును. ఆత్మకంటె వేరన్న మొదటిపక్షమున సాంఖ్యులు చెప్పెడు ప్రకృతి

వంటిదై నశింపనిది కావలసివచ్చును. ఇట్టి శంక కలుగగా దానికి సమాధానము 'అహంగతేనైవ' ఇత్యాదిగా చెప్పుచున్నారు.

అహంగతేన - జీవులదైన అహంకారముతోపాటు గమనము కలదియై యా మృత్యువు విమార్గములలో - ఆత్మకాని దానిని పొందు మార్గములలో చరించుచుండును. అనగా విషయములను అనుభవించుచు నుండునని తాత్పర్యము. ముక్తియందు అజ్ఞానము నాశ్రయించిన 'నేను' అను పదమున కర్థమైన జ్ఞానము వంటిది నశించిపోవును కనుక ఆత్మ శుద్ధమగును. అట్టి దానినుండి మరల అజ్ఞానము పుట్టుటగాని, భిన్నముగా నుండుటగాని జరుగదు-అని భావము.

గాఢనిద్రయందు అహంకారము లయమగుటయు కానవచ్చుచున్నదిగదా యను శంకకు సమాధానము చెప్పుచున్నారు. గాఢనిద్రయందు అహంకారము పూర్తిగా నశింపదు. సూక్ష్మరూపమున నుండును. కావున గాఢనిద్రయే ముక్తి కాదు. కావుననే ఏ యొక్కడును జ్ఞానమును వదలి ఆత్మతో యోగము పొందడు. జ్ఞానము లేనిచో 'స్వరూపము' - మోక్షము పొందదని తాత్పర్యము.

కావున అహంకారము నశింపకమున్ను క్రోధము మున్నగురూపములు గల మృత్యువు ఏర్పడుట యుక్తమే యని భావము.

అస్యాదేశాత్ - అనుదానికి 'అస్యాద్ ఏష' అని యొక పాఠము. అచట అస్యమనగా - దీనియందుండును అను అర్థమువలన అజ్ఞానమునకు నెలవైన అహంకారము అర్థము. ఆ అహంకారమువలననే క్రోధాదిరూపమైన మృత్యువు వెలువడునని భావము.

అహంకారమే మృత్యువు. దానివలననే క్రోధాదులు సంభవించును. అదియే చావు. అహంకారము నశించుటయే జ్ఞానము. అది కలిగినవాడు ఆత్మతో యోగము పొందును. అదియే ముక్తి అని శ్లోకతాత్పర్యము.

అవ. ఆత్మయోగము లేనిచో తప్పేమిః యన్నచో చెప్పుచున్నారు -

తే మోహితా స్తద్వశే వర్తమానా
ఇతః ప్రేతా స్తత్ర పునః పతన్తి,
తతస్తాన్ దేవా అనువిప్లవన్తే
అతో మృత్యు ర్మరణాఖ్యా ముపైతి. 8

ప్ర. అ. తే - వారు - ఆత్మయోగము పొందని నరులు; మోహితాః - మోహము పొందినవారై; తద్వశే - క్రోధాదిరూపమైన మృత్యువువశమున; వర్తమానాః - తిరుగుచున్నవారై; ఇతః - ఈ లోకమునుండి; ప్రేతాః - వెడలిన వారై; తత్ర - ఆ యమలోకమందు; పునః - మాటిమాటికి; పతన్తి - పడు చుందురు; తతః - అటుపై; తాన్ - అట్లు పడినవారిని; అను - అనుసరించి; దేవాః - ఇంద్రియములు; ప్లవన్తే - పోవుచున్నవి; అతః - అందువలన; మృత్యుః - అజ్ఞానము; మరణాఖ్యామ్ - మరణము అను పేరును; ఉపైతి - పొందుచున్నది.

తా. అట్లు జ్ఞానములేని నరులు మోహమువలన క్రోధము మొదలగు రూపములుగల మృత్యువునకు వశమై తిరుగుచు ఈలోకమునుండి వెడలి ఆ యమ లోకమున మరల మరల పడుచున్నారు. వారి ననుసరించి వారి యింద్రియము లును అక్కడకే పోవుచున్నవి. ఇట్లు మృత్యువునకు మరణ మను పేరు కలుగు చున్నది.

వ్యా : మోహితాః - క్రోధాదులచేత మోహపెట్టబడినవారై; తద్వశే - మృత్యువువశమున; ఇతః - ఈ లోకమునుండి; తత్ర - యమలోకమున; పునః - అనుమాట జ్ఞానము సిద్ధించువరకు పెక్కుమారులు పడుచునే యుందు రను నర్థమును సూచించును; పతంతి - నరకాదులయందు పడుదు రని యర్థము; తాన్ - అందు బోయినవారిని; అను - అనుసరించి, దేవాః - ఇంద్రి యములు; ప్లవన్తే - పోవును; 'తముత్క్రామన్తం ప్రాణోఽనూత్క్రామతి ప్రాణ మనూత్క్రామన్తం సర్వే ప్రాణా అనూత్క్రామన్తి' అని శ్రుతి. దేహమును వదిలిపోవు జీవు ననుసరించి ప్రాణము, ప్రాణము వెంటబడి యింద్రియము లన్నియు లేచిపోవును - అని యర్థము. ప్రాణత్యాగము జరుగుచున్నది కనుక 'మృఙ్ ప్రాణత్యాగే' అను అనుశాసనమును బట్టి యిట్టి అజ్ఞానరూపమృత్యువు; మరణాఖ్యామ్ - మరణ మను నామమును; ఉపైతి - పొందుచున్నది.

'మృత్యు రత్యన్త విస్మృతిః' సంపూర్ణమగు విస్మృతియే - జ్ఞానరహి తత్వమే మృత్యువు అను దానినిబట్టి దేహవిస్మృతిరూపమున యముడును, ఆత్మవిస్మృతిరూపమున అజ్ఞానమును మృత్యువులని భావము. ముఖ్యమగు మృత్యువు అజ్ఞానము, అముఖ్యమగు మృత్యువు యముడు - అని తాత్పర్యము.

అవ. మరణమునకు పూర్వమున గదా మృత్యువువలన భయము. మరణించినవాని కది యుండదు గదా! అట్లు మరణించినవాడు కృతకృత్యుడే అగుచున్నాడు గదా - అను శంకకు సమాధానము చెప్పుచున్నారు.

కర్మోదయే కర్మఫలానురాగా -
స్తత్రాను తే యాన్తి న తరన్తి మృత్యుమ్,
సదర్థయోగానవగమాత్ సమన్తాత్
ప్రవర్తతే భోగయోగేన దేహీ. 9

ప్ర. అ. కర్మ - ఉదయే - కర్మము పుట్టగా; కర్మ, ఫల, అను రాగాః - కర్మఫలము ననుభవించుటయందు అనురాగము గల; తే - వారు; తత్ర - అచటకు - స్వర్గము మొదలగు తావులకు, అను, యాన్తి - వెడలుదురు; మృత్యుమ్ - మృత్యువును; న, తరన్తి - దాటరు; దేహీ - దేహమున అభిమానము గలవాడు; సత్, అర్థ, యోగ, అనవగమాత్ - బ్రహ్మమును పొందించు ఉపాయమగు యోగమార్గము తెలియరానికారణమున; భోగ యోగేన - భోగములను పొందు కోరికతో; సమన్తాత్ - అన్నివిధములగు యోనులందును ప్రవర్తతే - తిరుగుచుండును.

తా. ముందు జీవికి కర్మము పుట్టుచున్నది. దానివలన నేర్పడు ఫలముల ననుభవించుటకు అనురాగము పెరుగుచున్నది. అట్లు అనురాగము పెరిగినవారు భోగవాసనతో స్వర్గాదిప్రదేశములకు పోవుచున్నారు. అంతేకాని మృత్యువును తప్పించుకొనుటలేదు. ఏలయన దేహి బ్రహ్మము నెరుగుటకు యోగ్యమైన యోగ మార్గము నెరుగక భోగలాలసతతో ఉత్తమ మధ్యమ అధమజాతులయందు పలుమారు పుట్టుచు తిరుగుచున్నాడు.

వ్యా. కర్మోదయే - భోగముల నొసగు కర్మము ఏర్పడగా; కర్మఫల, అనురాగాః - కర్మముల ఫలముల ననుభవించుటయందు అనురాగము కలవారు; తత్ర - స్వర్గము మున్నగు దానియందు; అను, యాన్తి - భోగములవాసన వలన పూర్వదేహమును వదలి పోవుచున్నారు; అనగా వారు మరియొకదేహము లోనికి పోవుచున్నారు కాని మృత్యువును తరించుట లేదని తాత్పర్యము; దేహము పోగా ముక్తి రాదని భావము. శ్రుతియు నట్లే చెప్పుచున్నది.

"యేయం ప్రేతే విచికిత్సా మనుష్యేఽస్తీత్యేకే నాయమస్తీతి చైకే" - మనుష్యుడు మరణించిన పిదపను ఉన్నాడని కొందరు, లేదని కొందరు - అను రెండు పక్షములను ప్రతిపాదించి, "యోని మన్యే ప్రపద్యన్తే శరీరత్వాయ

దేహినః, స్థాణు మన్యేఽనుసంయన్తి యథాకర్మ యథా శ్రుతమ్" - కొందరు దేహులు శరీరమును పొందుటకై మరల గర్భమును ప్రవేశించుచున్నారు. మరి కొందరు స్థాణురూపమును పొందుచున్నారు. ఇది వారి వారి కర్మములనుబట్టియు, జ్ఞానమును బట్టియు జరుగుచున్నది అని మరియొక దేహమును పొందెడు రూపమున-ఉండుటనే ప్రతిపాదించుచున్నది.

అట్లేల కావలయు ననుదానికి హేతువును చెప్పుచున్నారు. సత్ - అనగా బ్రహ్మము. సదర్థయోగ మనగా-బ్రహ్మమును పొందుటకు యోగ్యమైన యోగ మార్గము-అష్టాంగములతో కూడిన యోగమార్గము-దాని-అనవగమాత్-లాభము-పొందిక లేని కారణమువలన - బ్రహ్మమును పొందించు యోగమార్గము నను సరింపని కారణమున-అని ఫలితార్థము. సమన్తాత్ - అన్నియెడల-ఉన్నతములు, నీచములు, తిర్యక్కులు అగు యోనులయందు; భోగయోగేన - భోగములను పొందుఇచ్ఛతో; దేహీ - దేహాభిమానము కలవాడు; ప్రవర్తతే-చావుపుట్టుకలరూప మున తిరుగుచున్నాడు.

దేహము నశించినను కర్మఫలానుభవము, దానివలన నగు దుఃఖమును తప్పుట లేదని ఫలితార్థము.

అవ. భోగదోషములనే చూపుచున్నారు-

తద్వై మహామోహన మిన్ద్రియాణాం
మిథ్యార్థయోగస్య గతిర్హి నిత్యా,
మిథ్యార్థయోగాభిహతా న్తరాత్మా
స్మర న్నుపాస్తే విషయాన్ సమన్తాత్. 10

ప్ర. అ. మిథ్యా - అర్థయోగస్య - అబద్ధములగు విషయములందు రాగము కలవాని; గతిః -ప్రవృత్తి; నిత్యా - స్వభావసిద్ధమై నిలిచియుండునది; ఇతి యత్ - అనునదేది గలదో; తద్, వా - అది; ఇన్ద్రియాణామ్ - ఇంద్రియ ములకు; మహామోహనమ్ - పెనుమోహము కలిగించునది.

మిథ్యా-అర్థ, యోగ, అభిహత, అన్తరాత్మా- అసత్యములగు విషయము లందలి కూడికవలన దెబ్బతిన్న అంతరాత్మ కలవాడు; సమన్తాత్ - అన్ని యెడల; విషయాన్-శబ్దము మొదలగు విషయములను; స్మరన్ - తలపోయుచు; ఉపాస్తే - సేవించుచుండును.

తా. ఇంద్రియములు వాంఛించు విషయములు నిజమునకు అసత్యములు. వానితో సంపర్కము పెట్టుకొన్నవాని ప్రవర్తన అట్లే సాగుచుండును. అది ఇంద్రియములను బలముగా ఆక్రమించి మోహపెట్టుచుండును. విషయములకు వశమై అదుపుతప్పిన అంతరాత్మగలవాడు యుక్తితో భక్తితో మన్నింపవలసినది మరియొకటి యున్నదని గుర్తింపక శబ్దము, స్పర్శ, రూపము, రసము, గంధము అను విషయసుఖములనే అంటిపెట్టుకొనియుండును.

వ్యా. మిథ్యా - అర్థ, యోగస్య - అసత్యములగు శబ్దాదివిషయముల యందు; యోగ మనగా రాగము - అది కలవాని; గతిః - ప్రవృత్తి - నడవడి; నిత్యా-స్వభావము నంటిపెట్టుకొని యుండునది-ఒకలీరున వదలగొట్టుకొనరానిదని భావము; తద్, ఏవ-అదియే; ఇంద్రియాణాం, మహామోహనమ్-ఇంద్రియములను బలముగా మోహపెట్టునది. విషయములు సంకల్పమువలన పుట్టునవి కనుక మిథ్యాభూతములు. అక్షపాదులు దీనినిగురించి యిట్లు చెప్పిరి- "దోషనిమిత్తం రూపాదయో విషయాః సంకల్పకృతాః"-దోషమునకు కారణములైన రూపము మొదలగు విషయములు సంకల్పమువలన నేర్పడినవి. దోష మనగా రాగము మొదలగునది.

అట్టి మిథ్యార్థములందు తగులుపొంది గతితప్పిన చిత్తముకలవాడు విషయములను స్మరించుచు వానినే ఉపాసించుచుండును. అసత్తుఅగువానిని ఉపాసించుటవలన అసత్ఫలమే కలుగుట తప్పదు కదా!

స్మరణమే విషయోపాసనహేతువు కనుక శబ్దాదివిషయము విస్మరించు టయే మానవుని కర్తవ్యమని ఫలితార్థము.

అవ. విషయములను స్మరించుటవలన నగు దోషమును వివరించు చున్నారు-

అభిధ్యా వై ప్రథమం హన్తి లోకాన్
కామక్రోధా వనుగృహ్యాశు పశ్చాత్,
ఏతే బాలాన్ మృత్యవే ప్రాపయన్తి
ధీరాస్తు ధైర్యేణ తరన్తి మృత్యుమ్. 11

ప్ర. అ. అభిధ్యా, వై-విషయములను స్మరించుటయే; ప్రథమమ్-మొట్ట మొదట; లోకాన్-లోకులను; హన్తి-చావగొట్టును; పశ్చాత్-పిదప; ఆశు - వెను

వెంటనే; కామక్రోధౌ - కామము, క్రోధము - అనునవి, అనుగృహ్య-వెంటబడి పట్టుకొని; హతః-చావగొట్టును; ఏతే-ఈ మూడును; బాలాన్-చిత్తముపై అదుపు లేనివారిని; మృత్యవే-మృత్యువునకు; ప్రాపయన్తి - అప్పగించుచున్నవి; ధీరాః, తు-బుద్ధివిశేషముచేత చిత్తమును గెలిచినవారు మాత్రము; ధైర్యేణ-ధైర్యముతో; మృత్యుమ్-మృత్యువును; తరన్తి-దాటుచున్నారు.

తా. వివేకము లేక విషయములనే వదలక స్మరించువారిని ఆ స్మరణమే మొదట చావగొట్టుచున్నది. వెనువెంటనే కామక్రోధములు పట్టిపల్లార్చుచున్నవి. మనస్సు నదుపున పెట్టుకొనజాలని పసివారిని ఇవియే మృత్యువున కప్పగించుచున్నవి. ఇంద్రియములపై, చిత్తముపై అదుపుగలవారు మాత్రము బుద్ధివిశేషము చేత మృత్యువునకు లోబడక శాశ్వతసుఖము పొందుచున్నారు.

వ్యా. అభిధ్యా - విషయములను - శబ్దము, స్పర్శ, రూపము, రసము, గంధము అనువానిని - విడువక ధ్యానించుట; కామ మనగా వానిని పొంద వలయునను కోరిక; ఏదేని కారణముచేత అవి లభింపకున్నచో కలుగునది క్రోధము; ఏతే - ఈ మూడును (స్మరణము, కామము, క్రోధము). బాలాన్ - బాలురనగా ఇచట వివేకము లేనివారు-ఇంద్రియములపై అదుపులేనివారు-వారిని; మృత్యవే - మోహమునకు; ప్రాపయన్తి - అప్పగించును. ధీరాః - ధీరులు - చిత్తమును తమ అదుపులో పెట్టుకొన్నవారు - నిష్కాములని భావము; మృత్యుం తరన్తి - మృత్యువువంటి మోహమునకు లోనుగారని భావము. ఇచట మృత్యువనగా సంసారము. అది దాటుట యనగా శాశ్వతమైన సుఖము పొందుట.

ధర్మం చరన్తి - అని యొక పాఠము. యోగాభ్యాసము చేయుదురని అర్థము.

సోఽభిధ్యాయ న్నుత్పతితా న్నిహన్యా-
దనాదరే ణాప్రతిబుధ్యమానః,
నైనం మృత్యు ర్మృత్యు రివాత్తి భూత్వా
ఏవం విద్వా న్యో వినిహన్తి కామాన్. 12

ప్ర.అ సః - అతడు - ఆ ధీరుడు; అభిధ్యాయన్ - ఆత్మపదార్థమును ధ్యానించుచు; ఉత్పతితాన్ - ఎగసిపడుచున్న కామములను, అనాదరేణ - ఆదరింపక; అప్రతిబుధ్యమానః - వాని యునికినే గుర్తింపనివాడై; నిహన్యాత్ -

రూపుమాపును; యః - ఏ నరుడు; ఏవం - ఈవిధముగా; విద్వాన్ - తత్త్వ మెరిగినవాడు; భూత్వా - అయి; కామాన్ - విషయములకు సంబంధించిన కోరికలను; వినిహన్తి - మొత్తముగా చంపివేయునో; ఏనమ్- అట్టి ఈ నరుని; మృత్యుః - అజ్ఞానము; మృత్యుః, ఇవ - మృత్యుదేవతవలె; న, అత్తి - మ్రింగదు - లోగొనదు.

తా. మోహమును రూపుమాపదలచువాడు ఆత్మపదార్థమునే విడువక తలపోయుచుండును. ఎగసిపడుచున్న కామములను - అవి యున్నట్లే భావింపక - తుసకరించి నాశనము చేయును. ఇట్టి జ్ఞానసంపదకలవాడు కామములను చావగొట్టి యమునివంటి అజ్ఞానమును దరికి రానీయడు.

వ్యా. సః-అతడు-మృత్యువును తరింపగోరినవాడని భావము; అభిధ్యాయన్ - చెడెడు ఇంద్రియాదులకంటె భిన్నమైన చెడనిదగు ఆత్మతత్త్వమును వదలక ధ్యానించుచు; ఉత్పతితాన్ - ఎగిరిపడుచున్న కామములను; నిహన్యాత్ - నాశనము చేయును.

నాశనముచేయు ఉపాయమును చెప్పుచున్నారు. అనాదరేణ - తుచ్ఛమైనది అను బుద్ధితో దారిలో రాలిపడిన గడ్డిపరకలనువలె భోగములను లెక్కగట్టుచు; అప్రతిబుధ్యమానః - తలపునకు రానీయనివాడై.

ఇట్లు జ్ఞానియై కామములను పరిమార్చు పురుషుని; మృత్యుః - అజ్ఞానము; మృత్యుః ఇవ - యమునివలె; న, అత్తి - మ్రింగదు - విషయసుఖములందు కామనలేనివానికి మృత్యుభయము లేదని తాత్పర్యము.

అవ. కామములున్నవాని పాటులను, లేనివాని ఘనతను వక్కాణించు చున్నారు-

కామానుసారీ పురుషః కామా నను వినశ్యతి,
కామాన్ వ్యుదస్య ధునుతే యత్కిఞ్చిత్ పురుషో రజః. 13

ప్ర.అ. కామానుసారీ-కామముల వెంటనంటి పోవు: పురుషః - పురుషుడు, కామాన్ - కామములను; అను - అనుసరించి; (కామములు నశించినట్లు) వినశ్యతి - నశించును; కామాన్ - కామములను; వ్యుదస్య - త్రోసివైచి; పురుషః - నరుడు; యత్, కిఞ్చిత్ - ఏకొంచెమేని; రజః - దుఃఖరూపమైన ధానిని; ధునుతే - దులిపివైచును.

తా. కామముల వెంటబడి పోవువాడు వానివలెనే నశించును. వానిని దులిపి పారవేయువాడు దుఃఖము నంతటిని దులిపివేసికొనును.

వ్యా. కామానుసారి యనగా విషయవాంఛలు కలవాడు; కామాన్ అను. వినశ్యతి-కామము లెట్లు నశించునో అట్లే నశించును-"కురఙ్గ మాతఙ్గ పతఙ్గ భృఙ్గ మీనాహతాః పఞ్చభి రేవ పఞ్చ" - లేడి శబ్దముచేత, ఏనుగు స్పర్శచేత, మిడుత రూపముచేత, తుమ్మెద రసముచేత, చేప గంధముచేత నశించుచున్నవి కదా!

కామాన్ వ్యుదస్య - కామములను దూరంగా త్రోసివైచి; రజః - దుఃఖ రూపమైన రజోగుణమును; యత్కిఞ్చిత్ అనగా సర్వమును అని భావము; ధునుతే - రూపుమాపును.

అవ. అట్లుకానిచో దోషమేమో చెప్పుచున్నారు-

తమోఽప్రకాశో భూతానాం నరకోఽయం ప్రదృశ్యతే,
ముహ్యన్త ఇవ ధావన్తి గచ్ఛన్తః శ్వభ్రవ త్సుఖమ్. 14

ప్ర.అ. అయమ్ - ఈ కామము; అప్రకాశః - వెలుగులేని; తమః - చీకటి; భూతానామ్ - ప్రాణులకు; నరకః - నరకముగా; ప్రదృశ్యతే - కాన వచ్చుచున్నది; జనాః - జనులు; ముహ్యన్తః - మత్తెక్కినవారు; గచ్ఛన్తః - పోవుచు; శ్వభ్రవత్ - గుంటలుగల ప్రదేశమును వలె; సుఖమ్ - సుఖమొసగు దాని వైపు; ధావన్తి - పరుపులు తీయుచున్నారు.

తా. ఈ కామమున ఏమాత్రము వెలుగు లేదు. అది కాఱు చీకటి. కావు ననే అది ప్రాణులకు నరకము. కాని జనులు, మద్యము కై పెక్కినవారు గుంట లలో పడి పొరలినట్లు ఈ కామసుఖములకై పరువెత్తుచున్నారు.

వ్యా. అయమ్ - ఇది అనగా కామము; భూతములకు; తమః - అజ్ఞా నము; అప్రకాశః - విషయవివేకము కలుగజేయునిది; నరకః - నరకమువలె దుఃఖమునే కలిగించునది; ముహ్యన్తః - మద్యము త్రావి యొడలెరుగనివారు; శ్వభ్రవత్ - గుంటలుగల తావునందు; కల్లు త్రావి యొడలెరుగనివారు ఎగుడు దిగుళ్లలో పడిపోవువిధమున కామము ననుసరించువారు సంసారమున బడి దారపుత్రధనాదులకై పరుగులు తీయుచున్నారని భావము.

అమూఢవృత్తేః పురుషస్యేహ కుర్యాత్
కిం వై మృత్యు స్తార్ణ ఇవాస్య వ్యాఘ్రః,
అమన్యమానః క్షత్రియ కిఞ్చిదన్య -
న్నాధీయాత నిర్ణుద న్నివాస్య చాయుః. 15

ప్ర. అ. క్షత్రియ - ఓయి క్షత్రియుడా! యః - ఏ నరుడు, అస్య - ఈ కాముని; ఆయుః - ఆయువును; నిర్ణుదన్ - నుగ్గు నుగ్గొనరించుచు; అన్యత్ - మరియొక మోహహేతువును; కిఞ్చిత్ - కొంచెముకూడ; అమన్యమానః - తలప కున్నవాడై; న, అధీయాత - స్మరింపడో; అస్య - ఇట్టి, అమూఢవృత్తేః - కామునికి వశముకాని ప్రవృత్తిగల; పురుషస్య - నరునకు; మృత్యుః-మృత్యువు; తార్ణః - గడ్డిపరకలతో నేర్పడిన; వ్యాఘ్రః ఇవ - పులివలె; కిమ్, వై - కుర్యాత్ - ఏమి చేయును? (ఏమియును చేయజాలదు).

తా. నరుడు కాముని ఆయువును నుగ్గు నుగ్గు చేయవలయును. సుఖ హేతువులగు దారధనాదులను మనసున చొరనీయరాదు. వానిని స్మరింపరాదు. ఆ విధముగ అతడు అజ్ఞానము తొలగిన ప్రవృత్తి కలవాడైనచో గడ్డిపరకలతో చేసిన పులివలె అజ్ఞాన మనెడు మృత్యువు అతని నేమియు చేయజాలదు.

వ్యా. అమూఢవృత్తేః - కామములకు వశముకాని చిత్తముగల పురుషు నకు; తార్ణమ్ - తృణమయము గడ్డిపరకలతో చేయబడినది; కావున ఈ కాముని; ఆయుః - జీవనమును; నిర్ణుదన్ - తొలగించుచు; అన్యత్ కిఞ్చిత్ - సాధారణ ముగా జనులు వాంఛించు దేహసుఖాదులను; అమన్యమానః - తలపులోనికి రానీనివాడై; న, అధీయాత - స్మరింపకుండువాడు - ఇది తుచ్ఛము అను బుద్ధి గలిగి విషయములను విస్మరించుటయే కామమును కూకటివ్రేళ్ళతో పెల్లగించి వేయుట - అని తాత్పర్యము.

వసిష్ఠభగవాను డిట్లు చెప్పెను-

"భ్రమస్య జగతస్యాస్య జాతస్యాకాశవర్ణవత్,
అపునఃస్మరణం మన్యే సాధో విస్మరణం వరమ్.
తథాపి తవ న స్వాస్థ్యం సర్వవిస్మరణాదృతే".

ఈ జగత్తుకు సంబంధించిన భ్రమ ఆకాశమురంగు వంటిది. (నిజమునకు లేనిది). దానిని స్మరింపకుండుటయే మేలు మరచుట ఉత్తమము. అట్లు జగద్వి షయములను పూర్తిగా మరవనిచో నీకు మనఃసుఖము కలుగదు.

అవ. 'యమం త్వేకే' అను శ్లోకమున 'ఆత్మావసన్నమ్'అను పదముతో యముడు కూడ ఆత్మయందు కల్పితుడే అని చెప్పియున్నారు. దానిని వివరించు చున్నారు-

స క్రోధలోభా మోహవా నన్తరాత్మా
స వై మృత్యు స్త్వచ్ఛరీరే య ఏషః,
ఏవం మృత్యుం జాయమానం విదిత్వా
జ్ఞానే తిష్ఠ న్న బిభేతీహ మృత్యోః,
వినశ్యతే విషయే తస్య మృత్యు-
ర్మృత్యో ర్యథా విషయం ప్రాప్య మర్త్యః. 16

ప్ర.అ. యః - ఏ, ఏషః - ఈతడు - (జీవుడు) త్వచ్ఛరీరే - నీ శరీరమున; అంతరాత్మా - లోనున్న ఆత్మయై; మోహవాన్ - మోహము కల వాడై; క్రోధలోభా - క్రోధము లోభముగా నయి ఉండెనో; సః, వై - అతడే; మృత్యుః - యముడు.

ఏవమ్ - ఈ విధముగా; జాయమానమ్ - మోహమువలన పుట్టుచున్న; మృత్యుం - యముని; విదిత్వా - తెలిసికొని; జ్ఞానే - జ్ఞానమునందు; తిష్ఠన్ - చెదరక నిలుచుచు; నరుడు; మృత్యోః - యమునివలన; ఇహ - ఇచట; న బిభేతి - భయపడడు.

మృత్యోః - మృత్యువుయొక్క; విషయం - గురిని; ప్రాప్య - పొంది; యథా - ఎట్లు; మర్త్యః - మానవుడు; వినశ్యతే - నశించునో; తథా - అట్లు; విషయే - విషయము తెల్లము కాగా; తస్య - ఆ జ్ఞానముయొక్క; మృత్యుః - మరణమువంటి బంధము; వినశ్యతే - నశించిపోవును.

తా. నిజమునకు యముడని మరియొకడు లేడు. నీ శరీరమున అజ్ఞానముతో కూడియున్న జీవుడే మృత్యువు. క్రోధలోభములు కూడ మృత్యువులే. ఇట్లు తనయందు పుట్టుచున్న మోహము, క్రోధము, లోభము అను మృత్యువులను కనిపెట్టి వానికంటె భిన్నమైన జ్ఞానస్వరూపమున చెదరక నిలుచువానికి మృత్యువువలన భయము లేదు. లోకమున మృత్యువునకు వశమైన దేహము నామరూపములు లేకుండ పోయినవిధముగా జ్ఞానము కలిగిన వెంటనే అజ్ఞానమనెడు మృత్యువు నశించును.

వ్యా. శరీరే ఏషః - శరీరమునందున్న ఈతడు - 'నేను' అను భావము పొందిన జీవుడు - అతడు వెలుపలనున్న దేహమనెడు ఆత్మకు లోనున్నవాడు కనుక అంతరాత్మ యగుచున్నాడు. ఇతడు జ్ఞానమునకు అజ్ఞానమునకు ముడి వంటివాడు. అతడు మోహముకలవాడై క్రోధలోభములతో కూడి మృత్యు వగు చున్నాడు. మోహ మనగా ఒకదానిని మరియొకటి అనుకొనుట. ఆత్మ కాని దేహము మొదలగుదానిని ఆత్మగా భావించుటయే ఇచట మోహము. స్వయముగా బంధము లేనివాడయ్యు 'నవిక' యనుచెట్టును చూచి నిష్కారణముగా భయపడి అరచు చిలుకవలె అజ్ఞానమువలన ఆత్మను బద్ధునిగా భావించి కామాదులకు వశమగున్నాడు.

ఇట్లు కాక మోహమునకు శత్రువగు జ్ఞానమున కుదురుకొన్నవానికి మృత్యుభయము లేదు.

ఒక దృష్టాంతము చెప్పుచున్నారు - విషయము తెల్లమగునప్పటికి ఆ జ్ఞానమునకు మృత్యువైన అజ్ఞానము మృత్యువును గాంచి దేహము నశించినట్లు రూపుమాసిపోవును.

అజ్ఞానమువలన కలిగిన బంధము జ్ఞానముచేతనే నశించును కాని కర్మా దులవలన కాదని ఫలితార్థము.

అవ. ఇట నొక శంక-

ధృతరాష్ట్ర ఉవాచ - ధృతరాష్ట్రు డిట్లు పలికెను.

యానేవాహు రిజ్యయా సాధు లోకాన్
ద్విజాతీనాం పుణ్యతమాన్ సనాతనాన్,
తేషాం పరార్థం కథయ న్తీహ వేదా
ఏత ద్విద్వా న్నోపైతి కథం ను కర్మ. 17

ప్ర.అ. ద్విజాతీనామ్ - ఉపనయనసంస్కారముగలవారికి; ఇజ్యయా- యజ్ఞము మొదలగు కర్మముచేత; యాన్-ఏ; పుణ్యతమాన్-మిక్కిలి పుణ్యము లును; సనాతనాన్-నిత్యములును అగు; సాధులోకాన్-సత్యలోకము మొదలగు వానిని, ఆహుః-చెప్పుదురో; తేషామ్-అట్టివానికి; వేదాః-వేదములు; పరార్థమ్- అన్నింటికంటె మిన్నయగుతనమును; కథయన్తి-చెప్పుచున్నవి; ఏతత్-దీనిని; విద్వాన్-తెలిసినవాడు; కర్మ-కర్మమార్గమును; కథం ను-ఎట్లు; న ఉపైతి- పొందడు.

తా. ఉపనయనసంస్కారముకలవారికి యజ్ఞయాగాదికర్మములద్వారా గొప్ప పుణ్యము కలవియు, శాశ్వతములును అగు మంచిలోకములు సిద్ధించునని చెప్పుచున్నారు. వేదములును ఆ లోకములే అన్నింటికన్న మిన్న యని వక్కాణించుచున్నవి. ఇది యెరిగినవాడు కర్మమార్గము నేల పొందరు?

వ్యా. ఇజ్యయా - అశ్వమేధము మొదలగు యజ్ఞసముదాయముచేత; పుణ్యతమములు - ఇంద్రలోకము మొదలగువాని దృష్టితో అతిశయించినవి; సనాతనములు-వ్యవహారదృష్టితో నిత్యమైనవి; లోకాన్-సత్యలోకము మొదలగు పేర్లు కలవానిని; ఇహ-వేదమునందు; ఆహుః-వేదవేత్తలు చెప్పుదురు; అట్టి లోకముల, పరార్థం-పరార్థత్వమును-అన్నింటిని మించినతనమును; వేదములు చెప్పుచున్నవి. ఏతత్-దీనిని-కర్మలు క్రమముక్తిహేతువులను విషయమును; విద్వాన్-ఎరిగినవాడు; కర్మ-కర్మమును; కథం ను- ఎట్లు; న ఉపైతి-ఆశ్రయింపడు?

కర్మములవలననే మోక్షము సిద్ధించుచుండగా జ్ఞానముతో పని యేమి? అని శంక.

అవ. పైశంకకు సమాధానము చెప్పుచున్నారు-

సనత్సుజాత ఉవాచ - సనత్సుజాతుడు ఇట్లు చెప్పెను-

ఏవం హ్యవిద్వా నుపయాతి తత్ర
తత్రార్థజాతం చ వదన్తి వేదాః,
అనీహ ఆయాతి పరం పరాత్మా
ప్రయాతి మార్గేణ నిహత్య మార్గాన్. 18

ప్ర.అ. అవిద్వాన్ - చక్కని జ్ఞానము లేనివాడు, ఏవం - నీవు చెప్పిన ప్రకారము; తత్ర - మోక్షపదమునందును; ఉపయాతి - చేరుకొనును; అర్థజాతమ్ - భోగమే మోక్ష మనునట్టిదానిని; వేదాః - వేదములు; వదన్తి - చెప్పుచున్నవి.

పరాత్మా - జీవుడు; నిష్కామః - కోరికలు లేనివాడై; పరమ్ - నిర్గుణ మగు ఆత్మను; ఆయాతి - చేరుకొనుచున్నాడు; మార్గేణ - సుషుమ్న అను నాడిద్వారా; మార్గాన్ - తక్కిన మార్గములను; నిహత్య - తొలగించుకొని; ప్రయాతి - మోక్షమునకు పోవుచున్నాడు.

వ్యా. శ్రీనీలకంఠులదృష్టిలో కర్మము జ్ఞానమునకు సాధకము కావున కర్మమార్గమున ప్రవర్తించువారుకూడ మోక్షపదమును పొందుదురని వ్యాఖ్యానించుచున్నారు. కాని అది క్రమముక్తి. జ్ఞానమార్గమువలన సాక్షాన్ముక్తి కలుగును.

అవిద్వాన్ - జ్ఞానస్వరూపము నెరుగనివాడు; ఏవమ్ - నీవు చెప్పిన వరుసలో; తత్ర - అచట-మోక్షపదమునందు; ఉపయాతి-చేరుకొనుచున్నాడు. అర్థజాతమ్ - భోగమోక్షము అను పేరు గలదానిని - ప్రయోజనసామాన్యముగా వేదములు చెప్పుచుండును.

అనీహః - ఈహలు - కామములు లేని; పరాత్మా - జీవుడు. (ఆత్మకాని దేహము మొదలగువానియందు ఆత్మభావన కలవాడు కనుక పరమైన-ఇతరమైన ఆత్మ కలవాడు అని యీ శబ్దమున కర్థము) పరమ్ - నిర్గుణమైన ఆత్మను; ఆయాతి - పొందుచున్నాడు. కామములను విడనాడినవాడు భ్రాంతిని వదలి ఆత్మస్వరూపముతో నిలిచియుండు నని తాత్పర్యము.

మరియొకవిధముగా ఆ జీవుడే సుషుమ్నానాడిద్వారమున (యోగమార్గము ద్వారా) ఇతరలోకములను పొందించు దారులను పరిహరించి బ్రహ్మలోకము ద్వారమున పరమునుగూర్చి - పరమాత్మనుగూర్చి ప్రయాణము చేయును.

"తయోర్ధ్వమాయ న్నమృతత్వమేతి" అని శ్రుతి. ఆ సుషుమ్నద్వారా పైకి వచ్చి అమృతత్వమును పొందును.

బృహదారణ్యక మిట్లు చెప్పుచున్నది - కమసాలి బంగారుముద్దనుండి కొంత బంగారము గ్రహించి క్రొత్తదైన సుందరమైన రూపమును (నగను) చేయుచున్నాడు. అట్లే సాధకుడును ఈశరీరమును నశింపజేసి విద్యను పొందించి దానినుండియే పితృదేవతలకో, గంధర్వులకో, దేవతలకో, ప్రజాపతులకో, బ్రహ్మకో సంబంధించిన క్రొత్తది మంగళదాయకము నగు రూపమును సాధించు చున్నాడు. ఇది యంతయు కోరికలనుబట్టి యేర్పడుచున్నది.

ఇక కోరికలు లేనివాడన్ననో అన్నికోరికలు పొందినవాడే యగును. కావున వాని ప్రాణములు మరియొకదేహములోనికి ప్రవేశింపవు. అందే లీనములై పోవును.

ఇట్టి ఉపనిషద్భాగము కోరికలున్నవాని దేహము మరణముచేత 'పిత్ర్యము' మొదలగు మరియొకరూపమును పొందుచున్నదనియు, కోరికలు లేనివాడు పూర్ణబ్రహ్మస్వరూపము పొందుటచే వానికి మరియొకరూపము లేక పోవుచున్నదనియు ప్రతిపాదించుచున్నది. అట్లగుటయే ముక్తి.

కర్మాదులు చిత్తశుద్ధికి కారణములై జ్ఞానమును కలిగింపగా దానివలన జీవుడు ముక్తు డగుచున్నా డనునది ఫలితార్థము. ఇదికూడ ఒకవిధమగు అధికారము కలవారికి అవసరమే కనుక వేదములు ఆమార్గమునుకూడ ప్రశంసించినవని తాత్పర్యము.

అవ. మరల ధృతరాష్ట్రున కొక శంక కలిగినది - జీవుడు పరమును పొందుచున్నా డన్నచో ఒకటి మరియొకటియగుట కుదురదు గదా! కావున సర్వశక్తిమంతుడగు పరమాత్మయే జీవు డయ్యెనని చెప్పవలసివచ్చును. అప్పు డతడు బద్ధుడగుచున్నాడు. పరుడగు బ్రహ్మము ఇతరుల చెప్పుచేతలలో ఉండవలసిన అవసరము లేదు కనుక అదియు సరిపడని విషయమే. కావున నిట్లు అడుగు చున్నాడు-

ధృతరాష్ట్ర ఉవాచ - ధృతరాష్ట్రు డిట్లు పలికెను.

కోఽసౌ నియుఙ్క్తే తమజం పురాణం
స చేదిదం సర్వ మనుక్రమేణ,
కిం వాఽస్య కార్య మథవా సుఖం చ
తన్మే విద్వన్ బ్రూహి సర్వం యథావత్. 19

ప్ర.అ. విద్వన్ - జ్ఞానసంపద కలవాడా! అజమ్ - పుట్టుక మొదలగు వికారములు లేని; పురాణమ్ - ఎట్టిమార్పులు లేని; తమ్ - ఆ పరమాత్మని; నియుఙ్క్తే - నియోగించుచున్నది; కః, అసౌ - ఎవ్వ డాతడు?

సః - ఆ పరమాత్మయే; ఇదమ్ - ఈ; సర్వమ్ - అంతటిని; అనుక్రమేణ - క్రమము ననుసరించి; నియుఙ్క్తే. చేత్ - నియోగించు నేని; అస్య- అతనికి; కిమ్, కార్యమ్ - పని యేమి? అథవా - మరియు; సుఖమ్, చ, కిమ్ - సుఖ మేమి ?

తత్, సర్వమ్ - దాని నంతటిని; యథావత్ - ఉన్నదున్నట్లు; మే - నాకు; బ్రూహి - చెప్పుము.

ధృ. విద్వాంసుడా! చావుపుట్టుకలు లేనివాడును, పురాణపురుషుడునగు ఆ పరమాత్మను నడపువా డెవ్వడు? అతడే అన్నింటిని ప్రవర్తింపజేయుచున్నా డన్నచో అతనికి ఈ పనియేల? దీనివలన నాతడు బాముకొను సుఖమేమి? దీనిని ఉన్నదున్నట్లు నాకు తెలియజెప్పుము.

వ్యా. జీవుడు పరమాత్మ యగుచున్నా డన్నమాట కుదురుట లేదు. ఒకడు ఇంకొకడగుట లోకమున అసంభవము కనుక. పరమాత్మయే జీవుడగు చున్నా డనుటయు పొసగదు. అట్లయినచో అతడు మరియొకనికి వశుడై యుండ వలసివచ్చును. ఈ శంకను ధృతరాష్ట్రుడు వెలువరించుచున్నాడు.

అజమ్ - పుట్టుక మొదలగు వికారములు లేని; పురాణమ్ - 'పురాపి నవమ్' - 'ప్రాతవాడయ్యు క్రొత్తవాడు' అను నర్థమున దేశకాలపరిధులవలన నయ్యెడు ఏవిధమైన మార్పులు లేనివాడని భావము. అట్టి పరమాత్మని ఇట్టట్టు ప్రవర్తింపుమని ఆదేశించువా డెవ్వడు? అట్టివా డొక డున్నచో కదా జీవుడు దుఃఖాదులను పొందుట జరుగును! పరునకు నియోజకు డొక డున్నచో వానికిని మరియొక డుండవలయును గదా! అట్లు అవ్యవస్థ ఏర్పడును.

అట్లు కాక పరుడే తన్ను త్రిప్పువాడు లేక తానే యీ చేతనాచేతనమైన విశ్వముగా నయ్యెనని భావింప వీలున్నది. "తత్సృష్ట్వా తదేవానుప్రావిశత్". దానిని సృజించి దానియందే ప్రవేశించెను- అని వేదము చెప్పుచున్నది. కాని అప్పుడు మరియొక శంక కలుగుచున్నది. ఆ పరమాత్మ పొందవలసిన కామము లన్నియు పొంది ఎట్టి కామవాంఛలు లేనివాడుగదా! ఇట్లు జీవాదిభావము పొందు నవసర మేమి? పొంది యేమి సుఖ మనుభవించుచున్నాడు? 'ప్రయోజనము లేక బుద్ధిహీనుడును ప్రవర్తింప'డని కదా సూక్తి. కనుక పరమాత్మకు ప్రయోజన మేమియు లేదు. కనుక ప్రవృత్తి ఉండరాదు.

అట్లు గాక లోకములో వినోదముకొరకు చదరంగము మొదలైనవాని యందు లోకులు ప్రవర్తింతురు. "లోకవత్తు లీలాకైవల్యమ్" అను న్యాయము ననుసరించి పరమాత్ముడును విలాసముగా జగత్తును సృష్టించి అందు ప్రవేశించు చున్నాడా? అన్నచో అదియు పొసగదు.లోకమున చదరంగ మాడుట మొదలగు నది సుఖముకొరకే. పరమాత్మున కట్టి సుఖాపేక్ష లేదు. మరియు తన్ను తానే సంకటమున పడవేసికొనువానికి సుఖమును కలుగదు.అట్లు పరునకు సృష్టియందు ప్రవృత్తి సంభవింపదు. మరియు పరునితో జీవునకు అభేదముకూడ ఏర్పడదు.

ఏల యన జీవుడు పరుడు వేరు వేరు అన్నప్పుడుమాత్రమే జీవుని అదృష్టమును బట్టి పరుడు రాజువలె జీవుని భోగములకొరకు సృష్టి మొదలగువానియందు, తాను చేసిన మర్యాదను పరిపాలించుటకై ప్రవర్తించును. అందువలన వారిరువురకు అభేదము సంభవింపదు- అని ధృతరాష్ట్రుని శంక.

అవ : పై శంకకు సమాధానము చెప్పుచున్నారు-

దోషో మహానత్ర విభేదయోగే
హ్యనాదియోగేన భవన్తి నిత్యాః,
తథాస్య నాధిక్య మపైతి కిఞ్చి-
దనాదియోగేన భవన్తి పుంసః. 20

ప్ర. అ. అత్ర - ఈ; విభేదయోగే- వేరువేరుగా నున్న జీవపరమాత్మల కలయికయందు ;మహాన్ - దొడ్డదియగు, దోషః - దోషము - (కలదు). అనాది యోగేన - భోగ్యములగు వస్తువుల సంబంధముచేత ; నిత్యాః - నిత్యులగు జీవులు ; భవన్తి - ఏర్పడుచున్నారు ; తథా - అట్లు; అస్య - ఆ పరునియొక్క, ఆధిక్యమ్ - ఎక్కువతనము, కిఞ్చిత్ - కొంచెము కూడ ; న, అపైతి - తొల గదు ; పుంసః - పురుషులు ; అనాదియోగేన - ఆది లేనిదగు అజ్ఞాన సంబంధము చేత ; భవన్తి - ఏర్పడుచున్నారు.

తా. జీవపరమాత్మ లొక్కటియే యనుకొనుట పెద్ద దోషము. జీవులు భోగ్యములగు స్థూలసూక్ష్మశరీరములచేత ఏర్పడుచున్నారు. ఆ విధముగా పరమాత్మ గొప్పతనమునకు ఏ కొంచెము లోపము లేదు. అనాదియగు అజ్ఞానము వలన పురుషులు (జీవులు) ఏర్పడుచున్నారు.

వ్యా. విభేదము లనగా విశేషముగా భేదముకలవి జీవాత్మపరమాత్మలు. వాని యోగ మనగా అవి ఒక్కటి యగుట; దానియందు - అవి రెండును ఒక్కటియే యనుకొనుట - ఒకటి మరియొకటి యగుట సంభవింపదు కావున - పెద్ద తప్పు. ఇంతమాత్రమున జీవపరమాత్మలకు తాత్త్వికముగా భేదము భావించుట తగదు. మరేమన - అనాదియోగేన - అది అను పదమునకు తినెడు స్వభావముగలది యని యర్థము - అది కానిది - అనాది - అనగా భోగ్య వర్గము - స్థూలసూక్ష్మదేహరూపముననున్న క్షేత్రములని ఫలితార్థము. వానితో సంబంధముచేత పరమాత్మనుండి నిత్యులగు జీవు లేర్పడుచున్నారు. ఇది

యెట్లనగా అఖండముగా నున్న ఆకాశము ఆధారముగానున్న కుండ మొదలగు వానిచేత ఘటాకాశముగా హద్దులు కలదిగా అయినట్లు. ఆకాశమున నున్న చంద్రుడు వేరువేరుగా నున్న జలములలో ప్రతిబింబించినట్లు. ఇందు ఘటము, జలము అను ఆధారములనుబట్టి భిన్నస్వరూపములలో ఆకాశము, చంద్రబింబ ములు కనబడుచున్నవి. జీవు లట్టివారు. కాగా వీనివలన పరమాత్మయొక్క ఆధిక్యమే కొంచెము తొలగుటలేదు. నీటిలో పడిన చంద్రునినీడ కదలినచో పైనున్న చంద్రుడు కదలడు గదా! ఘటమునందలి ఆకాశము కదలగా ముఖ్య మగు ఆకాశము కదలినట్లు కాదుగదా!

ఈ యర్థమునే శ్రుతులు ప్రతిపాదించుచున్నవి.

ఒకే ఒక భూతాత్మ ప్రతిభూతమునందును ప్రకాశించుచున్నది. ఒక్కటిగా పెక్కుగా జలచంద్రులవలె కానవచ్చుచున్నది. సూర్యు డొక్కడే. జలములు పెక్కుగా నున్నవి. ఇట్లు పుట్టుక మొదలగు వికారములు లేని పరమాత్మ క్షేత్ర ములనుబట్టి భేదరూపమున కానవచ్చుచున్నాడు. ఇట్లు జీవపరమాత్మలకున్న భేదము ఉపాధినిబట్టి - జీవుడు ఉన్న ఆధారమును బట్టి - ఏర్పడినదే కాని అచ్చమైనది కాదు. కావున అవి రెండును కేవలము విభిన్నము లని తలపరాదు.

అయినచో జీవులు జన్మాదుల నెట్లు పొందుచున్నా రనగా అనాదియోగేన - ఆదిలేనిదగు అజ్ఞానసంబంధముచేత - అని సమాధానము.

క్షేత్రసంబంధము అజ్ఞానసంబంధముచేత పుట్టినదని ఫలితార్థము.

అవ. జీవేశ్వరుల భేదమును తొలగించి ప్రపంచముకూడ పరమేశ్వరుని కంటె వేరుగా లేదని నిరూపించుచున్నారు-

య ఏతద్వా భగవాన్ స నిత్యో
వికారయోగేన కరోతి విశ్వమ్,
తథా చ తచ్ఛక్తి రితి స్మ మన్యతే
తథాఽర్థయోగే చ భవన్తి వేదాః. 21

ప్ర. అ. యః - ఏతత్ - ఏ యీ జగత్తు, వా-వలె; భాతి - కనిపించు చున్నదో; సః - అదియు; నిత్యః-వికారములు లేని; భగవాన్ - ఐశ్వర్యము లన్నింటితో కూడిన పరమాత్మయే; సః - అతడు - వికారయోగేన - మాయా సంబంధముచేత; విశ్వమ్-ఈ సమస్తమును; కరోతి - చేయుచున్నాడు; తథా

చ - ఆ ప్రకారముగనే; తత్, శక్తిః - ఆ పరమాత్మశక్తి; ఇతి-అని; మన్యతే-వేదముకూడ సంభావించుచున్నది వేదాః, చ - వేదములును; తథా - అట్లు; అర్థయోగే - అర్థముల సంబంధమునందు; భవన్తి - ప్రమాణము లగుచున్నవి.

తా. ఈ కానవచ్చు జగమువలెనున్నదియు ఆ పరమాత్మయే. మాయవలన ఆతడే విశ్వమును చేయుచున్నాడు. ఆ మాయను పరమాత్మశక్తిగా వేదములు సంభావించుచున్నవి. అట్లు శక్తియు శక్తికిందియు ఒకటియే యను విషయము నందును వేదములే ప్రమాణము.

వ్యా. ఇచట 'వా' శబ్దము 'వలె' అను నర్థము కలది. జగత్తువలె కానవచ్చునదియు; భగవాన్ - సర్వైశ్వర్యములతో కూడిన పరమాత్మయే. (ఇచట 'వా' శబ్దము మిథ్య అను నర్థమును వ్యక్తముచేయును.) "ఇదం సర్వం యదయమాత్మా" - ఈ అంతయు ఆత్మయే మొదలగు వాక్యములద్వారా దీనినే ప్రతిపాదించుచున్నది. ప్రపంచము బ్రహ్మముకంటె వేరుకానిది - అను విషయ మును వక్కాణించుచున్నారు - వికార మనగా అనృతము - మాయ. దాని సంబంధముచే విశ్వమును చేయుచున్నాడు(పరమాత్మ)స్వప్నమువలె, ఇంద్ర జాలమువలె. మెలకువ వచ్చినవెంటనే స్వప్నమంతయు అసత్యమువలె తెల్లమయి నట్లు, కీలకము తెలిసిన వెంటనే ఇంద్రజాలము విచ్చిపోయినట్లు పరమాత్మ తత్త్వము తెలియవచ్చినంతనే జగత్తు ఉండదని భావన. ఇచట వికారశబ్దమున కిది యర్థము. అంతేకాని బంగారమునకు కుండలమునకువలె బ్రహ్మమునకు జగత్తునకు వికారివికారభావములేదని యెఱుగవలయును. అట్లయినచో బ్రహ్మము నకును అనిత్యతాదోషము సిద్ధించును.

కాగా జడమగు జగత్తునకు జడము కారణము కావలయును కాని విలక్షణ మగు చేతన మెట్లగును? అను శంకకు సమాధానము చెప్పుచున్నారు. ఆ ప్రకార ముగనే ఆత్మలో కలవలె జగత్తును తోపజేయుచు ఆ పరమాత్మశక్తి - అతని కంటె వేరుకానిది - కలదని వేదము సంభావించుచున్నది. అప్పుడు శక్తికి శక్తి కల పరమాత్మకు భేదము ఉండనే యున్నది కదా యన్నచో అది సరికాదు. శక్తి శక్తికలదానికంటె వేరుగా కానరాదు. అగ్నిలో కాల్చెడు శక్తియు, ప్రకాశ శక్తియు విడిగా కానరావు కదా! కావున భేదము లేదని తాత్పర్యము.

అర్థయోగే - శక్తి శక్తిమంతులకు అభేదసంబంధము కలదనుటకును వేదములే ప్రమాణము.

ధృతరాష్ట్ర ఉవాచ - ధృతరాష్ట్రు డిట్లు పలికెను.

యేఽస్మిన్ ధర్మా న్నాచరన్తీహ కేచి
త్తథా ధర్మాన్ కేచి దిహాచరన్తి,
ధర్మః పాపేన ప్రతిహన్యతే స్వి-
దుతాహో ధర్మః ప్రతిహన్తి పాపమ్. 22

ప్ర.అ. యే, కేచిత్ - కొందరు; అస్మిన్ - ఈ మోక్షము నిమిత్తముగా; ధర్మాన్ - ధర్మములను; న, ఆచరన్తి - చేయరు; తథా-అట్లే; కేచిత్ - మరి కొందరు; ఇహ - ఈ విషయమున; ధర్మాన్ - ధర్మములను; ఆచరన్తి - ఆచరింతురు. అట్టియెడ; ధర్మః - ధర్మము; పాపేన - పాపముచేత; ప్రతిహన్యతే, స్విత్ - చెడునా? ఉత - అట్లు కాక; ధర్మః-ధర్మము; పాపమ్ - పాపమును; ప్రతిహన్తి - రూపుమాపునా?

తా. కొందరు మోక్షము పొందుటకై అగ్నిహోత్రార్చనము మొదలగు ధర్మముల నాచరింపక సూటిగా సంన్యాసమును స్వీకరింతురు. కొందరు క్రమ ముక్తికొరకు కర్మముల నాచరింతురు. అట్టియెడ ధర్మము పాపముచేత చెడునా? ధర్మము పాపమును చెఱుపునా?

వ్యా. పై శ్లోకములలో జీవునకు ఈశ్వరునకు అభేదమును ప్రతిపాదించిరి. జగత్తు మిథ్యాత్వమును వక్కాణించిరి. జగత్తేర్పడుటకు నిమిత్తమైన ప్రకృతి - మాయ - శక్తి అనునది బ్రహ్మముకంటె వేరుకాదని నిరూపించిరి. ఇట్లు బ్రహ్మాద్వైతము సిద్ధించినది. దానిచేత మృత్యువు లేదను పక్షము గట్టిపడినది. మరికొందరు కర్మమార్గమున మృత్యునాశము కలుగునని వక్కాణింతురు. ఆ పక్షమునందును క్రమముక్తిని ప్రతిపాదించి కర్మములును మోక్షహేతువులే యగుటను స్పష్టము చేసిరి. దీనికి సంబంధించి ధృతరాష్ట్రుడు అడుగుచున్నాడు.

కొందరు మోక్షమునకై ధర్మములను - అగ్నిహోత్రాదికర్మములను ఆచరింపరు. సంన్యాసమునే అవలంబింతురు. మరికొందరు క్రమముక్తికొరకు ఉపాసనతో కూడిన కర్మములనే యాచరింతురు. అట్టి రెండవవిధమువారికి మొదటివారికివలె మహాధర్మము కలుగదు అగ్నిహోత్రార్చనాదిరూపమైన నిత్యానుష్ఠానాత్మకమైన అల్పధర్మమే కలుగును. అట్టి ధర్మము పాపముచేత -

రాగము మొదలగు దోషముచేత నశించునా? లేక ఆ ధర్మమే రాగాదిదోషమును నాశనము చేయునా? అని ప్రశ్న తాత్పర్యము.

అవ. సమాధానము చెప్పచున్నారు-

సనత్సుజాత ఉవాచ - సనత్సుజాతు డిట్లు చెప్పెను.

ఉభయమేవ తత్రోపయుజ్యతే
ఫలం ధర్మస్యై వేతరస్య చ. 23

ప్ర.అ. తత్ర - అందు; ఉభయమ్ - రెండు విధములైనదియు; ఉపయుజ్యతే, ఏవ - ప్రయోజనము కూర్చునదియే; ధర్మస్య - ధర్మముయొక్కయు; ఇతరస్య, చ - మరియొకటియగు పాపముయొక్కయు; ఫలమ్ - ఫలము; ఉపయుజ్యతే - కలుగును.

తా. మోక్షవిషయమున రెండు మార్గములును ఫలము కూర్చునవియే యగును. ధర్మమునకు, పాపమునకు ఫలము తప్పక కలుగును.

వ్యా. ఉభయమ్ - అనగా సన్యాసము, ఉపాసనతోకూడిన కర్మము - అను నీ రెండును; ఉపయుజ్యతే - పనికి వచ్చునవియే. అట్లే ధర్మమునకు ఫలము స్వర్గమో, చిత్తశుద్ధి కలుగుటయో ఉండితీరును. ఇతరస్య-అనగా అధర్మమునకు - పాపమునకు. ఇచట పాప మనగా - సంన్యాసభావముతో కాక - నిత్యకర్మము వదలుట, దానికి ఫలము నరకము కలుగునని భావము.

అవ. ఈ సంగ్రహవాక్యమునే వివరించుచున్నారు.

తస్మిన్ స్థితౌ వాऽప్యుభయం హి నిత్యం
జ్ఞానేన విద్వాన్ ప్రతిహన్తి సిద్ధమ్,
తథాऽన్యథా పుణ్య ముపైతి దేహీ
తథాగతం పాపముపైతి సిద్ధమ్. 24

అర్థ: ఉభయమ్, అపి - ఈ రెండును - సన్యాసము, కర్మము అనునవి; తస్మిన్ -ఆ మోక్షమునందును; స్థితౌ - స్థితికొఱకును; నిత్యమ్ - స్థిరముగా నుండునవి; వా - నిశ్చయము; జ్ఞానేన - సంన్యాసపూర్వకమైన జ్ఞానముచేత; విద్వాన్ - విద్వాంసుడు; సిద్ధమ్ - సిద్ధమైన బ్రహ్మమును; ప్రతిహన్తి - చేరకొనును;

తథా - అట్లే; దేహీ - ప్రాణి; అన్యథా - రెండవదియగు కర్మమార్గము ద్వారమున; పుణ్యమ్ - పుణ్యమును; ఉపైతి - పొందును; తథాగతమ్ - ఆ ప్రకారముగా; సిద్ధమ్ - సిద్ధముగా నున్న, పాపమ్ - పాపమును కూడ (కదాచిత్ - ఒకప్పుడు) ఉపైతి - పొందును.

తా. సంన్యాసము, కర్మమార్గము - ఈ రెండును మోక్షవిషయమునను, స్థితివిషయమునను నిత్యములే. కాని జ్ఞానముచేత విద్వాంసుడు తప్పక సిద్ధమగు మోక్షమును చేరుకొనును. కర్మమార్గమున దేహి పుణ్యమును పొందును. అప్పటి దేహాభిమానమువలన ఒకప్పుడు పాపమును కూడ పొందు నవకాశము కలదు.

వ్యా. ఉభయ మనగా సంన్యాసము, కర్మమార్గము అను నీ రెండును. తస్మిన్ - మోక్షవిషయమున; స్థితౌ - స్వస్వరూపమున ఉండుటయందు; నిత్యమ్ - స్థిరముగా నుండునవి (ది). ఇచట 'హ' శబ్దము నిశ్చయార్థకము. ఆ రెంటిలో విశేషమును చెప్పుచున్నారు. సంన్యాసపూర్వకమైన జ్ఞానముచేత; సిద్ధమ్ - బ్రహ్మవిద్యచే నిత్యమై ఏర్పడియున్న బ్రహ్మపదార్థమును; ప్రతిహన్తి - అనృతము, దుఃఖము, జడము అనువానికి విరుద్ధమై సచ్చిదానందాత్మకమైన పరబ్రహ్మమును పొందును; ఇచట హన్తి అనునది గత్యర్థకము.

తథా - ఉపాసనతో కూడిన కర్మమార్గముద్వారా; అన్యథా - సిద్ధమునకు విపరీతమైన సాధ్యమును పుణ్యమ్ - పుణ్యమును అనగా దేవతాదిభావమును; ఉపైతి - పొందును. దేహీ - దేహాభిమానము కలవాడైన కారణమున; తథాగతమ్ - ఆప్రకారముగా (కర్మమార్గమున) సిద్ధమ్ - మానవదేహాభిమానము వలన నేర్పడియున్న; పాపమ్, అపి - పాపమునుకూడ; కదాచిత్ - ఒకప్పుడు; ఉపైతి - పొందును.

కర్మమార్గమున మోక్షము వచ్చుట నియతముకాదు. దేవభావము పొంది అటుపై ముక్తి నందవచ్చును. లేదా జయవిజయాదులవలె భ్రష్టతయు కలుగ వచ్చును. కావున జ్ఞానమే శ్రేష్ఠమని ఫలితార్థము.

అవ : 23వ శ్లోకమునందు "ఫలం ధర్మస్యై వేతరస్య చ" అను రెండవభాగమును వివరించుచున్నారు.

గత్వోభయం కర్మణా యుజ్యతే స్థిరం
శుభస్య పాపస్య స చాపి కర్మణా,
ధర్మేణ పాపం ప్రణుదతీహ విద్వాన్
ధర్మో బలీయా నితి తస్య సిద్ధిః. 25

ప్ర. అ. అస్థిరమ్ - నశించునట్టి; శుభస్య - పుణ్యముయొక్కయు; పాపస్య - పాపముయొక్కయు; ఉభయమ్ - స్వర్గనరకరూపమగు ఫలములను రెంటిని; గత్వా - పొంది; కర్మణా-పూర్వసంస్కారమున కనుగుణమగు కర్మముతో; యుజ్యతే- కూడికొనును; సః, అపి - అట్టి కర్మయోగియు; కర్మణా - కర్మ రూపమైన; ధర్మేణ - ధర్మముతో; విద్వాన్ - విద్వాంసుడై; ఇహ - ఇచ్చట; పాపమ్ - పాపమును; ప్రణుదతి - తొలగించుకొనును; ధర్మః - ధర్మము; బలీయాన్ - అధర్మముకంటె మిక్కిలి బలముగలది; ఇతి - ఈకారణమున; తస్య - ధర్మము నాచరించువానికి; సిద్ధిః - సిద్ధి, కలుగును.

తా. కర్మఫలము నశించునట్టిది. కావున కర్మము నాచరించువాడు పుణ్యపాపరూపమైన స్వర్గనరకఫలములను రెంటిని అనుభవించి అవి నశించిన పిమ్మట మరల కర్మముతోడనే ప్రవర్తించును. ఇట్లీతనికి కర్మపాశము తప్పుట లేదు. అయినను ఆ కర్మయోగి తెలివిగలవాడై ధర్మముతో పాపమును పరిహరించుకొనును. కావున ధర్మము అధర్మముకంటె ఎక్కువబలము కలది యగుచున్నది. ఇట్లు కాలవశమున అట్టి కర్మయోగికి కూడ సిద్ధి కలుగును.

వ్యా. పుణ్యపాపములఫలములగు స్వర్గము, నరకము అస్థిరములు - నశించునవి. కర్మమార్గము ననుసరించువాడు స్వర్గనరకము లనుభవించిన పిమ్మట మరల పూర్వసంస్కారమున కనుగుణమైన జన్మము పొందును. పొంది మరల కర్మసంపర్కమే కలవా డగును. ఇట్లతనికి కర్మ పాశము తప్పుటలేదు. అట్లయ్యు అతడు ఈ తత్త్వమును చక్కగా నెరిగినవాడైనచో ధర్మముచేత పాపమును పరిమార్చికొనును. ఎరుగని మూఢుడైనచో కర్మ ఫలమగు స్వర్గభనాదులనే కోరుచుండును. ఈహేతువువలన ధర్మమే బలీయము. అధర్మము కాదు. ఈకారణమున ధర్మ మాచరించువానికి, కాలము గడువగా, రాగాదిదోషములు నశించుటవలన మోక్షఫలముకూడ సిద్ధింపవచ్చును.

కర్మమార్గమువలన మోక్షఫలము తప్పక సిద్ధించునని చెప్పజాలమని ఫలితార్థము. అందుకూడ మోక్షము కలుగు అవకాశమున్నది కనుక సర్వథా త్యాజ్యము కాదనియు భావము.

అవ. కామ్యమైన ధర్మము పాపము. అది బంధమునకు కారణము. నిత్యధర్మమువలన నేర్పడు పుణ్యము మోక్షహేతువని తలచి అడుగుచున్నాడు.

ధృతరాష్ట్ర ఉవాచ - ధృతరాష్ట్రు డిట్లు పలికెను.

యానిహాహుః స్వస్య ధర్మస్య లోకాన్
ద్విజాతీనాం పుణ్యకృతాన్ సనాతనాన్,
తేషాం క్రమాన్ కథయ తతోఽపి చాన్యా -
న్నైత ద్విద్వన్ వేత్తుమిచ్ఛామి కర్మ. 26

ప్ర. అ. విద్వన్ - పండితుడా! ద్విజాతీనామ్ - ఉపనయనసంస్కారము కలవారికి; స్వస్య - తమదైన; ధర్మస్య - ధర్మమునకు ఫలములయిన; పుణ్యకృతాన్ - పుణ్యమువలన నేర్పడిన; సనాతనాన్-సనాతనము లయిన; లోకాన్-లోకములను; యాన్ - వేనిని; ఆహుః - చెప్పుదురో; తేషామ్ - వానియొక్క; క్రమాన్ - క్రమములను - హెచ్చుతగ్గులను; కథయ - చెప్పుము. తతః, అపి-వానికంటెను; అన్యాన్, చ - ఇతరములైనవానిని (ఇచట గౌరవార్థమున బహువచనము - ఇతరమైన మోక్షసుఖమును అనియే తాత్పర్యము) కథయ - చెప్పుము. ఏతత్-ఈ, కర్మ - పనికిరాని కామ్యకర్మమును; వేదితుమ్ - తెలియుటకు; న, ఇచ్ఛామి - కోరను.

రా. జ్ఞానముపండిన వృద్ధమూర్తీ! వేదశాస్త్రములు ధర్మ మాచరించు వారికి పుణ్యమువలన నేర్పడు సనాతనలోకము లున్నట్లు చెప్పుచున్నవి. వానిలో ఉన్న తారతమ్యములను నాకు బోధింపుము. వానికంటె మిన్నయగు అతిశయ సుఖముగల మోక్షమునుగూర్చి బోధింపుము. పనికిమాలిన ఈకామ్యకర్మమును గూర్చి నేను తెలిసికొనగోరను.

వ్యా. వేదములు ఆ యా యజ్ఞాదులకు ఫలముగా స్వర్గలోకమును, బ్రహ్మలోకము మొదలగునవి కలుగునని చెప్పుచున్నవి. వానియందలి ఉచ్చనీచములను ధృతరాష్ట్రుడు తెలియగోరుచున్నాడు.

తతోఽపి చ అన్యాన్-అన్నచోట బహువచనము పూజ్యార్థమున ప్రయోగింపబడినది. నిజమున కట్టిది ఒక్కటియే ప్రత్యగానందరూపమైన మోక్షసుఖము. దానిని తెలియగోరుచున్నాడు.

దీనికంటె వేరుగా స్వభావసిద్ధమగు ప్రవృత్తికి విషయము, నిషిద్ధము అగు కామ్యకర్మమును గూర్చి తెలియగోరుటలేదు. దీనివలన ఆతని వైరాగ్యభావము స్పష్టమగుచున్నది. మరియు ప్రకరణమున దీనికి ఉపయోగము కూడ కలదు.

అవ : పై ప్రశ్నమునకు సమాధానము చెప్పుచున్నారు -

సనత్సుజాత ఉవాచ - సనత్సుజాతు డిట్లు చెప్పెను.

యేషాం వ్రతేఽథ విస్పర్ధా బలే బలవతా మివ,
తే బ్రాహ్మణా ఇతః ప్రేత్య బ్రహ్మలోకప్రకాశకాః. 27

ప్ర. అ. యేషామ్-ఎవరికి, వ్రతే-వ్రతమునందు; విస్పర్ధా-విశేషమగు స్పర్ధ; బలే-బలవిషయమున; బలవతామ్, ఇవ-బలవంతులకువలె, ఉండునో; తే-అ; బ్రాహ్మణాః-బ్రాహ్మణులు; ఇతః-ఈ దేహమునుండి; ప్రేత్య-వెడలి (మరణించి), బ్రహ్మలోకప్రకాశకాః - బ్రహ్మలోకమునందు వెలుగొందినవారగుదురు.

తా : బలవంతులకు బలవిషయమున ఇతరులను మించవలయునను భావము కలిగిన విధమున యమనియమాదివ్రతవిషయమున గట్టి స్పర్ధతో కృషి చేసినవారు ఈ దేహమును విడచి బ్రహ్మలోకమున తేజస్సుతో వెలుగొందుదురు.

వ్యా : వ్రతే-యమనియమాదిరూపమైన వ్రతము నిర్వహించుటయందు; విస్పర్ధా-నేను ఇతరులకంటె మిక్కిలిగా యమాదులను సాధింతును అను పోటీ-విశ్వామిత్రుడు మొదలగువారియందు కానవచ్చు తపస్సునందలి పట్టుదలవంటిది. తే-అట్టి యోగులు; బ్రాహ్మణాః-సగుణబ్రహ్మవేత్తలు; ఇతః-ఈ దేహమునుండి; ప్రేత్య-వెడలి - బ్రహ్మలోకమున తేజస్వు లగుదురు. ఆపై బ్రహ్మతోపాటు ముక్తిని కూడ పొందుదురు. స్మృతియు -

"బ్రహ్మణా సహ తే సర్వే సంప్రాప్తే ప్రతిసంచరే,
పరస్యాన్తే కృతాత్మానః ప్రవిశన్తి పరం పదమ్."

అట్టివారు వ్రతము ముగిసినపిదప కృతకృత్యులై బ్రహ్మతోపాటు పరమ పదమును ప్రవేశింతురు- అని చెప్పుచున్నది.

అవ. స్వధర్మములలో శ్రేష్ఠమైన యోగధర్మమునకు ఫలమును చెప్పి యజ్ఞాదిధర్మము ఫలమును చెప్పుచున్నారు-

యేషాం ధర్మే చ విస్పర్ధా తేషాం తద్ జ్ఞానసాధనమ్,
తే బ్రాహ్మణా ఇతో ముక్తాః స్వర్గం యాన్తి త్రివిష్టపమ్. 28

ప్ర.అ. యేషామ్ - ఎవరికి; ధర్మే - యజ్ఞాదిధర్మమున; విస్పర్ధా - ఇతరులను మీరవలయు నను భావ ముండునో; తేషామ్ - అట్టివారికి; తద్ - అదియే; జ్ఞానసాధనమ్ - జ్ఞానమునకు సాధనమగును; తే - అట్టి; బ్రాహ్మణాః - సగుణబ్రహ్మవేత్తలు; ఇతః - ఈదేహమునుండి; ముక్తాః - విడివడినవారై; త్రివిష్టపమ్ - స్వర్గలోక మనెడు; స్వర్గమ్ - సుఖస్థానమును; యాన్తి - చేరుదురు.

తా. ధర్మమున - యజ్ఞనిర్వహణమున పట్టుదలగలవారికి అదియే జ్ఞానసాధన మగును. అట్టివారు ఈదేహమును వదలి స్వర్గమునకు చేరుకొందురు.

వ్యా. నేనే అందరికంటె యజ్ఞాదులను గొప్పగా చేయుదు నను పట్టుదల గలవారికి ఆ యజ్ఞమే పరబ్రహ్మమును తెలియవలయు ననెడు కోరికను పుట్టించి జ్ఞానసాధన మగును. శ్రుతియు దీనిని వివరించుచున్నది-

"తమేతం వేదానువచనేన బ్రాహ్మణా వివిదిషన్తి యజ్ఞేన దానేన తపసాఽనాశకేన"—

వేదమును పఠించుటచేతను. యజ్ఞముచేతను, దానముచేతను, తపస్సు చేతను ఆ పరమపురుషుని తెలిసికొనగోరుదురు.

స్వర్గం త్రివిష్టపమ్- అని చెప్పుటచేత ఇది దేవలోకమే కాని సత్య లోకము కాదని చెప్పినట్లయినది.

జ్ఞానము నెరుగగోరి చేయు కర్మముకూడ ఆనుషంగికముగా (అప్రధాన ఫలమును ఆనుషంగిక మందురు) స్వర్గమును సమకూర్చును. ఇచట ఆపస్తంబుని మాట అన్వయించుకొనదగును - తద్యథాఽఽమ్రే ఫలార్థం నిర్మితే ఛాయాగన్ధ ఇత్యనూత్పద్యన్తే ఏవం చర్యమాణ మర్థా అనూత్పద్యన్తే" - మామిడిచెట్టును

పండ్లకొరకై పెంచుదుము. వానితోపాటు నీడను వాసనను కూడ అది పుట్టించును. అట్లే ధర్మము నాచరించుచుండగా అర్థములుకూడ పుట్టుచుండును.

అవ. కొందరు ధర్మమును చేయనిచో పాపము సంభవించునని ధర్మముకొరకే చేయుదురు. దానివలన జ్ఞానము కాని స్వర్గమునుగాని అపే క్షింపరు. అట్టివారినిగూర్చి చెప్పుచున్నారు-

తస్య సమ్యక్ సమాచార మాహు ర్వేదవిదో జనాః,
నైనం మన్యేత భూయిష్ఠం బాహ్యమాభ్యంతరం జనమ్. 29

ప్ర.అ. తస్య - ఆధర్మమును; సమాచారమ్-చక్కగా అచరించుటను; వేదవిదః - వేదము చదివిన; జనాః - జనులు; సమ్యక్ - మంచిది - అని; ఆహుః - చెప్పుదురు. ఏనమ్ - ఈః; బాహ్యమ్-బహిర్ముఖుడైన; ఆభ్యంతరమ్-వేదము చెప్పినదాని నాచరించుటవలన అంతర్ముఖుడును ఐన; జనమ్-జనుని; భూయిష్ఠమ్ - మిక్కిలి యెక్కువగా; న మన్యేత - మన్నింపరాదు.

తా. వేదము నెరిగిన జనులు (కొందరు) ఆ ధర్మము నాచరించుటయే గొప్పపని యందురు. అట్లు బహిర్ముఖముగా, అంతర్ముఖముగా నున్నవానిని పెద్దగా మన్నింపనక్కరలేదు.

వ్యా. వేదవిదులగు జను లనగా వేదమునందు కేవలము అభిమానము కల వారు. వారు అంతకంటె ఎక్కువగా ఐహికమో, ఆముష్మికమో అయిన ఫల మును కోరరు. వేదము చెప్పినది కావున చేయుచున్నా మందురు. ఏనం జనమ్-ఇట్టి జనమును - ఇట్టి జనులను - అని తాత్పర్యము. భూయిష్ఠమ్, న, మన్యేత-గొప్పగా మన్నింపనక్కరలేదు. కొంత మన్నింపవచ్చునని భావము. వీరు ఆత్మ యందు వర్ణ, ఆశ్రమ,వయో, అవస్థాదులను అభిమానింతురు గనుక బహిర్విషయ ప్రవృత్తికలవారు అను నర్థమున బాహ్యులు; వేదము ననుసరించుచున్నారు. వాంఛలు లేకున్నవారు కనుక అభ్యంతరులు. అకామహతుడైన శ్రోత్రియునను ఆనందలబ్ధి తక్కినవారికంటె అధికము అని ఆనందవల్లి చెప్పుచున్నది. ఆ తార తమ్యము నిట నిరూపించిరి.

అవ. ఇట్లు పై మూడుశ్లోకములలో క్రమముగా యోగుల ధర్మము ఉత్తమ మనియు, ఆత్మజ్ఞానము పొందగోరువారి ధర్మము మధ్యమమనియు, నిష్కామ

ముగా వర్ణాశ్రమధర్మములను పాటించువారిది అధమమనియు చెప్పిరి. ఇటుపై అహింస ప్రధానముగా గల యోగిధర్మములను చెప్పుచున్నారు.

యత్ర మన్యేత భూయిష్ఠం ప్రావృషీవ తృణోలపమ్,
అన్నం పానం బ్రాహ్మణస్య తజ్జీవే న్నానుసంజ్వరేత్. 30

ప్ర.అ. ప్రావృషి - వర్షాకాలమందు; తృణోలపమ్ ఇవ - గడ్డి అధికముగా నుండునట్లు; యత్ర - ఏ యింటియందు; బ్రాహ్మణస్య - బ్రహ్మమునందు నిష్ఠ గల సన్న్యాసికి; అన్నమ్ - భోజనము, పానమ్ - త్రాగునీరు; భూయిష్ఠమ్ - మిక్కిలి యెక్కువ అని; మన్యేత - తోచునో; తత్ - ఆ యింటిని (చేరి) జీవేత్ - బ్రదుకవలయును; న, అనుసంజ్వరేత్ - ఆకలితో తన్ను తాను హింసించుకొనరాదు.

తా. బ్రహ్మజ్ఞాని వర్షర్తువున గడ్డిపరకలు బాగుగా దొరకువిధమున నెవనియింట అన్నపానములు సమృద్ధిగా లభించు నని భావించునో ఆ యింట బ్రదుకవలయును. క్షుద్బాధతో ఆత్మను పీడించుకొనరాదు.

వ్యా. బ్రాహ్మణస్య - బ్రహ్మజ్ఞానసంపన్నునకు; తృణోలపమ్ - తృణము లనగా చిన్నగడ్డిపరకలు, ఉలపము లనగా దుబ్బులు దుబ్బులుగా పెరిగిన గడ్డి, జీవేత్ - ప్రాణయాత్ర సాగింపవలయును. అన్నపానములు సమృద్ధిగా కలవని నమ్మినచోట బ్రదుకు సాగింపవలయును. తనకే తిండిలేని గృహస్థుని బాధింపరాదని తాత్పర్యము. న అనుసంజ్వరేత్ - ఆకలిబాధతో ఆత్మను పీడింపరాదని భావము.

యత్రాకథయమానస్య ప్రయచ్ఛ త్యశివం భయమ్,
అతిరిక్త మివాకుర్వన్ స శ్రేయా న్నేతరో జనః. 31

ప్ర.అ. అశివమ్ - అశుభమైన; భయమ్ - భయమును; ప్రయచ్ఛతి - ఇచ్చునట్టి, యత్ర అపి - ఏదేశమునందైనను, అకథయమానస్య - తన్నుగూర్చి గొప్పలు చెప్పకొనని; అతిరిక్తమ్, ఇవ - తన్ను అందరికంటె గొప్పవాడుగా; అకుర్వన్ - చేయని, సః - ఆ జనుడు, శ్రేయాన్ - గొప్పవాడు; ఇతరః - అట్లుకాని యితరుడు, న - గొప్పవాడు కాడు.

తా. బ్రహ్మవేత్త తాను నివసించు దేశము అమంగళమైనను, భయము గొలుపునదైనను అందు తన్నుగూర్చి గొప్పలు చెప్పుకొనడు. అందరికంటె

గొప్పవాడయ్యు ఆ గొప్పతనమును వెలువరింపడు. అట్టివాడే శ్రేష్ఠుడు. ఇతరుడు కాడు.

వ్యా. అకథయమానస్య-తన మాహాత్మ్యమును చెప్పుకొనక, అశివమ్ - అమంగళము, భయమ్ - భయమును, ప్రయచ్ఛతి - ఇచ్చునట్టి దేశమున - ఉన్నప్పటికి.

తనకు సామర్థ్యమున్నను అచటనున్న జనులలో, అతిరిక్తమివ - అధికుని వలె, అకుర్వన్ - చేయక, తన ఉత్కర్షను ప్రకటింపక అని తాత్పర్యము.

పరపీడనమును మానమును మానవలయునని ఈరెండు శ్లోకముల భావము.

అవ. ఇట్టివాడు ఎట్టివాని యన్నము తినవలయునో చెప్పుచున్నారు-

యో వా కథయమానస్య హ్యాత్మానం నానుసజ్జ్వరేత్,
బ్రహ్మస్వం నోపభుఞ్జీత తదన్నం సంమతం సతామ్. 32

ప్ర.అ. యః - ఎవడు; ఆత్మానమ్ - తన్నుగూర్చి; కథయమానస్య - చెప్పుకొనువానియెడ, న, అనుసంజ్వరేత్ - మనస్తాపము చెందడో; బ్రహ్మస్వమ్ - బ్రహ్మస్వమును; న, ఉపభుఞ్జీత - భుజింపడో; తదన్నమ్ - అట్టివాడు పెట్టెడు అన్నము; సతామ్ - సత్పురుషులకు; సంమతమ్ - ఇష్టము.

తా. గృహస్థుడు గొప్పలు చెప్పుకొనువాని విషయమున మనస్తాపము చెందరాదు. వండిన యన్నమును మొదట యతులకు బ్రహ్మచారులకు నివేదింప వలయును. అట్టి యన్నమును బ్రహ్మస్వ మందురు. బ్రహ్మస్వము కాని యన్నమును తినరాదు. అట్టి గృహస్థుడు పెట్టు నన్నమే సత్పురుషులు భుజింపవలయును.

వ్యా. ఆత్మానం, కథయమానస్య - తన గొప్పను చెప్పుకొనువాని విషయమున; న, అనుసంజ్వరేత్ - సంతాపము చెందరాదు. ఇతరుల ఉన్నతిని గాంచి మనస్తాపము చెందరాదని తాత్పర్యము.

"యతిశ్చ బ్రహ్మచారీ చ పక్వాన్నస్వామినా వుభౌ" యతియు, బ్రహ్మచారియు వండిన యన్నమునకు అధికారులు - అని స్మృతి. అట్లు యతి మొదలగువారికి పెట్టక తినువాడు బ్రహ్మస్వమును భుజించువా డగును. అది గృహస్థ ధర్మము కాదు.

అసూయ లేనివాడు, శ్రద్ధ కలవాడు పెట్టు భోజనమే మోక్షధర్మమున ప్రవర్తించువారికి తగినదని భావము.

యథాస్వం వాన్తమశ్నాతి శ్వా వై నిత్య మభూతయే,
ఏవం తే వాన్త మశ్నన్తి స్వవీర్య స్యోప సేవనాత్. 33

ప్ర.అ. శ్వా - కుక్క; నిత్యమ్ - ప్రతిదినము; అభూతయే - కడుపు కక్కుర్తితో; స్వమ్ - తనదైన; వాన్తమ్ - కక్కిన కూటిని; యథా - ఎట్లు; అశ్నాతి - తినునో; ఏవమ్ - ఇట్లే; తే - ఆ సంన్యాసులు; స్వవీర్యస్య - తమ శక్తిసామర్థ్యములను; ఉపసేవనాత్ - సేవించుటవలన; వాన్తమ్ - క్రక్కిన కూటిని; అశ్నన్తి - తినుచున్నారు.

తా. కుక్క కడుపుకక్కుర్తికై తాను క్రక్కిన కూటినే తినును. తన పాండిత్యమును ప్రదర్శించి బ్రదుకగోరు సంన్యాసులు అట్లు క్రక్కినకూడు తినువా రగుదురు.

వ్యా. స్వవీర్యస్య - తన పాండిత్యాదిశక్తిపై, ఉపసేవనాత్ - ఆధార పడి బ్రదుకుటవలన; పాండిత్యాదికమును ప్రదర్శించి భిక్షను గోరు యతి క్రక్కినకూడు తిన్నవా డగునని భావము.

నిత్య మజ్ఞాతచర్యా మే ఇతి మన్యేత బ్రాహ్మణః,
జ్ఞాతీనాం తు వసన్ మధ్యే తం విదు ర్బ్రాహ్మణం బుధాః. 34

ప్ర.అ. యః - ఏ; బ్రాహ్మణః - బ్రహ్మవేత్త; జ్ఞాతీనామ్ - జ్ఞాతుల; మధ్యే - నడుమ; వసన్, అపి - నివసించుచు కూడ; నిత్యమ్ - ప్రతిదినము; మే - నాకు; అజ్ఞాతచర్యాః - తెలియని చర్య కలవారు; సన్తు - అగుదురు గాక; ఇతి - అని; మన్యేత - తలచునో; తమ్ - అట్టివానిని; బుధాః - పండితులు; బ్రాహ్మణమ్ - నిజమైన బ్రహ్మజ్ఞానము కలవానినిగా; విదుః - ఎరుగుదురు.

తా. సంన్యాసి జ్ఞాతులనడుమ నున్నను వారికి తన యోగబుద్ధి తెలియ జెప్పుకొనుటకు ప్రయత్నింపరాదు. అప్పుడే అతనిని పండితులు బ్రహ్మవేత్తగా భావింతురు.

వ్యా. అజ్ఞాత చర్యాః - ఎఱుగని చర్యలు కలవారు. దగ్గర బంధువులు కూడ తన యోగబుద్ధిని తెలిసికొనరాదని సంన్యాసి భావింపవలయును. తన తేజము మిక్కిలి గూఢముగా నుండవలయు నని తాత్పర్యము. బుధులనగా ఇచట సంన్యాసిలక్షణములను చక్కగా నెరిగినవారు. బ్రాహ్మణమ్ - బ్రహ్మ జ్ఞానము నిండుగా గలవానినిగా;

కో హ్యనన్తర మాత్మానం బ్రాహ్మణో హన్తుమర్హతి,
నిర్లిఙ్గ మచలం శుద్ధం సర్వద్వైతవివర్జితమ్. 35

ప్ర.అ. అనన్తరమ్ - అడ్డులేని; నిర్లిఙ్గమ్ - అనుమానాది ప్రమాణము లకు దొరకని; అచలమ్ - అంతట వ్యాపించి స్థిరముగా నున్న; శుద్ధమ్ - అంటుసొంటులు లేని; సర్వ, ద్వైత, వివర్జితమ్ - సజాతీయ, విజాతీయ, స్వగత భేదములు లేని; ఆత్మానమ్ - పరమాత్మని; (పైని చెప్పిన ప్రవర్తన లేనిచో); కః - ఏ; బ్రాహ్మణః-బ్రాహ్మణుడు; హన్తుమ్-పొందుటకు; అర్హతి- తగును?

తా. పైని వివరించిన సదాచారసంపత్తి లేనిచో ఏ బ్రాహ్మణుడును ఏ విధమైన అడ్డు లేక అందువాడు, సర్వమును వ్యాపించియున్నవాడు, ఏ అంటు సొంటులు లేనివాడు, సజాతీయాదిభేదములు లేనివాడు అగు పరమాత్మను అందు కొనజాలడు.

వ్యా : అనంతరమ్ - శరీరము మొదలగు ఉపాధులు కల్పించిన అడ్డు గోడలు లేనివానిని; నిర్లిఙ్గమ్ - లింగమనగా ప్రమాణము - అనుమానము మొద లగు ప్రమాణముల కందని వానిని; అచలమ్ - చలించుచోటు లేని వానిని; - అంతట నిండిన వాడని భావము; శుద్ధమ్ - సంగరహితుని; సర్వద్వైత వివర్జి తమ్ - సృష్టియందు ఎల్లవారికి వ్యవహారదృష్టితో మూడుభేదము లుండును. ఒక నరునకు మరియొక నరునితో నుండు భేదము సజాతీయము. నరునకు పశు వుతో ఉండు భేదము విజాతీయము. నరునకు బాల్యయౌవనాదులచేత ఏర్పడునది స్వగతము - ఇట్టి భేదము లేవియు లేనివానిని; హన్తుమ్-గన్తుమ్-పొందుటకు వెనుక శ్లోకములలో చెప్పిన సదాచారసంపత్తి లేనివాడు ఆత్మ నందుకొన జాలడని ఫలితార్థము.

తస్మాద్ధి క్షత్రియస్యాపి బ్రహ్మావసతి పశ్యతి. 36

ప్ర. అ. తస్మాత్ - అట్టి వ్రతచర్యలేని బ్రాహ్మణునికంటె; క్షత్రియస్య అపి - క్షత్రియునైనను; బ్రహ్మ - బ్రహ్మము; ఆవసతి - తన వెలుగు నింపి నిలిచియుండును; పశ్యతి - (క్షత్రియునైనను) దర్శించును.

తా. ఇట్టి వ్రతచర్యలేని బ్రాహ్మణునికంటె, ఉత్తమ క్షత్రియుడు కూడ బ్రహ్మభావమును పొందుట కర్హుడగును. ఆ వ్రతచర్యచేత క్షత్రియుడు మొదలగు నితర జాతులవారును పరబ్రహ్మమును దర్శింపగలరు.

అవ. ఆత్మ నెరుగనిచో కలుగు అనర్థమును చెప్పుచున్నారు.

యోఽన్యథా సన్త మాత్మాన మన్యథా ప్రతిపద్యతే,
కిం తేన న కృతం పాపం చౌరే ణాత్మాపహారిణా. 37

ప్ర. అ. యః-ఎవడు; అన్యథా - తన దేహాదులకంటె వేరుగా నున్న, సన్తమ్-సత్పదార్థమగు; ఆత్మానమ్-ఆత్మను; అన్యథా-దానిస్వరూపముకంటె వేరయిన దేహాదులుగా; ప్రతిపద్యతే-ఎరుగునో; తేన-అట్టి; ఆత్మ-అపహారిణా-ఆత్మను దొంగిలించు, చౌరేణ - దొంగచేత; కిమ్, పాపమ్ - ఏ పాపము; న కృతమ్-చేయబడలేదు.

తా. దేహము మొదలగునవి కాని శుద్ధమగు ఆత్మను దేహాదులుగా తలచువాడు ఆత్మను అపహరించెడు దొంగ యగును. అట్టివాడు అన్నిపాపములు చేసినవాడే యగును.

వ్యా. అన్యథా - ఆత్మవలె తోచు దేహాదులకంటె వేరయినదానిని; అన్యథా-కర్త, భోక్త అను విధముగా ప్రతిపద్యతే-ఎరుగునో-వాడు తనదె కాని సొమ్ము నపేక్షించు దొంగవలె సర్వపాపములు చేసినవా డగునని ఫలితార్థము.

అవ. ఆత్మతత్త్వము నెరుగు ఉపాయమును బోధించుచున్నారు.

అశ్రాన్తః స్యా దనాదాతా సంమతో నిరుపద్రవః,
శిష్టో న శిష్టవత్స స్యా ద్బ్రాహ్మణో బ్రహ్మవిత్కవిః. 38

ప్ర. అ. అశ్రాన్తః-అలసట యెఱుగనివాడు; అనాదాతా-ఇతరులనుండి యేమియు పరిగ్రహింపనివాడు; సంమతః-అందరకు నిష్టుడు; నిరుపద్రవః-ఏ కష్టములు లేనివాడు; శిష్టః-చక్కని నడవడి కలవాడు; న శిష్టవత్-తన

చక్కని నడవడిని వెల్లడింపనివాడు; కవిః - ఇంద్రియముల కందనివానిని దర్శింపగలవాడు; అగు, బ్రాహ్మణః-బ్రహ్మజ్ఞానసంపన్నుడు; బ్రహ్మవిత్-బ్రహ్మము నెరిగినవాడు; స్యాత్-అగును.

తా. బ్రహ్మము నెరుగగోరువాడు అలసత లేక ప్రయత్నింపవలయును. దానాదులు గ్రహింపరాదు. అందరకు ఇష్టుడు కావలయును. ఆటుపోటులు లేనివాడు కావలయును. మంచి నడవడి కలవాడయ్యు దానిని ప్రకటింపరాదు. యోగమార్గమున ఇంద్రియముల కందని మహావిషయమును గ్రహింపగలవాడు కావలయును.

వ్యా. అశ్రాంతు డనగా శ్రమములేనివాడు, ఏలయన అనాదాత కనుక. ఇతరు డిచ్చినదానిని పుచ్చుకొన్నచో అది భరించుటకును, తీర్చుటకును శ్రమపడవలసివచ్చును. ఎవ్వరినుండి ఏమియు గ్రహింపడు కనుక మంచివారికి ఇష్టుడగును. సంసారలంపటమున చిక్కుకొన్నవానికివలె అట్టివానికి ఏ ఉపద్రవములు కలుగవు, బాధింపవు. శిష్టవత్, న, స్యాత్ - అనగా తన శిష్టతను ప్రకటించుకొనడని తాత్పర్యము. ప్రకటించుకొనుట అహంకారలక్షణము. కవిః - క్రాంతదర్శి - ఇంద్రియములకు కానరాని ఆత్మపదార్థమును దర్శింపగలవాడు.

అనాఢ్యా మానుషే విత్తే ఆఢ్యా దైవే తథా క్రతౌ,
తే దుర్ధర్షా దుష్ప్రకమ్ప్యా స్తాన్ విద్యాద్ బ్రహ్మణ స్తనుమ్. 39

ప్ర.అ. మానుషే - మనుష్యసంబంధమైన, విత్తే - ధన విషయమున, అనాఢ్యాః - దరిద్రులు, దైవే - దేవసంబంధమైన, విత్తే - ధనమునందును, తథా-అట్లే, క్రతౌ - ఉపాసనయందును, ఆఢ్యాః - భాగ్యవంతులు, అగు, తే-ఆ సంన్యాసులు, దుర్ధర్షాః - ఎవరికిని లొంగనివారు, దుష్ప్రకమ్ప్యాః- ఎవరికిని కదలింపరానివారు. తాన్ - అట్టివారిని, బ్రహ్మణః - బ్రహ్మముయొక్క, తనుమ్ - స్వరూపముగా, విద్యాత్ తెలియదగును.

తా. బ్రహ్మవేత్తలు మనుష్యసంబంధమగు ధనవిషయమున దరిద్రులు. దేవవిషయమున, ఉపాసనావిషయమునను ధనవంతులు. వారు ఎవ్వరికిని లొంగరు. ఎవ్వరు వారిని కదలింపనుజాలరు. వారిని బ్రహ్మస్వరూపముగా ఎరుగదగును.

వ్యా. మానుషే విత్తే - కంటికి కనపడు ధనము, దారలు, వస్తువాహనములు అను విషయమునందు, అనాఢ్యాః - దరిద్రులు. అట్టివి వారికడ నుండవని తాత్పర్యము. దైవే - చెవి గ్రహించెడు పరలోకసంబంధమైన ధర్మాది విషయమున, ఆఢ్యాః - మహాసంపన్నులు. ఆ ధర్మమంతయు వారికడనే నిలిచి యుండునని తాత్పర్యము. తథా - అట్లే, క్రతౌ - ఇచట క్రతువనగా ఈశ్వరోపాసనము. "స క్రతుం కుర్వీత" మున్నగు వాక్యములందు క్రతుశబ్దము ఉపాసన యను నర్థమున ప్రయోగించుట కానవచ్చుచున్నది. వైరాగ్యపూర్వకమగు కర్మోపాసనము చేయుటయందును - భాగ్యవంతులని భావము. దుర్ధర్షులు, దుష్ప్రకంప్యులు అనగా ఎచ్చట, ఎవ్వరివలన, ఎప్పుడు ఏ భయము లేనివారని భావము. తనువనగా స్వరూపము. అట్టి బ్రహ్మవేత్తలు బ్రహ్మమే అగుదురని ఫలితార్థము.

అవ. అన్నిక్రతువులకంటె బ్రహ్మజ్ఞానమే మిన్న యని ప్రతిపాదించుచున్నారు -

సర్వాన్ స్విష్టకృతో దేవాన్ విద్యాద్య ఇహ కశ్చన,
న సమానో బ్రాహ్మణస్య తస్మిన్ ప్రయతతే స్వయమ్. 40

ప్ర. అ. యః కశ్చన - ఎవ్వడేని; స్విష్టకృతః-స్విష్టకృత్తులను; దేవాన్-దేవులను; సర్వాన్ - అందరిని; విద్యాత్ - తెలిసికొన్నను; సః - అతడు; బ్రాహ్మణస్య - బ్రహ్మవేత్తకు; సమానః - సాటి; న - కాడు. ఏలయన; తస్మిన్ - ఆ స్విష్టవిషయమున; స్వయమ్ - తానై; ప్రయతతే - ప్రయత్నించుచున్నాడు.

తా. స్విష్టకృత్తులగు దేవత లందరిని ప్రత్యక్షము చేసికొన్నవాడుకూడ బ్రహ్మవేత్తకు సాటి రాడు. ఏలయన స్విష్టమునకై అతడు ప్రయత్నించుచున్నాడు గదా!

వ్యా. స్విష్టకృత్తు లనగా యజ్ఞము చేయువానికి మిక్కిలి ప్రీతికరములగు దివ్యములగు స్త్రీలను, అన్నపానాదులను కూర్చువారు - దేవతలు. తాన్, సర్వాన్ - అట్టివారి నందరిని; యః కశ్చన - ఎవ్వడైన నొకడు; విద్యాత్ - ప్రత్యక్షము చేసికొన్నను-అట్టివాడు బ్రాహ్మణునకు - బ్రహ్మవేత్తకు-సమానుడు కాజాలడు. కారణమును వివరించుచున్నారు. ఏలయన అట్టిమనుజుడు స్విష్టము

కొఱకు ప్రయత్నించుచున్నాడు గదా! తాత్పర్యమిది. స్వేష్టము అనునది క్రియతో సాధింపబడునది కావున అనిత్యము. ఇక బ్రహ్మమన్ననో స్వతఃసిద్ధముగనే తోచునది. కావున ఆ జ్ఞానఫలమైన మోక్షముకూడ స్వతఃసిద్ధము కావున నిత్యము. నిత్యముకంటె అనిత్యము హీనమే కదా! కావున బ్రహ్మజ్ఞానముతో యజ్ఞయాగాది ఫలము సాటి కాజాలదు.

యమప్రయతమానం తు మానయన్తి స మానితః,
న మాన్యమానో మన్యేత న మాన్య మభిసఞ్జ్వరేత్. 41

ప్ర. అ. అప్రయతమానమ్-ఏప్రయత్నమును చేయని, యమ్-ఎవనిని, దేవతలు మొదలగువారు, మానయన్తి - మన్నింతురో, సః - అతడు, మానితః - నిజముగా మన్ననపొందినవా డగును. మాన్యమానః - మన్నింపబడుచు, మాన్యమ్ - మాన్యునిగా న మన్యేత - భావింపరాదు, న, అభి సంజ్వరేత్ - అవమానము కలిగినపుడు మనస్తాపము పొందరాదు.

తా. ఏ ప్రయత్నము లేక దేవాదుల మన్ననను పొందువాడు బ్రహ్మవేత్త. అతడే నిజముగా మన్నన నందినవాడు. ఆతడు మన్ననలందుచు మాన్యుడనని భావింపడు. అవమానము పొంది కుందడు.

వ్యా. దేవాదుల మన్ననల నందినవా డనగా బ్రహ్మతత్త్వము నెరిగి బ్రహ్మమైనవాడని తాత్పర్యము. ప్రయత్నపడి యజ్ఞాదికర్మములం నాచరించు వానిని దేవతలు మన్నింతు రన్నచో అతడు పశువే యగును. అనగా అట్లు మన్ననపొందుట నిష్ఫలమని భావము.

"అథ యోఽన్యాం దేవతా ముపాస్తేఽన్యోఽసా వన్యోఽహమితి న స వేద యథా పశురేవ స దేవానామ్" అని శ్రుతి. ఇది వేరు, నేను వేరు అను తలపుతో ఇతరదేవతను ఉపాసించువానికి ఏమియు తెలియదు. వాడు దేవతలకు పశువే యగును. ఇచట ఉపాసన యనగా యజ్ఞాదులతో దేవతలను తృప్తిపరచుట.

ఆ కారణమున బ్రహ్మజ్ఞాని తన్ను ఇతరులు మన్నించుచున్నను మాన్యుడుగా భావింపడు. అవమానము చేసినను మనసున దుఃఖపడడు. రాగద్వేషముల కతీతుడై యుండునని తాత్పర్యము.

అవ. లోకము స్వభావముచేతనే తన్ను గౌరవించును కాని నాయందు మానయోగ్యత లేదు - అను భావముతో జ్ఞాని గర్వమంద దని చెప్పుచున్నారు-

లోకః స్వభావవృత్తిర్హి నిమేషోన్మేషవత్సదా,
విద్వాంసో మానయన్తీహ ఇతి మన్యేత మానితః. 42

ప్ర.అ. లోకః - లోకము, సదా - ఎల్లవేళల, నిమేష, ఉన్మేషవత్ - ఱెప్పమూతపడుట, తెఱచుకొనుటవంటిది. స్వభావవృత్తిః - స్వభావముతో ప్రవర్తించునది, హి - కదా. విద్వాంసః - అన్నియు నెఱిగినవారు, ఇహ - ఈ విషయమున, మానయన్తి - మన్నన చేయుదురు, ఇతి - అని, మానితః - మన్ననపొందిన జ్ఞాని, మన్యేత - భావించును.

తా. బ్రహ్మజ్ఞాని లోకము తన్ను మన్నించినప్పుడు అది విద్వాంసుల స్వభావము, కన్ను మూతపడుట, తెరచుకొనుటవలె లోకము స్వభావప్రవృత్తి కలది అని మాత్రమే తలచును.

వ్యా. ఆ మన్ననకు పొంగిపోవడు, అహంకరింపడు అని తాత్పర్యము. దీనినిబట్టి అవమానమునకు క్రుంగడనియు గుర్తింపవలయును.

అవ. ఎవరైన మన్నింపనిచో అట్టివానిని ఉపేక్షించునేకాని దండింప డనియు చెప్పుచున్నారు-

అధర్మనిపుణా మూఢా లోకే మాయావిశారదాః,
న మాన్యం మానయిష్యన్తి మాన్యానామవమానినః. 43

ప్ర.అ. అధర్మనిపుణాః - అధర్మమున ఆరితేరినవారు; లోకే - లోకమున, మాయావిశారదాః - మోసమున గొప్పప్రజ్ఞ కలవారు, అగు, మూఢాః - మూఢులు, మాన్యమ్ - మన్నింపదగినవానిని, న మానయిష్యన్తి-మన్నింపరు, మాన్యానామ్ - మాన్యులను, అవమానినః - అవమానించువారును అగుదురు.

తా. మూర్ఖులు అధర్మమునందును, వంచనయందును ఆరితేరినవారు. వారు మాన్యులను మన్నింపరు. మరియు అవమానింతురు.

వ్యా. జ్ఞాని యిట్టివారిని, అది వారి స్వభావమని తలచి, ఉపేక్షించునే కాని బాధపడడు. బాధపెట్టడు- అని భావము.

న వై మానం చ మౌనం చ సహితౌ వసతః సదా,
అయం హి లోకో మానస్య అసౌ మౌనస్య తద్విదుః. 44

ప్ర.అ. మానమ్, చ - అహంకారమును; మౌనమ్, చ - మౌనమును - మునిచర్యయును; సదా - ఎన్నడును; సహితౌ - కలసి; న వసతః - ఉండవు: హి - ఏలయన; మానస్య - మానమునకు - అహంకారమునకు; అయం లోకః - ఈ లోకము; మౌనస్య - మౌనమునకు; అసౌ - ఆ లోకము - పరలోకము; తద్ - ఆ విషయమును; బుధులు; విదుః - ఎరుగుదురు.

తా. అహంకారము మునిచర్యయు సహజీవనము చేయవు. అహంకరించు వానికి ఇదియే లోకము. మౌనమునకు పరలోకము అని బుధు లెరుగుదురు.

వ్యా. 'మానమ్' అనుచోట నపుంసకలింగము ఆర్షము. మౌన మనగా మునిచర్య - యోగుల ప్రవర్తన. మానము కోరువారికి పరలోకము, మౌనము కోరువారికి ఈలోకము లభింపవని తాత్పర్యము

శ్రీః సుఖస్యేహ సంవాసః సా చాపి పరిపన్థినీ,
బ్రాహ్మీ సుదుర్లభా శ్రీర్హి ప్రజ్ఞాహీనేన క్షత్రియ. 45

ప్ర. అ. క్షత్రియ-ఓయి క్షత్రియుడా! శ్రీః - సంపద; ఇహ - ఇచట; సుఖస్య - అహంకారరూపమైన సుఖమునకు; సంవాసః - నెలవు; సా,చ, అపి - అదియును; పరిపన్థినీ - పరలోకమును కొట్టివేయు దొంగవంటిది; బ్రాహ్మీ - బ్రహ్మసంబంధమైన; శ్రీః, హి - సంపద యన్నచో; ప్రజ్ఞాహీనేన - ప్రజ్ఞ లేనివానికి; సుదుర్లభా - లభించునది కాదు.

తా. రాజా! లోకమున సంపద సుఖమునకు నెలవు. కాని అది పరలోకమును చూడనీయక కన్నుగప్పుచున్నది. వేదసంబంధమగు సంపదయన్ననో ప్రజ్ఞలేనివానికి లభింపదు.

వ్యా. శ్రీః - ధనము, చుట్టపక్కములు, అధికారము మొదలగు రూపమున నుండు సంపద; సుఖస్య - మానరూపమగు సుఖమునకు; సంవాసః - నివాసస్థానము; సా - అది; పరిపన్థినీ - దొంగవంటిది; పరలోకమును నశింపజేయునది. యోగులకు బొత్తిగా పనికిరానిదని భావము; బ్రాహ్మీ - బ్రాహ్మణునకు యోగ్యమైన; శ్రీః - సంపద - ఋగ్యజుస్సామరూపమైనది. "ఋచస్సామాని యజూంషి సా హి శ్రీ రమృతా సతామ్" - అని శ్రుతి. ఋక్కులు, సామములు, యజుస్సులు అనునవి సత్పురుషులకు అమృతమైన సంపద. ప్రజ్ఞ లేనివాడు ఋగాదుల రహస్యమును పొందజాలడని భావము.

ద్వారాణి తస్యేహ వదన్తి సన్తో
బహుప్రకారాణి దురాధరాణి,
సత్యార్జవే హ్రీర్దమశౌచవిద్యా
యథా న మోహప్రతిబోధనాని. 46

ప్ర.అ. తస్య-ఆ బ్రహ్మసంబంధమైన సుఖమునకు, ద్వారాణి - మార్గములు - పొందు సాధనములు, దురాధరాణి - మిక్కిలి మెలకువతో రక్షింపవగినవి; బహుప్రకారాణి - అనేకవిధములైనవి, కలవు. అవి, సత్య, ఆర్జవే - సత్యము, ఋజుప్రవర్తనము, హ్రీః - పాపుపనులకు సిగ్గుపడుట; దమ, శౌచ, విద్యాః - దమః - ఇంద్రియనిగ్రహము, శౌచమ్ - లోపల, వెలుపల పరిశుద్ధత, విద్యా - వేదశాస్త్రములను పొందుట. యథా - ఎట్లన్నచో, ఇవి, మోహప్రతిబోధనాని - మోహమును మేల్కొల్పునవి, న - కావు.

తా. ఆ బ్రహ్మసంబంధమగు సుఖమునకు సాధనములు పెక్కువిధములుగా గలవు. వానిని మానవుడు మిక్కిలి మెలకువతో రక్షించుకొనవలయును. అవి సత్యము, వంచన లేకుండుట, చెడుపనులకు సిగ్గుపడుట, ఇంద్రియనిగ్రహము, బాహ్యాభ్యంతరశౌచము, వేదశాస్త్రములను సంపాదించుట అనునవి. ఇవి యున్నచో అనాదివాసనవలన వచ్చెడు అజ్ఞానము కూడ ఏమియు చేయజాలదు.

వ్యా. తస్య - దానికి - బ్రహ్మసంబంధమైన సుఖమునకు, ద్వారాణి - మార్గములు - ప్రాప్తిసాధనములు, దురాధరాణి - సుఖముగా రక్షింపజాలనివి. కష్టపడి రక్షించుకొనదగినవని తాత్పర్యము. సత్యమ్ - యథార్థభాషణము, ఆర్జవమ్ - కుటిలత, వంచన లేకుండుట, హ్రీః - లోకనిందకు భయపడుట, దమః - ఇంద్రియముల నడుపుచేయుట, శౌచమ్ - మట్టి, నీరు మొదలగువానితో నగునది బాహ్యశౌచము, మనఃశుద్ధి అంతరశౌచము, విద్యా - వేదశాస్త్రములను పొందుట, మోహప్రతిబోధనాని - మోహమును - అజ్ఞానమును మేల్కొలుప నీయనివి. ఇవి యున్నచో అనాదివాసనారూపమున నేర్పడు అజ్ఞానముకూడ ఏ ప్రమాదమును కలిగింపజాలదని తాత్పర్యము.

ఇతి శ్రీమహాభారతే ఉద్యోగపర్వణి సనత్సుజాతపర్వణి
ద్విచత్వారింశోఽధ్యాయః.

ఇది శ్రీమహాభారతము ఉద్యోగపర్వమున సనత్సుజాతపర్వమున
నలుబదిరెండవ అధ్యాయము.

—(౦)—

# త్రిచత్వారింశోఽధ్యాయః - నలుబదిమూడవ అధ్యాయము

**మౌనతపస్త్యాగాప్రమాదాదిగుణానాం మదాదిదోషాణాం చ నిరూపణమ్-
మౌనము, తపము, త్యాగము, అప్రమాదము మొదలగు గుణములను
మదాదిదోషములను నిరూపించుట.**

అవ. పూర్వాధ్యాయముచివర మౌనము, బ్రహ్మసంపద, సత్యాది షట్కము మోహ మనెడు మృత్యువునకు ప్రతిబంధకము అని చెప్పిరి. వానినే ప్రశ్నపూర్వకముగా వివరించుటకు ఈ అధ్యాయమును ప్రారంభించుచున్నారు.

**ధృతరాష్ట్ర ఉవాచ - ధృతరాష్ట్రు డిట్లు పలికెను.**

కస్యైష మౌనః కతరన్ను మౌనం
ప్రబ్రూహి విద్వన్నిహ మౌనభావమ్,
మౌనేన విద్వానుత యాతి మౌనం
కథం మునే మౌన మిహాచరన్తి. 1

ప్ర. అ. విద్వన్-పండితుడా!, ఏషః - ఈ, మౌనః-మౌనము, కస్య-ఏ ప్రయోజనముకొరకు, మౌనమ్-మౌనము, కతరత్, ను-ఎట్టిది?, మౌనభావమ్-మౌనభావమునుగూర్చి, ప్రబ్రూహి-- గట్టిగా చెప్పుము. విద్వాన్-విద్వాంసుడు, మౌనేన - మౌనముచేత, మౌనమ్-నిర్వికల్పమైన పదమును, యాతి, ఉత - పొందునా? మునే - ఓ మునీ, ఇహ-ఇచట, మౌనమ్ - మౌనమును, కథం - ఎట్లు, ఆచరన్తి - ఆచరింతురు.

తా. అన్నియు నెరిగిన ఓ మునీ! ఈమౌనమువలన నగు ప్రయోజన మేమి? మౌన మనగా మాటాడకుండుట అనియు శ్రవణమననములకు తరువాతి దగు నిదిధ్యాసనమనియు నర్థములు గలవు. ఈ రెంటిలో నేది ? ఆ మౌనము స్వలక్షణ మేమి? ఆ మౌనముచేత మనస్సు ప్రాణము, ఇంద్రియములు అనువాని క్రియలు అణగారునా? మౌనము నాచరించు విధానమేది?

వ్యా. పూర్వాధ్యాయమున ప్రసక్తమైన మౌనమునకు సంబంధించి ధృతరాష్ట్రునకు కొన్నిప్రశ్నలు పుట్టినవి. అడుగుచున్నాడు. 1. మౌనము దేనిని సాధించును? సంన్యాసపూర్వకముగా గ్రహించు మునిధర్మమునకు మౌనమని పేరు. అది దేనిని సాధించునని మొదటి ప్రశ్న.

2. లోకములో మౌనమనగా వాక్కును ప్రసరింపజేయకుండుట అను రూఢి కలదు. "అమౌనం చ మౌనం చ నిర్విద్యాథ బ్రాహ్మణః" అను శ్రుతిలో మౌనశబ్దమునకు శ్రవణమననములకు తరువాతి 'నిదిధ్యాసనము' అను నర్థము చెప్పబడినది. కనుక మాటాడకుండుట, నిదిధ్యాసనము అను రెంటిలో నీవు చెప్పు మౌన మేది? - ఇది రెండవప్రశ్న.

3. ఏలక్షణములతో నున్న దానిని మౌనమందురు. ఇది మూడవప్రశ్న.

4. మౌనముచేత మౌనమును సాధకుడు పొందునా? ఇట - రెండవ మౌన శబ్దమునకు మనస్సు, ప్రాణము, ఇంద్రియములు అనువానిక్రియలు సంపూర్ణముగా అణగుట అని యర్థము. అదియే నిర్వికల్పస్థితి. సాధకుడు దాని నందు కొనునా? అని నాలుగవ ప్రశ్న.

5. మౌనము నాచరించు విధానమేది? అని అయిదవప్రశ్న,

అవ. ఈపై అయిదు ప్రశ్నలకు ఉపాయముగా సమాధానము చెప్పుచున్నారు-

సనత్సుజాత ఉవాచ . సనత్సుజాతు డిట్లు చెప్పెను-

యతో న వేదా మనసా సహైన -
మనుప్రవిశన్తి తతోఽథ మౌనమ్,
యత్రోత్థితో వేదశబ్ద స్తథాఽయం
స తన్మయత్వేన విభాతి రాజన్. 2

ప్ర.అ. రాజన్ - రాజా! యతః - ఏకారణమువలన, వేదాః - వేదములు, మనసా, సహ - మనస్సుతోపాటు, ఏనమ్ - ఈ ప్రత్యగాత్మను; న, అనుప్రవిశన్తి - అనుసరించి ప్రవేశింపవో; తతః - అందువలన, అథ - పిదప, మౌనమ్ - మౌనము.

యత్ర - ఏ అధిష్ఠానమందు, వేదశబ్దః - వేదశబ్దము, తథా - అట్లే, అయమ్ - ఈ లౌకిక శబ్దము; ఉత్థితః-లేచినదో, సః - అట్టి భూతాత్మ, తన్మయత్వేన - శబ్దమయస్వరూపముతో, విభాతి - ప్రకాశించుచున్నది.

తా. రాజా! ఈ వేదములు మనసుతోపాటు ఈ పరబ్రహ్మమును ప్రవేశింపజాలవు. అందువలన దీనిని మౌన మనుచున్నారు. ఈ అధిష్ఠానమునుండియే వేదశబ్దము, లోకశబ్దము పొటమరించినవి. కావున ఆ భూతాత్మ శబ్దమయ స్వరూపముతో ప్రకాశించుచున్నది.

వ్యా. యతః - ఏకారణమువలన, ఏనమ్ - ఈ పరబ్రహ్మమును, మనస్సుతోపాటు వేదములు ప్రవేశింపజాలవో ఆ కారణమున పరబ్రహ్మమునకే మౌనమని పేరు. "యతో వాచో నివర్తన్తే అప్రాప్య మనసా సహ" అని శ్రుతి. వాక్కులు మనస్సుతోపాటు దానిని పొందజాలక మరలుచున్నవి అని అర్థము.

దీనివలన మౌనమువలన ప్రయోజన మేమి? అను ప్రశ్నకు వాక్కులకు మనసునకు అందని స్థితిని పొందుట అని సమాధానము లభించినది. వాక్కు మొదలగు ఇంద్రియవ్యాపారముల నరికట్టుట మనస్సు నరికట్టుటయే మౌనము అని రెండవ ప్రశ్నకు సమాధానము. దానివలన క్రమముగా బాహ్యాభ్యంతర ప్రపంచములు తోపకుండుట జరుగును. అదియే మౌనభావమని మూడవ ప్రశ్నకు సమాధానము. అట్లు తోపకుండుటచేత వాక్కునకు మనసునకు అతీతమైన పదము లభించును అనునది నాలుగవ ప్రశ్నకు సమాధానము. ఇట్లు ఒక వాక్యముచే నాలుగుప్రశ్నలకు గూఢముగా సమాధానము చెప్పబడినది.

ఇక అయిదవ ప్రశ్నకు సమాధానము చెప్పుచున్నారు. అంతట నిండిన బ్రహ్మపదార్థమునుండి వేదశబ్దము, లోకశబ్దమును క్షేత్రమున విత్తనమువలె, సముద్రమున తరంగమువలె పుట్టినవి. కావున ఆ బ్రహ్మము శబ్దమయముగా ప్రకాశించుచున్నది. క్షేత్రము బీజమయముగా, సముద్రము తరంగమయముగా కానవచ్చుట నిట భావింపదగును. దీని నిట్లు భావింపదగును. వేదమనగా వేదసారమగు ఓంకారము. బహ్వృచబ్రాహ్మణ మిట్లు చెప్పుచున్నది: 'భూః' అను శబ్దము ఋగ్వేదమునుండియు, 'భువః' అనునది యజుర్వేదమునుండియు, 'స్వః' అనునవి సామవేదమునుండియు పుట్టినవి. ఇవి శుక్రములు. అనగా తేజోరూపమైనవి. అవి బాగుగా పండి మూడు వర్ణములైనవి. అవియే అకార ఉకార మకారములు. వానిని కలుపగా 'ఓమ్' అయినది. 'ఓమిత్యేతదక్షర మిదం సర్వమ్' - 'ఓమ్' అను నీ అక్షరమే సర్వము అని వేదము ప్రతిపాదించుచున్నది. దీనిమాత్రలగు అకార ఉకార మకారములు క్రమముగా స్థూల సూక్ష్మకారణప్రపంచములకు వాచకములు. అనగా అకారము స్థూలజగత్తును,

ఉకారము సూక్ష్మప్రపంచమును, మకారము కారణప్రపంచమును తెలుపు పదములు. పదమును, దాని యర్థమును ఒకదానితో నొకటి భేదము లేనివి. కావున ఓంకారము పరమాత్మను, పరమాత్మనుండి యేర్పడిన ప్రపంచమును బోధించుశబ్ద మగుచున్నది.

గురూపదేశమునుబట్టి పై మూడు మాత్రలను ముందు ముందు వానిని తరువాతి తరువాతివానిలో ప్రవిలాపనము చేయగా స్థూలజగత్తు సూక్ష్మమున ఆదికారణమున కలసిపోవును. (ప్రవిలాపమనగా లవణోదకన్యాయమున కలసిపోవుట. అనగా ఉప్పుగడ్డను నీళ్ళలో వేయగా ఉప్పురూప ముండదు. ఉప్పదనము మాత్రము తెలియును. ఆ విధముగా రూపము చెడుటను ప్రవిలయ మందురు). 'ఓమ్' అని పలికినపిదప అర్ధమాత్రాకముగా నుండు నిశ్శబ్దమును తురీయ మందురు. కారణప్రపంచము దానిలో లయమగును. "శివ మద్వైతం చతుర్థం మన్యన్తే"-ఆ నాల్గవమాత్ర శివము అద్వైతము అని బ్రహ్మజ్ఞులు తలంతురు-అని శ్రుతి. దీనినిబట్టి ఆ చతుర్థమాత్రలో సర్వద్వైతభావము జారి పోవును. కావున ప్రణవమను శబ్దమయరూపముతో వాక్కునకు మనస్సునకు అందని పదము ప్రకాశించుననియు మౌనము నాచరించు ప్రక్రియ ఇది యనియు నైదవ ప్రశ్నకు సమాధానము.

అవ. పరమాత్మ వేదశబ్దమయుడు. ఓంకారస్వరూపుడు. కావున వేదముద్వారా వాక్కునకు మనస్సునకు అందని పదము ప్రకాశించును. కావున వేదజ్ఞానమువలన "అగ్నిలో బడిన దూదిపింజ కాలిపోయినట్లు వేదజ్ఞానమువలన సర్వపాపములు నశించిపోవు"నని శ్రుతి చెప్పుచున్నది కావున సర్వపాపనాశ నము కూడ కలుగును గదా! అట్టియెడ మౌనహీనునకు కూడ ఋగాదివేదము లభ్యసించుటవలన వాఙ్మనసాతీతపదప్రాప్తి, పాపనాశము అను రెండుఫలములు కలుగునా? అను శంకను ధృతరాష్ట్రుడు వెలువరించుచున్నాడు-

ధృతరాష్ట్ర ఉవాచ - ధృతరాష్ట్రు డిట్లు పలికెను.

ఋచో యజూంషి యో వేద సామవేదం చ వేద యః,
పాపాని కుర్వన్ పాపేన లిప్యతే కిం న లిప్యతే. 3

ప్ర. అ. ఋచః - ఋక్కులను, యజూంషి - యజుస్సులను, యః - ఎవడు, వేద - ఎరుగునో; సామవేదం, చ - సామవేదమును, యః - ఎవడు,

వేద - ఎరుగునో, సః - అతడు, పాపాని - పాపములను, కుర్వన్ - చేయుచు; పాపముతో; లిప్యతే, వా - అంటుకలవా డగునా? న లిప్యతే వా - అంటులేనివా డగునా?

తా. ఋగ్యజుస్సామవేదముల నెరిగినవానికి చేసిన పాపముల ఫల ముండునా? ఉండదా?

వ్యా. వేదాభ్యాసము పాపఫలమును రూపుమాపునా? మాపదా? అని ప్రశ్న భావము.

అవ. సమాధానము చెప్పుచున్నారు-

సనత్సుజాత ఉవాచ - సనత్సుజాతు డిట్లు చెప్పెను.

నైనం సామాన్యృచో వాఽపి న యజూంష్యవిచక్షణమ్,
త్రాయన్తే కర్మణః పాపా న్న తే మిథ్యా బ్రవీమ్యహమ్. 4

ప్ర.అ. ఏనమ్ - ఈ, అవిచక్షణమ్ - వివేకము లేనివానిని, సామాని-సామములు, ఋచః - ఋక్కులు, యజూంషి, వా, అపి - యజుస్సులుగాని, పాపాత్ - పాపమైన, కర్మణః - కర్మమునుండి, న, త్రాయన్తే - రక్షింపవు, తే - నీకు, మిథ్యా - అసత్యము, అహమ్-నేను, న బ్రవీమి - చెప్పను.

తా. వివేకములేనివానిని వేదములు పాపకర్మములనుండి రక్షింపవు. నేను నీకు సత్యమే చెప్పుచున్నాను.

వ్యా. ఇచట అవిచక్షణమ్ - వివేకరహితుని అనుమాటకు వాక్కును మనస్సును నిగ్రహించు సామర్థ్యము లేనివానిని - అని అర్థము. వాక్కును మనస్సును నిగ్రహించుట యనెడు మౌనమును పాటింపనివానిని ఏ వేదములు రక్షింపజాలవని ఫలితార్థము. "న తే మిథ్యా - అనువాక్యమువలన ఇందులో ఇచ్చకములాడి ప్రయోజనము లేదను అర్థము స్ఫురించును.

న చ్ఛన్దాంసి వృజినా త్తారయన్తి
మాయావినం మాయయా వర్తమానమ్,
నీడం శకున్తా ఇవ జాతపక్షా -
శ్ఛన్దాం స్యేనం ప్రజహ త్యన్తకాలే. 5

ప్ర.అ. మాయావినమ్ - కపటభావములుకలవానిని, మాయయా-కపటపు చేష్టతో, వర్తమానమ్ - నడచుకొనువానిని, ఛందాంసి - వేదములు, వృజినాత్ - పాపమునుండి, న, తారయన్తి - తరింపఁజేయవు, జాతపక్షాః - రెక్కలు వచ్చిన, శకున్తాః - పక్షులు, నీడమ్, ఇవ - గూటినివలె, ఏనమ్-వీనిని, ఛందాంసి - వేదములు, అన్తకాలే - చావువేళ, ప్రజహతి - పూర్తిగా వదలిపోవును.

తా. మనస్సున, చేష్టలో కపటములుగలవానిని వేదములు పాపమునుండి రక్షింపజాలవు. రెక్కలు వచ్చిన పక్షులు గూటిని వదలి వెళ్ళిపోవువిధముగా మరణసమయమున వానిని(పాపకర్ముని) వేదములు వదలిపోవును.

వ్యా. ఛందములనగా వేదములు. వృజినమనగా పాపము. ఇట నొక శంక కలుగు నవకాశము కలదు. "వేదము ఏ యే దేవతను వర్ణించునో ఆ యా దేవతతో ఆ వేదము చదువువానికి భావైక్యము సిద్ధించును" అని ఒక వాక్యము కలదు. అట్లే గీతయు 'ఏ యే భావమును స్మరించుచు మానవుడు దేహత్యాగము చేయునో ఆ యా భావమును పొందును' అని చెప్పుచున్నది. అట్టి యెడ నిత్యాభ్యాసమువలన మరణసమయమున మానవుడు భావించు వేదమంత్రములు ఆ యా దేవతారూపమును కలుగజేయకుండుట యెట్లు ? మౌనభావభావముతో పని యేమి? అను శంకకు సమాధానము చెప్పుచున్నారు.

మానవుడు అనుక్షణము వేదాభ్యాసము చేసినను వాని పాపకర్మముల వలన మరణకాలమున ఆ వేదములు వానికి స్ఫురింపవు. రెక్కలు వచ్చిన పక్షులు గూటిని వదలి వెళ్ళిపోయినట్లు వేదములు వానిని విడచిపోవును. కావున మరణకాలమున వానిని అట్టివాడు నిలుపుకొనజాలడు కనుక పాపఫలమునే యను భవించునని తెలుచున్నది.

ధృతరాష్ట్ర ఉవాచ-ధృతరాష్ట్రు డిట్లు పలికెను.

న చేద్వేదా వినా ధర్మం త్రాతుం శక్తా విచక్షణ,
అథ కస్మాత్ ప్రలాపోఽయం బ్రాహ్మణానాం సనాతనః. 6

ప్ర.అ. విచక్షణ - వివేకశాలీ! ధర్మం, వినా-ధర్మము లేకయే, వేదాః- వేదములు, త్రాతుమ్ - రక్షించుటకు, న, శక్తాః, చేత్ - శక్తి లేనివైనచో; అథ - ఇక; బ్రాహ్మణానామ్ - వేదవిదుల; అయమ్ - ఈ; సనాతనః - అనాదియైన; ప్రలాపః - వాగుడు, కస్మాత్ - దేనివలన.

తా. వివేకశాలీ! స్వభావసిద్ధమగు ధర్మమును పాటింపనిచో వేదములు రక్షింపజాల వన్నచో వేద వేత్తలు అనాదిగా పలుకు పనికిమాలిన పలుకుల కర్థ మేమి?

వ్యా. ధర్మ మనగా స్వభావసిద్ధమైన కార్యాచరణము. శమము, దమము, తపము, శౌచము, ఓర్పు, ఋజుత్వము, జ్ఞానము, విజ్ఞానము, ఆస్తిక్యము - అనునది స్వభావమువలన పుట్టిన బ్రహ్మకర్మము అనుసట్టిది. ధర్మం, వినా - ఇట్టి ధర్మమును వదలినచో వేదములు రక్షింపవన్నచో-

"ఋగ్యజుస్సామభిః పూతో బ్రహ్మలోకే మహీయతే" ఋగ్యజుస్సామములచేత పవిత్రుడైనవాడు బ్రహ్మలోకమున గొప్పవా డగును-

"యావతీర్వై దేవతా స్తాస్సర్వా వేదవిది బ్రాహ్మణే వసన్తి"- ఎంతలేసి దేవతలును వేద మెరిగిన బ్రాహ్మణునియందు నెలకొందురు - మొదలుగా గల; ప్రలాపః - బ్రాహ్మణుల మాహాత్మ్యమును పొగడు పనికిమాలిన వాక్యముల కూర్పు; కిస్మాత్ - దేనివలన, ప్రవృత్తమైనది? అని భావము. సనాతనమనుట వలన ఈ ప్రలాపము నేటిది కాదే అనాదిగా వచ్చుచున్నది గదా! యని ఆశ్చర్యము.

అవ. పై ప్రశ్నకు సమాధానము చెప్పుచున్నారు-

సనత్సుజాత ఉవాచ - సనత్సుజాతు డిట్లు చెప్పెను.

తస్యైవ నామాదివిశేషరూపై-
రిదం జగ ద్భాతి మహానుభావ,
నిర్దిశ్య సమ్య క్ప్రవద న్తి వేదా-
స్తద్విశ్వవైరూప్య ముదాహర న్తి. 7

ప్ర.అ. మహానుభావ - మహానుభావా! తస్య - ఏవ - ఆ పరమాత్మ యొక్కయే, నామాదివిశేషరూపైః - నామము, రూపము మొదలగు విశేష స్వరూపములతో, ఇదమ్ - ఈ, జగత్-జగత్తు, భాతి - తోచుచున్నది, వేదాః - వేదములు, నిర్దిశ్య - సమస్తవిశ్వమును నిరూపించి, సమ్యక్ - చక్కగా, ప్రవదన్తి - చెప్పుచున్నవి, తత్ - ఆ బ్రహ్మను; వైరూప్యమ్ - విలక్షణమైన దానినిగా, ఉదాహరన్తి - వక్కాణించుచున్నవి.

తా. ఓ మహానుభావా! ఈ నామరూపాత్మకమైన ప్రపంచ మంతయు పరమాత్మకు సంబంధించినదే.వేదములు విశ్వము నంతటిని నిరూపించి చెప్పు చున్నవి. మరియు విశ్వముకంటె ఆ పరమాత్మ విలక్షణమైన దనియు నిరూపించి చెప్పుచున్నవి.

వ్యా. మహానుభావా! అని సంబోధించుటలో రెండు అర్థములు సంభావింపనగును. నిజమైన ఆవేదనతో జిజ్ఞాసతో ధృతరాష్ట్రుడు ప్రశ్నించుచున్న ధోరణి కానవచ్చుటచే కలిగిన ప్రమోదము. వేదవాక్యములను ప్రలాప మను చున్నాడు కనుక అవహేళన.

తస్యైవ - "అస్య మహతో భూతస్య నిఃశ్వసిత మేత ద్యదృగ్వేదో యజుర్వేదః సామవేదః" అని శ్రుతి ఋగ్యజుస్సామవేదములు ఆ మహాభూతము బ్రహ్మముయొక్క, నిఃశ్వసితముగా వర్ణించుచున్నది. కనుక నీవు ప్రలాప మనునది ఆ పరమాత్మదే. అంతే కాదు అవ్యాకృతుడైన - బీజములో చెట్టు పైకి తెలియరాకుండునట్లున్న - ఆ పరమాత్మ - నామరూపాదులతో వ్యక్తము కాగా ఈ జగత్తు తోచుచున్నది. అనగా ఆ వేదము, ఈ జగత్తు ఆ పరమాత్మయొక్క స్వరూపములే యని తాత్పర్యము.

శ్రుతి కూడ అట్లే చెప్పుచున్నది. "తద్ధేదం తర్హ్యవ్యాకృత మాసీ త్తన్నామరూపాభ్యామేవ వ్యాక్రియతాసౌ నామాయమిదం రూప మితి". అవ్యాకృతముగా అవ్యక్తముగా నున్న ఆ పరమాత్మయే నామరూపములతో వ్యక్తము కాగా - ఇది పేరు ఇది రూపము అను వ్యవహార మేర్పడుచున్నది.

"నిర్దిశ్య సమ్యక్ప్రవద న్తి వేదాః" - బ్రహ్మము రూపములు రెండు - ఒకటి మూర్తము, రెండు అమూర్తము - ఇట్లు కానవచ్చునది, కానరానిది అను రూపమున నున్న విశ్వమంతయు బ్రహ్మరూపమే అని నిర్దేశించి ఈ విశ్వ మంతయు బ్రహ్మమే అని వేదములు చెప్పుచున్నవి. ఇది అధ్యారోపప్రసంగము-అనగా విశ్వమునందు బ్రహ్మమును దర్శించుట.

అయినచో విశ్వమునకున్న అవలక్షణము లన్నియు బ్రహ్మమున కుండునా? అను శంక కలుగవచ్చును. దానికి సమాధానము చెప్పుచున్నారు. "తద్విశ్వవైరూప్య ముదాహర న్తి".

ఆ బ్రహ్మము విశ్వముకంటె విరూపమైనదియే అనియు వేదములు చెప్పు చున్నవి. ఆ బ్రహ్మము, విశ్వ-మూర్తము, అమూర్తము అగు విశ్వముకంటె, విరూపమ్ - విభిన్నమైన - విలక్షణమైన రూపము కలది అని భావము. (మూర్తము అనగా ఆకారము కలది, అమూర్త మనగా ఆకారము లేనిది) దీనిని అపవాద ప్రసంగ మందురు. అపవాద మనగా తొలగించుట - పరిహరించుట.

'నేతి నేతి' అను శ్రుతివాక్యములందు 'న' - కాదు అను శబ్దము రెండు మారులు కానవచ్చుచున్నది. మొదటి న శబ్దముచేత బ్రహ్మము మూర్తము, అమూర్తమునగు విశ్వము కాదు అని చెప్పి అట్లయినచో ఇక మిగులునది శూన్యమే కదా అను అభిప్రాయము కలుగుచుండగా అట్లు కాదు అనుటకు మరి యొక నశబ్దమును వేదము గ్రహించినది. ఆ నశబ్దమునకు ఆత్మకంటె భిన్న ముగా, పరముగా కారణముగాని కార్యముకాని లేదని చెప్పుట దాని ప్రయోజ నము. "న తు శూన్య మవశేష్యతే" అని శ్రుతియే చెప్పుచున్నది. శూన్యము మిగులుట లేదు అని దాని యర్థము. ఈ విధముగా బ్రహ్మము విశ్వముకంటె విలక్షణము అను నర్థము సిద్ధించుచున్నది. దీనివలన పరమాత్మ నుండి పుట్టిన వేదము మన్నింపదగినది కనుక వేదము చెప్పిన మార్గమును అనుష్ఠింపని వాని వేదాధ్యయనము నిష్ఫలమే అని స్పష్ట మగుచున్నది. అది భగవదాజ్ఞను త్రోసి పుచ్చుటయే కదా!

'న తస్య వాచ్యపి భాగో అస్తి' అనియు వేదము చెప్పుచున్నది. దేహమే ఆత్మ అను బుద్ధితో పరమాత్మ లేదని తలచి వదలు వానికి వేదోచ్చారణ చేసి నంత మాత్రమున ఫలమున అంశముకూడ లభింపదని మంత్రార్థము. తాత్పర్యము గుర్తింపక వేద పఠనము చేయుట నిష్ఫలమని ఫలితార్థము.

తదర్థముక్తం తప ఏత దిజ్యా
తాభ్యా మసౌ పుణ్య ముపైతి విద్వాన్,
పుణ్యేన పాపం వినిహత్య పశ్చాత్
సజ్జాయతే జ్ఞానవిదీపితాత్మా. 8

ప్ర.అ. తదర్థమ్ - ఆ బ్రహ్మమును పొందుటకు, తపః - తపస్సు, ఇజ్యా - యజ్ఞము, ఏతత్ - అనునిది, ఉక్తమ్ - సాధనముగా చెప్పబడినది, తాభ్యామ్ - ఆ రెంటితో, విద్వాన్ - విద్వాంసుడు, పుణ్యమ్ - పుణ్యమును,

ఉపైతి - పొందుచున్నాడు, పుణ్యేన - అట్టి పుణ్యముతో, పాపమ్ - పాపమును, వినిహత్య - రూపు మాపికొని, పశ్చాత్ - అటుపై, జ్ఞానవిదీపితాత్మా - జ్ఞానము చేత వెలుగొందు ఆత్మతత్త్వము కలవాడు, సంజాయతే - అగును.

తా. ఆ పరమాత్మను పొందుటకు తపము, యజ్ఞము అను రెండు సాధనములు కలవు. ఈరెంటివలన విద్వాంసుడు పుణ్యమును పొందును. ఆ పుణ్యము చేత పాపమును రూపుమాపుకొనును. దానితో ఆతని జ్ఞానజ్యోతి ప్రకాశించును.

వ్యా. బ్రహ్మము విశ్వముకంటె విలక్షణమైనదని పైని నిరూపించి యున్నారు. అట్టి విలక్షణమగు బ్రహ్మమును పొందుటకు తపస్సు, యజ్ఞము అను రెండు సాధనములు కలవు. తపస్సనగా కృచ్ఛ్రము, చాంద్రాయణము మొదలగు పేర్లుగల వ్రతము. మరియు ధ్యానము, ధారణము మొదలగునదికూడ తపమే. 'తపసా బ్రహ్మ విజిజ్ఞాసస్వ' - తపస్సుతో బ్రహ్మము నెరుగ గోరుము - అని శ్రుతి చెప్పుచున్నది. అట్లే యాగములు మొదలగునవి కూడ ఆ ప్రయోజనముకొరకే. ఈ రెంటివలన పుణ్యమేర్పడును. దానితో పాపము నశించును. పాపములేనివాడు జ్ఞానముతో - బ్రహ్మాకారమైన చిత్తవృత్తితో - ప్రకాశితమైన ఆత్మతత్త్వము కలవాడగును. ఇది క్రమము.

దీనిచేత యజ్ఞము, తపస్సు అనునవి మోక్షమునకు సూటిగా కారణములు కావనియు స్పష్టమగుచున్నది. జ్ఞానమే మోక్షసాధనమని తెలియుచున్నది. జ్ఞానకర్మముల సముచ్చయము మోక్షహేతు వను భావము ఆధారరహితమైనదనియు నిరూపితమగుచున్నది.

అవ. ఆత్మతత్త్వము ప్రకాశించినచో ఫల మేమో చెప్పుచున్నారు.

జ్ఞానేన చాత్మాన ముపైతి విద్వా-
నథాన్యథా వర్గఫలానుకాంక్షీ,
అస్మిన్ కృతం తత్పరిగృహ్య సర్వ-
మముత్ర భుఙ్క్తే పునరేతి మార్గమ్. 9

ప్ర.అ. విద్వాన్ - బ్రహ్మతత్త్వ మెరిగినవాడు, జ్ఞానేన - జ్ఞానముచేత, ఆత్మానమ్ - పరమాత్మను, ఉపైతి - పొందును, అథ - ఇక, అన్యథా - అట్లు కానిచోదల, వర్గఫల - అనుకాంక్షీ - ఇంద్రియముల ఫలములను కోరువాడై,

అస్మిన్ - ఈ లోకమున, కృతమ్ - చేయబడిన, సర్వమ్ - అంతటిని, పరిగృహ్య - గ్రహించి, అముత్ర - పరలోకమున, భుఙ్క్తే - అనుభవించును, పునః - మరల, మార్గమ్ - కర్మమార్గమును బట్టి లోకమును. ఏతి - పొందును.

తా. బ్రహ్మతత్త్వ మెరిగినవాడు జ్ఞానముచేత పరమాత్మను చేరుకొనును. అట్లుకాక ఇతరమార్గము నవలంబించినచో ఇంద్రియముల ఫలములగు విషయముల సుఖములందు కోరికగలవాడై ఈలోకమున చేసిన పుణ్యపాపరూపమైన కర్మఫలము నంతటిని గ్రహించి పరలోకమున (స్వర్గమో నరకమో) సుఖదుఃఖరూపమైన దానిని అనుభవించును. మిగిలిన కర్మఫలము ననుభవించుటకై మరల ఈలోకము దారిబట్టును.

వ్యా. జ్ఞానేన చ ఆత్మాన ముపైతి - ఆత్మలాభముకంటె మరియొక లాభము లేదు.

"ఆత్మానం చే ద్విజానీయా దయ మస్మీతి పూరుషః,
కిమిచ్ఛన్ కస్య కామాయ శరీర మనుసఞ్జ్వరేత్".

'నేను బ్రహ్మమను' అను రూపమున పరమాత్మ నెరిగినచో నరుడు ఇంక దేనిని కోరును? దేనికొరకు శరీరమును తపింపజేయును?- ఇత్యాది శాస్త్రవాక్యములవలన ఆత్మప్రాప్తియే పరమపురుషార్థము.

ఇది కానిచో అగు దోషమును చెప్పుచున్నారు. అథ అను మాటకు కాని పక్షమున అని అర్థము. అన్యథా - ఆత్మజ్ఞానము లేక ఆత్మకానిదానియందు పురుషార్థబుద్ధి పెట్టినచో, వర్గ, ఫల, అనుకాంక్షీ - వృజ్క్తే ఆత్మానం స్వస్వవిషయోపహారముఖేన వర్గః - తన తన విషయమును సమర్పించుటచేత ఆత్మను క్రమ్మిమైచును - అను నర్థమును బట్టి వర్గమనగా ఇంద్రియముల సముదాయము. దాని ఫలము - విషయసుఖము. దానిని కోరువాడై, అస్మిన్ - ఈ లోకమున, కృతమ్ - చేసిన - పుణ్యమునో, పాపమునో, సర్వమ్ - సమస్తమును, గ్రహించి -

"తం విద్యాకర్మణీ సమన్వారభేతే పూర్వప్రజ్ఞా చ" - ప్రాణములు వదలిపోవు జీవుని విద్యయు, కర్మమును, పూర్వప్రజ్ఞయు వెంటనంటును. అను శ్రుతి ననుసరించి - తీసికొని పోవునని తాత్పర్యము.

అముత్ర - పరలోమున - అది పుణ్యమునుబట్టి స్వర్గము పాపమును బట్టి నరకము అగును. భుఙ్క్తే - అనుభవించును.

అటుపై మరల ఈ మార్గమునే పట్టును. ఈమార్గ మనగా ఈ లోకము, ఇది కర్మశేషముచేత జరుగును.

"తస్మిన్ యావత్సంపాత ముషిత్వాఽథైతమే వాధ్వానం పున ర్నివర్తన్తే". కర్మఫల మున్నంతవరకు పరలోకమున నివసించి మరల ఈ మార్గమునకే తిరిగి వత్తురు. (సంపాత మనగా - దీనిచేత సంపతతి - పడును - అనునర్థమున కర్మము అర్థము) "తస్మాల్లోకాత్పునరైత్యస్మై లోకాయ కర్మణే"- ఆలోకమునుండి మరల కర్మముకొరకు ఈ లోకమునకు వచ్చును - అని శ్రుతులు చెప్పుచున్నవి.

అవ. అయినచో "స్వాధ్యాయప్రవచనే ఏవేతి నాకో మౌద్గల్యః" - స్వాధ్యాయప్రవచనములందే స్వర్గమని మౌద్గల్యుడు. "తద్ధి తప స్తద్ధి తపః"- అదియే తపము. అదియే తపము. - ఇట్లు ఈ శ్రుతులు ఆదరముతో అధ్యయన, అధ్యాపనములే ముఖ్యతపమని వక్కాణించుచున్నవి. అట్లు అవియును మోక్షహేతువు లగుచున్నవి కదా! అట్టియెడ వేదములు పాపమునుండి రక్షింపవనుట యెట్లు? అని శంకించి తెలిసిచేసెడు తపము, తెలియక చేసెడు తపము అనువానికి గల భేదమును వక్కాణించుచున్నారు-

అస్మింల్లోకే తప స్తప్తం ఫల మన్యత్ర భుజ్యతే,
బ్రాహ్మణానా మిమే లోకా ఋద్ధే తపసి తిష్ఠతామ్. 10

ప్ర.అ. అస్మిన్-ఈ, లోకే - లోకమునందు, తపః - తపము, తప్తమ్- చేయబడినది, అన్యత్ర - పరలోకమున, ఫలమ్ - ఫలము, భుజ్యతే - అనుభవింప బడును.

ఋద్ధే - తప్పనిసరిగా చేయదగిన, తపసి - తపస్సునందు, తిష్ఠతామ్ - ఉన్న, బ్రాహ్మణానామ్ - బ్రహ్మజ్ఞానసంపన్నులకు, ఇమే - ఈ, లోకాః - లోకములు - ఫలముల నిచ్చునవి.

తా. జ్ఞానము లేక కేవలము ఈ లోకమునందు తపస్సు చేసినవారు పరలోకమున ఫలము అనుభవింతురు. జ్ఞానముతో తప్పక చేయదగు తపము

నాచరించు బ్రహ్మవేత్తలకు ఇవియే ఫలము నిచ్చును. జ్ఞానమునకు ఫలము వెంటనే ఈ లోకముననే కానవచ్చునని ఫలితార్థము.

వ్యా. ఇందు మొదటి పాదమున జ్ఞానములేని సాధారణుల తపమును గూర్చి చెప్పబడినది. ఎఱుకలేని సాధారణుల తపస్సునకు ఫలమును వారు స్వర్గాదిరూపమున పరలోకమున ననుభవింతురు. ఇక ధాత్వమైన తపస్సున నిష్ఠ గల బ్రాహ్మణులకు - బ్రహ్మనిష్ఠ గలవారికి ఇవియే లోకములు - ధాత్వ మనగా ధాతవ్యము. కర్తవ్యము - తప్పక చేయదగినది - ఇట్టిది శమము, దమము, తపస్సు, శౌచము అని ముందు చెప్పియున్నారు. ఇమే - ఇవియే, లోకాః - ఫలము నొసగునవి. జ్ఞానమునకు ఫలము ఈ లోకమునందే కన్పట్టునని ఫలితార్థము.

అవ. ఒకే తపస్సు విద్వాంసునకు సమృద్ధము, అవిద్వాంసునకు అసమృద్ధము అని రెండువిధములుగా నగును? అని అడుగుచున్నాడు-

ధృతరాష్ట్ర ఉవాచ - ధృతరాష్ట్రు డిట్లడిగెను.

కథం సమృద్ధ మసమృద్ధం తపో భవతి కేవలమ్,
సనత్సుజాత తద్బ్రూహి యథా విద్యామ తద్వయమ్. 11

ప్ర.అ. కేవలమ్ - ఒక్కటియే యగు, తపః - తపస్సు, సమృద్ధమ్ - పండినది, అసమృద్ధమ్ - పండనిది; కథం - ఎట్లు, భవతి - అగును? సనత్సుజాత - సనత్సుజాతుడా, యథా - ఎట్లు, విద్యామ - స్పష్టముగా ఎరుగుదుమో, తత్ - దానిని, తథా - ఆ విధముగా, బ్రూహి - చెప్పుము.

తా. సనత్సుజాతా! ఒకేవిధమగు తపస్సు ఒకరికి సమృద్ధము, మరి యొకరికి అసమృద్ధము అగుట యెట్లు? ఈవిషయమును నాకు చక్కగా బోధపడు నట్లు చెప్పుము.

వ్యా. జ్ఞానముకలవాని తపస్సు మోక్షరూపమున పండుచున్నది. జ్ఞానము (మోక్షబుద్ధి) లేనివాని తపస్సు మోక్షఫలము నీయకున్నది. తప మొక్కటియే కదా! రెండువిధములగు ఫలముల నిచ్చు టెట్లు? అని జిజ్ఞాస.

అవ. సమాధానము చెప్పుచున్నారు-

సనత్సుజాత ఉవాచ - సనత్సుజాతు డిట్లు చెప్పెను.

నిష్కల్మషం తప స్త్వేతత్ కేవలం పరిచక్షతే,
ఏత త్సమృద్ధ మప్యృద్ధం తపో భవతి కేవలమ్. 12

ప్ర.అ. ఏతత్ - ఈ, తపః - తపము, నిష్కల్మషమ్ - కల్మషము లేనిదై, కేవలమ్ - కేవలము అని, పరిచక్షతే - చెప్పబడును. ఏతత్, కేవలమ్- ఈ కేవలము, తపః - తపస్సు, సమృద్ధమ్ - సమృద్ధము, ఋద్ధమ్, అపి - ఋద్ధము అనియు, భవతి - అగుచున్నది.

తా. తపస్సు మూడు విధములు. అందు మొదటిది నిష్కల్మషమైనది. దానిని కేవలము అందురు. కల్మష మనగా కామము. అది లేనిది కేవలము. ఇది కామముతో కూడినచో సమృద్ధము అనబడును. కేవలము ఇతరుల మెప్పునకు చేసెడి తపమును ఋద్ధము అందురు.

వ్యా. కల్మష మనగా కామము. మోక్షముకంటె ఇతరమైన ఏ విషయమునందు ప్రసరించినను కామము కల్మష మగును. శ్రద్ధ మొదలగు లక్షణములు లేనిదియు కల్మషమే. అది కానిది నిష్కల్మషము. అది కైవల్యమునకు సాధనము కనుక కేవలమని దానికి వ్యవహారము.

ఆ తపస్సే శ్రద్ధ మొదలగువానితో కూడినదైనను సకామమైనచో సమృద్ధమనియు, కేవలము ఇతరుల మెప్పునకు చేసెడిదైనచో ఋద్ధమనియు పేర్కొనబడును.

శ్రుతియు - "యదేవ విద్యయా కరోతి శ్రద్ధయోపనిషదా తదేవ వీర్యవత్తరం భవతి" అని చెప్పుచున్నది. జ్ఞానసంపదతో శ్రద్ధతో చేసెడు తపము వీర్యవత్తర మగుచున్నది. ఇచట 'తరప్' - (రెంటిలో మేలైనది అను నర్థము నిచ్చు ప్రత్యయము) అనుదానిని వాడుటవలన విద్యాహీనుడు చేసెడు తపస్సు కూడ వీర్యవంతమగుట తెలియవచ్చుచున్నది కాన ఋద్ధత్వము-గొప్పదియగుట కానవచ్చుచున్నది.

అవ. తపమునే కొనియాడుచున్నారు-

తపోమూల మిదం సర్వం యన్మాం పృచ్ఛసి క్షత్రియ,
తపసా వేదవిద్వాంసః పరం త్వమృత మాప్నుయుః. 13

ప్ర.అ. క్షత్రియ-క్షత్రియా!; ఇదమ్ - ఈ, సర్వమ్ - అంతయును, తపోమూలమ్-తపస్సే మూలముగా గలది, యత్-దేనినిగూర్చి, మామ్-నన్ను,

పృచ్ఛసి-అడుగుచున్నావో, తు-కాని, వేదవిద్వాంసః-వేదము తత్త్వ మెరిగిన పండితులు, తపసా-తపస్సుచేత, పరమ్ అమృతమ్ - మిక్కిలి గొప్పదియగు, అమృతస్థితిని-ముక్తిని, ఆప్నుయుః-పొందుదురు.

తా. క్షత్రియా! ఈ సృష్టిలో మానవుడు పొందు భోగ్యమైన దెల్ల తపస్సువలననే సిద్ధించుచున్నది. వేదతత్త్వ మెరిగిన జ్ఞానసంపన్నులుమాత్రము తపస్సుచేత ముక్తిని బొందుచున్నారు.

వ్యా. ఇచట తపస్సునకు నశ్వరమైన ఐహికఫలము, అవినాశి యగు పరమఫలము కలుగునని చెప్పుచున్నారు. 'తు' అను మాటవలన రెండవదియే జ్ఞానవంతుడు కోరదగినదని నొక్కి చెప్పినట్లయినది.

అవ. అవును; నిష్కల్మషమగు తపస్సును గూర్చి వింటిని. ఇక కల్మష మనగా నేమి? అది లేని తపమువలనగదా సనాతనము, గుహ్యము అగు బ్రహ్మవిద్య యెఱుగనగును? - అని యడుగుచున్నాడు-

ధృతరాష్ట్ర ఉవాచ - ధృతరాష్ట్రు డిట్లు పలికెను.

కల్మషం తపసో బ్రూహి శ్రుతం నిష్కల్మషం తపః,
సనత్సుజాత యేనేదం విద్యాం గుహ్యం సనాతనమ్. 14

ప్ర.అ. సనత్సుజాత!-ఓయి సనత్సుజాతా!, తపః-తపస్సు, నిష్కల్మషమ్ - కల్మషము లేనిది కావలయు నని, శ్రుతమ్ - వినవచ్చినది, తపసః - తపస్సునకు, కల్మషమ్ - మాలిన్య మన నేమో, బ్రూహి - చెప్పుము, యేన - దేనివలన, ఇదమ్ - ఈ, సనాతనమ్-పురాతన మగు, గుహ్యమ్ - రహస్యమును - జ్ఞానమును, విద్యామ్ - తెలిసికొందునో.

తా. మహర్షీ! నిష్కల్మషమగు తపస్సు అని వినియుంటిని. తపస్సునకు కల్మష మనగా నెట్టిది? అది నా కెరిగింపుము. దానిని విన్నచో నిత్యసత్యమగు రహస్యము నా కెరుకపడును.

వ్యా. కల్మష మేమో యెఱిగినచో దానిని పరిహరించుకొనుట సాధ్యమగునని భావము. కల్మష మననేమో యెఱుగనిచో సనాతనమగు బ్రహ్మవిద్య యెఱుకపడదనియు భావము.

అవ. దానినే చెప్పుచున్నారు-

సనత్సుజాత ఉవాచ - సనత్సుజాతు డిట్లు చెప్పెను.

క్రోధాదయో ద్వాదశ యస్య దోషా
స్తథా నృశంసాని దశత్రి రాజన్,
ధర్మాదయో ద్వాదశైతే పితృాణాం
శాస్త్రే గుణా యే విదితా ద్విజానామ్. 15

ప్ర.అ. రాజన్-రాజా!, యస్య - ఏ తపస్సునకు, దోషాః - దోషములు, ద్వాదశ - పండ్రెండు కలవో, తే - అవి, క్రోధాదయః - క్రోధము మొదలగునవి, తథా - అట్లే, నృశంసాని - క్రూరగుణములు, దశత్రి - పదమూడు కలవు.

ఏతే - ఈ, ద్వాదశ - పండ్రెండును, ద్విజానామ్ - బ్రహ్మజ్ఞానము పొందగోరువారికి, పితృణామ్ - వంశకర్తలగు మనువు మొదలగు వారికి సంబంధించినవిగా, ధర్మాదయః - ధర్మము మొదలగు, గుణాః - గుణములు, శాస్త్రే-శాస్త్రమునందు, విదితాః - తెలియవచ్చునవి.

తా. రాజా! తపస్సును పాడుచేయు దోషములు క్రోధము మొదలగునవి పండ్రెండు కలవు. అట్లే పదమూడు క్రూరలక్షణములును కలవు. బ్రహ్మజ్ఞానము పొందగోరువారికి మనువు మొదలగు మహానుభావులు చెప్పిన శాస్త్రములందు తెలియవచ్చు గుణములు ధర్మము మొదలగునవి కలవు.

వ్యా. క్రోధాధులగు పండ్రెండును, పదుమూడువిధములైన నృశంసవర్గమును తపస్సునకు కల్మషమని భావము. అది ధర్మము మొదలగు గుణములకు విరుద్ధమైనది గదా! అట్టి దోషములులేని తపస్సు నిష్కల్మషమై మోక్షమునకు హేతువగును. పితృాణామ్ - వంశకర్తలగు మనువు మొదలగువారియొక్క, శాస్త్రే - శాస్త్రమునందు, విదితాః - తెలియవచ్చునవి. అట్టివి ధర్మాదిలక్షణములు పండ్రెండు గలవని తాత్పర్యము. వీనిని తరువాతి శ్లోకములతో వివరింపుచున్నారు.

క్రోధః కామో లోభమోహౌ విధిత్సా
కృపాసూయే మానశోకౌ స్పృహా చ,
ఈర్ష్యా జుగుప్సా చ మనుష్యదోషా
వర్జ్యాః సదా ద్వాదశైతే నరాణామ్. 16

ప్ర అ. క్రోధః - క్రోధము, కామః - కామము, లోభమోహౌ - లోభ మోహములు, విధిత్సా - మితిమీరిన స్వార్థచింతన, అకృపా -అసూయే - దయ లేనితనము, అసూయ, మానశోకౌ - మిడిసిపాటు, శోకము, స్పృహా, చ - లోక విషయములందు తీవ్రవాంఛ, ఈర్ష్యా - ఈర్ష్య, జుగుప్సా, చ - ఏవగించు కొనుటయు, మనుష్యదోషాః - మనుష్యుని దోషములు, ఏతే - ఈ, ద్వాదశ - పంద్రెండును, నరాణామ్ - నరులకు, సదా - ఎల్లవేళల, వర్జ్యాః - విడిచివేయ దగినవి.

తా. రాజా! క్రోధము, కామము, లోభము, మోహము, మితిమీరిన స్వార్థ చింతన, దయలేనితనము, అసూయ, మానము శోకము భోగములయం దను రక్తి, ఈర్ష్య, ఏవగింపు-అను పంద్రెండును మానవదోషములు. నరులు వీనిని ఎన్నిటికిని దరికి చేరనీరాదు.

వ్యా. క్రోధము - కోరినది సిద్ధింపకపోవుటవలన గుండె బాదుకొనుచు పొందెడు మనస్తాపము; కామము - స్త్రీలయందు వాంఛ, లోభము - ధనము పోవునను భీతి, మోహము - చేయదగినపనులను, చేయరానిపనులను నిర్ణయించు కొనలేకపోవుట, విధిత్సా - మీద మీద లాభములు గలుగుచున్నను తృప్తిపడ కుండుట, అతిదాహము - (ధేట్ - పానే అను ధాతువుపై సన్నంతరూపము.) అకృప - దయలేకపోవుట, అసూయ - ఇతరుల గుణములను దోషములనుగా భావించుట, మానము - తన్ను గొప్పవా దనుకొనుట, శోకము - కోరిన అర్థము నష్టము కాగా మనస్సు చెదరుట, స్పృహ - భోగములయందు కాంక్ష, ఈర్ష్య - ఇతరుల గొప్పతనమును చూచి సహింపకపోవుట, జుగుప్స - ఇతరులను నిందించుట లేక ఇతరులకు ఏవగింపు కలుగునట్లు ప్రవర్తించుట.

నరాణామ్ - నరులకు అనుటవలన ఈపంద్రెండు దోషములను - అతడు యోగియైనను, కాకున్నను - మానవు డైనంతమాత్రమున - వదలవలయునని భావము.

అవ. వీనిలో ఏయొక్కటియు మనుష్యుని నాశనము చేయగలదు. ఇక కొన్నింటి సముదాయమో, అన్నింటి సముదాయమో ఉన్నచో చెప్పెది దేమి ? యనుచున్నారు-

ఏకైకః పర్యుపాస్తే హ మనుష్యాన్ మనుజర్షభ,
లిప్సమానోఽన్తరం తేషాం మృగాణామివ లుబ్ధకః. 17

ప్ర.అ. మనుజర్షభ - రాజా! ఏకైకః - వీనిలో ఒక్కొక్కటియు, మనుష్యాన్ - మనుష్యులను, తేషామ్-వారి, అన్తరమ్ - దోషమును, మృగాణామ్ - మృగముల దోషమును, లుబ్ధకః, ఇవ - బోయవాడు వలె, లిప్సమానః - పొంద గోరుచు, పర్యుపాస్తే - హింసించును.

తా. రాజా! వేటకాడు మృగముల బలహీనతను పొంచి చూచి పట్టి చంపు విధముగా ఈ దోషములలో ఒక్కొక్కటియు నరుల బలహీనతలను పొంచి చూచి హింసించును.

వ్యా. అంతర మనగా సందు. బలహీనత. హింసించుటకు ఒక్కొక్కటియు సమర్థము లనగా కొన్ని కాని, అన్నియు కాని చేయగల ప్రమాద మెట్టిదియో పరికింపనగునని తాత్పర్యము.

అవ. రెండు శ్లోకములతో పదుమూడు హింసించు లక్షణములను చెప్పుచున్నారు-

వికత్థనః స్పృహయాళు ర్మనస్వీ
బిభ్రత్కోప శ్చపలోఽరక్షణశ్చ
ఏతాన్ పాపాః షణ్నరాః పాపధర్మాన్
ప్రకుర్వతే నో త్రసన్తః సుదుర్గే. 18

ప్ర.అ. వికత్థనః - దంబములు పలుకువాడు, స్పృహయాళుః - చెక్కు చెదరని దుష్టకామము కలవాడు, మనస్వీ - మిక్కిలి పొగరుబోతు, బిభ్రత్కోపః - విడువని కోపము కలవాడు, చపలః - చంచలమైన మనస్సు కలవాడు, అరక్షణః - శక్తియుండియు రక్షింపనివాడు, పాపాః-పాపులగు; నరాః-నరులు, సదుర్గే - మహాకష్టసమయమునందును, నో త్రసన్తః - వెరువనివారై, ఏతాన్ - ఈ, షట్ - ఆరు, పాపధర్మాన్ - పాపపు పనులను, ప్రకుర్వతే - పట్టు వదలక చేయుచుందురు.

తా. వికత్థనుడు, స్పృహయాళువు, మనస్వి, కోపి, చపలుడు, అరక్షణుడు - అను నీ యారుగురును పాపాత్ములు. ఎట్టి ఆపద సమయమునం దైనను సిగ్గు పడక ఈ పాపకార్యములే చేయుచుందురు.

వ్యా : వికత్థనుడు - ఇతరుల గుణములను వెక్కిరించుచు తన గుణము లను గొప్పగా చెప్పుకొనువాడు, స్పృహయాళుః-ఎట్టి తీవ్ర ప్రయత్నములోనైనను పరస్త్రీ సుఖము పొందగోరువాడు, మనస్వీ - మేరమీరిన గర్వముతో ఇతరులను అవమానించువాడు; బిభ్రత్‌కోపః-కారణము లేకయే ఎల్లపుడు కోపముతో చిరచిర లాడువాడు, చపలః - స్నేహము మొదలగు లక్షణములందు స్థిరబుద్ధి లేనివాడు, అరక్షణః - శక్తి యుండియు చేపట్టిన స్త్రీలు మొదలగు వారిని కాపాడనివాడు, ఏతాన్, షట్, పాపధర్మాన్ - ఈ ఆరు పాపపు పనులను, ప్రకుర్వతే - పట్టుదలతో చేయుచుందురు.

సుదుర్గే - మహాసంకటమందును, నోత్రసన్తః - వెరవనివారై - సిగ్గు ఎగ్గులు లేనివారై, ఈ ఆరుగురు పరమక్రూరులని భావము.

సంభోగసంవి ద్విషమోఽతిమానీ
దత్తానుతాపీ కృపణో బలీయాన్,
వర్గప్రశంసీ వనితాసు ద్వేష్టా
ఏతే పరే సప్త నృశంసవర్గాః. 19

ప్ర.అ. సంభోగసంవిద్, విషమః - సంభోగమే పురుషార్థమను బుద్ధితో చెలరేగువాడు, అతిమానీ - మిక్కిలి పొగరుబోతు, దత్త - అనుతాపీ - దాన మిచ్చి పశ్చాత్తాపము చెందువాడు, కృపణః - పిసినిగొట్టు, బలీయాన్ - హద్దుమీరి పన్నులు గుంజువాడు, వర్గప్రశంసీ - చేసిన పాపమును గొప్పగా చెప్పుకొను వాడు, వనితాసు - వనితలయందు, ద్వేష్టా - ద్వేషభావము కలవాడు, ఏతే - ఈ, సప్త - ఏడుగురు, పరే - మరియొక, నృశంసవర్గాః - హింసకులు.

తా. సంభోగమే పురుషార్థమను బుద్ధితో విచ్చలవిడిగా తిరుగువాడు, మేరమీరిన గర్వము కలవాడు, దాన మిచ్చి ఏడ్చువాడు, ప్రాణముకంటె ధనమే మిన్న యనుకొనువాడు, హద్దుమీరి ప్రజల నుండి పన్నులు గుంజువాడు, చేసిన పాపమును గొప్పగా చెప్పుకొనువాడు, అనురాగము గల భార్యలను ద్వేషించు వాడు - అను నీ యేడుగురు హింసకులు.

వ్యా. సంభోగసంవిద్, విషమః - సంభోగమనగా స్త్రీ సంగమము - అదియే సంవిత్తు - బుద్ధి, దానితో విషముడు - విపరీత ప్రవర్తన గలవాడు, అతిమానీ - హద్దు పద్దులులేని గర్వము గలవాడు, సంభోగసంవిద్, ద్విషమేధ

మానః - అని పాఠాంతరము. అప్పుడు సంభోగసంవిత్తనగా ముందు చెప్పినదియే అర్థము. ద్విషమేధమానః - ద్విష మనగా ద్వేషభావము - దానిని పెంపొందించుకొనువాడు అని యర్థము. దత్తానుతాపీ - దానమొనర్చి పిదప అయ్యో, ధనము పోయెనే అని హృదయములో క్రుళ్ళిపోవువాడు. కృపణః - ప్రాణములు పోవు సమయమునందును ధనవ్యయమును సహింపనివాడు, బలీయాన్ - 'బలి' అనగా కప్పము గైకొనువాడు, పూర్వరాజులకంటె గొప్పగా పన్నులు రాబట్టువాడని యర్థము, వర్గప్రశంసీ - వర్గమనగా పాపము - చేసిన పాడుపనినిగూర్చి గొప్పగా చెప్పుకొనువాడు, వనితాసు - వనిత యనగా పతియందు మిక్కిలి అనురాగముగల భార్య. అట్టివారిని నిష్కారణముగా, ద్వేష్టా - ద్వేషించువాడు.

పరే - పూర్వశ్లోకమున ఆరుగురిని చెప్పియున్నారు - వీరు మిగిలిన ఏడుగురు - మొత్తము పదుముగ్గురు - నృశంసులు - క్రూరకర్ములు.

అవ. దోషములను చెప్పి యిపుడు గుణములను వక్కాణించుచున్నారు-

ధర్మశ్చ సత్యం చ దమస్తపశ్చ
అమాత్సర్యం హ్రీస్తితిక్షాఽనసూయా,
యజ్ఞం చ దానం చ ధృతిః శ్రుతం చ
వ్రతాని వై ద్వాదశ బ్రాహ్మణస్య. 20

ప్ర.అ. బ్రాహ్మణస్య - బ్రహ్మజ్ఞానము పొందగోరువానికి; ధర్మః, చ - ధర్మమును; సత్యం, చ - సత్యమును; దమః - దమమును; తపః చ - తపమును, అమాత్సర్యమ్ - ఇతరుల ఉన్నతిని సహించుటయును; హ్రీః - లజ్జయును; తితిక్షా - ఓర్పును; అనసూయా - అసూయ లేకుండుటయు; యజ్ఞః - యజ్ఞమును; దానమ్ - దానమును; ధృతిః - ధైర్యము; శ్రుతమ్, చ - వేదజ్ఞానము నార్జించుటయు; ద్వాదశ - ఈ పండ్రెండును; వ్రతాని - వ్రతములు.

తా. బ్రహ్మజ్ఞానము పొందగోరువాడు ధర్మము, సత్యము, ఇంద్రియనిగ్రహము, తపము, మత్సరభావము లేకుండుట, లజ్జ, సహనము, అసూయపడకుండుట, యజ్ఞము, దానము, ధైర్యము, వేదజ్ఞానము - అను నీ పండ్రెండు వ్రతముల నాచరింపవలయును.

వ్యా. ధర్మః - ఆ యా వర్గములకు, ఆశ్రమములకు నియతమైన సంధ్యావందనాదికృత్యముల నాచరించుట; సత్యమ్ - ఇతరులను హింసపెట్టనిది, పొల్లుకానిది అగు పలుకు పలుకుట; దమః - నాలుక మొదలగువానిని అదుపులో పెట్టుకొనుట; తపః - కృచ్ఛ్రము, చాంద్రాయణము మొదలగునది - అమాత్సర్యమ్ - మత్సరమనగా ఇతరుల గుణములను సహింపలేకపోవుట - అట్టిది లేకుండుట; హ్రీః - పాడుపనులకు సిగ్గుపడుట; తితిక్షా - కోపమునకు తగిన కారణమున్నను పొందకుండుట; అనసూయా - పరగుణములను దోషములుగా భావింపకుండుట; యజ్ఞః - జ్యోతిష్టోమము మొదలగునది; దానమ్ - ఇతరులకు ధనమిచ్చుట; ధృతిః - ఘోరమగు ఆపద కలిగినను వ్రతము విడువకుండుట; శ్రుతమ్ - అర్థమును గ్రహించుచు వేదము చదువుట; బ్రాహ్మణస్య - బ్రహ్మమును పొందగోరువానికి.

యస్త్వేతేభ్యః ప్రభవే ద్ద్వాదశభ్యః
సర్వా మపీమాం పృథివీం స శిష్యాత్,
త్రిభి ర్ద్వాభ్యా మేకతో వాఽర్థితో య-
స్తస్య స్వమ స్తీతి స వేదితవ్యః. 21

ప్ర. అ. యః, తు - ఎవ్వడుగాని; ఏతేభ్యః - ఈ; ద్వాదశభ్యః - పండ్రెండుగుణములచేత, ప్రభవేత్ - సంపన్ను డగునో; సః - అతడు; సర్వామ్, అపి - సమస్తమైన, ఇమామ్ - ఈ, పృథివీమ్ - భూమిని, శిష్యాత్ - శాసింపగలవా డగును, యః - ఎవడు, త్రిభిః - మూడింటితోడనో, ద్వాభ్యామ్ - రెంటితోడనో, ఏకతః, వా - ఒక్కదానితోడనో, అర్థితః - సంపన్నుడగునో, తస్య - వానికి, స్వమ్ - సొమ్ము, అస్తి - కలదు, ఇతి - అని, సః - అతడు, వేదితవ్యః - తెలియదగినవాడు.

తా. పైని చెప్పిన పండ్రెండు గుణములు నిండుగా గలవాడు ఈ భూమి సంతటిని ఏలజాలును. అట్లుకాక కనీసము మూడో, రెండో, ఒక్కటియో కలవాడుకూడ సంపదకలవా డనియే ఎరుగదగును.

వ్యా. ఈ సర్వగుణములు కలవాడు బ్రహ్మము నెరిగినవాడై సత్యకామాదిలక్షణములు కలవాడగును. "య స్తమాత్మాన మనువిద్య విజానాతి స సర్వాంశ్చ లోకానాప్నోతి సర్వాంశ్చ కామాన్". ఆత్మను విద్యాక్రమము ననుస

రించి తెలిసికొనువాడు సర్వలోకములను, సర్వకామములను పొందినవా డగును-అని శ్రుతి చెప్పుచున్నది.

ఈ పై పంద్రెండు గుణములలో త్రిభిః-మూడింటిచేతనో, ద్వాభ్యామ్-రెంటిచేతనో, ఏకతః వా-కనీస మొక్కదానిచేతనో, అర్థితః-అర్థ మీతనికి కలిగినది అను నర్థమున-ధనవంతుడైనవాడు; స్వమ్ - దైవమయిన ధనము, అస్తి కలవాడు, అని, వేదితవ్యః - ఎరుగదగినవాడు.

ఇట్టి గుణములు ఒకటి రెండైనను కలవాడే ధనవంతుడు కాని యితరుడు కాదు అని తాత్పర్యము.

దమ స్త్యాగోఽప్రమాదశ్చ ఏతేష్వమృత మాహితమ్,
తాని సత్యముఖా న్యాహు ర్బ్రాహ్మణా యే మనీషిణః. 22

ప్ర.అ. దమః-దమము, త్యాగః-త్యాగము, అప్రమాదః, చ-ప్రమాదము పడకుండుట-, ఏతేషు-వీనియందు; అమృతమ్-ముక్తి, ఆహితమ్-ఉంచబడినది, యే-ఏ, మనీషిణః-బుద్ధికుశలత గల, బ్రాహ్మణాః-బ్రహ్మతత్త్వ మెరిగినవారు కలరో, తే-వారు; తాని - ఆ గుణములను, సత్యముఖాని-సత్యప్రధానము లని, ఆహుః-చెప్పుదురు.

తా. దమము, త్యాగము, ప్రమాదము పొందకుండుట అను ఈగుణము లందే ముక్తి నెలకొనియున్నది. బ్రహ్మవేత్తలగు బుద్ధిమంతులు ఇవి సత్యప్రధానము లనియే చెప్పుదురు.

వ్యా. దమః-ఇంద్రియములను వశమున పెట్టుకొనుట, త్యాగః - కర్మఫలముల నన్నింటిని ఈశ్వరున కర్పించుట, అప్రమాదః-పరతత్త్వము విషయమున ఏమరుపాటు లేకుండుట, అమృతమ్ - ముక్తి, సత్యముఖాని - సత్యము ప్రధానముగా గలవి. అనగా పైమూడుగుణములు సత్యసహితములైనపుడే ముక్తి ఫలము లభించునని తాత్పర్యము.

అవ. దమము పదునెనిమిది దోషములు లేనిదైనపుడే పదునెనిమిది గుణములు కలది యగునని చెప్పుచున్నారు-

దమో హ్యష్టాదశగుణః ప్రతికూలం కృతాకృతే
అనృతం చాభ్యసూయా చ కామార్థౌ చ తథాస్పృహా, 23

క్రోధః శోక స్తథా తృష్ణా లోభః పైశున్యమేవ చ,
మత్సరశ్చ విహింసా చ పరితాప స్తథాఽరతిః. 24
అపస్మార శ్చాతివాద స్తథా సంభావనాత్మని,
ఏతై ర్విముక్తో దోషై ర్యః స దాన్తః సద్భి రుచ్యతే. 25

ప్ర.అ. దమః-దమము, అష్టాదశగుణః - పదునెనిమిది గుణములు కలది, హి-కదా(పదునెనిమిది దోషములు లేకుండుటయే గుణములుండుట కావున పదునెనిమిదిదోషములను వక్కాణించుచున్నారు). కృత, అకృతే-కృతమునందును, అకృతమునందును, ప్రతికూలమ్-విరుద్ధమైన నడవడి, అనృతమ్-అసత్యము, అభ్యసూయా,చ-అసూయయు,కామ,అర్థౌ-కామము,అర్థము,తథా-అట్లే, స్పృహా-వాంఛయు, క్రోధః-క్రోధము,శోకః-శోకము, తథా-అట్లే, తృష్ణా-తీరని వాంఛ, లోభః-పిసినిగొట్టుతనము, పైశున్యమ్,ఏవ,చ-కొండెములు చెప్పుట,మత్సరః-మత్సరము, విహింసా, చ-ఇతరులను పీడించుట, పరితాపః-మిక్కిలిగా దుఃఖపడుట,అరతిః-మంచిపనులయెడ ప్రీతి లేకుండుట, అపస్మారః-చేయవలసినపనులను మరచిపోవుట, అతివాదః-ఇతరులను దూషించుట, ఆత్మని-తన విషయమున, సంభావనా-గొప్పతనమును భావించుట-, ఏతైః-ఈ, దోషైః-దోషములతో, యః-ఎవడు, విముక్తః-విడువబడినవాడో, సః-అతడు, దాన్తః-దమగుణము గలవాడు అని, సద్భిః-సజ్జనులచేత, ఉచ్యతే.చెప్పబడును.

తా. కృతాకృతములయందు విరుద్ధమైన నడవడి, అసత్యము, అసూయ, కామము, అర్థము, వాంఛ, క్రోధము, శోకము, అతివాంఛ, లోభము, కొండెములు చెప్పుట, హింస, పరితాపము, మంచిపనులయెడ ప్రీతి లేకుండుట, చేయవలసిన పనులను మరచిపోవుట, పరనింద, తన్ను గొప్పవాడని తలచుట-అను నీ పదునెనిమిది దోషములను విడచినవాడే దాంతుడని సజ్జనులు చెప్పుదురు. ఈ పదునెనిమిదిదోషములు లేకుండుటయే దమము లక్షణము.

వ్యా. కృత మనగా కర్మము - అది వేదవిహితమైనది, అకృత మనగా - ఉపవాసవ్రతాదికము - ఇందు కృతమున ప్రతికూలమనగా అశ్రద్ధ, ఆలస్యము మొదలగు లక్షణము. అకృతమున ప్రతికూల మనగా ఆకలి, జిహ్వాచాపల్యము మొదలగునది. ఈ రెండును కలిపి ఒక దోషము. అర్థః -

ధనార్జనయందు అతియత్నము, స్పృహా - ధనాదులయందు మిక్కుటమగు కోరిక, తృష్ణా-ఎంత సంపాదించినను కోరిక తీరకుండుట, పైశున్యమ్-కొండెములు చెప్పుట, పరితాపః-ఎల్లవేళల దుఃఖించుట, అరతిః-సత్కార్యముల యెడ శ్రద్ధ లేకుండుట, అపస్మారః-కర్తవ్యమును విస్మరించుట, అతివాదః-ఇతరులను మాటలతో నొప్పించుట, సంభావనా-గొప్పగా భావించుట.

మదోఽష్టాదశదోషః స్యా త్త్యాగో భవతి షడ్విధః,
విపర్యయాః స్మృతా ఏతే మదదోషా ఉదాహృతాః. 26

ప్ర.అ. మదః-మదము, అష్టాదశదోషః-పదునెనిమిది దోషములు గలది, స్యాత్-అగును, త్యాగః-త్యాగము, షడ్విధః-ఆరువిధములైనవి, భవతి-అగును, ఏతే-ఈ, విపర్యయాః-చెప్పబోవు త్యాగమునకు విరుద్ధములైనవి, మదదోషాః-మదదోషములుగా, ఉదాహృతాః-చెప్పబడుచున్నవి.

తా. పైనిచెప్పిన పదునెనిమిది దోషములు గలది మదము. త్యాగము ఆరువిధములు. దాని విరుద్ధగుణములు ఆరు. అవియు నివియు కలిపి మొత్తము ఇరువదినాలుగు మదదోషములు.

వ్యా. దమమునకు విరుద్ధములుగా పైని పేర్కొన్న పదునెనిమిది దోషములతోపాటు త్యాగమునకు విరుద్ధములగు ఆరుదోషములు గలవు. అవి ఐశ్వర్యము కలిగినపుడు పొంగిపోవుట, అప్రియము కలిగినపుడు క్రుంగిపోవుట, తనవారికడ బిచ్చమెత్తుట, పాత్రత యెరిగి దానము చేయకుండుట, యోగ్యత కలిగియుండియు ఇష్టాపూర్తములను సత్కర్మము లాచరింపకుండుట, కామమును విడనాడకుండుట అనునవి. ఈ ఇరువదినాలుగును మదదోషములు.

శ్రేయాంస్తు షడ్విధ స్త్యాగ స్తృతీయో దుష్కరో భవేత్,
తేన దుఃఖం తరత్యేవ భిన్నం తస్మిన్ జితం కృతే. 27

ప్ర.అ. షడ్విధః - ఆరువిధములగు, త్యాగః - త్యాగము, శ్రేయాన్-మేలైనది, తృతీయః - మూడవది, దుష్కరః - సులభముగా చేయరానిది, భవేత్ - అగును, తస్మిన్ - అది, కృతే - చేయబడగా, భిన్నమ్ - భేదభావము, జితమ్ - గెలువబడిన దగును, తేన - దానిచేత, నరుడు, దుఃఖమ్ - దుఃఖమును తరతి, ఏవ - తప్పక దాటును.

తా. త్యాగము ఆరువిధములుగా నుండును. అది మేలైనది. ఆ ఆరింటిలో మూడవది సాధించుట మిక్కిలి కష్టము. సాధించినచో భేదభావమును గెలిచినట్లే. అప్పుడు నరుడు దుఃఖమును దాటును.

వ్యా. శ్రేయాన్ - ప్రశస్తతరము - అనగా దమముకంటె మేలైనదని భావము. తృతీయః - ముందు చెప్పబోవువానిలో మూడవది - కామత్యాగము అనునది, తస్మిన్ కృతే సతి - దానిని సాధించినచో, భిన్నమ్ - ఇది భావార్థక రూపము. భేదభావము - ద్వైతభావమని యర్థము. దుఃఖమ్ - ద్వైతమువలన కలిగిన దుఃఖము. "ద్వితీయాద్వై భయం భవతి యత్రాన్యత్పశ్యత్యన్యచ్ఛృణోతి తదల్ప మథ యదల్పం తద్దుఃఖమ్" - రెండవదానివలన భయము కలుగుచున్నది. మరియొకదానిని చూచుచున్నాడు, మరియొకదానిని వినుచున్నాడు - అనగా అది అల్పము - అదియే దుఃఖము - అను ఈ మొదలగు శ్రుతులవలన కామత్యాగమువలననే దుఃఖములన్నియు నశించుట యను మోక్షము కలుగుచున్నది. కామ మనగా రెండవదాని ఉనికిని భావించుటవలననే గదా ఏర్పడును. దానిని త్యజించుట యనగా ఏకత్వమును విడువక అనుభవించుట. శ్రుతియు - "యదా సర్వే ప్రముచ్యన్తే కామా యేఽస్య హృది స్థితాః, అథ మర్త్యోఽమృతో భవత్యత్ర బ్రహ్మ సమశ్నుతే" - హృదయమున నెలకొన్న కామములన్నియు పూర్తిగా జారిపోయినచో మానవుడు అమృతుడగును. బ్రహ్మమును పొందును - అని చెప్పుచున్నది.

అవ. త్యాగమునే వివరించుచున్నారు-

శ్రేయాంస్తు షడ్విధస్త్యాగః శ్రియం ప్రాప్య న హృష్యతి,
ఇష్టాపూర్తే ద్వితీయం స్యా న్నిత్యవైరాగ్యయోగతః, 28
కామత్యాగశ్చ రాజేన్ద్ర స తృతీయ ఇతి స్మృతః,
అప్యవాచ్యం వదన్త్యేతం స తృతీయో గుణః స్మృతః. 29

ప్ర.అ. షడ్విధః - ఆరువిధములగు; త్యాగః - త్యాగము; తు - మాత్రము; శ్రేయాన్ - మిక్కిలి గొప్పది; శ్రియమ్ - సంపదను; ప్రాప్య - పొంది; న హృష్యతి - పొంగిపోవడు; ఇష్టాపూర్తే - ఇష్టము, పూర్తము అనునవి; ద్వితీయమ్ - రెండవది; స్యాత్ - అగును; నిత్య, వైరాగ్య, యోగతః - అచంచలమగు వైరాగ్య సంబంధముతో; కామత్యాగః - కామమును త్యజించుట.

అనున దేదో; సః - అది; రాజేన్ద్ర - రాజేంద్రా!, తృతీయః - మూడవది; ఇతి- అని; స్మృతః - భావింపబడినది; ఏతమ్ - ఈ గుణమును; అవాచ్యమ్, అపి - చెప్పకొనరానిదనియు, వదన్తి - చెప్పదురు, సః - అట్టిది, తృతీయః - మూడవ, గుణః - గుణముగా, స్మృతః - భావింపబడినది.

తా. ఆరు విధములగు త్యాగము మిక్కిలి దొడ్డది. అందు మొదటిది సంపదను పొంది పొంగిపోకుండుట. నిత్య వైరాగ్యభావనతో ఇష్టము, పూర్తము అను సత్కర్మముల నాచరించుట రెండవది. నిత్యవైరాగ్యభావనతో కామత్యాగము చేయుట మూడవది. ఇట్టి స్థితిని చెప్పకొనరాదనియు నందురు.

వ్యా. శ్రియమ్ - సంపద మరియు విద్యాసంపదను పొంది, న హృష్యతి - గర్వపడరాదని తాత్పర్యము. ఇష్టమనగా - యాగము, హోమము మొదలగునది. పూర్త మనగా చెరువులు త్రవ్వించుట, తోటలు వేయించుట మొదలగునది.

కామత్యాగము పరమోత్కృష్టస్థితిని చెప్పచున్నారు - అప్యవాచ్యమ్ - అది అవాచ్యమనియు చెప్పదురు. ఈ మాటకు కామత్యాగవిషయము ప్రకటించుకొనరాదనియు, ప్రకటించుకొన్నచో నిష్ఫలమనియు నొక అర్థము చెప్పకొననగును. అవాచ్యము - అడుగరాని దాని నడిగినను ఇచ్చివేయవలయు ననుట మరియొక అర్థము. 'యదా సర్వే ప్రముచ్యన్తే' - అను చోట సర్వే - అన్నియు అను దానికి అదే అర్థము.

'నిత్యవైరాగ్యయోగతః' అనుదానిని మధ్యమణిన్యాయము ననుసరించిన అటు రెండవదైన ఇష్టాపూర్తనిర్వహణమునకు, ఇటు మూడవదగు కామత్యాగమునకు అన్వయించుకొనదగును. అప్పడు అహంకారభావన నశించుట యను పరమోన్నతస్థితిని చెప్పినట్లగును.

త్యక్తై ర్ద్రవ్యై ర్యద్భవతి నోపయుక్తైశ్చ కామతః,
న చ ద్రవ్యై స్తద్భవతి నోపయుక్తైశ్చ కామతః. 30

ప్ర.అ. యత్ - ఏది - ఏ నిష్కామభావము, త్యక్తైః - వదలివేయబడిన, ద్రవ్యైః - ద్రవ్యములతో, భవతి - ఏర్పడునో, తత్ - అది, కామతః - కామమువలన, ఉపయుక్తైః - అనుభవింపబడినవానితో, న భవతి - ఏర్పడదు, తత్ - అది, ద్రవ్యైః - ద్రవ్యములతో, చ - మరియు, కామతః - కామముతో, ఉపయుక్తైః - అనుభవింపబడు వానితో, న - ఏర్పడదు.

తా. నిష్కామత్వము ఆ యా విషయములను పూర్తిగా వదలినపుడే ఏర్పడును. పూర్తిగా కామభావనతో అనుభవించినను ఏర్పడదు. ద్రవ్యములు పుష్కలముగా వశమైనను ఏర్పడదు. వశమైన వానిని కామముతో అనుభవించినను ఏర్పడదు.

వ్యా. కొందరు విషయసుఖములను అనుభవపూర్వకముగా పరిత్యజింప వలయు నందురు. దాని నిట ఖండించుచున్నారు. ద్రవ్యములనగా స్త్రీలు, వస్తువాహనములు మొదలగునవి. త్యక్తైః - వానిని త్రికరణశుద్ధిగా దరికి రానీని స్థితి యందే, తద్ - ఆ నిష్కామత్వము, భవతి - ఏర్పడును. కామతః-ఉపయుక్తైః, న భవతి - కామపూర్వకముగా అనుభవించినచో ఏర్పడదు. "న జాతు కామః కామానా ముపభోగేన శామ్యతి" కామము కామముల అనుభవముచేత ఎన్నటికిని అణగదు - అని చెప్పి యున్నారు.

న చ ద్రవ్యై స్తద్భవతి - ఆయాద్రవ్యములు పుష్కలముగా లభించినను నిష్కామత్వము కలుగదు. కామతః ఉపయుక్తైః చ న భవతి - అట్లు పుష్కలముగా లభించినవానిని తనివితీర అనుభవించినను కామత్యాగము సిద్ధింపదు. సందేహనివారణమునకై కామత్యాగమునుగూర్చి నొక్కి వక్కాణించుచున్నారు. విషయములను పరిపూర్ణముగా దరికి రానీకుండుటయే కామత్యాగము కాని అనుభవించుటవలనగాని, సమృద్ధిగా పొందుటవలనగాని కామముతో పొందినవానిని శుష్కింపజేయుటవలన కాని యేర్పడదని తాత్పర్యము.

న చ కర్మస్వసిద్ధేషు దుఃఖం తేన చ న గ్లపేత్,
సర్వై రేవ గుణై ర్యుక్తో ద్రవ్యవానపి యో భవేత్. 31

ప్ర.అ. సర్వైః - సర్వవిధములగు, గుణైః - కీర్తి మొదలగు లక్షణములతో, యుక్తః, ఏవ - కూడినవాడే అయినను, యః - ఎవడు, ద్రవ్యవాన్ - సర్వద్రవ్యములు కలవాడు, భవేత్ - అగునో, సః - అట్టివాడు, కర్మసు - ఆ యా కార్యములు, అసిద్ధేషు - నెరవేరనిచో, దుఃఖమ్ - దుఃఖమును, న - పొందరాదు, చ - మరియు, తేన - దానితో, న గ్లపేత్ - క్రుంగి పోరాదు.

తా. కీర్తి మొదలగునవియు, వస్తువాహనాదులును సమృద్ధిగా నున్నవానికిని ఒక్కొక్కవేళ ఆ యా కార్యములు సిద్ధింపవు. అట్టి సమయములలో దుఃఖము పొందరాదు. కొంచెము దుఃఖము కలిగినను క్రుంగి పోరాదు.

వ్యా. గుణైః - కీర్తిమొదలగు గుణములచేత, న దుఃఖమ్ - దుఃఖము పొందరాదని భావము, న గ్లపేత్ - క్రుంగిపోరాదు. ఇట్లు 29,30,31 శ్లోకములతో మూడవదైన కామత్యాగమును గట్టిగా విశదీకరించిరి.

అప్రియే చ సముత్పన్నే వ్యథాం జాతు న గచ్ఛతి,
ఇష్టాన్ పుత్రాంశ్చ దారాంశ్చ న యాచేత కదాచన. 32

ప్ర.అ. చ - మరియు, అప్రియే - ప్రియముకానిది, సముత్పన్నే - కలుగగా, జాతు - ఎన్నడును, వ్యథామ్ - దుఃఖమును, న గచ్ఛతి - పొందడు, కదాచన - ఎన్నటికిని, ఇష్టాన్ - ఇష్టులైన, పుత్రాన్ - పుత్రులను, దారాన్, చ - భార్యలను, న యాచేత - యాచింపడు.

తా. అప్రియము కలిగినను ఎన్నడు దుఃఖపడడు. ఇష్టులైన పుత్రాదులను యాచింపడు.

వ్యా. అప్రియ మనగా కీర్తి, ధనము మొదలగునవి నశించుట. అట్టియెడ క్రుంగిపోకుండుట నాలుగవ త్యాగగుణము. పుత్రాదులనైనను యాచింపకుండుట అయిదవ త్యాగగుణము.

అవ. ఆరవగుణమును చెప్పుచున్నారు-

అర్హతే యాచమానాయ ప్రదేయం తచ్ఛుభం భవేత్.

ప్ర.అ. అర్హతే - యోగ్యుడగు, యాచమానాయ-యాచకునకు, ప్రదేయమ్ - ఈయవలయును, తత్ - అది, శుభమ్ - శుభము, భవేత్ - అగును.

తా. యోగ్యుడైనవాని కడిగినది యీయవలయును. దానివలన శుభము కలుగును.

వ్యా. అడుగుకొనకుండుట ఒక మహాగుణము. అడిగినది యోగ్యున కిచ్చుట మరియొక మహాగుణము - అని తాత్పర్యము.

అవ. షడ్విధత్యాగఫలమును వక్కాణించుచున్నారు-

అప్రమాదీ భవేదేతైః స చాప్యష్టగుణో భవేత్. 33

ప్ర.అ. ఏతైః - వీనితో, అప్రమాదీ - పొరపాటు లేనివాడు, భవేత్- కావలయును, సః, చ - అదియు - ప్రమాదము లేకుండుటయు, అష్టగుణః - ఎనిమిదిగుణములు కలది, భవేత్ - అగును.

తా. త్యాగగుణము లారింటి విషయములో మానవుడు ఎందును పొర పడరాదు. ప్రమాదము లేకుండుట అనునది యెనిమిది విధములు.

సత్యం ధ్యానం సమాధానం చోద్యం వైరాగ్యమేవ చ,
అస్తేయం బ్రహ్మచర్యం చ తథాఽసంగ్రహమేవ చ. 34

ప్ర. అ. సత్యమ్-యథార్థము పలుకుట, ధ్యానమ్-ఈశ్వరునిగాని, పర మాత్మనుగాని చెదరకుండ మనసున పట్టుకొనుట, సమాధానమ్-సంప్రజ్ఞాతము-తెలియవచ్చునది, అసంప్రజ్ఞాతము - తెలియకుండునది అను రూపమున రెండు విధములైన సమాధి. పరబ్రహ్మమునందు లగ్నమైయుండు భావస్థితి, చోద్యమ్-తర్కము, వైరాగ్యమ్ - లోకవిషయములందు విరక్తి, అస్తేయమ్ - ఇతరుల సొమ్మును దొంగిలింపకుండుట, బ్రహ్మచర్యమ్-స్త్రీసంగము లేకుండుట, అసంగ్రహః - సొమ్ము కూడబెట్టకుండుట.

తా. సత్యము, ధ్యానము, సమాధి, తర్కము, వైరాగ్యము, దొంగ తనము చేయకుండుట, బ్రహ్మచర్యము, సొమ్ము కూడబెట్టకుండుట అను ఈ యెనిమిదియు ప్రమాదములేని స్థితి లక్షణములు.

వ్యా. ధ్యానమనగా మూర్తిధ్యానముకాని, పరమాత్మానుసంధానముకాని కావచ్చును. చోద్యమనగా తర్కము-దీనివలన కామ్యాదులయందు దోషములు తెలియవచ్చును. వైరాగ్యమనగా ఇంద్రియములను విషయములపై ప్రసరింప నీకుండుట, అసంగ్రహమనగా ఇతరులిచ్చిన సొమ్మును గ్రహించి కూడబెట్ట కుండుట.

అవ. అప్రమాదమునకు విరుద్ధమైన ప్రమాదమును తెలియజెప్పుటకై చెప్పినదానిని సంగ్రహించుచున్నారు-

ఏవం దోషా మదస్యోక్తా స్తాన్ దోషాన్ పరివర్జయేత్,
తథా త్యాగోఽప్రమాదశ్చ స చాప్యష్టగుణో మతః. 35

ప్ర.అ. ఏవమ్-ఇట్లు, మదస్య - మదముయొక్క, దోషాః - దోషములు, ఉక్తాః-చెప్పబడినవి, తాన్-అ, దోషాన్-దోషములను, పరివర్జయేత్-పూర్తిగా వదలవలయును, తథా-అట్లే, త్యాగః-త్యాగము, అప్రమాదః, చ-ప్రమాదము పొందకుండుటయును, సః, చ-అదియును, అష్టగుణః-ఎనిమిదిగుణములుకలదిగా, మతః-భావింపబడినది.

తా. ఇట్లు మదదోషములు చెప్పితిమి. అట్లే త్యాగము, అప్రమాదము అనువానిస్వరూపముకూడ వివరింపబడినది. అదియు ఎనిమిదిగుణములతో నున్నది-

అష్టౌ దోషాః ప్రమాదస్య తాన్ దోషాన్ పరివర్జయేత్,
ఇన్ద్రియేభ్యశ్చ పఞ్చభ్యో మనసశ్చైవ భారత,
అతీతానాగతేభ్యశ్చ ముక్త్యుపేతః సుఖీ భవేత్. 36

ప్ర. అ. ప్రమాదస్య - ప్రమాదమునకు సంబంధించి, అష్టౌ - ఎనిమిది, దోషాః-దోషములు, తాన్-ఆ, దోషాన్-దోషములను, పరివర్జయేత్-పూర్తిగా వదలవలయును, పఞ్చభ్యః-అయిదయిన, ఇన్ద్రియేభ్యః-ఇంద్రియములవలనను, మనసః, చ-మనస్సువలనను, అతీత, అనాగతేభ్యః, చ-వచ్చినవియు, రానున్న వియు నగు క్లేశములవలన, ముక్తి-ఉపేతః-ముక్తిని పొందినవాడు, సుఖీ-సుఖ వంతుడు, భవేత్-అగును.

తా. ప్రమాదమనగా శ్రద్ధ లేకుండుట. దాని దోషములు ఎనిమిది. వానిని బుద్ధిశాలి పూర్తిగా వదలివేయవలయును. ఇంద్రియము లైదింటివలన నగుదోషము లైదు. మనస్సు తెచ్చెడు అనర్థము ఆరవది. పుత్రుడు మరణిం చుట మొదలగువానివలన కలిగెడి క్లేశము ఏడవది. ఇది అతీతము-గడచినది. అనాగత మనగా రానున్నది. పుత్రులు కలుగకుండుట మొదలగునది. ఇది యెనిమిదవది. వీనినుండి ముక్తిపొందినవాడు సుఖవంతు డగును.

వ్యా. ఇంద్రియములు, మనస్సు తెచ్చు అనర్థము లనగా ఆ యా విష యములందు రాగద్వేషాదులవలన పుట్టెడు క్లేశములు. ముక్తి-ఉపేతః-ముక్తిని పొందినవాడు.

అవ. లోగడ దమ త్యాగ, అప్రమాదములను పేర్కొని అవి సత్య ముఖములని చెప్పియున్నారు. దానిని వివరించుచున్నారు-

సత్యాత్మా భవ రాజేన్ద్ర సత్యే లోకాః ప్రతిష్ఠితాః,
తాంస్తు సత్యముఖా నాహుః సత్యే హ్యమృతమాహితమ్. 37

ప్ర. అ. రాజేంద్ర-మహారాజా, సత్యాత్మా-సత్యమున చిత్తము కలవాడ వగుము, సత్యే-సత్యమందు, లోకాః-లోకములు, ప్రతిష్ఠితాః-నెలకొనియున్నవి, తాన్-ఆ దమత్యాగఅప్రమాదములను, సత్యముఖాన్-సత్యమే ప్రధానమైనవిగా, ఆహుః-(తత్త్వజ్ఞులు) చెప్పుదురు, సత్యే, హి - సత్యమునందు, అమృతమ్-మోక్షము, ఆహితమ్-చక్కగా నిలిచియున్నది.

తా. రాజా! సత్యము తప్పని చిత్తముకలవాడ వగుము. ఏలయన సత్యమునందే లోకములన్నియు నెలకొనియున్నవి. దమము, త్యాగము, అప్రమాదము అను మహాగుణములకును సత్యమే పట్టుగొమ్మ. సత్యమునందే మోక్షము నెలకొనియున్నది.

వ్యా. సత్యాత్మా-ఇచట ఆత్మయనగా చిత్తము, సత్యమునందు చిత్తము కలవాడని యర్థము. తాన్-వానిని- దమ, త్యాగ, అప్రమాదములనువానిని.

అవ. దోషములను తుడిచివేయుటచేతనే తపస్సిద్ధియగునని బ్రహ్మ ఏర్పాటుచేసెనని చెప్పుచున్నారు-

నివృత్తేనైవ దోషేణ తపోవ్రత మిహాచరేత్,
ఏతద్ధాతృకృతం వృత్తం సత్యమేవ సతాం వ్రతమ్. 38

ప్ర. అ. నివృత్తేన-తొలగింపబడిన, దోషేణ, ఏవ-దోషముచేతనే, తపోవ్రతమ్-తపోవ్రతమును, ఇహ-ఇచట, ఆచరేత్-ఆచరింపవలయును, ఏతత్-ఇది, ధాతృకృతమ్-బ్రహ్మచేసిన, వృత్తమ్-నడవడి, సతామ్-సత్పురుషులకు, సత్యమ్, ఏవ-సత్యమే, వ్రతమ్-వ్రతము.

తా. దోషములు తొలగించుకొనియే తపస్సును, వ్రతమును ఆచరింపవలయును. ఇది బ్రహ్మచేసిన కట్టుబాటు. సత్పురుషులకు సత్యమే వ్రతము.

అవ. ప్రశ్న వ్యాఖ్యానమును ఉపసంహరించుచున్నారు-

దోషై రేతై ర్విముక్తస్తు గుణై రేతైః సమన్వితః,
ఏత త్సమృద్ధ మత్యర్థం తపో భవతి కేవలమ్. 39

ప్ర.అ. ఏతైః - ఈ, దోషైః - దోషములతో, విముక్తః - విడివడినవాడు, ఏతైః - ఈ, గుణైః - గుణములతో, సమన్వితః - కూడినవాడు -

చేయునట్టి, ఏతత్ - ఈ, అత్యర్థమ్ - గొప్పదియగు, సమృద్ధమ్ - పరిపూర్ణ మగు, తపః - తపస్సు, కేవలమ్ - ముక్తినొసగునది, భవతి - అగును.

తా. రాజా! పైనిచెప్పిన దోషము లన్నింటిని రూపుమాపుకొనవలయును. గుణములను సంపాదింపవలయును. అట్టివాడు చేయు తపస్సు పండి గొప్పదై ముక్తిదాయకమగును.

యన్మాం పృచ్ఛసి రాజేన్ద్ర సంక్షేపాత్ ప్రబ్రవీమి తే,
ఏతత్ పాపహరం పుణ్యం జన్మమృత్యుజరాపహమ్. 40

ప్ర.అ. రాజేన్ద్ర! - మహారాజా!, మామ్-నన్ను, యత్ - దేనినిగూర్చి, పృచ్ఛసి - అడిగెదవో, దానిని, తే - నీకు, సంక్షేపాత్ - సంగ్రహముగా, ప్రబ్రవీమి - దృఢముగా బోధించుచున్నాను, ఏతత్ - ఇది, పాపహరమ్ - పాపమును తుడిచివేయునది, పుణ్యమ్ - పుణ్యమైనది, జన్మ, మృత్యు, జరా - అపహమ్ - పుట్టుక, చావు, ముదిమి అనువానిని తొలగించునది.

తా. రాజా! నీవడిగినదానిని సంక్షేపముగా చక్కగా బోధించితిని. ఈ జ్ఞానము పాపమును పోకార్చును. పుణ్యమును పెంచును. చావు, పుట్టుక, ముసలితనము అను దోషములను రూపుమాపును.

అవ. ఇట్లు విద్యాసాధనములను తెలిసికొని, అధ్యయనమువలన పొందెడు వేదమునుండి తెలియదగిన విషయములు పెక్కులున్నట్లు తలచుచు తెలియదగినవానిలో మిక్కిలి మిన్న అయిన దేది? అని అడుగుచున్నాడు-

ధృతరాష్ట్ర ఉవాచ-ధృతరాష్ట్రు డిట్లు పలికెను.

ఆఖ్యానపఞ్చమై ర్వేదై ర్భూయిష్ఠం కథ్యతే జనః,
తథా చాన్యే చతుర్వేదా స్త్రివేదాశ్చ తథాపరే. 41

ప్ర.అ. ఆఖ్యానపఞ్చమైః - ఆఖ్యానము అయిదవదిగా గల, వేదైః - వేదములచేత, భూయిష్ఠమ్ - అన్నింటికంటె పెద్దదియగు పరబ్రహ్మము, జనః - జగత్తుగా, కథ్యతే - చెప్పబడుచున్నది, తథా - అట్లే, అన్యే - మరి కొందరు, చతుర్వేదాః - నాలుగువేదములు అనుచున్నారు, తథా - అట్లే, పరే - మరికొందరు, త్రివేదాః - మూడు వేదములు అనుచున్నారు.

తా. ఇతిహాసపురాణములతోపాటు నాలుగు వేదములు పరబ్రహ్మమని చెప్పుదానిని జగమే అని కొంద రందురు. మరికొందరు వేదము ప్రతిపాదించు పురుషులు నలుగు రందురు. ఇంక కొందరు తెలియదగినవి మూడే అందురు.

వ్యా. ఆఖ్యానమనగా ఇతిహాసము, పురాణము అనునది. అది అయిదవ దిగా గల వేదములు - అనగా నాలుగువేదములు, ఇతిహాసపురాణములు అనువాని ద్వారా, భూయిష్ఠమ్ - అన్నింటికన్న మిన్నయగునది - పరమాత్మ, "సర్వం ఖల్విదం బ్రహ్మ" - ఇది యంతయు బ్రహ్మమే కదా!, "బ్రహ్మైవేదం విశ్వమ్" - ఈ విశ్వమంతయు బ్రహ్మమే, "పురుష ఏవేదం సర్వమ్" - ఇదియంతయు ఆపురుషుడే - మున్నగు వాక్యములచేత ప్రతిపాదింపబడు పర బ్రహ్మము, జనః - స్థావరజంగమాత్మకమైన జగత్తు అని, కథ్యతే - చెప్పబడు చున్నది.

అన్యే - ఇతరశాఖలవారు, చతుర్వేదాః - నాల్గింటిని తెలుపుచున్నవి - అనువారు. అనగా పురుషులు నల్వురు అనువారు మరియొకవిధమువారు - అని తాత్పర్యము. 1. బాహ్యమైన శరీరపురుషుడు. 2. ఛందఃపురుషుడు 3. వేద పురుషుడు 4. మహాపురుషుడు - అను పురుషస్వరూపములు నాలుగు అనువారు కొందరు. ఛందఃపురుషుడనగా గాయత్రిమున్నగు నియతమైన అక్షరములు పాద ములుగల వేదము ఋక్కు. ఇది యజుస్సామములనుకూడ ఉపలక్షణచేత గ్రహించును. వేదపురుషు డనగా కర్మమునందు మనుష్యులను ప్రచోదనచేయు బ్రాహ్మణగ్రంథములు. మహాపురుషుడనగా వీన్నింటినిమించిన పరమాత్మ. ఇట్లు పురుషులు నాలుగువిధములని తెలియదగునని చెప్పువారు చతుర్వేదులు. మరి కొందరు త్రివేదులు - క్షరము, అక్షరము, ఉత్తమము అనుస్వరూపముతో పురుషుని తెలియదగుననువారు. "క్షరః సర్వాణి భూతాని కూటస్థోఽక్షర ఉచ్యతే, ఉత్తమః పురుషస్త్వన్యః పరమాత్మే త్యుదాహృతః" - అని సర్వభూతములు క్షరస్వరూపము. కూటస్థుడగు జీవుడు అక్షరస్వరూపము. ఉత్తమపురుషుడు ఈ రెంటికంటె వేరయినవాడు. అతనినే పరమాత్మ యందురు - అని భావించువారు త్రివేదులు.

"క్షరం ప్రధానమమృతాక్షరం హ క్షరాత్మానా వీశతే దేవ ఏకః" - క్షరము ప్రధానము మొదటిది. అమృతము అక్షరము జీవుడు, కూటస్థుడు అను పేర్లుగల అక్షరస్వరూపము రెండవది. ఈ క్షరాక్షరములను పాలించు దేవు డొక్కడు-అని ఈ వాక్యముకూడ మూడు విషయములను బోధించుచున్నది. ఈ తాత్పర్యము కలవారు త్రివేదులు.

ద్వివేదా శ్చైకవేదాశ్చాప్యనృచశ్చ తథాపరే,
తేషాం తు కతరః సః స్యా ద్యమహం వేద వై ద్విజమ్. 42

ప్ర. అ. అపి - మరియు, ద్వివేదాః - తెలియదగినవి రెండే అనువారు, ఏకవేదాః - చ - తెలియదగినది ఒకటే అనువారు, తథా - అట్లు, పరే - మరికొందరు, అనృచః - ఋక్కు లేదనువారు, తేషామ్ - వీరిలో, సః - అతడు, కతరః - ఎవ్వడు, స్యాత్ - అగును, యమ్ - ఎవనిని, అహమ్ - నేను, ద్విజమ్ - బ్రహ్మవేత్తనుగా, వేద - ఎఱుగుదునో.

తా. మరికొందరు ద్వివేదులు. వేరుకొందరు ఏకవేదులు. ఇతరులు కొందరు ఋక్కులేదనువారు. ఇట్టివారిలో నిజమైన బ్రహ్మవేత్త యని నేనెవనిని గుర్తింపవలయును?

వ్యా. ద్వివేదులనగా తెలియదగినవి రెండుగల వనువారు. ఒకటి శబ్ద బ్రహ్మము. రెండు - పరము. శబ్ద బ్రహ్మ మనగా - వాచ్యమునకు వాచకమునకు అభేదము కనుక, నామరూపాత్మకమైన ప్రపంచము. పరమనగా దానికతీతమైన పరతత్త్వము.

ఏకవేదులు - "ఏకధైవానుద్రష్టవ్యం నేహ నానాస్తి కిఞ్చన" - అంతటిని ఒక్కటియను భావముతో చూడవలయును. ఇచట ఒకటికంటె ఎక్కువ ఏదియు ఏమాత్రము లేదు - అని తెలియదగినది ఒక్కటియే కలదనువారు.

అనృచులు - ఋచ్యతే - స్తూయతే ఇతి ఋక్కు. ఋక్కు అనగా స్తుతింపబడువాడు - ఈశ్వరుడు. అతడు పరమాత్మకంటె భిన్నముగా లేదను వారు అనృచులు - బ్రహ్మాద్వైతవాదులు. ఏకవేదులకు సమాధి జారినపుడు ద్వైతము కలదు. సమాధిలో లేదు. అనృచుల కన్ననో రెండు అవస్థలయందును ద్వైతము లేకుండుట సమానము. ఇట్లే యిరువురకు భేదమని తెలియవలయును.

ఇట్లు పంచవేదులు, చతుర్వేదులు, త్రివేదులు, ద్వివేదులు, ఏకవేదులు, అనృచులు - అను ఆరువిధముల వారిలో ఎవనిని బ్రహ్మవేత్తగా తెలియదగునో చెప్పవలసినదని ప్రశ్న తాత్పర్యము. ద్విజమ్ - బ్రాహ్మణునిగా - బ్రహ్మవేత్తనుగా-వేద - ఎరుగుదును?

ఇందు 'భూయిష్టం జనః' అను మొదటిది విశేషాద్వైతపక్షము. రెండవది ఈశ్వరుడు లేడు అను పక్షము. ఇది సాంఖ్యులు, మీమాంసకులు చెప్పునది. త్రివేదులు - పాతంజలులు - వీరు జీవునకు ఈశ్వరునకు జగత్తునకు భేదము కలదందురు - ఇది మూడవపక్షము. ద్వివేదులనువారు ఔడులోములు - కార్య స్వరూపముతో భేదము, కారణ స్వరూపముతో అభేదమును సత్యమని వీరు భావింతురు. ఎట్లనగా హారము, కేయూరము అను స్వరూపముతో కార్యమైన ఆభరణము సత్యమే, అట్లే వానికి కారణమగు కనకమును సత్యమే. అట్లీ కార్యమైన జగత్తు, కారణమైన జగత్కర్తయు సత్యమని వీరి సిద్ధాంతము. కారణమును భావించునపుడు కార్యకారణములు విడివిడిగా ఉండవు. ఇది నాలుగవ పక్షము.

ఏకవేదులు - వీరికి వ్యావహారికముగానైనను ద్వైతభావన యుండును. అది స్వప్నము, భ్రమ వలె నిజమునకు లేకపోయినను వ్యవహారదశలో కన్పట్టుచున్నది కనుకను, మోక్షమే దానిని రూపుమాపవలయును కనుకను అది యున్నట్లే. ఇది అయిదవపక్షము.

అన్నచుల దృష్టిలో త్రాటియందు పాము లేక దండ అనునది కల్పితమే కాని సత్యము కాదు. అట్లే ఆత్మయందు జాగ్రత్స్వప్నములు కల్పించబడినవే కాని సత్యములు కావు. ఇది ఏకవిదులకు - అన్నచులకు భేదము. ఇది ఆరవ పక్షము.

"అధ్యారోప అపవాదాభ్యాం నిష్ప్రపఞ్చం ప్రపఞ్చ్యతే" అధ్యారోప, అపవాదములతో జగత్తులేనితనము స్పష్టము చేసికోదగును - అను న్యాయమునుబట్టి మొదటి నాలుగుపక్షములను వ్యవహారముయొక్క పరమార్థదృష్టితో అధ్యారోప భావనతో చెప్పుట జరిగినది. చివరిదగు 'అన్నచ' పక్షము అపవాదదృష్టితో వ్యవహారమును తొలగించి చూచుటతో ఏర్పడినది. ఇక అయిదవదగు ఏకవాద పక్షము అధ్యారోపఅపవాదముల సంకీర్ణతలవలన ఏర్పడినది. దీనిని అనిర్వచనీయదృష్టి అందురు. అట్లు అధ్యారోప, అపవాదవ్యామిశ్రరూపములగు మూడు చూపులతో శాస్త్రము ప్రవర్తిల్లుచున్నది.

'ఆత్మకృతేః పరిణామాత్' - అను సూత్రమున అధ్యారోపకాలమున పరిణామదృష్టి సూచింపబడినది. అనగా బ్రహ్మమే జగత్తుగా పరిణమించినది.

ఎట్లన - బంగారమే ఆభరణముగ మార్పునొందినది. శ్రుతియు దీని నిట్లు చెప్పుచున్నది.

"తదాత్మానం స్వయ మకురుత సత్యం చానృతం చ సత్య మభవత్".
ఆ బ్రహ్మమే తన్ను స్వయముగా రూపొందించుకొనెను. సత్యము, అనృతము, సత్యము-అయ్యెను.

ఇచట సత్యమనగా వ్యవహారమునుబట్టి ఏర్పడు జాగ్రదవస్థ, త్రాడు మొదలగునది. అనృత మనగా నిజముగా లేనిదయ్యును ఉన్నట్లు కన్పట్టు స్వప్నము, పాము మొదలగునది. ఈ రెండు రూపములుగల సత్య మనగా మూడుకాలములలో చెరగని బ్రహ్మము. ఇది పై శ్రుతికి అర్థము.

"తథా ఆత్మని చైవం విచిత్రాశ్చ హి" అని సూత్రము. స్వప్న కాలమున మనస్సునందును, జాగ్రదవస్థలో మాయ, ఇంద్రజాలము మొదలగు వానినిబట్టి ఎండమావులలో నీరు మొదలగు సృష్టులు విచిత్రముగా కన్పట్టు చున్నవి. అవి యన్నియు అనుభవమునకు వచ్చుచున్నవి కావున లేవనుటకు వీలులేదు. యథార్థజ్ఞానమునుబట్టి యున్నవనుటకును వీలు లేదు. ఇట్లీ బ్రహ్మము నందు విచిత్రము, వివరించి తెలుపరానిది అగు సృష్టి ఏర్పడుచున్నదని పై సూత్రమున కర్థము. ఇట్లు అనిర్వచనీయత్వమును - విస్పష్టముగా ఇది దీని స్థితి అని చెప్పరాని లక్షణమును శ్రుతియు చెప్పుచున్నది. "కో అద్ధా వేద క ఇహ ప్రవోచత్ కుత ఆజాతా కుత ఇయం విసృష్టిః" దాని నెవ్వడు ఎరుగడు, చెప్పలేదు - అని శ్రుతివాక్యతాత్పర్యము. దీనిని వ్యామిశ్రదృష్టి అందురు. వ్యామిశ్ర మనగా ఒకదానితో నొకటి కొంచెముగనో గొప్పగనో కలిసిపోయి యుండుట.

ఇక అపవాదదృష్టిని "అహ చ తన్మాత్రమ్" అను సూత్రము సూచించు చున్నది.

"స యథా సైన్ధవఖిల్య ఉదకే ప్రాస్త ఉదక ఏవాను విలీయేత. స యథా సైన్ధవ ఘనోఽనన్తరోఽ బాహ్యః కృత్స్నో రసఘనః. ఏవం వా అరేఽ యమాత్మా కృత్స్నః ప్రజ్ఞానఘనః" అని శ్రుతియు నీ అర్థమును తెలియ జేయుచున్నది. సైంధవలవణము ఉప్పునీటిచే ఏర్పడుచున్నది. నీటియందే

లయమై పోవుచున్నది. విడిగా ఉన్నపుడు అది తానొక ప్రత్యేకవస్తువుగా కన్పట్టు చున్నది. అట్లే బ్రహ్మపదార్థము నుండి ఏర్పడిన యీ ప్రపంచము బ్రహ్మము నందే లయ మగుచున్నది. విడిగా చూచినచో ప్రపంచముగా కన్పట్టినను సమాధి యందు బ్రహ్మమేకాని మరియొకటి కాదు. ఇది అపవాదదృష్టి. అనగా జగత్తుగా కనబడు దానిని త్రోసివైచి సత్యమగు బ్రహ్మమునే చూచుట.

ఈ మూడు దృష్టులతో జనులకు సత్యమును బోధించుటకై శాస్త్రము బయలుదేరుచున్నది.

సంక్షేపశారీరకమను గ్రంథమున-

"ఆరోపదృష్టి రపవాదకదృష్టి రేవం
వ్యామిశ్రదృష్టి రితి దృష్టివిభాగ మేనమ్,
సంగృహ్య సూత్రకృదయం పురుషం ముముక్షుం
సమ్యక్ప్రబోధయితు ముత్సహతే క్రమేణ" అనునది మొదలుకొని
"శ్రుతివచాంసి మునిస్మరణాని చ
ద్వయవిశారదగీరపి సర్వశః,
త్రయమపేక్ష్య దృశాం త్రితయం వినా
న హి ఘటా ముపయాన్తి కదాచన" అనునంతవరకు గల శ్లోకములు పై విషయమునే ప్రతిపాదించుచున్నవి.

సూత్రకారులు మోక్షవాంఛగల పురుషునికి చక్కని జ్ఞానబోధ చేయుటకై ఆరోపదృష్టి, అపవాదదృష్టి, వ్యామిశ్రదృష్టి అను మూడింటిని ఏర్పరచెను. పై మూడుదృష్టులను ఆధారముగా గొనక శ్రుతిస్మృతిగ్రంథములలో ఆరితేరినవారైనను బ్రహ్మవస్తువును చక్కగా బోధింపజాలరని పైశ్లోకముల తాత్పర్యార్థము.

పై ఆరు విధములలో ఏపక్షము బ్రహ్మమును చక్కగా నెరిగించును? అని ప్రశ్న పరమార్థము.

అవ. ఇట్లు అనేకపక్షములు పుట్టగా సనత్సుజాతులు సిద్ధాంతమును నిరూపించుచున్నారు.

సనత్సుజాత ఉవాచ - సనత్సుజాతు డిట్లు చెప్పెను.

ఏకస్య వేదస్యాజ్ఞానా ద్వేదాస్తే బహవః కృతాః,
సత్యస్యైకస్య రాజేన్ద్ర సత్యే కశ్చిదవస్థితః.

ప్ర.అ. ఏకస్య - ఒక్కటి యగు, వేదస్య - వేదముయొక్క, అజ్ఞానాత్ - చక్కనిజ్ఞానము లేకపోవుటవలన, ఏకస్య - ఒక్కటియగు, సత్యస్య - సత్యమునకు, తే - ఆ, బహవః - పెక్కువిధములగు, వేదాః - తెలియదగు విషయములు, కృతాః - చేయబడినవి, రాజేన్ద్ర - రాజేంద్రా! సత్యే - సత్యమగు బ్రహ్మము విషయమున, కశ్చిత్ - ఒకానొకడు, అవస్థితః - తగిలియుండువాడు.

తా. రాజా! తెలియదగిన దొక్కటే విషయము. అది సత్యమగు బ్రహ్మము. ఆ ఒక్క సత్యమును నిరూపించుటకై పెక్కువేదములు కల్పింపబడినవి. సత్యమున చెదరక నిలుచువా డెవ్వడో ఒక్కడు మాత్రమే యుండును.

వ్యా. బ్రహ్మ మొక్కటియే తెలియదగినది. అది సత్యము-అనగా మూడుకాలములందును ఎట్టిమార్పులు లేనిది. అది తెలియరానికారణమున ఉపాసింపదగు వేద్యములు పెక్కులు కల్పితము లైనవి. సత్యస్వరూపజ్ఞానము కలుగుటకై అసత్యములైనవాని బ్రహ్మము కానితనమును వేదమే వక్కాణించియున్నది. "తదేవ బ్రహ్మ త్వం విద్ధి నేదం యదిద ముపాసతే"- అదియే బ్రహ్మమని నీవు తెలిసికొనుము. నీవు ఉపాసించునది బ్రహ్మము కాదు- అని ఆ సత్యమగు బ్రహ్మము విషయమున ఎవ్వడో ఒక్కడు మాత్రమే స్థిరబుద్ధితో నిలిచియుండును. అనగా బ్రహ్మమును పొందుట అతిదుష్కరమని తాత్పర్యము. శ్రుతియు జగత్తు అజ్ఞానమువలననే ఏర్పడుచున్నదని యిట్లు చెప్పుచున్నది. "తుచ్ఛేనాభ్యపిహితం యదాసీత్ తమస స్తన్మహినాఽజాయతైకమ్"-తుచ్ఛమైన తమస్సుచేత సర్వవ్యాపకమైన బ్రహ్మము కప్పబడియున్నది. తమస్సుయొక్క మహిమచేత ఈ ప్రపంచము పుట్టుచున్నది. ఇచట తమస్సు అనగా అజ్ఞానము. అది బ్రహ్మమును కప్పివైచినది. అది ఒక్కటియే యయ్యు అజ్ఞానముయొక్క మహిమవలన ప్రపంచాకారముగా ఏర్పడినది. త్రాడు అజ్ఞానముచేత సర్పమువలె తోచినవిధముగా బ్రహ్మము ప్రపంచముగా తోచుచున్నదని భావము.

ఏవం వేద మవిజ్ఞాయ ప్రాజ్ఞోఽహమితి మన్యతే,
దాన మధ్యయనం యజ్ఞో లోభాదేతత్ ప్రవర్తతే. 44

ప్ర.అ. ఏవమ్-ఈ విధముగా, వేదమ్-పరతత్త్వమును, అవిజ్ఞాయ-ఎఱుగక, మానవుడు, అహమ్-నేను, ప్రాజ్ఞః-గొప్పతెలివి కలవాడనని, మన్యతే-

భావించుచున్నాడు. దానమ్-దానము, అధ్యయనమ్-వేదములను వల్లించుట, యజ్ఞః-యజ్ఞము-అను, ఏతత్-ఇది, లోభాత్-బాహ్యసుఖలోభమువలన, ప్రవర్తతే-సాగుచున్నది.

తా. పరబ్రహ్మస్వరూపమును చక్కగా నెఱుగక మానవుడు నేను తెలివిగలవాడ ననుకొనుచున్నాడు. బాహ్యసుఖములందలి పేరాసతో దానము, అధ్యయనము, యజ్ఞము అనువానిని సాగించుచున్నాడు.

వ్యా. వేద మనగా వేద్యము- తెలియదగినది, అది సత్యము, అద్వయము, ఆనందమయము అయిన బ్రహ్మము. లోభాత్-బాహ్యసుఖలోభమువలన దానాదులను సాగించుచున్నాడు. ఇట్లు చెప్పుటవలన దానాదులు వర్జ్యములని తాత్పర్యము కాదు. బాహ్యసుఖలోభము లేకుండ ఆచరించినప్పుడు అవి మోక్షఫలదాయకము లగునని తాత్పర్యము.

సత్యాత్ ప్రచ్యవమానానాం సఙ్కల్పశ్చ తథా భవేత్,
తతో యజ్ఞః ప్రతాయేత సత్యస్యై వావధారణాత్. 45

ప్ర.అ. సత్యాత్-సత్యమగు పరబ్రహ్మమునుండి, ప్రచ్యవమానానామ్-జారిపోవుచున్నవారి, సంకల్పః, చ - సంకల్పముకూడ, తథా-అట్లే, భవేత్-అగును, తతః-దానివలన, సత్యస్య-వేదవచనముయొక్క, అవధారణాత్, ఏవ-నిశ్చయజ్ఞానమువలననే, యజ్ఞః-యజ్ఞము, ప్రతాయేత-విస్తరింపబడుచున్నది.

తా. సత్యమగు పరమాత్మనుండి జారిపోవువారికి తుచ్ఛఫలములందే సంకల్పము కలుగును. కావుననే వేదమును ప్రమాణముగా గొని యజ్ఞయాగాదులను పెంపొందించును.

వ్యా. సంకల్పః-పరమానందమునుండి జారిపోయినవారికి తుచ్ఛమగు ఆనందములందు సంకల్పము కలుగును. దానితో తుచ్ఛఫలముల నిచ్చు జ్యోతిష్టోమాదియజ్ఞములను పెల్లుగా చేయుచుండును. దీనికిని వేదవచనమునే ప్రమాణముగా గొనును. జ్యోతిష్టోమేన స్వర్గకామో యజేత"- స్వర్గమును కోరువాడు జ్యోతిష్టోమయాగము చేయవలయును.

సత్య మెరుకపడినపుడుమాత్రము ఆతడు కృతకృత్యు డగును.

మనసాఽన్యస్య భవతి వాచాఽన్యస్యాథ కర్మణా,
సంకల్పసిద్ధః పురుషః సంకల్పా నధితిష్ఠతి. 46

ప్ర.అ. అన్యస్య-ఒకనికి, మనసా-మనస్సుతో, యజ్ఞః-యజ్ఞము, భవతి-అగును, అన్యస్య-మరియొకనికి, వాచా - వాక్కుతో, యజ్ఞః భవతి - యజ్ఞము అగును, అథ-పిదప, అన్యస్య-వేరొకనికి, కర్మణా-కర్మముతో, భవతి-యజ్ఞము అగును. సంకల్పసిద్ధః-సంకల్పము నెరవేరిన, పురుషః-పురుషుడు, సంకల్పాన్-సంకల్పములను, అధితిష్ఠతి-ఆక్రమించును.

తా. మనసా-ఇది దేవతాధ్యానాదిరూపమైన మానసయజ్ఞము, వాచా-బ్రహ్మయజ్ఞజపాదిరూపమైన వాగ్రూపయజ్ఞము, కర్మణా-ప్రసిద్ధమైన జ్యోతిష్టోమాదికము ఇందులో మూడవదానికంటె రెండవది, రెండవదానికంటె మొదటిది గొప్పది. సత్యసంకల్పుడగు బ్రహ్మవేత్త బ్రహ్మలోకాదుల నాక్రమించును. ఇచట సంకల్పమనగా సమ్యగ్జ్ఞానము. శ్రుతియు నిట్లే చెప్పుచున్నది-

"ఆప్నోతి స్వారాజ్యమ్ ఆప్నోతి మనసస్పతిమ్,
వాక్పతి శ్చక్షుష్పతిః శ్రోత్రపతి ర్విజ్ఞానపతిః".

స్వరా ట్టనగా పరబ్రహ్మ. అతని భావము స్వారాజ్యము బ్రహ్మైశ్వర్యము. వాక్పతి, చక్షుష్పతి, శ్రోత్రపతి, విజ్ఞానపతియు స్వారాజ్యమును పొందును. మనసస్పతి, వాక్పతి - ఇత్యాదుల కర్థ మేమనగా బ్రహ్మవస్తువును మనసున ధ్యానించి సిద్ధి పొందినవాడు, వాక్కుతో స్తుతించి సిద్ధి పొందినవాడు వాక్పతి - ఇట్లే తక్కినవియు నెరుగదగును.

అనైభృత్యేన చైతస్య దీక్షితవ్రత మాచరేత్,
నామైత ద్ధాతునిర్వృత్తం సత్యమేవ సతాం పరమ్. 47

ప్ర.అ. ఏతస్య, చ - ఈ సంకల్పము యొక్క, అనైభృత్యేన - గట్టితనము లేకపోవుటచేత, దీక్షితవ్రతమ్ - దీక్షితవ్రతమును, ఆచరేత్ - చేయవలయును, ఏతత్ - ఈ, నామ-దీక్షితుడను పేరు, ధాతునిర్వృత్తమ్ - 'దీక్ష వ్రతాదేశే' అను ధాతువునుండి ఏర్పడినది, సతామ్ - సత్పురుషులకు, సత్యమ్, ఏవ - సత్యమగు పరబ్రహ్మమే, పరమ్ - మిక్కిలి ఉత్తమము.

తా. పరబ్రహ్మమునందు సంకల్పము (అందరకు) గట్టిగా నిలువదు. దానికై దీక్షితవ్రతము నాచరింపవలయును. దీక్షితశబ్దము 'దీక్ష వ్రతాదేశే' అను ధాతువునుండి పుట్టినది. సత్పురుషులకుమాత్రము సత్యమే సర్వశ్రేష్ఠము.

వ్యా. వ్రతాద్యనుష్ఠానము బ్రహ్మమునందు సంకల్పము దృఢపడుటకు మాత్రమే అని శ్లోకతాత్పర్యము. అనైభృత్యేన - స్థిరముగా నుండకపోవుటచేత - చెదరిపోవుటవలన - దీక్షితశబ్దము దీక్షధాతువునుండి ఏర్పడినదని చెప్పుటచేత కర్మమువలన నేర్పడిన సంస్కారము మధ్యలో వచ్చినది కావున నశించునదియే కాని స్థిరముగా నిలుచునది కాదని చెప్పినట్లయినది. దీక్షితవ్రతములు - బిచ్చమెత్తుట, మౌనము పాటించుట మొదలగునది.

సత్యముమాత్రము కృతకము కాదు కావున నశింపనిదగును అని 'సత్యమేవ సతాం పరమ్' అను దాని భావము.

అవ. దీనినే స్పష్టము చేయుచున్నారు-

జ్ఞానం వై నామ ప్రత్యక్షం పరోక్షం జాయతే తపః,
విద్యాద్ బహు పఠన్తం తు ద్విజం వై బహుపాఠినమ్. 48

ప్ర.అ. జ్ఞానమ్, నామ - జ్ఞాన మనునది, ప్రత్యక్షమ్ - ప్రత్యక్షమగు ఫలము కలది, తపః - తపస్సు, పరోక్షమ్ - పరోక్షమైన ఫలము కలదిగా, జాయతే - అగుచున్నది, బహు - ఎక్కువ, పఠన్తం - చదువుచుండు - ద్విజం - బ్రాహ్మణుని, బహుపాఠినం - గొప్పగా చదివినవాడు - అని, విద్యాత్ - ఎరుగవలయును.

తా. జ్ఞానమునకు ఫలము ప్రత్యక్షము. తపస్సునకు పరోక్షము. ఎక్కువగా వేదములు చదువుచు జ్ఞానముపొందని బ్రాహ్మణుని 'బహుపాఠి' అనదగును.

వ్యా. ప్రత్యక్షమనగా శోకమును, మోహమును పోగొట్టి మోక్షఫలము నొసగునది అని భావము. తపస్సు కాయికము, వాచికము, మానసికము అని మూడువిధము లైనది. ఇవి పరోక్షఫల మనగా స్వర్గాదులను కలుగజేయునది. విద్యాత్ - తెలియవలయును అనుటలో పరోక్షజ్ఞానమును పరిహరించుకొనవలయు ననుట తాత్పర్యము.

అవ. పైనిచెప్పిన విషయమును ముగించుచున్నారు-

తస్మాత్ క్షత్రియ మా మంస్థా జల్పితేనైవ వై ద్విజమ్,
య ఏవ సత్యా న్నాపైతి స జ్ఞేయో బ్రాహ్మణ స్త్వయా. 49

ప్ర.అ. క్షత్రియ - రాజా!, తస్మాత్ - అందువలన, జల్పితేన, ఏవ- వేదములను వల్లెవేయుటచేతనే, ద్విజమ్, మై - బ్రాహ్మణుడని, మా మంస్థాః- తలపకుము, యః - ఎవడు. సత్యాత్ - సత్యమగు పరమాత్మనుండి, న, ఉపైతి- తొలగిపోవడో, సః - అతడు, బ్రాహ్మణః - బ్రాహ్మణుడని, త్వయా - నీచేత, జ్ఞేయః - తెలియదగినవాడు.

తా. రాజా! వేదములను వల్లించినంతమాత్రమున బ్రాహ్మణు డనుకొన కుము. సత్యమునుండి తొలగనివాడే బ్రాహ్మణుడని గుర్తింపుము.

వ్యా. జల్పిత మనగా అర్థము తెలియకుండ వేదములను వల్లించుట; సత్యాత్ - పరమాత్మ స్వరూపమునుండి. శ్రుతియు నిట్లు చెప్పుచున్నది - "యో వా ఏత దక్షరం గార్గి విదిత్వాఽస్మాల్లోకాత్ ప్రైతి స బ్రాహ్మణః"-గార్గీ! ఈ అక్షర స్వరూపము నెరిగి ఈ లోకమునుండి వెడలువాడు బ్రాహ్మణుడు. ఈ వాక్యము అపరోక్షజ్ఞానినే బ్రాహ్మణుడని చెప్పుచు ఇతరుడు బ్రాహ్మణుడు కాజాల డని సూచించుచున్నది.

అవ. ఇట్లయినచో అధ్యయనము వ్యర్థమను భావన కలుగునని శంకించి అది అవసరమే అని నిరూపించుచున్నారు-

ఛందాంసి నామ క్షత్రియ తాన్యథర్వా
పురా జగౌ మహర్షిసఙ్ఘ ఏషః,
ఛందోవిదస్తే య ఉత నాధీతవేదా
న వేదవేద్యస్య విదుర్హి తత్త్వమ్. 50

ప్ర. అ. క్షత్రియ- రాజా! పురా - పూర్వము, అథర్వా-అథర్వమహర్షి, యాని - ఆ, ఛందాంసి - వేదములను, జగౌ - గానము చేసెనో, ఏషః - ఈ మహర్షిసంఘః - మహర్షుల సముదాయము, జగౌ - పాడెనో, తాని - అవియే, ఛందాంసి - ఛందస్సులు - వేదములు, ఉత - మరియు, యే - ఎవరు, అధీత వేదాః - ఉపనిషత్తులతోపాటు వేదములను అర్థజ్ఞానముతో పఠించిరో, తే-వారు, ఛందోవిదః - ఛందస్సు నెరిగినవారు. న - కారు, హి - ఏలయన; తే - వారు, వేదవేద్యస్య - వేదవేద్యుడైన పరమాత్మయొక్క, తత్త్వమ్ - తత్త్వమును, న విదుః - తెలియరు.

తా. రాజా! పూర్వము అథర్వమహర్షి యీ వేదములను పాడెను. అటుపై మహర్షులసంఘము వీనిని గానముచేసెను. కేవలము పఠించి అర్థము తెలిసికొన్నంతమాత్రమున ఛందోవేత్త లనజాలము. వానిద్వారా వేదవేద్యమగు పరమాత్మతత్త్వము నెరుగకున్నచో వేదము నెరిగినట్లు కాదు.

వ్యా. ఏషః - ఈతడు ఉపనిషత్తులలో ప్రసిద్ధమైనవాడని భావము. అథర్వుడు, మహర్షులు గానము చేసిన జ్ఞానబోధకములైన ఉపనిషత్తులే ఛందము లని తాత్పర్యము "ఛాదయన్తి హ వా ఏనం ఛందాంసి పాపాత్ కర్మణః" అనుశ్రుతి పాపకర్మమునుండి కాపాడునవి అను నర్థము చెప్పుచున్నది. "ప్లవా హ్యేతే అదృఢా యజ్ఞరూపాః" - అని అథర్వణోపనిషత్తునందు యజ్ఞములు పాపమునుండి రక్షించుటలో సమర్థములు కావని నిరూపించుటచేత బ్రహ్మ విద్యను బోధించు వేదములే ముఖ్యచ్ఛందస్సులనియు, ఇతరములకు ఛంద శ్శబ్దము గౌణార్థమున - అప్రధానార్థమున ప్రయుక్తమనియు తెలియుచున్నది.

ఉత - మరియు, అధీతవేదులు ఛందోవేత్తలు కారు. వేదమును తక్కిన విద్యలలో ఒకదానివలె భావించి అర్థజ్ఞానమును సామాన్యకారముగా పొందుచు పాఠములు వల్లెవేయువారు అధీతవేదులు. అనగా ఇది పైచూపే కాని లోచూపు కాదని భావము. ఏలయన, వేదవేద్యుడగు జ్ఞానరూపపురుషుని యాథార్థ్యము తెలియజాలరుగదా! "అధేన్వా చరతి మాయయైష వాచం శుశ్రువామఫలా మపు ష్పామ్" - అనువేదవాక్యములు అఫలము, అపుష్పము అయిన వాక్కు అనగా సత్యమును బోధింపనివాక్కు అని అర్థము. "పుష్పం హి ఫలం వాచః సత్యమ్" అనుశ్రుతి వాక్కునకు పుష్పము ఫలము సత్యమే అని చెప్పుచున్నది. సత్య మనగా పరబ్రహ్మమే.

ఛందాంసి నామ ద్విపదాం వరిష్ఠ
స్వచ్ఛన్దయోగేన భవన్తి తత్ర,
ఛన్దోవిద స్తేన చ తానధీత్య
గతా న వేదస్య న వేద్యమార్యాః. 15

ప్ర.అ. ద్విపదాం వరిష్ఠ - మనుజశ్రేష్ఠుడా! తత్ర - సత్యమగు పర మాత్మ విషయమున, ఛందాంసి నామ - వేదములు, స్వచ్ఛందయోగేన - స్వాతంత్ర్య సంబంధముతో, భవన్తి - అగుచున్నవి, తేన, చ - దానిచేతనే -

బ్రహ్మజ్ఞానముచేతనే, ఛందోవిదః - ఛందోవేత్తలగుచున్నారు, తాన్ - వానిని, అధీత్య - పొంది, ఆర్యాః - మహానుభావులు, వేదస్య - వేదముయొక్క, వేద్యమ్ - తెలియదగినవిషయమును - బ్రహ్మమును, న గతాః - పొందరు, ఇతి న - అని లేదు. తప్పకపొందుదు రని భావము.

తా. ద్విపదామ్ - రెండు పాదములుగల నరులలో, వరిష్ఠ - శ్రేష్ఠుడా! బ్రహ్మజ్ఞానమునుగూర్చి ప్రశ్నించుచున్న కారణమున ధృతరాష్ట్రుడు నరులలో శ్రేష్ఠు డగుచున్నాడు.

తత్ర - అందు - సత్యమగు పరమాత్మ విషయమున అని భావము. ఛందములు, స్వచ్ఛందయోగేన, భవన్తి - స్వతంత్రముగా ప్రవర్తించునని భావము. కర్మకాండ అర్థమునకువలె బ్రహ్మకాండ అర్థజ్ఞానమునకు కూడ నడుమ మరియొక అనుష్ఠానముతో పని లేదు. అనగా ఆ యా వైదిక కర్మముల నాచరించువారు మరియొక అనుష్ఠానముతో పనిలేకయే దాని అర్థజ్ఞానమును పొందినట్లు జ్ఞానకాండము నధ్యయనము చేసినవారును దాని అర్థజ్ఞానమును పొందుచున్నారు. దీని నీక్రింది దృష్టాంతముచే నిరూపించుకొనవచ్చును.

"తద్ధైత త్పశ్యన్నృషి ర్వామదేవః ప్రతిపేదేఽహం మనురభవం సూర్యశ్చ." సూర్యబింబమును గాంచుచు వామదేవఋషి నేను మనువ నైతిని సూర్యుడను అయితిని అని తెలిసికొనెను. అనగా చూచునపుడు మనువైనవాడు చూచినపిదప సూర్యుడయ్యెనని భావము. సూర్యుడగుట యనగా సూర్యునితో తాదాత్మ్యము పొందుట. అనగా దర్శించుట, సర్వాత్మభావము పొందుట అను రెండు పనులకు నడుమ 'నిలుచుండి పాడుచున్నాడు' అనుటవలె మరియొక కార్యము లేదనుట స్పష్టమగుచున్నది. వేదములు బ్రహ్మము విషయమున స్వచ్ఛందయోగముతో ప్రవర్తించుట యనగా వేదము లెవని ననుగ్రహించునో వానికి సూటిగా బ్రహ్మజ్ఞానమును కలిగించునని తాత్పర్యము. ఉపాసనాదులకు జ్ఞానము పొందుటకు సంబంధము లేదనియు తాత్పర్యము. [ఇది బ్రహ్మజ్ఞాన విషయమునందు మాత్రమే అని అనుసంధించుకొనవలయును. ఉపాసనాదులు సర్వాత్మనా వ్యర్థములని సంభావింపరాదు].

తేన చ - ఇచట 'చ' కారమునకు 'ఏవ' అనునది యర్థము. దానిచేతనే - తెలియవచ్చిన సత్యముచేతనే అని తాత్పర్యము. సత్యమగు బ్రహ్మమును

ప్రతిపాదించునదియే ఛందమని పూర్వము చెప్పియున్న కారణమున బ్రహ్మ జ్ఞానము పొందినవారే ఛందోవిదు లగుచున్నారు. కావున తాన్, అధీత్య - పర బ్రహ్మతత్త్వము నెరిగించువారిని పొంది, ఆర్యాః - ఆర్యులు - దోషములేని నడవడికలవారు, వేదస్య వేద్యమ్ - వేదముచే తెలియదగిన ఆత్మతత్త్వమును, న గతాః న - పొందరని లేదు. తప్పక పొందుదురని భావము. ఛందస్తత్త్వ మెరిగిన గురువు ఇతరులకు కూడ దాని నెరుకపడునట్లు చేయగలడని తాత్ప ర్యము. దీనిచేత "తద్విజ్ఞానార్థం స గురుమేవాభిగచ్ఛేత్" - ఆ జ్ఞానముకొరకు సాధకుడు గురువునే పొందవలయును - అను శ్రుత్యర్థము తెలియవచ్చుచున్నది.

అవ. అయినను బ్రహ్మతత్త్వ మంత సులభముగా నెరుకపడదని చెప్పుచున్నారు-

న వేదానాం వేదితా కశ్చిదస్తి
కశ్చి త్త్వేతాన్ బుధ్యతే వాఽపి రాజన్,
యో వేద వేదా న్న స వేద వేద్యం
సత్యే స్థితో యస్తు స వేదవేద్యమ్. 52

ప్ర.అ. వేదానామ్ - వేదముల, వేదితా - రహస్య మెరిగినవాడు, కశ్చిత్- ఒక్కడును, న, అస్తి - లేడు, తు - కాని, రాజన్ - రాజా! కశ్చిత్ - ఎవ్వడో యొక్కడు, ఏతాన్ - వీనిని, బుధ్యతే - ఎరుగును, యః - ఎవడు, వేదాన్ - వేదములను, వేద - ఎరిగెనో, సః - అతడు, వేద్యమ్ - తెలియదగిన ఆత్మ తత్త్వమును, న, వేద - ఎరుగడు, తు - కాని, యః - ఎవడు, సత్యే - సత్యమునందు, స్థితః - చెదరక నిలిచియుండునో, సః - అతడు, వేద్యమ్ - పరతత్త్వమును, వేద - తెలిసికొనెను.

తా. వేదముల రహస్య మందరకు తెలియునదికాదు. వానితత్త్వ మెవ్వ నికో ఒక్కనికి తెలియవచ్చును. వేదములను వల్లెవేసినవానికి తత్త్వము తెలిసి నట్లు కాదు. ఆత్మనిష్ఠ కలవానికే ఆత్మతత్త్వము ఎరుకపడును.

వ్యా. వేదితా - రహస్యమెరిగినవాడు - కశ్చిన్నాస్తి-ఎవ్వడును లేడు- ఇట్లు చెప్పుటలో తాత్పర్యము జ్ఞానము సులభము కాదని చెప్పుటయే. తరువాతి వాక్యములో ఈ అర్థమే కలదు. కశ్చిత్తు బుధ్యతే - రహస్యప్రతిపాదకములగు

వేదములను చిత్తశుద్ధి సంపూర్ణముగా పొందినవాడొక్కడు తెలిసికొనును. "యో వేద వేదాన్న స వేద వేద్యమ్"—'తత్త్వమసి' మొదలగు వాక్యముల అర్థములను అనుసంధానము చేయువాని యెఱుకయు సవికల్పకమే. నిర్వికల్పమైన జ్ఞానము సత్యనిష్ఠకలవానికే కలుగును. సర్వవృత్తులు నశించుట అనునది తుదిమెట్టుగా గల ప్రత్యక్‌చైతన్యమునందు చెదరక నిలుచుటయే సత్యనిష్ఠ. ఇట తెలియుట యనగా అట్టి నిర్వికల్పానందము పొందుటయే.

అవ : ఈ అర్థమునే మరియొకవిధముగా చెప్పుచున్నారు.

న వేదానాం వేదితా కశ్చి దస్తి
వేద్యేన వేదం న విదు ర్న వేద్యమ్,
యో వేద వేదం స చ వేద వేద్యం
యో వేద వేద్యం న స వేద సత్యమ్. 53

ప్ర.అ : వేదానాం - తెలియదగినవానిలో, వేదితా-తెలియునది, కశ్చిత్-ఒక్కటియు, న, అస్తి-లేదు, వేద్యేన-తెలియదగిన చేతముచేత, వేదమ్-వేదము ప్రతిపాదించు ఆత్మతత్త్వమును, న, విదుః-తెలియజాలరు, వేద్యమ్-తెలియవచ్చు ఆత్మకంటె భిన్నమైనదానిని కూడ, న, విదుః-తెలియరు.

యః-ఎవడు, వేదమ్-ఆత్మ పదార్థమును, వేద-ఎరుగునో, సః-అతడు, వేద్యం, చ-ఆత్మకంటె భిన్నముగా తెలియదగిన సర్వమును, వేద-ఎరుగును, యః-ఎవడు, వేద్యమ్-తెలియవచ్చు ఆత్మకంటె భిన్నమగుదానిని, వేద - ఎరుగునో, సః-అతడు, సత్యమ్-నిత్యచైతన్యరూపమగు పరమాత్మను, న, వేద-ఎరుగడు.

తా. తెలియదగు అహంకారాదులలో తెలిసికొనునది ఒక్కటియు లేదు. కావున వేద్యమగు చేతస్సుతో ఆత్మ నెవ్వరు తెలియజాలరు. మరియు ఆత్మకంటె భిన్నమగు జగత్తత్త్వముకూడ వారికి తెలియరాదు. ఆత్మ మెరిగినవానికే ఆత్మకంటె భిన్నమైనది యెఱుకపడును. కేవలము అనాత్మ నెరిగినవానికి పరతత్త్వ మెరుకపడదు.

వ్యా. ఈ శ్లోకమున వేదశబ్దమునకు పరమాత్మ అర్థము. వేద్యమనగా దానికంటె భిన్నముగా తెలియవచ్చు మనస్సు మొదలగునవియును, జగత్తును అర్థములు. 'వేదానామ్' అను పదమునకు మాత్రము అహంకారాదులని అర్థము. మనస్సు, బుద్ధి, చిత్తము, అహంకారము అను నివి జడములు. కనుక వీనిలో ఏ యొక్కటియు చైతన్యఘనమగు ఆత్మతత్త్వము నెరుగజాలవు. ఆ ఆత్మతత్త్వ మునే యిచట వేదశబ్దముచే వ్యవహరించుచున్నారు. ఆ ఆత్మతత్త్వముచేతనే సర్వము - మనస్సు, ఇంద్రియములు, జగత్తు - అనున దంతయు ఎరుకపడును కావున ఇది యంతయు వేద్యమగుచున్నది. వేద్యమంతయు జడము కనుక అది స్వతంత్రముగా దేనిని తెలియజాలదు కనుక జడమైన చేతముతో ఆత్మను, ఆత్మకు వేరైన ప్రపంచమును తెలియజాలము. అనాత్మ ఏల తెలియరా దనగా అది ఆత్మమువలన ఏర్పడినదే కదా!

కాని జడమే యగు బుద్ధివృత్తిచేత ఆత్మ తెలియవచ్చుచున్నది. "దృశ్యతే త్వగ్ర్యయా బుద్ధ్యా.'' నిశితమగు బుద్ధివలన కానవచ్చుచున్నది- అను శ్రుతి చెప్పు చున్నది కదా! అను శంకకు సమాధానము 'యో వేద వేదమ్' అని మొదలైన వాక్యముతో చెప్పుచున్నారు. ఆత్మ నెరిగినవాడే అనాత్మ యగు ప్రపంచాదికమును కూడ నెరుగును. ఏలయన సర్వము ఆత్మవలన నేర్పడినదే కదా! అయినచో అనాత్మ నెరిగినవాడు ఆత్మ నెరుగజాలడా? అను శంకకు నాలుగవపాదములో సమాధానము చెప్పుచున్నారు. ఆత్మకంటె భిన్నమైన జగదాదికమును చూచు చున్నవాడు బహిర్ముఖుడు కావున ఆతనికి పరతత్త్వ మెరుకపడదు. ఈ విషయము నీ క్రింది రెండు శ్రుతులు స్పష్టము చేయుచున్నవి.

"ఆత్మనో వా అరే దర్శనేన శ్రవణేన మత్యా విజ్ఞానే నేదం సర్వం విదితమ్" ఆత్మను దర్శించినవాడు ఆత్మనుగూర్చి విన్నవాడు, ఆత్మను భావించినవాడు, ఆత్మతత్త్వ మెరిగినవాడు ఈ సర్వమును తెలిసికొనుచున్నాడు. సర్వమనగా ఆత్మేతరమైన సర్వమును అని యర్థము.

"పరాఞ్చి ఖాని వ్యతృణత్ స్వయంభూ
స్తస్మాత్పరాన్ పశ్యతి నాన్తరాత్మన్."

స్వయంభువు ఇంద్రియములను బహిర్ముఖములను గావించి హింసించెను. కావున జీవి పరవిషయములనే చూచుచున్నాడు కాని అంతరాత్మను చూచుట లేదు.

ఇచట హింసించుట యనగా పరమాత్మదర్శనము లేకుండ చేయుటయే. దీనివలన ప్రపంచము నెరిగినవానికి పరమాత్మ యెరుకపడదనుట విదితమైనది.

యో వేద వేదాన్ స చ వేద వేద్యం
న తం విదు ర్వేదవిదో న వేదాః,
తథాఽపి వేదే న విదన్తి వేదం
యే బ్రాహ్మణా వేదవిదో భవన్తి. 54

ప్ర.అ. యః - ఏ చిదాత్మ, వేదాన్-ప్రమాణములను, వేద-ఎరుగునో, సః, చ - అదియే, వేద్యమ్ - ప్రమేయమును, వేద - ఎరుగును, తమ్ - ఆ చిదాత్మను మాత్రము, వేదాః - ప్రమాణములు, వేదవిదః - ప్రమాణముల నెరిగిన వారును, న, విదుః - తెలియరు, తథాఽపి - అట్లయినను, యే - ఎవరు, వేద విదః - వేదతత్త్వము నెరిగిన, బ్రాహ్మణాః - బ్రహ్మజ్ఞానసంపన్నులో, తే - వారు, వేదేన - వేదప్రమాణముచేత, విదన్తి - తెలియుదురు.

తా. సర్వప్రమాణముల నెరిగిన చిదాత్మకే ప్రమేయమగు పరతత్త్వము తెలియనగును. ఆ చిదాత్మను మాత్రము ప్రమాణములు కాని, ప్రమాణముల నెరిగినవారు కాని యెరుగరు. అయినను వేదరహస్యము నెరిగి బ్రహ్మజ్ఞానము దృఢపడినవారు మాత్రము వేదవాక్యముచేతనే ఆ పరమాత్మ నెరుగుదురు.

వ్యా. యః-జ్ఞానాకారమైన ఏ చిదాత్మ కలదో అది, వేదాన్-ప్రమాణము లను-దేనివలన నిశ్చయజ్ఞానము కలుగునో అది ప్రమాణము. వేదయన్తి - తెలుపుచున్నవి అను నర్థమున వేదము లనగా ప్రమాణములు. ఆ చిదాత్మయే, వేద్యమ్-ప్రమేయమగు-తెలియవలసినదగు ఆత్మనుకూడ - తెలియును. కాని ప్రమాణములు జడములు కావున పరమాత్మను తెలియజాలవు. ఇక అవి ప్రమాణ ము లగుట ఆత్మకంటె ఇతరములైనవాని విషయముననే అని భావింపవలయును.

తమ్-దానిని-ఆ పరతత్త్వమును-ప్రాణమునకు ప్రాణము, కంటికి కన్ను, చెవికి చెవి, మనస్సునకు మనస్సు అని ఉపనిషత్తులు కొనియాడినదియు ప్రాణా దులను ప్రవర్తింపజేయునదియు నగు ఆత్మను ప్రమాణములైన వేదములుగాని, ప్రమాణముల నెరిగిన వేదవేత్తలుగాని తెలియజాలరు. అనగా కేవలతర్కాదు లిట పనిజేయ వని తాత్పర్యము. "యతో వాచో నివర్తన్తే అప్రాప్య మనసా సహ" అని వాక్కులకు మనస్సునకు అందని స్థితిని వేదములే అభివర్ణించినవి కదా!

అయినచో గతి యేమి ?— చెప్పుచున్నారు. వేదమ్-సర్వము నెరుగు ఆత్మను, వేదేన-వేదముతో 'అహం బ్రహ్మాస్మి' మొదలగు వేదప్రమాణము ద్వారా, విదన్తి-ఎరుగుదురు. ఎట్టివారు-? వేదవిదః-వేదమును పఠించి, వేదము యొక్క అర్థ మెఱిగి, అది చెప్పిన పరమార్థమును అనుష్ఠానముద్వారా అనుభవ మునకు తెచ్చుకొన్న, బ్రాహ్మణాః-బ్రహ్మజ్ఞానము పొందినవారు.

అధ్యయనము, యజ్ఞము మొదలగునవి చిత్తమునకు సంస్కారము కలి గింపగా జ్ఞానవాక్యములద్వారమున లక్షణామార్గమున ఎరుగుదురని తాత్పర్యము.

అవ. దీని నొక దృష్టాంతముతో ప్రతిపాదించుచున్నారు-

ధామాంశభాగస్య తథా హి వేదా
యథా హి శాఖా హి మహీరుహస్య,
సంవేదనే చైవ యథాఽఽమనన్తి
తస్మిన్ హి సత్యే పరమాత్మనోఽర్థే. 55

ప్ర. అ. ధామాంశభాగస్య-చంద్రుని కళయొక్క, సంవేదనే - ఎఱు కలో, యథా - ఎట్లు, మహీరుహస్య - చెట్టుయొక్క, శాఖా - కొమ్మ - గ్రహింప బడునో, తథా - అట్లు, పరమాత్మనః - పరమాత్మయొక్క, అర్థే - విషయ మగు, తస్మిన్ - ఆ, సత్యే - సత్యమునందు, వేదాః - వేదములు, గ్రహింప బడునని, ఆమనన్తి - చెప్పుదురు.

తా. పాడ్యమినాటి చంద్రకళను గుర్తించుటకు చెట్టుకొమ్మ సూచకమై నట్లు వేదములు పరమపురుషార్థమైన ఆ సత్యమునకు సూచకములు.

వ్యా. 'శాఖాచంద్రన్యాయ' మని యొక న్యాయ మున్నది. పాడ్యమి నాటి చంద్రకళను అందరు తేలికగా గుర్తింపజాలరు. కావున ముందు దానిని చూచినవాడు చూడనివానికి చూపుటకు ప్రయత్నించునపుడు అదిగో ఆ చెట్టు కొమ్మకు ప్రక్కగా ఆకాశమున చూడుము అని చెప్పును. అనగా చూచువాడు ముందు చెట్టుకొమ్మను అక్కరలేకపోయినను - చూడవలయును. తరువాత దానిని వదలి ఆకాశమునందలి చంద్రరేఖను చూడవలయును. అట్లే సత్యమగు పరమాత్మ నెరుగుటకు వేదములు లక్షణామార్గమున సహకరించును. లక్షణ యనగా లక్షింపజేయునది. తెలిసికొనుటలో సహకరించునని తాత్పర్యము.

ధామమనగా తేజస్సు. ధామాంశు డనగా తేజోమయములగు అంశములు - కళలు కలవాడు - చంద్రుడు - అతని భాగ మనగా 'కళ' - పదునారవ భాగము.

అవ. ఇట్లు గురువును చేరుకొని వాక్యార్థజ్ఞానము పొందు ఉపాయమును జెప్పి యిప్పుడు గురువు లక్షణములను వక్కాణించుచున్నారు.

అభిజానామి బ్రాహ్మణం వ్యాఖ్యాతారం విచక్షణమ్,
యశ్ఛిన్నవిచికిత్సః స వ్యాచష్టే సర్వసంశయాన్. 56

ప్ర.అ. యః - ఎవడు, ఛిన్నవిచికిత్సః - నశించిన సంశయములు కలవాడో, సః - అతడు, సర్వసంశయాన్ - పరుల సర్వసంశయములను, వ్యాచష్టే - వివరించి రూపుమాపును. అట్టి, వ్యాఖ్యాతారమ్ - వ్యాఖ్యానము చేయునట్టి, విచక్షణమ్ - వివేకశాలి యగువానిని, బ్రాహ్మణమ్ - బ్రహ్మతత్త్వ మెరిగినవానినిగా, అభిజానామి - గుర్తింతును.

తా. సంశయముల నన్నింటిని త్రెంచివైచుకొని యితరుల సంశయములను రూపుమాపగల వ్యాఖ్యానకుశలుడగు వివేకశాలిని బ్రహ్మవేత్తగా నేను గుర్తింతును.

వ్యా. బ్రాహ్మణు డనగా బ్రహ్మవేత్త. అతని లక్షణములలో ఒకటి వ్యాఖ్యాత యగుట. ఉపక్రమము, ఉపసంహారము, ఏకవాక్యత మొదలగు తాత్పర్యమును నిర్ణయించు ఆరులింగముల ననుసరించి వాక్యార్థమును వివరించు నేర్పుగలవాడు వ్యాఖ్యాత. రెండవ లక్షణము-విచక్షణమ్-విన్న యర్థమును యుక్తులతో మననముచేయగలవాడు. మూడవలక్షణము-ఛిన్నవిచికిత్సః-నిదిధ్యాసన పరిపాకముచేత అపరోక్షసాక్షాత్కారము కలిగిన బలమువలన సంశయము లన్నియు రూపుమాపికొన్నవాడు, సర్వసంశయాన్ వ్యాచష్టే-ఇది నాలుగవ లక్షణము. పరులకు కలిగిన సర్వసంశయములను వివరించి చూపువాడు. సంశయములను వివరించుట యనగా తొలగించుట. ఈ నాలుగు లక్షణములు గల బ్రహ్మవేత్తను నేను గురువుగా భావింతునని సనత్సుజాతులు చెప్పుచున్నారు. ఇట్లు గురుతత్త్వ మెరిగిన సనత్సుజాతుడు ఉత్తమగురువై బ్రహ్మవేత్తయై బ్రహ్మ మగుచున్నాడని భావింపనగును.

నాస్య పర్యేషణం గచ్ఛేత్ ప్రాచీనం నోత దక్షిణమ్,
నార్వాచీనం కుత స్తిర్యఙ్నాదిశం తు కథఞ్చన. 57

ప్ర.అ. అస్య-ఆ పరమాత్మయొక్క, పర్యేషణమ్ - వెదకుటను గూర్చి, ప్రాచీనమ్-తూర్పుదిక్కునకు,న గచ్ఛేత్-పోరాదు,ఉత-అట్లు కాక,దక్షిణమ్-దక్షిణ దిక్కునకు, న-పోరాదు, అర్వాచీనమ్-మూలలకు, న గచ్ఛేత్-పోరాదు, తిర్యక్-అడ్డముగా పోవుట, కుతః - ఎక్కడిది? అదిశమ్ - దిక్కు తోచకయు, కథంచన- ఎన్నటికిని, న-పోరాదు.

తా. ఆ పరమాత్మను తూర్పు, దక్షిణము, మూలలు, క్రిందిభాగము-అను నీ మొదలుగా వెదుకరాదు. అతడు దిశలు లేనివాడు.

వ్యా. పర్యేషణ మనగా వెదకు చోటు. పరమాత్మను తూర్పు మొదలగు దిక్కులందును, ఆగ్నేయము మొదలగు మూలలందును వెదుకరాదు. అనగా అంతట ఉన్నవానిని ఎక్కడనో ఒకచోట వెదకిన ప్రయోజన ముండదు. లోపల వెలుపల అంతట ఏకాకారముతో పట్టుకొనవలయునని భావము. పరమాత్మకు దేశకాలపాత్రవిభాగము లేదని తాత్పర్యము.

అవ. దీనినే వివరించుచున్నారు.

తస్య పర్యేషణం గచ్ఛేత్ ప్రత్యర్థిషు కథంచన,
అవిచిన్వ న్నిమం వేదే తపః పశ్యతి తం ప్రభుమ్. 58

ప్ర.అ. కథంచన-ఎట్లో, తస్య-ఆ పరమాత్మయొక్క, ప్రత్యర్థిషు-విరుద్ధములైనవానియందు, పర్యేషణమ్-వెదకుటకు, గచ్ఛేత్-పోవలయును, వేదే-వేదమున, ఇమమ్-ఆత్మను, అవిచిన్వన్-వెదుకనివాడై, తపః-తపస్వి, తమ్-ఆ, ప్రభుమ్-ప్రభువును, పశ్యతి-చూచును.

తా. ఎట్లో కష్టపడి ఆ పరమాత్మకు వ్యతిరేకములైనవానియందు వెదుకవలయును. వేదములందు పట్టుపడని ఆప్రభువును తపస్వియై చూడవలయును.

వ్యా. ఆత్మకు ప్రత్యర్థులు - విరోధులు అనగా ఆత్మకంటె వేరయిన పంచకోశములు - అన్నమయ, ప్రాణమయ, మనోమయ, విజ్ఞానమయ, ఆనందమయము లనునవి. వానియందు - పర్యేషణం గచ్ఛేత్ - అన్వేషణ సాగింపవలయును. కథంచన-ఎట్లో - అనగా అన్వేషణ చాల దుష్కరమని తాత్పర్యము

కోశములందు అన్వేషణ యనగా వానియందేర్పడిన ఆత్మభావమును పరిహరించుకొనుటయే. కావుననే వానిని ప్రత్యర్థులు - శత్రువులుగా వర్ణించుట.

వేదే ఇమమ్ అచిన్వన్ - వేదమున దీనిని సాధింపజాలక - వేదాంత న్యాయములను కూడ భావింపక అని భావము. తపః - అనగా నిచట తపస్వి - భావనాబలము కలవాడు - ధ్యాననిష్ఠ కలవాడని తాత్పర్యము. అట్టివాడు ఆ ప్రభువును చూచును. పరమాత్మ గాఢభావనకు అందినట్లు తర్కాదులకు అందదని భావము.

శ్రుతియు 'తం పశ్యతి నిష్కలం ధ్యాయమానః' - నిష్కలుడగు ఆ పరమాత్మను సాధకుడు ధ్యానించుచు దర్శించును అని చెప్పుచున్నది.

తూష్ణీంభూత ఉపాసీత న చేష్టే న్మనసాఽపి చ,
ఉపావర్తస్వ తద్బ్రహ్మ అన్తరాత్మని విశ్రుతమ్. 59

ప్ర.అ. తూష్ణీంభూతః-ఊరకున్నవాడై, ఉపాసీత - కూర్చుండవలయును, చ - మరియు, మనసా, అపి - మనస్సుతోడను, న చేష్టేత్ - పనిచేయరాదు, అన్తరాత్మని - హృదయాకాశములో, విశ్రుతమ్ - ప్రసిద్ధమైన, తత్ - ఆ, బ్రహ్మ - బ్రహ్మమును, ఉపావర్తస్వ - దరిజేరుము.

తా. మనోవ్యాపారములను, దేహవ్యాపారములను, వాగ్వ్యాపారమును అరికట్టి అంతరంగమునందు సుప్రసిద్ధమగు ఆబ్రహ్మమును నిలుపవలయును.

వ్యా. వెనుకటి శ్లోకమున ధ్యానమును గూర్చి చెప్పియున్నారు. దాని నిందు వివరించుచున్నారు. తూష్ణీంభూతః - ఊరకుండి - ఈమాటవలన వాక్కు మొదలగు వెలుపలి ఇంద్రియముల చేష్టల నన్నింటిని ఉపసంహరించుటను చెప్పిరి. మనసాఽపి న చేష్టేత్ - దీనితో మనోవ్యాపారము - సంకల్పవికల్పాత్మకమైనది - అణగుటను చెప్పిరి. అన్తరాత్మని-హృదయాకాశమున, విశ్రుతమ్- వేదములందు ప్రసిద్ధమైన, తత్ - మనస్సులకు వాక్కులకు అందని, బ్రహ్మ - బ్రహ్మమును, ఉపావర్తస్వ - సన్నిధికి తెచ్చుకొనుము. హృదయమును బ్రహ్మ భావనతో నింపి చెదరనీకుము - అని తాత్పర్యము.

మౌనాన్న స ముని ర్భవతి నారణ్యవసనా న్మునిః,
స్వలక్షణం తు యో వేద స మునిః శ్రేష్ఠ ఉచ్యతే. 60

ప్ర.అ. మౌనాత్ - మౌనమువలన, సః - అతడు, మునిః - ముని, న భవతి - కాడు, అరణ్యవసనాత్ - అడవిలో ఉండుటవలన, మునిః - ముని, న - కాడు, తు - కాని, యః - ఎవడు, స్వలక్షణమ్ - ఆత్మలక్షణమును, వేద - ఎరుగునో, సః - అతడు, శ్రేష్ఠః - ఉత్తముడైన, మునిః - ముని - అని, ఉచ్యతే - చెప్పబడును.

తా. మౌనమువలననో, అడివిలో ఉండుటవలననో నరుడు ముని కాడు. ఆత్మలక్షణము నెరిగినవాడే ఉత్తమముని.

వ్యా. మౌనాత్ - ఇచట మౌన మనగా తత్త్వము తెలియకుండ దేనినో ధ్యానించుట. దానివలన మునికాజాలడు. అరణ్యవాస మనగా -తత్త్వ మెరుగని సన్యాసము. దానివలనను ముని కాడు. స్వలక్షణ మనగా- ప్రత్యగాత్మలక్షణము- ప్రత్యగాత్మ జగత్తేర్పడుటకు మూలకారణ మనియు, అది సచ్చిదానందాత్మక మనియు అనుభవపూర్వకముగా తెలిసికొనుట. అది తెలిసినవాడు ఉత్తముడగు ముని.

సన్న్యాసులకంటె, యోగులకంటె జ్ఞాని మిన్నయని భావము.

సర్వార్థానాం వ్యాకరణా ద్వైయాకరణ ఉచ్యతే,
తన్మూలతో వ్యాకరణం వ్యాకరోతీతి తత్తథా. 61

ప్ర.అ. సర్వ - అర్థానామ్ - సర్వార్థములను, వ్యాకరణాత్ - విప్పి చెప్పుటవలన, సః - బ్రహ్మవేత్త, వైయాకరణః - వైయాకరణుడని, ఉచ్యతే - చెప్పబడును. తత్ - ఆ వ్యాకరణము, మూలతః - మూలకారణమగు బ్రహ్మమును పొంది, వ్యాకరోతి - వివరించుచున్నాడు, అని, తత్ - అది, తథా - అవిధమైనది.

తా. బ్రహ్మజ్ఞానికి వైయాకరణు డని పేరు. ఏలయన ఆతడు జ్ఞానము ద్వారా సర్వజ్ఞుడై సర్వార్థములను విప్పి చెప్పుచున్నాడు. మూలకారణమగు బ్రహ్మమును పొంది అతడా పని చేయుచున్నాడు.

వ్యా. వ్యాకరణ మనగా విస్పష్టముగా వేర్పరచి చెప్పుట. ఆత్మను, అనాత్మను విడబరచి చెప్పుటవలన జ్ఞానిని వైయాకరణు డందురు. కేవల శబ్ద వ్యుత్పత్తిని చెప్పువానిని వైయాకరణు డందురు గదా అని శంకించి సమాధానము చెప్పుచున్నారు. ఆత్మజ్ఞానమువలననే సర్వజ్ఞానము కలుగును. అంతేకాని ఏదో

ఒక జ్ఞానము వలన కాదు. కావున మూలతః - అనగా మూలకారణమగు బ్రహ్మ మును పొంది - అందు వ్యాకర్త పరమాత్మయే. శ్రుతులు ఇట్లే చెప్పుచున్నవి - "తన్నామరూపాభ్యామేవ వ్యాక్రియత-" ఆ పరమాత్మ నామరూపములతోడనే సృష్టి నేర్పరచెను. "నామరూపే వ్యాకరవాణి" - నామరూపములను వ్యాకరింతును. ఇచట వ్యాకరణశబ్దము శ్రౌతమైన వ్యుత్పత్తికి సంబంధించినది.

ప్రత్యక్షదర్శీ లోకానాం సర్వదర్శీ భవే న్నరః,
సత్యే వై బ్రాహ్మణ స్తిష్ఠం స్తద్విద్వాన్ సర్వవి ద్భవేత్. 62

ప్ర.అ. లోకానామ్ - లోకములను; ప్రత్యక్షదర్శీ - ప్రత్యక్షముగా చూచువాడై; నరః - నరుడు; సర్వదర్శీ - సర్వమును చూచువాడు; భవేత్ - కావలయును; సత్యే - సత్యమునందు; తిష్ఠన్ - నెలకొనియుండు; బ్రాహ్మణః - బ్రహ్మజ్ఞాని; తద్విద్వాన్ - బ్రహ్మతత్త్వవేత్తయై; సర్వవిత్ - సర్వజ్ఞుడు, భవేత్ - అగును.

తా. లోకము లన్నింటిని ప్రత్యక్షముగా చూచు నరుడు సర్వమును చూచువాడు కావలయును. సత్యమందు చెదరక నిలిచి బ్రహ్మజ్ఞానమును పొంది సర్వజ్ఞుడు అగును.

వ్యా. సత్యమున నిలుచుట యనగా దేహాద్యాకారములందు భావన లేకుండుట అని తాత్పర్యము. బ్రాహ్మణః - బ్రహ్మవేత్త; లోకములన్నియు పరమాత్మమయములే కావున లోకములందు పరమాత్మనే చూచువాడు సర్వజ్ఞు డగును. బ్రహ్మవేత్త బ్రహ్మమువలె సర్వజ్ఞత్వాదిలక్షణములు కలవా డగునని భావము.

అవ. అధ్యాయార్థము నుపసంహరించుచున్నారు-

ధర్మాదిషు స్థితోఽప్యేవం క్షత్రియ బ్రహ్మ పశ్యతి,
వేదానాం చానుపూర్వ్యేణ ఏతద్బుద్ధ్వా బ్రవీమి తే. 63

ప్ర.అ. క్షత్రియ - రాజా! ధర్మాదిషు - ధర్మము మొదలగు వాని యందు; స్థితః, అపి - నిలిచినవాడయ్యు; ఏవమ్ - ఈ విధముగా; బ్రహ్మ - బ్రహ్మమును; పశ్యతి - చూచును. వేదానామ్ - వేదముల; ఆనుపూర్వ్యేణ - క్రమమునుబట్టి; ఏతత్ - దీనిని; బుద్ధ్వా - నీయందలి స్నేహబుద్ధితో; తే - నీకు; బ్రవీమి - ఉపదేశించుచున్నాను.

తా. రాజా! ధర్మము మొదలగువానియందు నిష్ఠకలవాడు కూడ బ్రహ్మమునే చూడవలయును వేదముల క్రమమునుబట్టి నీ కీ జ్ఞానమును నీ యందలి ప్రీతితో బోధించుచున్నాను.

వ్యా. ధర్మాదు లనగా లోగడ చెప్పిన ధర్మము, సత్యము, దమము, తపస్సు మొదలగు పండ్రెండు. అట్లే సత్యాదికమగు ఎనిమిది విధములుగల అప్రమాదమునందును నిలిచినవాడు. ఇట్టి సాధనసంపత్తి కలవాడు బ్రహ్మమునే చూచును-చూడవలయునని తాత్పర్యము.

వేదానాం చ ఆనుపూర్వ్యేణ - వెనుకచెప్పిన ఆరోప, వ్యామిశ్ర, అపవాద దృష్టుల క్రమమున సోపానారోహణన్యాయమున - మెట్లెక్కు విధమున - పరమ పదమున నున్న నేను దీనిని - అనుభవసిద్ధమైన పరతత్త్వమును; బుద్ధ్యా - నీయందలి స్నేహబుద్ధితో - బోధించుచున్నాను.

సోపానక్రమమునుగూర్చి నృసింహతాపనీయోపనిషత్తిట్లు చెప్పుచున్నది- "ఓతానుజ్ఞాత్రనుజ్ఞాఽవికల్పైః". ఓతత్వమనగా కార్యమునందు కారణవ్యాప్తి. కుండయందు మన్ను ఉన్నట్లు సర్వమునందు బ్రహ్మము కలదని ఈ జ్ఞానము కలవా రెరుగుదురు. ఇది పరిణామదృష్టి. 1 మట్టియే కుండగా మారినట్లు బ్రహ్మమే జగత్తయినది.

అనుజ్ఞాతృత్వ మనగా కార్యాసమస్తత్వము కారణమందు భావించుట ప్రకృతికి కారణమగు బ్రహ్మమునందు ప్రపంచము సమముగా లేకున్నను ఉన్నట్లు భాసించుట. ఇది ఎండమావులలో నీరున్నట్లు తోచుట. 2. ఇది జగన్మిథ్యా జ్ఞానము. నిజమున కచట నీరు లేదు. కాని దూరమునకున్నట్లు భాసించుచున్నది. అట్లే జగత్తు లేదు. ఉన్నట్లు కానవచ్చుచున్నది.

అనుజ్ఞయందు జగత్తు తుచ్ఛము. అది కుందేటి కొమ్ము మొదలగు వాని వంటిది - అను భావము కలుగును. ఇట్లు సోపానరీతిలో బ్రహ్మము జగత్తుగా పరిణమించినదని మొదటి మెట్టు. దీనిలో రెంటింటికి సమసత్తాస్థితి కలదు. రెండవ దానిలో ఒకటి తోచుటయే కాని సత్యమునకు లేదు. మూడవస్థితిలో అసలే లేదు. ఈ మూడు మెట్టుల ద్వారా నాలుగవదియగు నిర్వికల్పము, నిర్భయము, బ్రహ్మము అయిన దేదో అదే నేను- అను జ్ఞానము. ఆనుపూర్వ్యేణ అనుమాటను బట్టి ఈ వరుసలో జ్ఞానబోధను సనత్సుజాతుడు ధృతరాష్ట్రునకు చేసెనని గుర్తింపవలయును.

ఇతి శ్రీమహాభారతే ఉద్యోగపర్వణి సనత్సుజాతపర్వణి
సనత్సుజాతవాక్యే త్రిచత్వారింశోఽధ్యాయః.

ఇది శ్రీమహాభారతము ఉద్యోగపర్వమున సనత్సుజాతపర్వమున
సనత్సుజాతవాక్యముగల నలుబదిమూడవ అధ్యాయము.

—:o:—

## చతుశ్చత్వారింశోఽధ్యాయః
## నలుబదినాలుగవ అధ్యాయము

### బ్రహ్మచర్యబ్రహ్మణోర్నిరూపణమ్
### బ్రహ్మచర్యమును బ్రాహ్మణుని నిరూపించుట

అవ. ఇట్లాత్మజ్ఞానమార్గమును విని దానికి అంతరంగసాధనమగు యోగమునుగూర్చి వినుటకై ధృతరాష్ట్రు డడుగుచున్నాడు.

ధృతరాష్ట్ర ఉవాచ - ధృతరాష్ట్రు డిట్లు పలికెను.

సనత్సుజాత యామిమాం పరాం త్వం
బ్రాహ్మీం వాచం వదసే విశ్వరూపామ్,
పరాం హి కామేన సుదుర్లభాం కథాం
ప్రబ్రూహి మే వాక్యమిదం కుమార. 1

ప్ర. అ. సనత్సుజాత! త్వమ్-నీవు; యామ్-ఏ; పరామ్-చెప్పినదానికంటె మేలైనది; బ్రాహ్మీమ్-బ్రహ్మమును పొందించునది అగు; వాచమ్-వాక్కును; వదసే-ఎరుగుదువో: విశ్వరూపామ్-విశ్వమును ప్రకాశింపజేయునట్టిది కామేన-కోరబడునట్టిదానితో; పరామ్-ఇతరమైనట్టిది; సుదుర్లభామ్-సులభముగా అందనట్టిది; కథామ్-చెప్పుకొనదగినది అగు; తామ్ - అట్టి వాక్కును, ప్రబ్రూహి-చక్కగా ఉపదేశింపుము; కుమార! ఇదమ్-ఈ; మే-నా; వాక్యమ్-ప్రార్థనారూప వచనమును; మన్నిపుము.

తా. సనత్సుజాతా! నీ వింతకుముందు చెప్పినదానికంటె మేలైన బ్రహ్మప్రాప్తి కలిగించు ఉపనిషత్తును ఎరుగుదువు. అది విశ్వమంతటిని ప్రకాశింపజేయునది. సాధారణముగ అందరు కోరుదానికంటె విలక్షణమైనది. చెప్పుకొనదగినది. దానిని నాకు ఉపదేశింపుము. నా యీ ప్రార్థనను మన్నింపుము.

వ్యా. పరామ్-వెనుక చెప్పినదానికంటె విశిష్టమైనది; బ్రాహ్మీమ్-బ్రహ్మమును పొందించునది; వదసే-ఇచట జ్ఞానార్థమున ఆత్మనేపదప్రత్యయము వచ్చినది కావున ఎరుగుదువు-అని యర్థము; కామేన పరామ్-లోకమున సాధారణ

ముగా అందరు కోరనిది. అందరు కోరునది విషయసుఖము, అట్టిది కానిది విషయవార్తలు లేనిదని భావము. కావుననే సుదుర్లభాం - మహాప్రయత్నము తోడనే సిద్ధించునది; విశ్వరూపామ్-విశ్వం రూప్యతే-ప్రకాశ్యతే అస్యామ్-విశ్వ మందు ప్రకాశించును—అనగా తెలియదగిన దేమియు మిగులనిది అని భావము. ఇదం మే వాక్యమ్-ఈ నా వాక్యమును అనుదానికి మన్నింపుము. దయతో అవధరింపుము అను భాగమును కలుపుకొనవలయును.

అవ. బ్రహ్మవిద్య సుదుర్లభమని నిరూపించుచున్నారు.

సనత్సుజాత ఉవాచ - సనత్సుజాతు డిట్లు పలికెను.

నైతద్బ్రహ్మ త్వరమాణేన లభ్యం
యన్మాం పృచ్ఛ న్నతిహృష్య స్యతీవ,
బుద్ధౌ విలీనే మనసి ప్రచిన్త్యా
విద్యా హి సా బ్రహ్మచర్యేణ లభ్యా. 2

ప్ర. అ. యత్-దేనినిగూర్చి; మామ్-నన్ను; పృచ్ఛన్-ప్రశ్నచేయుచు; అతీవ-మిక్కిలి; అతిహృష్యసి-పొంగిపోవుచున్నావో; ఏతద్-ఈ; బ్రహ్మ-బ్రహ్మము; త్వరమాణేన-తొందరపాటుగలవానిచేత; న, లభ్యమ్-పొందబడునది కాదు; బుద్ధౌ-బుద్ధియందు; మనసి-మనస్సు; విలీనే-లయ మయిపోగా; ప్రచిన్త్యా-సంపూర్ణముగా నశించిన సంకల్పాదులు కల; సా-ఆ; విద్యా-విద్య; బ్రహ్మ చర్యేణ-బ్రహ్మచర్యముచేత; లభ్యా-పొందదగినది.

తా. రాజా! నీవు పొంగిపోవుచు అడుగుచున్న ఆ బ్రహ్మము తొందర పాటు మనుజునకు అందునది కాదు. మనసు బుద్ధియందు లయము కాగా, సంక ల్పాదులన్నియు సంపూర్తిగా అణగిపోగా ఆ విద్య బ్రహ్మచర్యమువలననే పొందదగినది.

వ్యా. అతీవ అతిహృష్యసి-అనుటలో నేను బ్రహ్మవిద్య కధికారి నయితి నని గర్వపడుచున్నావు, అట్టి నీకిది బొత్తిగా తెలియరానిదని హెచ్చరిక.

విద్య లక్షణమును చెప్పుచున్నారు. ఇంద్రియములన్నింటిని నిరోధింపగా మనస్సుమాత్రము అణగకుండును. అనగా సంకల్పవికల్పాదులు సాగుచునే యుండును. 'అహం బ్రహ్మాస్మి' అను నిశ్చయస్వభావముగల బుద్ధియందు ఆ మనస్సుకూడ స్వరూపములేకుండ కలిసిపోయినపుడు; ప్రచిన్త్యా - పూర్తిగా

నశించిన చింత్యములుగల ఒకానొకదశ యేర్పడును. అవియే ఇచట విద్య. అదియు బ్రహ్మచర్యముతో-కఠోరనియములుగల గురుకులవాసముతో-లభించును.

ధృతరాష్ట్ర ఉవాచ-ధృతరాష్ట్రు డిట్లు అనెను.

అత్యన్తవిద్యా మితి యత్సనాతనీం
బ్రవీషి త్వం బ్రహ్మచర్యేణ సిద్ధామ్,
అనారభ్యాం వసతీహ కార్యకాలే
కథం బ్రహ్మణ్య మమృతత్వం లభేత. 3

ప్ర. అ. సనాతనీమ్-నిత్యసిద్ధమైనదానిని; అత్యంతవిద్యామ్ - బ్రహ్మ విషయమగు విద్యను; బ్రహ్మచర్యేణ-బ్రహ్మచర్యముచేత, సిద్ధామ్ - అభివ్యక్త మగుదానిని; అనారభ్యామ్-మొదలు పెట్టరాని దానిని; కార్యకాలే-పనిపడిన వేళ; ఇహ-ఇచట; వసతి-ఉండునది అయినదానిని; త్వమ్-నీవు; బ్రవీషి-చెప్పుచున్నావు, అయినచో; బ్రాహ్మణ్యమ్ - బ్రహ్మజ్ఞానసంపద కలవానిదగు; అమృతత్వమ్ - అమృతత్వము; కథమ్-ఎట్లు; లభేత-లభించును?

తా. అయ్యా! నీవు చెప్పెడు ఆ బ్రహ్మవిద్య సనాతని గనుక ఎల్లప్పుడు ఉండునది. బ్రహ్మచర్యముతో తెలియవచ్చునది మాత్రమే. మరియు ఇతరము లగు పనులవలె మొదలు పెట్టుటకు యోగ్యముకానిది. అవసరమయినపుడు ఇక్క డనే ఉండునది. అయినచో ఇక బ్రహ్మవేత్త పొందు అమృతత్వమనగా నెట్టిది?

వ్యా. అత్యంతవిద్యామ్-అంతమనగా మూడువిధములయిన హద్దు. దేశ, కాల, పాత్రముల అవధి-దానిని దాటినది అత్యంతము-అనగా దేశకాల పాత్రావ ధులులేని పరబ్రహ్మము-దానికి సంబంధించిన విద్య అత్యంతవిద్య. అది సనా తని-నిత్యసిద్ధ. ఏర్పడియుండునదే కాని ఏర్పడివలసినది కాదు. ప్రత్యగాత్మ నిత్యము, అపరోక్షము అయినది కదా! ఇట్టిది బ్రహ్మచర్యముచే సిద్ధ - అనగా బ్రహ్మచర్యమువలన దానిస్థితి తెలియవచ్చును. మరియు అది అనారభ్య - ఆరంభమునకు యోగ్యమయినది కాదు. ఎల్లవేళల సిద్ధరూపముతో నుండునదని భావము. కార్యకాలమున - అవసరమయినపుడు ఇహ-ఆత్మయందే; వసతి - ఉండును. ఇట్లు ఆవిద్య నిత్యస్వరూపముతో దొరకియే యుండగా దానికై బ్రహ్మచర్యాదులచేత ప్రయత్నమేల? దానితో క్రొత్తగా వచ్చు అమృతత్వమనగా నెట్టిది? అని ఆక్షేపరూపమైన శంకను ధృతరాష్ట్రుడు వెలువరించెను.

అవ. దీనికి సమాధానము చెప్పుచున్నారు.

సనత్సుజాత ఉవాచ - సనత్సుజాతు డిట్లు చెప్పెను.

అవ్యక్తవిద్యా మభిధాస్యే పురాణీం
బుద్ధ్యా చ తేషాం బ్రహ్మచర్యేణ సిద్ధామ్,
యాం ప్రాప్యైనం మర్త్యలోకం త్యజన్తి
యా వై విద్యా గురువృద్ధేషు నిత్యా. 4

ప్ర. అ. పురాణీమ్ - నిత్యమైన; అవ్యక్తవిద్యామ్ - అవ్యక్తమగు బ్రహ్మమునకు సంబంధించిన విద్యను; తేషాం - ఆత్మజ్ఞానసంపన్నులకు; బుద్ధ్యా - బుద్ధిబలముతో; బ్రహ్మచర్యేణ - బ్రహ్మచర్యముతో; సిద్ధామ్ - సిద్ధమగుదానిని; అభిధాస్యే - ఎరుకపరతును; యామ్ - దేనిని, ప్రాప్య - పొంది; ఏనమ్ - ఈ; మర్త్యలోకమ్ - మర్త్యలోకమును; త్యజన్తి - వదలుదురో; యా, వై - ఏది; గురువృద్ధేషు - గురువులగు వృద్ధులయందు; నిత్యా - వినాశము పొందని; విద్యా - విద్యయో.

తా. రాజా! ఆ విద్య సనాతని. అది అవ్యక్తమగు బ్రహ్మమును తెలుపునట్టిది. బుద్ధిబలముతో బ్రహ్మచర్యముతో వ్యక్తమగును. ఆ విద్యను పొందినవారు మర్త్యలోకమును వదలివేయుదురు. అది గురువృద్ధులయందు నిత్యసత్యస్వరూపముతో నుండువిద్య.

వ్యా. అవ్యక్తవిద్యామ్ - బుద్ధి అను ఉపాధి - ఆధారమునుబట్టి కాలుష్యమేర్పడగా ఆబ్రహ్మము వ్యక్తము కాకున్నది. అట్టది అవ్యక్తము - అవ్యక్తము యొక్క విద్య - అవ్యక్తవిద్య. ఇట్లావిద్య అవ్యక్తసంబంధము కనుక దాని వ్యక్తస్థితికొరకు బ్రహ్మచర్యాదిప్రయత్న మవసరమని భావము. బ్రహ్మము నిజమునకు నిత్యము - అపరోక్షము. కాని బుద్ధి దోషమువలన, నది అందరకు వ్యక్తము కాకుండుటచే పరోక్ష మగుచున్నది. అట్లు పరోక్షమైన దానిని అపరోక్షముచేసికొనుటకు ప్రయత్నము తప్పదు. ఆ ప్రయత్నము ఫలించుటయే అది దొరకుట.

మర్త్యలోకం త్యజన్తి - అనగా సంసారబంధములు తెగిపోవు నని యర్థము. అదియే అమృతస్థితి - మోక్షము.

ఈ విద్య అందరకు పరోక్షము కాదు. అది నిత్యముగా వ్యక్తమగు వ్యక్తులును కలరు. వారే, గురువృద్ధులు. ఇట్లు చెప్పుట వలన అవ్యక్తము నిత్యము అవ్యక్తముగనే యుండును గదా! అను శంక తొలగును.

ధృతరాష్ట్ర ఉవాచ - ధృతరాష్ట్రు డిట్లు పలికెను.

బ్రహ్మచర్యేణ యా విద్యా శక్యావేదితు మఞ్జసా,
తత్కథం బ్రహ్మచర్యం స్యా దేతద్ బ్రహ్మన్ బ్రవీహి మే. 5

ప్ర. అ. బ్రహ్మన్ - బ్రాహ్మణోత్తమా! యా - ఏ; విద్యా - విద్య; బ్రహ్మచర్యేణ - బ్రహ్మచర్యముతో; అఞ్జసా - వేగముగా, సూటిగా; వేదితుమ్ - తెలియుటకు; శక్యా - సాధ్యమైనదో; తత్ - ఆవిద్యకు సాధనమయిన; బ్రహ్మచర్యమ్ - బ్రహ్మచర్యము; కథమ్ - ఎట్లు; స్యాత్ - అగును; మే - నాకు; బ్రవీహి - చెప్పుము.

తా. ఓయి బ్రహ్మవేత్తా! బ్రహ్మచర్యముతో ఆవిద్య తెలియదగు నంటివి. ఆ బ్రహ్మచర్యము ఎట్లు సమకూడునో నాకు తెలుపుము.

వ్యా. అఞ్జసా - త్వరగా - సూటిగా - అని అర్థము.

సనత్సుజాత ఉవాచ - సనత్సుజాతు డిట్లు చెప్పెను.

ఆచార్యయోని మిహ యే ప్రవిశ్య
భూత్వా గర్భే బ్రహ్మచర్యం చరన్తి,
ఇహైవ తే శాస్త్రకారా భవన్తి
ప్రహాయ దేహం పరమం యాన్తి యోగమ్. 6

ప్ర. అ. యే - ఎవరు; ఆచార్యయోనిమ్ - ఆచార్యుడున్న తావును; ప్రవిశ్య - ప్రవేశించి; గర్భే, భూత్వా - గర్భమునం దున్నట్లు ఆత్మీయులై, బ్రహ్మచర్యమ్ - బ్రహ్మచర్యమును; చరన్తి - ఆచరింతురో; తే - అట్టివారు; ఇహ, ఏవ - ఇందే; శాస్త్రకారాః - శాస్త్రకారులు; భవన్తి - అగుదురు; దేహమ్ - దేహమును; ప్రహాయ - వదలి; పరమమ్ - మిక్కిలి శ్రేష్ఠమగు; యోగమ్ - బ్రహ్మముతో ఐక్యమును; యాన్తి - పొందుదురు.

తా. ఆచార్యునికడ కరిగి శ్రద్ధాభక్తులతో కపటములేని సేవ చేసి ఆతనికి ఆత్మీయులై బ్రహ్మచర్యమును నడపువారు ఇందే బ్రహ్మవేత్త లగుదురు. దేహమును వదలిన పిదప పరమాత్మతో ఐక్య మగుదురు.

వ్యా. ఇచట యోనిశబ్దమునకు స్థానమని యర్థము. "యోనిష్ట ఇన్ద్రనిషదే అకారి. స్వే యోనౌ నిషదతం సరూపా॰" ఇత్యాదిమంత్రములం దా అర్థము

కానవచ్చుచున్నది. మరియు ఆచార్యగృహము తల్లిగర్భమువలె సర్వవిధముల రక్షించున దనుసర్థముకూడ ఇట తోచును. గర్భే భూత్వా - గర్భమునం దుండి - ఇచట గర్భమనగా హృదయము లోపలిభాగముగా భావింపదగును. గురువు హృదయములో నెలకొని - అట్టిస్థితి నిష్కపటమగు సేవాదులచేత సిద్ధించును. బ్రహ్మచర్యం, చరన్తి - ఆగురు వుపదేశించిన మార్గమున బ్రహ్మచర్యము నాచరింపవలయు నని తాత్పర్యము.

శాస్త్రకారాః - శాస్త్రకారునితనము బ్రహ్మమునందే కలదు. 'మహతో భూతస్య నిఃశ్వసితమేత దృగ్వేదః' ఈమొదలైన వాక్యములు ఆవిషయమును తెలుపుచున్నవి. మహాభూతముయొక్క నిశ్వాసమే ఋగ్వేదము మొదలగునది అని ఆమంత్రము సర్థము. కావున శాస్త్రకారాః భవన్తి - అను మాటకు బ్రహ్మవేత్తలై బ్రహ్మమే యగుదురని భావము. అట్లగుట ఇహైవ - ఇందే - దీనికి గురువు ననుగ్రహము కారణము. దేహమును వదలినపిదప అట్టివారు పరమమ్-పునరావృత్తిలేని, యోగమ్ - బ్రహ్మైక్యమును; యాన్తి - పొందుదురు.

అస్మింల్లోకే వై జయన్తీహ కామాన్
బ్రాహ్మీం స్థితిం హ్యనుతితిక్షమాణాః,
త ఆత్మానం నిర్హరన్తీహ దేహా
న్ముఞ్జాదిషీక మివ సత్త్వసంస్థాః. 7

ప్ర.అ. బ్రాహ్మీం - బ్రహ్మమునకు సంబంధించిన; స్థితిమ్ - స్థితిని, అనుతితిక్షమాణాః - ద్వంద్వములను సహించుచున్నవా రగుచు; యే - ఎవరు; అస్మిన్ - ఈ, లోకే - లోకమునందు; కామాన్ - కామములను; జయన్తి - జయింతురో; తే - వారు; సత్త్వసంస్థాః - సత్త్వగుణము సాధించినవారై; దేహాత్ - దేహమునుండి; ఆత్మానమ్ - ఆత్మను; ఇహ - ఇచట; ముఞ్జాత్ - దుబ్బులోనుండి; ఇషీకమివ - గడ్డిపరకను వలె; నిర్హరన్తి - వేరు చేయుదురు.

తా. బ్రహ్మానుసంధానమును సర్వకష్టములను సహించి చేయుచు ఈ లోకమున కామములను గెలుచువారు సత్త్వగుణమును సాధించినవారై దుబ్బునుండి గడ్డిపరకను లాగినట్లు దేహమునుండి ఆత్మను వేరుచేయుదురు.

వ్యా. అనుతితిక్షమాణాః - సుఖదుఃఖములు, శీతోష్ణములు మున్నగు వానికి వికారము పొందనివా రగుచు; సత్త్వసంస్థాః - సత్త్వగుణమున చక్కగా

కుదురుకొనినవారు; అట్టివారు అనాత్మ యగు దేహమునుండి ఆత్మపదార్థమును వేరు చేసికొందురు. అనగా ఆత్మానాత్మవివేకమును పొందుదు రని తాత్ప ర్యము. అంతవరకు దుబ్బుతో నొకటిగా నుండిన గడ్డిపరక బయటకు వచ్చి విడిగా కన్పట్టుతీరున అనాత్మయగు దేహముతో సంపర్కముగల ఆత్మ దేహము నుండి విడివడి అచ్ఛస్వరూపముగలది యగునని భావము.

శరీర మేతౌ కురుతః పితా మాతా చ భారత,

ఆచార్యశాస్తా యా జాతిః సా పుణ్యా సాఽజరాఽమరా. 8

ప్ర.అ. భారత! పితా - తండ్రి, మాతా, చ - తల్లియును; ఏతౌ - ఈ యిరువురు; శరీరమ్-శరీరమును; కురుతః - చేయుచున్నారు; ఆచార్యశాస్తా - ఆచార్యుడు ఉపదేశకుడుగా గల; యా - ఏ; జాతిః - జన్మము కలదో; సా - అది; పుణ్యా - పుణ్యమైనది; అజరా - ముదిమి లేనిది; అమరా - చావులేని...

తా. ధృతరాష్ట్ర! తల్లిదండ్రు లీ శరీరమును చేయుచున్నారు. ఆచార్య డుపదేశింపగా నేర్పడు జన్మము మాత్రము పుణ్యము. ముదిమియు చావును లేనిది.

వ్యా. ఆచార్యశాస్తా - ఆచార్యుడు శాస్తగా - ఉపదేశకుడుగా గలదీ; జాతిః - పుట్టుక; బ్రాహ్మణుడు ఉపనయన సంస్కారము పొంది రెండవ జన్మము నందినట్లు ఆచార్యునివలన పరబ్రహ్మవిద్యాప్రాప్తి కలుగును కావున అది మరియొక జన్మము. తల్లిదండ్రు లిచ్చునది శరీరము - నశించునది. కాని యీ ఆచార్యు డిచ్చిన జన్మము మోక్షహేతు వగుటచే పుణ్యము. నాశనము లేనిది.

యః ప్రావృణో త్యవితథేన వర్ణా
నృతం కుర్వ న్నమృతం సంప్రయచ్ఛన్,
తం మన్యేత పితరం మాతరం చ
తస్మై న ద్రుహ్యేత్ కృత మస్య జానన్. 9

ప్ర.అ. యః - ఏ ఆచార్యుడు; వర్ణాన్ - నాలుగు వర్ణములవారిని; అవిత థేన - సత్యమగు చిదాత్మతో; ఋతమ్ - బ్రహ్మమును; కుర్వన్ - వాక్కుతో ఆవిష్కరించుచు; అమృతమ్ - మోక్షమును; సంప్రయచ్ఛన్ - చక్కగా

నొసగుచు, ప్రావృణోతి - కాపాడుచున్నాడో; తమ్-అట్టి ఆచార్యుని; పితరమ్ - తండ్రినిగా, మాతరమ్ - తల్లినిగా; మన్యేత - తలపవలయును; అస్య-అతని కృతమ్ - మేలును; జానన్ - గుర్తించుచు, తస్మై - ఆతనికి; న ద్రుహేత్-ద్రోహము చేయరాదు.

తా. ఆచార్యుడు నాలుగువర్ణములవారికిని సత్యమగు చిదాత్మను బ్రహ్మమును తన ఉపదేశముద్వారా అనుభవమునకు తెచ్చుచు మోక్షము నొసగుచు కాపాడుచున్నాడు. కావున అతడే తల్లి, తండ్రి యని భావింపవలయును. ఆతడు చేసిన మేలు మరవక ఆతనికి ద్రోహము చేయక మెలగవలయును.

వ్యా. అవితథేన - వితథ మనగా అనృతము - అనాత్మ - జడము-అది కానిది అవితథము - సత్యమగు చిదాత్మ - దానితో; ప్రావృణోతి - బయట లోపల కప్పివైచును. ద్వైతమువలన పుట్టిన భయమును తొలగించి కాపాడును. ఋత మనగా బ్రహ్మము, కుర్వన్ - చేయుచు - అనగా తన ఉపదేశముద్వారా బ్రహ్మనుభవము కలిగించుచు, దాని ఫల మేమనగా-అమృతం సంప్రయచ్ఛన్-మోక్షమును కలిగించుచు-

కృత మనగా చేసిన ఉపకారము.

గురువే తండ్రి, గురువే తల్లి. గురువునకు ద్రోహము చేయుట యనగా ఆత్మద్రోహము చేసికొనుటయే అను దృఢవిశ్వాసముతో నుండవలయునని తాత్పర్యము.

గురుం శిష్యో నిత్య మభివాదయీత
స్వాధ్యాయ మిచ్ఛే చ్ఛుచి రప్రమత్తః,
మానం న కుర్యా న్నాదధీత రోష
మేష ప్రథమో బ్రహ్మచర్యస్య పాదః. 10

ప్ర అ. శిష్యః - శిష్యుడు; గురుమ్ - గురువును, నిత్యమ్-ప్రతిదినము; అభివాదయీత - నామగోత్రములు చెప్పి నమస్కరింపవలయును. శుచిః - లోపల, వెలుపల పరిశుద్ధుడై; అప్రమత్తః-ఏ విధములగు పొరపాటులు లేనివాడై; స్వాధ్యాయమ్ - వేదముల అధ్యయనమును; ఇచ్ఛేత్ - కోరవలయును; మానమ్-పొగరును; న, కుర్యాత్ - చేయరాదు; రోషమ్-తీవ్రకోపమును; న, ఆదధీత - దరికి రానీయరాదు; ఏషః - ఇది; బ్రహ్మచర్యస్య - బ్రహ్మచర్యము యొక్క; ప్రథమః - మొదటిదగు; పాదః - పాదము.

తా. శిష్యుడు గురువునకు ప్రతిదినము నామగోత్రములు చెప్పి ప్రణమిల్ల వలయును. బాహ్యమున, ఆభ్యంతరమున పరిశుద్ధుడై, ప్రమాదములు లేనివాడై యుండవలయును. గర్వమును, కోపమును దరిదాపులకు రానీయరాదు. ఇది బ్రహ్మచర్యము మొదటిపాదము.

వ్యా. శుచిః- స్నానాదికముతో బాహ్యశుద్ధి, భావములో కాలుష్యము లేకుండ అంతరశుద్ధియు సాధించినవాడు, అప్రమత్తః - గురుశుశ్రూషయందు శ్రద్ధాలోపము లేనివాడై, మానం, న, కుర్యాత్ - ఎంతటి నీచకార్యములు చెప్పి నను మనసునందును బాధపడరాదు, రోషం నాదధీత - శక్తికి మించిన శ్రమ కలిగినను కోపింపరాదు.

శిష్యవృత్తిక్రమేణైవ విద్యా మాప్నోతి యః శుచిః,
బ్రహ్మచర్యవ్రతస్యాస్య ప్రథమః పాద ఉచ్యతే. 11

ప్ర.అ. యః-ఏ శిష్యుడు, శుచిః-పవిత్రుడై, శిష్యవృత్తిక్రమేణ, ఏవ-ఉదయసాయంకాలములలో భిక్షాటనము చేయుట మొదలగు ప్రవర్తనతోడనే, విద్యామ్-విద్యను; ఆప్నోతి - పొందునో; అస్య - అట్టివానికి; బ్రహ్మచర్య వ్రతస్య - బ్రహ్మచర్యవ్రతముయొక్క, ప్రథమః, పాదః - మొదటిపాదముగా, ఉచ్యతే - చెప్పబడును.

తా. శిష్యుడు పరిశుద్ధుడై భిక్షాటనవృత్తితోడనే విద్య నార్జింపవలయును. బ్రహ్మచర్యవ్రతములో అదియు నతనికి మొదటిపాదము.

వ్యా. శిష్యవృత్తిక్రమేణ, ఏవ - ఉదయసాయంసమయములలో భిక్షాట నము చేసికొనివచ్చి ఆ అన్నమే తినుచు బ్రదుకు గడుపవలయును. అన్నము కొఱకు గురువుపై ఎట్టి పరిస్థితులలో ఆధారపడరాదని భావము.

అవ. పై రెండు శ్లోకములలో బ్రహ్మచర్యము మొదటిపాదమును వివరించి యున్నారు. ఇటుపై రెండు శ్లోకములతో రెండవపాదమును వక్కాణించు చున్నారు.

ఆచార్యస్య ప్రియం కుర్యాత్ ప్రాణైరపి ధనైరపి,
కర్మణా మనసా వాచా ద్వితీయః పాద ఉచ్యతే. 12

ప్ర. అ. ప్రాణైః, అపి - ప్రాణములతోడను, ధనైః, అపి - ధనములతోడను, కర్మణా-కర్మముచేతను, మనసా - మనస్సుచేతను, వాచా-వాక్కుచేతను, ఆచార్యస్య-ఆచార్యునకు, ప్రియమ్-ఇష్టమును, కుర్యాత్-చేయవలయును, ఇది, ద్వితీయః - రెండవ, పాదః - పాదము, అని, ఉచ్యతే-చెప్పబడును.

తా. ప్రాణము, ధనము, క్రియ, భావన, మాట అన్నియు గురుప్రీతికే అన్నభావముతో సేవచేయవలయును. ఇది బ్రహ్మచర్యమున రెండవపాదము.

సమా గురౌ యథా వృత్తి ర్గురుపత్న్యాం తథాఽఽచరేత్,
తత్పుత్రే చ తథా కుర్వన్ ద్వితీయః పాద ఉచ్యతే. 13

ప్ర.అ. యథా - ఎట్లు; గురౌ - గురువునందు; వృత్తిః - నడవడియో; గురుపత్న్యామ్ - గురుపత్నియందు; సమా - సమమగు వృత్తి; తథా - అట్లే ఆచరేత్ - ఆచరింపవలయును; తత్పుత్రే చ - గురువు పుత్రుని యందును; తథా-అట్లే; కుర్వన్-చేయుచుండవలయును; ఇది, ద్వితీయః, పాదః, ఉచ్యతే-రెండవపాదముగా చెప్పబడును.

వా. ఇట్లు గురువునందు సర్వసమర్పణబుద్ధితో ప్రవర్తించుటవలన శిష్యుని జీవితము ఐహికముగా ఆటుపోటుల నన్నింటిని తట్టుకొను స్థైర్యము పొదుననియు, ఆధ్యాత్మికముగా చెఱుపు కలిగించు దోషములు మాయుననియు గుర్తింపవలయును. అనగా ఇట్లు ప్రవర్తించుట స్వప్రయోజనమునకే అని యెఱుగవలయును.

అవ. విద్యను గ్రహించి, విద్యాసుఖము ననుభవించుచు ఆచార్యుని; మిక్కిలిగా మన్నించుట బ్రహ్మచర్యము మూడవపాదమని చెప్పుచున్నారు.

ఆచార్యేణాత్మకృతం విజానన్
జ్ఞాత్వా చార్థం భావితోఽస్మీత్యనేన,
యం మన్యతే తం ప్రతి హృష్టబుద్ధిః
స వై తృతీయో బ్రహ్మచర్యస్య పాదః. 14

ప్ర. అ. ఆచార్యేణ - ఆచార్యునిచేత; ఆత్మకృతమ్ - తనకు చేయబడిన ఉపకారమును; విజానన్ - ఎల్లవేళల గుర్తించుచు; అర్థం, చ - దానివలన నగు ప్రయోజనమును కూడ; జ్ఞాత్వా - ఎరిగి; అనేన - ఇతనిచేత; భావితః, అస్మి,

ఇతి - వృద్ధి పొందితిననని; మన్యతే - భావించును; తం, ప్రతి - ఆచార్యుని యెడ; హృష్టబుద్ధిః-సంతుష్టమైన బుద్ధి కలవాడగును; ఇతి యత్-అను నిట్టిది; బ్రహ్మచర్యస్య-బ్రహ్మచర్యముయొక్క; తృతీయః, పాదః - మూడవపాదము.

తా. ఆచార్యుడు తనకు చేసిన మేలు మరవరాదు. దాని ప్రయోజనమును గుర్తించి యనుభవింపవలయును. నే నీతనివలననే పెంపొందితి నని భావించుచు ఆనందముతో మెలగవలయును. ఇది మూడవపాదము.

వ్యా. ఆత్మకృతమ్ - తనకై చేసిన - విద్యాదానము; అర్థం జ్ఞాత్వా - దాని ప్రయోజనమగు దుఃఖ మణగారుట, ఆనందము కలుగుట అనునది; జ్ఞాత్వా- అనుభవించి; భావితః - వృద్ధి పొందినవాడను.

నాచార్య స్యానపాకృత్య ప్రవాసం
ప్రాజ్ఞః కుర్వీత నైతదహం కరోమి,
ఇతీవ మన్యేత న భాషయేత
స వై చతుర్థో బ్రహ్మచర్యస్య పాదః. 15

ప్ర. అ. ఆచార్యస్య - ఆచార్యునకు; అనపాకృత్య - అప్పు తీర్పక; ప్రాజ్ఞః - బుద్ధిమంతుడు, ప్రవాసమ్ - వేరుచోట ఉండుటను; న, కుర్వీత - చేయరాదు; ఏతత్ - ఈ గురుదక్షిణ రూపమైన దానిని; అహమ్-నేను; కరోమి- చేయుచున్నాను; ఇతి, ఇవ - అని; న, మన్యేత-తలపనే రాదు; న, భాషయేత- పలుకనే రాదు; స, వై - అట్టిది; బ్రహ్మచర్యస్య - బ్రహ్మచర్యము యొక్క; చతుర్థః . నాలుగవది యగు; పాదః - పాదము.

తా. గురుదక్షిణ యొసగక మరియొకచోటికి పోరాదు. గురుదక్షిణ ఇచ్చితి నని తలపరాదు. చెప్పరాదు. ఇది బ్రహ్మచర్యము నాలుగవపాదము.

వ్యా. అనపాకృత్య - విద్య నేర్చినదానికి తాను ఋణపడిన మూల్యమును చెల్లింపక - గురువునకు ప్రియమైన దక్షిణ నీయక అని భావము; ప్రవాసమ్ - గురువు నిల్లువదలి మరియొకచోట, వేరొక ఆశ్రమమున ఉండుట; న, కుర్వీత- చేయరాదు; ఏతత్ - గురువునకు ధన మొసగితి నని; నైవ మన్యేత - మనసులో అనుకొనరాదు; న భాషయేత - పలుకరాదు.

గురుదక్షిణ నొసగకుండుట గురుద్రోహము. ఇచ్చితినని భావించుట, చెప్పుట అహంకారమునకు మార్గములు. అట్లవి దోషము లగుచున్నవి.

అవ. నాలుగు పాదములు గల బ్రహ్మచర్యముతో సాధించు విద్యయు నాలుగు పాదములుగా నుండుటను వివరించుచున్నారు-

కాలేన పాదం లభతే తథాఽర్థం
తతశ్చ పాదం గురుయోగతశ్చ,
ఉత్సాహయోగేన చ పాద మృచ్ఛేత్
శాస్త్రేణ పాదం చ తతోఽభియాతి. 16

ప్ర.అ. కాలేన - కాలముచేత; పాదం - ఒక భాగమును; తథా - అట్లే; అర్థమ్ - ప్రయోజనమును; తతః, చ - పిదప; గురుయోగతః - గురువుకడ నుండి; పాదమ్ - ఒక భాగమును; లభతే - (శిష్యుడు) పొందును; చ-మరియు; ఉత్సాహయోగేన - బుద్ధిశక్తివలన; పాదమ్ - ఒక భాగమును; ఋచ్ఛేత్ - పొందును; శాస్త్రేణ - శాస్త్రము ద్వారా; తతః - అటుపై; పాదమ్-పాదమును; అభియాతి - పొందును.

తా. విద్యాప్రాప్తి నాలుగుభాగములుగా కలుగును. ఒకటి కాలపరిపాకమునుబట్టి, మరియొకటి గురువు ఉపదేశమును బట్టియు, వేరొకటి బుద్ధిబలమును బట్టియు, ఇంకనొకటి శాస్త్రవిచారణను బట్టియు సిద్ధించును.

వ్యా. ఈ శ్లోకమున క్రమమును సంభావింపలేదు-

"ఆచార్యాత్ పాద మాదత్తే పాదం శిష్యః స్వమేధయా
పాదం సబ్రహ్మచారిభ్యః పాదం కాలక్రమేణ చ"

అని క్రమము. శిష్యుడు ఆచార్యునివలన నొక భాగమును, తన బుద్ధిబలముతో రెండవభాగమును, సహపాఠకులవలన మూడవపాదమును, కాలక్రమమున నాలుగవపాదమును గ్రహించునని ఇది క్రమము.

కాలేన - బుద్ధిపరిపాకముచేత; ఉత్సాహయోగేన - బుద్ధివైభవముచేత; శాస్త్రేణ - సహపాఠకులతో కూడి చింతన చేయుటచేత.

ఈ విధముగా విద్యకు నిండుదనము వచ్చునని ఫలితార్థము.

ధర్మాదయో ద్వాదశ యస్య రూప
మన్యాని చాఙ్గాని తథా బలం చ,
ఆచార్యయోగే ఫలతీతి చాహు
ర్బ్రహ్మార్థయోగేన చ బ్రహ్మచర్యమ్. 17

అవ. ధర్మాదయః-ధర్మము మొదలగు; ద్వాదశ-పండ్రెండు; యస్య - దేని; రూపమ్-రూపమో; అన్యాని-ఇతరములును; అఙ్గాని-అంగములో; తథా-అట్లే; బలం, చ-బలమో; అట్టి; బ్రహ్మచర్యమ్-బ్రహ్మచర్యము; బ్రహ్మార్థ యోగేన-వేదముయొక్క అర్థసంబంధముచేత; ఆచార్యయోగే-ఆచార్యునితో కలి యుటయందు; ఫలతి-పండును; ఇతి-అని; ఆహుః-చెప్పుదురు.

తా. ధర్మాదులు స్వరూపముగా ఆసనప్రాణాయామాదులు అంగములుగా చెదరనియోగము బలముగాగల బ్రహ్మచర్యము వేదతత్త్వభావనచేత గురువు యొక్క సంబంధమునందు ఫలించు నని పెద్దలు చెప్పుదురు.

వ్యా. ధర్మాదులు స్వరూప మనగా ధర్మాదులే బ్రహ్మచర్యమని తాత్ప ర్యము. (ధర్మాదులు పండ్రెండు 43వ అధ్యాయము 20వ శ్లోకమున చెప్పబడి నవి). అన్యాని అఙ్గాని-ఆసన ప్రాణాయామాది యోగాంగములు; బల మనగా యోగమున చెదరని స్థితి. బ్రహ్మమనగా వేదము- దాని యర్థము- కర్మబ్రహ్మ ములు-వాని యోగమనగా జ్ఞానము పొందుట-వీనివలన బ్రహ్మచర్యము పాకము నకు వచ్చునని తాత్పర్యము. మరియు ఇవి యన్నియు ఫలించుట ఆచార్య యోగమునందే అనుదానిని మరవరాదు.

ఏవం ప్రవృత్తో యదుపాలభేత వై
ధన మాచార్యాయ తదను ప్రయచ్ఛేత్,
సతాం వృత్తిం బహుగుణా మేవ మేతి
గురోః పుత్రే భవతి చ వృత్తి రేషా. 18

ప్ర. అ. ఏవమ్-ఈవిధమైన; ప్రవృత్తః-నడవడి గలవాడై; ఉపాలభేత-బ్రహ్మవిద్యను పొందును; తదను - అటుపిమ్మట; ఆచార్యాయ - ఆచార్యునకు; ధనమ్-ధనమును; ప్రయచ్ఛేత్ - ఒసగవలయును; ఏవమ్-ఇట్లు; బహుగుణామ్-పెక్కుగుణములు గల; సతామ్-సజ్జనుల; వృత్తిమ్-జీవనపద్ధతిని; ఏతి-పొందు

చున్నాడు; గురోః-గురువుయొక్క; పుత్రే, చ-కొడుకునందును; ఏషా - ఇదియే; వృత్తిః-నడవడి; భవతి-అగును.

తా. ఇట్లు ప్రవర్తించువాడు బ్రహ్మవిద్యను సాధించును. పిదప గురువు జీవనము కొరకు అతనికి ప్రియమైన ధనమును శక్తిమేరకు అర్పింపవలయును. గురుపుత్రునందును ఇట్లే ప్రవర్తింపవలయును. అప్పుడు పెక్కుమేలైన గుణములుగల సత్ప్రవర్తనను శిష్యుడు పొందుచున్నాడు.

వ్యా. సతామ్ వృత్తిమ్ - అనుచోట: సః, తామ్, వృత్తిమ్, ప్రాప్నోతి - అని విభజించి, సః-ఆచార్యుడు శిష్యు డిచ్చిన గురుదక్షిణారూపమైన ధనముతో, వృత్తిమ్ - జీవికను, ప్రాప్నోతి - పొందును - అనియు అర్థము చెప్పియున్నారు. గురుపుత్రు డనగా గురువువలన బ్రహ్మజ్ఞానము పొందిన సాక్షాత్ పుత్రుడును, శిష్యరూపపుత్రుడును అను నర్థము గ్రహించుట అవసరము.

ఏవం వసన్ సర్వతో వర్ధతీహ
బహూన్ పుత్రాన్ లభతే చ ప్రతిష్ఠామ్,
వర్షన్తి చాస్మై ప్రదిశో దిశశ్చ
వసంత్యస్మిన్ బ్రహ్మచర్యే జనాశ్చ. 19

ప్ర. అ. ఏవమ్ - ఈవిధముగా; వసన్ - బ్రహ్మచర్యమున నుండుచు; ఇహ - ఇచట, సర్వతః - అన్నివిధముల; వర్ధతి - వృద్ధి పొందును; బహూన్ - పెక్కండ్రు, పుత్రాన్ - పుత్రులను; లభతే - పొందును; ప్రతిష్ఠాం, చ - ప్రతిష్ఠను కూడ పొందును; అస్మై - అట్టివానికి; ప్రదిశః - దిక్కులును; దిశశ్చ - మూలలును, వర్షన్తి - ధనాదులను కురిపించును; అస్మిన్ - ఈ; బ్రహ్మచర్యే - బ్రహ్మచర్యమునందు; జనాః, చ - జనులును; వసన్తి - నివసింతురు.

తా. ఇట్లు బ్రహ్మచర్యమున స్థిరముగా నుండువాడు సర్వవిధముల వృద్ధి పొందును. కోరినట్లు పుత్రులు కలుగుదురు. ప్రతిష్ఠ ఏర్పడును. సర్వదిక్కులు వాని కోరికలను తీర్చును. జను లందరు వానిని ఆదర్శముగా పెట్టుకొని బ్రహ్మచర్యమును పాలింతురు.

ఏతేన బ్రహ్మచర్యేణ దేవా దేవత్వ మాప్నువన్,
ఋషయశ్చ మహాభాగా బ్రహ్మలోకం మనీషిణః. 20

ప్ర. అ. ఏతేన - ఈ; బ్రహ్మచర్యేణ - బ్రహ్మచర్యముతో; దేవాః - దేవతలు; దేవత్వమ్ - దేవత్వమును; అప్నువన్ - పొందిరి; మనీషిణః - బుద్ధి విశేషముగల; మహాభాగాః - పుణ్యాత్ములగు; ఋషయః, చ - ఋషులును; బ్రహ్మలోకమ్ - బ్రహ్మసాక్షాత్కారమును; అప్నువన్ - పొందిరి.

తా. దేవతలకు దేవత్వము బ్రహ్మచర్యమువలననే సిద్ధించినది. పుణ్యాత్ములు, వివేకవంతులునగు ఋషులు బ్రహ్మనుభూతిని బ్రహ్మచర్యమువలననే పొందిరి.

గన్ధర్వాణా మనేనైవ రూప మప్సరసా మభూత్,
ఏతేన బ్రహ్మచర్యేణ సూర్యోఽప్యహ్నాయ జాయతే. 21

ప్ర. అ. అనేన, ఏవ - ఈ బ్రహ్మచర్యముచేతనే; గన్ధర్వాణామ్ - గంధర్వులకు, గానమహిమ; అభూత్ - కలిగెను; అప్సరసామ్ - అచ్చరలకు; రూపమ్ - చక్కనిరూపము; అభూత్ - కలిగెను; ఏతేన - ఈ; బ్రహ్మచర్యేణ - బ్రహ్మచర్యముచేత; సూర్యః, అపి - సూర్యుడును; అహ్నాయ - జగములను ప్రకాశింపజేయు కాంతికొరకు; జాయతే - ఏర్పడుచున్నాడు.

తా. గంధర్వులకు గానమహిమయు, అప్సరసలకు రూపమహిమయు, సూర్యునకు తేజోమహిమయు ఈ బ్రహ్మచర్యమువలననే సిద్ధించినవి.

ఆకాఙ్క్షార్థస్య సంయోగా ద్రసభేదార్థినామివ,
ఏవం హ్యేతే సమాజ్ఞాయ తాదృగ్భావం గతా ఇమే. 22

ప్ర. అ. రసభేద-అర్థినామ్-చింతామణిని ప్రార్థించువారికి, ఆకాంక్షార్థస్య-కోరినవిషయముయొక్క, సంయోగాత్ - లాభమువలన; ఇవ-వలె; ఏతే, ఇమే-ఈ దేవాదులు; ఏవం, సమాజ్ఞాయ - ఈవిధముగా బ్రహ్మచర్యమును చక్కగా నెరిగి అనుష్ఠించి; తాదృగ్భావమ్ - ఆయా దేవాదిభావమును; గతాః-పొందిరి.

తా. చింతామణి కోరిన కోర్కెల నిచ్చువిధమున బ్రహ్మచర్యము కోరినఫలముల నన్నింటిని కూర్చును. వారి వారి ఇష్టములనుబట్టి దేవాదులు దేవత్వము మొదలగువానిని పొందిరి.

వ్యా. రసభేద మనగా పాదరసగుళిక వంటిది. దానిని చింతామణి అందురు; దానిని అర్థించువారు రసభేదార్థులు; ఆకాంక్ష్యార్థమనగా కోరిన విషయము. దానితో సంయోగము అనగా అది లభించుట-సమాజ్ఞాయ - పొంది.

చింతామణివలె బ్రహ్మచర్యము కోరినదానినెల్ల అనుగ్రహించును. వారు వారు తమ ఇష్టము ననుసరించి దేవాదిభావములను కోరి పొందిరి. వీనికంటె అతీతమగు మోక్షమునుకూడ పొందవచ్చునని తాత్పర్యము.

య ఆశ్రయేత్ పావయే చ్చాపి రాజన్
సర్వం శరీరం తపసా తప్యమానః,
ఏతేన వై బాల్య మభ్యేతి విద్వాన్
మృత్యుం తథా స జయ త్యన్తకాలే. 23

ప్ర. అ. రాజన్-రాజా! యః-ఎవడు, సర్వమ్-నాలుగుపాదములు గల బ్రహ్మచర్యమును; ఆశ్రయేత్ - ఆశ్రయించునో; తపసా-తపస్సుతో; తప్యమానః-దీప్తి పొందుచు; శరీరమ్ - శరీరమును; పావయేత్, చ-పవిత్ర మొనరించునో; సః-అట్టి; విద్వాన్-జ్ఞానసంపద కలవాడు, ఏతేన-ఈ బ్రహ్మచర్యముచేత; బాల్యమ్-బాల్యమును; అభ్యేతి-పొందును. తథా-అట్లే; అన్తకాలే-మరణ సమయమున, మృత్యుమ్-మరణమును; జయతి-జయించును.

తా. ఈ బ్రహ్మచర్యము నాశ్రయించి గాఢమగు తపస్సుతో శరీరమును పవిత్రము చేసికొన్న జ్ఞాని బాల్యమును పొందును. తుదికి మృత్యువును జయించును.

వ్యా. సర్వమనగా పైని చెప్పిన నాలుగు పాదముల బ్రహ్మచర్యము నంతటిని; బాల్యమును పొందుట యనగా రాగద్వేషాదిదోషములు లేని నిర్మల భావమును పొందుట. లేగా వేదాంతార్థములను యుక్తిపూర్వకముగా గ్రహించి నిలుపుకొను శక్తి పొందుట-"గ్రహణధారణపటుర్బాలః" అని గదా వ్యుత్పత్తి. గీతయందు "శక్నోతీహైవ"-ఇత్యాదిశ్లోకమున శరీరము విడచుటకు ముందే ఈలోకమునందే కామక్రోధములవలన పుట్టిన వేగమును నిలువరింపగలవాడు యోగియై సుఖము పొందును-అని చెప్పియున్నారు గదా!

అన్తవన్తః క్షత్రియ తే జయన్తి
లోకాన్ జనాః కర్మణా నిర్మలేన,
బ్రహ్మైవ విద్వాంస్తేన చాభ్యేతి సర్వం
నాన్యః పన్థా అయనాయ విద్యతే. 24

ప్ర.అ. క్షత్రియ-క్షత్రియా! నిర్మలేన-నిర్మలమగు; కర్మణా-కర్మము చేత; తే, జనాః - ఆ జనులు; అన్తవన్తః-అంతముగల; లోకాన్-లోకములను; జయన్తి - సాధింతురు. విద్వాన్ - జ్ఞానవంతుడు; తేన, చ - బ్రహ్మచర్యము చేత; బ్రహ్మ, ఏవ - బ్రహ్మమునే; అభ్యేతి - పొందును; చ - మరియు; సర్వమ్ - సర్వమును; అభ్యేతి - పొందును; అన్యః - మరియొక; పన్థాః - మార్గము; అయనాయ - మోక్షమునకు; న - లేదు.

తా. నిర్మలమగు కర్మమార్గముచేత బ్రహ్మజ్ఞానము లేని యితరజనులు నశించు స్వర్గాదిలోకములను చేరుకొందురు. జ్ఞాని మాత్రము నశింపని బ్రహ్మమును - దానివలన సర్వమును - పొందును. మోక్షమునకు ఇంతకంటె వేఱు మార్గము లేదు.

వ్యా. తే జనాః - అనగా బ్రహ్మజ్ఞానము లేని జనులు అని తాత్పర్యము. అన్తవన్తః, లోకాన్ - పునరావృత్తిగల లోకములను; జయతి - సాధించును. విద్వాంసుడుమాత్రము సర్వమును పొందును. బ్రహ్మము సర్వాత్మకము కనుక బ్రహ్మము నెరిగినవాడు సర్వమును పొందునని భావము. అతః - జ్ఞానము కంటె, మోక్షమునకు వేరుమార్గము లేదు. "జ్ఞానాదేవ తు కైవల్యమ్" జ్ఞానము వలననే కైవల్యము - అని గదా నిశ్చయము.

అవ. మోక్షమునకు జ్ఞానముకంటె వేరుమార్గము లేదని ధృతరాష్ట్రుడు వినెను. 'తూష్ణీంభూతుడై యుండవలయును. మానసచేష్టలుకూడ వదలవలయును' అను ధ్యానవిధానమునుబట్టి ఆత్మానుసంధానమునకు పూనుకొనెను. కాని అది పట్టువడలేదు. హృదయములోపల పెక్కు వర్ణములుగల నాడీమార్గములు కానవచ్చెను. వానినిగూర్చి అడుగుచున్నాడు.

ఆభాతి శుక్లమివ లోహిత మివాథో
కృష్ణ మథాఞ్జనం కాద్రవం వా,

సద్బ్రహ్మణః పశ్యతి యోఽత్ర విద్వాన్
కథంరూపం తదమృత మక్షరం పదమ్. 25

ప్ర.అ. యః - ఏ; విద్వాన్ - ఎరుకకలవాడు; సద్బ్రహ్మణః - సత్యమగు బ్రహ్మముయొక్క; రూపమ్ - రూపమును; పశ్యతి - చూచునో; తత్ - అది; శుక్లమివ - తెల్లనిదివలె; లోహితమ్, ఇవ - ఎఱ్ఱనిదివలె; అథో - ఇంకను; కృష్ణమ్ - నల్లనిదివలె; అఞ్జనమ్ - కాటుకవన్నెవలె; కాద్రవం, వా - నల్లని పొగరంగువలె; ఆభాతి - కానవచ్చుచున్నది; తత్ - ఆ; అమృతమ్ - అమృతము; అక్షరమ్ - అక్షరము అగు; పదమ్ - స్థానము; కథంరూపమ్ - ఎట్టి రూపము గలది.

తా. జ్ఞానముపొందినవాడు సద్బ్రహ్మము రూపమును చూచుచున్నాడు. అది తెల్లనిదా? ఎఱ్ఱనిదా? నల్లనిదా? కాటుకవన్నెయా? పొగ రంగా?

వ్యా. జ్ఞాని హృదయమున బ్రహ్మానుభవము పొందును. అది యే రూపము ఏ రంగు అని ప్రశ్న. అక్షరమ్ - సర్వవ్యాపకము; అమృతమ్ - వినాశము లేనిది; పదమ్ - పొందదగినది. కాద్రవమ్ - కుత్సితమైన - అనగా ఇతరులను పీడించుద్రవము - గమనము గలది కనుక కాద్రవమనగా పొగ - ఆ రంగు. బ్రహ్మమార్గమున రూపములు వినవచ్చుచున్నవి.

"తస్మిన్ శుక్ల ముత నీల మాహుః
పింగలం హరితం లోహితం చ,
ఏష పన్థా బ్రహ్మణా హానువిత్త
స్తేనైతి బ్రహ్మవిత్ పుణ్యకృత్తైజసశ్చ".

బ్రహ్మమార్గమందలి రూపములు తెలుపు, నలుపు మొదలగు వర్ణములలో నుండును. ఈ మార్గముద్వారా బ్రహ్మజ్ఞాని బ్రహ్మము నెరిగి పుణ్యకృత్తు, తైజసుడు అగుచున్నాడు.

పరమాత్మ ఏవర్గమువాడు? నిజమునకు వర్ణము పరమాత్మకు చెందినదా? అని ప్రశ్నభావము.

అవ. సమాధానము చెప్పుచున్నారు.

సనత్సుజాత ఉవాచ - సనత్సుజాతు డిట్లు చెప్పెను.

ఆభాతి శుక్లమివ లోహిత మివాథో
కృష్ణమాయస మర్కవర్ణమ్,
న పృథివ్యాం తిష్ఠతి నాన్తరిక్షే
నైత త్సముద్రే సలిలం బిభర్తి. 26

ప్ర.అ. శుక్లమివ - తెలుపువలె; లోహితమివ - ఎరుపువలె; కృష్ణమ్ - నల్లగా; ఆయసమ్ - ఇనుపరంగుగా; అర్కవర్ణమ్ - సూర్యునివంటి రంగుగా; ఆభాతి - తోచును. తు - కాని, ఏతత్ - ఇది పృథివ్యామ్ - భూమియందు, న, తిష్ఠతి - ఉండదు; అన్తరిక్షే - ఆకాశమున, న, తిష్ఠతి-ఉండదు; సముద్రే- సముద్రమున; సలిలమ్ - జలమును; న, బిభర్తి - ధరింపదు.

తా. ఆ బ్రహ్మము పెక్కువర్ణములలో తోచును. కాని దానిరూపము నేలపై, నింగిలో ఉండదు. అది సముద్రమున జలమును ధరింపదు.

వ్యా. ఆభాతి - బ్రహ్మమార్గమున అనేకవర్ణములు తోచినప్పటికిని ఆ బ్రహ్మము పృథివ్యాదులలో లేదు.

"అశబ్ద మస్పర్శ మరూప మవ్యయం
తథారసం నిత్య మగన్ధవచ్చ"

అని బ్రహ్మమునందు శబ్దాదివిషయములు లేవని చెప్పియున్నారు. ఆ పృథివి మొదలగునవి శబ్దాదులు కల కారణమున బ్రహ్మప్రాప్తిచిహ్నములే కాని బ్రహ్మమురూపములు కావు.

"నీహార ధూమార్కానిలానలానాం
ఖద్యోత విద్యుత్స్ఫటికశశీనామ్,
ఏతాని రూపాణి పురఃసరాణి
బ్రహ్మణ్యభివ్యక్తికరాణి యోగే"

అనుచోట ఆ యా వర్ణములు గల రూపములు బ్రహ్మము విషయమున అభివ్యక్తి కరములనియే చెప్పిరి. అభివ్యక్తి అనగా తోచుట.

సముద్రమనగా ఇచట సంసారసాగరము - అందు, ఏనమ్ - ఈ పర మాత్మను; సలిలమ్-జలము. దానిచే ఊహింపదగు పంచభూతాత్మకమగు దేహము; న బిభర్తి-పట్టుకొనదు. ఆత్మపదార్థము శరీరమునకు చిక్కదని భావము.

న తారకాసు న చ విద్యుదాశ్రితం
న చాభ్రేషు దృశ్యతే రూప మస్య,
న చాపి వాయౌ న చ దేవతాసు
నైత చ్చన్ద్రే దృశ్యతే నోత సూర్యే. 27

ప్ర. అ. అస్య-ఆ పరమాత్మయొక్క; రూపమ్ - రూపము; తారకాసు-తారకలయందు; న-లేదు; చ-మరియు, విద్యుదాశ్రితమ్ - విద్యుత్తు నంటిపెట్టుకొనినది, న-కాదు, అభ్రేషు-మేఘములయందు, న, దృశ్యతే-కానరాదు, అపి, చ-మరియును, వాయౌ-గాలియందు, న-కానరాదు, దేవతాసు - దేవతలయందు, న-కానరాదు, చన్ద్రే - చంద్రునియందు, న, దృశ్యతే-కనబడదు, ఉత-మరియు, సూర్యే-సూర్యునియందు, న-కనబడదు.

తా. ఆ పరమాత్మరూపము నక్షత్రములలో, మెరపులలో, మేఘములలో, గాలికో, దేవతలలో, చంద్రునిలో, సూర్యునిలో కనబడదు.

వ్యా. ఆత్మకు స్వరూపాదులు లేవని వివరించుటకే యిట్లు చెప్పుట.

అవ. ప్రపంచము నామరూపాత్మకము. బ్రహ్మమునకు నామరూపములు లేవు. కావున రూపప్రపంచముకంటె భిన్నమైనదని నిరూపించి నామప్రపంచము కంటె వేరైనదని నిరూపించుచున్నారు.

నైవర్క్షు తన్న యజుష్షు నాప్యథర్వసు
న దృశ్యతే వై విమలేషు సామసు,
రథన్తరే బార్హద్రథే వాఽపి రాజన్
మహావ్రతేనైవ దృశ్యతే ధ్రువం తత్. 28

ప్ర. అ. రాజన్-రాజా! తత్-ఆ బ్రహ్మము, ఋక్షు-ఋక్కులయందు, యజుష్షు - యజుర్మంత్రములందు, అథర్వసు - అథర్వవేదమంత్రములందు, విమలేషు-విమలములైన, సామసు - సామములయందును, రథంతరే-రథంతర

సామమునందును, బార్హద్రథే - బార్హద్రథసామమునందును, మహావ్రతే-మహావ్రతమునందు, న, ఏవ, దృశ్యతే-కన్పట్టదు, తత్-ఇది, ధ్రువమ్-నిశ్చయము.

తా. రాజా! ఆ బ్రహ్మము ఋక్కు, యజుస్సు, అథర్వము, సామము, రథంతరము, బార్హద్రథము, మహావ్రతము మున్నగు వేదములం దెచ్చటను కాననే రాదు.

వ్యా. తత్ - అనుదానికి బ్రహ్మముయొక్క నామాత్మక స్వరూపమని తాత్పర్యము. విపులేషు - వైశ్వానరసామము మొదలగునవి; రథంతర బార్హద్రథములకు పృష్ఠ్యసామము అని పేరు. మహావ్రత మనునది ఒకవిధమగు యజ్ఞము. దీనిచేత యజ్ఞయాగాదికర్మములచేతను అది చూడరానిదని సూచన. "నాస్త్యకృతః కృతేన" - అని శ్రుతి. అకృతమనగా మోక్షము. అది కృతము చేత - కర్మముచేత యజ్ఞాదికముచేత, నాస్తి - లేదు - అని శ్రుత్యర్థము.

ఏల యనగా తత్ ధ్రువమ్ - అది నిత్యము

అపారణీయం తమసః పరస్తాత్
తదన్తకోఽప్యేతి వినాశకాలే,
అణీయో రూపం క్షురధారయా సమం
మహచ్చ రూపం తద్వై పర్వతేభ్యః. 29

ప్ర.అ. తత్ - అది; అపారణీయమ్ - దాటరానిది; తమసః - అజ్ఞానమునకు, పరస్తాత్ - ఆవలిది; అన్తకః, - యముడు; వినాశకాలే-ప్రళయకాలమున; తత్ - ఆ బ్రహ్మమును, అప్యేతి - చేరుకొనును; రూపమ్-రూపము; అణీయః-అతిసూక్ష్మమైనది; క్షురధారయా - చురకత్తి అంచుతో; సమమ్ - సమమైనది; తత్-అది; పర్వతేభ్యః - మహాపర్వతములకంటె; మహత్ - గొప్పది.

తా. ఆ బ్రహ్మమున దాటరానిది.అజ్ఞానమున కావలిది. ప్రళయకాలమున యముడును అందు లయమగును. దానిరూపము మిక్కిలి సూక్ష్మమైనది. చురకత్తి అంచు వంటిది. మరియు మహాపర్వతములకంటె పెద్దది.

వ్యా. వదలరానిది కనుక అపారణీయము. తమసః పరస్తాత్ - అజ్ఞానరూపమగు ఉపాధికంటె వేరైనది; సర్వులను సమయించు యముడుకూడ అందు లయమైపోవును. దీనిచేత దేవతావిలక్షణత్వము సిద్ధించుచున్నది. అణీయః -

అనుటవలన ఇంద్రియములకు గోచరింపనిదని తెలియుచున్నది. క్షురధారయా సమమ్ - అనుటవలన - శ్రద్ధాయుక్తులతో గ్రహింపవలయు ననుట; పర్వ తేభ్యః - అనుమాట ఉపలక్షణము. సర్వముకంటె పెద్దది అని ఫలితార్థము.

సా ప్రతిష్ఠా తదమృతం లోకా స్తద్బ్రహ్మ తద్యశః,
భూతాని జజ్ఞిరే తస్మాత్ ప్రలయం యాన్తి తత్ర హి. 30

ప్ర.అ. సా - అది; ప్రతిష్ఠా - సర్వాధారము; తత్ - అది; అమృతమ్- ఎట్టి వికారములు లేనిది; లోకాః - దృశ్యమగు సర్వలోకములును; తత్-అది; బ్రహ్మ - సర్వముకంటె పెద్దది; తత్ - అది; యశః - యశస్సు; తస్మాత్ - దానినుండి; భూతాని - భూతములన్నియు; జజ్ఞిరే - పుట్టినవి; తత్ర - అందు; ప్రలయమ్ - ప్రళయమును; యాన్తి - పొందుచున్నవి.

తా. ఆ పరమాత్మ సర్వాధారము, నిర్వికల్పము, సర్వలోకములు తత్స్వరూపమే. అది బ్రహ్మము, రమణీయము. దానివలననే భూతములన్నియు పుట్టి అందు అణగుచున్నవి.

వ్యా. ప్రతిష్ఠ అనగా అన్నింటికి ఆధారమైనది. అమృతమ్ - ఒక వికార రూపము మరియొక వికారమును పొందుటయే మృతి - అట్టి వికారములులేనిది. లోక్యన్తే ఇతి లోకాః - లోకము అనగా దృశ్యమాత్రమగు ప్రపంచమంతయు; యశః - రమణీయము. "తస్య నామ మహద్యశః"-అతని పేరు మహాయశస్సు అని శ్రుతి. తస్మాత్ జజ్ఞిరే - మట్టికుండకువలె సమస్త సృష్టికి పరమాత్మయే ఉపాదానకారణము. "తత్ర ప్రలయం యాన్తి" - ఘటము మరల మట్టిలో కలసిపోయినట్లు సృష్టియంతయు పరమాత్మలో లీనమగును. శ్రుతి ఈ యర్థమునే చెప్పుచున్నది.

"యతో వా ఇమాని భూతాని జాయన్తే
యేన జాతాని జీవన్తి, యత్ప్రయ న్త్యభిసంవిశ న్తీతి
తద్విజిజ్ఞాసస్వ తద్బ్రహేతి"

సర్వభూతములు దేనినుండి పుట్టునో, దేనిచేత జీవించునో, యెందు లయ మగునో దానిని తెలియగోరుము. అదియే బ్రహ్మము. దీనిచేత బ్రహ్మము జగత్తునకు కారణమని స్పష్టమయినది.

అనామయం తన్మహ దుద్యతం యశో
వాచోవికారం కవయో వదన్తి,
యస్మిన్ జగత్ సర్వమిదం ప్రతిష్ఠితం
యే తద్విదు రమృతా స్తే భవన్తి. 31

ప్ర. అ. అనామయమ్ - ఏ రోగము లేనిది; మహత్-గొప్పది; ఉద్యతమ్-జగత్తుగా పైకి వచ్చినది; యశః - సుందరమైనది; వాచః, వికారమ్-వాక్కుగా రూపొందినదని; కవయః - కవులు; వదన్తి-చెప్పుదురు; యస్మిన్ - దేనియందు; ఇదమ్ - ఈ; సర్వమ్ - సమస్తమగు; జగత్ - జగత్తు; ప్రతిష్ఠితమ్ - నెలకొనియున్నదో, తత్-దానిని, యే-ఎవరు; విదుః - తెలిసికొనిరో; తే - వారు; అమృతాః - మృతి లేనివారు; భవన్తి - అగుదురు.

తా. ఆ బ్రహ్మము సుఖదుఃఖాదివికారములు లేనిది. పెద్దది. జగత్తుగా పైకి పొటమరించినది. వాక్స్వరూపముగా రూపొందినదని కవులు పలుకుదురు. దీనియందే జగత్తు నెలకొని యున్నది. దీని నెరిగినవారు ముక్తులు.

వ్యా. అనామయమ్ - ద్వైతములేనిది; ఉద్యతమ్ - జగదాకారముగా రూపొందినది; మహత్ - ఆకాశాదులకంటెను పెద్దది; వాచః - అని షష్ఠి తృతీయార్థమున ప్రయుక్తమైనది. వాగ్రూపముగనే యున్నదని కవులు చెప్పుదురు. మరియొక స్వరూపము లేదని తాత్పర్యము. "వాచారమ్భణం వికారో నామధేయమ్" - అను శ్రుతి వికారమునకు - మారిన స్వరూపమునకు - వాక్కు ఆలంబనమని చెప్పుచున్నది. ఒక స్వరూప మేర్పడినంతనే ఒక పేరు వచ్చుట మనము చూచుచున్నాము. ప్రతిష్ఠితమ్-రజ్జువునందు భ్రాంతిరూపమున సర్పము తోచినట్లు - తోచుచున్నదని భావము. అమృతు లగుట యనగా ముక్తు లగుట.

ఇతి శ్రీమహాభారతే ఉద్యోగపర్వణి సనత్సుజాతపర్వణి
సనత్సుజాతవాక్యే చతుశ్చత్వారింశోఽధ్యాయః.

ఇది శ్రీమహాభారతము ఉద్యోగపర్వమున సనత్సుజాతపర్వమున
సనత్సుజాతవాక్యముగల నలుబదినాలుగవ అధ్యాయము.

— (౦) —

# పఞ్చచత్వారింశోఽధ్యాయః-నలుబదియైదవ అధ్యాయము

## గుణదోషాణాం లక్షణం బ్రహ్మవిద్యాయాశ్చ నిరూపణమ్-
## గుణదోషముల లక్షణమును బ్రహ్మవిద్యను నిరూపించుట.

అవ. జ్ఞానము ప్రధానము, యోగము అప్రధానము అగు బ్రహ్మవిద్య ముగిసినది. ఇటుపై యోగము ప్రధానము, జ్ఞానము ఉపసర్జనము అగు బ్రహ్మవిద్యను రాబోవు రెండు అధ్యాయములలో వివరించుచున్నారు. ఇందు ముందు చిత్తవృత్తిని నిరోధించుటద్వారా 'త్వం'పదము అర్థము నెరిగి పిదప వేదాంతవాక్య శ్రవణముచేత దాని బ్రహ్మత్వమును నిశ్చయించుట మొదటిది. పిదప శ్రవణాదికముచే ముందు పరోక్షరూపమున బ్రహ్మభావమును నిశ్చయించి వెనుక నిదిధ్యాసనముద్వారా దానిని అపరోక్షముగా చేసికొనుట రెండవపద్ధతి. ఈ రెండు మార్గములకు ఫలమొక్కటియే. కావున సాధనసంపత్తికూడ ఒక్కతీరుననే యుండును అని తెలుపుటకును పూర్వమే వివరించిన వదలవలసిన దోషములను, గ్రహింపవలసిన గుణములను ప్రదర్శించుచున్నారు.

సనత్సుజాత ఉవాచ - సనత్సుజాతు డిట్లు పలికెను.

శోకః క్రోధశ్చ లోభశ్చ కామో మానః పరాసుతా,
ఈర్ష్యా మోహో విధిత్సా చ కృపాసూయా జుగుప్సతా, 1
ద్వాదశైతే మహాదోషా మనుష్యప్రాణనాశనాః.

ప్ర. అ. శోకః-ఏడుపు; క్రోధః-తీవ్రకోపము; లోభః-పిసినిగొట్టుతనము; కామః-వాంఛ; మానః-గర్వము; పరాసుతా-నిద్దురమత్తుతనము; ఈర్ష్యా-ఈర్ష్య; మోహః-బుద్ధి సన్నగిల్లుట; విధిత్సా-స్వార్థము; కృపా-స్నేహము; అసూయా - అసూయ; జుగుప్సతా-ఏవగింపు; ఏతే-ఈ; ద్వాదశ - పంద్రెండును; మనుష్యప్రాణనాశనాః-మనుజుల ప్రాణము లపహరించు; మహాదోషాః-గొప్ప దోషములు.

తా. శోకము, క్రోధము, లోభము, కామము, మానము, నిద్దురమత్తుతనము, ఈర్ష్య, బుద్ధిమాంద్యము, స్వార్థము, అతిస్నేహము, అసూయ, ఏవగింపు-అను నీ పంద్రెండు మహాదోషములును మానవుల ప్రాణముల హరించునవి.

వ్యా. ఈ శ్లోకాదుల నిదివరకే వ్యాఖ్యానించి యున్నారు. విశేషముల నిట చెప్పుచున్నారు. మోహమనగా తెలివిలేకపోవుట, లోభమనగా అన్నియు తామలయు ననుకొనుట; పరాసుత యనగా నిద్దురమత్తుగా నుండుట, కృప యనగా కొందరి యందు మెత్తదనము. దీనినే స్నేహమని వ్యాఖ్యానించిరి.

ఏకైక మేతే రాజేన్ద్ర మనుష్యాన్ పర్యుపాసతే,
యై రావిష్టో నరః పాపం మూఢసంజ్ఞో వ్యవస్యతి. 2

ప్ర. అ. రాజేన్ద్ర - రాజేంద్రా: ఏతే - ఇవి, ఏక - ఏకమ్ - ఒక్కొకక్క టియు, మనుష్యాన్ - మనుష్యులను, పర్యుపాసతే - పట్టి పొలార్చును; యైః - ఏ వీనితో; ఆవిష్టః - ఆవేశింపబడిన; నరః - నరుడు; పాపమ్ - పాపఫలమైన కర్మమును; వ్యవస్యతి - చేయదొరకొనునో; సః - అతడు; మూఢసంజ్ఞః - మూఢబుద్ధి యగును.

తా. రాజా! వీనిలో నొక్కొక్కటియు మనుష్యులను పట్టి పల్లార్చును. వీనికి చేజిక్కిన నరుడు పాపఫలములైన పనులనే చేయుచు మూఢబుద్ధి యగును.

వ్యా. పాప మనగా పాపఫలము నొసగు కర్మము; వ్యవస్యతి - ప్రారంభించును; మూఢసంజ్ఞః - మూఢబుద్ధి.

స్పృహయాలు రుగ్రః పరుషో వా వదాన్యః
క్రోధం బిభ్రన్ మనసా వై వికత్థీ,
నృశంసధర్మాః షడిమే జనా వై
ప్రాప్యార్థం నోత సభాజయన్తే. 3

ప్ర. అ. స్పృహయాలుః - కోరికలతో సతమతమగువాడు; ఉగ్రః - దయలేనివాడు; పురుషః - తీవ్రముగా మాటాడువాడు; వదాన్యః - వదరుబోతు; మనసా - మనస్సుతో; క్రోధమ్ - క్రోధమును; బిభ్రన్ - పట్టి యుంచుకొను వాడు; వికత్థీ - తన్నెల్లప్పుడు పొగడుకొనువాడు; ఇమే ఈ; షట్ - ఆరుగురు; జనాః - జనులు, నృశంసధర్మాః - క్రూరప్రవృత్తి కలవారై; అర్థమ్ - ధనమును, ప్రయోజనమును; ప్రాప్య, అపి - పొందియు; న, సభాజయన్తే - మన్నింపరు.

తా. వాంఛలు పెల్లురేగినవాడు, దయలేనివాడు, తీవ్రవాది, వదరుబోతు, గుండెనిండ కోపము కలవాడు, తన్ను దాను పొగడుకొనువాడు - అను నీ ఆరుగురు క్రూరమైన ప్రవృత్తికలవారు - వారు ఇతరులవలన ప్రయోజనము పొందియు వారిని గౌరవింపరు.

వదాన్యుడనగా నోటకి వచ్చినట్లు వాగువాడు; న, సభాజయన్తే - ఇతరుని మన్నింపరు. మన్నింపవలసినవానిని మన్నింపకుండుట మహాదోషము.

సంభోగసంవిద్విషమోఽతిమానీ
దత్త్వా వికత్థీ కృపణో దుర్బలశ్చ,
బహుప్రశంసీ వనితాద్విట్ సదైవ
సప్తైవోక్తాః పాపశీలా నృశంసాః. 4

ప్ర. అ. బహుప్రశంసీ - ఆత్మస్తుతి ఎక్కువగా చేసికొనువాడు.

(ఈ శ్లోకమునకు అర్థ తాత్పర్య వ్యాఖ్యానములు 43 వ అధ్యాయము. 19 వ శ్లోకమున చూడనగును.)

ధర్మశ్చ సత్యం చ తపో దమశ్చ
అమాత్సర్యం హ్రీ స్తితిక్షాఽనసూయా,
దానం శ్రుతం చైవ ధృతిః క్షమా చ
మహావ్రతా ద్వాదశ బ్రాహ్మణస్య. 5

వ్యా. మహావ్రతాని అనుదానికి 'మహావ్రతాః' అనునది ఆర్షరూపము. (అర్థ తాత్పర్య వ్యాఖ్యానములు 43 అ. 20వ శ్లోకమున చూడనగును)

యో నైతేభ్యః ప్రచ్యవే ద్ద్వాదశభ్యః
సర్వా మపీమాం పృథివీం సశిష్యాత్,
త్రిభి ర్ద్వాభ్యా మేకతో వార్థితో వా
నాస్య స్వమస్తీతి చ వేదితవ్యమ్. 6

ప్ర. అ. యః - ఎవడు; ఏతేభ్యః - ఈ; ద్వాదశభ్యః - పండ్రెండు గుణములనుండి; న, ప్రచ్యవేత్ - జారడో; సః - అతడు; సర్వామ్ - సమస్తమైన; ఇమామ్ - ఈ; పృథివీమ్ - భూమిని; శిష్యాత్ - శాసించును; త్రిభిః -

మూడింటితోడనో; ద్వాభ్యామ్ - రెంటితోడనో; ఏకతః, వా - ఒకదానితోడనో; అర్థితః - సొమ్ము కలవాడు; ప్రచ్యవేత్ - జారినచో; తస్య - అతనికి; స్వమ్ - సొమ్ము; న, అస్తి, ఇతి - లేదని; వేదితవ్యమ్ - ఎరుగనగును.

తా. ఈ పంద్రెండు మహాగుణములనుండి జారుపాటు లేనివాడు ఈ సమస్తభూమిని శాసింపగలవాడగును. ఇందులో మూడో, రెండో, ఒకటియో జారిపోయినను వానికి తనదగు సొమ్ము ఏదియు లేదనియే తెలియదగును.

వ్యా. ధర్మాదులలో ఏయొక్కదానియందో పక్షపాతమున్నచో సర్వము నశించునని తాత్పర్యము.

దమ స్త్యాగోఽథాప్రమాద ఇత్యేతే ష్వమృతం స్థితమ్,
ఏతాని బ్రహ్మముఖ్యానాం బ్రాహ్మణానాం మనీషిణామ్. 7

ప్ర. అ. దమః - నిగ్రహము; త్యాగః - త్యాగము; అప్రమాదః - శ్రద్ధ; ఇతి - అను; ఏతేషు - వీనియందు; అమృతమ్ - మోక్షము; స్థితమ్ - నెలకొనియున్నది; బ్రహ్మముఖ్యానామ్ - బ్రహ్మమే ముఖ్యముగా పొందదగిన వారును; మనీషిణామ్ - ప్రజ్ఞ కలవారును అగు; బ్రాహ్మణానామ్ - బ్రహ్మ జ్ఞానసాధకులకు; ఏతాని - ఇవియే - ముఖ్యవ్రతములు.

తా. ఇంద్రియనిగ్రహము, త్యాగము, శ్రద్ధ అను నీ మూడే మోక్షమునకు చెదరని తావులు. బ్రహ్మమే ముఖ్యముగా పొందదగినదను జ్ఞానముగల బుద్ధిమంతుల కివియే మహావ్రతములు.

సద్వాఽసద్వా పరీవాదో బ్రాహ్మణస్య న శస్యతే,
నరకప్రతిష్ఠా వై స్యు ర్య ఏవం కురుతే జనాః. 8

ప్ర. అ. సత్, వా-నిజమో, అసత్, వా-అబద్ధమో, పరీవాదః-ఇతరులను నిందించుట, బ్రాహ్మణస్య - బ్రహ్మతత్త్వ మెరుగువానికి, న, శస్యతే-మంచిది కాదు, యే-ఎవరు, ఏవం-ఇట్లు, కుర్వతే-చేయుదురో, తే జనాః-వారు, నరకప్రతిష్ఠాః-నరకమున గట్టిడునికి గలవారు, స్యుః-అగుదురు.

తా. నిజమే అయినను, అబద్ధమే అయినను పరులదోషముల నెత్తిచూపుట మంచిపని కాదు. ఆపని చేయువారు నరకమున శాశ్వతముగా నుండిపోవుదురు.

వ్యా. సద్వా - నిజమయినది; అసద్వా-కల్పించినది; పరీవాదః-పరదోషములను పలుకుచుండుట.

మదోఽష్టాదశదోషః స స్యాత్ పురా యోఽప్రకీర్తితః.

ప్ర. అ. యః-ఏది; పురా-మునుపు; అప్రకీర్తితః-సూటిగా చెప్పబడలేదో; సః-ఆ; మదః-మదము; అష్టాదశదోషః-పదునెనిమిది దోషములు గలది; స్యాత్-అగును.

తా. మదము పదునెనిమిది దోషములు గలది. ఈ విషయము మునుపు సూటిగా చెప్పలేదు. ఇప్పుడు చెప్పుచున్నారు.

లోకద్వేష్యం ప్రాతికూల్య మభ్యసూయా మృషావచః. 9
కామక్రోధౌ పారతన్త్ర్యం పరివాదోఽథ పైశునమ్.
అర్థహాని ర్వివాదశ్చ మాత్సర్యం ప్రాణిపీడనమ్. 10
ఈర్ష్యామోదోఽతివాదశ్చ సంజ్ఞానాశోఽభ్యసూయితా,
తస్మాత్ ప్రాజ్ఞో న మాద్యేత సదా హ్యేతద్విగర్హితమ్. 11

ప్ర. అ. లోకద్వేష్యమ్ - లోకము నిందించు తప్పుడుపనులు; ప్రాతికూల్యమ్ - ధర్మాదులయందు వ్యతిరేకభావము; అభ్యసూయా-గుణముకలవారియందు దోషములుచెప్పుట; మృషావచః-అబద్ధములు పలుకుట; కామః-స్త్రీవాంఛ; క్రోధః - తీవ్రకోపము; పారతన్త్ర్యమ్ - మద్యము మొదలగువానికి వశుడగుట; పరివాదః-ఇతరులను నిందించుట; పైశునమ్ - కొండెములు చెప్పుట; అర్థహానిః-వ్యసనములలో తగులుకొని ధనము పోగొట్టుకొనుట; వివాదః - తగవులాడుట; మాత్సర్యమ్-పగబూనుట; ప్రాణిపీడనమ్-ప్రాణులను హింసించుట, ఈర్ష్యా-ఓర్వలేనితనము; మోదః-గర్వముతో కులుకుట; అతివాదః-మర్యాద తప్పి మాటాడుట; సంజ్ఞానాశః - వివేకము పోగొట్టుకొనుట; అభ్యసూయితా - ఎల్లవేళల తప్పులు వెదకుట, ప్రాజ్ఞః - బుద్ధిమంతుడు, తస్మాత్-ఈపదునెనిమిది గుణములు గల మదమునెడల, న మాద్యేత-పొరపాటు పడరాదు, హి-ఏల యన, ఏతత్-ఇది, విగర్హితమ్-మిక్కిలి నింద్యమయినది.

తా. లోకము నిందించు పరదారగమనము మొదలగు తప్పుడుపనులు, ధర్మాదులయెడ విరుద్ధభావము, గుణములను దోషములుగా భావించుట, కల్ల

లాడుట, కామము, క్రోధము, వ్యసనములందు లోనగుట, పరనింద, కొండెములు పలుకుట, పాడుపనులతో సొమ్ము పోగొట్టుకొనుట, తగవులాడుట, పగబూనుట, ప్రాణులను హింసించుట, ఓర్వలేనితనము, గర్వముతో పొంగిపోవుట; మర్యాద తప్పి మాటాడుట, వివేకము లేకుండుట, ఎల్లవేళల తప్పులే వెదకుట, అను వానిని మెలకువతో దరిజేరనీయరాదు. ఇది మిక్కిలి నింద్యము.

వ్యా. మోదమనగా-పొంగిపోవుట - ఇది గర్వమును పెంచును. 'హృష్టో దృప్యతి'- తన పనులకు పొంగిపోవువాడు గర్విష్ఠి యగును. అని అపస్తంబులు చెప్పిరి. సదా-ఏతద్విగర్హితమ్-అనుటవలన ఆపత్కాలమున కూడ ఈ లక్షణ ములను ఆశ్రయింపరాదని సూచన.

సౌహృదే వై షడ్గుణా వేదితవ్యాః
ప్రియే హృష్య త్యప్రియే చ వ్యథన్తే,
స్యాదాత్మనః సుహితం యాచతే యో
దదా త్యయాచ్యమపి దేయం ఖలు స్యాత్,
ఇష్టాన్ పుత్రాన్ విభవాన్ స్వాంశ్చ దారా-
నభ్యర్థిత శ్చార్హతి శుద్ధభావః. 12

ప్ర. అ. సౌహృదే-మంచితనమునందు; షట్ - ఆరు; గుణాః-గుణములు; వేదితవ్యాః-తెలియదగినవి.

1. ప్రియే-ప్రియము కలుగగా; హృష్యతి-సంతోషపడును. 2. అప్రియే-అప్రియము కలుగగా; వ్యథన్తే - దుఃఖపడుదురు. 3. ఆత్మనః - తనకు, సుహితమ్-మిక్కిలి యిష్టమైనవి, స్యాత్-అగుగాక! యః-ఎవ్వడేని; దేయమ్ - దాతను; అయాచ్యమ్, అపి - అడుగరానిదానినైనను; యాచతే - అడుగునేని; అభ్యర్థితః - అడుగబడినదాత, శుద్ధభావః - కల్మషములేని భావముగలవాడై; దదాతి-ఇచ్చును; ఇష్టాన్-ఇష్టులైన; పుత్రాన్-పుత్రులను; విభవాన్-సంపదలను స్వాన్-తన; దారాన్, చ-భార్యలనైనను, అర్హతి-ఈయవలయును.

తా. మిత్రునిలక్షణము లారు. నిజమైన మిత్రుడు తన మిత్రునకు ప్రియము కలిగినచో పొంగిపోవును. అప్రియము కలిగినచో క్రుంగిపోవును. తనకు మిక్కిలి యిష్టమైన పదార్థముల నైనను మిత్రు డడిగినచో ఇచ్చివేయును.

అడుగరానివానినైనను - పుత్రులనో - సంపదలనో, కడకు భార్యలనైనను- అడిగినచో హృదయమున కలతపడక ఇచ్చివేయును.

వ్యా. ఇందు సుహృద్గుణము లారింటిలో మూడింటిని చెప్పుచున్నారు. సుహితమ్-మిక్కిలి ఇష్టమైనది, మేలుకూర్చునది. 'దేయ' శబ్ద మిచట కర్త్రర్థమున కృత్యప్రత్యయము చేరిన రూపము. దేయు డనగా దాత అని యర్థము. ఎవ్వడైన దాతను అడుగరానిదాని నడిగినను-కడకు దారపుత్రాదుల నడిగినను- ఇచ్చివేయుట నిజమైన మిత్రలక్షణ మని యిచట చెప్పుచున్నారు. ఇది త్యాగ గుణమునకు పరసీమ.

అవ. తక్కిన మూడులక్షణములను చెప్పుచున్నారు.

త్యక్తద్రవ్యః సంవసే న్నేహ కామాద్,
భుఙ్క్తే కర్మ స్వాశిషం బాధతే చ. 13

ప్ర.అ. త్యక్తద్రవ్యః - త్యాగముచేసిన ధనము కలవాడై; కామాత్ - ఇష్టపూర్వకముగా; ఇహ - ఈ మిత్రునికడ; న, సంవసేత్ - నివాస ముండరాదు.

తా. తన సొమ్ము మిత్రున కిచ్చి ఈతడు నావలన ఉపకారము పొందెను గదా యన్న భావముతో అతనికడ నివసింపరాదు.

వా. అట్లు నివసించినచో ఒకప్పుడు మైత్రీభంగము కలుగవచ్చును ఇది నాలుగవ లక్షణము.

ప్ర.అ. కర్మ - కర్మమునే; భుఙ్క్తే - అనుభవించును.

తా. తన కష్టముతో సాధించిన ధనమునే అనుభవించును గాని మిత్రుల సొమ్ముపై ఆధారపడి బ్రదుకడు.

వ్యా. దీనివలన కాలక్రమమున అవహేళన కలిగి మైత్రి చెడిపోవచ్చును. ఇది అయిదవలక్షణము.

ప్ర.అ. స్వాశిషమ్ - తనకు శ్రేయమైనదానినికూడ; బాధతే-బాధించును.

తా. తనకు శ్రేయమైనదయ్యును, మిత్రునకు బాధాకరమైనచో అట్టి పని చేయడు.

వ్యా. స్వార్థముకంటె మిత్రార్థమే ఎక్కువ యిష్టమని భావన.

ద్రవ్యవాన్ గుణవా నేవం త్యాగీ భవతి సాత్త్వికః,
పఞ్చభూతాని పఞ్చభ్యో నివర్తయతి తాదృశః. 14

ప్ర.అ ద్రవ్యవాన్ - ద్రవ్యముగలవాడు; గుణవాన్ - గుణములు గలవాడు; సాత్త్వికః - సత్త్వగుణము గలవాడు; ఏవమ్ - ఈవిధముగా; త్యాగీ - త్యాగగుణముకలవాడు, భవతి, చేత్ - అయినచో; తాదృశః - అట్టివాడు; పఞ్చ భూతాని - అయిదుభూతములను; పఞ్చభ్యః - అయిదు విషయములనుండి; నివర్తయతి - మరలించును.

తా. ఇట్లు ధనవంతుడు, గుణవంతుడు, సత్త్వగుణప్రధానుడు అగు త్యాగి అయిదింద్రియములను అయిదు విషయములనుండి మరలించును. ఇంద్రియ నిగ్రహ మతనికి సులభ మగునని తాత్పర్యము.

వ్యా. ద్రవ్యవంతు డనగా గృహస్థుడని భావము. పంచభూతములనగా వాని పరిణతరూపములగు చెవి, చర్మము, కన్ను, నోరు, ముక్కు అను అయిదు ఇంద్రియములు, అయిదువిషయములు శబ్దస్పర్శరూపరసగంధములు.

అవ. విషయములనుండి యింద్రియములను మరలించుట అనునది తపస్సు. ఊర్ధ్వగతి నొసగును. అంతేకాని జ్ఞానమువలె ఇచటనే కృతకృత్యతను కూర్పదు. అట్టి స్థితి ఎవరికో చెప్పుచున్నారు.

ఏవం సమృద్ధ మప్యూర్ధ్వం తపో భవతి కేవలమ్,
సత్త్వాత్ ప్రచ్యవమానానాం సఙ్కల్పేన సమాహితమ్. 15

ప్ర.అ. సత్త్వాత్ - ధైర్యమునుండి; ప్రచ్యవమానానామ్ - జారిపోవువారికి; ఏతత్ - ఇది; సమృద్ధమ్; అపి - సంపూర్ణమే అయినను; సంకల్పేన - సంకల్పముతో; సమాహితమ్ - చేయబడినదై; కేవలమ్ - కేవలము; ఊర్ధ్వమ్- ఊర్ధ్వగతినొసగు; తపః - తపస్సు; భవతి - అగును.

తా. ఈ ఇంద్రియనిగ్రహము పండినప్పటికిని ధైర్యమునుండి జారిన వారికి సంకల్పములతో నేర్పడినదై కేవలము ఊర్ధ్వగతి నొసగు తపస్సు మాత్రమే అగును.

వ్యా. సత్త్వమనగా నిట మనోబలము. తీవ్రవైరాగ్యములేక ఆ మనోబలము జారినచో ఇంద్రియనిగ్రహము ఎంత పాకమునకు వచ్చినను ఊర్ధ్వ

గతి నొసగు తపస్సే అగును గాని మోక్షదాయకము కానేరదని తాత్పర్యము. సంకల్పేన - బ్రహ్మలోకాదులను పొందుదును అను సంకల్పముతో సాధింప బడినదై; బ్రహ్మలోకాదులు పునరావృత్తి కలవియే కదా!

యతో యజ్ఞాః ప్రవర్ధనే సత్యస్యై వావరోధనాత్,
మనసాఽన్యస్య భవతి వాచాఽన్యస్యాథ కర్మణా. 16

ప్ర.అ. యతః - ఏ సంకల్పమువలన; యజ్ఞాః-యజ్ఞములు; ప్రవర్ధన్తే - వృద్ధి పొందుచున్నవో; సత్యస్య - ఆ సంకల్పముయొక్క; అవరోధనాత్ - బిగపట్టుటవలన; అన్యస్య - ఒకనికి; మనసా - మనస్సుతో; భవతి- (యజ్ఞము) అగును; అన్యస్య - మరియొకనికి; వాచా - వాక్కుతో; అథ, అన్యస్య - వేరొకనికి; కర్మణా - కర్మముతో; భవతి - అగును.

తా. సంకల్పములవలననే యజ్ఞములు వృద్ధి పొందుచున్నవి. సంకల్పమును నిలువరించుటవలననే సాధకుడు యోగి కాగలడు. ఒకనికి మనస్సుతో మరియొకనికి వాక్కుతో వేరొకనికి కర్మముతో యజ్ఞము సిద్ధించును.

వ్యా. సత్యసంకల్పమువలన సాధకుడు యోగి యగును. అట్టివానికి మనసుతోడనే యజ్ఞము సిద్ధించును. త్రితుడను మునిని సోదరుడు నూతిలోనికి త్రోసివైచెను. ఆ త్రితు డందే మానసికముగా యజ్ఞమును గావించెను. "త్రితః కూపేఽవహితో దేవాన్ హవత ఊతయే" అను మంత్రము దీనిని తెలుపుచున్నది. అవహితః యనగా ధ్యానము చేయుచు; హవతే - ఆహ్వానించుచున్నాడు; ఊతయే - యజ్ఞసంతతికొరకు - ఇట్లు మానసమైన యజ్ఞము ఉత్తమము.

మరియొకడు వాక్కుతో యజ్ఞము చేయును అనగా బ్రహ్మయజ్ఞము, జపము మొదలగునది. ఇవి మధ్యమము. ఇంకొకడు ఆజ్యహోమము, పశువిశసనము, పురోడాశము మొదలుగాగల కర్మాత్మకమైన యజ్ఞము చేయును. ఇది మూడవరకము.

సఙ్కల్పసిద్ధం పురుష మసఙ్కల్పోఽధితిష్ఠతి,
బ్రాహ్మణస్య విశేషేణ కిఞ్చాన్యదపి మే శృణు. 17

ప్ర. అ. సంకల్పసిద్ధమ్ - సంకల్పము నెరవేరిన; పురుషమ్-పురుషుని; అసంకల్పః-సంకల్పములేని చిదాత్మ-జ్ఞానాత్మ; అధితిష్ఠతి-ఆక్రమించును; కిఞ్చ-

మరియు; అస్యత్, అపి-మరియొకదానిని కూడ; మే-నావలన; శృణు-వినుము; విశేషేణ-విశేషముగా; బ్రాహ్మణస్య-బ్రహ్మతత్త్వవేత్తకు.

తా. సంకల్పములు నెరవేరిన పురుషుని జ్ఞానము అక్రమించును. బ్రహ్మ జ్ఞానసంపన్నుని మరింతగా ఆక్రమించును.

వ్యా. అధితిష్ఠతి-భృత్యునియందు రాజునకు సర్వాధికారము లున్నట్లు సంకల్పసిద్ధుడైన పురుషునిపై చిదాత్మకు సర్వాధికారము లుండును. సంకల్ప సిద్ధుడనగా సగుణబ్రహ్మము నెరుగుటవలన సత్యసంకల్పు డైనవాడు. విద్వాంసునకు సత్యసంకల్పము వలన అనన్యాధిపతిత్వము సిద్ధించి మరియొక ఈశ్వరుడు అగును. అట్టివానియెడ దేవతలుకూడ అధికారులు కానేరరు. ఏలయన అతడు ఆత్మయే కదా !

'బ్రాహ్మణస్య విశేషేణ'-అనుటవలన సగుణోపాసకునికంటె నిర్గుణ బ్రహ్మవేత్తకు సత్యసంకల్పత్వాదికము విశేషముగాఆవిర్భవించుననితాత్పర్యము.

అధ్యాపయే న్మహదేత ద్యశస్యం
వాచోవికారాః కవయో వద న్తి,
అస్మిన్ యోగే సర్వ మిదం ప్రతిష్ఠితం
యే తద్విదు రమృతా స్తే భవ న్తి. 18

ప్ర. అ. మహత్-గొప్పది; యశస్యమ్-బ్రహ్మమును పొందించునదియగు; ఏతత్-దీనిని; అధ్యాపయేత్-శిష్యులకు బోధింపవలయును; ఇంతకంటె వేరయిన వన్నియు; వాచః-వాక్కుయొక్క; వికారాః-వికారములు; ఏతత్-ఈ విషయ మును గూడ; కవయః-కవులు; వద న్తి - చెప్పుదురు; అస్మిన్ - ఈ; యోగే - యోగమునందు, యోగము సాధించినవానియందు; ఇదమ్ - ఈ; సర్వమ్ - అంతయు; ప్రతిష్ఠితమ్-స్థిరముగా నిలిచియున్నది; యే-ఎవరు; తత్-ఆ యోగ మును; విదుః-ఎరిగిరో; తే-వారు; అమృతాః-అమృతులు; భవ న్తి-అగుదురు.

తా. గొప్పది, బ్రహ్మమును పొందించునది యగు ఈ యోగశాస్త్రమును జ్ఞానసంపన్నులు శిష్యులకు బోధింపవలయును. తక్కిన వన్నియు వాక్కువికార ములు. ఈ విషయమునుకూడ మేధావులు చెప్పుదురు. ఈ యోగము సిద్ధించిన వానియందు సర్వము స్థిరమై నిలుచును. ఇది యెరిగినవారు ముక్తులగుదురు.

వ్యా. యశస్యమ్-యశస్సనగా నిచట బ్రహ్మము. దాని ప్రాప్తికి హిత మైనది యశస్యము. బ్రహ్మప్రాప్తికి హేతువైన దని ఫలితార్థము.

న కర్మణా సుకృతేనైవ రాజన్
సత్యం జయే జ్జుహుయాద్వా యజేద్వా,
నైతేన బాలోఽమృత్యు మభ్యేతి రాజన్
రతిం చాసౌ న లభ త్యన్తకాలే. 19

ప్ర.అ. సుకృతేన - శ్రద్ధగా చేయబడిన; కర్మణా-కర్మముతో, సత్యమ్-బ్రహ్మమును; న జయేత్ - సాధింపడు; జుహుయాత్ - హోమముచేయుగాక; యజేద్, వా - యజ్ఞము చేయుగాక! ఏతేన - ఈ హోమము, యజ్ఞము అను కర్మముతో; బాలః - జ్ఞానసంపదలేనివాడు; అమృత్యుమ్ - మోక్షమును; న, అభ్యేతి - పొందడు, అన్తకాలే - మరణసమయమున; అసౌ-ఈ జ్ఞానశూన్యుడు, రతిమ్ - ఆనందమును; న, లభతి - పొందడు.

తా. ఎంత శ్రద్ధగా చేసినప్పటికిని కర్మము ద్వారా బ్రహ్మమును మానవుడు పొందజాలడు. హోమము, యజ్ఞము మున్నగునవి చేయుగాక! అవి జ్ఞానసంపద లేనివానికి మోక్షమును అందింపవు. మరణించిన పిదప అతనికి మోక్షసుఖము లభింపదు.

బాలుడనగా బ్రహ్మజ్ఞానము లేనివాడని భావము;

తూష్ణీ మేక ఉపాసీత చేష్టేత-మనసాఽపి న,
తథా సంస్తుతినిందాభ్యాం ప్రీతిరోషౌ వివర్జయేత్. 20

ప్ర.అ. తూష్ణీమ్ - ఏ కార్యము చేయక; ఏకః - ఒంటరిగా; ఉపాసీత - బ్రహ్మము ననుసంధించుకొనవలయును. మనసా, అపి - మనస్సుతోడను; న చేష్టేత - చేష్టలు చేయరాదు, తథా - అట్లే; సంస్తుతినిన్దాభ్యామ్ - స్తుతి చేతను, నిందచేతను; ప్రీతి రోషౌ - ప్రీతినందుట, క్రోధముచెందుట అనువానిని; వివర్జయేత్-పూర్తిగా వదలవలయును.

తా. దేహముతోడను, వాక్కుతోడను ఏపనియు చేయకుండవలయును. మనోవ్యాపారమును రూపుమాపవలయును. స్తుతికి ప్రీతి, నిందకు రోషము పొందరాదు.

అత్రైవ తిష్ఠన్ క్షత్రియ బ్రహ్మావిశతి పశ్యతి,
వేదేషు చానుపూర్వ్యేణ ఏతద్విద్వన్ బ్రవీమి తే. 21

ప్ర.అ. క్షత్రియ - క్షత్రియుడా! వేదేషు - మున్ను చెప్పిన దృష్టిభేదము లందు, అనుపూర్వ్యేణ - క్రమపద్ధతితో; తిష్ఠన్ - స్థిరముగా నున్నవాడై; అత్ర, ఏవ - ఇచటనే - ఈదేహముతోడనే; బ్రహ్మ - బ్రహ్మమును: పశ్యతి-చూచును; ఆవిశతి - బ్రహ్మమే యగును. ఏతత్-దీనిని; తే - నీకు, విద్వన్-విద్వాంసుడా! బ్రవీమి - చెప్పుచున్నాను.

తా. రాజా! పైని చెప్పిన అధ్యారోపాదిమార్గముల క్రమముతో నిష్ఠ పొందినవాడు ఈ దేహముతోడనే బ్రహ్మమును చూచును. బ్రహ్మముతో ఐక్యము పొందును. అట్టి ప్రయత్నము చేయుదువని నీకిది ప్రీతితో చెప్పుచున్నాను.

వ్యా. వేదము లనగా నిచట తెలియదగినవి. అధ్యారోప వ్యామిశ్ర అప వాదములననవి దృష్టిభేదములు. ఆవిశతి - తాదాత్మ్యమును పొందును. ఉపాధి నశింపగా ఘటాకాశము మహాకాశమున ఐక్యము పొందినట్లు జీవుడు బ్రహ్మ మగునని భావము. కావున ప్రత్యక్షము, అనంతము అగు ఫలము కల ఈ బ్రహ్మవిద్య అదృష్టము నశించునది యగు ఫలముకల కర్మముకంటె మేలైన దని యెరిగి జ్ఞానముకొరకే యత్నము చేయవలయునను భావముతో నీకిది చెప్పు చున్నాను - అని హెచ్చరిక.

ఇతి శ్రీ మహాభారతే ఉద్యోగపర్వణి సనత్సుజాతపర్వణి
సనత్సుజాతవాక్యే పఞ్చచత్వారింశోఽధ్యాయః.

ఇది శ్రీమహాభారతము ఉదోగ్యపర్వమున సనత్సుజాతపర్వమున
సనత్సుతజాత వాక్యముగల
నలుబది యైదవ అధ్యాయము.

— (౦) —

# షట్చత్వారింశోఽధ్యాయః-నలుబదియారవ అధ్యాయము

## పరమాత్మస్వరూపవర్ణనమ్, యోగిభిః క్రియమాణస్య పరమాత్మసాక్షాత్కారస్య ప్రతిపాదనమ్-

## పరమాత్మస్వరూపవర్ణనము, యోగులు పొందు పరమాత్మసాక్షాత్కారమును ప్రతిపాదించుట

అవ. వెనుకటి అధ్యాయముచివర మనస్సుతోకూడ చేష్టలు చేయరాదని చెప్పియున్నారు. మనస్సు చేష్టలులేని దైనచో గొప్పదియగు బ్రహ్మచర్యాది యత్నముచేత శూన్యమేకదా మిగులును అని శంకించి బ్రహ్మము శూన్యము వంటిదే అయి, ఏలక్షణములేనిది, శూన్యభావమును కూడ ప్రకాశింపజేయునది, సద్రూపమైనది, ప్రత్యగభిన్నమైనది అని తెలియదగును అని ఈ అర్థమును ప్రతిపాదించు మంత్రముల నుదాహరించుచున్నారు. యోగులకు ప్రత్యక్షమగు దానిని మరల మరల నిరూపించుచున్నారు.

సనత్సుజాత ఉవాచ - సనత్సుజాతు డిట్లు పలికెను.

యత్తచ్ఛుక్రం మహజ్జ్యోతి ర్దీప్యమానం మహద్యశః
తద్వై దేవా ఉపాసతే తస్మాత్ సూర్యో విరాజతే
యోగిన స్తం ప్రపశ్యన్తి భగవన్తం సనాతనమ్. 1

ప్ర. అ. యత్ - ఏది; శుక్రమ్ - బీజమో; మహత్ - దొడ్డదియో; జ్యోతిః - వెలుగో; దీప్యమానమ్ - ప్రకాశించునదియో; మహద్యశః - మహద్య శమను పేరు గలదియో; తద్, వై - దానినే; దేవాః - దేవతలు; ఉపాసతే - ఉపాసింతురు; తస్మాత్ - దానివలననే; సూర్యః - సూర్యుడు; విరాజతే - ప్రకాశించుచున్నాడు; యోగినః - యోగులు; తమ్ - ఆ; సనాతనమ్ - సనాతను డగు; భగవన్తమ్ - భగవంతుని; ప్రపశ్యన్తి - చక్కగా చూతురు.

రా. ఆ బ్రహ్మము సర్వమునకు బీజము, అన్నింటికంటె గొప్పది. గొప్ప వెలుగు కాంతులతో విప్పారి యుండును. మహద్యశమని దానికి పేరు. దానిని

దేవతలు ఉపాసింతురు. సూర్యుడు దానివలననే ప్రకాశించుచున్నాడు. యోగులా సనాతన భగవత్స్వరూపమును యోగమువలన చక్కగా దర్శించుకొందురు.

వ్యా. శుక్రమనగా విత్తనము - బ్రహ్మము విత్తనమువలె విశ్వము పుట్టుకను మూలకారణము. విశ్వమునకు సంబంధించిన చైతన్యము దానివలననే కలుగుచున్నది. ఆనందరూపమైనది.

మహత్ - ఏ ఉపాధులు లేనిది. సర్వమునకు అదియే ఆధారము. దానికే యాధారము లేదు.

జ్యోతిః - జ్ఞానమును ప్రసాదించునది. సమస్త విశ్వము దానివలననే తెలివికలది యగుచున్నది.

దీప్యమానమ్ - ప్రకాశించుచున్నది. లోకమునగల సూర్యుడు మొదలగున వన్నియు దాని వెలుగులే.

మహద్యశమని వేదములు దానిని వ్యవహరించినవి.

దేవాః ఉపాసతే-దేవశబ్దమునకు ఇంద్రియములు అని యర్థము. ఉపాసన మనగా అనుసరించుట.

సూర్యః విరాజతే - సూర్యుడనగా సృష్టికర్త. ఆతనిని మాయ ఉపాధిగా గల ఈశ్వరు డందురు. అట్టి ఈశ్వరుడు ఆ బ్రహ్మమువలన విరాజిల్లుచున్నాడు. తన పని యందు ప్రవర్తింపగలుగుచున్నాడని తాత్పర్యము.

ఈ విషయమున శ్రుతులు ఇట్లు చెప్పుచున్నవి.

"ఆనందాద్ధ్యేవ ఖల్విమాని భూతాని జాయన్తే.
ఆనందేన జాతాని జీవన్తి.
ఆనందం ప్రయన్త్యభిసంవిశన్తి"

ఆనందమువలననే యీభూతములన్నియు పుట్టుచున్నవి. జీవించుచున్నవి. లయ మగుచున్నవి.

"కో హ్యేవాన్యాత్ కః ప్రాణ్యాత్
యదేష ఆకాశ ఆనన్దో న స్యాత్,
యేన సూర్య స్తపతి తేజసేద్ధః
న తస్యేశే కశ్చన తస్య నామ మహద్యశః"

ఈ ఆకాశస్వరూపమగు ఆనందము లేనిచో ఎవనికి ప్రాణము లాడును? సూర్యుడు తేజస్సుతో ప్రకాశించుట దానివలననే. దానిని పాలించువా డెవ్వడు లేడు, దానికి పేరు మహద్యశము.

"న ప్రాణేన నాపానేన మర్త్యో జీవతి కశ్చన,
ఇతరేణ తు జీవన్తి యస్మిన్నేతా వుపాశ్రితౌ."

మానవుడు ప్రాణాపానములతో జీవించుటలేదు. మానవులను జీవింప జేయునది వేరగు తత్త్వమే. ఈ ప్రాణాపానములు దాని నాశ్రయించి యున్నవి. ఈమొదలైన శ్రుతులు పై విషయమును స్పష్టము చేయుచున్నవి.

ఆ పరమాత్మను-యోగినః-యోగులు-చిత్తవృత్తినిరోధము వశమైనవారు-దర్శింతురు.

ఆ దర్శనము రెండు విధములు-సమాధిసంప్రజ్ఞాతమైనచో-భగవన్తమ్-సర్వేశ్వర స్వరూపముగలవానినిగా దర్శింతురు. అసంప్రజ్ఞాతమైనచో సనాతనునిగా-అఖండము, ఏకరసము అను ఆనందరూపముగా దర్శింతురు.

ఆ పరమాత్మదర్శనము యోగమువలననే కాని మరియొకవిధముగా కాదు. దక్షు డిట్లు చెప్పెను.

"స్వసంవేద్యం హి తద్బ్రహ్మ కుమారీ స్త్రీసుఖం యథా,
అయోగీ నైవ జానాతి జాత్యన్ధో హి యథా ఘటమ్."

కౌమారదశలో నున్న స్త్రీకి స్త్రీసుఖము స్వయముగా తెలియవచ్చునదే కాని మరియొకమార్గము లేదు. ఆబ్రహ్మానుభవము కూడ అట్టిదియే. యోగి కానివాడు, పుట్టుగ్రుడ్డి ఏవస్తువును చూడలేని విధమున, దాని నెరుగడు.

అవ. తరువాతి మంత్రములు దీనినే వివరించును.

శుక్రాద్బ్రహ్మ ప్రభవతి బ్రహ్మ శుక్రేణ వర్ధతే
తచ్ఛుక్రం జ్యోతిషాం మధ్యేఽతప్తం తపతి తాపనమ్
యోగినస్తం ప్రపశ్యన్తి భగవన్తం సనాతనమ్. 2

ప్ర.అ. శుక్రాత్ - ఆ శుక్రమువలన, బ్రహ్మ - బ్రహ్మము, ప్రభవతి-సమర్థమగుచున్నది, శుక్రేణ - శుక్రముచేత, బ్రహ్మ-బ్రహ్మము, వర్ధతే-వృద్ధి బొందుచున్నది, తత్, శుక్రమ్ - ఆశుక్రము, జ్యోతిషాం, మధ్యే-వెలుగులగు

సూర్యుడు మొదలగువానిలోపల, అతప్తమ్ - తాపము పొందనిదియు, తాపనమ్- తాపము కలిగించునదియు-అయి, తపతి-ప్రకాశించుచున్నది.

తా. ఆ శుక్రమువలననే బ్రహ్మమునకు సర్వసమర్థత కలుగుచున్నది. దానిచేతనే బ్రహ్మము వృద్ధి పొందుచున్నది. వెలుగు నొసగు సూర్యాదులయందు ఉండి తాను తాపము పొందక, తాపము కలిగించుచు ప్రకాశించుచున్నది.

వ్యా. శుక్రాత్-ఆనందస్వరూపమగు ఆ పరమాత్మవలన, బ్రహ్మ-జగత్తును వెలువరించు పరమవ్యోమము, అవ్యాకృతము మొదలగు పేర్లుగల బ్రహ్మమును, ప్రభవతి - చేయగలుగుచున్నది. జగత్తు సృష్టి మొదలగు కార్యములు చేయు సామర్థ్యము పొందుచున్నదని భావము. వర్ధతే-ఆ బ్రహ్మము నామరూపాత్మక మగు విశ్వముగా రూపొందుటయు దానివలననే యని తాత్పర్యము. గీతయు నిట్లే చెప్పుచున్నది-

"యాదాదిత్యగతం తేజో జగద్భాసయతేఽఖిలమ్,
యచ్చన్ద్రమసి యచ్చాగ్నౌ తత్తేజో విద్ధి మామకమ్".

సర్వజగత్తును ప్రకాశింపజేయు సూర్యగతమైన తేజస్సు, అట్లే చంద్రుని యందు, అగ్నియందు గల వెలుగు నాదే యని యెరుగుము.

అతప్తమ్ - ఇతరమువలన వెలుగు పొందనిది - స్వయంజ్యోతి అని యర్థము.

తాపనమ్ - సూర్యాదులకును భయము కలిగించునది, లేక వెలుగు ప్రసాదించునది -

"భీషాఽస్మా ద్వాతః పవతే భీషోదేతి సూర్యః,
భీషాఽస్మా దగ్ని శ్చేన్ద్రశ్చ మృత్యు ర్ధావతి పఞ్చమః."

అని శ్రుతి. ఈ పరమాత్మవలని భయముచేతనే గాలి యాడుచున్నది. సూర్యుడుదయించుచున్నాడు. అగ్ని ఇంద్రుడు తమ పనులు చేయుచున్నారు. అయిదవది యగు మృత్యువు జీవుల వెంటబడి పరువెత్తుచున్నది - అని చెప్పుచున్నది.

అట్టి భగవంతుడగు సనాతనుని యోగులు గాంతురు.

అపో౽థ అద్భ్యః సలిలస్య మధ్యే
ఉభౌ దేవౌ శ్రిశ్రియాతే౽న్తరిక్షే,
అతన్ద్రితః సవితు ర్వివస్వా-
నుభౌ బిభర్తి పృథివీం దివం చ
యోగినస్తం ప్రపశ్యన్తి భగవన్తం సనాతనమ్. 3

ప్ర. అ. ఉభౌ - ఆ రెండు; దేవౌ - దేవస్వరూపములు; సలిలస్య - సలిలముయొక్క; మధ్యే - నడుమ; అద్భ్యః - అప్పులవలన ఏర్పడిన; అపః - జలస్వరూపమును; అన్తరిక్షే - అంతరిక్షమునందు; శిశ్రియాతే - ఆశ్రయించి యున్నవి; సవితుః - సవితయొక్క; వివస్వాన్ - వివస్వంతుడు; అతన్ద్రితః - మాయ లేనివాడై; ఉభౌ - ఆరెంటిని; పృథివీమ్ - భూమిని; దివమ్, చ - ఆకాశమును; బిభర్తి - పట్టి నిలుపుచున్నాడు.

తా. జీవ, ఈశ్వరతత్త్వములు రెండును బ్రహ్మమునడుమ పంచమహాభూతములతో నేర్పడిన దేహమును ఆశ్రయించి హృదయాకాశమున నున్నవి. వానికంటె వేరై సృష్టికర్తనుకూడ ఆచ్ఛాదించు పరమాత్మ ఆ జీవేశ్వరులను భూమ్యాకాశములను పట్టి నిలుపుచున్నాడు.

వ్యా. ఉభౌ - ఇద్దఱు, దేవౌ - దేవులు - జీవుడు, ఈశ్వరుడు అనువారు.

సలిలస్య, మధ్యే - సలిల మనగా జలము - దానివంటిది సలిలము - అఖండమగు రసాకృతిగల బ్రహ్మము "సలిల ఏకో ద్రష్టా౽ద్వైతో భవతి" అని శ్రుతిప్రసిద్ధము - సలిలము ఒక్కటి, సర్వమును చూచునది- అద్వైతము- రెండింటితనములేనిది;- అనుదీనినిబట్టి సలిల మనగా బ్రహ్మము. దాని నడుమ-

అద్భ్యః-నీటివలన-నీరు ఇచట తక్కిన మహాభూతములను సూచించును. కనుక పంచమహాభూతములవలన అని యర్థము.

అపః-జలము-పంచమహాభూతములవలన ఏర్పడిన జలమనగా పాంచభౌతికమైన దేహమని యర్థము. దానిని,

అన్తరిక్షే-ఆకాశమున-ఇచట హృదయాకాశమున అని యర్థము.

పరబ్రహ్మమునడుమ నున్న పంచభూతములవలన ఏర్పడిన దేహమును ఆశ్రయించి జీవేశ్వరులు ఉన్నారని తాత్పర్యము.

గాఢనిద్రలో జీవుని, ప్రళయమున ఈశ్వరుని మాయ క్రమ్మివేయు చున్నది. పరమాత్మకుమాత్రము అట్టి మాయ లేదు.కావున, అతడు అతంద్రి తుడు. తంద్ర యనగా మాయ.

సవితుః-జగత్కారణమైన తత్త్వమునకు, వివస్వాన్-సర్వాధిష్ఠానమైన వాడు అగు ఆ పరమాత్మ-వస్ ధాతువునకు అచ్ఛాదనము-కప్పుట అర్థము. వస్వాన్ అనగా అచ్ఛాదనము కలవాడు- వివస్వాన్ అనగా అచ్ఛాదనము లేని వాడు. ఎట్టి పరిచ్ఛేదములు-హద్దులు లేని జ్ఞానస్వరూపు డని యర్థము. ఎల్ల వేళల ఉదయము, అస్తమయము ఎరుగని ప్రకాశము కలవాడని తాత్పర్యము.

అట్టి పరమాత్మ ఆ జీవేశ్వరులను, భూమ్యాకాశములను పట్టి నిలుపు చున్నాడు. అట్టి భగవంతుని యోగులు దర్శింతురు.

ఈ మంత్రమున మూడవపాదమునకు "ఆసధ్రీచీ స విషూచీ ర్వసానౌ" అని యొక పాఠము గలదు. అప్పుడు సః-అనగా ఆ శుద్ధమగు ఆత్మ, సధ్రీచీః-దిక్కులను, విషూచీః-మూలలను, ఆ వసానౌ-వస్త్రమువలె కప్పియున్న ఆ జీవే శ్వరులను-భరించుచున్నదని యర్థము. 'ఆ' అను ఉపసర్గము, 'వసానౌ' అను క్రియాపదముతో వ్యవధానము కలిగియుండుట ఆర్షము.

అవ. దీనినే వివరించుచున్నారు-

ఉభౌ చ దేవౌ పృథివీం దివం చ
దిశః శుక్రో భువనం బిభర్తి,
తస్మా ద్దిశః సరితశ్చ స్రవన్తి
తస్మాత్ సముద్రా విహితా మహాన్తః.
యోగినస్తం ప్రపశ్యన్తి భగవన్తం సనాతనమ్. 4

ప్ర. అ. శుక్రః-ఆ బీజరూపమైన పరమాత్మ; ఉభౌ, దేవౌ-జీవేశ్వరు లిరువురిని; పృథివీమ్ - భూమిని; దివమ్ - ఆకాశమును; దిశః - దిక్కులను; భువనమ్-బ్రహ్మాండమును; బిభర్తి - భరించుచున్నది; తస్మాత్-ఆ పరమాత్మ నుండి; దిశః-దిక్కులు; సరితః, చ - నదులును; స్రవన్తి - వెలువడుచున్నవి; మహాన్తః-గొప్ప అంతముగల; సముద్రాః-సముద్రములును; తస్మాత్ - దాని నుండి; విహితాః-ఏర్పడుచున్నవి.

తా. ఆ శుక్రము జీవేశ్వరులను, భూమ్యాకాశములను, దిక్కులను, బ్రహ్మాండమును పట్టి నిలుపుచున్నది. దిక్కులు నదులు దానినుండియే ఏర్పడు చున్నవి. మహాంతములగు సముద్రములును దానినుండియే ఏర్పడుచున్నవి. అట్టి పరమాత్మను యోగులు దర్శింతురు.

వ్యా. భువన మనగా బ్రహ్మాండము, మహాంతమనగా పొందశక్యము కాని అంతము గలది. అట్టి సముద్రములు - సముద్రము లనగా నిచట కామము లను గ్రహింపవలయును. 'కామం సముద్ర మావిశ' అను మంత్రము దీని కాధారము. కామములు సముద్రములవలె అంతములేనివి. అట్టి సర్వకామములు ఆ శుక్రస్వరూపమునుండియే వెలువడుచున్నవని తాత్పర్యము.

చక్రే రథస్య తిష్ఠన్తోఽధ్రువస్యావ్యయకర్మణః,
కేతుమన్తం వహన్త్యశ్వా స్తం దివ్యమజరం దివి.
యోగినస్తం ప్రపశ్యన్తి భగవన్తం సనాతనమ్.5

ప్ర. అ. అధ్రువస్య - ధ్రువముకాని, నశించునట్టి; అవ్యయకర్మణః - వినాశము పొందని కర్మముగల; రథస్య-రథముయొక్క, దేహముయొక్క; చక్రే - చక్రమునందు, చక్రమువలె త్రిప్పు పురాతనకర్మము నిమిత్తముగా; తిష్ఠన్తః - ఉన్న, అశ్వాః - గుఱ్ఱములు, ఇంద్రియములు, కేతుమన్తమ్-ధ్వజము గలవానిని; ప్రజ్ఞావంతుని-జీవుని; తమ్-ఆ; దివ్యమ్-దివ్యుడు; అజరమ్ - వికార ములు లేనివాడు అగు పరమాత్మవైపు; దివి-ఆకాశమున, హృదయాకాశమున; వహన్తి - తీసికొనిపోవుచున్నవి.

తా. ఈ దేహ మొక రథము. అది నశించుస్వభావము కలది. కాని దాని కర్మము నశింపదు. అట్టి కర్మము నిమిత్తముగా ప్రవర్తించుచున్న ఇంద్రియము లను గుఱ్ఱములు ప్రజ్ఞకల జీవుని హృదయ మను ఆకాశములో పరమాత్మవైపు తీసికొనిపోవుచున్నవి. అట్టి పరమాత్మను యోగులు దర్శింతురు.

వ్యా. తనకు వశమైన యింద్రియములను దేహరథమున కట్టిన జీవుడు పరమాత్మకడకు చేరుకొనును. అట్లు కానియెడల దేహము నశించినను, కర్మము నశింపదు కావున మరియొక దేహమును పొంది బద్ధుడగును.

దివ్య మనగా అలౌకికము. 'నేను' అను జ్ఞానముకంటె వేరయినది, ఆకలిదప్పులు మొదలగునవి లేనిది. అజరమ్ - ముసలితనము లేనిది. ఇది ఒక

సూచన - ఎట్టి వికారములు లేనిదని తాత్పర్యము. ఈ రెండును పరమాత్మ లక్షణములు. దివి అనగా హృదయాకాశమునందు - అని అర్థము.

న సాదృశ్యే తిష్ఠతి రూప మస్య
న చక్షుషా పశ్యతి కశ్చిదేనమ్,
మనీషయాఽథో మనసా హృదా చ
య ఏనం విదు రమృతా స్తే భవన్తి.
యోగిన స్తం ప్రపశ్యన్తి భగవన్తం సనాతనమ్. 6

ప్ర.అ. అస్య - ఈ పరమాత్మయొక్క; రూపమ్ - రూపము; సాదృశ్యే - పోలికయందు; న తిష్ఠతి - ఉండదు; ఏనమ్ - దీనిని; కశ్చిత్-ఏ యొక్కడును, చక్షుషా - కంటితో; న, పశ్యతి - చూడడు; మనీషయా - బుద్ధితో; మనసా - మనస్సుతో; హృదా - హృదయముతో; ఏనమ్ - దీనిని; యే - ఎవరు; విదుః - తెలిసికొందురో; తే - వారు; అమృతాః - అమృతులు; భవన్తి - అగుదురు.

తా. ఆ పరమాత్మకు ఒక పోలిక లేదు. ఆతనిని కంటితో నెవ్వడు చూడజాలడు. బుద్ధితో, మనస్సుతో, హృదయముతో ఆ తత్త్వ మెరుగువారు అమృతు లగుదురు. అట్టి పరమాత్మను యోగు లెరుగుదురు.

వ్యా. సాదృశ్యే - పరమాత్మరూపమునకు పోలిక వచ్చునది సృష్టిలో ఏదియు లేదని భావము. న, చక్షుషా - కంటికి కానరా దనుట ఒక సూచన. ఏ యింద్రియమునకు గోచరము కాదని తాత్పర్యము. అది అరూపము, అశబ్దము, అస్పర్శము-ఇత్యాదిగా వేదము వర్ణించుచున్నది కనుక. మనీషయా - మనస్సు నిగ్రహించి ఒక నిశ్చయాత్మకస్థితిని పొందుటచేత; మనసా - సూక్ష్మమగు మనస్సుచేత, "మనసై వాను ద్రష్టవ్యమ్" అని శ్రుతి. మనస్సును ఒక సాధన ముగా చెప్పుచున్నది కనుక. హృదా - హృదయ మను ప్రదేశమున నిలిపిన మనస్సుచేత అని తాత్పర్యము. సంకల్పవికల్పాదులు లేని మనస్సును హృదయదేశమున నిబంధింపగా ఏర్పడు బుద్ధివిశేషముచేత పరమాత్మను దెలియవలయు నని భావము. అట్లు తెలిసినవారు ముక్తు లగుదురు.

అవ. ఆ తత్త్వ మెరుకపడనిచో సంసారము నశింప దనుటను వివరించు చున్నారు-

ద్వాదశపూగాం సరితం పిబన్తో దేవరక్షితామ్,
మధ్వీక్షన్తశ్చ తే తస్యాః సఞ్చరన్తీహ ఘోరామ్,
యోగినస్తం ప్రపశ్యన్తి భగవన్తం సనాతనమ్. 7

ప్ర.అ. ద్వాదశపూగామ్ - పంద్రెండు సముదాయములుగలదియు; దేవరక్షితామ్ - దేవతలు కాపాడుచున్నదియు, ఇహ - ఈ పరమాత్మయందు తోచు; ఘోరామ్ - భయంకరమైన, సరితమ్ - అజ్ఞాన మను నదిని; పిబన్తః- త్రావుచున్నవారై; తస్యాః - ఆ నదియొక్క; మధు - మధురఫలమును; ఈక్షన్తః - చూచుచున్నవారై; సఞ్చరన్తి - ఇటు నటు తిరుగుచున్నారు.

తా. అజ్ఞానరూపమైన ఈ సంసారము ఒక పెద్దనది. దానికి పంద్రెండు సముదాయములు గలవు. దానిని దేవనామము కల ఇంద్రియములు కాపాడు చున్నవి. దానిలో పడి తిరుగుచున్న జీవులు దాని మధురఫలముల కాసపడి చూచుచున్నారు. అందు కొట్టుమిట్టాడుచున్నారు.

వ్యా. ద్వాదశపూగములు - పంద్రెండు సముదాయములు. 1. చిత్తాదులు 2. స్మరణాదులు 3. శ్రోత్రాదులు 4. శ్రవణాదులు 5. వాగాదులు 6. వచనాదులు 7. శబ్దాదులు 8. వియదాదులు 9. ప్రాణాదులు 10. శ్వసనాదులు 11. సంస్కారములు 12. సుకృతాదులు. ఈ మహాసముదాయములతో జీవుడు అజ్ఞాననదిలో క్రిందికి, పైకి దిక్కు తెలియక తిరుగుచున్నాడు.

సరితమ్ - నిరంతర ప్రవాహరూప స్థితిగల నదిని - అజ్ఞానరూపమైన దానిని, పిబన్తః - త్రావుచున్నవారు; ఆ నదివలన నేర్పడు పుత్రపశ్వాదుల లాభములతో తృప్తిపడుచున్న అజ్ఞానులు అని భావము.

దేవరక్షితామ్ - విషయదర్శనము చేయుట ద్వారా పెక్కు సంస్కార సముదాయములను కలిగించుచున్నవియు, కన్ను మున్నగువానిని అనుగ్రహించు నవియు నగు సూర్యాదులచేత రక్షింపబడుచున్నదానిని, మధు - మధురఫలము- సంసారమునందు తోచుసుఖములను; ఈక్షంతః-చూచుచు.

ఇహ - ఈ షట్క్రమను పేరుగల అధిష్ఠానమందు నెలకొనియున్న, ఘోరామ్-భయంకరమైన అజ్ఞాననదిని; సఞ్చరన్తి - పైకి, క్రిందికి.మాటిమాటికి తిరుగుచున్నవారు-సంసారబంధమున చిక్కుకొనినవారని తాత్పర్యము.

ఇట్టి ఘోరమగు అజ్ఞానసది యే పరమాత్మయందు గలదో అట్టి పరమాత్మను యోగులు దర్శింతు రని తాత్పర్యము.

అవ. ఇక్కడ చేసిన కర్మము ఫలమును పరలోకమున అనుభవించుట వలన జీవునకు కర్మశేషము ఉండదు గదా! ఇక పునరావృత్తి యెక్కడిది? ముక్తియే కదా! అను శంకకు సమాధానము చెప్పుచున్నారు.

తదర్ధమాసం పిబతి సఞ్చిత్య భ్రమరో మధు
ఈశానః సర్వభూతేషు హవిర్భూత మకల్పయత్,
యోగిన స్తం ప్రపశ్యన్తి భగవన్తం సనాతనమ్. 8

ప్ర. అ. తత్ - ఆ; మధు - మధువును, కర్మఫలమును; భ్రమరః- తుమ్మెద, భ్రమరము వంటి జీవుడు; సఞ్చిత్య-కూడబెట్టి; అర్ధమాసమ్-చంద్ర రూపమైన సగము ఫలమును; పిబతి - త్రాగును, అనుభవించును. ఈశానః- ఈశ్వరుడు, సర్వభూతేషు-సర్వభూతములయందును; హవిర్భూతమ్-హవిస్సులతో సిద్ధమైన - యజ్ఞమును; అకల్పయత్-కల్పించెను.

తా. జీవుడు తేనెటీగవలె కూడబెట్టిన కర్మఫలమును సగము చంద్ర రూపమున ఉత్తమలోకమున అనుభవించును. తేనెటీగవలె భ్రమించు లక్షణము కలవాడు కనుక మరల మిగిలినదాని అనుభవమునకై ఈ లోకమునకు వచ్చును. ఈశ్వరుడు సర్వభూతములయందును హవిర్భాగమును ఏర్పాటుచేసియుంచెను.

వ్యా. మధువనగా తేనె, మధువనగా కర్మఫలము, అర్ధమాసమ్ అనగా చంద్రుడు. కర్మఫలములో ఒక భాగము చంద్రరూపమై పై లోకములందు జీవుల అనుభవమునకై యేర్పడును. "తేషాం సోమో రాజాఽన్నం తం దేవా భక్షయన్తి" - అను శ్రుతి ఇష్టాపూర్తాదులు చేసినవారికి రాజైన సోముడు అన్నము. దానిని దేవతలు భుజింతురు - అని చెప్పుచున్నది. దేవత లనగా ఇష్టాపూర్తాదులు చేసి పుణ్యమును సంపాదించుకొన్నవారు. వా రది యనుభవించిన పిమ్మట మరల మిగిలిన కర్మఫలానుభవమునకై ఈ లోకమునకు వత్తురు. ఈ విధముగా పునరావృత్తి కలదని తెలియుచున్నది. ఇచట జీవుని భ్రమరముగా చెప్పుటలో తాత్పర్యము కూడ అట్టిదియే. భ్రమర మనగా అచటికి ఇచటికి తిరుగునది యని యర్థము. సంచిత్య - అను మాటచేత ఆముష్మిక ఫలభోగము ముగిసిన పిమ్మట ఐహిక ఫలభోగ వాసన యున్నదని సూచన. కర్మఫలము

రెండు విధములు. కొంత ఆముష్మికము - మరణించిన తరువాత ఊర్ధ్వలోకము లలో అనుభవించునది. కొంత ఐహికము - ఈ లోకమున అనుభవింపవలసి నది. అందు ఒకటి అనుభవించి రెండవదానికై మరల భూలోకమున అవత రించునని ఈ తేనెటీగ దృష్టాంతమున శ్లేషతో చెప్పియున్నారు. శ్రుతియు-

"యావత్సంపాత ముషిత్వాఽథైతమేవాధ్వానం పున ర్నివర్తన్తే తద్య ఇహ రమణీయచరణా అభ్యాశోహ తే రమణీయాం యోని మాపద్యన్తే కపూయచరణాః కపూయాం యోని మాపద్యన్తే" అని చెప్పుచున్నది. సంపాత మనగా కర్మము. చరణ మనగా కర్మశేషము. అభ్యాశోహ అను మాటకు శీఘ్రము అని యర్థము. కపూయ మనగా నీచము. జీవులు కర్మ మున్నంతవరకు అనుభవించి, కర్మశేషము ననుభవించుటకై అదే మార్గమున వెనుకకు వత్తురు. రమణీయమగు కర్మశేష మున్నవారు శీఘ్రముగా రమణీయమగు జన్మము పొందుదురు. హీనఫలము అనుభవింపవలసినవారు హీనజన్మలు పొందుదురు - అని మంత్రతాత్పర్యము

ఈ విధమగు జీవుడు రఃజానుడై - అనగా అంతర్యామియై సర్వభూత ములయందు ఉండి హవిర్భూతమును - యజ్ఞమును కల్పించియుండెను. అనగా ఆ ఈశ్వరుడు వేదమును, వైదికమార్గమును ప్రవర్తింపజేయువాడని తాత్పర్యము. అనగా జీవునకు, ఈశ్వరునకు గల భేద మిచట చెప్పినట్లయినది. 'తత్త్వమసి' అను వాక్యములో 'త్వమ్' - నీవు అను పదమున కర్థమైన జీవునకును, 'తత్' అది - పదమున కర్థమైన పరమాత్మకును భేదము దీనిచే నిరూపితమైనది.

అట్లు యజ్ఞమును కల్పించిన పరమాత్మను యోగులు దర్శింతురు.

అవ. ఈశ్వరుడు జీవభావము పొందుటలో . కారణమేమో వివరించు చున్నారు.

హిరణ్యపక్ష మశ్వత్థ మభిపద్య హ్యపక్షకాః
తే తత్ర పక్షిణో భూత్వా ప్రపతన్తి యథాదిశమ్
యోగినస్తం ప్రపశ్యన్తి భగవన్తం సనాతనమ్. 9

ప్ర. అ. హిరణ్యపక్షమ్ - బంగారు ఆకులు గల, అశ్వత్థమ్ - రావి చెట్టును; అభిపద్య - ఆశ్రయించి. అపక్షకాః - రెక్కలులేని వగు; తే - అవి,

తత్ర - అందు; సంసారమునందు, పక్షిణః - రెక్కలుగలవి; భూత్వా - అయి; యథాదిశమ్ - తోచిన దిక్కులకు; ప్రపతన్తి - ఎగిరిపోవుచున్నవి;

తా. ఈశ్వరుడగు జీవుడు బంగారుఆకులుగల రావిచెట్టు నాశ్రయించి రెక్కలులేని తాను రెక్కలు పొంది దిక్కుతోచిన విధముగా ఎగిరిపోవుచున్నాడు. ఇట్టి స్థితి నందని స్వరూపముగల ఆపరమాత్మను యోగులు దర్శింతురు.

వ్యా. ఈశ్వరునకు జీవభావ మెట్లు వచ్చినదో యిందు అలంకారప్రాయ ముగా చెప్పుచున్నారు.

హిరణ్యపర్ణమ్ - బంగారుఆకులుగల - హిరణ్య మనగా హరించు శీలము గలది. పైచూపునకే ఆకర్షణ కలిగించునుగదా! పర్ణములనగా ఆకులవంటివి - అవయవములు, స్త్రీలు, పుత్రులు సంపదలు మొదలగునవి. సంసార మనెడు వృక్షమున నివి యాకులవంటివి.

అశ్వత్థమ్ - శ్వోఽపి న తిష్ఠతి అని వ్యుత్పత్తి. రేపుకూడ నిలువదు. అనగా నశించు స్వభావము గలది. ఇది అవిద్య - అజ్ఞానమనెడు చెట్టు.

అపక్షకాః - పక్షములంటగా పైకి లేచిపోవుటకు కారణము లయినవి. ఇచట ప్రాణాదిరూపములగు ఉపాధులు - ఆధారములు. అవి లేనివి. జీవదశకురాక ముందు ప్రాణాదిఉపాధులు లేనివారని తాత్పర్యము.

పక్షిణః - భూత్వా - ప్రాణము మున్నగు ఉపాధులను పొంది పైకి లేచుటకు శక్తి సంపాదించినవై.

యథాదిశమ్ - తోచిన దిక్కులకు - వాసనలనుబట్టి యని తాత్పర్యము.

ప్రపతన్తి - ఎగిరిపోవుచున్నవి - ఆయా యోనులయందు పుట్టుచున్నవి అని భావము.

ఇచట బహువచనము ఉపాధులనుబట్టి యేర్పడిన రూపభేదములనుబట్టి గ్రహించుట జరిగినది.

మొదట ఈశ్వరస్వరూపముతో నున్న ఆత్మ అవిద్యను-అజ్ఞానమునుబట్టి స్త్రీధనాదిఆకర్షణలకు లోనయ్యెను. వెంటనే దానికి సంసారమనెడు అశ్వత్థ వృక్షము ఆశ్రయ మయ్యెను. ప్రాణాదిఉపాధులు లేని ఆత్మకు అవిద్యవలన ఉపాధులు ఏర్పడునప్పటికి రెక్కలువచ్చిన పక్షివలె ఎగురుట, జన్మములను పొందుట సంభవించెను. అదియే బంధహేతువగు సంసారము.

ఇట్టి బంధము వదలించుకొని సనాతనస్వరూపమును పొందుటయే ముక్తి. ఆముక్తికి తావలమగు సనాతనభగవంతుని ఈ సంసారబంధములేని యోగులు దర్శింతురు.

అవ. ఇట్లు సహజముగా ఈశ్వరుడైనవాడు జీవు డగుట ఉపాధిసంబంధమునుబట్టి యగుచున్నదని ఋజువైనది. కాగా అందు ఉపాధులలో చిక్కుకొనునది సమస్తమగు బ్రహ్మమా? లేక బ్రహ్మముయొక్క అంశములా? మొదటి పక్షమున జీవులు పెక్కండ్రగుట కుదురదు. రెండవపక్షమున బ్రహ్మము నిష్కలము - కళలు - భాగములు లేనిది అను సిద్ధాంతము సరిపడదు. మరియు అంశమునకు, అంశములుగల మొత్తమునకు ఐక్యము కుదురదు కనుక జీవేశ్వరుల అభేదము కూడ సాధ్యపడనిస్థితి వచ్చును - అని శంకించి సమాధానము చెప్పుచున్నారు.

పూర్ణాత్ పూర్ణా న్యుద్ధరన్తి పూర్ణాత్ పూర్ణాని చక్రిరే,
హరన్తి పూర్ణాత్ పూర్ణాని పూర్ణమేవావశిష్యతే.
యోగినస్తం ప్రపశ్యన్తి భగవన్తం సనాతనమ్. 10

ప్ర.అ. పూర్ణాత్ - పూర్ణమైన దానినుండి, పూర్ణాని - పూర్ణములను; ఉద్ధరన్తి - వేరుచేయుచున్నారు; పూర్ణాత్ - పూర్ణమునుండి, పూర్ణాని-పూర్ణములను; చక్రిరే - చేసిరి; పూర్ణాత్ - పూర్ణమునుండి; పూర్ణాని - పూర్ణములను; హరన్తి - దూరముగా తొలగించుచున్నారు; పూర్ణమ్, ఏవ - పూర్ణమే; అవశిష్యతే - మిగులుచున్నది.

తా. పూర్ణములగు జీవరూపములు పూర్ణమగు పరమాత్మనుండియే వేరయినవి. పూర్ణమువలననే ఏర్పడినవి. పూర్ణమునుండి తొలగిపోగా పూర్ణమే మిగులుచున్నది.

వ్యా. పూర్ణమనగా అంతట నిండి యున్నది. అది ఆత్మ. చిదాకాశము అనియు నందురు. దానినుండి దాని ప్రతిబింబములవంటి జీవరూపములు వేరగుచున్నవి. ప్రతిబింబములే కనుక పూర్ణత్వమునకు లోపము లేదు. ఉపాధులగు ప్రాణాదులు అద్దములవంటివి.

అట్లయినచో ఉపాధులు వేరుగా నున్నచో పూర్ణమునకు పూర్ణత్వము పోదా? అని శంక కలుగును. దానికి సమాధానము చెప్పుచున్నారు.

పూర్ణములగు ప్రాణము మొదలగు ఉపాధులు (జీవుడు దేని నంటిపెట్టు కొని యుండునో వానిని ఉపాధులందురు) పూర్ణమువలననే ఏర్పడినవి. కనుక పూర్ణమగుటకు లోపము లేదు.

దీని భావ మిది - ఆకాశమునకు పరిధులు లేవు. కావున అది పూర్ణము అని భావించినచో - కుండ యను ఉపాధినిబట్టి యేర్పడిన ఘటాకాశమునకు పూర్ణత్వము పోవుచున్నది గదా - అని శంక. కాని ఉపాధి యనునది సత్యము కాదు కల్పితము. కావున, కల్పితమైన ఉపాధినిబట్టి పూర్ణత్వము చెడదు. ఒక దృష్టాంతమును పరికింపనగును. త్రాడును చూచి పామనుకొనినపుడు త్రాడు అన్న జ్ఞాన మున్నచో పాము లేదు. పాము అను జ్ఞాన మున్నచో త్రాడు లేదు. రెంటిజ్ఞాన మున్నచో భ్రాంతి లేదు. ఇట్లు కల్పితమైన ఉపాధివలన ఉపాధిగలదాని పూర్ణత్వమునకు భంగము కలుగదు. జీవేశ్వరభేదము ఈ కల్పితమైన ఉపాధిని బట్టియే కలుగుచున్నది.

బ్రహ్మమునందు ఆరోపింపబడిన ప్రాణాదిఉపాధులు తొలగిపోయిన వెంటనే పూర్ణమగు బ్రహ్మమే మిగులును. త్రాడియందు పొరపాటువలన చూచిన పాముతనము పోయినవెంటనే సత్యమే యగు త్రాడే మిగులును గదా!

ఈ విషయమున విష్ణుపురాణ మిట్లు చెప్పుచున్నది.

"విభేదజనకేఽజ్ఞానే నాశ మాత్యన్తికం గతే
ఆత్మనో బ్రహ్మణా భేద మసన్తం కః కరిష్యతి"

విభేదమునకు - జీవబ్రహ్మలు వేరు - అను భావమునకు కారణమైన అజ్ఞానము పూర్తిగా నాశనముకాగా తత్త్వతః లేని భేదము నెవడు కల్పింప గలడు.

వేదమున ప్రసిద్ధములైన 'తత్త్వమసి', అదియే నీవు, 'అహం బ్రహ్మాస్మి' - నేనే బ్రహ్మమను 'అయమాత్మా బ్రహ్మ' - ఈఆత్మ బ్రహ్మము మొదలగు వాక్యములందు అంశము, అంశి అను భేదభావము కానవచ్చుట లేదు.

ఇట్లు పూర్ణముగా మిగిలిన పరమాత్మను యోగులు దర్శింతురు.

తస్మాద్వై వాయు రాయాత స్తస్మింశ్చ ప్రయతః సదా,
తస్మా దగ్నిశ్చ సోమశ్చ తస్మింశ్చ ప్రాణ ఆతతః. 11

సర్వమేవ తతో విద్యా త్తత్ద్వక్తుం న శక్నుమః,
యోగినస్తం ప్రపశ్యన్తి భగవన్తం సనాతనమ్. 12

ప్ర.అ. తస్మాత్, వై - దానినుండియే; వాయుః-వాయువు; ఆయాతః-వచ్చినది; తస్మిన్, చ - దానియందే; సదా - ఎల్లవేళల; ప్రయతః - పట్టువడి యున్నది; తస్మాత్ - దానినుండి; అగ్నిః, చ - అగ్నియును, సోమః చ - చంద్రుడును, ఏర్పడినవి; తస్మిన్ - దానియందు; ప్రాణః - ప్రాణము; ఆతతః - వ్యాపించియున్నది; సర్వమ్ - సమస్తమును; తతః, ఏవ - దాని నుండియే అని; విద్యాత్ - తెలియవలయును; తత్ - ఆత్మయని ప్రసిద్ధి కెక్కిన; తత్ - దానినిగూర్చి; వక్తుమ్ - చెప్పుటకు; న శక్నుమః - సమర్థులము కాము;

తా. ఆ పరమాత్మనుండియే వాయువు మొదలగు సర్వభూతములు వెలువడినవి. దానియందే పట్టుపడియున్నవి. దానినుండియే భోక్తయగు అగ్ని, భోజ్యమగు సోముడు, ప్రాణమగు దేహేంద్రియాదులు ఏర్పడినవి. అది యిది యననేల? సర్వము దానినుండియే వచ్చినది. దాని పేరు 'తత్తు'. దానినిగురించి చెప్పజాలము. దానిని యోగులు దర్శింతురు.

వ్యా. వాయువు అనునది తక్కినభూతములను కూడ సూచించును. "తస్మాద్వా ఏతస్మాదాత్మన ఆకాశః సంభూతః, ఆకాశా ద్వాయుః, వాయో రగ్నిః, అగ్నే రాపః, అద్భ్యః పృథివీ" - అని శ్రుతి. ఆ యీ ఆత్మమునుండి ఆకాశము పుట్టినది. ఆకాశమునుండి వాయువు, వాయువునుండి అగ్ని, అగ్ని వలన నీరు, నీటివలన భూమి పుట్టినవని చెప్పుచున్నది.

ప్రయతః - పట్టువడినది - అనగా లయమైనదని తాత్పర్యము. దీనివలన పంచభూతములకు ఆత్మయే ఉపాదానకారణమని తెలియుచున్నది. ఉపాదాన మనగా కుండకు మట్టివలె ముడిపదార్థమని తెలియదగును.

అగ్ని యనగా భోక్త. సోముడు భోజ్యము. ప్రాణమనగా దేహేంద్రియాదుల సముదాయము.

ఈ సమస్తమును దానినుండియే పుట్టి 'తత్' అను పేరు కలిగియున్నది.

"తదితి వా ఏతస్య మహతో భూతస్య నామ భవతి" 'తత్' అని ఈ మహాభూతమునకు పేరు. అని శ్రుతి చెప్పుచున్నది.

వక్తుమ్ న శక్నుమః- వాక్కులకందనిది అని భావము.

అవ. ఇప్పుడు పరమాత్మదర్శనమునకు గట్టి ఉపాయమగు యోగమును సంక్షేపముగా చెప్పుచున్నారు.

అపానం గిరతి ప్రాణః ప్రాణం గిరతి చన్ద్రమాః,
ఆదిత్యో గిరతే చన్ద్రమాదిత్యం గిరతే పరః
యోగినస్తం ప్రపశ్యన్తి భగవన్తం సనాతనమ్. 13

ప్ర.అ. ప్రాణః - ప్రాణము; అపానం - అపానమును, గిరతి - ఉపసంహరించును; ప్రాణమ్ - ప్రాణమును; చన్ద్రమాః - చంద్రుడు; గిరతి - ఉపసంహరించును; ఆదిత్యః - సూర్యుడు; చన్ద్రం - చంద్రుని; గిరతే - మ్రింగివైచును; పరః - పరమాత్మ; ఆదిత్యమ్ - సూర్యుని - గిరతే - లోగొనును.

తా. ప్రాణము అపానమును, మనస్సు ప్రాణమును, బుద్ధి మనస్సును, బుద్ధిని పరమాత్మయు లోనికి గ్రహించివేయును. అట్టి పరమాత్మను యోగులు దర్శింతురు.

వ్యా. గిరతి - తనలో లయ మొనరించుకొనునని భావము. యోగశాస్త్ర మిట్లు చెప్పుచున్నది-

పార్ష్ణినా గుద మాపీడ్య దన్తై ర్దన్తా నసంస్పృశన్,
దృఢాసనోఽ పానవాయు మున్నయేచ్ఛ శనైః శనైః.
తం ప్రాణే నైకతాం నీత్వా స్థిరం కృత్వా హృదమ్బరే,
చేతోమాత్రేణ తిష్ఠేత తచ్చ బుద్ధౌ విలాపయేత్.

ఆసనమున నున్న వాయువును అపాన మందురు. హృదయస్థానమున నున్న వాయువునకు ప్రాణమని పేరు. ప్రక్కభాగముతో గుదమును గట్టిగా నొక్కి దంతములతో దంతములు తాకకుండునట్లు చేసి దృఢమైన ఆసనము కలవాడై అపానవాయువును మెల్లమెల్లగా పైకి పోవునట్లు చేయవలయును. అట్లు హృదయముకడకు వచ్చిన అపానమును ప్రాణవాయువుతో కలుపవలయును. హృదయాకాశమున దానిని చెదరకుండునట్లు నిలుపవలయును. పిదప సాధకుడు చేతస్సురూపమున నిలిచిపోవలెను. ఆ చిత్తమును బుద్ధిలో లయము చేయవలయును.

మంత్రమునందలి చంద్రమశ్శబ్దమునకు మనస్సు అర్థము. ఆదిత్యుడనగా బుద్ధి. పరమనగా పరమాత్మ. ఇట్లు అపానమును ప్రాణములో, ప్రాణమును మనస్సులో, మనస్సును బుద్ధిలో, బుద్ధిని పరమాత్మలో లీనము చేయగా పరమాత్మ యొక్కటియే మిగులును. అట్టి పరమాత్మను యోగులు దర్శింతురు

అవ. బ్రహ్మము ఎల్లవేళల అపరోక్షమే కదా! 'యత్సాక్షా దపరోక్షాత్' అని శ్రుతియు దీనినే వక్కాణించుచున్నది కదా! ఇంక అట్టిదానికై యోగ మేల? అను శంకకు సమాధానము చెప్పుచున్నారు.

ఏకం పాదం నోత్క్షిపతి సలిలా ద్ధంస ఉచ్చరన్,
తంచే త్సంతత మూర్ధ్వాయ న మృత్యు ర్నామృతం భవేత్.
యోగినస్తం ప్రపశ్యన్తి భగవన్తం సనాతనమ్ 14

ప్ర.అ. హంసః-హంస; సలిలాత్-జలమునుండి; ఉచ్చరన్-పైకి లేచుచు; ఏకమ్-ఒక; పాదమ్-పాదమును; న ఉత్క్షిపతి - పైకి లేపదు; ఊర్ధ్వాయ - పై భాగము కొరకు, సంతతమ్-వ్యాపించియున్న, తమ్-దానిని; పశ్యతి చేత్-చూచి నచో; న, మృత్యుః - మృత్యువు లేదు; అమృతం, న - అమృతమును లేదు.

తా. హంసవంటి పరమాత్మ అతిగంభీరమైన ప్రకృతికంటె పైభాగము లందు మూడు పాదములతో సంచరించుచు ఒక పాదమును ప్రకాశింపజేయ కున్నాడు. పైభాగమునకు వ్యాపించిన ఆ నాలుగవపాదమును సాధకుడు దర్శించునేని ఆ దశలో మృత్యువు లేదు అమృతస్థితియు లేదు. అట్టి పరమాత్మను యోగులు దర్శింతురు.

వ్యా. హంస యనగా హంసవంటి పరమాత్మ. అది శరీరమను వృక్షము నధివసించియున్నది. కాని శరీరముతో సంబంధములేకుండ ఉన్నది. ఆ పరమాత్మకు నాలుగు పాదములు. "సోఽయమాత్మా చతుష్పాత్"- అని శ్రుతి. ఆ నాలుగుపాదములు జాగ్రత్, స్వప్న, సుషుప్తి తురీయములు. అట్టి నాలుగు పాదములు గల పరమాత్మ - సలిలాత్ - మిక్కిలి గంభీరము, ఎట్టివిశేషములు లేని సలిలమువంటి ప్రకృతినుండి; ఉచ్చరన్- పై భాగమునందే మూడుపాదము లతో తిరుగుచున్నది. ఏకం పాదమ్ - ఒక పాదమును, న, ఉత్క్షిపతి - ప్రకాశింపపజేయకున్నది. ఆ పాదమును తురీయమందురు. తురీయమనగా నాలుగవది అని యర్థము. "తం తురీయం పాదం శివ మద్వైతం చతుర్థం మన్యన్తే

స ఆత్మా స విజ్ఞేయః" అని శ్రుతిప్రసిద్ధము. ఆ తురీయపాదము శివము, అద్వైతము. అది ఆత్మ. దానిని తెలియవలయును.

ఊర్ధ్వాయ - పైనున్న మూడుపాదములకొరకు - ఆ మూడుపాదములు విశ్వ, తైజస, ప్రాజ్ఞనామములు గలవి. వానికొరకు అనగా వానిని కదలించుట కొరకు అని అర్థము. సంతతమ్- వ్యాపించియున్న; "తురీయం త్రిషు సంతతమ్" నాలుగవది మూడింటియందు వ్యాపించి యున్నది - అను వాక్య మిచట ప్రమాణము. అది నిజమే కదా. చైతన్యరూపమైన ఆత్మయొక్క సంబంధము లేనియెడల విశ్వాదులు తమకార్యములు చేయ జాలవు కదా! అట్టి ఆ తురీయమును సాధకుడు దర్శించినచో అజ్ఞానమువలన ఏర్పడిన మృత్యువు. అమృతస్థితియు రెండును ఉండవు. ఆ దర్శనముకొరకే సాధకుడు యోగమును సాధింపవలయునని ఫలితార్థము.

బ్రహ్మము సర్వకాలములలో జీవునకు అపరోక్షము - ప్రత్యక్షము అనుమాట సత్యమే. కాని ఉపాధినిబట్టి పరోక్షమగుచున్నది. అంతేకాని ఉపాధిని వదలినరూపముతో కాదు. కావున ఆ ఉపాధిజ్ఞానము నశించుటకై యోగము అవసరమగుచున్నదని భావము.

అట్లు ఉపాధివదలుటతో ప్రత్యక్షమగు పరమాత్మను యోగులు దర్శింతురు.

అంగుష్ఠమాత్రః పురుషోఽన్తరాత్మా
లిఙ్గస్య యోగేన స యాతి నిత్యమ్,
తమీశ మీడ్య మనుకల్ప మాద్యం
పశ్యన్తి మూఢా న విరాజమానమ్,
యోగిన స్తం ప్రపశ్యన్తి భగవన్తం సనాతనమ్. 15

ప్ర. అ. అన్తరాత్మా - అంతరాత్మ; అంగుష్ఠమాత్రః - బొటనవ్రేలంత, పురుషః - పురుషుడు; సః - అతడు; లింగస్య - లింగశరీరముయొక్క; యోగేన - సంబంధముచేత, నిత్యమ్ - ఎల్లవేళల. యాతి - తిరుగుచున్నాడు; ఈశమ్ - ఈశ్వరుడు, ఈడ్యమ్ - స్తుతింపదగినవాడు; అనుకల్పమ్ - ఉపాధులనుబట్టి సర్వకార్యములయందు సమర్థుడు, ఆద్యమ్ - మూలకారణుడు, విరాజమానమ్ - చైతన్యరూపమున ప్రకాశించుచున్నవాడు - అగు; తమ్ - ఆ

పరమాత్మను; మూఢాః - మూఢులు; న, పశ్యన్తి - చూడకున్నారు; యోగినః - యోగులు, పశ్యన్తి - చూచుచున్నారు.

తా. ఆ పరమాత్మ బొటనవ్రేలంత ప్రమాణముగల హృదయమున పూర్ణస్వరూపుడై అందరియందు అన్నింటియందు ఉన్నాడు. లింగశరీర సంబంధముచేత ఇహపరములకు జాగ్రత్స్వప్నములకు తిరుగుచున్నాడు. సర్వమును నియమించుచు, స్తుతులకు లక్ష్యమగుచు, ఉపాధులనుబట్టి సర్వకార్యములను చక్కగా నిర్వహించుచు ప్రత్యక్చైతన్యరూపముతో వెలిగిపోవుచున్న ఆ పరమాత్మను అజ్ఞానము క్రమ్మివేయగా మూఢులు చూడజాలకున్నారు. యోగులు మాత్రము దర్శింతురు.

వ్యా. అంగుష్ఠమాత్రః - బొటనవ్రేలంతటి హృదయము అను పద్మము లోపలిభాగమున ధ్యానింపదగినవాడు కనుక పరమాత్మ అంగుష్ఠమాత్రుడు.

పురుష దనగా పూర్ణుడని యర్థము.

అంతరాత్మ - వెలుపలి ఆత్మలగు అన్నమయాది పంచకోశములకంటె లోపలివాడు.

లిఙ్గస్య సంబంధేన - అయిదు ప్రాణములు, మనస్సు, బుద్ధి, పది యింద్రియములు - అనువాని సమాహారమైన లింగదేహముయొక్క సంబంధముచేత, నిత్యము, యాతి - ఇహలోకపరలోకములకు లేక జాగ్రత్స్వప్నదశలకు తిరుగుచున్నవాడు.

అంగుష్ఠమాత్రుడు అనుటచేత పరమాత్మను హృదయదేశమున ధ్యానింపవలయునని చెప్పినట్లయినది.

అవ. ఆ పరమాత్మ హృదయమున నున్నట్లు 'అంగుష్ఠమాత్రః' అనుచోట చెప్పియున్నారు కదా! హృదయమున నున్నవానికి హృదయమునకు తాపము కలిగినపుడు తాపము కలుగదా? అట్లు తాపస్వభావము గలవానికి ముక్తి యెక్కడిది? అను శంకకు సమాధానము చెప్పుచున్నారు.

అసాధనా వాఽపి ససాధనా వా,
సమాన మేత ద్దృశ్యతే మానుషేషు,
సమాన మేత దమృతస్యేతరస్య
ముక్తా స్తత్ర మధ్వ ఉత్సం సమాపుః.
యోగిన స్తం ప్రపశ్యన్తి భగవన్తం సనాతనమ్. 16

ప్ర.అ. అసాధనాః, వా - సాధనములేనివారో; ససాధనాః, వా, అపి- సాధనములుగలవారో - అట్టి, మానుషేషు-జీవులయందు, ఏతత్-ఈ బ్రహ్మము; సమానమ్ - ఎట్టివికారములు లేనిదై; దృశ్యతే - కానవచ్చుచున్నది; అమృతస్య- అమృతునకు; ఇతరస్య - ఇతరునకు; ఏతత్ - ఇది; సమానమ్ - సమానము; తత్ర - అందు; ముక్తాః - ముక్తులు, మధ్వః - మధువుయొక్క; ఉత్సమ్ - ఉత్కర్షను - ఎక్కువతనమును; సమాపుః - పొందిరి.

తా. కొందరు సాధనసంపత్తికలవారు కావచ్చును. కొందరు లేనివారు కావచ్చును. కాని అందరియందున్న బ్రహ్మమునకు మాత్రము ఏ వికారము లేదు. బద్ధులయెడ, ముక్తులయెడ బ్రహ్మము సమానమే. ముక్తులు మాత్రము బ్రహ్మానందముయొక్క గొప్పస్థితిని అనుభవింతురు.

వ్యా. మానుషేషు - అవయవముల సముదాయమగు దేహమునం దభిమానముగల జీవులయందు; కొందరు, అసాధనాః-శమదమాదిసాధనములు లేనివారు, కొందరు; ససాధనాః - సాధనములు కలవారు. అగుగాక!

సమానమ్-ఆ యందరియందున్న బ్రహ్మము మాత్రము ఏ వికారములు లేక ఏకరూపముతో నుండును.

'అసంగోఽహ్యయం పురుషః' - ఈ పరమాత్మ అసంగుడు అని శ్రుతి చెప్పుచున్నది కదా!

అమృతస్య - ముక్తునకు, ఇతరస్య - ఇతరుడైన బద్ధునకును-బ్రహ్మము సమానమే.

అయినచో ముక్తులయందు విశేషమేమి? చెప్పుచున్నారు.

తత్ర - ఆజీవులనడుమ; ముక్తులు మధువుయొక్క - బ్రహ్మరసము యొక్క; ఉత్సమ్ - ఉత్కర్షను - ఆధిక్యమును; సమాపుః - పొందిరి. ముక్తులకు బ్రహ్మానందానుభవము కలుగునని తాత్పర్యము.

ఇచట భావ మిది - ఒక అవస్థలో దుఃఖము కలిగిన దనుకొందము. అది మరియొక అవస్థలో లేదు కదా! కాబట్టి దుఃఖము ఉపాధిధర్మమే అని స్పష్టమగుచున్నది. అది భ్రాంతివలన, స్ఫటికమునందు ప్రతిబింబించిన పూవురంగు స్ఫటికమునకు సంబంధించినదే అనిపించినట్లు ఉపాధియందున్న ఆత్మదే అన్నట్లు తోచును. సాధనసంపత్తివలన ఉపాధిని సంపూర్ణముగా తొలగించు

కొనుటయే ముక్తి. అనగా స్ఫటికము కడనున్న పూవును తొలగించుటవంటి స్థితి. అపుడు రంగు కనబడదు. అట్లు ముక్తిపొందినవారికి ఆనందమే తప్ప దుఃఖస్పర్శయు ఉండదు. కావున తాపము ఉపాధినిబట్టి కలిగినదే కాని ఆత్మకు సంబంధించినది కాదని ఫలితార్థము.

అవ. ఇట్లు బ్రహ్మప్రాప్తి కలుగగా సర్వఫలములు సిద్ధించును. కృత కృత్యత కలుగునని చెప్పుచున్నారు.

ఉభౌ లోకౌ విద్యయా వ్యాప్య యాతి
తదా హుతం చాహుత మగ్నిహోత్రమ్,
మా తే బ్రాహ్మీ లఘుతా మాదధీత
ప్రజ్ఞానం స్యాన్నామ ధీరా లభన్తే.
యోగిన స్తం ప్రపశ్యన్తి భగవన్తం సనాతనమ్. 17

ప్ర.అ. జ్ఞానసంపద కలవాడు; విద్యయా-జ్ఞానముచేత; ఉభౌ, లోకౌ-రెండు లోకములను: వ్యాప్య - వ్యాపించి; యాతి - తిరుగును; అహుతమ్ - వ్రేల్వబడనిదయ్యు; అగ్నిహోత్రమ్ - అగ్నిహోత్రము; తదా - అప్పుడు; హుతమ్ - వ్రేల్వబడినదే - యగును; బ్రాహ్మీ - బ్రహ్మసంబంధమగు ఈ ఉపదేశవాక్కు; తే - నీకు; లఘుతామ్ - తక్కువతనమును; మా ఆదధీత - కలుగ జేయకుండుగాక! ప్రజ్ఞానమ్ - ప్రజ్ఞానము, నామ ఏవ, స్యాత్ - జ్ఞానవంతునకు పేరే అగుగాక! ధీరాః - ధీరులు; లభన్తే - ఆపేరు పొందుదురు.

తా. జ్ఞానమువలన రెండులోకములను వ్యాపించి జ్ఞాని సంచరించును ఆతడు హోమము చేయకున్నను చేసినట్లే యగును. ఓయి ధృతరాష్ట్రా! నే నుపదేశించిన యీ వాక్కువలన నీకు తక్కువతనము కలుగకుండుగాక! జ్ఞానికి ప్రజ్ఞానము పేరే యగు గాక! ఆపేరు ధీరులు పొందుదురు.

వ్యా. విద్య యనగా బ్రహ్మాకారము పొందిన అంతఃకరణవృత్తిచేత అని యర్థము. ఈ సర్వము నేనే అను భావన.

వ్యాప్య - వ్యాపించి - తెలిసికొని, యాతి - ప్రారబ్ధకర్మము పట్టుకొన్న దేహము కలవాడై - అది నశించువరకు దేహమును తాల్చి - అని భావము.

అప్పుడు అగ్నిహోత్రకార్యము చేయకున్నను చేసినట్లే యగును. జ్ఞానమునందు సర్వకర్మములు అంతర్భవించునని భావము.

మా లఘుతా మాదధీత - జ్ఞానము పొంది నేను బ్రహ్మమునైతి నన్న భావమున్న నీవు నేను దాసుడను, నీచుడను - అను తలపును దరికి రానీక మని తాత్పర్యము.

అట్టివానికి ప్రజ్ఞాన మనియే పేరు. "ప్రజ్ఞానం బ్రహ్మ" - "బ్రహ్మవిద్బ్రహ్మైవ భవతి" - అను శ్రుతివాక్యములచేత బ్రహ్మవేత్త ప్రజ్ఞానమను పేరే కలవాడగును. బ్రహ్మము జ్ఞానిరూపముతో తన మహిమను అర్హత కలవారి యందు రహస్యముగా ఉంచ నవసరము లేదు. అజ్ఞానులయందు ప్రకటింపరాదు.

"తథా చరేత వై యోగీ సతాం ధర్మ మదూషయన్,
జనా యథాఽవమన్యేరన్ గచ్ఛేయు ర్నైవ సఙ్గతమ్".

యోగి సత్పురుషుల ధర్మమును చెడకుండునట్లు ప్రవర్తింపవలయును. జనులు తన్ను అవమానింపకుండునట్లు, సంసారలంపటుడు కలవానినిగా భావన కూడ కలుగజేయనివిధమున ప్రవర్తింపవలయునని సూక్తి. కావున ప్రజ్ఞానమే అతని పేరగుగాక అనుటలో తన మహిమను యోగ్యులైనవారికి తెలియజేయుట కర్తవ్యమని తాత్పర్యము.

ధీరాః లభన్తే - ఈ ప్రజ్ఞాన మను పేరును ధీరులు - ధ్యాననిష్ఠ కలవారు పొందుదురు.

అట్టి ప్రజ్ఞాన మను పేరు కల పరమాత్మను యోగులు దర్శింతురు.

ఏవంరూపో మహాత్మా స పావకం పురుషో గిరన్,
యో వై తం పురుషం వేద తస్యేహార్థో న రిష్యతే.
యోగిన స్తం ప్రపశ్యన్తి భగవన్తం సనాతనమ్. 18

ప్ర.అ. ఏవంరూపః - ఇట్టి రూపముగల; మహాత్మా - పరమాత్మ; పావకమ్ - భోక్తయగు జీవుని, గిరన్ - రూపుమాపునట్టి; పురుషః - పురుషుడు - పూర్ణస్వరూపుడు; యః - ఎవడు; తమ్ - ఆ; పురుషమ్ - పూర్ణుని; వేద - తెలిసికొనెనో; తస్య - వానియొక్క; అర్థః - ప్రయోజనము; న రిష్యతే - హింస పొందదు;

తా. ఇట్లు పరమాత్మ జీవభావమును రూపుమాపును. అట్టి పరమాత్మ నెరిగినవానికి పురుషార్థము చెడదు.

వ్యా. ఏవంరూపః - ఇట్లు వాక్కునకు మనస్సునకు అందనివాడు - జగత్తునకు కారణమైనవాడు, వికారములు లేనివాడు, యోగమువలననే తెలిసికొనదగినవాడు - ఎవనిని ఎరిగినచో మహాపూజ్యత కలుగునో, కర్మఫలదోషము ఉండదో - అట్టి పరమాత్మ;

పావకం గిరన్ - కర్మఫలముల ననుభవించు జీవుని ఉపసంహరించుచు - జీవభావము లేకుండ చేయుచు - అని తాత్పర్యము.

ఇట్టి పూర్ణస్వరూపుడగు పరమాత్మను ఎరుగువాని మోక్షరూప పురుషార్థమునకు ఏలోపము రాదని తాత్పర్యము. కర్మఫలమువలె జ్ఞానఫలము అనిత్యము కాదని భావము.

అట్టి పురుషార్థనాశము కాని జ్ఞానము గల పరమాత్మను యోగులు దర్శింతురు.

అవ. జ్ఞానమువలన మోక్షమే కాదు. ఎంత దూరమున నున్నదియు, సర్వమును ఆత్మమునందే అంతర్భవించునని చెప్పుచున్నారు.

యః సహస్రం సహస్రాణాం పక్షాన్ సంతత్య సంపతేత్,
మధ్యమే మధ్య ఆగచ్ఛేదపి చేత్స్యాన్మనోజవః.
యోగినస్తం ప్రపశ్యన్తి భగవన్తం సనాతనమ్. 19

అ. ప్ర. యః - ఎవడు; సహస్రాణామ్ - వేల, సహస్రమ్ - వేయి; పక్షాన్ - రెక్కలను; సంతత్య - విస్తరించుకొని, సంపతేత్ - ఎగిరిపోవుగాక; మధ్యే - శరీరమునడుమ, మధ్యమే - హృదయముననున్న పరమేశ్వరుని కడకు; ఆగచ్ఛేత్ - రావలయును; అపి - మరియు; మనోజవః - మనస్సుయొక్క జవమువంటి జవముకలవాడు; చేత్ - అయినను, స్యాత్ - అగును.

తా. వేలవేయి రెక్కలు తాల్చి యెంత దూరమున కెగిరి పోయినవాడైనను శరీరమునడుమ హృదయము లోపలనున్న పరమాత్మకు సన్నిహితుడే యగును. మనోవేగము కలవాడైనను అంతియ.

వ్యా. పరమాత్మకు దూరము దగ్గర అను దశలు లేవని తాత్పర్యము. కావుననే పరమాత్మదర్శనము చేసిన యోగులు హృదయాకాశమున సర్వమును దర్శింపగలరని భావము. ఈ దూరము కాలమును కూడ సూచించును. పరమాత్మకు దేశకాలపాత్రల పరిచ్ఛేదములు లేవు కాన యోగులకు కూడ వాని భేదములు లేవని ఫలితార్థము.

అట్టి పరమాత్మను యోగులు దర్శింతురు.

అవ. ఇట్టి ఆత్మను దర్శించు యోగమున కనుగుణమైన ఇతర సాధనములను చెప్పుచున్నారు.

న దర్శనే తిష్ఠతి రూప మస్య
పశ్యన్తి చైనం సువిశుద్ధసత్త్వాః,
హితో మనీషీ మనసా న తప్యతే
యే ప్రవ్రజేయు రమృతాస్తే భవన్తి.
యోగిన స్తం ప్రపశ్యన్తి భగవన్తం సనాతనమ్. 20

ప్ర. అ. అస్య - ఆ పరమాత్మయొక్క; రూపమ్ - రూపము; దర్శనే- చూపునందు; న, తిష్ఠతి - నిలువదు, చ - మరియు; ఏనమ్ - ఆ పరమాత్మను; సువిశుద్ధసత్త్వాః - మిక్కిలి పరిశుద్ధమైన చిత్తము గలవారు; పశ్యన్తి - చూతురు; హితః - సర్వుల మేలుకోరువాడు; మనీషీ - మనస్సును నిలువరింపగలవాడు; మనసా, చ - మనస్సుతోకూడ; న, తప్యతే - దుఃఖపడడో; అతడు శుద్ధ చిత్తుడగును; యే - ఎవరు; ప్రవ్రజేయుః - సంన్యసింతురో; తే - వారు; అమృతాః - అమృతులు; భవన్తి - అగుదురు.

తా. ఆ పరమాత్మరూపము కంటికందునది కాదు. ఏ కొంచెము మాలిన్యములేని చిత్తము కలవారు మాత్రమే అతని నెరుగుదురు. సమస్తవిశ్వమునందు శుభభావన కలిగియుండుట, సంకల్పవికల్పములను అణచివేయుట, దుఃఖకారణ మెంతటిదైనను దుఃఖపడకుండుట అనునవి శుద్ధచిత్తుని లక్షణములు. ఇది యెరిగి విక్షేపహేతువగు సంసారమును పరిత్యజించువారు అమృతులగుదురు. అట్టి అమృతకారణమైన పరమాత్మను యోగులు దర్శింతురు.

వ్యా. కంటికందదు అనుట ఏ ఇంద్రియములకు అందదు అని చెప్పుట.

మనసా న తప్యతే - మిక్కిలి ప్రియులైన పుత్రాదులు మరణించినను దుఃఖపడడు. చిత్తశుద్ధి కిట్టివి లక్షణములు.

ప్రవ్రజేయుః - విక్షేపమునకు - పరమాత్మనుండి దూరముచేయుటకు కారణములగు గృహాదులను వదలుదురు. సంన్యాసులయినవారని భావము.

అవ. సంన్యసించిన పిదప పొరపాటుననైనను వంచకులను గూడరాదని చెప్పుచున్నారు.

గూహన్తి సర్పా ఇవ గహ్వరాణి
స్వశిక్షయా స్వేన వృత్తేన మర్త్యాః,
తేషు ప్రముహ్యన్తి జనా విమూఢా
యథాఽధ్వానం మోహయన్తే భయాయ.
యోగినస్తం ప్రపశ్యన్తి భగవన్తం సనాతనమ్. 21

ప్ర.అ. మర్త్యాః-మనుజులు; స్వశిక్షయా - తమ గురువుల శిక్షణచేతనో; స్వేన - తనదైన, వృత్తేన - నడవడిచేతనో; సర్పాః, ఇవ - పాములవలె, గహ్వరాణి - పాపములను, గూహన్తి - దాచుకొందురు; విమూఢాః - వివేకము లేని; జనాః - జనులు; తేషు - అట్టివారివిషయమున, ముహ్యన్తి - భ్రమపడుదురు; యథా - ఏ విధముగా; అధ్వానమ్ - దారిని, భయాయ - భయము కలిగించుటకై, మోహయన్తే - వంచింతురో;

తా. కొందరు మనుజులు తమకు బోధచేసినవారి శిక్షణవలననో, తమ నడవడిచేతనో పాపపుపనులు చేయుచు పాములవలె తమ పాపపుపనులను ఇతరులకు తెలియరాకుండునట్లు జాగ్రత్తపడుదురు. అట్టివారివిషయమున వివేకములేని జనులు భ్రమపడుదురు. ఆ వంచకులు వీరిని దారి మళ్ళించి మోసగింతురు.

వ్యా. గహ్వరము లనగా పాపములు - మద్యమాంసపరస్త్రీసేవనాదులు; సర్పా ఇవ - పాములు ఇతరజీవులను కాటువేసి పుట్టలలో దాగుకొన్నవిధముగా- అని భావము.

అధ్వానమ్-తాము శిష్టాచారులవలె గోచరించుచు ఇతరులకు నరకభయము కలిగించి మద్యమాంసాది అశుచివ్రతమును బోధించి మోసపుత్తురని భావము.

కావున చక్కగా పరీక్షించియే యితరులతో సాంగత్యము చేయవలయును. అప్పుడే పరమాత్మలాభము చేకూరును. అట్టి సత్సంగతివలన కలుగు పరమాత్మను యోగులు దర్శింతురు.

అవ. ఇట్లు సర్వకర్మత్యాగముచేసిన యోగులుకూడ దుష్టులసాంగత్యము వదలుట తప్పనిసరి యని నిరూపించి, జీవన్ముక్తులగువారి అనుభవమును చెప్పుచున్నారు.

నాహం సదాఽసత్కృతః స్యాం న మృత్యు-
ర్నచామృత్యు రమృతం మే కుతః స్యాత్,
సత్యానృతే సత్యసమానబన్ధే
సతశ్చ యోని రసతశ్చైక ఏవ.
యోగినస్తం ప్రపశ్యన్తి భగవన్తం సనాతనమ్. 22

ప్ర. అ. అహమ్ - నేను; సదా - సర్వకాలములలో; అసత్కృతః - అసత్తుచేత చేయబడినవాడను; న స్యామ్ - కాను; మృత్యుః-మృత్యువు; న-లేదు; అమృత్యుః - జన్మము; న - లేదు; మే - నాకు; అమృతమ్ - మోక్ష మనునది; కుతః - స్యాత్ - దేనివలన నగును? సత్యానృతే - సత్యము, అనృతము అనునవి; సత్యసమానబన్ధే - సత్యము, సమానము అగు బంధము కలవి; సతః, చ - సత్తునకును, అసతః, చ - అసత్తునకును; యోనిః - ఉత్పత్తిస్థానము; ఏకః, ఏవ - నే నొక్కడనే.

తా. నేను అసత్తుచేత ఏర్పడినవాడను కాదు. నాకు మృత్యువు లేదు. జన్మమును లేదు. మోక్ష మెక్కడిది? సత్యము, అనృతము అను రెండును సత్యము సమానము అగు బ్రహ్మమునందే చిక్కియున్నవి. సదసత్తులకు నేనే ఉత్పత్తిస్థానమును.

వ్యా. సదా - మూడుకాలములందును; అసత్కృతః - సత్తుకాని దేహేంద్రియాదికముచేత - తాదాత్మ్య భ్రాంతిచేత - సుఖదుఃఖ జరా మరణాది ధర్మములు గలుగునట్లు చేయబడినవాడను కాదు.

కావుననే దేహాదివియోగరూపమైన మృత్యువు లేదు. అమృత్యు వనగా మృత్యువునకు విరోధియగు జన్మము - అదియు లేదు.

జన్మమృత్యువులు లేనిచో మోక్షమను మాటయే లేదు గదా.

సత్యానృతే - సత్య మనగా సాక్షాత్తుగా కానవచ్చు కుండ మొదలగు వస్తువులు. అనృత మనగా - భ్రాంతివలన త్రాటియందు కానవచ్చు పాము మొదలగునవియు సత్యసమానబంధములు. సత్యమనగా దేశాదుల హద్దులు లేనిది. సమాన మనగా సర్వకాలములయందు సర్వదేశములయందు ఏక రూపముగా నుండునది. అట్టి బ్రహ్మము బంధముగా గలవి. అనగా జగత్తంతయు బ్రహ్మాధీనమని భావము. సదసత్తులకు - కార్యకారణములకు యోనిః - ఉత్పత్తిస్థానము. దీనిచేత ప్రళయస్థానముకూడ ఊహింపనగును. అది నేనే. అట్టి నన్ను యోగులు దర్శింతురు.

శ్రుతియు దీనిని చెప్పియున్నది -
"న నిరోధో న చోత్పత్తి ర్న బద్ధో న చ సాధకః,
న ముముక్షు ర్న వై ముక్త ఇత్యేషా పరమార్థతా".

నిరోధము లేదు. ఉత్పత్తి లేదు. బద్ధుడు కాడు, సాధకుడు కాడు. మోక్షమున ఇచ్ఛ లేదు. ముక్తుడు కాడు - ఇది పరమార్థత. ఇట్లు సృష్టి మొదలగున దంతయు నాయందే కల్పితమని తాత్పర్యము.

అవ.: బ్రహ్మజ్ఞాని సత్కర్మముచే గొప్పవాడు కాడు. అసత్కర్మముచే హీనుడును కాడు అను శ్రుతిసిద్ధవిషయమునుబట్టి కర్మ మంటకుండుటయే బ్రహ్మవిద్యాఫలమని చెప్పుచున్నారు

న సాధునా నోత అసాధునా వా
ఒసమాన మేత ద్దృశ్యతే మానుషేషు,
సమాన మేత దమృతస్య విద్యా-
దేవం యుక్తో మధు తద్వై పరీప్సేత్. 23

ప్ర. అ. ఏతత్ - ఈ బ్రహ్మము, సాధునా - సత్కర్మము చేత, సమానమ్ - గొప్పది; న - కాదు; అసాధునా - చెడుపనిచేత; అసమానమ్ - నీచమైనది; న - కాదు, మానుషేషు-మనుష్యులయందు, ఏతత్ - ఈ భేదము, దృశ్యతే-కానవచ్చుచున్నది.అమృతస్య-కైవల్యమునకు; సమానమ్-సమానముగా, ఏతత్ - దీనిని, విద్యాత్ - తెలియవలయును, ఏవమ్ - ఇట్లు చెప్పిన

విధముగా, యుక్తః - యోగము సాధించినవాడై; తత్ - ఆ, మధు - బ్రహ్మమును, పరీప్సేత్ - పొందగోరవలయును.

తా. మనుష్యులలో కర్మఫలభేదములు కానవచ్చుచున్నవి. కాని బ్రహ్మము సాధుకర్మముతో గొప్పదియో, అసాధుకర్మముతో తక్కువదో కాదు. ఈ బ్రహ్మము కైవల్యమునకు సమానము. ఇట్లు యోగమును సాధించినవాడు ఆ బ్రహ్మమును పొందగోరవలయును. అట్టి పరమాత్మను యోగులు దర్శింతురు.

వ్యా. "అసాధనా వాఽపి ససాధనా వా" అనుచోట బ్రహ్మముయొక్క అసంగస్థితిని వర్ణించిరి. ఇచట బ్రహ్మవేత్తకు పాపస్పర్శ లేదని చెప్పుచున్నారు.

మానుషేషు - దేహాభిమానము కలవారి విషయమున కర్మఫలములందు తారతమ్యము లున్నట్లు బ్రహ్మవేత్తయం దుండ దని తాత్పర్యము.

సమానమేత దమృతస్య-కైవల్యము- మోక్షమునందు పుణ్య పాప స్పర్శ ఏ కొంచెమును లేదనుట అందరు అంగీకరించినదే. అదే స్థితి బ్రహ్మవేత్తకును గలదు.

మధు - అందరు ప్రీతితో కోరెడు వస్తువు కనుక ఇచట మధు వనగా బ్రహ్మము.

'మధు' అన్నచోట 'బహు' అని యొక పాఠము. ఆ శబ్దమునకు కూడ బ్రహ్మము అనియే యర్థము. హద్దులేని బహుత్వము బ్రహ్మమునందే పర్యవసించును.

నాస్యాతివాదా హృదయం తాపయన్తి
నానధీతం నాహుత మగ్నిహోత్రమ్,
మనో బ్రాహ్మీ లఘుతా మాదధీత
ప్రజ్ఞాం చాస్మై నాము ధీరా లభన్తే.
యోగినస్తం ప్రపశ్యన్తి భగవన్తం సనాతనమ్. 24

ప్ర.అ. అస్య - ఇతనికి - బ్రహ్మవేత్తకు; అతివాదాః-నిందావాక్యములు; హృదయమ్ - హృదయమును; న, తాపయన్తి - బాధింపవు; అనధీతమ్ - నాచే అధ్యయనము చేయబడలేదు; అగ్నిహోత్రమ్ - అగ్నిహోత్రము; అహుతమ్- హోమము చేయబడలేదు; అని అతని హృదయము; న-బాధపడదు. బ్రాహ్మీ-

బ్రహ్మసంబంధమైన ఈ విద్య; అస్మై - ఈ పురుషునకు; లఘు-శీఘ్రముగా, తాం, ప్రజ్ఞామ్ - ఆ ప్రజ్ఞను; ఆదధీత - కలిగించును; ధీరాః - ధీరులు; లభన్తే - పొందుదురు,

తా. ఇతరులు చేసిన నిందలు అతని హృదయమును నొప్పింపవు. నేను అధ్యయనము చేయలేదు. హోమము చేయలేదు అను వేదన అతనికి కలుగదు. బ్రహ్మసంబంధమైన యీ విద్య అతనికి శీఘ్రముగా ప్రజ్ఞను కలిగించును. అట్టి ప్రజ్ఞను ధీరులు పొందెదరు.

వ్యా. నానధీతమ్ - అధ్యయనాగ్నిహోత్రాదికర్మములు జ్ఞాని చేయకున్నను అతనికి ప్రత్యవాయము లేదని భావము. శ్రుతి - "నైనం కృతాకృతే తపతః". ఈతనిని కృతాకృతములు బాధింపవు. "ఏతం హ వా వ న తపతి కిమహం సాధు నాకరవం కిమహం పాపమకరవమితి" - బ్రహ్మవేత్తకు నేను సత్కార్యము చేయలేదు. పాపము చేసితిని - అను భావములు వేదన కలిగింపవు అని చెప్పుచున్నది.

బ్రాహ్మీ - బ్రహ్మకు సంబంధించిన యీ విద్య, ప్రజ్ఞామ్ - ప్రజ్ఞను - ఆ ప్రజ్ఞ యెట్టిదనగా - ఆ ప్రజ్ఞ యొక పెద్ద మేడ. దాని నెక్కి అతడు శోకించు జనులను కొండమీద నున్నవాడు భూమిపై నున్నవారిని చూచినట్లు చూచును. అతని విషయమున నెవ్వరు అయ్యో! పాప మనుకొనవలసిన స్థితి యుండదు. ఇట్టి ప్రజ్ఞను ఋతంభర అందురు. ఆత్మవేత్త సర్వవేత్త యగునని భావము.

ధీరు లనగా ధ్యాననిష్ఠ కలవారు. వా రా ప్రజ్ఞను పొందుదురు. 'నామ' అను పదము నిశ్చయముగా అను నర్థము నిచ్చును.

దీనిచేత శోకమోహములు దరికి రాకుండుట, సర్వజ్ఞత్వము అనునవి బ్రహ్మవిద్యాఫలములుగా చెప్పినట్లయినది.

ఇట్లు రాపాదులు పొందని విద్వాంసునితో అభిన్నుడగు పరమేశ్వరుని యోగులు దర్శింతురు.

ఏవం యః సర్వభూతేషు ఆత్మాన మనుపశ్యతి,
అన్యత్రాన్యత్ర యుక్తేషు కిం స శోచేత్తతః పరమ్. 25

ప్ర.అ. ఏవమ్ - ఇట్లు; యః - ఏ జ్ఞాని; సర్వభూతేషు - సమస్తములగు భూతములయందు; ఆత్మానమ్ - ఆత్మను; అనుపశ్యతి - అవిచ్ఛిన్నముగా

చూచునో, అన్యత్ర - ఇతరములగు భార్యాదులయందును; అన్యత్ర - ఆ యా కర్మములందును, యుక్తేషు - తగులకొనినవారియందు; సః - ఆతడు; కిం శోచేత్ - ఏమి దుఃఖించును? తతః పరమ్ - ఆ ఆత్మకంటె అధికముగా-(ఏమి ఆతనికి తోచును?)

తా. ఇట్లు సర్వభూతములయందు ఆత్మమునే అనుస్యూతముగా చూచు వానికి సంసారమున తగులుకొనిన వారినిగూర్చియు దుఃఖము కలుగదు. ఆత్మ కంటె భిన్నముగా ఆతనికేదియు గోచరింపదు.

వ్యా. అనుపశ్యతి - గురువాక్యములవలన కలిగిన జ్ఞానముతో సర్వ భూతములను ఆత్మముగానే విడువక చూచువాడు - అనుస్యూతముగా అనగా ఆత్మకంటె వేరైన భావము ఏమాత్రము తోచకుండుట - ఇదియే ధ్యానదృష్టి.

అన్యత్ర - ఇతరములగు దారపుత్రాదులయందును; అన్యత్ర-కర్మముల యందు - యజ్ఞయాగాదులయందును;

యుక్తేషు - ఇతరజనులు తగులుకొనియుండగా-

కిం శోచేత్ - ఏమి దుఃఖించును. ఆతనికి దుఃఖమే లేదు. అట్లు దారాదుల యందును, కర్మములయందును తగులుకొన్నవారే దుఃఖమగ్నులగుదురని భావము.

యథోదపానే మహతి సర్వతః సంప్లుతోదకే,
ఏవం సర్వేషు వేదేషు ఆత్మాన మనుజానతః. 26

ప్ర. అ. సర్వతః - అన్నియెడల; సంప్లుతోదకే - వెల్లివిరియు నీరు గల; మహతి - గొప్ప; ఉదపానే - మంచినీరు దొరకు స్థలమునందు; యథా - ఎట్లో; ఏవమ్ - అట్లు; ఆత్మానమ్ - ఆత్మను; అనుజానతః - వదలక గుర్తించుచున్నవానికి; సర్వేషు - సమస్తములగు; వేదేషు - వేదములయందు; అగును.

తా. దప్పిగొన్నవానికి అన్నివైపుల మంచినీరము సమృద్ధిగా లభించు చెరువునందెట్లో ఆత్మను దర్శించువానికి సర్వవేదములయందట్లే బ్రహ్మము గోచరించును.

వ్యా. ఉదపాన మనగా నీరు త్రావుచోటు-చెరువు, బావి మొదలగునది. ఎటు చూచినను పుష్కలముగా నీరున్నవానికి స్నానపానాదుల కెట్లు లోపము కలుగదో ఆత్మ నెరుగగోరువానికి సర్వవేదములలో అట్టిది లభించునని తాత్పర్యము. కావున వేలకొలంది గ్రంథముల భారము మోయుట వ్యర్థము. దానిలోపల సారభూతమైన జ్ఞానవాక్యమును గురువువలన నెరిగి, మననము చేసి హృదయమున చెదరక నిలుపుకొని కృతకృత్యుడు కావలయు నని భావము. మరియు దాహము కలవానికి చెరువునందలి నీరంతయు అక్కరలేదు. ఎంత కావలయునో అంతే గ్రహించును. అట్లే జ్ఞానతృష్ణ కలవాడు వేదము లన్నియు తిరుగవేయనక్కరలేదనియు తాత్పర్యము.

అఙ్గుష్ఠమాత్రః పురుషో మహాత్మా
న దృశ్యతే సౌహృది సంనివిష్టః,
అజశ్చరో దివరాత్ర మతన్ద్రితశ్చ
స తం మత్వా కవిరాస్తే ప్రసన్నః. 27

ప్ర. అ. పురుషః - పరమాత్మ; అఙ్గుష్ఠమాత్రః - వ్రేలెడంతవాడు; అయినను; మహాత్మా - సర్వమున నిండియున్నవాడు; సౌహృది - మంచిహృదయదేశమున, సంనివిష్టః - నెలకొనియున్నవాడు - అయినను; న దృశ్యతే - కానరాడు. అజః - జన్మము లేనివాడు; దివారాత్రమ్ - పగలనక రాత్రి యనక సర్వవేళలలో; చరః - సంచరించుచుండును; అతన్ద్రితః - అలసత మొదలగు లక్షణములు లేనివాడు; తమ్ - అట్టి పరమాత్మను; సః - అతడు - అజ్ఞాని; మత్వా - ఎరిగి; ప్రసన్నః - ఏ దోషములు లేనివాడై; కవిః - సర్వజ్ఞుడు, అయి; ఆస్తే - ఉండును.

తా. ఆ పరమాత్మ వ్రేలెడంత హృదయములో నుండియు విశ్వమంతయు నిండినవాడు. ఎవ్వరికిని కానరాడు. జన్మాదులు లేనివాడు. అలసత యెరుగక సర్వకాలములలో జ్ఞానరూపుడై తిరుగుచుండును. అట్టి పరమాత్మ నెరిగినవాడు ప్రసన్నుడై కవియై నిష్క్రియుడై యుండును.

వ్యా. అంగుష్ఠమాత్రః - ఉపాధివలన సూక్ష్మ పరిమాణము కలవాడని భావము; మహాత్మా - అంతట వ్యాపించినవాడు, న దృశ్యతే - రూపాదులులేని

బాదని భావము; అజః - పుట్టనివాడు, సృష్టిస్థితిలయములు లేనివాడు, చరః - జగత్తును సదపుటలో నిత్యజాగరూకుడని భావము.

సః - పరమాత్మకు గల ఈ లక్షణము లన్నింటిని గురువువలన తెలిసి కొన్నవాడు; మత్వా - దానిని చక్కగా కుదురుకొల్పుకొని; కవిః - ఇంద్రియ ముల కందని దర్శనసామర్థ్యము కలవాడు; ప్రసన్నః - ఉపాధివలన నేర్పడిన కాలుష్యము లన్నియు పోగా నిర్మలమైనవాడు; ఆస్తే - ఉండును. సర్వ కర్మ ముల నుండి వెనుకకు మరలి ఉండును.

అవ. ఇప్పుడు బ్రహ్మవేత్త బ్రహ్మభావమును అనుభవించుచు తాను సర్వాత్ముడనని సంభావించుతీరును వివరించుచున్నారు.

అహమేవ స్మృతో మాతా పితా పుత్రోఽస్మ్యహం పునః,
ఆత్మాహమపి సర్వస్య యచ్చ నాస్తి యదస్తి చ. 28

అ.ప్ర. అహమ్, ఏవ - నేనే; మాతా - తల్లిని; పితా - తండ్రిని; పుత్రః, అస్మి - కొడుకను; అహమ్ - నేను; సర్వస్య - సర్వమునకు; ఆత్మా, అపి - ఆత్మమును; అస్మి - అయితిని; యత్ - ఏది; నాస్తి - లేదో; యత్ - ఏది; అస్తి - ఉన్నదో - అది యంతయు నేనే.

తా. ఈ సమస్తమునకు నేనే తండ్రిని, నేనే తల్లిని, నేనే పుత్రుడను, నేనే ఆత్మను. ఉన్నది, లేనిదియు అంతయును నేనే.

వ్యా. నాస్తి - ఇప్పటికి లేనిది - అనగా భూతము, భవిష్యత్తు - వెళ్ళి నది - రానున్నది అని అర్థము; అస్తి - అనగా వర్తమానము.

ఆత్మా - సర్వులకు, సర్వమునకు అంతరాత్మను నేనే అని తాత్పర్యము.

పితామహోఽస్మి స్థవిరః పితా పుత్రశ్చ భారత,
మమైవ యూయమాత్మస్థా న మే యూయం న వో వయమ్.29

అ.ప్ర. భారత - భారతా! స్థవిరః - ముదుసలియగు; పితామహః - తాతను; అస్మి - నేనే; పితా - తండ్రియు; పుత్రః, చ - కొడుకును-నేనే; యూయమ్ - మీరందరు; మమ - నా; ఆత్మస్థాః, ఏవ-ఆత్మయందు దున్నవారే;

యూయమ్ - మీరు; మే - నా వారు; న - కారు; వయమ్ - మేము; వః - మీవారము; న - కాము.

తా. రాజా! వృద్ధుడైన తాత, తండ్రి, కొడుకు అన్నియు నేనే. మీరందరు నా ఆత్మలోనున్నవారే. అయినను మీరు నావారు కారు. మేము మీవారము కాము.

వ్యా. తల్లి, తండ్రి, కొడుకు, తాత అన్నియు నేనే అనుట బ్రహ్మము నందు జగత్తును ఆరోపించిచూచు దృష్టి. మీరు నావారుకాదు. మేము మీవారము కాదు అనుట అపవాదదృష్టి. జగద్భావనను తొలగించి కేవలము బ్రహ్మమునే చూచుట.

అవ. మోక్షమునం దిచ్చకలవారు చూడదగినది నేనే యనుచున్నారు.

ఆత్మైవ స్థానం మమ జన్మ చాత్మా
ఓతప్రోతో౾హ మజరప్రతిష్ఠః,
అజశ్చరో దివారాత్ర మతన్ద్రితో౾హమ్
మాం విజ్ఞాయ కవిరాస్తే ప్రసన్నః. 30

ప్ర. అ. మమ - నా; స్థానమ్ - తావు; ఆత్మా, ఏవ - ఆత్మయే; జన్మ, చ - పుట్టుకకు కారణమును, ఆత్మా - ఆత్మయే; అహమ్ - నేను; ఓతప్రోతః - పడుగుపేక దారముల వంటివాడను; అజరప్రతిష్ఠః - ఏకొంచెము జారుపాటులేని ప్రతిష్ఠ కలవాడను; అజః - అజుడను; దివారాత్రమ్ - పగలును రాత్రియును; అతన్ద్రితః - అలసత యెరుగక; చరః - తిరుగువాడను; మామ్-నన్ను; విజ్ఞాయ - తెలిసికొని; కవిః-క్రాంతదర్శి; ప్రసన్నః - నిర్మలుడు, ఆస్తే - అగును.

తా. నా నెలవు ఆత్మయే. నా పుట్టుక ఆత్మమునందే; పడుగుపేకలుగా అల్లుకొనిన దారములవలె అంతయు ఆత్మస్వరూపమే. నాస్థితికి ఏవిధమైన మార్పులు లేవు. పుట్టుక, చావు మొదలగు వికారములు నాకు లేవు. నిత్యము మెలకువతో అంతట చైతన్యరూపమున కదలుచున్నవాడను. నన్నెరిగినవాడు కవి యగును. ప్రసన్నుడగును.

వ్యా. "స్వే మహిమ్ని ప్రతిష్ఠితః" పరమాత్మ తన మహిమలో కదలక చెదరక నిలిచియుండును. అను శ్రుతివాక్యమునుబట్టి ఆత్మయే నా స్థానము

జన్మాదికము ఆత్మయే యనగా లోకవ్యవహారమును బట్టి చావుపుట్టుకలను భావించునెడల అన్నియు ఆత్మయందే తాత్పర్యము. నిజమునకు చావుపుట్టుకలు లేవని తెలియదగును.

వస్త్రమునందు దారమున్నట్లు విశ్వమంతయు నేనే వ్యాపించియున్నాను - అని ఓతప్రోతశబ్దమున కర్థము. నిజమునకు దారమే వస్త్రము అన్నట్లు సర్వము నేనే అని తాత్పర్యము.

అజరప్రతిష్ఠః - ఏమాత్రము స్వరూపవికారములేని ఒకే విధమగు స్థితి నాది యని తాత్పర్యము.

తక్కిన వాక్యములకు పూర్వశ్లోకములలో వివరణ కలదు.

అవ. ప్రకరణార్థమును ముగించుచున్నారు.

అణో రణీయాన్ సమనాః సర్వభూతేషు జాగ్రతి,
పితరం సర్వభూతేషు పుష్కరే నిహితం విదుః. 31

ప్ర.అ. అణోః - అణువుకంటె; అణీయాన్ - సూక్ష్మమైనది; సుమనాః - దివ్యమైన దర్శనముకలది; సర్వభూతేషు - సర్వభూతములయందు; జాగ్రతి - జాగర్తి - మేలుకొనియుండును; అట్టి పరమాత్మను, పితరమ్ - సర్వభూతములకు ఉత్పత్తి కారణముగా; సర్వభూతేషు - సర్వదేహములయందు; పుష్కరే - హృదయపద్మమున, నిహితమ్ - ఉన్నవానినిగా; విదుః - బ్రహ్మజ్ఞులు ఎరుగుదురు.

తా. ఆ పరతత్త్వము అణువుకంటె సూక్ష్మమైనది. దివ్యనేత్రము కలది. సర్వభూతములలో నిత్యము మేల్కొనియుండునది. సర్వభూతములను పుట్టించి పాలించునది. సర్వదేహముల హృదయపద్మములందు ఉన్నది అని బ్రహ్మవేత్త లెరుగుదురు

వ్యా. అణోరణీయాన్ - ఈ మాటకు చూడశక్యము కానిదని చెప్పుట తాత్పర్యము. అంతేకాని అణుతరమైన పరిమాణము కలది యని యర్థము కాదు. అస్థూలము, అనణు, అహ్రస్వము, అదీర్ఘము - అని బ్రహ్మమునందు నాలుగు విధములైన పరిమాణములు లేవని చెప్పియున్నారు. ఈమాటచే బ్రహ్మము నిర్గుణమని చెప్పినట్లయినది.

సుమనాః - శోభనమైన మనస్సు కలది - మనస్సనగా ఇచట కన్ను. దానికే మాయ యని పేరు. అది కడచినదానిని, రానున్నదానిని - సర్వమును ప్రకాశింపజేయును. "మనోఽస్య దైవం చక్షుః" అని శ్రుతి. ఆ పరమాత్మకు మనస్సనునది దివ్యలక్షణములు గల నేత్రము. దీనిచే సగుణస్వరూపము చెప్పినట్లయినది.

పితరమ్ - తండ్రి జన్మపాలనసంబంధము కలవాడు అని శబ్దార్థము. ఆకాశము మొదలగు పంచభూతములకు, జరాయుజములు మొదలగు నాలుగు విధములైన ప్రాణులకు ఉత్పత్తికర్త, పాలనకర్తయు పరమాత్మయే యని తాత్పర్యము.

పుష్కరే నిహితమ్ - ఇట్టి పరమాత్మను ఎందో వెదక నవసరము లేదు. ఆ పరమాత్మ సర్వదేహములలో హృదయమను పద్మమువంటి అవయవము నందే ఉండును. కనుక, ఆ పరమాత్మను హృదయమునందే ధ్యానరూపమున సాక్షాత్కరింపజేసికొని, కృతకృత్యుడు కావలయునని సనత్సుజాతుల ఉపదేశ సారమైన ఆనందస్వరూపము.

ఇతి శ్రీమహాభారతే ఉద్యోగపర్వణి సనత్సుజాతపర్వణి
షచ్చత్వారింశోఽధ్యాయః.

ఇది శ్రీమహాభారతము ఉద్యోగపర్వమున సనత్సుజాతపర్వమున
నలుబదియారవ అధ్యాయము.

సమాప్తం సనత్సుజాతపర్వ. సనత్సుజాతపర్వము ముగిసెను.

## * యానసంధి పర్వ - 5

## యానసంధి పర్వము - 5

### సప్తచత్వారింశోఽధ్యాయః-నలుబదియేడవ అధ్యాయము

పాణ్డవసమీపాద్ వినివర్తితస్య సఞ్జయస్య
కురురాజసంసది ప్రవేశః.

**పాండవుల కడనుండి తిరిగి వచ్చిన సంజయుడు
కురురాజుకొలువున ప్రవేశించుట.**

వైశమ్పాయన ఉవాచ - వైశంపాయను డిట్లు చెప్పెను.

ఏవం సనత్సుజాతేన విదురేణ చ ధీమతా,
సార్థం కథయతో రాజ్ఞః సా వ్యతీయాయ శర్వరీ. 1

ఇట్లు సనత్సుజాతునితోడను, బుద్ధిమంతుడగు విదురునితోడను, ప్రసంగము చేయుచున్న ధృతరాష్ట్రునకు ఆ రేయి గడచెను.

తస్యాం రజన్యాం వ్యుష్టాయాం రాజానః సర్వ ఏవ తే,
సభా మావివిశు ర్హృష్టాః సూతస్యోపదిదృక్షయా. 2

ఆ రేయి గడువగా దొర లందరు సంజయుని చూడగోరినవారై ఉత్సాహముతో కొలువున ప్రవేశించిరి.

---

* యానసంధి - సంజయుని యానము, భగవద్యానము - ఈ రెంటి నడుమ జరిగిన వృత్తాంతము దెలుపు పర్వము.

1. కథయతః - ప్రసంగ మాడుచున్న; శర్వరీ - రాత్రి.
2. సూతస్య - సంజయుని; ఉపదిదృక్షయా - చూపు కోరికతో.

శుశ్రూషమాణాః పార్థానాం వాచో ధర్మార్థసంహితాః,
ధృతరాష్ట్రముఖాః సర్వే యయూ రాజసభాం శుభామ్. 3

ధర్మము, అర్థములతో కూడిన కుంతి కొడుకుల మాటలు వినగోరుచు ధృతరాష్ట్రుడు మున్నగువా రందరు శుభమైన రాజసభకు వెడలిరి.

సుధావదాతాం విస్తీర్ణాం కనకాజిరభూషితామ్,
చన్ద్రప్రభాం సురుచిరాం సిక్తాం చన్దనవారిణా. 4

ఆ సభ సున్నపుతెలుపుతో విరాజిల్లుచున్నది. విశాలముగా నున్నది. బంగారు ముంగిలితో నొప్పారుచున్నది. చంద్రుని కాంతి వంటి కాంతితో చూడ ముచ్చట గొలుపుచున్నది. దానిని మంచిగంధపు నీటితో కడిగియుండిరి.

రుచిరై రాసనై స్తీర్ణాం కాఞ్చనై ర్దారవై రపి,
అశ్మసారమయై ర్దాన్తైః స్వాస్తీర్ణైః సోత్తరచ్ఛదైః. 5

అందు బంగారుతో, కొయ్యతో, రత్నములతో, దంతములతో చేసిన అందమైన ఆసనములు చక్కగా పరచియుంచిరి. వానిపై జిలుగు వస్త్రములు కప్పియుంచిరి.

భీష్మో ద్రోణః కృపః శల్యః కృతవర్మా జయద్రథః,
అశ్వత్థామా వికర్ణశ్చ సోమదత్తశ్చ బాహ్లికః. 6
విదురశ్చ మహాప్రాజ్ఞో యుయుత్సుశ్చ మహారథః,
సర్వే చ సహితాః శూరాః పార్థివా భరతర్షభ. 7
ధృతరాష్ట్రం పురస్కృత్య వివిశు స్తాం సభాం శుభామ్.

భీష్ముడు, ద్రోణుడు, కృపుడు, శల్యుడు, కృతవర్మ, జయద్రథుడు, అశ్వత్థామ, వికర్ణుడు, సోమదత్తుడు, బాహ్లికుడు, గొప్పప్రజ్ఞగల విదురుడు,

---

4. కనకాజిరభూషితామ్ - బంగారముతో చేసిన ముంగిలితో అలంకరింపబడినది.

5. అశ్మసారమయైః - రత్నములు కూర్చిన ఆసనములతో; స్వాస్తీర్ణైః - చక్కగా అమర్పబడిన; సోత్తరచ్ఛదైః - పైని పరచిన మంచి వస్త్రములతో కూడిన;

మహారథు డగు యుయుత్సుడు మరియు శూరులగు రాజు లందరు తమ హితు లతో గూడి ధృతరాష్ట్రుని ముందిడుకొని ఆ శుభలక్షణములు గల సభను చేరు కొనిరి.

దుశ్శాసన శ్చిత్రసేనః శకునిశ్చాపి సౌబలః, 8
దుర్ముఖో దుస్సహః కర్ణ ఉలూకోఽథ వివింశతిః,
కురురాజం పురస్కృత్య దుర్యోధన మమర్షణమ్, 9
వివిశు స్తాం సభాం రాజన్ సురాః శక్రసదో యథా.

దుశ్శాసనుడు, చిత్రసేనుడు, సుబలరాజగు శకుని, దుర్ముఖుడు, దుస్స హుడు, కర్ణుడు, ఉలూకుడు, వివింశతి అనువారు పొగరుబోతగు కురురాజు దుర్యోధనుని ముందిడుకొని దేవతలు ఇంద్రసభను చేరిన విధముగా ఆ సభ లోనికి ప్రవేశించిరి.

ఆవిశద్భి స్తదా రాజన్ శూరైః పరిఘబాహుభిః, 10
శుశుభే సా సభా రాజన్ సింహైరివ గిరేర్గుహా.

పరిఘలవంటి భుజములు గల శూరులు ప్రవేశించుచున్న ఆ సభ సింహ ములు చొచ్చుచున్న కొండగుహవలె ప్రకాశించెను.

తే ప్రవిశ్య మహేష్వాసాః సభాం సర్వే మహౌజసః, 11
ఆసనాని విచిత్రాణి భేజిరే సూర్యవర్చసః.

గొప్ప విలుకాండ్రు, గొప్ప కండబలముగలవారు, సూర్యుని తేజస్సు వంటి తేజస్సుగలవారు నగు ఆ రాజు లందరు వన్నెచిన్నెలు గల ఆసనముల నలంకరించిరి.

ఆసనస్థేషు సర్వేషు తేషు రాజసు భారత, 12
ద్వాఃస్థో నివేదయామాస సూతపుత్ర ముపస్థితమ్.

అట్లు ఆ రాజు లందరు ఆసనములందు కూర్చుండగా ద్వారపాలకుడు సంజయుడు వచ్చియుండెనని విన్నవించెను.

అయం స రథ ఆయాతి యోఽయాసీత్ పాణ్డవాన్ ప్రతి,
దూతో న స్తూర్ణ మాయాతః సైన్ధవైః సాధువాహిభిః. 13

పాండవుల కడ కరిగెనో ఇదిగో ఆ రథము వచ్చుచున్నది. పదిలముగా రథము లాగు గుఱ్ఱములతో మన దూత వడిగా నరుగుదెంచెను. (అని ద్వార పాలకుడు తెలిపెను.)

ఉపేయాయ స తు క్షిప్రం రథాత్ ప్రస్కన్ద్య కుణ్డలీ,
ప్రవివేశ సభాం పూర్ణాం మహీపాలై ర్మహాత్మభిః. 14

సంజయుడును వడివడిగా రథము దిగి కదలాడు కుండలములతో మహాత్ము లగు ఏలికలతో నిండియున్న కొలువుకూటమును చేరుకొనెను.

సఞ్జయ ఉవాచ - సంజయు డిట్లు పలికెను.

ప్రాప్తో౽స్మి పాణ్డవాన్ గత్వా తం విజానీత కౌరవాః,
యథావయః కురూన్ సర్వాన్ ప్రతినన్దన్తి పాణ్డవాః. 15

కౌరవులారా! పాండవుల కడ కరిగి తిరిగి వచ్చితిని. నన్ను చూడుడు. ఆ పాండవులు కౌరవుల నందరిని వారి వారి వయస్సులకు తగిన విధముగా మన్ననలు చేయుచున్నారు.

అభివాదయన్తి వృద్ధాంశ్చ వయస్యాంశ్చ వయస్యవత్,
యూన శ్చాభ్యవదన్ పార్థాః ప్రతిపూజ్య యథావయః. 16

పెద్దలకు మ్రొక్కుచున్నారు. తమ ఈడువారిని నెయ్యముతో సంభావించిరి. యువకులను పలుకరించిరి. ఇట్లు కుంతికొడుకులు వయస్సునకు తగిన మన్నన చేసిరి.

యథా౽హం ధృతరాష్ట్రేణ శిష్టః పూర్వ మితో గతః,
అబ్రువం పాణ్డవాన్ గత్వా తన్నిబోధత పార్థివాః. 17

రాజులారా! నే నిటనుండి పోవునపుడు ధృతరాష్ట్రుడు ఆజ్ఞ పెట్టిన తీరున పాండవులకడ కరిగి పలికినదానిని అవధరింపుడు.

ఇతి శ్రీమహాభారతే ఉద్యోగపర్వణి యానసంధిపర్వణి
సఞ్జయప్రత్యాగమనే సప్తచత్వారింశో౽ధ్యాయః.

ఇది శ్రీమహాభారతము ఉద్యోగపర్వమున యానసంధిపర్వమున
సంజయుని తిరిగిరాక యను నలుబదియేడవ అధ్యాయము.

— (౦) —

14. ప్రస్కన్ద్య - దిగి; ఉపేయాయ - చేరుకొనెను;
15. యథావయః - వారి వారి వయస్సునకు తగినట్లు;

## అష్టచత్వారింశోఽధ్యాయః

## నలుబదియెనిమిదవ అధ్యాయము

కౌరవసభాయాం సఞ్జయస్య సవ్యసాచి సన్దేశ సముద్ఘోషణమ్.

**కౌరవులసభలో సంజయుడు అర్జునుని సందేశమును నొక్కి పక్కాణించుట**

ధృతరాష్ట్ర ఉవాచ - ధృతరాష్ట్రు డిట్లు పలికెను.

పృచ్ఛామి త్వాం సఞ్జయ రాజమధ్యే
కిమబ్రవీ ద్వాక్య మదీనసత్త్వః,
ధనఞ్జయ స్తాత యుధాం ప్రణేతా
దురాత్మనాం జీవితచ్ఛి న్మహాత్మా. 1

నాయనా! సంజయా! ఈ రాజు లందరి యెదుట ని న్నడుగుచున్నాను. తరుగని సత్త్వ గలవాడు, యుద్ధములలో నాయకుడు, దుష్టబుద్ధుల బ్రదుకులు రూపుమాపువాడు మహాత్ముడు నగు అర్జునుడు ఏమి పలికెను?

సఞ్జయ ఉవాచ - సంజయు డిట్లు పలికెను.

దుర్యోధనో వాచ మిమాం శృణోతు
య దబ్రవీ దర్జునో యోత్స్యమానః,
యుధిష్ఠిర స్యానుమతే మహాత్మా
ధనఞ్జయః శృణ్వతః కేశవస్య. 2

కయ్యమునకు కాల్ద్రివ్వుచున్న అర్జునుడు ధర్మరాజు అనుమతింపగా, కృష్ణుడు వినుచుండగా పలికిన యీ పలుకును దుర్యోధనుడు వినవలయును.

అన్వత్రస్తో బాహువీర్యం విదాన
ఉపహ్వరే వాసుదేవస్య ధీరః,

అవోచన్మాం యోత్స్యమానః కిరీటీ
మధ్యే బ్రూయా ధార్తరాష్ట్రం కురుణామ్. 3

జంకుగొంకులు లేనివాడు, తన భుజబలము నెరిగినవాడు దిట్టయు నగు ఆ కిరీటి వాసుదేవుని సమీపమున ధీరుడై నిలిచి 'ఓయీ! సంజయా! నేను చెప్పు ఈ మాటలు కౌరవు లందరు వినుచుండగా ధృతరాష్ట్రుని కొడుకునకు చెప్పుమని నాతో పలికెను.

సంశృణ్వత స్తస్య దుర్భాషిణో వై
దురాత్మనః సూతపుత్రస్య సూత!,
యో యోద్ధు మాశంసతి మాం సదైవ
మన్దప్రజ్ఞః కాలపక్వోఽతిమూఢః. 4

కొంచె మేని వివేకము లేనివాడు కాలము మూడినవాడు, తెలివి చచ్చిన వాడు నై యెల్లవేళల నాతో కయ్యమును కాంక్షించుచుండునే. కారుకూతలు కూయు చెడిపె - ఆ కర్ణుడు వినుచుండగా నా మాటలు దుర్యోధనునకు చెప్పుము.

యే వై రాజానః పాణ్డవాయోధనాయ
సమానీతాః శృణ్వతాం చాపి తేషామ్,
యథా సమగ్రం వచనం మయోక్తం
సహామాత్యం శ్రావయేథా నృపం తత్. 5

మరియు పాండవులతో పోరుటకై ఆ రాజు తెచ్చిన రాజు లందరు వినుచుండగా నేను చెప్పినమాటను 'తు - చ' తప్పకుండ చెలిమికాండ్రతో కూడిన ఆ రాజునకు వినిపింపుము.

---

3. అను + అత్ర స్తః - ఇచట 'అను' శబ్దము 'అవోచత్' అను క్రియకు ముందు చేర్పబడినది. ధాతువునకు ఉపసర్గకు వ్యవధాన ముండుట వేద భాషలో సహజమే. వ్యాసవాక్కు వేదవాక్కువంటిది; విద్వానః - ఎరిగిన వాడు; ఉపహ్వరే - సమీపమున; కురుణాం మధ్యే ధార్తరాష్ట్రం బ్రూయాః ఇత్యవోచ దితి సంబంధః - కురువులనడుమ దుర్యోధనునకు చెప్పుమని పలికెనని వాక్యమున కన్వయము.

5. పాణ్డవ + ఆయోధనాయ - పాండవుల తోడి యుద్ధమునకై.

యథా నూనం దేవరాజస్య దేవాః
శుశ్రూషన్తే వజ్రహస్తస్య సర్వే,
తథాఽశృణ్వన్ పాణ్డవాః సృఞ్జయాశ్చ
కిరీటినా వాచ ముక్తాం సమర్థామ్. 6

వజ్రము చేపట్టిన దేవేంద్రుని పలుకులు దేవత లందరు శ్రద్ధతో విన్న తీరున ఆ అర్జును డాడిన చేవగల పలుకును పాండవులు సృంజయులు ఆలకించిరి.

ఇత్యబ్రవీ దర్జునో యోత్స్యమానో
గాణ్డీవధన్వా లోహితపద్మనేత్రః,
న చే ద్రాజ్యం ముఞ్చతి ధార్తరాష్ట్రో
యుధిష్ఠిర స్యాజమీఢస్య రాజ్ఞః. 7

పోరుటకు సిద్ధముగా నున్నవాడై గాండీవము చేపట్టిన అర్జునుని కన్నులు ఎఱ్ఱదామరలవన్నె తాల్చినవి. ఆత డిట్లు పలికెను. అజమీఢవంశమువా డగు ధర్మరాజునకు ధృతరాష్ట్రుని కొడుకు రాజ్య మొసగకున్నచో.........

అస్తి నూనం కర్మ కృతం పురస్తా-
దనిర్విష్టం పాపకం ధార్తరాష్ట్రైః,
యేషాం యుద్ధం భీమసేనార్జునాభ్యాం
తథాశ్విభ్యాం వాసుదేవేన చైవ. 8

ఆ ధృతరాష్ట్రుని కొడుకులు మునుపు చేసిన పాప మట్లే యున్నది. దాని ఫల మింకను వారు అనుభవింపలేదు. అట్టివారికి ఇపుడు భీమసేనునితో, అర్జునునితో, కవలలతో శ్రీకృష్ణునితో కూడ పోరు దాపురించును.

శైనేయేన ధ్రువ మాత్తాయుధేన
ధృష్టద్యుమ్నే నాథ శిఖణ్డినా చ,
యుధిష్ఠిరే ణేన్ద్రకల్పేన చైవ
యోఽపధ్యానా న్నిర్దహే ద్గాం దివం చ. 9

---

8. కర్మ - పాపము; అనిర్విష్టమ్ - అనుభవింపబడలేదు; అశ్విభ్యామ్ - అశ్వినీదేవతల పుత్రులగు నకులసహదేవులతో;

9. అపధ్యానాత్ - అపకారమును తలచిన మాత్రమున;

ఆయుధము చేపట్టిన సాత్యకితో, ధృష్టద్యుమ్నునితో, శిఖండితో, ఇంద్రు నకు కొంచెము మటో ఇటో అనదగు యుధిష్ఠిరునితో కయ్య మగును. ఆ ధర్మ జుడు వారు చేసిన అపకారమును తలచినమాత్రమున నేలను నింగిని కాల్చి వేయజాలును.

తైశ్చే ద్యోద్ధుం మన్యతే ధార్తరాష్ట్రో
నిర్వృత్తోఽర్థః సకలః పాణ్డవానామ్,
మా తత్కార్షీః పాణ్డవ స్యార్థహేతో
రుపైహి యుద్ధం యది మన్య సే త్వమ్. 10

ధృతరాష్ట్రుని కొడుకు వారితో పోర గోరినచో పాండవుల పంట మొత్త ముగా పండినట్లే. దుర్యోధనా! పాండవులకు పాలిచ్చుట అను పనిని చేయకుము. అది వారికే మేలు. పోరే మేలని తలతువేని తలపడుము.

యాం తాం వనే దుఃఖశయ్యా మవాత్సీత్
ప్రవ్రాజితః పాణ్డవో ధర్మచారీ,
వ్యాప్నోతు తాం దుఃఖతరా మనర్థా-
మన్త్యాం శయ్యాం ధార్తరాష్ట్రః పరాసుః. 11

ధర్మరాజు నిలువనీడలేక ధర్మముమీద నిలచి అడవిలో దుఃఖపుపాన్పు నెక్కియుండెను. దుర్యోధనుడో దానిని మించిన దుఃఖపుపాన్పును - ఎవ్వరు కోరని దానిని - తుదిదానిని - ప్రాణములు కోల్పోయి ఎక్కును.

---

10. నిర్వృత్తః - నెరవేరినది; దుర్యోధనుడు రాజ్యభాగ మీక పోరుటయే మా కిష్టము. ఎట్లన, మేము పరాక్రమముతో రాజ్యమంతయు పొంద గలుగుదుము అని భావము. తత్ - రాజ్యభాగ మిచ్చుట అనుదానిని; పాణ్డవస్య, అర్థహేతోః - పాండుని కొడుకగు ధర్మరాజు మేలుకొరకు; మా కార్షీః - (దుర్యోధనా!) చేయకుము. నీవు రాజ్యభాగ మిచ్చినచో యుద్ధము జరుగదు. దానివలన మీకంటె ఎక్కువ నష్టపడునది మేమే. యుద్ధమువలన మిక్కిలి లాభము మాకే యని అర్జునుని భావము

11. అన్త్యాం శయ్యాం - పాడెను;

> హ్రియా జ్ఞానేన తపసా దమేన
> శౌర్యేణాథో ధర్మగుప్త్యా ధనేన,
> అన్యాయవృత్తిః కురుపాణ్డవేయా-
> నధ్యాతిష్ఠ ద్ధార్తరాష్ట్రో దురాత్మా. 12

దుష్టబుద్ధి, చెడునడవడి గల దుర్యోధనుడు ఏ లోకముల నాక్రమించెనో, వానిని సద్బుద్ధి, జ్ఞానము, తపస్సు, నిగ్రహము, పరాక్రమము, ధర్మరక్షణ ధనము అనువానితో ధర్మరాజునకు వశ మొనర్పుము.

> మాయోపధః ప్రణిపాతార్జవాభ్యాం
> తపోదమాభ్యాం ధర్మగుప్త్యా బలేన,
> సత్యం బ్రువన్ ప్రతిపన్నో నృపో న-
> స్తితిక్షమాణః క్లిశ్యమానోఽతివేలమ్. 13

మా రాజు పెద్దలకు మ్రొక్కుట, కుటిలత లేకుండుట, తపస్సు, నిగ్రహము, ధర్మరక్షణ, బలము అనువానితో, సత్యమునే పలుకుచున్నవాడై మితి మీరిన కష్టములు పడుచున్నప్పటికిని ఇతరుల కపటచేష్టలను సహించుచునే యున్నాడు.

> యదా జ్యేష్ఠః పాణ్డవః సంశితాత్మా
> క్రోధం యత్తం వర్షపూగాన్ సుఘోరమ్,
> అవస్రష్టా కురు షూద్వృత్తచేతా
> స్తదా యుద్ధం ధార్తరాష్ట్రోఽన్వతప్స్యత్. 14

---

12. దుర్యోధనుడు అన్యాయవృత్తితో ప్రజలపై అధికారమును చేజిక్కించు కొనెను. ధర్మరాజు దానిని వినయాదిలక్షణములతో పొందగోరు చున్నాడు. అట్టివానితో ఇట్టివానికి పొందగుట సాధ్యము రాదని భావము.

13. మాయోపధః - కుటిలచేష్టలను; ప్రతిపన్నః - పొందినవాడు, ప్రణిపాతా దులతో కూడినవాడై సత్యమునే పలుకుచు. మిక్కిలిగా క్లేశములు పొందుచున్నను సహించుచునే యున్నాడు కాని రోషముతో విజృంభించి ధర్మవిరోధమునకు పాల్పడలే దని భావము.

14. సంశిత + ఆత్మా - నిగ్రహముగల బుద్ధిగల; యత్తమ్ - అణపబడిన; వర్షపూగాన్ - పెక్కేండ్లు; ఉద్వృత్తచేతాః - (సహజముగా శాంత

పాండుని కొడుకులలో పెద్దవాడగు ధర్మరాజు బుద్ధి నదుపులో పెట్టుకొని పెక్కేండ్లు అణచియుంచిన మహాఘోర మగు క్రోధమును, వశము తప్పిన చిత్తముతో కౌరవులయందు ప్రసుమ్మరించిననాడు దుర్యోధనుడు యుద్ధమును గూర్చి విచారించును.

కృష్ణవర్త్మేవ జ్వలితః సమిద్ధో
యథా దహేత్ కక్ష మగ్ని ర్నిదాఘే,
ఏవం దగ్ధా ధార్తరాష్ట్రస్య సేనాం
యుధిష్ఠిరః క్రోధదీప్తోఽన్వవేక్ష్య. 15

మండువేసవిలో మెల్లమెల్లగా పెల్లురేగిన అగ్ని అడవిని రూపుమాపినట్లు, దుర్యోధనుని సేనను కనుగొని కోపముతో మండిపోవుచు, యుధిష్ఠిరుడు కాల్చివేయును.

యదా ద్రష్టా భీమసేనం రథస్థం
గదాహస్తం క్రోధవిషం వమన్తమ్,
అమర్షణం పాణ్డవం భీమవేగం
తదా యుద్ధం ధార్తరాష్ట్రోఽన్వతప్స్యత్. 16

---

హృదయము గలవాడయ్యు) క్రోధమునకు వశమైన చిత్తముగలవాడైనచో; అవస్రష్టా - క్రోధము - నొక్కుమ్మడిగా ప్రసరింపజేయువాడైనచో; తదా - అప్పుడు; ధార్తరాష్ట్రః - దుర్యోధనుడు; యుద్ధమ్ - యుద్ధమునుగూర్చి; అన్వతప్స్యత్ - శోకించును; యుద్ధమున కెందుకు సిద్ధపడితినా అని పశ్చాత్తాపము చెందునని తాత్పర్యము.

15 జ్వలితః-చిన్నమంటలు రేగినది, సమిద్ధః-పెనుమంటలతో అన్నివైపులకు వ్యాపించినది; కక్షమ్-అడవిని; కృష్ణవర్త్మా - పొగతో నల్లనిరేఖలు చేయువాడని సామాన్యార్థము (అగ్ని) 'అగ్నె ముద్ధరతి' మొదలగు వేదానువాకము 'వఖ' మున్నగు ఏడు రూపములు గల అగ్నిని చెప్పుచున్నది. వానిలో పొగను వ్యాపింపజేయు 'కృష్ణవర్త్మ' అను అర్థమునకు సరిపడు రౌద్రాగ్ని యొకటి కలదు. అది యిట గ్రహింపదగును.

భయంకర మగు వేగము, కోపము కలిగి క్రోధ మను విషమును గ్రక్కుచు గద చేపట్టి పాండుని కొడుకు భీమసేనుడు రథమునుండి కానవచ్చిననాడు దుర్యోధనుడు యుద్ధమును గూర్చి పశ్చాత్తాపపడును.

సేనాగ్రగం దంశితం భీమసేనం
స్వాలక్షణం వీరహణం పరేషామ్,
ఘ్నన్తం చమూ మన్తకసంవికాశం
తదా స్మర్తా వచన స్యాతిమానీ. 17

ఆ భీముడు సేనముందు నడచుచు దేనికైన సిద్ధపడినవాడై తన వారికి కూడ తేరిచూడరాక పగవారి వీరులను పరిమార్చుచు యమునివలె సేనను చెండుచున్నపుడు ఆ తల పొగరు దుర్యోధనుడు తన మాటను తలచును.

యదా ద్రష్టా భీమసేనేన నాగాన్
నిపాతితాన్ గిరికూటప్రకాశాన్,
కుమ్భై రివాసృ గ్వమతో భిన్నకుమ్భాం-
స్తదా యుద్ధం ధార్తరాష్ట్రోఽన్వతప్స్యత్. 18

కొండకొమ్ములవలె విరాజిల్లు ఏనుగులు భీమసేనునిచేత నేలగూలి పగిలిన తలలతో కుండలతో క్రుమ్మరించునట్లు నెత్తురులు క్రక్కుచుండగా చూచునాడు దుర్యోధనుడు అయ్యో! పోరి కేల పూనితి నని ఏడ్చును.

మహాసింహో గా వ ఇవ ప్రవిశ్య
గదాపాణి ర్ధార్తరాష్ట్రా నుపేత్య,
యదా భీమో భీమరూపో నిహన్తా
తదా యుద్ధం ధార్తరాష్ట్రోఽన్వతప్స్యత్. 19

---

17. దంశితమ్-అన్నిటికి అన్ని విధముల సిద్ధపడియున్న; స్వ + అలక్షణమ్-తనవారికికూడ తేరిపారజూచుటకు వీలుకాని విధమున నున్న-'అంతకుని వలె' నని చెప్పుటచేత భీముని విజృంభణమును తనవారే చూడజాల రన్నచో శత్రువుల సంగతి చెప్పనేల? అని తాత్పర్యము. యుద్ధమున అతని ఆవేశ మంత తీవ్రముగా నుండు నని భావము; అతిమాని - పొగరుతో కన్ను మిన్ను కానని వాడని తాత్పర్యము.

19. గాః వః - అని పదవిభాగము; వః - మిమ్ములను: గాః ఇవ-పశువులను వలె.

గద చేపట్టి రుద్రుని వంటి రూపముగల భీముడు మహాసింహము గొర్ల మందలో చొరబారినట్లు ధృతరాష్ట్రుని కొడుకులగు మిమ్ములను ముట్టి చిత్రవధ చేయునప్పుడు దుర్యోధనుడు పోరి కేల దిగితినిరా దేవుడా? అని మొత్తుకొనును.

మహాభయే వీతభయః కృతాస్త్రః
సమాగమే శత్రుబలావమర్దీ,
సకృద్రథే నాప్రతిమాన్ రథౌఘాన్
పదాతిసఙ్ఘాన్ గదయాభినిఘ్నన్. 20
శైక్యేన నాగాంస్తరసా విగృహ్ణన్
యదా ఛేత్తా ధార్తరాష్ట్రస్య సైన్యమ్,
ఛిన్దన్వనం పరశునేవ శూర-
స్తదా యుద్ధం ధార్తరాష్ట్రోఽన్వతప్స్యత్. 21

అందరకు పెనుభయము పుట్టుచోట తాను భయ మనునది ఎరుగక అస్త్రములం దారితేరినవాడై పగవారి బలమును నుగ్గుచేయుచు, ఒంటిరథముతో మూకలు మూకలుగా రథములను, కాల్బలమును గదతో చావమోదుచు, చిక్కములతో ఏనుగులను బిగియగట్టి పీనుగులవలె ఈడ్చుచు, గొడ్డలితో అడవిని తెగనరకినట్లు దుర్యోధనుని సేనను రూపుమాపుచు నున్న భీముని చూచి దుర్యోధనుడు యుద్ధమును గూర్చి కుమిలిపోవును.

తృణప్రాయం జ్వలనేనేవ దగ్ధం
గ్రామం యథా ధార్తరాష్ట్రిన్ సమీక్ష్య,
పక్వం సస్యం వైద్యుతేనేవ దగ్ధం
పరాసిక్తం విపులం స్వం బలౌఘమ్. 22

---

21. శైక్యేన - చిక్కముతో; విగృహ్ణన్ - మెడకో, కాలికో త్రాడు బిగించి పీనుగును లాగినట్లు లాగుచు.

22. తృణప్రాయమ్ - గడ్డితో నేసిన యిండ్లు అధికముగా గల; పరాసిక్తమ్ - చిందరవందర అయిన;

హతప్రవీరం విముఖం భయార్తం
పరాఙ్ముఖం ప్రాయశోఽధృష్టయోధమ్,
శస్త్రార్చిషా భీమసేనేన దగ్ధం
తదా యుద్ధం ధార్తరాష్ట్రోఽన్వతప్స్యత్. 23

గడ్డికొంపల పల్లె నిప్పుతో బూది అయినట్లు, పండి యెండిన పంట పిడుగుపడి మాడినట్లు, తనసేన అంతయు భీముని బాణముల మంటలకు చిందర వందర అయిపోగా, గొప్పవీరులు చావగా, మిగిలినవా రందరు భయముతో బెదురుతో నలుదిక్కులకు పారగా చూచి దుర్యోధనుడు యుద్ధమును గూర్చి ఏడ్చును.

ఉపాసజ్గా నాచరే ద్దక్షిణేన
వరాఙ్గానాం నకుల శ్చిత్రయోధీ,
యథా రథాగ్ర్యో రథినః ప్రచేతా
తదా యుద్ధం ధార్తరాష్ట్రోఽన్వతప్స్యత్. 24

చిత్రగతులతో పోరువాడు, రథికులలో శ్రేష్ఠుడు నగు నకులుడు గుంపులు గుంపులుగా చేసి యోధు లందరి తలలను అవలీలగా గుట్టలుగా నొనర్చును, అప్పు డది చూచి సుయోధనుడు కుళ్ళి యేడ్చును.

సుఖోచితో దుఃఖశయ్యాం వనేషు
దీర్ఘం కాలం నకులో యా మశేత,
ఆశీవిషః క్రుద్ధ ఇవోద్వమన్ విషం
తదా యుద్ధం ధార్తరాష్ట్రోఽన్వతప్స్యత్. 25

సుఖముగా బ్రదుకవలసిన ఆ నకులుడు అడవులలో బహుకాలము పడరాని పాట్లు పడెను. కావున తోకత్రొక్కిన నాగుబాముపలె విషమును వెలిగ్రక్కుచుండును. అప్పుడు దుర్యోధనుడు యుద్ధమునుగూర్చి చింతిల్లును.

---

23. అధృష్టయోధమ్ - గుండెదిటవు తప్పిన యోధులుగల;
24. వరాఙ్గానామ్ - తలలయొక్క; ఉపాసంగాన్ - గుట్టలను; రథినః - యోధులను; ప్రచేతా - మందలుగా నొనర్చును;

త్యక్తాత్మానః పార్థివా యోధనాయ
సమాదిష్టా ధర్మరాజేన సూత,
రథైః శుభ్రైః సైన్య మభిద్రవన్తో
దృష్ట్వా పశ్చాత్ తప్స్యతే ధార్తరాష్ట్రః. 26

సూతా! ధర్మరాజు పిలుపుతో చావుకు తెగించి పోరికి వచ్చిన రాజులు తనసేనను చూచి, మంచి రథములతో వెంటబడి తరిమికొట్టుచున్నపుడు దుర్యోధనుడు పశ్చాత్తాప మందును.

శిశూన్ కృతాస్త్రా నశిశుప్రకాశాన్
యదా ద్రష్టా కౌరవః పఞ్చ శూరాన్,
త్యక్త్వా ప్రాణాన్ కౌరవా నాద్రవన్త-
స్తదా యుద్ధం ధార్తరాష్ట్రోఽన్వతప్స్యత్. 27

అస్త్రములలో ఆరితేరినవారు, బాలురయ్యు మహావీరులవలె విజృంభించు వారును, ప్రాణములకు తెగించి కౌరవులను తరిమికొట్టువారును అగు ద్రౌపదీ కుమారు లయిదుగురిని చూచి దుర్యోధనుడు దుఃఖముతో కుమిలిపోవును.

యదా గతోద్వాహ మకూజనాక్షం
సువర్ణతారం రథ మాతతాయీ,
దాన్తై ర్యుక్తం సహదేవోఽధిరూఢః
శిరాంసి రాజ్ఞాం క్షేప్స్యతే మార్గణౌఘైః. 28

---

26. త్యక్తాత్మానః - విడిచిన దేహము గలవారు - అనగా ప్రాణభీతి లేక పోరువారని తాత్పర్యము. పార్థివ - ఆయోధనాయ అని పదవిభాగము.

27. అశిశుప్రకాశాన్ - చిన్నవారే అయినను గండరగండల వలె విజృంభించు వారని తాత్పర్యము; ప్రాణాన్, త్యక్త్వా - ప్రాణములకు తెగించి అని భావము; ఆద్రవన్తః - అద్రవతః.

28. గత, ఉద్వాహమ్ - ఒడిదుడుకులు లేని గమనము గలదానిని; అకూజన + అక్షమ్ = చప్పుడు చేయని యిరుసు గలదానిని; సువర్ణ తారమ్-బంగారపుర్రాప్పు గలదానిని-అతివేగమువలన అలాతచక్రమును

మహాభయే సంప్రవృత్తే రథస్థం
 వివర్తమానం సమరే కృతాస్త్రమ్,
సర్వా దిశః సంపతన్తం సమీక్ష్య
 తదా యుద్ధం ధార్తరాష్ట్రో౽న్వతప్యత్. 29

కుదుపులు లేనిది, రొదచేయని యిరుసుకలది, బంగారుత్రాడు కలది, చక్కగా తీర్చిదిద్దిన గుఱ్ఱములు పూన్చినదియు నగు రథ మెక్కి ఆతతాయి యగు సహదేవుడు అమ్ములవానలతో రాజుల తలలను విసరికొట్టును. అట్లు మహాభయము దాపురింపగా రథముననుండి యుద్ధభూమిలో అన్నివైపులకు విచ్చలవిడిగా తిరుగుచు మీదపడుచున్న ఆ విలుకానిని గాంచి దుర్యోధనుడు దుఃఖపడును.

హ్రీనిషేవో నిపుణః సత్యవాదీ
 మహాబలః సర్వధర్మోపపన్నః,
గాన్ధారి మార్ఛం స్తుములే క్షిప్రకారీ
 క్షేప్తా జనాన్ సహదేవ స్తరస్వీ. 30

ఆ సహదేవుడు సహజముగా వినయము గలవాడు. అన్నింట నారితేరినవాడు. సత్యమే పలుకువాడు. గొప్ప బలశాలి. సర్వధర్మములు ఎరిగి ప్రవర్తించువాడు. యుద్ధమున గొప్ప వడి కలవాడు. ఆతడు శకునిని తరుముచు ఒడుపుతో జనులను చెదరగొట్టును.

యదా ద్రష్టా ద్రౌపదేయాన్ మహేషూన్
 శూరాన్ కృతాస్త్రాన్ రథయుద్ధకోవిదాన్,

---

జోలి బంగారురేఖవలె కానవచ్చు దానిని; దాన్తైః - చక్కని శిక్షణ కల గుఱ్ఱములతో; ఆతతాయీ - శత్రువులను చంపుటకే విల్లెక్కుపెట్టు వానిని;

29. వివర్తమానమ్ - వివిధములగు గతులతో తిరుగుచున్నవానిని;

30. గాన్ధారిమ్ - గాంధారరాజగు శకునివైపు; ఆర్ఛన్ - పోవుచు; తరస్వీ - వడిగా ముందుకు దూకువా డని తాత్పర్యము;

ఆశీవిషాన్ ఘోరవిషా నివాయత
స్తదా యుద్ధం ధార్తరాష్ట్రోఽన్వతప్స్యత్. 31

ద్రౌపది కొడుకులు గొప్ప విలుకాండ్రు. శూరులు అస్త్రములలో ఆరితేరిన వారు. రథయుద్ధమున పండిన ప్రజ్ఞ గలవారు. ఘోరమగు విషముగల నాగులవలె పగవారిపై వచ్చి పడుదురు. అట్టి వారిని చూచి దుర్యోధనుడు కుమిలిపోవును.

యదాభిమన్యుః పరవీరఘాతీ
శరైః పరాన్ మేఘ ఇవాభివర్షన్,
విగాహితా కృష్ణసమః కృతాస్త్ర
స్తదా యుద్ధం ధార్తరాష్ట్రోఽన్వతప్స్యత్. 32

అభిమన్యుడు శత్రువీరులను నుగ్గు నూచగా గొట్టును. మేఘమువలె పగవారిని బాణవర్షముతో ఎడ పెడ తాడించును. కృష్ణు నంతటివాడు. అస్త్రము లన్నింట ఆరితేరెను. అట్టివాడు పైకి దుమికి వచ్చునపుడు దుర్యోధనుడు దుఃఖముపా లగును.

యదా ద్రష్టా బాల మబాలవీర్యం
ద్విషచ్చమూం మృత్యు మివోత్పతన్తమ్,
సౌభద్ర మిన్ద్రప్రతిమం కృతాస్త్రం
తదా యుద్ధం ధార్తరాష్ట్రోఽన్వతప్స్యత్. 33

ఆతడు పిన్నవాడే కాని వయసునకు మించిన శక్తికలవాడు. శత్రువుల సేనపై మృత్యువువలె దూకును. ఇంద్రునివంటి ఆ సుభద్ర కొడుకును గాంచిన దుర్యోధనుడు దుఃఖమున క్రుంగును.

---

31. ఆయతః - మీదికి వచ్చి పడుచున్నవారిని;

32. విగాహితా - పైకి దుముకువాడు.

33.. అబాలవీర్యమ్ - అభిమన్యుడు బాలుడైనను ప్రౌఢునికున్న శక్తి సామర్థ్యములు గల వాడని తాత్పర్యము.

ప్రభద్రకా శీఘ్రతరా యువానో
విశారదాః సింహసమానవీర్యాః,
యదా క్షేప్తారో ధార్తరాష్ట్రాన్ ససైన్యాం
స్తదా యుద్ధం ధార్తరాష్ట్రోఽన్వతప్స్యత్. 34

ప్రభద్రకులు మంచి వడి - వయసు గలవారు. పండితులు. వారిది సింహము వంటి సత్తువ. సేనలతో ధృతరాష్ట్రకుమారులను వారు చెల్లా చెదరు చేయునపుడు దుర్యోధనుడు కుమిలిపోవును.

వృద్ధౌ విరాటద్రుపదౌ మహారథౌ
పృథక్ చమూభ్యా మభివర్తమానౌ,
యదా ద్రష్టారౌ ధార్తరాష్ట్రాన్ ససైన్యాం
స్తదా యుద్ధం ధార్తరాష్ట్రోఽన్వతప్స్యత్. 35

విరాటుడు, ద్రుపదుడు తలలు పండిన వృద్ధులు, మహారథులు. విడి విడిగా సేనలతో విహరించుచుందురు. వారు ధృతరాష్ట్రుని కొడుకులను సేనలతో పాటు చూతురేని దుర్యోధనుడు దుఃఖపడును.

యదా కృతాస్త్రో ద్రుపదః ప్రచిన్వన్
శిరాంసి యూనాం సమరే రథస్థః,
క్రుద్ధః శరై శ్ఛేత్స్యతి చాపముక్తై-
స్తదా యుద్ధం ధార్తరాష్ట్రోఽన్వతప్స్యత్. 36

అస్త్రవిద్యలో ఆరితేరిన ద్రుపదుడు యుద్ధమున రథ మెక్కి, క్రుద్ధుడై వింటినుండి వదలిన బాణములతో వయసు వారి తలలను తరిగి విసరి వేయు నపుడు దుర్యోధనుడు పొగిలిపోవును.

యదా విరాటః పరవీరఘాతీ
మమాన్తరే శత్రుచమూం ప్రవేష్టా,

మత్స్యైః సార్థ మనృశంసరూపై-
స్తదా యుద్ధం ధార్తరాష్ట్రోఽన్వతప్స్యత్. 37

పగవారి వీరులను పరిమార్చు విరాటుడు యుద్ధమున మెత్తనివారగు మాత్స్యులతో కూడి శత్రుసేనలోనికి చొరబారునపుడు దుర్యోధనుడు తన్ను దాను దూఱుకొనును.

జ్యేష్ఠం మాత్స్య మనృశంసార్యరూపం
విరాటపుత్రం రథినం పురస్తాత్,
యదా ద్రష్టా దంశితం పాణ్డవార్థే
తదా యుద్ధం ధార్తరాష్ట్రోఽన్వతప్స్యత్. 38

మత్స్యుని కొడుకులలో పెద్దవాడు, వినయము, మంచిస్వభావము గలవాడు పాండవులకై అన్నింటికి సిద్ధపడి రథమెక్కి ఎదురుపడిననాడు దుర్యోధనుడు చూచి గుడుసుళ్ళు వడును.

రణే హతే కౌరవాణాం ప్రవీరే
శిఖణ్డినా సత్తమే శాన్తనూజే
న జాతు నః శత్రవో ధారయేయు-
రసంశయం సత్యమేత ద్బ్రవీమి. 39

కౌరవవీరులలో గొప్పవా డగు భీష్ముడు శిఖండిచేత యుద్ధభూమిలో కూలిపోగా మా శత్రువులు బ్రదుకరు. ఇందు సందియము లేదు. నిజము చెప్పుచున్నాను.

---

37. మమత్తరే - మిక్కిలిగా నలుగగొట్టుట కలది; అనగా యుద్ధమున అని భావము. లేదా 'మమత్' అనగా బలము గలది అనియు నర్థము. మిక్కిలి బలముగలదానియందు అనగా యుద్ధమున అని భావము. అనృశంసరూపైః- మత్స్యులు పెద్దగా క్రూరస్వభావము కలవారు కారు. అట్టివారితో కలిసి విరాటుడు యుద్ధము చేయును. దుర్యోధనుని సేన అట్టివారినికూడ తట్టుకొనలేదని భావము.

39. శాంతనూజే - ఋషిభాషతో దీర్ఘము వచ్చినది. న ధారయేయుః - బ్రదుకరు;

యదా శిఖణ్డీ రథినః ప్రచిన్వన్
భీష్మం రథేనాభియాతా వరూథీ,
దివ్యై ర్హయై రవమృద్నన్ రథౌఘాం-
స్తదా యుద్ధం ధార్తరాష్ట్రోఽన్వతప్స్యత్. 40

శిఖండి రథికవరులను కూడగట్టుకొని రథికులు తన్ను క్రమ్ముకొనగా దివ్యములగు గుఱ్ఱములు గల రథముతో శత్రువీరులను నలుగగొట్టుచున్నపుడు దుర్యోధనుడు దురపిల్లును.

యదా ద్రష్టా సృఞ్జయానా మనీకే
ధృష్టద్యుమ్నం ప్రముఖే రోచమానమ్,
అస్త్రం యస్మై గుహ్య ముఖాచ ధీమాన్
ద్రోణ స్తదా తప్స్యతి ధార్తరాష్ట్రః. 41

సృంజయుల సేనలో ముందుభాగమున వెలుగొందుచున్న ధృష్టద్యుమ్నుని గాంచి దుర్యోధనుడు దుఃఖించును. మహామేధావి యగు ద్రోణుడు అతనికి రహస్యమైన అస్త్రవిద్య నుపదేశించెను.

యదా స సేనాపతి రప్రమేయః
పరా మృద్న న్నిషుభి ర్ధార్తరాష్ట్రాన్,
ద్రోణం రణే శత్రుసహోఽభియాతా
తదా యుద్ధం ధార్తరాష్ట్రోఽన్వతప్స్యత్. 42

ఆ సేనాపతి ధృష్టద్యుమ్నుని శక్తిసామర్థ్యములు ఊహ కందనివి. ఎంతటి శత్రువునైన తట్టుకొనగల అతడు ధృతరాష్ట్రునివారలను బాణములతో నుగ్గుచేయుచు యుద్ధమున ద్రోణునిపైకి దుముకును. దుర్యోధనుడప్పుడు ఏడ్చును.

హ్రీమాన్ మనీషీ బలవాన్ మనస్వీ
స లక్ష్మీవాన్ సోమకానాం ప్రబర్హః,
న జాతు తం శత్రవోఽన్యే సహేరన్
యేషాం స స్యాదగ్రణీ ర్వృష్ణిసింహః. 43

---

40. వరూథీ - రథికుల రక్షణ కలవాడు;

వినయము, బుద్ధి, బలము, మానము, సంపద సమృద్ధిగా గల ఆ సోమక వంశప్రముఖుని ఎట్టి శత్రువులును తట్టుకొనజాలరు. అతనికి ముందు శ్రీకృష్ణుడు రక్షకుడై నిలిచియుండును.

ఇదం చ బ్రూయా మా వృణీష్వేతి లోకే
యుద్ధేఽద్వితీయం సచివం రథస్థమ్,
శినే ర్నప్తారం ప్రవృణీమ సాత్యకిం,
మహాబలం వీతభయం కృతాస్త్రమ్. 44

రాజ్యముపై ఆశ పెట్టుకొనకుమను నీ మాటయు దుర్యోధనునకు చెప్పుము. ఏలయన రథమునం దున్నచో లోకమునందును, యుద్ధమునందును సాటిలేని సాత్యకిని సహాయునిగా ఎన్నుకొంటిమి. ఆ శిని మనుమడు భయ మెరుగడు. గొప్ప బలశాలి. అస్త్రవిద్యలో ఆరితేరినవాడు.

మహోరస్కో దీర్ఘబాహుః ప్రమాథీ
యుద్ధేఽద్వితీయః పరమాస్త్రవేదీ,
శినే ర్నప్తా తాలమాత్రాయుధోఽయం
మహారథో వీతభయః కృతాస్త్రః. 45

ఆ సాత్యకి వెడదరొమ్ము, పొడవైన భుజములు గలవాడు. శత్రువులను నుగ్గునుగ్గుగా గొట్టును. పోరున నతని కతడే సాటి. గొప్ప అస్త్రము లన్నింటిని నేర్చినవాడు. తాటిచెట్టంత ఆయుధము పట్టిన ఘనుడు. మహారథుడు. భయ మెరుగడు.

యదా శినీనా మధిపో మయోక్తః
శరైః పరాన్ మేఘ ఇవ ప్రవర్షన్,

---

44. 'ఇదం చ' - ఇదిగో అని ఎదురుగా నున్న యుద్ధమునకు మూలమగు రాజ్యమును సూచించుచున్నాడు. మా వృణీష్వ - 'నీవు రాజ్యమును కోరకుము' అని భావము. ఏలయన మేము యుద్ధమున సాటిలేని సాత్యకిని సహాయునిగా కోరితిమి. ఇంక మీకు రాజ్యము దక్కుట యొక్కడి మాట అని భావము.

ప్రచ్ఛాదయిష్య త్సరిహా యోధముఖ్యాం
స్తదా యుద్ధం ధార్తరాష్ట్రోఽన్వతప్స్యత్. 46

నేను చెప్పిన ఈ శినివంశశ్రేష్ఠుడు సాత్యకి మేఘమువలె బాణములను పగవారిపై కురిపించుచు యోధవీరులను క్రమ్మివేయునాడు దుర్యోధనునకు యుద్ధమన నేమో తెలిసివచ్చును.

యదా ధృతిం కురుతే యోత్స్యమానః
స దీర్ఘబాహు ర్దృఢధన్వా మహాత్మా,
సింహస్యేవ గన్ధ మాఘ్రాయ గావః
సంచేష్టన్తే శత్రవోఽస్మా ద్రణాగ్రే. 47

పొడుగుచేతులు, గట్టివిల్లు గల ఆ మహాత్ముడు యుద్ధము చేయుచు పట్టు పట్టెనేని సింహము వాసన తగిలిన గొడ్లమందవలె శత్రువులు యుద్ధభూమిలో తిరుగుళ్ళు పడుదురు,

స దీర్ఘబాహు ర్దృఢధన్వా మహాత్మా
భిన్ద్యాద్ గిరీన్ సంహరేత్ సర్వలోకాన్,
అస్త్రే కృతీ నిపుణః క్షిప్రహస్తో
దివి స్థితః సూర్య ఇవాభిభాతి. 48

పొడవైన చేతులు, గట్టివిల్లుగల ఆ మహాత్ముడు కొండలను పిండిగొట్టును. ఎల్ల లోకములను రూపుమాపును. అస్త్రవిద్యలో పండితుడు. కార్యసిద్ధిలో నేర్పరి. చేతియొడుపు గలవాడు. ఆకసమున నున్న సూర్యునివలె వెలుగొందుచుండును.

చిత్రః సూక్ష్మః సుకృతో యాదవస్య
అస్త్రే యోగో వృష్ణిసింహస్య భూయాన్,

---

47. అస్మాత్ - ఈతనివలన-ఈతనిని చూచి అని తాత్పర్యము; సంచేష్టన్తే - దిక్కుతోచక పరువులెత్తుదు రని భావము.

యథావిధం యోగ మాహుః ప్రశస్తం
సర్వై ర్గుణైః సాత్యకి స్తై రుపేతః. 49

వృష్ణివంశమున సింహమువంటివా డగు కృష్ణుని చేతిలో అస్త్రవిద్య ఎంత చిత్రమో, ఎంత సూక్ష్మమో, ఎట్టి శిల్పము గలదియో సాత్యకియందును అది అన్నిగుణములతో అట్లే ప్రశస్తమైన దని చెప్పుదురు.

హిరణ్మయం శ్వేతహయై శ్చతుర్భి-
ర్యదా యుక్తం స్యన్దనం మాధవస్య,
ద్రష్టా యుద్ధే సాత్యకే ర్ధార్తరాష్ట్రి-
స్తదా తప్స్య త్యకృతాత్మా స మన్దః. 50

తెల్లని నాలుగు గుఱ్ఱములు పూన్చిన సాత్యకి బంగారురథముతో ధార్తరాష్ట్రులు తలపడినప్పుడు తెలివిమాలిన దుర్యోధనుడు మొత్తుకొనును.

యదా రథం హేమమణిప్రకాశం
శ్వేతాశ్వయుక్తం వానరకేతు ముగ్రమ్,
దృష్ట్వా మమాప్యాస్థితం కేశవేన
తదా తప్స్య త్యకృతాత్మా స మన్దః. 51

బంగారముతో మణులతో విరాజిల్లుచు తెల్లని గుఱ్ఱములు పూన్చి యున్నదియు, భయంకరమగు కపికేతనము గలదియు, శ్రీకృష్ణు డధివసించి యున్నదియు నగు నా రథమును గాంచి ఆ మందమతి పశ్చాత్తాపము నందును.

యదా మౌర్వ్యా స్తలనిష్పేష ముగ్రం
మహాశబ్దం వజ్రనిష్పేషతుల్యమ్,
విధూయమానస్య మహారణే మయా
స గాణ్డివస్య శ్రోష్యతి మన్దబుద్ధిః. 52

---

49. అస్త్రే యోగః - అస్త్రముల లాభము, చిత్రః - అచ్చెరువు గొలుపునది; సూక్ష్మః - చూడ శక్యముకానిది; సుకృతః - శూరులకు ఉత్సాహము పుట్టించునది-అనగా మంచి నేర్పుగలది; యథావిధమ్-కృష్ణునికి, సాత్యకికి అస్త్రవిద్య ఒక్కతీరున అబ్బిన దని భావము; సాత్యకి కృష్ణునికంటె ఏమియు తక్కువ తిన్నవాడు కాదని భావము.

నేను మహాయుద్ధమున అల్లెత్రాటిని లాగగా పిడుగు పడినట్లు ఉత్పత్తిల్లిన భయంకరమగు గాండివము మ్రోతను ఆ బుద్ధిహీనుడు వినును.

తదా మూఢో ధృతరాష్ట్రస్య పుత్ర-
స్తప్తా యుద్ధే దుర్మతి ర్దుఃసహాయః,
దృష్ట్వా సైన్యం బాణవర్షాన్ధకారే
ప్రభజ్యన్తం గోకులవ ద్రణాగ్రే. 53

గర్వముతో కన్నుగానని ఆ ధృతరాష్ట్రునికొడుకు పోరిలో మతి చెడి, తోడగువారు లేక అంపవాన చీకటిలో గొడ్లమందవలె తుక్కుదూగర యగు చున్న సేనను చూచి గుండెలో కుములును.

బలాహకా దుచ్చరతః సుభీమాన్
విద్యుత్స్ఫులిఙ్గానివ ఘోరరూపాన్,
సహస్రఘ్నాన్ ద్విషతాం సఙ్గరేషు
అస్థిచ్ఛిదో మర్మభిదః సుపుఙ్ఖాన్, 54
యదా ద్రష్టా జ్యాముఖా ద్బాణసఙ్ఘాన్
గాణ్డీవముక్తా నాపతతః శితాగ్రాన్,
హయాన్ గజాన్ వర్మిణ శ్చాదదానాం-
స్తదా యుద్ధం ధార్తరాష్ట్రోఽన్వతప్స్యత్. 55

మేఘమునుండి ప్రేలిపడుచున్న మిక్కిలి భయంకరములగు పిడుగు రవ్వలవలె ఘోరరూపముగలవియు, వేనవేల యోధులను రూపుమాపునవియు, ఎముకలను నుగ్గుచేయునవియు, ఆయువుపట్టులను పగులగొట్టునవియు, గట్టి పిడులు - వాడి ములుకులు గలవియు, గాండీవపు అల్లెత్రాటినుండి వచ్చిపడు చున్నవియు, గుఱ్ఱములను - ఏనుగులను - కవచముల ధరించిన వీరులను మ్రింగివేయునవియు నగు బాణముల మొత్తములను గాంచి ధృతరాష్ట్రుని కొడుకు గొల్లుమనును.

యదా మన్దః పరబాణాన్ విముక్తాన్
మమేషుభి ర్హ్రియమాణాన్ ప్రతీపమ్,

తిర్య గ్విధ్య చ్ఛిద్యమానాన్ పృషత్కై-
స్తదా యుద్ధం ధార్తరాష్ట్రోఽన్వతప్స్యత్. 56

పరులు వదలిన బాణములు నా బాణముల తాకిడికి వెనుదిరిగి విరిగి పడు చుండగా దుర్యోధనుడు కుళ్ళి యేడ్చును.

యదా విపాఠా మద్భుజవిప్రముక్తా
ద్విజాః ఫలానీవ మహీరుహాగ్రాత్,
ప్రచేతార ఉత్తమాఙ్గాని యూనాం
తదా యుద్ధం ధార్తరాష్ట్రోఽన్వతప్స్యత్. 57

నా చేతినుండి వెలువడిన పెద్దఅమ్ములు చెట్లచివరలనుండి పిట్టలు పండ్లు త్రుంచుకొని పోయినట్లు, యువకుల తలలను కుప్పలు చేయుచున్నపుడు చూచి దుర్యోధనుడు దురపిల్లును.

యదా ద్రష్టా పతతః స్యన్దనేభ్యో
మహాగజేభ్యోఽశ్వగతాన్ సుయోధనాన్,
శరై ర్హతాన్ పాతితాం శ్చైవ రఙ్గే
తదా యుద్ధం ధార్తరాష్ట్రోఽన్వతప్స్యత్. 58

రథములనుండి, ఏనుగులనుండి, గుఱ్ఱములనుండియు మంచి యుద్ధవీరులు నాచేత చచ్చి యుద్ధరంగమున రాలిపడునపుడు దుర్యోధనుడు కుమిలిపోవును.

అసంప్రాప్తా నస్త్రపథం పరస్య
యదా ద్రష్టా నశ్యతో ధార్తరాష్ట్రాన్,
అకుర్వతః కర్మయుద్ధే సమన్తా-
త్తదా యుద్ధం ధార్తరాష్ట్రోఽన్వతప్స్యత్. 59

---

57. విపాఠాః - విస్తృతము లగు బాణములు.

59. అస్త్రపథమ్, అసంప్రాప్తాన్ - అస్త్రములకు గురికాకయే, అర్జునుని బాణ ప్రయోగము చూచినంతనే వారికి గుండెలు పగిలిపోవునని భావము; కర్మ అకుర్వతః - యుద్ధమున భయముతో కలిగిన వెడపాటువలన చేష్ట లుడిగినవారిని;

పగవాని బాణముల దారిలో పడకయే చేష్ట లుడిగి నశించుచున్న ధృతరాష్ట్రుని కొడుకులను యుద్ధమునం దెల్లెడల గాంచునాడు దుర్యోధనుడు గుండె బాదుకొనును.

పదాతిసఙ్ఘాన్ రథసఙ్ఘాన్ సమన్తా-
ద్వ్యాత్తాననః కాల ఇవాతతేషుః,
ప్రణోత్స్యామి జ్వలితై ర్బాణవర్షైః
శత్రూం స్తదా తప్స్యతి మన్దబుద్ధిః. 60

నోరు తెరచికొనివచ్చు యమునివలె ఎడతెగని బాణధారలు గలవాడనై కాల్బంటుల గుంపులను, రథముల సముదాయములను మండుచున్న బాణముల వానతో నేను దూరమునకు విసరివేయునపు డా బుద్ధిహీనుడు కుమిలిపోవును.

సర్వా దిశః సంపతతా రథేన
రజోధ్వస్తం గాణ్డివేన ప్రకృత్తమ్,
యదా ద్రష్టా స్వబలం సంప్రమూఢం
తదా పశ్చాత్తప్స్యతి మన్దబుద్ధిః. 61

యుద్ధభూమిలో అన్నివైపుల వచ్చిపడుచున్న రథమువలన లేచిన దుమ్ముతో దిక్కుతోచక కూలిపడినదియు, గాండీవముతో ముక్కలు ముక్కలైనదియు, ఒడ లెరుగనిదియు నగు తన సేనను గాంచి ఆ బుద్ధితక్కువవాడు పశ్చాత్తాప మందును.

కాన్దిగ్భూతం ఛిన్నగాత్రం విసంజ్ఞం
దుర్యోధనో ద్రక్ష్యతి సర్వసైన్యమ్,
హతాశ్వవీరాగ్ర్య నరేన్ద్రనాగం
పిపాసితం శ్రాన్తపత్రం భయార్తమ్. 62

---

60. ప్రయోత్స్యామి - దూరముగా బడునట్లు కొట్టుదును;
61. రజోధ్వస్తమ్ - దుమ్ముతో దిక్కు తోచక రథముల నుండి కూలిపడినది; ప్రకృత్తమ్ - బాగుగా నరుకబడినదియు.
62. కాంిదిగ్భూతమ్ - చావుభయముతో దిక్కుతోచక పరువెత్తినది; శ్రాన్తపత్రమ్ - అలసిసొలసిన వాహనములు గలది, ప్రజాపతేః కర్మ యథా-

ఆర్తస్వరం హన్యమానం హతం చ
వికీర్ణకేశాస్థికపాలసఙ్ఘమ్,
ప్రజాపతేః కర్మ యథాఽర్థనిశ్చితం
తదా దృష్ట్వా తప్స్యతి మన్దబుద్ధిః. 63

ఆ దుర్యోధనుని సేన భయముతో చెల్లాచెదరై పోవును. విరిగిన అవయవములతో చేష్టలు దక్కి యుండును. గుఱ్ఱములు, వీరవరులు, రాజులు, ఏనుగులు కుప్పకూలి యుండును. వాహనములు అలసతతో కదలకుండును. నిలువెల్ల భయముతో పీడ నొంది, ఆర్తనాదములు చేయుచుండును. చెదరిపడిన జుట్టు, ఎముకలు, పుఱ్ఱెలు కుప్పలుగా కానవచ్చుచుండును. స్వర్గమునకై నిశ్చయము గొని ప్రజాపతి చేయు యజ్ఞమునందలి పశువులవలె చచ్చియు, చచ్చుచు నున్న ఆ సేనను గాంచి ఆ తెలివిమాలినవాడు కుళ్ళి కుళ్ళి యేడ్చును.

యదా రథే గాణ్డివం వాసుదేవం
దివ్యం శఙ్ఖం పాఞ్చజన్యం హయాంశ్చ,
తూణా వక్షయ్యౌ దేవదత్తం చ మాం చ
దృష్ట్వా యుద్ధే ధార్తరాష్ట్రోఽన్వతప్స్యత్. 64

రథమున గాండీవమును, వాసుదేవుని, దివ్యమగు శంఖము పాంచజన్యమును, తెలిగుఱ్ఱములను, తరుగని అమ్ములుగల పొదులను, దేవదత్త మను పేరుగల నా శంఖమును, నన్నును కనుగొని దుర్యోధనుడు విలవిల లాడును.

ఉద్వర్తయన్ దస్యుసఙ్ఘాన్ సమేతాన్
ప్రవర్తయన్ యుగ మన్య ద్యుగాన్తే,

---

వాజపేయయాగమున ప్రజాపతి దేవతగా గల పదునేడు పశువులను బలి చేయుదురు. దానియందువలె నిందును అనేకులను చిత్రవధ చేయుదు నని భావము. అర్థనిశ్చితమ్ - అర్థమనగా రాజ్యము లేదా స్వర్గము. యుద్ధపక్షమున రాజ్యమునకై, ప్రజాపతిపక్షమున స్వర్గమునకై నిశ్చయింపబడినదని భావము.

యదా ధన్వ్యా మ్యగ్నివత్ కౌరవేయాం-
స్తదా తప్తా ధృతరాష్ట్రః సపుత్రః. 65

మూకలుగా వచ్చిన ఆ దొంగలగుంపులను త్రిప్పికొట్టుచు, యుగము పూర్తికాగా క్రొత్తయుగమును ప్రవర్తిల్లజేయుచు, అగ్నివలె ఆ ధృతరాష్ట్రుని కొడుకులను మాడ్చి మసిచేయునాడు ధృతరాష్ట్రుడు కొడుకులతోపాటు గుండెలు బాదుకొనును.

స భ్రాతా వై సహసైన్యః సభృత్యో
భ్రష్టైశ్వర్యః క్రోధవశోఽల్పచేతాః,
దర్పస్యాన్తే నిహతో వేపమానః
పశ్చా న్మన్ద స్తప్స్యతి ధార్తరాష్ట్రః. 66

దుర్యోధనుడు తమ్ములతో, సేనలతో, సేవకులతోపాటు ఐశ్వర్యము కోల్పోయి, కోపము పాల్పడి, బుద్ధి తక్కి- పొగరుచావగా నేలగూలి వణకిపోవుచు అప్పుడు పశ్చాత్తాప మొందును.

పూర్వాహ్ణే మాం కృతజప్యం కదాచి-
ద్విప్రః ప్రోవా చోదకాన్తే మనోజ్ఞమ్,

65. దస్యుసఙ్ఘాన్ - దొంగమూకలను; న్యాయముగా పాండవుల కీయవలసిన రాజ్యభాగ మీనందువలన దుర్యోధనాదులు దొంగలు; ఉద్వర్తయన్ - మీదికి దూకుటకు వచ్చిన వారిని త్రిప్పి బావగొట్టుచు అని భావము;

'యథా తథా చ పరప్రతిగ్రహ మభిమన్యతే స్తేనో భవతి' ఏదో ఒకవిధమున ఇతరుల సొమ్మును గ్రహింపగోరువాడు దొంగ యగును - అని స్మృతి;

యుగాన్తే - శత్రువులను సంహరించుట జరుగగా; అన్యద్ - మరియొకటి యగు; యుగమ్ - ధర్మము ప్రధానముగా గల కాలమును, ప్రవర్తయన్ - జరుగునట్లు చేయుచు, స్మృతి రాజు కాలమునకు కారణ మని చెప్పుచున్నది.

66. దర్పస్య - అన్తే - దర్పము చచ్చినపిదప;

కర్తవ్యం తే దుష్కరం కర్మ పార్థ
యోద్ధవ్యం తే శత్రుభిః సవ్యసాచిన్. 67

ఇన్ద్రో వా తే హరివాన్ వజ్రహస్తః
పురస్తా ద్యాతు సమరేఽరీన్ వినిఘ్నన్,
సుగ్రీవ యుక్తేన రథేన వా తే
పశ్చాత్ కృష్ణో రక్షతు వాసుదేవః 68

ఒకనాడు పగటిమొుపట నేను జపము ముగించి సంధ్యావందనమునం దాచమనము చేసిన పిదప విప్రు డొకడు మనోహరముగా ఇట్లు పలికెను-" కుంతీ కుమారా! సవ్యసాచీ! నీవు బహుకష్టమైన పని చేయవలసియున్నది. నీ పగ వారితో పోరవలయును. మంచి గుఱ్ఱములు గల యింద్రుడు పోరున పగవారిని పడనూకుచు నీముందు నడచుచు రక్షించుగాక! మఱియు సుగ్రీవము మున్నగు గుఱ్ఱములు పూన్చిన రథముతో ఎల్లెడల వసించుచు వెలుగొందు కృష్ణపరమాత్మ నీవెనుకవైపున నుండి కాపాడుగాక!"

వవ్రే చాహం వజ్రహస్తా న్మహేన్ద్రా-
దస్మిన్ యుద్ధే వాసుదేవం సహాయమ్,
స మే లబ్ధో దస్యువధాయ కృష్ణో
మన్యే చైత ద్విహితం దైవతై ర్మే. 69

వజ్రము చేత దాల్చిన మహేంద్రుని వదలి ఈ యుద్ధమునందు వాసుదేవుని తోడుగా నేను కోరియుంటిని. ఈ దొంగలమూకను రూపుమాపుటకు అతడు నాకు దొరకెను. ఇది యంతయు దేవతల యేర్పాటని భావింతును.

అయుధ్యమానో మనసాఽపి యస్య
జయం కృష్ణః పురుష స్యాభినన్దేత్,
ఏవం సర్వాన్ స వ్యతీయా దమిత్రాన్
సేన్ద్రాన్ దేవాన్ మానుషే నాస్తి చిన్తా. 70

---

67. ఉదక - అన్తే - సంధ్యావందనమున ఆచమించుట అయిన వెనుక;
70. వ్యతీయాత్ - మించిపోవును; అభినన్దేత్ - వాంఛించును.

యుద్ధము చేయకున్నను కృష్ణుడు మనస్సుతో ఏపురుషుని జయమును కాంక్షించునో అతడు శత్రువుల నందరిని - ఇంద్రునితోపాటు దేవతలనుకూడ అతిక్రమింపగలడు. మనుష్యుల విషయమున చింతయే లేదు.

స బాహుభ్యాం సాగర ముత్తితీర్షే-
న్మహోదధిం సలిల స్యాప్రమేయమ్,
తేజస్వినం కృష్ణ మత్యన్తశూరం
యుద్ధేన యో వాసుదేవం జిగీషేత్. 71

గొప్ప తేజస్సు, మహాపరాక్రమము గల వసుదేవకుమారు డగు కృష్ణుని యుద్ధమున గెలువగోరువాడు సగరకుమారులు పెంపొందించిన ఊహింపనలవి కాని జలములు గల మహాసముద్రమును చేతులతో దాటగోరినవా డగును.

గిరిం య ఇచ్ఛేత్తు తలేన భేత్తుం
శిలోచ్చయం శ్వేత మతిప్రమాణమ్,
తస్యైవ పాణిః సనఖో విశీర్యే-
న్న చాపి కిఞ్చిత్ స గిరేస్తు కుర్యాత్. 72

ఎవడుగాని అరచేతితో పెద్దది యగు వెండికొండను పిండిచేయగోరినచో వానిచేయి గోళ్ళతోపాటు నుగ్గునుగ్గగును. వాడు కొండనేమియు చేయజాలడు. కృష్ణు నెదిరించుట అట్టిదే.

అగ్నిం సమిద్ధం శమయే ద్భుజాభ్యాం
చన్ద్రం చ సూర్యం చ నివారయేత,

---

71. సాగరమ్-సగరులు పెంపొందించిన దానిని; సలిలస్య - జలముయొక్క; అప్రమేయమ్-ఇంత ప్రమాణమని చెప్పరాని దానిని; జిగీషేత్ - గెలువ గోరును; ఉత్తితీర్షేత్-దాటగోరును.

72. తలేన - అరచేతితో; శిలోచ్చయమ్ - గిరిమ్ అను పదముండగా మరల పర్వతమను నర్థముగల ఈ పదమును గ్రహించుట కాఠిన్యమును చూపుటకొరకని భావము. శ్వేతమ్-తెల్లనికొండను-కైలాసమును-తానెంత బలవంతు నాశ్రయించెనో దీనివలన వ్యక్తమగును;

హరే ర్దేవానా మమృతం ప్రసహ్య
యుద్ధేన యో వాసుదేవం జిగీషేత్. 73

యుద్ధములో వాసుదేవుని గెలువగోరువాడు బాగుగా మంటలు రేగిన అగ్నిని చేతులతో ఆర్పనెంచువా డగును. చంద్రుని, సూర్యుని గమనములను ఆపువా డగును. దేవతల అమృతమును బలాత్కారముగా హరించువా డగును.

యో రుక్మిణీ మేకరథేన భోజా-
నుత్పాద్య రాజ్ఞః సమరే ప్రసహ్య,
ఉవాహ భార్యాం యశసా జ్వలన్తీం
యస్యాం జజ్ఞే రౌక్మిణేయో మహాత్మా. 74

ఆ కృష్ణుడు ఒంటిరథికుడై భోజవంశపురాజు లందరిని యుద్ధమున బలముతో తరిమికొట్టి రూపముతో వెలిగిపోవుచున్న రుక్మిణిని భార్యగా కొనిపోయెను. ఆమెయందే కదా మహాత్ముడగు ప్రద్యుమ్నుడు పుట్టెను.

అయం గాన్ధారాం స్తరసా సంప్రమథ్య
జిత్వా పుత్రా న్నగ్నజితః సమగ్రాన్,
బద్ధం ముమోచ వినదన్తం ప్రసహ్య
సుదర్శనం వై దేవతానాం లలామమ్. 75

దేవతలకు తలమీద పెట్టుకొనదగిన సుదర్శను డను రాజును నగ్నజిత్తు కొడుకులు పట్టుకొనగా, ఆతడు కూయిపెట్టగా ఈకృష్ణుడు గాంధారరాజులగు ఆ నగ్నజిత్తుకొడుకుల నందరిని బలముతో ఓడించి యాతనిని విడిపించెను.

అయం కపాటేన జఘాన పాణ్డ్యం
తథా కళిఙ్గాన్ దన్తకూరే మమర్ద,

---

75. సుదర్శను డను రాజును నగ్నజిత్తు కొడుకులు బంధింపగా - కృష్ణుడు విడిపించె నని భావము. దేవతానాం లలామమ్-దేవతలకు రత్నమువంటి వాడు; నెత్తిన పెట్టుకొనదగినవాడని భావము.

అనేన జగ్ధా వర్షపూగాన్ వినాథా
వారాణసీ నగరీ సంబభూవ. 76

ఈతడు పాండ్యరాజును బొమ్మతో సలిపి చంపెను. అట్లే కళింగరాజులను యుద్ధమున మర్దించెను. ఈతడు కొల్లగొట్టిన వారణాసినగరము వేలయేండ్లు దిక్కుమాలిన దాయెను.

అయం స్మ యుద్ధే మన్యతేఽన్యై రజేయం
త మేకలవ్యం నామ నిషాదరాజమ్,
వేగే నైవ శైల మభిహత్య జమ్భః
శేతే స కృష్ణేన హతః పరాసుః. 77

ఏకలవ్యు డను ఆటవికుల రాజు ఎల్లవేళల కృష్ణునితో పోరగోరుచుండును. ఇతరులకు గెలువ రానివాడు. అట్టివాడు వేగముతో కొండను దాకినట్లు తాకి జంభాసురునివలె కృష్ణునిచేత దెబ్బ తిని ప్రాణములు కోల్పోయి పడియుండెను.

తతోఽగ్రసేనస్య సుతం సుదుష్టం
వృష్ణ్యన్ధకానాం మధ్యగతం సభాస్థమ్,

---

76. కపాటేన-బొమ్మదెబ్బతో; దన్తకూరే-యుద్ధమున; కొందఱు కపాటే - కపాటనగరమున, నిజఘాన-చంపెను అను పాఠమును కల్పించిరి. అట్లే దన్తకూరే - దన్తకూరమను ప్రదేశమున అని వ్యాఖ్యానించిరి. జగ్ధా - మ్రింగబడినది-ఆక్రమింపబడిన దని భావము;
అనాథా సంబభూవ-రక్షకుడు లేని దాయెను;

77. అయం-ఈ కృష్ణుడు; తమ్-ఆ యేకలవ్యుని; యుద్ధే-యుద్ధమున, మన్యతే-మన్నించును. యుద్ధమున చాల సమర్థు డని కృష్ణుడు భావించునట్టి వా డా యేకలవ్యుడు అని భావము; అన్యైః-ఇతరులచేత; అజేయం-గెలువ రానివానిని; సః - అట్టి యేకలవ్యుడు; జమ్భః-జంభు డను రక్కసునివలె; వేగేన-వేగముతో; శైలమ్ అభిహత్య-కొండనుతాకిన విధమున (కృష్ణుని మార్కొని) కృష్ణేన-కృష్ణునిచేత, హతః-దెబ్బతిన్నవాడై; పరాసుః - ప్రాణములు కోల్పోయి; శేతే-పడియుండెను అని అన్వయము.

అపాతయ ద్బలదేవద్వితీయో
హత్వా దదౌ చోగ్రసేనాయ రాజ్యమ్. 78

ఉగ్రసేనుని కొడుకు మిక్కిలి దుష్టుడు నగు కంసుని వృష్ణి, అంధక వంశమువారినడుమ నిండుకొలువులో నున్నవానిని బలదేవు నొక్కని సాయముగా గొని చంపి నేల గూల్చెను. ఉగ్రసేనునకు రాజ్యము నొసగెను.

అయం సౌమ్భం యోధయామాస ఖస్థం
విభీషణం మాయయా శాల్వరాజమ్,
సౌమ్భద్వారి ప్రత్యగృహ్ణా చ్ఛతఘ్నీం
దోర్భ్యాం క ఏనం విషహేత మర్త్యః. 79

ఈ కృష్ణుడు భయంకరు డగు సాల్వరాజు సౌంభుని నింగిని నిలిచి మాయతో పోర నిచ్చెను. సౌంభపురము ద్వారముకడ ఆతడు ప్రయోగించిన శతఘ్నిని రెండుచేతులతో బంతినివలె పట్టుకొనెను. మానవమాత్రు డీతనిని పట్టుకొనగలడా?

ప్రాగ్జ్యోతిషం నామ బభూవ దుర్గం
పురం ఘోర మసురాణా మసహ్యమ్,
మహాబలో నరక స్తత్ర భౌమో
జహారాదిత్యా మణికుణ్డలే శుభే. 80

---

78. తతః + ఉగ్రసేనస్య-తత ఉగ్రసేనస్య అని కావలయును 'తతోగ్ర' అను సంధి ఆర్షము. లేదా 'తథోగ్రసేనస్య' అను పాఠమునైన గ్రహింపవలయును.

79. ఖస్థమ్-ఆకసమున నున్నవానిని; విభీషణమ్-భయంకరుడైన వానిని - లేదా-భయ మెరుగని వానిని; శతఘ్నీమ్-వందలకొలది వీరులను చంపు శక్తి అను ఆయుధమును; దోర్భ్యామ్-చేతులతో; ప్రత్యగృహ్ణాత్-బంతిని వలె పట్టుకొనెను;

80. భౌమః - భూదేవికొడుకు;

ప్రాగ్జ్యోతిష మను పేరున రాక్షసుల కోట అయిన దుర్గమొకటి కలదు. అది యెవ్వరికిని లొంగనిది. అచ్చటి నరకు డను మహాబలశాలి, భూమికొడుకు-అదితియొక్క మంగళవస్తువులగు మణికుండలముల నపహరించెను.

న తం దేవాః సహ శక్రేణ శేకుః
సమాగతా యుధి మృత్యో ర్భీతాః,
దృష్ట్వా చ తం విక్రమం కేశవస్య
బలం తథైవాస్త్ర మవారణీయమ్. 81

జానన్తోఽస్య ప్రకృతిం కేశవస్య
న్యయోజయన్ దస్యువధాయ కృష్ణమ్,
స తత్కర్మ ప్రతిశుశ్రావ దుష్కర-
మైశ్వర్యవాన్ సిద్ధిషు వాసుదేవః. 82

మృత్యువునకును భయపడని దేవత లందరు ఇంద్రునితోపాటు యుద్ధమున నాతని గెలువలేకపోయిరి. కేశవుని జగమెరిగిన పరాక్రమమును, అడ్డులేని అస్త్రవిద్యను ఎఱిగినవారు కావున వారు కృష్ణుని ఆ దొంగరక్కసుని వధకై నియోగించిరి. కార్యసిద్ధులయందు నిండైన ప్రభుత్వము గల వాసుదేవు డా దుష్కరమగు కార్యమునకు మాట యిచ్చెను.

నిర్మోచనే షట్ సహస్రాణి హత్వా
సంఛిద్య పాశాన్ సహసా క్షురాన్తాన్,
మురం హత్వా వినిహత్యౌఘరక్షో
నిర్మోచనం చాపి జగామ వీరః. 83

82. ప్రకృతిమ్ - స్వభావమును - రక్కసులను మట్టుపెట్టు లక్షణమును; ప్రతిశుశ్రావ - మాట యిచ్చెను - అంగీకరించెను; సిద్ధిషు-కార్యసిద్ధుల యందు; ఐశ్వర్యవాన్ - ఐశ్వర్య మనగా ఈశ్వరభావము. ఈశ్వరుడు సంకల్పించినదానికి తిరుగు ఉండదు. అట్టి భావము కలవాడై అని భావము.

83. నిర్మోచనే - నిర్మోచన మను పేరుగల నగరమున; క్షురాన్తాన్ - చుర

నిర్మోచన మను నగరమున ఆరువేలరక్కసులను చంపి, వాడిఅంచులు గల పాశముల నొక్కుమ్మడి త్రెంచివైచి, మురుని, ఓఘుడను రక్కసుని చావగొట్టి ఈ వీరుడు నిర్మోచనమును ప్రవేశించెను.

తత్రైవ తేనాస్య బభూవ యుద్ధం
మహాబలే నాతిబలస్య విష్ణోః,
శేతే స కృష్ణేన హతః పరాసు-
ర్వాతే నేవ మథితః కర్ణికారః. 84

అందే ఆ మహాబలముగల నరకునితో వానిని మించిన బలముగల కృష్ణునకు పోరు జరిగెను. ఆ నరకుడు పెనుగాలికి నుగ్గునుగ్గైన కొండగోగు చెట్టువలె కృష్ణుని దెబ్బకు ప్రాణములు కోల్పోయి నేల గూలెను.

ఆహృత్య కృష్ణో మణికుణ్డలే తే
హత్వా చ భౌమం నరకం మురం చ,
శ్రియా వృతో యశసా చైవ విద్వాన్
ప్రత్యాజగా మాప్రతిమప్రభావః. 85

అట్లు భూమిపుత్రుడగు నరకుని, మురుని చంపి, ఆ మణికుండలములు సాధించి, సంపదను, కీర్తిని సంపాదించి, అన్నియు నెఱిగినవాడు, సాటిలేని మహిమ గలవాడు నగు కృష్ణుడు తిరిగివచ్చెను.

అస్మై వరా న్యదదం స్తత్ర దేవా
దృష్ట్వా భీమం కర్మ కృతం రణే తత్,
శ్రమశ్చ తే యుధ్యమానస్య న స్యా -
దాకాశే చాప్సు చ తే క్రమః స్యాత్. 86

---

కత్తులవంటి, అంచులుగల; పాశాన్ - ఇనుపత్రాళ్ళను; ఓఘరక్షః - ఓఘు డను పేరుగల రక్కసుని;

86. క్రమః - గతి. వరాణి - వరములను; అదదన్ - ఇచ్చిరి.

శస్త్రాణి గాత్రే న చ తే క్రమేర -
న్నిత్యేవ కృష్ణశ్చ తతః కృతార్థః,
ఏవంరూపే వాసుదేవేఽ ప్రమేయే
మహాబలే గుణసంప త్సదైవ. 87

ఆతడు యుద్ధమున చేసిన భయంకరకర్మమును గాంచి దేవతలు, 'నీవు పోరుచున్నపుడు శ్రమ లేకుండుగాక! నింగిలో,నీటిలో నీకు ప్రవేశము కలుగుగాక! నీ దేహమున బాణపుములుకులు చొరకుండుగాక!' అని వరము లిచ్చిరి. దానితో కృష్ణుడు కృతార్థు డయ్యెను. ఇట్లితరుల కలవికాని మహాబలుడగు కృష్ణుని యందు, కృష్ణు డున్నచోట, ఎల్లవేళల గుణముల సంపద నిలిచియుండును.

త మసహ్యం విష్ణు మనన్తవీర్య -
మాశంసతే ధార్తరాష్ట్రో విజేతుమ్,
సదా హ్యేనం తర్కయతే దురాత్మా
తచ్చాప్యయం సహతేఽస్మాన్ సమీక్ష్య. 88

అట్టి భరింపశక్యముకాని అనంతమైన వీర్యముగల విష్ణునికూడ ఈ ధృతరాష్ట్రుని కొడుకు గెలువ నుంకించును. ఆ చెడిపె ఈతనిని ఎల్లప్పుడు పట్ట యత్నించును. ఈ మహాత్ముడు మమ్ములను చూచి దానిని గూడ సహించుచుండును.

పర్యాగతం మమ కృష్ణస్య చైవ
యో మన్యతే కలహం సంప్రసహ్య,
శక్యం హర్తుం పాణ్డవానాం మమత్వం
తద్వేదితా సంయుగం తత్ర గత్వా. 89

ఆ దుష్టుడు నాకును కృష్ణునకును బలవంతముగ కలహము వచ్చినట్లే భావించుచుండును. దానితో కృష్ణునకు పాండవులయెడ గల మమకారమును తొలగింపనగు నని కలలు గనును. ఆ సంగతి యుద్ధమునకు బోయి యందు తెలిసికొనగలడు.

---

88. తర్కయతే - బంధింపగోరును;
89. పర్యాగతమ్ - వచ్చినదానినిగా, వేదితా - ఎఱుగగలడు.

నమస్కృత్వా శాన్తనవాయ రాజ్ఞే
ద్రోణా యాథో సహపుత్రాయ చైవ,
శారద్వతా యాప్రతిద్వన్ద్వినే చ
యోత్స్యా మ్యహం రాజ్య మభీప్సమానః. 90

శంతనుకుమారు డగు భీష్మునకు, పుత్రునితోపాటు ద్రోణునకు, పగవాడు లేని కృపునకు మ్రొక్కి రాజ్యమును పొందగోరుచు నేను యుద్ధము చేయుదును.

ధర్మేణాస్త్రం నిధనం తస్య మన్యే
యో యోత్స్యతే పాణ్డవైః పాపబుద్ధిః,
మిథ్యాగ్లహే నిర్జితా వై నృశంసైః
సంవత్సరాన్ వై ద్వాదశ రాజపుత్రాః. 91

పాపబుద్ధియై యెవడైనను పాండవులతో పోరునేని ధర్మముచేతనే వానికి చావుమూడు నని భావింతును. ఆ క్రూరులు కపటద్యూతమున ఈ రాజపుత్రులను పండ్రెండేండ్లు గెలిచిరి.

వాసః కృచ్ఛ్రో విహిత శ్చాప్యరణ్యే
దీర్ఘం కాలం చైక మజ్ఞాతవర్షమ్,
తే హి కస్మా జ్జీవతాం పాణ్డవానాం
నన్దిష్యన్తే ధార్తరాష్ట్రాః పదస్థాః. 92

అడవులలో బహుదీర్ఘకాలము కష్టములపాలై నిలిచితిమి. ఒక యేడు అజ్ఞాతవాస మొనర్చితిమి. ఈ పాండవులు బ్రదికియుండగా ఆ ధృతరాష్ట్రపుత్రులు ఎట్లు పదములం దుండి సుఖింతురు?

తే చే దస్మాన్ యుధ్యమానాన్ జయేయు -
ర్దేవై రమహేన్ద్రప్రముఖైః సహాయైః,
ధర్మా దధర్మ శ్చరితో గరీయాం-
స్తతో ధ్రువం నాస్తి కృతం చ సాధు. 93

---

93. సాధు కృతమ్-సత్కర్మము; నాస్తి-లేదు; సత్కర్మమునకు ఫలము లేని కారణమున ధర్మము పనికిమాలిన దగునని భావము;

దేవేంద్రుడు మున్నగు దేవతలు తోడై వారు పోరుచున్న మమ్ము గెలుతు రేని ధర్మముకంటె అధర్మమైన ప్రవృత్తియే గొప్పది యని తేలిపోవును. మంచి పని యనునది నిశ్చయముగా ఉండబోదు.

న చే దిమం పురుషం కర్మబద్ధం
న చే దస్మాన్ మన్యతేఽసౌ విశిష్టాన్,
ఆశంసేఽహం వాసుదేవద్వితీయో
దుర్యోధనం సానుబన్ధం నిహన్తుమ్. 94

పురుషుడు కర్మమునకు కట్టుబడినవాడనియు, మేమట్లు కర్మబద్ధులమనియు, మా యీ క్లేశములకు కర్మమే కారణమనియు ఎరిగిన వారమగుటచే, అట్లెరుగని సాధారణ జనులకంటె విశిష్టుల మనియు నా దుర్యోధనుడు తలపోయడేని శ్రీకృష్ణుడు తోడై నిలువగా నే నా దుర్యోధనుని, వాని వారిని చంపనెంతును.

న చే దిదం కర్మ నరేన్ద్ర వన్ధ్యం
న చే ద్భవే త్సుకృతం నిష్ఫలం వా,
ఇదం చ త చ్చాభిసమీక్ష్య నూనం
పరాజయో ధార్తరాష్ట్రస్య సాధుః. 95

---

94. కర్మబద్ధం - మే మింతవరకు పాట్లు పడితి మన్నచో అది కర్మఫల మనుభవించుటయే కాని దుర్యోధనుని ప్రతాపమువలన కాదని తాత్పర్యము; న చేత్......మమ్ము మేము కర్మబద్ధుల మనియే ఎఱిగిన వారగుటచే అట్లెరుగని సామాన్యులకంటె విశిష్టులమని తలపడేని దాని ఫలము చచ్చుటయే యని తాత్పర్యము.

95. న చే దిదం కర్మ నరేన్ద్ర వన్ధ్యమ్-రాజా! కర్మము నిష్ఫలము కానిచో వాడు చేసిన పాపపునికి తగిన ఫలము వా డనుభవింపకతప్పనిచో-న చేత్ భవేత్ సుకృతం నిష్ఫలం వా - చేసిన పుణ్యము నిష్ఫలము కాని దైనచో; ఇదమ్ - ఇప్పటిదగు రాజ్యభాగము నీకుండుట అనునది; తత్- అప్పటిదైన రాజ్యమునుండి వెడలగొట్టబడుట అనునది; అభిసమీక్ష్య - ఆలోచించి (నచో); ధార్తరాష్ట్రస్య - దుర్యోధనునకు; పరాజయః - ఓటమియే; సాధుః-తగినది.

రాజా! ఇట్లు సుకృతముగాని, దుష్కృతముగాని తమ తమ ఫలము లిచ్చుననియే నిశ్చితము. కాన ఈ రెంటిని బాగుగా విచారించినచో దుర్యోధను డోడుటయే సరియైన ఫలము (ధర్మము).

ప్రత్యక్షం వః కురవో యద్బ్రవీమి
యుద్ధ్యమానా ధార్తరాష్ట్రా న సన్తి,
అన్యత్ర యుద్ధాత్ కురవో యది స్యు-
ర్న యుద్ధే వై శేష ఇహాస్తి కశ్చిత్. 96

కౌరవులారా! మీముందు చెప్పుచున్నాను. ధృతరాష్ట్రుని కొడుకులు యుద్ధ మాడుదురేని మిగులరు. యుద్ధము కానిచో వారు మిగులవచ్చును. యుద్ధమే జరిగినచో ఒక్కడును మిగులబోడు.

హత్వా త్వహం ధార్తరాష్ట్రాన్ సకర్ణాన్
రాజ్యం కురూణా మవజేతా సమగ్రమ్,
యద్వః కార్యం తత్కురుధ్వం యథాస్వ-
మిష్టాన్ దారా నాత్మభోగాన్ భజధ్వమ్. 97

నేను మాత్రము కర్ణునితోపాటు ధృతరాష్ట్రుని వారల నందరను చంపి కౌరవుల రాజ్యమును గెలుతును. మీ మీ సంపదలకు తగినట్లు చేయదగు పనిని మున్నే చేసికొనుడు. ప్రియమైన భార్యలతో పొందవలసిన భోగములను పొందుడు.

అప్యేవం నో బ్రాహ్మణాః సన్తి వృద్ధాః
బహుశ్రుతాః శీలవన్తః కులీనాః,
సాంవత్సరా జ్యోతిషి చాభియుక్తా
నక్షత్రయోగేషు చ నిశ్చయజ్ఞాః. 98

---

97. ఎట్లో మీకు చావు మూడినది. అనుభవించవలసిన సుఖము లన్నియు నిప్పుడే అనుభవింపు డని తాత్పర్యము.

98. సాంవత్సరాః - సంవత్సరగమనము లెక్కగట్టు పంచాంగకర్తలు లేక జ్యోతిషవిద్వాంసులు.

మఱియు మాకు వృద్ధులు, గొప్పచదువులు చదివినవారు, మంచి శీలము, కులము కలవారు, జ్యోతిషమునందు గట్టిప్రజ్ఞ గలవారు, నక్షత్రముల కలయికల యందు ఫలములను నిశ్చయించి చెప్పగలవారు నగు పంచాంగకర్తలు బ్రాహ్మణులు కలరు.

ఉచ్చావచం దైవయుక్తం రహస్యం
దివ్యాః ప్రశ్నా మృగచక్రా ముహూర్తాః,
క్షయం మహాన్తం కురుసృంజయానాం
నివేదయన్తే పాణ్డవానాం జయం చ. 99

వారు అదృష్టముతో కూడిన రహస్యమును, దివ్యము లగు ప్రశ్నలు, మృగచక్రములు, ముహూర్తములు - ఈ అన్నింటిని మూలముట్టుగా విచారించి కౌరవులకు సృంజయులకు పెనుకీడు మూడుననియు పాండవులకు జయము కలుగుననియు చెప్పుచున్నారు.

యథా హి నో మన్యతేఽజాతశత్రుః
సంసిద్ధార్థో ద్విషతాం నిగ్రహాయ,
జనార్దన శ్చాప్యపరోక్షవిద్యో
న సంశయం పశ్యతి వృష్ణిసింహః. 100

99. ఉచ్చావచమ్ - హెచ్చుతగ్గులు సరిచూడబడిన; దైవయుక్తమ్ - అదృష్టముతో కూడిన; రహస్యమ్-అందరకు నెరుగరాని విషయమును; దివ్యాః-రాబోవు విషయములను సూచించునట్టి ప్రశ్నలు; మృగచక్రాః - చక్రములు, సర్వతోభద్రము మొదలగునవి-శైవాగమములందు ప్రసిద్ధములు - వానిని పరీక్షించువారు - అనగా ఏ నక్షత్రము ఏ గ్రహముతో కూడినది అని విచారించువారు మృగచక్రులు - 'చక్రమృగ' అని యుండవలయును. కాని మృగశబ్దము ముందుండుట వైదికపద్ధతి.

100. న మన్యతే - నిశ్చయమునకు రాకున్నపుడని భావము; అపరోక్షవిద్యః-భూతభవిష్యద్విషయముల నెరిగినవాడు, సంశయమ్ - గెలుపును గూర్చిన సంశయమును ; న పశ్యతి - చూడకున్నాడు - గెలుపు తప్పక కలుగు ననుచున్నాడని భావము.

పగవారిని అణచివేయుటకు అజాతశత్రువు అన్ని యేర్పాటులను కూర్చుకొని యొక నిర్ణయమునకు రాకున్నసమయమున శ్రీకృష్ణుడు దివ్య దృష్టి కలవాడు కావున జయమునుగూర్చి యెట్టి సంశయమును బొంద లేదు.

అహం తథైవ ఖలు భావిరూపం
పశ్యామి బుద్ధ్యా స్వయ మప్రమత్తః,
దృష్టి శ్చ మే న వ్యథతే పురాణీ
సంయుధ్యమానా ధార్తరాష్ట్రా న సన్తి. 101

నేనును మెలకువతో బుద్ధి నుపయోగించి, భవిష్యత్తును భావించుచున్నాను. యోగప్రభావముగల నా దృష్టికి తిరుగులేదు. యుద్ధమాడిరో ధృతరాష్ట్రపక్షము వారు బ్రదుకరు.

అనాలబ్ధం జృమ్భతి గాణ్డివం ధను-
రనాహతా కమ్పతి మే ధను ర్జ్యా,
బాణా శ్చ మే తూణముఖా ద్విసృత్య
ముహు ర్ముహు ర్గన్తు ముశన్తి చైవ. 102

చేత ముట్టకయే గాండీవధనువు ఎగసిపడుచున్నది. మ్రోగింపకయే అల్లెత్రాడు మొరయుచున్నది. అమ్ములపొదులనుండి బాణములును తమంత తామే వెలికి దూకుచున్నవి.

ఖడ్గః కోశా న్నిఃసరతి ప్రసన్నో
హిత్వేవ జీర్ణా మురగ స్త్వచం స్వామ్,
ధ్వజే వాచో రౌద్రరూపా భవన్తి
కదా రథో యోక్ష్యతే తే కిరీటిన్. 103

సర్పము చివికిపోయిన కుబుసమును వదలినట్లు ప్రసన్నమగు నాకత్తి యొరనుండి వెలి కురుకుచున్నది. ధ్వజమునందు 'ఓ కిరీటి! నీ రథము నెప్పుడు కూర్తు' వను భయంకరములగు మాటలు పుట్టుచున్నవి.

---

101. పురాణీ - యోగప్రభావము గలది; న వ్యథతే - తిరస్కారమును బొందుటలేదు;

గోమాయుసఙ్ఘాశ్చ నదన్తి రాత్రౌ
రక్షాం స్యథో నిష్పత న్త్యన్తరిక్షాత్,
మృగాః శృగాలాః శితికణ్ఠాశ్చ కాకా
గృధ్రా బకాశ్చైవ తరక్షవశ్చ. 104

రాత్రియందు నక్కల మూకలు ఊళలు పెట్టుచున్నవి. ఆకసమునుండి రక్షస్సులు నేలపై వ్రాలుచున్నవి. లేళ్లు, నక్కలు, నెమళ్లు, కాకులు, గ్రద్దలు, కొంగలు, సివంగులు కూయుచున్నవి.

సువర్ణపత్రాశ్చ పతన్తి పశ్చా-
ద్దృష్ట్వా రథం శ్వేతహయప్రయుక్తమ్,
అహం హ్యేకః పార్థివాన్ సర్వయోధాన్
శరాన్ వర్షన్ మృత్యులోకం నయేయమ్. 105

తెల్లని గుఱ్ఱములు పూన్చిన రథమును గాంచి బంగారు ఱెక్కల పక్షులు వెంటబడుచున్నవి. నే నొక్కడనే రాజు లందరను, యోధు లందరను బాణములను కురిపించుచు, మృత్యులోకమునకు పంపుదును.

సమాదదానః పృథగస్త్రమార్గాన్
యథాగ్నిరిద్ధో గహనం నిదాఘే,
స్థూణా కర్ణం పాశుపతం మహాస్త్రం
బ్రాహ్మం చాస్త్రం యచ్చ శక్రోఽప్యదాన్మే. 106

స్థూణాకర్ణ మను అస్త్రము గొప్పది యగు పాశుపతము, బ్రహ్మాస్త్రము, ఇంద్రు డిచ్చిన ఐంద్రాస్త్రము అనువానిని గ్రహించి, మండు వేసగిలో అడవిని గాల్చు దావాగ్నివలె ఇతరుల అస్త్రమార్గములను త్రిప్పికొట్టుదును.

వధే ధృతో వేగవతః ప్రముఞ్చ-
న్నాహం ప్రజాః కిఞ్చి దిహావశిష్యే,
శాన్తిం లప్స్యే పరమో హ్యేష భావః
స్థిరో మమ బ్రూహి గావల్గణే తాన్. 107

---

107. వధే ధృతః - చంపుటకు సిద్ధపడిన; వేగవతః - వేగముగల వానిని - బాణములను;

వారి చాపునకై గట్టిగా నిలిచి బాణములను ప్రయోగించు నేను ప్రజలను ఏకాంచెము మిగులనీయను. ఓయి గవల్గణకుమారా! అందరు చచ్చిన వెనుకనే శాంతి నందుదును. ఇది నా చెదరని పరమభావము. వారికి తెలుపుడు.

యే వైజయ్యాః సమరే సూత లబ్ధ్వా
దేవా నపీన్ద్రప్రముఖాన్ సమేతాన్,
తై ర్మన్యతే కలహం సంప్రసహ్య
స ధార్తరాష్ట్రః పశ్యత మోహ మస్య. 108

సూతా! ఇంద్రుడు మొదలగు దేవతలందరు తలపడినను ఎవ్వరు జయమునే పొందుదురో అట్టివారితో మొండిగా కయ్యమును కాంక్షించుచున్నాడా దుర్యోధనుడు. వాని తెలివితక్కువతనమును చూడుడు.

వృద్ధో భీష్మః శాన్తనవః కృపశ్చ
ద్రోణః సపుత్రో విదురశ్చ ధీమాన్,
ఏతే సర్వే యద్వదన్తే తదస్తు
ఆయుష్మన్తః కురవః సన్తు సర్వే. 109

పెద్దవాడు శంతనుకుమారు డగు భీష్ముడు, కృపుడు, అశ్వత్థామతో కలిసిన ద్రోణుడు, బుద్ధిశాలి యగు విదురుడు- వీరందరు ఏమందురో అది యగు గాక! కురువంశమువా రందరు ఆయుష్మంతు లగుదురుగాక!

ఇతి శ్రీమహాభారతే ఉద్యోగపర్వణి
యానసంధిపర్వణి అర్జునవాక్యనివేదనే
అష్టచత్వారింశో உధ్యాయః.

ఇది శ్రీమహాభారతము ఉద్యోగపర్వమున
యానసంధిపర్వమున అర్జునుని వాక్యములు
చెప్పుట యను నలుబది యెనిమిదవ అధ్యాయము.

—:o:—

108. వైజయ్యాః - విజయ మగు కర్మము కలవారు - తప్పక జయించువారని భావము; దేవాన్ అపి లబ్ధ్వా - దేవతలను పొందియు-దేవతలు యుద్ధము చేయుటకు వచ్చినప్పటికిని అని భావము.

## ఏకోనపఞ్చాశత్తమోఽధ్యాయః
## నలుబదితొమ్మిదవ అధ్యాయము

భీష్మేణ దుర్యోధనం ప్రతి శ్రీకృష్ణార్జునయోః మాహాత్మ్యకథనపూర్వకం కర్ణస్య గర్హణమ్. కర్ణ స్యాత్మ ప్రశంసనమ్, భీష్మేణ పున స్తస్యోపహాసః, ద్రోణకర్తృకం భీష్మవాక్యానుమోదనం చ.

భీష్ముడు దుర్యోధనునితో శ్రీకృష్ణార్జునుల మాహాత్మ్యమును చెప్పుచు కర్ణుని నిందించుట, కర్ణుడు తన్నుదా పొగడుకొనుట, భీష్ముడు మరల వాని నధిక్షేపించుట, ద్రోణుడు భీష్ముని పలుకును మెచ్చుకొనుట.

వైశమ్పాయన ఉవాచ-

వైశంపాయను డిట్లు చెప్పెను.

సమవేతేషు సర్వేషు తేషు రాజసు భారత,<br>దుర్యోధన మిదం వాక్యం భీష్మః శాన్తనవోఽబ్రవీత్. 1

ఆ రాజు లందరు అక్కడ కూడియుండగా, శంతనుకుమారు డగు భీష్ముడు దుర్యోధనునితో ఇట్లు పలికెను.

బృహస్పతి శ్శోశనా చ బ్రహ్మాణం పర్యుపస్థితౌ,<br>మరుత శ్చ సహేన్ద్రేణ వసవ శ్చాగ్నినా సహ. 2

ఆదిత్యాశ్చైవ సాధ్యాశ్చ యే చ సప్తర్షయో దివి,<br>విశ్వావసు శ్చ గన్ధర్వః శుభా శ్చాప్సరసాం గణాః. 3

ఒకప్పుడు బృహస్పతి, శుక్రుడు, మరుత్తులు, ఇంద్రుడు, వసువులు, అగ్ని, ఆదిత్యులు, సాధ్యులు, ఆకసమున నున్న సప్తర్షులు, విశ్వావసు వను గంధర్వుడు చక్కని అచ్చరల సముదాయములు బ్రహ్మను గొలిచియుండిరి.

నమస్కృత్యోపజగ్ము స్తే లోకవృద్ధం పితామహమ్,<br>పరివార్య చ విశ్వేశం పర్యాసత దివౌకసః. 4

వా రందరు లోకములకెల్ల పెద్దయగు బ్రహ్మదేవునికి నమస్కరించి దేవతలందరు విశ్వేశుని చుట్టి కూర్చుండిరి.

తేషాం మనశ్చ తేజ శ్చా ప్యాదదానా విహౌజసా,
పూర్వదేవౌ వ్యతిక్రాన్తౌ నరనారాయణా వృషీ. 5

వారందరి మనస్సును తేజమును తమ శక్తితో కొల్లగొట్టుచుండిరో యన్నట్లు ప్రాచీనులగు నరనారాయణులు మించి యుండిరి.

బృహస్పతిస్తు పప్రచ్ఛ బ్రహ్మాణం కావిమా వితి,
భవన్తం నోపతిష్ఠేతే తౌ నః శంస పితామహ. 6

బృహస్పతి బ్రహ్మతో, 'పితామహా! వీరిరువు రెవ్వరు? నిన్నేల కొలువకున్నారు? మాకు చెప్పు' మని యడిగెను.

బ్రహ్మోవాచ - బ్రహ్మ యిట్లు చెప్పెను.

యా వేతౌ పృథివీం ద్యాం చ భాసయన్తౌ తపస్వినౌ,
జ్వలన్తౌ రోచమానౌ చ వ్యాప్యాతీతౌ మహాబలౌ. 7

నరనారాయణా వేతౌ లోకా ల్లోకం సమాస్థితౌ,
ఊర్జితౌ స్వేన తపసా మహాసత్త్వపరాక్రమౌ. 8

భూమిని, ఆకాశమును వెలుగొందజేయుచున్నవారు, గొప్ప బలము గలవారు, దీప్తితో విరాజిల్లుచున్నవారు, అందరకు చూడ ముచ్చట అయినవారు, అందరను మించినవారు నగు ఈ తాపసులు నరనారాయణులు. మానవలోకము నుండి బ్రహ్మలోకమునకు వచ్చినవారు. తమ తపస్సుతో మహిమ నొందినవారు. గొప్పబలము, పరాక్రమము గలవారు.

ఏతౌ హి కర్మణా లోకం నన్దయామాసతు ర్ధ్రువమ్,
ద్విధాభూతౌ మహాప్రాజ్ఞౌ విద్ధి బ్రహ్మన్ పర న్తపౌ,
అసురాణాం వినాశాయ దేవగన్ధర్వపూజితౌ. 9

---

6. పర్యాసత-చుట్టును చేరి కూర్చుండిరి
8. లోకాత్ - మానవుల లోకమునుండి; లోకమ్-బ్రహ్మలోకమునకు;

వీరు తమపుణ్యకర్మలచే లోకమును ఉప్పొంగజేసిరి. నిజమున కొక్కరే రెండుగా నయిరి. గొప్పప్రజ్ఞ గలవారు. ఓయి ఋషీ! శత్రువులను మాడ్చివేయు శక్తి గలవారు. రాక్షసుల రూపుమాపుటకై దేవతలు, గంధర్వులు వీరిని ప్రార్థించిరి.

వైశమ్పాయన ఉవాచ-

వైశంపాయను డిట్లు చెప్పెను.

జగామ శక్ర స్తచ్ఛ్రుత్వా యత్ర తౌ తేపతు స్తపః,

సార్ధం దేవగణైః సర్వై ర్బృహస్పతిపురోగమైః. 10

అంత నింద్రు డది విని బృహస్పతిమున్నగాగల దేవతలందరితో పాటు వారిరువురు తపస్సుచేయు చోటి కరిగెను.

తదా దేవాసురా యుద్ధే భయే జాతే దివౌకసామ్,

అయాచత మహాత్మానౌ నరనారాయణౌ వరమ్. 11

అప్పుడు దేవతలకు రాక్షసులకు యుద్ధము జరుగుచున్నది. దేవతలకు భయ మేర్పడినది. ఇంద్రుడు మహాత్ములగు నరనారాయణులను వరము కోరెను.

తా వబ్రూతాం వృణీష్వేతి తదా భరతసత్తమ,

అథైతా వబ్రవీ చ్ఛక్రః సాహ్యం నః క్రియతా మితి. 12

భరతవరేణ్యా! అంత వారు వరము కోరుకొమ్మనిరి. అపుడు దేవేంద్రుడు మాకు సాయము చేయవలసిన'దని యడిగెను.

తత స్తౌ శక్ర మబ్రూతాం కరిష్యావో యదిచ్ఛసి,

తాభ్యాం చ సహితః శక్రో విజిగ్యే దైత్యదానవాన్. 13

అంత - వారు నీ కేది యిష్టమో అది చేయుదు మనిరి. ఇంద్రుడు వారితో కూడి దితికొడుకులను, దనువుకొడుకులను జయించెను.

నర ఇన్ద్రస్య సఙ్గ్రామే హత్వా శత్రూన్ పరంతపః,

పౌలోమాన్ కాలఖఞ్జాంశ్చ సహస్రాణి శతాని చ. 14

---

11. అయాచత - ఇంద్రుడు వరము కోరెను.

12. సాహ్యమ్ - సాయమును.

పగవారిని మాడ్చివేయు నరుడు ఇంద్రుని యుద్ధమున పౌలోములు, కాలఖంజులు అనువారిని వందలకొలది వేలకొలదిగా పట్టుపెట్టెను.

ఏష భ్రాన్తే రథే తిష్ఠన్ భల్లే నాపాహర చ్ఛిరః,
జంభస్య గ్రసమానస్య తదా హ్యర్జున ఆహవే. 15

జంభు డనువాడు మీదపడి మ్రింగబోవుచుండగా యుద్ధభూమిలో కదలాడు రథముననుండి యీ అర్జునుడు భల్లముతో తలను తొలగించెను.

ఏష పారే సముద్రస్య హిరణ్యపుర మారుజత్,
జిత్వా షష్టిం సహస్రాణి నివాతకవచాన్ రణే. 16

ఈతడు సముద్రపుటొడ్డున ఆరువేలమంది నివాతకవచులను యుద్ధమున నోడించి హిరణ్యపురమును పీడించెను.

ఏష దేవాన్ సహేన్ద్రేణ జిత్వా పరపురఞ్జయః,
అతర్పయన్ మహాబాహు రర్జునో జాతవేదసమ్. 17

శత్రుపురములను గెలుచువాడు, పెనుభుజములు గలవాడు నగు అర్జునుడు (నరుడు) ఇంద్రునితోపాటు దేవతలను గెలిచి అగ్నిదేవుని తృప్తి పరచెను.

నారాయణ స్తథైవాత్ర భూయసోఽన్యాన్ జఘాన హ,
ఏవ మేతౌ మహావీర్యౌ తౌ పశ్యత సమాగతౌ. 18

అట్లే యీ నారాయణుడును చాలమంది శత్రువులను చావగొట్టెను. ఇట్లు గొప్పవీర్యముగల యీ యిరువురు కలసి వచ్చిరి. వారిని చూడుడు.

వాసుదేవార్జునౌ వీరౌ సమవేతౌ మహారథౌ,
నరనారాయణౌ దేవౌ పూర్వదేవా వితి శ్రుతిః. 19

---

15. భ్రాన్తే రథే - నిలుకడ లేనిదైన రథముమీద - అట్లు కదలాడుచున్న రథముమీద నిలిచి పోరుట సుకరము కాదు.

16. ఆరుజత్ - పీడించెను

18. భూయసః - చాలమందిని

ఆ కృష్ణార్జునులు మహారథులు, కూడియున్న వీరులు. గొప్ప ప్రకాశము గల తొలి దేవతలు నరనారాయణులే యని వినవచ్చుచున్నది.

అజేయౌ మానుషే లోకే సేన్ద్రైరపి సురాసురైః
ఏష నారాయణః కృష్ణః ఫాల్గునశ్చ నరః స్మృతః,
నారాయణో నరశ్చైవ సత్త్వమేకం ద్విధా కృతమ్. 20

వీరు మనుష్యలోకమున నెవ్వరికిని గెలువజాలనివారు. అంతే కాదు; ఇంద్రునితో పాటు దేవతలు, దానవులు కలసివచ్చినను వీరిని గెలువజాలరు. ఈ నారాయణుడే కృష్ణుడు. నరుడే అర్జునుడు. నిజమునకు ఒక తత్త్వము రెండుగా నయి నరనారాయణులుగా నైనది.

ఏతౌ హి కర్మణా లోకా నశ్నువాతేఽక్షయాన్ ధ్రువాన్,
తత్ర తత్రైవ జాయేతే యుద్ధకాలే పునః పునః. 21

వీరే యుద్ధ మను కార్యముతో తరుగనివి స్థిరమైనవి యగు లోకములను వ్యాపించియుందురు. యుద్ధమగువేళ అందందు తిరిగి తిరిగి పుట్టుచుందురు.

తస్మాత్ కర్మైవ కర్తవ్య మితి హోవాచ నారదః,
ఏతద్ధి సర్వ మాచష్ట వృష్ణిచక్రస్య వేదవిత్. 22

కావున వారితో యుద్ధమే చేయదగిన దని వేద మెరిగిన నారదుడు వృష్ణివంశమువారికి దీని నంతటిని వక్కాణించెను.

శంఖచక్రగదాహస్తం యదా ద్రక్ష్యసి కేశవమ్,
పర్యాదదానం చాస్త్రాణి భీమధన్వాన మర్జునమ్. 23
సనాతనౌ మహాత్మానౌ కృష్ణా వేకరథే స్థితౌ,
దుర్యోధన తదా తాత స్మర్తాసి వచనం మమ. 24

---

20. సత్త్వమ్ - ఉన్నది; ప్రకృతి, ఒకే దైవము యోగప్రభావమువలన రెండు రూపములతో నున్నా డని భావము.
21. అశ్నువాతే - వ్యాపించియుండును;
22. కర్మ - యుద్ధకర్మము-ఆ నరనారాయణులతో నని కలుపుకొనదగును. .. ఆచష్ట - చెప్పెను - నారదుడు; ..

శంఖము, చక్రము, గద చేత దాల్చిన కృష్ణుని, మిక్కిలి వెరపుగొలుపు ధనువునుబట్టి అస్త్రములను విరజిమ్ముచున్న అర్జునుని - సనాతను లగు ఈ మహాత్ముల నిరువురను ఒక్కరథమున నుండగా చూచిన నీకు, నాయనా! దుర్యోధనా! నా మాట గుర్తునకు వచ్చును.

నో చే దయ మభావః స్యాత్ కురూణాం ప్రత్యుపస్థితః,
అర్థాచ్చ తాత ధర్మాచ్చ తవ బుద్ధి రుపప్లుతా. 25

స్మరింపవేని, నాయనా! కౌరవులకు వినాశకాలము వచ్చిపడినది. కావుననే నీ బుద్ధి అర్థధర్మములను వదలి గుదుసుప్పు పడుచున్నది.

న చే ద్గ్రహీష్యసే వాక్యం శ్రోతాఽసి సుబహూన్ హతాన్,
తవైవ హి మతం సర్వే కురవః పర్యుపాసతే; 26

నా మాటను పట్టించుకొనవో పెక్కు సంఖ్యలో నీవారు చచ్చిన వార్తలు విందువు. ఈ కౌరవు లందరు నీఅభిప్రాయమునే పట్టి ప్రేలుచున్నారు.

త్రయాణామేవ చ మతం తత్త్వమేకోఽనుమన్యసే
రామేణ చైవ శప్తస్య కర్ణస్య భరతర్షభ. 27
దుర్జాతేః సూతపుత్రస్య శకునేః సౌబలస్య చ,
తథా క్షుద్రస్య పాపస్య భ్రాతు ర్దుఃశాసనస్య చ. 28

పరశురాముని తిట్టువడినవాడు, దుష్టుడు, సూతపుత్రుడు నగు కర్ణుడు, సుబలరాజు శకుని, మరియు నీచుడు, పాపి అయిన తమ్ముడు దుశ్శాసనుడు-అను నీ ముప్వురి యిష్టమునే నీవు సరియైనదిగా మన్నించుచున్నావు.

కర్ణ ఉవాచ - కర్ణు డిట్లు పలికెను.
నైవ మాయుష్మతా వాచ్యం యన్మామాత్థ పితామహ,
క్షత్రధర్మే స్థితో హ్యస్మి స్వధర్మా దనపేయివాన్. 29

తాతా! నన్ను నీ వాడిన మాటలు ఆయువున్నవాడు పలుకదగినది కాదు. నేను క్షత్రధర్మమునందు నిలచినవాడను. స్వధర్మమునుండి తొలగనివాడను.

---

25. నో చేత్ - స్మరించి బుద్ధి మరలించుకొనకున్నచో అని భావము.

కిం చాన్యన్మయి దుర్వృత్తం యేన మాం పరిగర్హసే,
న హి మే వృజినం కిఞ్చి ద్ధార్తరాష్ట్రా విదుః క్వచిత్. 30

నాయందే చెడుపనము చూచి నన్ను నిందించుచున్నావు? నాయందు కొంచెమేని ఎన్నడేని పాపమును ధార్తరాష్ట్రులు చూచి ఎరుగరు.

నాచరం వృజినం కిఞ్చి ద్ధార్తరాష్ట్రస్య నిత్యశః,
అహం హి పాణ్డవాన్ సర్వాన్ హనిష్యామి రణే స్థితాన్. 31

నేనీ దుర్యోధనున కేనాడును ఏ ద్రోహమును చేసియుండలేదు. యుద్ధమున నిలచిన పాండవుల నందరను నేను వధింపగలను.

ప్రాగ్విరుద్ధైః శమం సద్భిః కథం వా క్రియతే పునః,
రాజ్ఞో హి ధృతరాష్ట్రస్య సర్వం కార్యం ప్రియం మమ,
తథా దుర్యోధనస్యాపి స హి రాజ్యే సమాహితః. 32

మున్ను పగగొన్నవారితో-సజ్జనులే అయినను-మరల శాంతి చేకూరుట యెట్లు?

రాజైన ధృతరాష్ట్రుని పని యేదైనను నాకు ప్రియము. అట్లే దుర్యోధనుని పనియు ఇష్టము. అతడు గదా రాజ్యమున నిలద్రొక్కుకొన్నవాడు.

వైశమ్పాయన ఉవాచ - వైశంపాయను డిట్లు చెప్పెను.
కర్ణస్య తు వచః శ్రుత్వా భీష్మః శాన్తనవః పునః,
ధృతరాష్ట్రం మహారాజ సంభాష్యేదం వచోఽబ్రవీత్. 33

కర్ణు డాడిన మాట విని భీష్ముడు మరల ధృతరాష్ట్రుని సంబోధించి యిట్లు పలికెను.

యదయం కత్థతే నిత్యం హన్తాఽహం పాణ్డవా నితి,
నాయం కలాఽపి సంపూర్ణా పాణ్డవానాం మహాత్మనామ్. 34

---

32. స హి రాజ్యే సమాహితః-అతడు గదా రాజ్యమున నెలకొన్నవాడు-అనగా నాకు నీమాట యేటి లెక్క. ధృతరాష్ట్రునిదో, దుర్యోధనునిదో మాటను నేను పాటింతు నని భావము.

వీడు ప్రతిదినము పాండవులను చంపుదు నని బీరము లాడును. మహాత్ములగు పాండవుల కళకును నీతడు పోలడు.

అనయో యోఽయ మాగన్తా పుత్రాణాం తే దురాత్మనామ్,
తదస్య కర్మ జానీహి సూతపుత్రస్య దుర్మతేః. 35

చెడుబుద్ధిగల నీకొడుకులకు వచ్చిపడిన యీ కీడంతయు దుష్టబుద్ధి యగు ఈ సూతపుత్రుని పనియే యని యెరుగుము.

ఏత మాశ్రిత్య పుత్ర స్తే మన్దబుద్ధిః సుయోధనః,
అవామన్యత తాన్ వీరాన్ దేవపుత్రా నరిందమాన్. 36

బుద్ధిహీను డగు నీ కొడుకు వీనిని చేపట్టి, వీరులు - శత్రువుల రూపుమాపువారు, దేవతల యంశముతో జన్మించినవారు నగు ఆపాండవులను అవమానించెను.

కిం చాప్యేతేన తత్కర్మ కృతపూర్వం సుదుష్కరమ్,
తైర్యథా పాణ్డవైః సర్వై రేకైకేన కృతం పురా. 37

ఆ పాండవులు ఒక్కొక్కరు చేసిన ఘనకార్య మొక్కటిగాని యీతడు మున్ను చేసిన దేమి గలదు?

దృష్ట్వా విరాటనగరే భ్రాతరం నిహతం ప్రియమ్,
ధనఞ్జయేన విక్రమ్య కిమనేన తదా కృతమ్. 38

విరాటనగరమున తన ముద్దుతమ్ముడు అర్జునునిచేత చావగా నాడు వీడు విక్రమించి చేసిన దేమి?

స హి తాన్ హి కురూన్ సర్వా నభియాతో ధనఞ్జయః,
ప్రమథ్య చాచ్ఛిన ద్వాసః కిమయం ప్రోషిత స్తదా. 39

అర్జునుడు కౌరవుల నందరిని కట్టగట్టి చావగొట్టి తలగుడ్డలను కోసికొని పోయెను. నాడు వీ డచట లేడా యేమి?

గన్ధర్వై ర్ఘోషయాత్రాయాం హ్రియతే యత్సుత స్తవ,
క్వ తదా సూతపుత్రోఽభూ ద్య ఇదానీం వృషాయతే. 40

---

40. యత్ - యదా - ఎప్పుడైతే, వృషాయతే - ఎద్దువలె రంకెలు వేయుచున్నాడు.

గంధర్వులు ఘోషయాత్రలో నీ కొడుకును తోలుకొని పోయి నాడు ఈ సూతుని కొడు కెంచబోయెను? ఇప్పు డిచట రంకెలు వేయుచున్నాడు.

నను తత్రాపి భీమేన పార్థేన చ మహాత్మనా,
యమాభ్యామేవ సంగమ్య గన్ధర్వా స్తే పరాజితాః. 41

ఆ నాడు ఆ భీముడు, మహాత్ముడగు అర్జునుడు, నకులుసు కలిసియే కదా ఆ గంధర్వుల నోడించిరి.

ఏతా న్యస్య మృషోక్తాని బహూని భరతర్షభ,
వికత్థనస్య భద్రం తే సదా ధర్మార్థలోపినః. 42

రాజా! తన్ను తాను పొగడుకొను వీని అబద్ధపు కూత లివి. ఇందు ధర్మమును లేదు. అర్థమును లేదు. నీకు మేలగుగాక.

భీష్మస్య తు వచః శ్రుత్వా భారద్వాజో మహామనాః,
ధృతరాష్ట్ర ముహాచేదం రాజమధ్యేఽభిపూజయన్. 43

భీష్ముని మాట విని దొడ్డబుద్ధిగల ద్రోణుడు నిండు సభలో వానిని కొని యాడుచు ధృతరాష్ట్రునితో నిట్లు పలికెను.

య దాహ భరతశ్రేష్ఠో భీష్మ స్తత్క్రియతాం నృప,
న కామ మర్థలిప్సూనాం వచనం కర్తు మర్హసి. 44

రాజా! భరతవంశమున శ్రేష్ఠుడగు భీష్ముడు చెప్పినట్లు చేయుము. పరుల ధనమును కొల్లగొట్టువారి మాట బొత్తుగా పాటింపరాదు.

పురా యుద్ధాత్ సాధు మన్యే పాణ్డవైః సహ సఙ్గతమ్.

యుద్ధము కాకమున్నే పాండవులతో సంధి మంచిదని నా అభిప్రాయము.

యద్వాక్య మర్జునే నోక్తం సఞ్జయేన నివేదితమ్, 45
సర్వం తదపి జానామి కరిష్యతి చ పాణ్డవః,
న హ్యస్య త్రిషు లోకేషు సదృశోఽస్తి ధనుర్ధరః. 46

అర్జునుడు పలికినట్లు సంజయుడు చెప్పెనే అది యంతయు నే నెరుగుదును. ఆ పాండుకుమారుడు అంతయు చేయగలడు. వానితో సాటివచ్చు విలుకాడు మూడు లోకములందును లేడు.

అనాదృత్య తు తద్వాక్య మర్థవ ద్ద్రోణభీష్మయోః,
తతః స సఞ్జయం రాజా పర్యపృచ్ఛత పాణ్డవాన్. 47

ద్రోణభీష్ములు ప్రయోజనము కలుగునట్లు పలికిన ఆ పలుకులు పెడ చెవిని బెట్టి రాజు సంజయుని పాండవులనుగూర్చి యడుగజొచ్చెను.

తదైవ కురవ స్సర్వే నిరాశా జీవితేఽభవన్,
భీష్మద్రోణౌ యదా రాజా న సమ్య గనుభాషతే. 48

రా జెప్పుడు భీష్మద్రోణులతో చక్కగా పలుకక పాండవులనుగూర్చి యడిగెనో అప్పుడే కౌరవు లందరు బ్రదుకున ఆశలేనివారైరి.

ఇతి శ్రీమహాభారతే ఉద్యోగపర్వణి యానసంధిపర్వణి
భీష్మద్రోణవాక్యే ఊనపఞ్చాశ త్తమోఽధ్యాయః.

ఇది శ్రీమహాభారతము ఉద్యోగపర్వమున యానసంధిపర్వమున
భీష్మద్రోణులవాక్యముగల నలుబదితొమ్మిదవ అధ్యాయము.

—(౦)—

# పఞ్చాశత్తమోఽధ్యాయః
# ఏబదియవ అధ్యాయము

సఞ్జయేన యుధిష్ఠిరస్య ప్రముఖసహాయకానాం వర్ణనమ్-
సంజయుడు ధర్మరాజు ముఖ్యసహాయకులను వర్ణించుట.

ధృతరాష్ట్ర ఉవాచ - ధృతరాష్ట్రు డిట్లు పలికెను.

కిమసౌ పాణ్డవో రాజా ధర్మపుత్రోఽభ్యభాషత,
శ్రుత్వేహ బహులాః సేనాః ప్రీత్యర్థం నః సమాగతాః. 1

మా ప్రీతికొఱకు వచ్చిన పెక్కుసేనలను గూర్చి విని ఆ పాండుని కొడుకు ధర్మరా జేమి పలికెను?

కి మసౌ చేష్టతే సూత యోత్స్యమానో యుధిష్ఠిరః,
కే వాస్య భ్రాతృపుత్రాణాం పశ్యన్త్యాజ్ఞేప్సవో ముఖమ్. 2

సూతా! ఆ యుధిష్ఠిరుడు యుద్ధము చేయగోరుచు చేయు చేష్ట ఏమి? వాని తమ్ములయు, కొడుకులయు నాజ్ఞ పాటింపగోరుచు ముఖము చూచుచున్నవా రెవరు?

కే స్విదేనం వారయన్తి యుద్ధా చ్ఛామ్యేతి వా పునః,
నికృత్యాకోపితం మన్దై ర్ధర్మజ్ఞం ధర్మచారిణమ్. 3

శాంతి నొందుమని చెప్పుచు యుద్ధమునుండి యాతనిని మరలించువా రెవరు? ధర్మ మెరిగినవాడు ధర్మ మాచరించువాడు నగు ఆతనికి బుద్ధిలేనివారు పాపబుద్ధితో కోప మెక్కించుచున్నారు.

సఞ్జయ ఉవాచ - సంజయు డిట్లు చెప్పెను.

రాజ్ఞో ముఖ ముదీక్షన్తే పాఞ్చాలాః పాణ్డవైః సహ,
యుధిష్ఠిరస్య భద్రం తే స సర్వా ననుశాస్తి చ. 4

రాజా! నీకు మేలగుగాక! పాండవులతోపాటు ధర్మరాజు ఆజ్ఞకై ముఖము నందే దృష్టి నిలుపువారు పాంచాలురు. ఆ ధర్మజుడే అందరను శాసించు చున్నాడు.

పృథగ్భూతాః పాణ్డవానాం పాఞ్చాలానాం రథధ్వజాః,
ఆయాన్త మభినన్దన్తి కున్తీపుత్రం యుధిష్ఠిరమ్. 5

పాండవులయు పాంచాలురయు రథములవారు విడివిడిగా నేర్పడి యుద్ధమునకు వచ్చు ధర్మరాజును అభినందించుచున్నారు.

నభః సూర్య మివోద్యన్తం కౌన్తేయం దీప్తతేజసమ్,
పాఞ్చాలాః ప్రతినన్దన్తి తేజోరాశి మివోదితమ్. 6

ధర్మరాజు ధగధగలాడు తేజస్సుతో విరాజిల్లుచున్నాడు. వెలుగుముద్ద ఉదయించెనా అన్నట్లున్నాడు. మింట నుదయించు సూర్యునివలె నున్న యాతనిని చూచి పాంచాలురు పొంగిపోవుచున్నారు.

ఆగోపాలావిపాలాశ్చ నన్దమానా యుధిష్ఠిరమ్,
పాఞ్చాలాః కేకయా మత్స్యాః ప్రతినన్దన్తి పాణ్డవమ్. 7

గోవులను, గొఱ్ఱెలను కాచుకొనువారితోపాటు అందరు ధర్మరాజును మెచ్చుకొనుచున్నారు. పాంచాల, కేకయ, మత్స్యదేశమువారు పాండవుని ప్రీతితో మెచ్చుకొనుచున్నారు.

బ్రాహ్మణ్యో రాజపుత్ర్యశ్చ విశాం దుహితరశ్చ యాః,
క్రీడన్త్యోఽభిసమాయాన్తి పార్థం సంనద్ధ మీక్షితుమ్. 8

బ్రాహ్మణస్త్రీలు, రాజపుత్రికలు, వైశ్యుల కూతుండ్రు కేకింతలు కొట్టుచు, యుద్ధమునకు సిద్ధపడిన ధర్మరాజును చూచుటకు వచ్చుచున్నారు.

ధృతరాష్ట్ర ఉవాచ-ధృతరాష్ట్రు డిట్లు పలికెను.

సఞ్జయాచక్ష్వ యేనాస్మాన్ పాణ్డవా అభ్యయుఞ్జత,
ధృష్టద్యుమ్నస్య సైన్యేన సోమకానాం బలేన చ. 9

---

9. యేన - ఏ సహాయునితో. అస్మాన్-మమ్ములను గూర్చి, అభ్యయుఞ్జత - సిద్ధపడియున్నారు.

సంజయా! పాండవులు మనవారిని పరికించియు, ఎవరిని తోడుగొని సిద్ధపడిరో చెప్పు. ధృష్టద్యుమ్నుని సేన, ద్రుపదరాజుల బలము మాత్రమే కదా వారి కున్నది !

వైశమ్పాయన ఉవాచ-వైశంపాయను డిట్లు చెప్పెను.

గావల్గణిస్తు తత్ పృష్టః సభాయాం కురుసంసది,
నిఃశ్వసన్ సుభృశం దీర్ఘం ముహుః సఞ్చిన్తయ న్నివ. 10

కౌరవు లందరు కొలువుదీరి కూర్చున్న ఆ సభలో ధృతరాష్ట్రు డిట్లడుగగా సంజయుడు మిక్కిలి దీర్ఘముగా నిట్టూర్చుచు మరల చింతించుచుండెను.

తత్రానిమిత్తతో దైవాత్ సూతం కశ్మల మావిశత్,
తదాచచక్షే విదురః సభాయాం రాజసంసది. 11

అచట కారణము లేకయే దైవవశమున సంజయుడు మూర్ఛ పొందెను. రాజులు కొలువుదీరిన ఆ సభలో విదురు డిట్లు చెప్పదొడగెను.

సఞ్జయో௨యం మహారాజ మూర్ఛితః పతితో భువి,
వాచం న సృజతే కాఞ్చి ద్ధీనప్రజ్ఞో௨ల్పచేతనః. 12

"మహారాజా! ఇదిగో యీ సంజయుడు మూర్ఛ నొంది నేల వ్రాలెను. నోట మాట వచ్చుట లేదు. తెలివి సన్నగిల్లినది. ఒడలి కదలికయు తగ్గినది".

ధృతరాష్ట్ర ఉవాచ-ధృతరాష్ట్రు డిట్లు పలికెను.

అపశ్యత్ సఞ్జయో నూనం కున్తీపుత్రాన్ మహారథాన్,
తై రస్య పురుషవ్యాఘ్రై ర్భృశ ముద్వేజితం మనః. 13

సంజయుడు కుంతికొడుకులను నిక్కముగా మహారథు లని భావించెను. ఆ సింహమువంటి పురుషులు వీని గుండెను కుదిలించివైచిరి.

వైశమ్పాయన ఉవాచ-వైశంపాయను డిట్లు చెప్పెను.

సఞ్జయ శ్చేతనాం లబ్ధ్వా ప్రత్యాశ్వాస్యేద మబ్రవీత్,
ధృతరాష్ట్రమహారాజసభాయాం కురుసంసది. 14

---

10. కురుసంసది - కురువంశమువారు కొలువుదీరియున్న;

సంజయుడు మెల్లగా తెలివి నొంది, గుండె చిక్కబట్టుకొని ధృతరాష్ట్ర మహారాజు సభలో కౌరవులందరు నున్నచోట ఇట్లు పలికెను.

సఞ్జయ ఉవాచ-సంజయు డిట్లనెను.

దృష్టవా నస్మి రాజేన్ద్ర కున్తీపుత్రాన్ మహారథాన్,
మత్స్యరాజగృహావాసనిరోధే నావకర్శితాన్. 15

మహారాజా! విరటుని యింట గుట్టుగా నుండి క్రుంగి కృశించిన మహారథు లగు కుంతికొడుకులను చూచినాడను.

శృణు యైర్హి మహారాజ పాణ్డవా అభ్యయుఞ్జత,
ధృష్టద్యుమ్నేన వీరేణ యుద్ధే వ స్తేఽభ్యయుఞ్జత. 16

మహారాజా! విను! పాండవు లెవరిసాయముతో సన్నద్ధులైరో చెప్పెదను. వీరుడైన ధృష్టద్యుమ్నుని తోడుగొని మిమ్ముల నెదుర్కొన వారు సిద్ధముగా నున్నారు.

యో నైవ రోషా న్న భయా న్న లోభా న్నార్థకారణాత్,
న హేతువాదా ద్ధర్మాత్మా సత్యం జహ్యాత్ కదాచన. 17
యః ప్రమాణం మహారాజ ధర్మే ధర్మభృతాం వరః,
అజాతశత్రుణా తేన పాణ్డవా అభ్యయుఞ్జత. 18

రోషము, భయము, లోభము, ధనము, హేతువాదము అను వానివలన ఏ మహాత్ము డెన్నటికిని సత్యమును వీడడో, ధర్మవిషయమున ఎవడు ప్రమాణమో ధర్మ మాచరించువారిలో నెవడు శ్రేష్ఠుడో, అట్టి పగవాడు లేని ధర్మరాజు బాసటతో పాండవులు సన్నద్ధు లైరి.

యస్య బాహుబలే తుల్యః పృథివ్యాం నాస్తి కశ్చన,
యో వై సర్వాన్ మహీపాలాన్ వశే చక్రే ధనుర్ధరః. 19
యః కాశీనఙ్గమగధాన్ కళిఙ్గాంశ్చ యుధాఽజయత్,
తేన వో భీమసేనేన పాణ్డవా అభ్యయుఞ్జత.

16. వః - మిమ్ములను; తే - వారు, పాండవులు;

ఎవని భుజబలమునకు సాటి యగువాడు భూమిలో లేడో, ఏ విలుకాడు రాజు లందరను తనకు వశ మొనర్చుకొనెనో, కాశి, అంగ, మగధ, కళింగదేశములను పోరున జయించెనో, అట్టి భీమసేనుని చూచుకొని వారు మీతో పోరుటకు సిద్ధపడిరి.

యస్య వీర్యేణ సహసా చత్వారో భువి పాణ్డవాః, 20
నిఃసృత్య జతుగేహా ద్వై హిడిమ్బాత్ పురుషాదకాత్,
య శ్చైషా మభవ ద్ద్వీపః కున్తీపుత్రో వృకోదరః. 21

ఆతని బలముతో పాండవులు నలువురు లక్కయింటినుండి బయటపడిరి. నరులను తిను హిడింబుడు విజృంభించినపుడు ఈ వృకోదరుడే వారిని గట్టెక్కించెను.

యాజ్ఞసేనీ మథో యత్ర సిన్ధురాజోఽపకృష్టవాన్,
తత్రైషా మభవ ద్ద్వీపః కున్తీపుత్రో వృకోదరః. 22

సైంధవుడు ద్రౌపదిని చెరగొన్ననాడు ఈతడే వారికి అండ యాయెను.

యశ్చ తాన్ సఙ్గతాన్ సర్వాన్ పాణ్డవాన్ వారణావతే,
దహ్యతో మోచయామాస తేన వస్తేఽభ్యయుజ్ఞత. 23

వారణావతమున (లక్కయింట) కాలిపోనున్న పాండవులందరి నొక్కపెట్టున విడిపించిన భీమునితో వారు మీమీదికి ఎత్తివచ్చుచున్నారు.

కృష్ణాయాం చరతా ప్రీతిం యేన క్రోధవశాహతాః,
ప్రవిశ్య విషమం ఘోరం పర్వతం గన్ధమాదనమ్. 24

ద్రౌపదిసుందరి ప్రీతితో విహరించుచు నా వీరుడు ఘోరము, చొరశక్యము కానిని యగు గంధమాదనపర్వతము ప్రవేశించి క్రోధవశులైన గంధర్వులను పెక్కండ్రను చంపెను.

యస్య నాగాయుతై ర్వీర్యం భుజయోః సార మర్పితమ్,
తేన వో భీమసేనేన పాణ్డవా అభ్యయుజ్ఞత. 25

---

22. సిన్ధురాజః - జయద్రథుడు;

అతని భుజములందు వేయి యేనుగుల బలము కలదు. అట్టి భీమ సేనునితో మీపై పాండవు లెత్తి వత్తురు.

కృష్ణద్వితీయో విక్రమ్య తుష్ట్యర్థం జాతవేదసః,
అజయ ద్యః పురా వీరో యుధ్యమానం పురన్దరమ్. 26

అగ్నిదేవుని తృప్తిపరచుటకై కృష్ణుడు తోడుకాగా మును పే వీరుడు పోరుచున్న దేవేంద్రుని గెలిచెనో-

యః స సాక్షా న్మహాదేవం గిరిశం శూలపాణినమ్,
తోషయామాస యుద్ధేన దేవదేవ ముమాపతిమ్. 27

దేవదేవుడు, ఉమాపతి, శూలపాణి, గిరివాసియు నగు సాక్షాత్తు మహాదేవుని నెవడు యుద్ధమున ఆనందపరచెనో-

యశ్చ సర్వాన్ వశే చక్రే లోకపాలాన్ ధనుర్ధరః,
తేన వో విజయే నాజౌ పాణ్డవా అభ్యయుఙ్క్షత. 28

ఏ విలుకాడు లోకపాలుర నందరను వశపరచుకొనెనో యట్టి అర్జునునితో పాండవులు మీమీదికి ఎత్తివత్తురు.

యః ప్రతీచీం దిశం చక్రే వశే మ్లేచ్ఛగణాయుతామ్,
స తత్ర నకులో యోద్ధా చిత్రయోధీ వ్యవస్థితః. 29
తేన వో దర్శనీయేన వీరేణాతిధనుర్భృతా,
మాద్రీపుత్రేణ కౌరవ్య పాణ్డవా అభ్యయుఙ్క్షత. 30

మ్లేచ్ఛుల గణములు వేలకొలదిగా గల పడమటిదిక్కును వశపరచుకొనిన వీరుడు, చూడముచ్చట అయినవాడు, గొప్ప విలుకాడు నగు నకులునితో కూడి మీపై యుద్ధమునకు వారు సిద్ధముగా నున్నారు. ఆతడు చిత్రముగా పోరును. యుద్ధమున నిద్రాక్కుకొని యుండును.

యః కాశీనఙ్గమగధాన్ కళిఙ్గాంశ్చ యుధాజయత్,
తేన వః సహదేవేన పాణ్డవా అభ్యయుఙ్క్షత. 31

---

28. విజయేన-అర్జునునితో

కాశి, అంగ, మగధ, కళింగదేశములను పోరున గెలిచిన వీరుడు సహదేవునితో కూడి ఆ పాండవులు మీతో పోర తలపడిరి.

యస్య వీర్యేణ సదృశా శ్చత్వారో భువి మానవాః,
అశ్వత్థామా ధృష్టకేతూ రుక్మీ ప్రద్యుమ్న ఏవ చ. 32
తేన వః సహదేవేన యుద్ధం రాజన్ మహాత్యయమ్,
యవీయసా నృవీరేణ మాద్రీనన్దకరేణ చ. 33

పాండవుల చిన్నతమ్ముడు, మాద్రి ముద్దు కొడుకు నరులలో గొప్ప వీరుడు - ఆ సహదేవునకు - పరాక్రమమున సాటివచ్చు మానవులు భూమిలో నలువురే కలరు. అశ్వత్థామ, ధృష్టకేతువు, రుక్మి, ప్రద్యుమ్నుడు. అట్టి సహదేవునితో రాజా ! మీకు సర్వనాశము చేయు యుద్ధము వచ్చి పడినది.

తపశ్చచార యా ఘోరం కాశికన్యా పురా సతీ,
భీష్మస్య వధమిచ్ఛన్తీ ప్రేత్యాపి భరతర్షభ. 34
పాఞ్చాలస్య సుతా జజ్ఞే దైవాచ్చ స పునః పుమాన్,
స్త్రీపుంసోః పురుషవ్యాఘ్ర యః స వేద గుణాగుణాన్. 35

మున్ను కాశిరాజు కూతురు అంబ చచ్చియైనను భీష్ముని చావుకోరినదై ఘోరమైన తప మొనరించెను. ఆమె ద్రుపదుని యింట కూతురై పుట్టెను. దైవవశమున మరల మగవా డయ్యెను. అతనికి స్త్రీ పురుషుల గుణములు, దోషములు తెలియును.

యః కళిఙ్గాన్ సమాపేదే పాఞ్చాల్యో యుద్ధదుర్మదః,
శిఖణ్డినా వః కురవః కృతాస్త్రేణాభ్యయుఞ్జత. 36

ఆ పాంచాలరాజకుమారుడు యుద్ధమున విజృంభించి కళింగులను ఓడించెను. అస్త్రవిద్యలో ఆరితేరిన ఆ శిఖండిని తోడుగా గొని కౌరవులారా! పాండవులు యుద్ధమునకు నిశ్చయించిరి.

యం యక్షః పురుషం చక్రే భీష్మస్య నిధనేచ్ఛయా,
మహేష్వాసేన రౌద్రేణ పాణ్డవా అభ్యయుఞ్జత. 37

భీష్ముని చావు కోరియే యక్షుడా శిఖండిని మగవాని నొనర్చెను. అట్లు మహాశక్తి గొప్ప ధనువు గల శిఖండితో కూడి పాండవులు యుద్ధసన్నద్ధులైరి.

మహేష్వాసా రాజపుత్రా భ్రాతరః పఞ్చ కేకయాః,
ఆముక్తకవచాః శూరా స్తైశ్చ వస్తేఽభ్యయుఙ్క్షత. 38

గొప్ప ధనువులు, కవచములు ధరించిన కేకయరాజపుత్రులు అయిదుగు రన్నదమ్ములు కలరు. పాండవులు వారిని గొని యుద్ధమునకు దిగిరి.

యో దీర్ఘబాహుః క్షిప్రాస్త్రో ధృతిమాన్ సత్యవిక్రమః,
తేన వో వృష్ణివీరేణ యుయుధానేన సఙ్గరః. 39

పొడవైన చేతులు, బాణములు వేయుటలో వేగము, ధైర్యము నిజమైన పరాక్రమము - గల వృష్ణివంశపు వీరుడు యుయుధానునితో మీకు యుద్ధము సంఘటిల్లినది.

య ఆసీ చ్ఛరణం కాలే పాణ్డవానాం మహాత్మనామ్,
రణే తేన విరాటేన భవితా వః సమాగమః. 40

మహాత్ము లగు పాండవులకు ఆపదవేళ రక్షకు డైన విరాటునితో యుద్ధభూమిలో మీరు తలపడవలయును.

యః స కాశీపతీ రాజా వారణాస్యాం మహారథః,
స తేషా మభవ ద్యోద్ధా తేన వస్తేఽభ్యయుఙ్క్షత. 41

వారణాసీనగరమున మహారథు డైన కాశీరా జుండెనే అతడు వారి పక్షమున యుద్ధ మాడును. అతనితో కూడి వా రెత్తివత్తురు.

శిశుభి ర్దుర్జయైః సఙ్ఖ్యే ద్రౌపదేయై ర్మహాత్మభిః,
ఆశీవిషసమస్పర్శైః పాణ్డవా అభ్యయుఙ్క్షత. 42

ద్రౌపదీకొడుకులు పసివారు అయినను పండిన బుద్ధి గలవారు. యుద్ధమున వారి నెవ్వరు గెలువజాలరు. వారిని తాకుట త్రాచుపాముతో చెలగాటము వంటిది. అట్టివారిని గొని పాండవులు పోరికి సిద్ధమైరి.

యః కృష్ణసదృశో వీర్యే యుధిష్ఠిరసమో దయే,
తేనాభిమన్యునా సఙ్ఖ్యే పాణ్డవా అభ్యయుఙ్క్షత. 43

ఆ అభిమన్యుడు పౌరుషమున కృష్ణునకు, నెమ్మదితనమున ధర్మరాజునకు సాటి. అట్టి అభిమన్యుని తోడుగొని పాండవులు పోరునకు సిద్ధపడిరి.

యశ్చ వాప్రతిమో వీర్యే ధృష్టకేతు ర్మహాయశాః,
దుఃసహః సమరే క్రుద్ధః శైశుపాలి ర్మహారథః. 44
తేన వ శ్చేదిరాజేన పాణ్డవా అభ్యయుఞ్జత,
అక్షౌహిణ్యా పరివృతః పాణ్డవాన్యోఽభిసంశ్రితః. 45

బలమున సాటిలేనివాడు, గొప్పకీర్తిగలవాడు యుద్ధమున క్రుద్ధుడైనచో ఎవరికిని సహింప నలవికానివాడు, మహారథుడు, చేదిరాజు నగు శిశుపాలుని కొడుకు ధృష్టకేతువు కలడే అతడు తోడు రాగా పాండవులు మీతో పోరికి సిద్ధమైరి. ఆతడు ఒక అక్షౌహిణిసేనతో పాండవులను చేరుకొనెను.

యః సంశ్రయః పాణ్డవానాం దేవానా మివ వాసవః,
తేన వో వాసుదేవేన పాణ్డవా అభ్యయుఞ్జత. 46

దేవతల కింద్రునివలె పాండవులకు దిక్కైనవాడు వాసుదేవుడు. అతనితో గూడి పాండవులు మిమ్ముల నెదుర్కొందురు.

తథా చేదిపతేర్భ్రాతా శరభో భరతర్షభ,
కరకర్షేణ సహిత స్తాభ్యాం వ స్తేఽభ్యయుఞ్జత. 47

రాజా! చేదిపతి తమ్ముడు శరభుడు తన తమ్ముడగు కరకర్షునితో గూడి ధర్మజునకు తోడయ్యెను. వారితో గూడి పాండవులు మిమ్ముల నెదుర్కొందురు.

జారాసన్ధిః సహదేవో జయత్సేనశ్చ తా వుభౌ,
యుద్ధేఽప్రతిరథౌ వీరౌ పాణ్డవార్థే వ్యవస్థితౌ. 48

జరాసంధుని కొడుకు సహదేవుడు, మఱియు జయత్సేనుడు అను నీ యిరువురు యుద్ధమున నెదురులేని వీరులు. వారు పాండవులకై సిద్ధముగా నున్నారు.

---

44. శైశుపాలిః - శిశుపాలుని కుమారుడు;
47. కరకర్షేణ - కరకర్షు డను పేరుగల్గి శరభుని తమ్ముడు;

ద్రుపదశ్చ మహాతేజా బలేన మహతా వృతః,
త్యక్తాత్మా పాణ్డవార్థాయ యోత్స్యమానో వ్యవస్థితః. 49

మహాతేజశ్శాలి ద్రుపదుడు గొప్పసేనతో కూడి పాండవులకై దేహ మర్పించి యుద్ధ మాడగోరుచు నిలిచియున్నాడు.

ఏతే చాన్యే చ బహవః ప్రాచ్యోదీచ్యా మహీక్షితః,
శతశో యా నుపాశ్రిత్య ధర్మరాజో వ్యవస్థితః. 50

వీరును, ఇంకను చాలమంది తూర్పుదేశపు, ఉత్తరదేశపు రాజులు గలరు. ధర్మజుడు వందలకొలదిగా నున్న ఆ రాజులను అండగా గొని యుద్ధమునకు నిలిచియున్నారు.

ఇతి శ్రీ మహాభారతే ఉద్యోగపర్వణి యానసంధిపర్వణి
సఞ్జయవాక్యే పఞ్చాశత్తమోఽధ్యాయః.

ఇది శ్రీ మహాభారతము ఉద్యోగపర్వమున యానసంధిపర్వమున
సంజయవాక్యము గల ఏబదియవ అధ్యాయము.

—(౦)—

49. త్యక్తాత్మా - విడచిన దేహము గలవాడు - అనగా యుద్ధమున చచ్చుట కైన సిద్ధపడినవాడు - యని భావము.

# అథ ఏకపఞ్చాశత్తమోఽధ్యాయః
# ఏబది యొకటవ అధ్యాయము.

భీమపరాక్రమస్య భీమస్యానుస్మరణేన ధృతరాష్ట్రస్య పరిదేవనమ్.

భీముని పరాక్రమము, భీముడు మదిలో మెదలుచుండగా ధృతరాష్ట్రుడు దుఃఖించుట.

ధృతరాష్ట్ర ఉవాచ-ధృతరాష్ట్రు డిట్లు పలికెను.

సర్వే ఏతే మహోత్సాహా యే త్వయా పరికీర్తితాః,
ఏకత స్త్వేవ తే సర్వే సమేతా భీమ ఏకతః. 1

నీవు వర్ణించిన వీ రందరకు గొప్ప ఉత్సాహము గలదు. కాని వీరందరు కలసి ఒక యెత్తు. ఆ భీము డొక యెత్తు.

భీమసేనాద్ధి మే భూయో భయం సఞ్జాయతే మహత్,
క్రుద్ధా దమర్షణా త్తాత వ్యాఘ్రాదివ మహారురోః. 2

సహింపశక్యము కాని కోపముతో చెలరేగిన పులివలన పెద్దిలేడి కెట్లు భయము పుట్టునో యట్టి పెనుభయము భీమసేనునివలన నాకు మాటిమాటికి కలుగుచున్నది.

జాగర్మి రాత్రయః సర్వా దీర్ఘ ముష్ణం చ నిఃశ్వసన్,
భీతో వృకోదరా త్తాత సింహాత్ పశురివాపరః. 3

సింహమును చూచి బెదిరిన పశువువలె వృకోదరునివలన భయపడి నిట్టూర్పులు పుచ్చుచు అన్నిరాత్రులు నిద్రపోంచకున్నాను.

న హి తస్య మహాబాహోః శక్రప్రతిమతేజసః,
సైన్యేఽస్మిన్ ప్రతిపశ్యామి య ఏనం విషహే ద్యుధి. 4

---

౨. మహారురోః - పెద్దమృగమునకు -, లేడికి;

ఇంద్రుని వంటి తేజస్సుగల ఆ మహాబాహువునకు యుద్ధమున ఎదురు నిలిచి తట్టుకొనువా డెవ్వడు ఈ సేనలో నాకు కానరాడు.

అమర్షణశ్చ కౌన్తేయో దృఢవైరశ్చ పాణ్డవః,
అనర్మహాసీ సోన్మాద స్తిర్యక్ప్రేక్షీ మహాస్వనః. 5

ఆ కుంతీపుత్రునికి పగలని పగ. తీవ్ర స్వభావము. వెకిలినవ్వులు నవ్వడు, తిక్కమానిసి. అడ్డచూపులు చూచును. పెద్దగా అరచును.

మహావేగో మహోత్సాహో మహాబాహు ర్మహాబలః,
మన్దానాం మమ పుత్త్రాణాం యుద్ధే నాన్తం కరిష్యతి. 6

తీవ్రవేగము, పొంగు గలవాడు, మహాబాహువు, మహాబలుడు నగు ఆ భీముడు బుద్ధిలేని నాకొడుకులను యుద్ధమున నాశము చేయును.

ఉరుగ్రాహగృహీతానాం గదాం బిభ్ర ద్వృకోదరః,
కురూణా మృషభో యుద్ధే దణ్డపాణి రివాన్తకః. 7

తోడేలు పొట్టవంటి పొట్టగల ఆ పోటుమానిసి దండము చేతబట్టిన యమునివలె పెద్దఉచ్చులో చిక్కిన కౌరవులను గదగొని చావమోదును.

అష్టాశ్రిమాయసీం ఘోరాం గదాం కాఞ్చనభూషణామ్,
మనసాఽహం ప్రపశ్యామి బ్రహ్మదణ్డ మివోద్యతమ్. 8

ఎనిమిది కోణములు, బంగారు తొడవులు గల ఘోరమైన ఎత్తిపట్టిన బ్రహ్మదండమువంటి ఉక్కుగద నామదిలో ఎప్పుడు మెదలుచున్నది.

యథా మృగాణాం యుద్ధేషు సింహో జాతబల శ్చరేత్,
మామకేషు తథా భీమో బలేషు విచరిష్యతి. 9

బలము పుంజుకొన్న సింహము లేళ్ళత్రొక్కిసలాటలో ఎట్లు విచ్చలవిడిగా తిరుగునో భీముడట్లు నాసేనలలో విహరించును.

---

5. అనర్మహాసీ - వ్యర్థముగా నవ్వనివాడు - చెప్పినది చేసి పగవానిని పరిహసించు నని భావము.

6. ఉరుగ్రాహగృహీతానామ్ - పెద్దఉచ్చులో చిక్కుకొన్నవారిని; భీముడు గదతో మోదునపుడు తప్పించుకొనుటకు శక్యముకా దని భావము.

సర్వేషాం మమ పుత్రాణాం స ఏకః క్రూరవిక్రమః,
బహ్వాశీ విప్రతీపశ్చ బాల్యేఽపి రభసః సదా. 10

పసితనమునుండియు వా డొక్కడు నాకొడుకు లందరకు ఎదురుచుక్క. వానిది క్రూరమైన విజృంభణము. తిండిపోతు. వానివి ఎల్లప్పుడు తీవ్రమైన పోకడ.

ఉద్వేపతే మే హృదయం యే మే దుర్యోధనాదయః,
బాల్యేన తేఽపి యుధ్యన్తో వారణేనేవ మర్దితాః. 11

ఈ నా దుర్యోధనుడు మొదలగువారిని పసితనమునందు పోరుచున్నపుడు ఈతడు ఏనుగువలె మట్టగించెను. అది తలచిన నా గుండె మిక్కిలి వణకిపోవుచున్నది.

తస్య వీర్యేణ సంక్లిష్టా నిత్యమేవ సుతా మమ,
స ఏవ హేతు ర్భేదస్య భీమో భీమపరాక్రమః. 12

నా కొడుకులు ప్రతిదినము వాని శక్తితో పలుపాట్లు పడిరి. భయంకరమగు పరాక్రమముగల ఆ భీముడే ఈ విరోధమునకు కారణము.

గ్రసమాన మనీకాని నరవారణవాజినామ్,
పశ్యామీ వాగ్రతో భీమం క్రోధమూర్ఛిత మాహవే. 13

నరులయు (కాల్బలము వారియొక్కయు) ఏనుగులయు, గుఱ్ఱములయు సేనలను క్రోధముతో ఒడలెరుగక యుద్ధభూమిలో నాకన్నులయెదుట మ్రింగుచున్నట్లున్న భీముడు నాకు గానవచ్చుచున్నాడు.

అస్త్రే ద్రోణార్జునసమం వాయువేగసమం జవే,
మహేశ్వరసమం క్రోధే కో హన్యా ద్భీమ మాహవే, 14
సఞ్జయాచక్ష్వ మే శూరం భీమసేన మమర్షణమ్.

సంజయా! శూరుడు, భయంకరమగు సేన కలవాడు, అతితీక్ష్ణుడు, అస్త్రవిద్యలో ద్రోణార్జునులకు దీటైనవాడు, విరుచుకొని పడుటలో వాయువేగముతో సాటియైనవాడు, క్రోధమున రుద్రునితో సమానుడు అయిన భీముని యుద్ధమున కొట్టగల వా డెవ్వడు?

అతిలాభం తు మన్యేఽహం యత్తేన రిపుఘాతినా, 15
తదైవ న హతాః సర్వే మమ పుత్రా మనస్వినా.

యేన భీమబలా యక్షా రాక్షసాశ్చ పురా హతాః, 16
కథం తస్య రణే వేగం మానుషః ప్రసహిష్యతి.

ఆనాడు ఘోషయాత్రలో భయంకరబలముగల యక్షులను, రాక్షసులను మట్టుపెట్టిన ఆ శత్రుమర్దనుడు, ఆ కోపిష్ఠి నా కొడుకు లందరిని చంపలేదు. అదియే గొప్పలాభ మని తలంతును. అట్టివాని ధాటికి మానవుడెట్లు తట్టుకొనును?

న స జాతు వశే తస్థౌ మమ బాల్యేఽపి సఞ్జయ, 17
కిం పున ర్మమ దుష్పుత్రైః క్లిష్టః సంప్రతి పాణ్డవః

వాడు చిన్ననాడే, యెక్కనాడును నా అదుపులో లేడు. ఇప్పుడు దుష్టులగు నాకొడుకులు మరియు బాధించిరి. ఇక చెప్పనేల?

నిష్ఠురో రోషణోఽత్యర్థం భజ్యేతాపి న సంనమేత్,
తిర్యక్ప్రేక్షీ సంహతభ్రూః కథం శామ్యే ద్వృకోదరః. 18

మొదలే పెడసరమువాడు. పైని మిక్కిలి కోపముతో నున్నాడు. విరుగునే గాని వంగడు. అడ్డచూపులు, ముడివడిన కనుబొమలు గల వృకోదరుడు శాంతి నొందుట యెట్లు?

శూర స్తథాప్రతిబలో గౌర స్తాల ఇవోన్నతః,
ప్రమాణతో భీమసేనః ప్రాదేశే నాధికోఽర్జునాత్. 19

శూరుడు, ఎదురులేనివాడు; తెల్లనివన్నె కలవాడు. తాటిచెట్టంత పొడగరి. అర్జునునికంటె పొడవులో పండ్రెండంగుళములు ఎక్కువవాడా భీముడు.

---

18. తిర్యక్ప్రేక్షీ-అడ్డముగా చూచువాడు - సూటిగా చూడడు - ఎదిరివానిలో దోషములే వెదకునని తాత్పర్యము; సంహతభ్రూః-రెండు కనుబొమలు కలిసినవాడు. అనగా కోపముతో ముడివడిన కనుబొమలు కలవాడని భావము.

19. ప్రాదేశేన-పండ్రెండంగుళముల కొలతచేత;

జవేన వాజినోఽత్యేతి బలే నాత్యేతి కుఞ్జరాన్,
అవ్యక్తజల్పీ మధ్వక్షో మధ్యమః పాణ్డవో బలీ. 20

వడిలో గుఱ్ఱములను, బలమున ఏనుగులను మించును. తెలియరాకుండ గొణుగుచుండును. తేనెవంటి కన్నులు, గొప్పబలము గలవాడా పాండవమధ్యముడు.

ఇతి బాల్యే శ్రుతః పూర్వం మయా వ్యాసముఖాత్ పురా,
రూపతో వీర్యతశ్చైవ యాథాతథ్యేన పాణ్డవః. 21

ఇట్లని నేను మున్ను వీని చిన్ననాడు వ్యాసునినోట గట్టిగా వినియుంటిని. రూపమున, వీర్యమున ఆ పాండుని కొడుకు నిక్కముగా నట్టివాడే.

ఆయసేన చ దణ్డేన రథా న్నాగా న్నరాన్ హయాన్,
హనిష్యతి రణే క్రుద్ధో రౌద్రః క్రూరపరాక్రమః. 22

యుద్ధమున క్రుద్ధుడై క్రూరమగు పరాక్రమము, భయంకర మగు విజృంభణము గల యీ భీముడు, రథములను, ఏనుగులను, నరులను, గుఱ్ఱములను ఇనుపగుదియతో చావగొట్టును.

అమర్షీ నిత్యసంరబ్ధో భీమః ప్రహరతాం వరః,
మయా తాత ప్రతీపాని కుర్వన్ పూర్వం విమానితః. 23

తీవ్రకోపము గలవాడు, ఎల్లవేళల కుతకుత లాడుచుండును. పోటుగాండ్రలో మేటి. అట్టి భీముని, నాయనా! సంజయా! మునుపు అడ్డదిడ్డపు పనులు చేసి అవమానించితిని.

నిష్కర్ణా మాయసీం స్థూలాం సుపార్శ్వాం కాఞ్చనీం గదామ్,
శతఘ్నీం శతనిర్హ్రాదాం కథం శక్ష్యన్తి మే సుతాః. 24

---

21. పురా-సమీపమున లేక చాల గట్టిగా, పూర్వము వీనినిగూర్చి వ్యాసుడీమాటలు నాకడ (లేదా) గట్టిగా చెప్పెనని భావము - 'పురా పురాణే ఽతిధృఢే' అని మేదినీకోశము'. 'పురా భావిపురాణయోః, ప్రబన్ధే నికటే ఽతీతే' అని విశ్వలోచనము;

24. నిష్కర్ణామ్ - వంకరలు లేనిది - గురితప్పని దని భావము; శతనిర్హ్రాదాం - పెనుమ్రోత గలది;

వంకరలు లేనిది, బరువైనది, చక్కని ప్రక్కభాగములు కలది, నూర్ల కొలదిగా వీరులను చంపునది, నూరు పిడుగుల మ్రోతగలదియు నగు వాని బంగారుపూతగల ఉక్కుగదను, అయ్యో! నా కొడుకు లెట్లు తాళగలరు?

అపార మప్లవాగాధం సముద్రం శరవేధనమ్,
భీమసేనమయం దుర్గం తాత మన్దా స్తితీర్షవః. 25

అంతులేనిది, దాటరానిది, లోతు తెలియనిది, బాణముల పోట్లుగలదియు నగు భీమసేనమయమగు సముద్రమును, బాబూ! ఈ తెలివితక్కువవారు దాట గోరుచున్నారు.

క్రోశతో మే న శృణ్వన్తి బాలాః పణ్డితమానినః,
విషమం న హి మన్యన్తే ప్రపాతం మధుదర్శినః. 26

నేను మొత్తుకొనుచుండగా వినరు. చిఱుతవారయ్యు గొప్పతెలివిగలవార మని విఱ్ఱవీగుదురు. తేనెను గాంచి పెనులోయలో దుముకు తెలివిమాలినవారు నా కొడుకులు.

సంయుగం యే గమిష్యన్తి నరరూపేణ మృత్యునా,
నియతం చోదితా ధాత్రా సింహేనేవ మహామృగాః. 27

సింహముతో తలపడిన పెనుమెకములవలె, బ్రహ్మ తోలుచుండగా, నర రూపములో నున్న మృత్యువుతో ఈ దుష్టులు పోరి కరుగుదురు.

శైక్యాం తాత చతుష్కిష్కుం షడస్రి మమితౌజసమ్,
ప్రహితాం దుఃఖసంస్పర్శాం కథం శక్ష్యన్తి మే సుతాః. 28

ఆరుఅంచులు, గొప్పశక్తి గలదియు, తాకినంతనే తీవ్రవేదన కలిగించునదియు, చిక్కమున వ్రేలుచున్నదియు, నాలుగుమూరలు గలదియు నగు ఆ గదను నాకొడుకు లెట్లు సహింతురు నాయనా!

---

25. అప్లవ - అగాధమ్ - దాటరానిది, లోతు తెలియనిది; శరవేధనమ్ - బాణపుములుకుల పోట్లు గలది; తితీర్షవః - దాటగోరుచున్నవారు;

28. శైక్యామ్ - చిక్కమునం దున్నదానిని - క్రిందపడినచో భూమిపగులునను శంకతో భీముడు తన గద నొక చిక్కమున గట్టి యుంచు నని భావము.

గదాం భ్రామయత స్తస్య భిన్దతో హస్తిమస్తకాన్,
సృక్కిణీ లేలిహానస్య బాష్ప ముత్సృజతో ముహుః. 29

గదను త్రిప్పుచు, ఏనుగుతలలను పగులగొట్టుచు పెదవి అంచులు నాకుచు, ఆనందబాష్పములు మాటిమాటికి వదలుచు ఉన్నవాడు......

ఉద్దిశ్య నాగాన్ పతతః కుర్వతో భైరవా న్రవాన్,
ప్రతీపం పతతో మత్తాన్ కుఞ్జరాన్ ప్రతి గర్జతః. 30

ఏనుగుల వెంటబడి దరుముచు, భయంకరధ్వనులను చేయుచు, ఎదురు వచ్చు ఏనుగులపైకి బొబ్బలు పెట్టుచు దుముకువాడు......

విగాహ్య రథమార్గేషు వరా నుద్దిశ్య నిఘ్నతః,
అగ్నేః ప్రజ్వలితస్యేవ అపి ముచ్యేత మే ప్రజాః. 31

శ్రేష్ఠులను చంప నుంకించి రథమార్గములలో చొరబడి మండుచున్న మంటవలె విజృంభించువాడు నగు భీముని దెబ్బనుండి నాబిడ్డలు తప్పించుకొనగలరా?

వీథీం కుర్వన్ మహాబాహు ర్ద్రావయన్ మమ వాహినీమ్,
నృత్య న్నివ గదాపాణి ర్యుగాన్తం దర్శయిష్యతి. 32

ఆ పొడవుచేతులవాడు, గద చేతగొన్నవాడై దారి చేసికొనుచు, నా సేనను తరిమికొట్టుచు, తైతక్కలాడుచు ప్రళయకాలమును చూపగలడు.

ప్రభిన్న ఇవ మాతఙ్గః ప్రభఞ్జన్ పుష్పితాన్ ద్రుమాన్,
ప్రవేక్ష్యతి రణే సేనాం పుత్రాణాం మే వృకోదరః. 33

మదముతో చిట్లిన ఏనుగు బాగుగా పూచిన చెట్లను విరుగబొడుచునట్టు ఆ తోడేలుపొట్టవాడు నా కొడుకుల సేనలో ప్రవేశించును.

కుర్వన్ రథాన్ విపురుషాన్ విసారథిహయధ్వజాన్,
ఆరుజన్ పురుషవ్యాఘ్రో రథినః సాదిన స్తథా. 34
గఙ్గావేగ ఇవానూపాం స్తీరజాన్ వివిధాన్ ద్రుమాన్,
ప్రభఙ్ క్ష్యతి రణే సేనాం పుత్రాణాం మమ సఞ్జయ. 35

సంజయా! రథములందు వీరులను, సారథులను, గుఱ్ఱములను, టెక్కెము లను రాలగొట్టుచు పులివంటి ఆ పురుషుడు రథికులను, సారథులను, నుగ్గు నూచగా గొట్టుచు, గంగవేగము నీటితో నిండిన చోటులందలి చెట్లను, ఒడ్డు లందలి చెట్లను కూల్చునట్లు నా కొడుకుల సేనను కూలద్రోయును.

దిశో నూనం గమిష్యన్తి భీమసేనభయార్దితాః,
మమ పుత్రాశ్చ భృత్యాశ్చ రాజానశ్చైవ సఞ్జయ. 36

సంజయా! నాకొడుకులు, సేవకులు, రాజులు, భీమసేనుని చూచిన భయముతో గుండెలదరి దిక్కులకు పారుదురు. ఇది నిక్కము.

యేన రాజా మహావీర్యః ప్రవిశ్యాన్తఃపురం పురా,
వాసుదేవసహాయేన జరాసంధో నిపాతితః. 37

మును వీతడు వాసుదేవునితో కూడి అంతఃపురము సొచ్చి మహాబలశాలి యగు జరాసంధుని నేల గూల్చెను.

కృత్స్నేయం పృథివీ దేవీ జరాసన్ధేన ధీమతా,
మాగధేన్ద్రేణ బలినా వశే కృత్వా ప్రతాపితా. 38

తెలివి, బలము మిన్నగా గల ఆ మగధరాజు జరాసంధుడు ఈ భూదేవి నంతటిని తన వశము చేసికొని ప్రతాపము చూపెను.

భీష్మప్రతాపాత్ కురవో నయే నాన్ధకవృష్ణయః,
య న్న తస్య వశే జగ్ముః కేవలం దైవమేవ తత్. 39

భీష్ముని ప్రతాపమువలన కౌరవులు, నీతిబలముతో అంధకవృష్ణివంశ ములవారు ఆ జరాసంధునకు లొంగలే దన్నచో అది కేవలము అదృష్టమే.

స గత్వా పాణ్డుపుత్రేణ తరసా బాహుశాలినా,
అనాయుధేన వీరేణ నిహతః కిం తతోఽధికమ్. 40

అట్టి జరాసంధుడు గొప్ప భుజబలము గలవాడును, ఆయుధము లేని వాడును అగు వీరుడైన పాండుపుత్రునిచేత మడిసెను. దానిని మించి చెప్పెడిదేమి?

దీర్ఘకాలసమాసక్తం విష మాశీవిషో యథా,
స మోక్ష్యతి రణే తేజః పుత్రేషు మమ సఞ్జయ. 41

సంజయా! బహుకాలము కూడబెట్టిన విషమును క్రాచుపాము వెడల గ్రక్కునట్లు ఆ భీముడు నా కొడుకులయందు తన వాడిమిని క్రుమ్మరించును.

మహేన్ద్ర ఇవ వజ్రేణ దానవాన్ దేవసత్తమః,
భీమసేనో గదాపాణిః సూదయిష్యతి మే సుతాన్. 42

దేవతలలో గొప్పవాడగు మహేంద్రుడు వజ్రముతో రాక్షసులను రూపుమాపినట్లు గద చేత బట్టిన భీమసేనుడు నాకొడుకులను రూపుమాపును.

అవిషహ్య మనావార్యం తీవ్రవేగపరాక్రమమ్,
పశ్యామి వాతితామ్రాక్ష మాపతన్తం వృకోదరమ్. 43

తట్టుకొనరానివాడు, అప నలవికానివాడు, తీవ్రమైన వేగము, పరాక్రమము గలవాడు, చంద్రనిప్పులవంటి కన్నులు కలవాడు, మీదికి దుముకుచున్నవాడు నగు భీముడు, నా కనులలో ఆడుచున్నట్లే యున్నది.

అగదస్యా ప్యధనుషో విరథస్య వివర్మణః,
బాహుభ్యాం యుధ్యమానస్య కస్తిష్ఠే దగ్రతః పుమాన్. 44

గద, విల్లు, రథము, కవచము లేకయే, చేతులతో పోరాడు ఆ భీముని ముందు నిలువగల మగవా డెవ్వడు?

భీష్మో ద్రోణశ్చ విప్రోఽయం కృపః శారద్వత స్తథా,
జానన్త్యేతే యథైవాహం వీర్యజ్ఞ స్తస్య ధీమతః. 45

భీష్ముడు, ఈ విప్రుడు ద్రోణుడు, శరద్వంతుని కుమారుడు కృపుడును, నే నెట్లాతని శక్తి నెరుగుదునో యట్లెరుగుదురు.

ఆర్యవ్రతం తు జానన్తః సఙ్గరాన్తం విధిత్సవః,
సేనాముఖేషు స్థాస్యన్తి మామకానాం నరర్షభాః. 46

---

46. ఆర్యవ్రతమ్-ఆర్యుల వ్రతము - యుద్ధము వచ్చినపుడు జంకుగొంకులు లేక నిలుచుట వంటిది; సంగర-అన్తమ్-యుద్ధమున తమ నాశమును - చావును; విధిత్సవః-చేయగోరువారై - అట్లగుట ఉత్తమక్షత్రియధర్మము కనుక; భీష్మాదులకు భీముని పరాక్రమము తెలియును. తాము చత్తుమనియు నెరుగుదురు. అయినను, క్షత్రియధర్మము నవలంబించి సేనముందు నిలుతురే గాని గెలుతు మను నమ్మకముతో కాదని భావము;

నా వారిలో ఉత్తమశక్తిగల వీరందరు ఆర్యుల ప్రవృత్తి నెరిగినవా రగుచు యుద్ధమున చావు పొందగోరువారై సేనల ముందుభాగములందు నిలుతురు.

బలీయః సర్వతో దిష్టం పురుషస్య విశేషతః,
పశ్యన్నపి జయం తేషాం న నియచ్ఛామి యత్సుతాన్. 47

అన్నియెడల దైవమే బలీయము. నరుని విషయమున అది మరియు సత్యము. ఎట్లన, ఆపాండవుల జయము చూచుచుండియు నేను నాకొడుకులను అదుపులో పెట్టకున్నాను.

తే పురాణం మహేష్వాసా మార్గ మైన్ద్రం సమాస్థితాః,
త్యక్ష్యన్తి తుములే ప్రాణాన్ రక్షన్తః పార్థివం యశః. 48

గొప్ప విలుకాండ్రగు ఆపాండవులు పురాతనమగు స్వర్గమార్గమున నెల కొన్నవారై రాజులదైన కీర్తిని కాపాడుకొనుచు యుద్ధమున ప్రాణములనైన వదలుదురు.

యథైషాం మామకా స్తాత తథైషాం పాణ్డవా అపి,
పౌత్రా భీష్మస్య శిష్యాశ్చ ద్రోణస్య చ కృపస్య చ. 49

ఈః నా వా రెట్లో ఆపాండవులును అట్లే. భీష్మునకు మనుమలు, ద్రోణునకు కృపునకు శిష్యులు.

యే త్వస్మదాశ్రయం కిఞ్చి ద్దత్తమిష్టం చ సఞ్జయ,
తస్యాపచితి మార్యత్వాత్ కర్తారః స్థవిరా స్త్రయః. 50

వారు మమ్ముల నాశ్రయించియుండిరి. వారి కిష్టమైనది ఒసగితిమి. సజ్జనులు కనుక ఈ ముప్వురు దానికి బదులుచేయువారై (మనవైపు) ఉన్నారు.

ఆదదానస్య శస్త్రం హి క్షత్రధర్మం పరీప్సతః,
నిధనం క్షత్రియ స్యాజౌ వర మేవాహు రుత్తమమ్. 51

---

48. ఐన్ద్రమ్-మార్గమ్-ఇంద్రసంబంధమైన మార్గమును - స్వల్పమార్గమును;
50. అపచితమ్-బదులు తీర్చుకొనుటను;

శస్త్రము చేపట్టినవాడును, క్షత్రధర్మమును పాటింపగోరువాడును నగు క్షత్రియునకు యుద్ధమున మరణమే మేలైనది, కోరదగినది యందురు.

స వై శోచామి సర్వాన్ వై యే యుయుత్సన్తి పాణ్డవైః,
విక్రుష్టం విదురేణాదౌ తదేత ద్భయమాగతమ్. 52

పాండవులతో తలపడుచున్న వా రందరినిగూర్చి ఆ నేను యేడ్చు చున్నాను. విదురుడు మున్నే మొత్తుకొన్న భయము దాపురించినది.

న తు మన్యే విఘాతాయ జ్ఞానం దుఃఖస్య సఞ్జయ,
భవత్యతిబలం హ్యేతత్ జ్ఞానస్యాప్యుపఘాతకమ్. 53

సంజయా! జ్ఞానము దుఃఖమును రూపుమాపునని నా కనిపింపదు. దుఃఖమే జ్ఞనమును రూపుమాపు శక్తికలదని నా భావన.

ఋషయో హ్యపి నిర్ముక్తాః పశ్యన్తో లోకసంగ్రహాన్,
సుఖై ర్భవన్తి సుఖిన స్తథా దుఃఖేన దుఃఖితాః. 54

బ్రదికి యుండియు ముక్తులైన ఋషులు కూడ లోకము తీరులను గమనించుచు, సుఖములతో సుఖము కలవారు, దుఃఖముతో దుఃఖము పొందువారు నగుచున్నారు.

కింపున ర్మోహ మాసక్త స్తత్ర తత్ర సహస్రథా,
పుత్రేషు రాజ్యదారేషు పౌత్రేష్వపి చ బన్ధుషు. 55

కొడుకులు, రాజ్యము, భార్యలు, మనుమలు, బంధువులు మున్నగు వారి యందు వేలకొలది తీరులలో మోహమున తగుల్కొన్నవాని సంగతి చెప్పనేల?

---

53. ఏతత్-రాబోవు దుఃఖము; అతిబలమ్-జ్ఞానమును మించిన బలముగలది; జ్ఞానమువలన అపరానిదని భావము,

54. నిర్ముక్తాః- జీవన్ముక్తులు - బ్రదికి యుండియు మోక్షస్థితిని సాధించిన వారు ;

55. క్షమమ్ - చేయజాలినది; ఉత్తరమ్ - ఇటుపై చేయదగినది - నివారణోపాయ మని భావము.

సంశయే తు మహత్యస్మిన్ కిం ను మే క్షమ ముత్తరమ్,
వినాశం హ్యేవ పశ్యామి కురూణా మనుచిన్తయన్. 56

ఈ పెనుసంశయమున నేను చేయు ప్రతిక్రియ యెట్టిది? ఎంతగా చింతించినను కౌరవుల సర్వనాశమే నాకు గోచరించుచున్నది.

ద్యూతప్రముఖ మాభాతి కురూణాం వ్యసనం మహత్,
మన్దే నైశ్వర్యకామేన లోభాత్ పాపమిదం కృతమ్. 57

జూదము మొదలుగా కౌరవులకు పెను భయము కల్గెనని తోచుచున్నది. బుద్ధి లేనివాడు, సంపదకై అంగ లార్చువాడు నగు నా కొడుకు లోభము వలన ఈ పాపము గావించెను.

మన్యే పర్యాయధర్మోఽయం కాల స్యాత్యన్తగామినః,
చక్రే ప్రధి రివాసక్తో నాస్య శక్యం పలాయితుమ్ 58

ఇది తప్పక ప్రవర్తించు కాలముయొక్క విపరీతధర్మము కాబోలు; చక్రమున తగుల్కొన్న పట్టావలె కాలమునకు వశుడైనవాడు పారిపోజాలడు.

కిన్ను కుర్యాం కథం కుర్యాం క్వ ను గచ్ఛామి సఞ్జయ,
ఏతే నశ్యన్తి కురవో మన్దాః కాలవశం గతాః. 59

సంజయా ! ఏమి చేయుదును? ఎట్లు చేయుదును? ఎందు బోదును? ఈ బుద్ధిలేని కౌరవులందరు కాలమునకు వశులై చచ్చుచున్నారు.

అవశోఽహం తదా తాత పుత్రాణాం నిహతే శతే,
శ్రోష్యామి నినదం స్త్రీణాం కథం మాం మరణం స్పృశేత్. 60

బాబూ ! నూరుగురు కొడుకులు చచ్చిననాడు పట్టుదప్పి ఆడువారి ఆక్రందనల నెట్లు విందును? నా కిప్పుడే చావు వచ్చుగాక !

యథా నిదాఘే జ్వలనః సమిద్ధో
దహేత్ కక్షం వాయునా చోద్యమానః,

---

58. పర్యాయధర్మః- తిరుగుడు వడిన ధర్మము; ప్రధిః - నేమి చక్రమునకు చుట్టిన పట్టా; అస్య - కాలమునకు వశమైన వానికి;

గదాహస్తః పాణ్డవో వై తథైవ
హన్తా మదీయాన్ సహితోఽర్జునేన. 61

మండువేసవిలో గాలికి చెలరేగి మండుచున్న అగ్ని అడవిని గాల్చినట్లు గద చేపట్టిన భీముడు అర్జునుడు తోడుకాగా నావారి నందరిని రూపుమాపును.

ఇతి శ్రీ మహాభారతే ఉద్యోగపర్వణి
యానసంధిపర్వణి ధృతరాష్ట్రవాక్యే
ఏకపఞ్చాశత్తమోఽధ్యాయః.

ఇది శ్రీ మహాభారతము ఉద్యోగపర్వమున
యానసంధిపర్వమున ధృతరాష్ట్రవాక్యము గల
ఏబదియొకటవ అధ్యాయము.

—(o)—

# ద్విపఞ్చాశత్తమోఽధ్యాయః
# ఏబది రెండవ అధ్యాయము

### ధృతరాష్ట్రేణ ధనఞ్జయప్రతాపస్య పరివర్ణనమ్.

### ధృతరాష్ట్రుడు అర్జునుని ప్రతాపమును గూర్చి పలవించుట.

ధృతరాష్ట్ర ఉవాచ - ధృతరాష్ట్రు డిట్లు పలికెను.

యస్య వై నానృతా వాచః కదాచి దను శుశ్రుమ,
త్రైలోక్యమపి తస్య స్యా ద్యోద్ధా యస్య ధనఞ్జయః. 1

ఒక్కనాడును ఆ అర్జునుడు అబద్ధమాడినట్లు విని యెఱుగము. అతడు పోరినచో ముల్లోకములు నాతనికి దక్కును.

తస్యైవ చ న పశ్యామి యుధి గాణ్డీవధన్వనః,
అనిశం చిన్తయానోఽపి యః ప్రతీయా ద్రథేన తమ్. 2

గాండీవ మను విల్లుపట్టిన ఆ అర్జునుని రథముతో ఎదుర్కొనగలవానిని రాత్రింబవళ్ళు ఆలోచించినను గానకున్నాను.

అస్యతః కర్ణినాళీకాన్ మార్గణాన్ హృదయచ్ఛిదః,
ప్రత్యేతా న సమః కశ్చి ద్యుధి గాణ్డీవధన్వనః. 2

గుండెలు చీల్చు గుట్టపుచెవులవంటి వాడిబాణములను గుప్పించుచున్న గాండీవికి సాటివచ్చు వీరు డొక్కడైన నాకు తోచకున్నాడు.

ద్రోణకర్ణౌ ప్రతీయాతాం యది వీరౌ నరర్షభౌ,
కృతాస్త్రౌ బలినాం శ్రేష్ఠౌ సమరే ష్వపరాజితౌ. 4

వీరులు, నరవరులు, అస్త్రవిద్యలో ఆరితేరినవారు, బలవంతులలో శ్రేష్ఠులు యుద్ధములం దోటమి యెరుగనివారు నగు ద్రోణకర్ణులు మార్కొనగలరేమో!

మహాన్ స్యాత్ సంశయో లోకే న త్వస్తి విజయో మమ,
ఘృణీ కర్ణః ప్రమాదీ చ ఆచార్య స్థవిరో౽ గురుః. 5

అట్లు వారు మార్కొన్నను లోకమున పెద్ద సంశయము గలదు. మాకు విజయము కలుగదు. ఏలయన కర్ణుడు జాలిగుండెవాడు, మైమరపు గలవాడు. గురువగు ద్రోణాచార్యుడు ముదుసలి.

సమర్థో బలవాన్ పార్థో దృఢధన్వా జితక్లమః,
భవేత్ సుతుములం యుద్ధం సర్వశో౽ప్యపరాజయః. 6

ఇక, అర్జును డన్నచో సమర్థుడు, బలశాలి; అతనివి గట్టివిల్లు. అలసతను జయించినవాడు. ఎంతటి దొమ్మికయ్యము కలిగినను వానికి ఓటమి ఎటు నుండియు కలుగదు.

సర్వే హ్యస్త్రవిదః శూరాః సర్వే ప్రాప్తా మహద్యశః,
అపి సర్వామరైశ్వర్యం త్యజేయుర్న పునర్జయమ్. 7

వారందరు అస్త్రవేత్తలు. శూరులు. గొప్పకీర్తి సాధించినవారు. దేవతల యైశ్వర్యమంతటినైన వదలుదురు గాని జయమును మాత్రము వదలరు.

వధే నూనం భవేచ్ఛాన్తి స్తయోర్వా ఫల్గునస్య చ,
న తు హన్తార్జునస్యాస్తి జేతా చాస్య న విద్యతే. 8

ఆ ద్రోణకర్ణులో, ఆ అర్జునుడో చావగా శాంతి సిద్ధించును. అర్జునుని చంపగలవాడు గాని, జయించువాడు గాని నాకు కానరాడు.

మన్యుస్తస్య కథం శామ్యే న్మన్దాన్ ప్రతి య ఉత్థితః,
అన్యే౽ప్యస్త్రాణి జానన్తి జీయన్తే చ జయన్తి చ. 9
ఏకాన్తవిజయ స్త్వేవ శ్రూయతే ఫాల్గునస్య హ.

---

5. ఘృణీ - భీమాదులయందు జాలి కలవాడు; ప్రమాదీ - కడకు పనివేళ అస్త్రవిద్యను మరచువా డని భావము.

6. అపరాజయః - ఓటమి - పాండవుల కని భావము.

8. కర్ణద్రోణులను అర్జునుడు చంపినచో మావారు చప్పగా చల్లారుదురు. అర్జునుని మావారు చంపినచో పాండవు లణగిపోదు రని భావము.

అతడీ బుద్ధిలేని వారిపైకి లేచెను. వాని కోప మెట్లణగును? ఇతరులును అస్త్రము లెరుగుదురు. కాని వారు గెలువవచ్చును. ఓడను వచ్చును. కాని అర్జునునకు మాత్రము ఎల్లవేళల గెలుపే యను మాట వినవచ్చుచున్నది.

త్రయస్త్రింశత్సమా హూయ ఖాణ్డవేఽగ్నిమతర్పయత్, 10
జిగాయ చ సురాన్ సర్వా న్నాస్య విద్మః పరాజయమ్,
యస్య యన్తా హృషీకేశః శీలవృత్తసమో యుధి. 11

ఖాండవవనమున అగ్నిని తృప్తిపరచి ముప్పదిమూడేండ్లయినది. దేవతల నందరిని గెలిచెను. అట్టివానికి ఓటమి యనుమాట యెరుగము. పైగా యుద్ధమున నాతని రథము తోలువాడు శ్రీకృష్ణుడు. స్వభావము నడవడి వారిద్దరికి సమానము.

ధ్రువ స్తస్య జయ స్తాత యథేన్ద్రస్య జయ స్తథా,
కృష్ణౌ వేకరథౌ యత్తా వధిజ్యం గాణ్డివం ధనుః. 12

నాయనా! ఇంద్రునకువలె ఆ అర్జునునకు జయము తథ్యము. ఏలయన ఆ కృష్ణు లిద్దరు ఒకరథమున నిలిచిరి. గాండివము ఎక్కుపెట్టబడినది.

యుగప త్త్రీణి తేజాంసి సమేతా న్యను శుశ్రుమ,
నైవా స్తి నో ధను స్తాదృగ్ న యోద్ధా న చ సారథిః. 13

ఒక్కమారు మూడు తేజస్సులు ఒక్కచోట కూడినవని వింటిమి. మన కట్టి విల్లుగాని, అట్టి యోధుడు గాని, అట్టి సారథి గాని లేకుండెను.

తచ్చ మన్దా న జానన్తి దుర్యోధనవశానుగాః,
శేషయే దశని ర్దీప్తో విపత న్మూర్ధ్ని సఞ్జయ. 14

దుర్యోధనుని పట్టి పోవు మూర్ఖు లీ విషయము నెరుగకున్నారు. సంజయా! తలపై పడిన మండుచున్న పిడుగు (మాడ్చివేయక) మిగుల్చునా?

---

10. త్రయ.........సమాః - ముప్పదిమూడేండ్లు గడచినవని భావము. అంత పిన్ననాటనే ఇంద్రున కెదురునిలిచి గెలిచిన అర్జును డిప్పు డెంత పోటుమానిసి యగునో యని ధృతరాష్ట్రుని బెదరు.

న తు శేషం శరాస్తాత కుర్యు రస్తాః కిరీటినా,
అపి చాస్యన్నివాభాతి నిఘ్నన్నివ ధనఞ్జయః. 15

కిరీటి గ్రుమ్మరించెడు బాణములు, నాయనా! శేషము మిగులనీయవు. ఆ అర్జునుడు బాణములు విరజిమ్ముచున్నట్లే (నావారిని), చంపుచున్నట్లే నా కనిపించుచున్నది.

ఉద్ధర న్నివ కాయేభ్యః శిరాంసి శరవృష్టిభిః. 16

బాణముల వానలలో తలలను దేహములనుండి ఉదగొట్టుచున్నట్లే తోచుచున్నది.

అపి బాణమయం తేజః ప్రదీప్తమివ సర్వతః,
గాణ్డీవోత్థం దహేతాజౌ పుత్రాణాం మమ వాహినీమ్,
అపి సారథ్యఘోషేణ భయార్తా సవ్యసాచినః, 17
విత్రస్తా బహుధా సేనా భారతీ ప్రతిభాతి మే.

యుద్ధమున గాండీవమునుండి పైకి లేచిన బాణమయ మగు పెనుమంట నాకొడుకుల సేనను మాడ్చినట్లే నా కనిపించుచున్నది. ఎడమచేతితో గూడ బాణములు గుప్పించు నేర్పుగల అర్జునుని సారథిఘోషకే ఈ భరతవంశమువారి సేన వెరగొంది పెక్కువిధముల చెల్లాచెద రయినట్లు నాకు తోచుచున్నది.

యథా కక్షం మహానగ్నిః ప్రదహేత్ సర్వత శ్చరన్,
మహార్చి రనిలోద్ధూత స్తద్వ ద్ధక్ష్యతి మామకాన్. 18

దావాగ్ని గాలి కెగసి పెద్దజ్వాలలతో అన్నివైపులకు వ్యాపించుచు అడవి నంతటిని మాడ్చివేసినవిధమున ఆగాండీవబాణాగ్ని నావారి నందరిని మాడ్చి మసిచేయును.

యదోద్వమ న్నిశితాన్ బాణసఙ్ఘాం
స్తా నాతతాయీ సమరే కిరీటీ,
సృష్టోఽన్తకః సర్వహరో విధాత్రా
యథా భవే త్తద్వ దపారణీయః. 19

---

15. అస్తాః - విరజిమ్మబడిన;

చిచ్చరపిడుగైన ఆ కిరీటి యుద్ధమున వాడిబాణములను గుదులుగుదులుగా వెలిగ్రక్కుచున్నపుడు బ్రహ్మ సర్వమును రూపుమాపుటకు సృష్టిచేసిన యముడే అన్నట్లు తోచుచు ఎవ్వరికిని ఆప నలవికాదు.

యదా హ్యభీక్ష్ణం సుబహూన్ ప్రకారాన్
శ్రోతాఽస్మి తానావసథే కురూణామ్,
తేషాం సమన్తాచ్చ తథా రణాగ్రే
క్షయః కిలాయం భరతా నుపైతి. 20

ఆ కౌరవులు పరిపరివిధములుగా చచ్చిన చావులన్నియు నింట కూర్చుండి మాటిమాటికి విందును. అయ్యో! అని మొనలో భరతవంశమువారికి ఈ సర్వ నాశము దాపురించినది గదా!

ఇతి శ్రీమహాభారతే ఉద్యోగపర్వణి
యానసంధిపర్వణి ధృతరాష్ట్రవాక్యే
ద్విపఞ్చాశత్తమోఽధ్యాయః.

ఇది శ్రీమహాభారతము ఉద్యోగపర్వమున
యానసంధిపర్వమున ధృతరాష్ట్రుని వాక్యము గల
ఏబదిరెండవ అధ్యాయము.

—(o)—

20. సుబహూన్ ప్రకారాన్ - కొందరు ముక్కలయినట్లు, కొందరు కాలు చేతులు విరిగినట్లు కొందరు దిక్కు మాలి కాలికి బుద్ధి చెప్పినట్లు ఈ మొదలైన చచ్చిన చావుల తీరులను; ఆవసథే - ఇంట; శ్రోతా ఒస్మి - వినువాడను; అట్టి వార్తలను ఎవడో చెప్పుచుండగా వినుటయే నా పని అని భావము.

# త్రిపఞ్చాశత్తమోఽధ్యాయః
## ఏబదిమూడవ అధ్యాయము

కౌరవసభాయాం ధృతరాష్ట్రేణ యుద్ధాత్
భయం దర్శయిత్వా శాన్త్యర్థం ప్రస్తావకరణమ్.

కౌరవసభలో ధృతరాష్ట్రుడు యుద్ధము
వలని భయమును వెల్లడించి శాంతి
కొఱకు ప్రసంగము చేయుట.

ధృతరాష్ట్ర ఉవాచ-ధృతరాష్ట్రు డిట్లు పలికెను.

యథైవ పాణ్డవాః సర్వే పరాక్రాన్తా జిగీషవః,
తథైవాభిసరా స్తేషాం త్యక్తాత్మానో జయే ధృతాః. 1

ఆ పాండవు లెట్లు గెలుపొందగోరి పరాక్రమించుచున్నారో వారిముందు నడచు రాజులుకూడ జయమునందు పట్టుదల గలిగి చచ్చుటకైన సిద్ధముగా నున్నారు.

త్వమేవ హి పరాక్రాన్తా నాచక్షీథాః పరా న్మమ,
పఞ్చాలాన్ కేకయాన్ మత్స్యాన్ మాగధాన్ వత్సభూమిపాన్. 2

అట్లు విజృంభించువారైన పాంచాలురు, కేకయులు, మగధదేశమువారు, వత్సరాజులు - అనువారినిగూర్చి నీవే నాకు వక్కాణించితివి.

యశ్చ సేన్ద్రానిమాన్ లోకా నిచ్ఛన్ కుర్యాద్వశే బలీ,
స స్రష్టా జగతః కృష్ణః పాణ్డవానాం జయే ధృతః. 3

కోరినచో ఇంద్రునితోపాటు లోకముల నన్నింటిని చేతికి లేగల బలశాలి, జగముల సృష్టిచేయు కృష్ణుడు పాండవవిజయమున పట్టుదలతో నున్నాడు.

సమస్తా మర్జునా ద్విద్యాం సాత్యకిః క్షిప్ర మాప్తవాన్,
శైనేయః సమరే స్థాతా బీజవ త్ప్రవపన్ శరాన్. 4

శిని మనుమడు సాత్యకి బాణవిద్య సంతతిని అర్జునునివలన శీఘ్రముగా నేర్చెను. అట్టివాడు విత్తనములను నాటుచున్నతీరున బాణములను కురిపించుచు యుద్ధమున నిలిచియుండెను.

ధృష్టద్యుమ్నశ్చ పాఞ్చాల్యః క్రూరకర్మా మహారథః,
మామకేషు రణం కర్తా బలేషు పరమాస్త్రవిత్. 5

పాంచాలరాజుకొడుకు ధృష్టద్యుమ్నుడు క్రూరమైన పనులు చేయు మహారథుడు. గొప్ప అస్త్రము లన్నియు నెరిగినవాడు. అట్టివాడు మాసేనలపై రణ మొనరించును.

యుధిష్ఠిరస్య చ క్రోధా దర్జునస్య చ విక్రమాత్,
యమాభ్యాం భీమసేనాచ్చ భయం మే తాత జాయతే. 6

యుధిష్ఠిరుని క్రోధమువలనను, అర్జునుని పరాక్రమమువలనను, కవల వలనను, భీమసేనునివలనను, నాయనా! నాకు భయము పుట్టుచున్నది.

అమానుషం మనుష్యేన్ద్రై ర్జాలం వితత మన్తరా,
న మే సైన్యా స్తరిష్యన్తి తతః క్రోశామి సఞ్జయ. 7

సంజయా! ఆ నరవరులు మానవమాత్రులకు శక్యము కాని వల పన్నిరి. ఆ నడుమ చిక్కుకొన్న నా సేనలు బయటపడవు. అందు కేడ్చుచున్నాను.

దర్శనీయో మనస్వీ చ లక్ష్మీవాన్ బ్రహ్మవర్చసీ,
మేధావీ సుకృతప్రజ్ఞో ధర్మాత్మా పాణ్డునన్దనః. 8

ఆ పాండుకుమారుడు ధర్మరాజు చూడ ముచ్చటగొలుపువాడు, అభిమానవంతుడు, ఐశ్వర్యము కలవాడు, వేదవిద్యతో వెలిగిపోవు తేజస్సు కలవాడు; బుద్ధిసంపదయు పండిన ప్రజ్ఞయు కలవాడు. ధర్మాత్ముడు.

మిత్రామాత్యైః సుసంపన్నః సంపన్నో యుద్ధయోజకైః,
భ్రాతృభిః శ్వశురై ర్వీరై రుపపన్నో మహారథైః. 9

---

9. యుద్ధయోజకైః - యుద్ధమునకు సంబంధించిన ఉద్యోగులతో;

మిత్రులు, మంత్రులు అతనికి సమృద్ధిగా గలరు. యుద్ధమున నేర్పుగల సహాయసంపద అతనికి కలదు. మహారథులైన తమ్ములు, వీరులైన బంధువులు - ఎందరో అతనికడ నున్నారు.

ధృత్యా చ పురుషవ్యాఘ్రో నైభృత్యేన చ పాణ్డవః,
ఆనృశంసో వదాన్యశ్చ హ్రీమాన్ సత్యపరాక్రమః. 10

ఆ పురుషవరేణ్యుడు ధైర్యముతో నిబ్బరముతో నిండినవాడు. క్రూరుడు కాడు. చక్కని మాటనేర్పు, ఉచితమైన లజ్జ, సత్యమగు పరాక్రమము కలవాడు.

బహుశ్రుతః కృతాత్మా చ వృద్ధసేవీ జితేన్ద్రియః.

గొప్ప శాస్త్రజ్ఞానము, గుండెదిటవు కలవాడు. పెద్దలను సేవించువాడు. ఇంద్రియములను గెలిచినవాడు.

తం సర్వగుణసంపన్నం సమిద్ధ మివ పావకమ్. 11
తప న్త మభి కో మన్దః పతిష్యతి పతఙ్గవత్,
పాణ్డవాగ్ని మనావార్యం ముమూర్షు ర్నష్టచేతనః, 12

అన్నిగుణములు గూడు కట్టుకొన్నట్టివాడు, చెలరేగిన నిప్పువంటివాడు, ఎదురుగా కాల్చివేయువాడు నగు నాతనిపై పురుగువలె పడు బుద్ధిహీను డెవ్వడు? ఆపనలవికాని పాండవాగ్నిని ఆర్పగోరు జడు డెవ్వడు?

తనురుద్ధః శిఖీ రాజా మిథ్యోపచరితో మయా,
మన్దానాం మమ పుత్రాణాం యుద్ధే నా న్తం కరిష్యతి. 13

ఆ రాజు మెల్లగా రాజుకొనుచున్న నిప్పు. నేనాతని యెడ వంచనతో మెలగితిని. బుద్ధిలేని నా కొడుకుల నాతడు యుద్ధమున తుదముట్టించును.

తై రయుద్ధం సాధు మన్యే కురవ స్తన్నిబోధత,
యుద్ధే వినాశః కృత్స్నస్య కులస్య భవితా ధ్రువమ్. 14

కౌరవులారా! వారితో పోరకుండుటే మంచిది గుర్తింపుడు. యుద్ధమైనచో కుల మెల్ల రూపు మాసిపోగలదు. ఇది నిక్కువము.

---

10. నైభృత్యేన - గుండెనిబ్బరముచేత - రహస్యము దాచగల శక్తిచేత;

ఏషా మే పరమా బుద్ధి ర్యయా శామ్యతి మే మనః,
యది త్వయుద్ధ మిష్టం వో వయం శాన్త్యై యతామహే. 15

ఇది నాకు తోచిన మిక్కిలి మేలైన బుద్ధి. దీనితో నా మనస్సు శాంతి నొందును. మీకును, పో రిష్టము కానిచో మనము శాంతికై యత్నింతము.

న తు నః క్లిశ్యమానానా ముపేక్షేత యుధిష్ఠిరః,
జుగుప్సతి హ్యధర్మేణ మామే వోద్దిశ్య కారణమ్. 16

ఇట్లు నలిగిపోవుచున్న మనల నా యుధిష్ఠిరుడు ఉపేక్షింపకుండుగాక! నన్నాతడు అధర్మముతో కలహకారణ మని భావించి నిందించును.

ఇతి శ్రీమహాభారతే ఉద్యోగపర్వణి
యానసంధిపర్వణి ధృతరాష్ట్రవాక్యే
త్రిపఞ్చాశత్తమోఽధ్యాయః.

ఇది శ్రీమహాభారతము ఉద్యోగపర్వమున
యానసంధిపర్వమున ధృతరాష్ట్రవాక్యము గల
ఏబదిమూడవ అధ్యాయము,

—(೦)—

16. క్లిశ్యమానానామ్ - ఇది కర్మార్థమున షష్ఠి - నలిగిపోవుచున్నవారిని, కష్టపడుచున్నవారిని - అని భావము. న ఉపేక్షేత - ఉపేక్షింపకుండు గాక! వా రెట్లు పోయిన నాకేమి? యని ధర్మరాజు భావింపకుండుగాక, అని భావము. మనము ధర్మరాజు అట్లు భావించుటకై ప్రయత్నము చేయనిచో ఈ కలహమున కంతటికి, నేనే కారణ మని నిర్ణయించుకొని నన్ను నింధించును - అని రెండవపాదము తాత్పర్యము.

# చతుఃపఞ్చాశత్తమోఽధ్యాయః
# ఏబదినాల్గవ యధ్యాయము

సఞ్జయస్య ధృతరాష్ట్రం ప్రతి తద్దోష-దిగ్దర్శన
పూర్వకం దుర్యోధన మనుశాసితుం సమ్మతిదానమ్.

సంజయుడు ధృతరాష్ట్రున కాతని దోషముల నెత్తిచూపుచు
దుర్యోధనుని అదుపున పెట్టుమని బోధించుట.

సఞ్జయ ఉవాచ - సంజయు డిట్లు పలికెను.

ఏవ మేత న్మహారాజ యథా వదసి భారత,
యుద్ధే వినాశః క్షత్రస్య గాణ్డీవేన ప్రదృశ్యతే. 1

మహారాజా! భారతా! నీవు చెప్పునది నిజమే. గాండీవముతో క్షత్రియకుల మంతయు యుద్ధమున రూపుమాసిపోవుట కానవచ్చుచున్నది.

ఇదం తు నాభిజానామి తవ ధీరస్య నిత్యశః,
యత్ పుత్రవశ మాగచ్ఛే స్తత్త్వజ్ఞః సవ్యసాచినః. 2

సవ్యసాచి తత్త్వ మెరిగియు నీ కొడుకు త్రిప్పులకు లోనగుదువు. ఈ నీ ధైర్యమేమో నా కెన్నటికిని అర్థము కాదు.

నైష కాలో మహారాజ తవ శశ్వత్ కృతాగసః,
త్వయా హ్యేవాదితః పార్థా నికృతా భరతర్షభ. 3

మహారాజా! పాపములు పండించిన నీ కీ బుద్ధి నిలువదు. భరతవరేణ్యా! మొదటినుండియు నీవే ఆ కుంతికొడుకులకు కీడొనరించితివి.

పితా శ్రేష్ఠసుహృద్యశ్చ సమ్యక్ ప్రణిహితాత్మవాన్,
ఆస్థేయం హి హితం తేన న ద్రోగ్ధా గురు రుచ్యతే. 4

---

3. న, ఏషః, కాలః - ఈ బుద్ధి నీకు నిలుచునది కాదని తాత్పర్యము;

4. ప్రణిహిత, ఆత్మవాన్-సావధానమైన చిత్తము గలవాడు;

ఉత్తము డగు తండ్రి, కొడుకులయందు మంచిమనసుతో నుండవల యును. చక్కగా కుదురుకొన్న బుద్ధి కలిగి ప్రవర్తింపవలయును. కొడుకులకు హితమునే చెప్పవలయును. ద్రోహము చేయువానిని గురు వనరు.

ఇదం జిత మిదం లబ్ధ మితి శ్రుత్వా పరాజితాన్,
ద్యూతకాలే మహారాజ స్మయసే స్మ కుమారవత్. 5

ఇది గెలిచితిని, ఇది పొందితినని ఓడిపోయినవారిని గూర్చి విని జూదము నాడు నీకొడుకులవలెనే గర్వించితివి.

పరుషా ణ్యుచ్యమానాంశ్చ పురా పార్థా నుపేక్షసే,
కృత్స్నం రాజ్యం జయన్తీతి ప్రపాతం నానుపశ్యసి. 6

ఆనాడు ఆ పాండవులను నీవారు కాఱులు కూయుచుండగా ఉపేక్ష వహించితివి. వారు రాజ్య మంతటిని గెలుచునప్పటి ఘోరమైన పా టెరుగ కున్నావు.

పిత్ర్యం రాజ్యం మహారాజ కురవస్తే సజాఙ్గలాః,
అథ వీరై ర్జితా ముర్వీ మఖిలాం పత్యపద్యథాః. 7

జాంగలములతో పాటు ఈ కురుదేశము లన్నియు వారితండ్రి సంపా దించిన రాజ్యము. అంతేకాదు. ఆ వీరులు సమస్తమగు భూమిని గెలిచిరి. ఇది తెలిసికొనుము.

బాహువీర్యార్జితా భూమి స్తవ పార్థై ర్నివేదితా,
మయేదం కృత మిత్యేవ మన్యసే రాజసత్తమ. 8

తమ భుజముల శక్తితో సంపాదించిన భూమిని పాండవులు నీ కర్పించిరి. నీవేమో 'ఇది యంతయు నేనే గడించితి'నని తలచుచున్నావు.

గ్రస్తాన్ గన్ధర్వరాజేన మజ్జతో హ్యప్లవేఽమ్భసి,
ఆనినాయ పునః పార్థః పుత్రాంస్తే రాజసత్తమ. 9

రాజవరేణ్యా! గంధర్వరాజు చేతికి చిక్కి తెప్పలేని నీట మునుగుచున్న నీ కొడుకులను ఆ ధర్మరాజు తిరిగి తెచ్చెను.

కుమారవచ్చ స్మయసే ద్యూతే వినికృతేషు యత్,
పాణ్డవేషు వనే రాజన్ ప్రవ్రజత్సు పునః పునః. 10

జూదమున పాండవులు మోసగింపబడగా, అడవుల పాలు కాగా నీ కొడుకులవలె మిడిసిపడితివి.

ప్రవర్షతః శరవ్రాతా నర్జునస్య సితాన్ బహూన్,
అప్యర్ణవా విశుష్యేయుః కిం పున ర్మాంసయోనయః. 11

వాడి బాణములు గుదులు గుదులుగా గ్రుమ్మరించు అర్జునుని ధాకిటి సముద్రములే యింకిపోవును. మాంసమునుండి పుట్టిన మనుజుల సంగతి చెప్పనేల?

అస్యతాం ఫాల్గునః శ్రేష్ఠో గాణ్డీవం ధనుషాం వరమ్,
కేశవః సర్వభూతానా మాయుధానాం సుదర్శనమ్. 12

విలుకాండ్రలో అర్జునుడు శ్రేష్ఠుడు. విండ్లలో గాండీవము మిన్న. సర్వభూతములలో కేశవు డధికుడు. ఆయుధములలో సుదర్శనము గొప్పది.

వానరో రోచమానశ్చ కేతుః కేతుమతాం వరః,
ఏవమేతాని సరథో బహూన్ శ్వేతహయో రణే, 13
క్షపయిష్యతి నో రాజన్ కాలచక్ర మివోద్యతమ్,
తస్యాద్య వసుధా రాజ న్నిఖిలా భరతర్షభ. 14

పడగనున్న వానరము మిరుమిట్లు గొలుపుచుండును. ఆ ధ్వజము ధ్వజములలోని కెల్ల గొప్పది. రాజా! పైకి లేచిన కాలచక్రము వంటిదియు, తెల్లని గుఱ్ఱములు గలదియు నగు, ఆ రథము మనలను రూపుమాపగలదు. భరతవరేణ్యా! నేడు ఈ భూమి అంతయు ఆ అర్జునునిది.

యస్య భీమార్జునౌ యోధౌ స రాజా రాజసత్తమ,

రాజవరేణ్యా! భీముడు, అర్జునుడు ఎవ్వని యోధులో వాడే రాజు.

---

12. అస్యతామ్ - బాణములను విరజిమ్మువారిలో - విలుకాండ్రలో అని తాత్పర్యము;

తథా భీమహతప్రాయాం మజ్జన్తీం తవ వాహినీమ్, 15
దుర్యోధనముఖా దృష్ట్వా క్షయం యాస్యన్తి కౌరవాః.

భీముడు సర్వనాశము చేయగా, మునిగిపోవుచున్న నీ సేనను గాంచి దుర్యోధనుడు మొదలగు కౌరవు లందరు గుండె పగిలి చత్తురు.

న భీమార్జునయో ర్భీతా లప్స్యన్తే విజయం విభో, 16
తవ పుత్రా మహారాజ రాజాన శ్చానుసారిణః.

భీమార్జునులకు భయపడిన నీ కొడుకులు, వారివెంట దిరుగు రాజులు విజయము పొందరు.

మత్స్యా స్త్వామద్య నార్చన్తి పఞ్చాలాశ్చ సకేకయాః, 17
శాల్వేయాః శూరసేనాశ్చ సర్వే త్వా మవజానతే.

ఈనాడు మాత్స్యులు, పాంచాలురు, కేకయులు, శాల్వేయులు, శూరసేనులు నిన్ను మన్నింపరు. పైగా అవమానించుచున్నారు.

పార్థం హ్యేతే గతాః సర్వే వీర్యజ్ఞా స్తస్య ధీమతః, 18
భక్త్యా హ్యస్య విరుధ్యన్తే తవ పుత్రైః సదైవ తే.

బుద్ధిశాలియగు ధర్మజుని బలిమి యెరిగి వీరందరు నాతనిని చేరుకొనిరి. ఆతనిపై భక్తితో నీ కొడుకులతో విరోధ మొందుచున్నారు.

అనర్హా నేవ తు వధే ధర్మయుక్తాన్ వికర్మణా, 19
యోఽక్లేశయత్ పాణ్డుపుత్రాన్ యో విద్వేష్ట్యధునాపి వై,
సర్వోపాయై ర్నియన్తవ్యః సానుగః పాపపూరుషః, 20
తవ పుత్రో మహారాజ నానుశోచితు మర్హసి.

వధమునకు తగనివారు, ధర్మముతో కూడినవారు నగు పాండుపుత్రులను నీచకర్మముతో కష్టపెట్టినవాడు, ఇప్పటికి ద్వేషించుచున్నవాడు నగు పాపపురుషు డగు నీ కొడుకును సాహసగాండ్రతోపాటు ఉపాయము లన్నింటిని ప్రయోగించి అణగద్రొక్కవలయును. రాజా! దీనికి విచారింపబనిలేదు.

ద్యూతకాలే మయా చోక్తం విదురేణ చ ధీమతా. 21

ఈ విషయమును నేనును, బుద్ధిశాలియగు విదురుడును జూదమునాడే చెప్పితిమి.

యదిదం తే విలపితం పాణ్డవాన్ ప్రతి భారత,
అనీశేనేవ రాజేన్ద్ర సర్వమేత న్నిరర్థకమ్. 22

రాజా! పాండవులనుగూర్చి నీ వీనాడు దిక్కుమాలినవానివలె నేడ్చెడు నేడ్పంతయు పనికిమాలినది.

ఇతి శ్రీమహాభారతే ఉద్యోగపర్వణి యానసంధిపర్వణి
సఞ్జయవాక్యే చతుఃపఞ్చాశ త్తమోఽధ్యాయః.
ఇది శ్రీమహాభారతము ఉద్యోగపర్వమున యానసంధిపర్వమున
సంజయవాక్యముగల ఏబదినాల్గవ అధ్యాయము.

—(౦)—

# పఞ్చపఞ్చాశత్తమోఽధ్యాయః
## ఏబదియైదవ అధ్యాయము

**ధృతరాష్ట్రం సమాశ్వాసయతా దుర్యోధనేన**
**స్వపరపక్షవిషయకోత్కర్షాపకర్షదిగ్దర్శనమ్.**

**ధృతరాష్ట్రుని ఊరడించుచు దుర్యోధనుడు తన పక్షము,**
**ఎదిరిపక్షముల హెచ్చులొచ్చులను స్థూలముగా వక్కాణించుట.**

దుర్యోధన ఉవాచ-దుర్యోధను డిట్లు పలికెను.

న భేతవ్యం మహారాజ న శోచ్యా భవతా వయమ్,
సమర్థాః స్మ పరాన్ జేతుం బలినః సమరే విభో. 1

మహారాజా! భయపడ నక్కరలేదు. మమ్ములనుగూర్చి విచారింపవలదు. మేము పగవారిని గెలువజాలుదుము. యుద్ధమున మాకు ఆవసరమగు బలము గలదు.

వనే ప్రవ్రాజితాన్ పార్థాన్ యదాఽఽయా న్మధుసూదనః,
మహతా బలచక్రేణ పరరాష్ట్రావమర్దినా. 2

అడవికి తరుమబడిన పాండవులను గైకొని పరరాష్ట్రమును పీడించు గొప్ప సేనాసముదాయముతో కృష్ణుడు (ఎప్పుడు వచ్చెనో) వచ్చెను.

కేకయా ధృష్టకేతుశ్చ ధృష్టద్యుమ్నశ్చ పార్షతః,
రాజాన శ్చాన్వయుః పార్థాన్ బహవోఽన్యేఽనుయాయినః. 3

కేకయరాజులు, ధృష్టకేతువు, ధృష్టద్యుమ్నుడు, ద్రుపదుడు - మరియు నితరులగు అనుయాయులు పాండవులను అనుసరించి వచ్చిరి.

ఇన్ద్రప్రస్థస్య చాదూరాత్ సమాజగ్ము ర్మహారథాః,
వ్యగర్హయంశ్చ సఙ్గమ్య భవన్తం కురుభిః సహ. 4

ఆ మహారథు లందరు ఇంద్రప్రస్థము కడ కరుదెంచిరి. అట్లు కూడి వారందరు కౌరవులతో కలిపి నిన్ను తూలనాడిరి.

తే యుధిష్ఠిర మాసీన మజినైః ప్రతివాసితమ్,
కృష్ణప్రధానాః సంహత్య పర్యుపాసన్త భారత. 5

కృష్ణుడు మున్నుగా గలవా రందరు కూడి తోళ్ళు గట్టుకొని కూర్చున్న ధర్మరాజును కొలిచియుండిరి.

ప్రత్యాదానం చ రాజ్యస్య కార్య మూచు ర్నరాధిపాః,
భవతః సానుబన్ధస్య సముచ్ఛేదం చికీర్షవః. 6

ఆ రాజు లందరు నిన్ను చుట్టపక్కములతో పెకలించివేయ గోరిన వారై రాజ్యమును తిరిగి సాధించు పనిని గూర్చి ప్రసంగించిరి.

శ్రుత్వా చైవం మయోక్తాస్తు భీష్మద్రోణకృపా స్తదా,
జ్ఞాతిక్షయభయా ద్రాజన్ భీతేన భరతర్షభ. 7

వినియు బంధువులందరు చత్తురను భయమువలనను, గెలువమను భీతిచేతను, నేను భీష్మద్రోణకృపులతో నిట్లంటిని.

తతః స్థాస్యన్తి సమయే పాణ్డవా ఇతి మే మతిః,
సముచ్ఛేదం హి నః కృత్స్నం వాసుదేవ శ్చికీర్షతి. 8

పాండవులు ఆడిన మాటపై నిలుతు రనియే నా భావము. కాని, కృష్ణుడు మాత్రము మనలను కూకటివ్రేళ్ళతో కూల్చివేయ గోరుచున్నాడు.

ఋతే చ విదురాత్ సర్వే యూయం వధ్యా మతా మమ,
ధృతరాష్ట్రస్తు ధర్మజ్ఞో న వధ్యః కురుసత్తమః. 9

నా అభిప్రాయమును బట్టి విదురు నొక్కని విడచి మీరందరు (కృష్ణుని దృష్టిలో) చంపదగినవారే. కురువులలో శ్రేష్ఠుడు, ధర్మ మెరిగినవాడు నగు ధృతరాష్ట్రుడు మాత్రము వధింపరాని వాడగును.

సముచ్ఛేదం చ కృత్స్నం నః కృత్వా తాత జనార్దనః,
ఏకరాజ్యం కురూణాం స్మ చికీర్షతి యుధిష్ఠిరే. 10

---

10. ఏకరాజ్యమ్ - ఒక్కడు ఏలు - శత్రువులు లేని రాజ్యమును.

ఆ జనార్దను డట్లు మనల నెల్ల పెకలించివైచి కౌరవులదైన ఈ ఏక రాజ్యమును ధర్మరాజునందు ప్రతిష్ఠింప గోరుచున్నాడు.

తత్ర కిం ప్రాప్తకాలం నః ప్రణిపాతః పలాయనమ్,
ప్రాణాన్ వా సంపరిత్యజ్య ప్రతియుధ్యామహే పరాన్. 11

ఇందు మనకీ సమయమున చేయదగిన దేమి? కాళ్ళమీద బడుటయా? తోక ముడిచి పరుగెత్తుటయా? లేక ప్రాణములను వదలివైచి శత్రువులతో తల పడుటయా?

ప్రతియుద్ధే తు నియతః స్యాదస్మాకం పరాజయః,
యుధిష్ఠిరస్య సర్వే హి పార్థివా వశవర్తినః. 12

ఎదుర్కొని పోరినచో మనకు తప్పక ఓటమి యగును. ఏలయన రాజు లందరు ధర్మరాజు చెప్పుచేతలలో నిలిచియుండిరి.

విరక్తరాష్ట్రాశ్చ వయం మిత్రాణి కుపితాని నః,
ధిక్కృతాః పార్థివైః సర్వైః స్వజనేన చ సర్వశః. 13

దేశమంతయు మనయం దనురాగము లేని దాయెను! మనమిత్రు లందరు కోపించియుండిరి. రాజులందరు, మనవారును అన్నివైపులనుండియు ఛీకొట్టు చుండిరి!

ప్రణిపాతే న దోషోఽస్తి సన్ధిర్నః శాశ్వతీః సమాః,
పితరం త్వేవ శోచామి ప్రజ్ఞానేత్రం జనాధిపమ్. 14
మత్కృతే దుఃఖ మాపన్నం క్లేశం ప్రాప్త మనన్తకమ్.

కాళ్ళపై బడినచో తప్పే లేదు. మనకు కలకాలము సంధి యగును. కాని ప్రజ్ఞయే కన్నుగాగల రాజైన మా తండ్రినిగూర్చి విచారించుచున్నాను. ఆయన నాకై ఎంతో కుమిలిపోవుచున్నాడు. అంతులేని పాటు పడుచున్నాడు.

---

11. ప్రణిపాతః- సంధికై కాళ్ళమీద పడుట ; - పలాయనం వా - సిగ్గుతో పారిపోవుట ,

14. కాళ్ళమీద పడినచో వంశనాశ మగుట యను దోషము ఉండదు. సంధి యగును. అయినను నాకు యుద్ధమే రుచించు నను భావముతో 'పితరమ్' ఇత్యాదిగా పలుకుచున్నాడు.

కృతం హి తవ పుత్రైశ్చ పరేషా మవరోధనమ్,
మత్ప్రియార్థం పురైవైత ద్విదితం తే నరోత్తమ. 15

మహారాజా! నీకొడుకుల మగు మేము నా ప్రీతికొరకు శత్రువులను నిలువరించితిమి. ఇది నీకు మున్నే తెలియును.

తే రాజ్ఞో ధృతరాష్ట్రస్య సామాత్యస్య మహారథాః,
వైరం ప్రతికరిష్యన్తి కులోచ్ఛేదేన పాణ్డవాః. 16

మహారథు లగు ఆ పాండవులు మంత్రులతోపాటు రాజైన ధృతరాష్ట్రుని కులమును కూలద్రోసి పగదీర్చుకొందురు.

తతో ద్రోణోఽబ్రవీద్ భీష్మః కృపో ద్రౌణిశ్చ భారత,
మత్వా మాం మహతీం చిన్తా మాస్థితం వ్యథితేన్ద్రియమ్. 17

నే నీ మాటలు పలుకగా ద్రోణుడు, భీష్ముడు, కృపుడు, అశ్వత్థామయు, నేను పెనుచింత నొందితి ననియు, నా యింద్రియములు మిక్కిలి వ్యథనొందె ననియు తలచి యిట్లు పలికిరి.

అభిద్రుగ్ధాః పరే చేన్నో న భేతవ్యం పరన్తప,
అసమర్థాః పరే జేతు మస్మాన్ యుధి సమాస్థితాన్. 18

పగవారిని భస్మము చేయునట్టి దుర్యోధనా! పరులకు మనము ద్రోహము చేసియున్నను నీవు భయపడకుము. పోరున నిలబడిన మమ్ము పరులు గెలువజాలరు.

ఏకైకశః సమర్థాః స్మో విజేతుం సర్వపార్థివాన్,
ఆగచ్ఛన్తు వినేష్యామో దర్ప మేషాం శితైః శరైః. 19

మనలో ఒక్కొక్కరమును రాజు లందరను గెలుచుటకు సమర్థులము. రానిమ్ము. వాడిములుకులతో వారి పొగరు దింపగలము.

---

16, ప్రతికరిష్యన్తి - త్రిప్పి కొట్టుదురు.

17. తతః - అంతట - ఇది మునుపు జరిగినదానిని చెప్పుట.

18. నః - మనచేత, పరే - శత్రువులు, చేత్ అభిద్రుగ్ధాః - ఒకవేళ ద్రోహము చేయబడినవారైనను; న భేతవ్యమ్ - భయపడ నక్కరలేదు

పురైకేన హి భీష్మేణ విజితాః సర్వపార్థివాః,
మృతే పితర్యతిక్రుద్ధో రథేనైకేన భారత. 20

ఈ భీష్ముని తండ్రి మరణించినపుడు రాజు లందరు దండెత్తి రాగా, మహాక్రోధముతో ఈత డొక్క రథముతో రాజుల నందర గెలిచెను.

జఘాన సుబహూంస్తేషాం సంరబ్ధః కురుసత్తమః,
తతస్తే శరణం జగ్ము ర్దేవవ్రత మిమం భయాత్. 21

కోపముతో పెల్లురేగిన ఈ కురువరేణ్యుడు ఆ రాజులలో చాలమందిని చావగొట్టెను. అంత వా రందరు భయముతో ఈదేవవ్రతుని శరణు జొచ్చిరి.

స భీష్మః సుసమర్థోఽయ మస్మాభిః సహితో రణే,
పరాన్ విజేతుం తస్మాత్తే వ్యేతు భీ ర్భరతర్షభ. 22

దుర్యోధనా! అట్టి మిక్కలి సమర్థు డగు భీష్ముడు పగవారిని గెలుచుటకై యుద్ధమున మనతో నుండును. నీకు భయము లేదు.

ఇత్యేషాం నిశ్చయో హ్యాసీ త్తత్కాలేఽమితతేజసామ్,
పురా పరేషాం పృథివీ కృత్స్నాఽసీ ద్వశవర్తినీ. 23

ఇట్లని ఈ మహాతేజస్వు లందరు ఆ సమయమున నిశ్చయము చేసిరి. పగవారి భూమి యంతయు మున్నెన్నడో మనకు వశమైనది.

అస్మాన్ పునరమీ నాద్య సమర్థా జేతు మాహవే,
ఛిన్నపక్షాః పరే హ్యద్య వీర్యహీనాశ్చ పాణ్డవాః. 24

నేడు తెగిన రెక్కలు చచ్చిన సత్తువ గల పాండవులు మనలను యుద్ధమున గెలువజాలరు.

అస్మత్సంస్థా చ పృథివీ వర్తతే భరతర్షభ,
ఏకార్థాః సుఖదుఃఖేషు సమానీతాశ్చ పార్థివాః. 25

భరతశ్రేష్ఠా! ఈభూమి యంతయు మనయందు నెలకొనియున్నది. సుఖదుఃఖములయం దొకే తీరునగల రాజుల నందర నిటకు తెచ్చితిని.

---

25. సమానీతాః - నాచేత తేబడినవారని యర్థము;

అప్యగ్నిం ప్రవిశేయుస్తే సముద్రం వా పరన్తప,
మదర్థం పార్థివాః సర్వే తద్విద్ధి కురుసత్తమ. 26

నాకొరకై ఈరాజు లందరు నిప్పులలో దూకుదురు. సముద్రములో దుముకుదురు. దీని నెరుగుము.

ఉన్మత్తమివ చాపి త్వాం ప్రహసన్తీహ దుఃఖితమ్,
విలపన్తం బహువిధం భీతం పరవికత్థనే. 27

పెక్కు తీరుల నోటికి వచ్చినట్లాడుచు నేడ్చుచున్న నిన్ను, పగవారిని పొగడుచు భయపడుచున్న నిన్ను పిచ్చివాడని ఇక్కడివారు నవ్వుచున్నారు.

ఏషాం హ్యేకైకశో రాజ్ఞాం సమర్థః పాణ్డవాన్ ప్రతి,
ఆత్మానం మన్యతే సర్వో వ్యేతు తే భయ మాగతమ్. 28

ఈ రాజులలో ఒక్కొక్కడు తన్ను పాండవులకు దీటైనవానిగా భావించుచున్నాడు. నీకు వచ్చిన భయము తొలగుగాక!

జేతుం సమగ్రాం సేనాం మే వాసవోఽపి న శక్నుయాత్,
హన్తు మక్షయ్యరూపేయం బ్రహ్మణోఽపి స్వయంభువః. 29

నా సేనను పూర్తిగా జయించుటకు ఇంద్రుడైన చాలడు. స్వయముగా పుట్టిన బ్రహ్మకును ఈ నాసేన తరుగవోనిదై చంపశక్యము గాకుండును.

యుధిష్ఠిరః పురం హిత్వా పఞ్చగ్రామాన్ స యాచతి,
భీతో హి మామకాత్ సైన్యాత్ ప్రభావాచ్చైవ మే విభో. 30

రాజా! నా సేనవలనను, నా ప్రభావమువలనను, భయపడియే గదా ఆ యుధిష్ఠిరుడు పురమును వదలి అయిదుగ్రామముల నడుగుకొనుచున్నాడు.

సమర్థం మన్యసే యచ్చ కున్తీపుత్రం వృకోదరమ్,
తన్మిథ్యా న హి మే కృత్స్నం ప్రభావం వేత్సి భారత. 31

---

27. పరవికత్థనే - పగవారి గుణములను పొగడుటయందు;

29. బ్రహ్మణః అపి - బ్రహ్మకును; - అక్షయ్యరూపా-నాశము చేయరానిది, సృష్టిచేసిన బ్రహ్మయు దీనిని నశింపజేయలేదని భావము; హన్తుమ్ (అశక్యా) - చంపరానిది.

భారతా! ఇక ఆ కుంతికొడుకు - తోడేలుపొట్టవా డుండెనే వాడు సమర్థుడని నీ వనుకొనుచున్నావు. అది మిథ్య. నీవు నాప్రభావము మొత్తము నెరుగవు.

మత్సమో హి గదాయుద్ధే పృథివ్యాం నాస్తి కశ్చన,
నాసీత్ కశ్చిదతిక్రాన్తో భవితా చ న కశ్చన. 32

గదాయుద్ధమున నాకు దీటైన వాడీ భూమండలములో లేడు. మునుపు లేడు. ముందుండబోడు.

యుక్తో దుఃఖోషితశ్చాహం విద్యాపారగత స్తథా,
తస్మాచ్చ భీమా న్నాన్యేభ్యో భయం మే విద్యతే క్వచిత్. 33

నేనెంతో పట్టుదలతో గురుకులమున పడరానిపాట్లు పడి ఆవిద్యలో అంతము చూచితిని. కాని భీమునివలనకాని, మరియెవ్వరివలనగాని ఎందును నాకు భయములేదు.

దుర్యోధనసమో నాస్తి గదాయామితి నిశ్చయః,
సంకర్షణస్య భద్రం తే యత్తదైన ముపావసమ్. 34

నేను బలరామునికడ శిష్యునిగా కొలుచు దినములలోనే గదాయుద్ధమున దుర్యోధనునకు దీటైనవాడు లేడని (అందరు చేసిన) నిశ్చయము. నీకు మేలగుగాక!

యుద్ధే సంకర్షణసమో బలే నాభ్యధికో భువి,
గదాప్రహారం భీమో మే న జాతు విషహే ద్యుధి. 35

యుద్ధమున, బలమున బలదేవునకు ఈడైనవాడను. నా గదదెబ్బను భీము డొక్కనాటికి తట్టుకొనలేడు.

ఏకం ప్రహారం యం దద్యాం భీమాయ రుషితో నృప,
స ఏ వైనం నయే ద్ఘోరః క్షిప్రం వైవస్వతక్షయమ్. 36

---

33. యుక్తః - పట్టుదల గలవాడు; దుఃఖోషితః - గురుకులమున కష్టములు పడి నిలిచినవాడు;

34. ఉపావసమ్ - శిష్యునిగా సేవ చేసితిని;

నేను కోపముతో ఒక్క దెబ్బ కొట్టినచో, ఆ ఘోరమగు దెబ్బ భీముని వెనువెంటనే యమునిల్లు చేర్చును.

ఇచ్ఛేయం చ గదాహస్తం రాజన్ ద్రష్టుం వృకోదరమ్,
సుచిరం ప్రార్థితో హ్యేష మమ నిత్యం మనోరథః. 37

రాజా! గద చేపట్టిన వృకోదరు నెన్నడు చూతునా? యనునది నేను నిత్యము కోరెడు రుచికరమైన కోరిక.

గదయా నిహతో హ్యాజౌ మయా పార్థో వృకోదరః,
విశీర్ణగాత్రః పృథివీం పరాసుః ప్రపతిష్యతి. 38

కుంతికొడుకు, తోడేలుపొట్టవాడు, నేను యుద్ధమున గదతో కొట్టగా నుగ్గైన దేహముతో ప్రాణములు కోల్పోయి నేల కూలును.

గదాప్రహారాభిహతో హిమవానపి పర్వతః,
సకృన్మయా విదీర్యేత గిరిః శతసహస్రధా. 39

నే నొక్కమారు గదతో కొట్టినచో హిమవత్పర్వతముకూడ నూరువేల ముక్కలుగా పగిలిపోవును.

స చాప్యేత ద్విజానాతి వాసుదేవార్జునౌ తథా,
దుర్యోధనసమో నాస్తి గదాయా మితి నిశ్చయః. 40

గదావిషయమున దుర్యోధనునకు సాటి యైనవాడు లేదని ఆ భీముడు నెరుగును. అట్లే కృష్ణార్జునులకును తెలియును.

తత్తే వృకోదరమయం భయం వ్యేతు మహాహవే,
వ్యపనేష్యా మ్యహం హ్యేనం మా రాజన్ విమనా భవ. 41

రాజా! కావున నీకు భీమునివలన నైన భయము తొలగుగాక! మహాయుద్ధమున నేను వానిని రూపు మాపెదను. నీవు మనసు పాడుచేసుకొనకుము.

తస్మిన్ మయా హతే క్షిప్రం మర్జునం బహవో రథాః,
తుల్యరూపా విశిష్టాశ్చ క్షేప్స్యన్తి భరతర్షభ. 42

వాడు నాచేత చావగా వెనువెంటనే అనేకరథికులు అర్జునునికి సాటివచ్చు వారును, మించువారును వానిని తుక్కుదూగరగా గొట్టుదురు.

భీష్మో ద్రోణః కృపో ద్రౌణిః కర్ణో భూరిశ్రవా స్తథా,
ప్రాగ్జ్యోతిషాధిపః శల్యః సిన్ధురాజో జయద్రథః, 43
ఏకైక ఏషాం శక్తస్తు హన్తుం భారత పాణ్డవాన్,
సమేతాస్తు క్షణే నైతా న్నేష్యన్తి యమసాదనమ్.

భీష్ముడు, ద్రోణుడు, కృపుడు, అశ్వత్థామ, కర్ణుడు, భూరిశ్రవుడు, ప్రాగ్జ్యోతిషరాజు శల్యుడు, సింధురాజగు జయద్రథుడు - వీరిలో ఒక్కడొక్క డును పాండవులను పరిమార్పగలడు. అందరు కలసినచో ఒక్కక్షణములో వారిని యమలోకమున కంపుదురు.

సమగ్రా పార్థివీ సేనా పార్థమేకం ధనఞ్జయమ్, 44
కస్మాదశక్తా నిర్జేతు మితి హేతు ర్న విద్యతే.

అందరు కూడిన రాజులసేన ఒక్క అర్జునుని ఏల గెలువజాలదు? దీనికి కారణ మేమియు కన్పట్టదు.

శరవ్రాతైస్తు భీష్మేణ శతశో నిచితోఽవశః, 45
ద్రోణద్రౌణికృపై శ్చైవ గన్తా పార్థో యమక్షయమ్.

భీష్ముడు, ద్రోణుడు, అశ్వత్థామ, కృపుడు అంపగుదులను నూర్లకొలది గ్రుచ్చగా ఆ అర్జునుడు యమలోకమున కరుగును.

పితామహోఽపి గాఙ్గేయః శన్తనోరధ భారత, 46
బ్రహ్మర్షిసదృశో జజ్ఞే దేవైరపి సుదుఃసహః.

ఈ తాత గంగకొడుకు శంతనునివలన బ్రహ్మర్షికి దీటైనవాడై పుట్టెను. దేవతలకును (అసాధ్యుడు) తట్టుకొనరానివాడు.

న హన్తా విద్యతే చాపి రాజన్ భీష్మస్య కశ్చన, 47
పిత్రా హ్యుక్తః ప్రసన్నేన నాకామ స్త్వం మరిష్యసి.

భీష్ముని చంపగలవా డెవ్వడు లేడు. తండ్రి మెప్పుదలతో, 'నీవు కోరక మరణింప'వని వర మొసగెను గదా!

బ్రహ్మర్షేశ్చ భరద్వాజా ద్ద్రోణ్యాం ద్రోణా మజాయత. 48

ద్రోణుడు భరద్వాజునకు దొన్నెయందు పుట్టెను.

ద్రోణా జ్జజ్ఞే మహారాజ ద్రౌణిశ్చ పరమాస్త్రవిత్.

మహారాజా! ఈ అశ్వత్థామ ద్రోణునివలన పుట్టెను. మహాస్త్రము లన్నియు నేర్చెను.

కృప శ్చాచార్యముఖ్యోఽయం మహర్షే ర్గౌతమా దపి, 49

శర స్తంభోద్భవః శ్రీమా నవధ్య ఇతి మే మతిః.

మరియు ఆచార్యులలో శ్రేష్ఠుడగు కృపుడు రెల్లుకాదనుండి మహర్షి గౌతమునివలన పుట్టెను. ఈ శ్రీమంతు డెవ్వరివలనను చావ డని నా అభిప్రాయము.

అయోనిజా స్త్రయో హ్యేతే పితా మాతా చ మాతులః, 50

అశ్వత్థామ్నో మహారాజ స చ శూరః స్థితో మమ.

అశ్వత్థామ తండ్రి, తల్లి, మేనమామ ఈ ముగ్గురు స్త్రీగర్భమున పుట్టని మహానుభావులు. అట్టి శూరుడు నాకడ నున్నాడు.

సర్వ ఏతే మహారాజ దేవకల్పా మహారథాః, 51

శక్రస్యాపి వ్యథాం కుర్యుః సంయుగే భరతర్షభ.

మహారాజా! వీరందరు దేవతలవంటివారు. మహారథులు. యుద్ధమున దేవేంద్రుని కూడ బాధింపగలవారు.

నైతేషా మర్జునః శక్త ఏకైకం ప్రతి వీక్షితుమ్, 52

సహితాస్తు నరవ్యాఘ్రా హనిష్యన్తి ధనఞ్జయమ్.

వీరిలో ఒక్కని నొక్కనినైనను అర్జునుడు తేరిపార జూడలేడు. అందరు కలసినచో ఆ నరవరులు ధనంజయుని అంతము చేయగలరు.

భీష్మద్రోణకృపాణాం చ తుల్యః కర్ణో మతో మమ, 53

అనుజ్ఞాతశ్చ రామేణ మత్సమోఽసీతి భారత.

భీష్మద్రోణకృపులకు కర్ణుడు సాటి యని నా అభిప్రాయము. పరశురాముడు 'నీవు నాయంతటివాడ'వని కర్ణు నంగీకరించెను.

కుణ్డలే రుచిరే చాస్తాం కర్ణస్య సహజే శుభే, 54
తే శచ్యర్థం మహేన్ద్రేణ యాచితః స పరంతపః.

ఆ కర్ణునకు పుట్టుకతో వచ్చిన ఇంపైన కుండలము లుండెడివి. మహేంద్రుడు శచీదేవికై కర్ణుని ముష్టియెత్తి వానిని కొనిపోయెను.

అమోఘయా మహారాజ శక్త్యా పరమభీమయా, 55
తస్య శక్త్యోపగూఢస్య కస్మా జ్జీవే ద్ధనఞ్జయః.

మహారాజా! మిక్కిలి భయము గొలుపునదియు, వ్యర్థము కానిదియు నగు శక్తి మూల్యముగా ఆ కుండలము లిచ్చెను. అట్టి శక్తిగల కర్ణునకు ఎదురై అర్జునుడు బ్రదుకు టెట్లు?

విజయో మే ధ్రువం రాజన్ ఫలం పాణా వివాహితమ్. 56

రాజా! చేతిలో పెట్టిన పండువలె గెలుపు నాకు తథ్యము.

అభివ్యక్తః పరేషాం చ కృత్స్నో భువి పరాజయః.

శత్రువులకు మొత్తముగా అపజయము కలుగు నని భూమియం దంతట వెల్లడియైనది.

అహ్నా హ్యేకేన భీష్మోఽయం ప్రయుతం హన్తి భారత, 57
తత్సమాశ్చ మహేష్వాసా ద్రోణద్రౌణికృపా అపి.

ఈ భీష్ము డొక్కదినమున పదిలక్షలమంది వీరులను సంహరింపగలడు. గొప్ప విల్లు ధరించిన ద్రోణుడు, అశ్వత్థామ, కృపుడుకూడ అతనితో సమానులు.

సంశప్తకానాం వృన్దాని క్షత్రియాణాం పరంతప, 58
అర్జునం వయ మస్మాన్ వా నిహన్యాత్ కపికేతనః,
తం చాల మితి మన్యన్తే సవ్యసాచివధే ధృతాః. 59

క్షత్రియు లైన సంశప్తకుల గణములు మే మర్జునునో మ మ్మర్జునుడో చంపవలయు నను పట్టుదలతో అర్జునుని వధించుటలో సమర్థులమని తలపోయుచున్నారు.

పార్థివాః స భవాం స్తేభ్యో హ్యేకస్మా ద్వ్యథతే కథమ్,
భీమసేనే చ నిహతే కోఽన్యో యుద్ధ్యేత భారత. 60

ఆ రాజు లట్లుండగా నీవు ఏ కారణము లేక ఆ పాండవులవలన ఏల వ్యథపడుచున్నావు? భీమసేనుడు చావగా నచట పోరు సలుపువా డెవ్వడు?

పరేషాం తన్మమాచక్ష్వ యది వేత్థ పరంతప,
పఞ్చ తే భ్రాతరః సర్వే ధృష్టద్యుమ్నోఽథ సాత్యకిః, 61
పరేషాం సప్త యే రాజన్ యోధాః సారం బలం మతమ్.

పగవారిలో వీరు డెవ్వడో ఎరిగినచో చెప్పుము. ఆ అయిదుగురు సోదరులు, ధృష్టద్యుమ్నుడు, సాత్యకి - వీ రేడుగురే కదా యోధులు. వారి సారమంతయే యని నా అభిప్రాయము.

అస్మాకం తు విశిష్టా యే భీష్మద్రోణకృపాదయః, 62
ద్రౌణి ర్వైకర్తనః కర్ణః సోమదత్తోఽథ బాహ్లికః,
ప్రాగ్జ్యోతిషాధిపః శల్య ఆవన్త్యౌ చ జయద్రథః, 63
దుఃశాసనో దుర్ముఖశ్చ దుఃసహశ్చ విశామ్పతే,
శ్రుతాయు శ్చిత్రసేనశ్చ పురుమిత్రో వివింశతిః, 64
శలో భూరిశ్రవాశ్చైవ వికర్ణశ్చ తవాత్మజః.

మన కన్ననో విశిష్టులు ఎందరో కలరు. భీష్ముడు, ద్రోణుడు, కృపుడు మొదలగువారు మరియు అశ్వత్థామ, సూర్యునికొడుకు కర్ణుడు, సోమదత్తుడు, బాహ్లికుడు, ప్రాగ్జ్యోతిషరాజు భగదత్తుడు, శల్యుడు, అవంతిరాజసోదరులు విందానువిందులు, సైంధవుడు, దుశ్శాసనుడు, దుర్ముఖుడు, దుస్సహుడు, శ్రుతాయువు, చిత్రసేనుడు, పురుమిత్రుడు, వివింశతి, శలుడు, భూరిశ్రవుడు, నీ కొడుకు వికర్ణుడు మొదలగువారు గలరు.

అక్షౌహిణ్యో హి మే రాజన్ దశైకా చ సమాహృతాః, 65
న్యూనాః పరేషాం సప్తైవ కస్మా న్మే స్యాత్ పరాజయః.

రాజా! నేను పదునొకం డక్షౌహిణుల సేనను తెచ్చితిని. పగవారికో మనకన్న తక్కువ. ఏడే అక్షౌహిణులు. నా కపజయ మెట్లు కలుగును?

బలం త్రిగుణతో హీనం యోధ్యం ప్రాహ బృహస్పతిః,
పరేభ్య స్త్రిగుణా చేయం మమ రాజ న్ననీకినీ. 66

మూ డంశములు తక్కువయైన సేనతో పోర దగునని బృహస్పతి చెప్పెను. రాజా! నా సేన పరులసేనకంటె మూడంశము లధికమైనది.

గుణహీనం పరేషాం చ బహు పశ్యామి భారత,
గుణోదయం బహుగుణ మాత్మనశ్చ విశాంపతే. 67

పరుల బలము మిక్కిలి గుణహీనమైనదిగా నాబలము గుణముల వృద్ధి కలిగి, పలుగుణములు కలదిగా కన్పట్టుచున్నది.

ఏతత్ సర్వం సమాజ్ఞాయ బలాగ్ర్యం మమ భారత,
న్యూనతాం పాణ్డవానాం చ న మోహం గన్తు మర్హతి. 68

ఇది యంతయు చక్కగా నెరిగి నా సేన బలవంతమైన దనియు, పాండవుల సేన తక్కువదనమును గుర్తించి నీవు మోహపడకుండవలయును.

ఇత్యుక్త్వా సఞ్జయం భూయః పర్యపృచ్ఛత భారత,
వివిత్సుః ప్రాప్తకాలాని జ్ఞాత్వా పరపురంజయః. 69

దుర్యోధను డిట్లు పలికి, కాలమునకు తగిన పను లేవో తెలియగోరుచు, సంజయునితో మరల నిట్లు పలికెను.

ఇతి శ్రీమహాభారతే ఉద్యోగపర్వణి యానసంధిపర్వణి
దుర్యోధనవాక్యే పఞ్చపఞ్చాశత్తమోఽధ్యాయః.

ఇది శ్రీమహాభారతము ఉద్యోగపర్వమున యానసంధిపర్వమున
దుర్యోధనుని పలుకు గల ఏబదియైదవ అధ్యాయము.

—(o)—

66. త్రిగుణతః - మూడంశములచేత; హీనమ్ - తక్కువ అయిన దానిని; త్రిగుణా - మూడంశము లధికముగా గలది.

# షట్పఞ్చాశత్తమోఽధ్యాయః

## ఏబదియారవ అధ్యాయము

సఞ్జయేన ధనఞ్జయస్య ధ్వజాశ్వాదీనాం ధర్మరాజప్రభృతీనాం చాశ్వానాం వర్ణనమ్.

సంజయుడు ధనంజయుని ధ్వజము, అశ్వములు మున్నగువానిని, ధర్మరాజాదుల అశ్వములను వర్ణించుట.

దుర్యోధన ఉవాచ - దుర్యోధను డిట్లడిగెను.

అక్షౌహిణీః సప్త లబ్ధ్వా రాజభిః సహ సఞ్జయ,
కింస్వి దిచ్ఛతి కౌన్తేయో యుద్ధప్రేప్సు ర్యుధిష్ఠిరః. 1

సంజయా! ఏడక్షౌహిణులు సంపాదించి యుద్ధమునకు సిద్ధమైన ధర్మరాజు రాజులతోపాటు ఏమి చేయగోరుచున్నాడు?

సఞ్జయ ఉవాచ - సంజయు డిట్లు చెప్పెను.

అతీవ ముదితో రాజన్ యుద్ధప్రేప్సు ర్యుధిష్ఠిరః,
భీమసేనార్జునౌ చోభౌ యమావపి న బిభ్యతః. 2

రాజా! యుద్ధము గోరుచున్న ధర్మరాజు మిక్కిలి పొంగిపోవుచున్నాడు. అట్లే భీమార్జునులును, కవలలును. వారు భయపడుటలేదు.

రథం తు దివ్యం కౌన్తేయః సర్వా విభ్రాజయన్ దిశః,
మన్త్రం జిజ్ఞాసమానః సన్ బీభత్సుః సమయోజయత్. 3

ఆ బీభత్సుడు తన మంత్రశక్తి నెరుగగోరి, దిక్కుల నన్నింటిని వెలిగించుచు తన దివ్యరథమును సిద్ధపరచెను.

తమపశ్యామ సన్నద్ధం మేఘం విద్యుద్యుతం యథా,
సమన్తాత్ సమభిధ్యాయ హృష్యమాణోఽభ్యభాషత. 4

---

3. జిజ్ఞాసమానః - పరీక్షింపగోరుచు;

అట్లు సిద్ధపడియున్న అర్జునుని మెరపుతోకూడిన మేఘమువలె కనుగొంటిమి. అన్నివైపుల చక్కగా ధ్యానించి సంతోషముతో నాతడిట్లు పలికెను.

పూర్వరూప మిదం పశ్య వయం జేష్యామ సఞ్జయ,
బీభత్సు ర్మాం యథోవాచ తథావైమ్యహ మప్యుత. 5

సంజయా! ఇదిగో శకునము చెప్పుచున్నాను. మేము గెలుతుము. ఆ వివ్వచ్చు డన్నట్లే యగునని నాకు తోచుచున్నది.

దుర్యోధన ఉవాచ - దుర్యోధను డిట్లనెను.

ప్రశంస స్యభినన్దం స్తాన్ పార్థా నక్షపరాజితాన్,
అర్జునస్య రథే బ్రూహి కథ మశ్వాః కథం ధ్వజాః. 6

జూదములో ఓడిన ఆ పృథకొడుకులను పెద్దచేయుచు కొనియాడుచున్నావు. అర్జునుని రథమునందలి గుఱ్ఱము లెట్టివో టెక్కెము లెట్టివో పలుకుము.

సఞ్జయ ఉవాచ - సంజయు డిట్లు పలికెను.

భౌమనః సహ శక్రేణ బహుచిత్రం విశామ్పతే,
రూపాణి కల్పయామాస త్వష్టా ధాతా సదా విభో. 7

ఇంద్రునితో కలిసి విశ్వకర్మయు, త్వష్టయను ప్రజాపతియు బహుచిత్రముగా ఎన్నో రూపములు ఎల్లవేళల కల్పించుచుండిరి.

ధ్వజే హి తస్మిన్ రూపాణి చక్రు స్తే దేవమాయయా,
మహాధనాని దివ్యాని మహాన్తి చ లఘూని చ. 8

అట్టి రూపముల నన్నింటిని ఎంతో విలువగలవానిని, పెద్దవానిని, చిన్నవానిని, అతని ధ్వజమున దేవమాయతో వారు ఏర్పరచిరి.

---

5 పూర్వరూపమ్-శకునము; తథా, అవైమి, అహమ్, అపి, ఉత - అని పదవిభాగము;

7. భౌమనః-విశ్వకర్మ; త్వష్టా ధాతా-త్వష్ట యను ప్రజాపతి;

8. తే - వారు; విశ్వకర్మ - ఇంద్రుడు, త్వష్టృప్రజాపతి.

భీమసేనానురోధాయ హనూమాన్ మారుతాత్మజః,
ఆత్మప్రతికృతిం తస్మిన్ ధ్వజ ఆరోపయిష్యతి. 9

భీమసేనుని ప్రీతికై వాయుదేవుని పుత్రుడు హనుమంతు డాధ్వజమున తన బొమ్మ నందు సమకూర్చును.

సర్వా దిశో యోజన మాత్ర మన్తరం
స తిర్య గూర్ధ్వం చ రురోధ వై ధ్వజః,
న సంసజ్జత్యసౌ తరుభిః సంవృతోఽపి
తథా హి మాయా విహితా భౌమనేన. 10

ఆ ధ్వజము యోజనము మేర అన్ని దిక్కులను అడ్డముగా, నిలువుగా తన తేజస్సుతో ఆక్రమించెను. చెట్లు క్రమ్మియున్నను అది తగులుకొనదు. ఆ విశ్వకర్మ అట్టి మాయ దాని కేర్పరచెను.

యథాకాశే శక్రధనుః ప్రకాశతే
న చైకవర్ణం న చ వేద్మి కిం ను తత్,
తథా ధ్వజో విహితో భౌమనేన
బహ్వాకారం దృశ్యతే రూపమస్య. 11

ఆకసమున ఇంద్రధనువు వెలుగు నట్లు ఒక రంగు కాదు, అదేమియో యెరుగను. ఆ విశ్వకర్మ ఆ ధ్వజము నట్లు నిర్మించెను. దాని రూపము పెక్కు ఆకారములు కలిగి కానవచ్చును.

యథాగ్నిధూమో దిన మేతి రుద్ధ్వా
వర్ణాన్ బిభ్రత్తైజసాం శ్చిత్రరూపాన్,
తథా ధ్వజో విహితో భౌమనేన
న చే ద్భారో భవితా నోత రోధః. 12

నిప్పు పొగ క్రమ్మి చిత్రవిచిత్రము లగు రూపములు గల అగ్నిసంబంధము లగు రంగులను తాల్చుచు, గగనమున కెగసిన విధముగా ఆ విశ్వకర్మ ఆ ధ్వజమును నిర్మించెను. మరియు ఆ రథమున బరువు లేదు. ద్వారము మున్నగు తావులలో నది నిలిచిపోదు.

10. రురోధ-తన తేజస్సుతో అడ్డగించెను.

శ్వేతా స్తస్మిన్ వాతవేగాః సదశ్వా
దివ్యా యుక్తా శ్చిత్రరథేన దత్తాః,
భువ్య న్తరిక్షే దివి వా నరేన్ద్ర
యేషాం గతి ర్హీయతే నాత్ర సర్వా.

ఆ రథమునకు పూన్చిన గుఱ్ఱములు తెల్లనివి. వాయువేగమువంటి వేగము గలవి. చిత్రరథు డిచ్చినవి. వాని గమనము నింగిపై నేలపై, స్వర్గము నందు మందగింపదు.

శతం యత్ర త్పూర్యతే నిత్యకాలం
హతం హతం దత్తవరం పురస్తాత్. 13

చచ్చినవి చచ్చుచుండగా ఎల్ల వేళల నూరుసంఖ్య తరుగకుండునట్లు మున్ను ఇచ్చిన వరము గలదు.

తథా రాజ్ఞో దన్తవర్ణా బృహన్తో
రథే యుక్తా భాన్తి తద్వీర్యతుల్యాః,
ఋక్షప్రఖ్యా భీమసేనస్య వాహా
రథే వాయో స్తుల్యవేగా బభూవుః. 14

---

13. అశ్వానాం శతం హతం హతమ్-నూరు గుఱ్ఱములలో చచ్చినది చావగా; నిత్యకాలమ్-ఎల్లవేళల; శతం-నూరు; పూర్యతే-నిండును. ఏలయన; పురస్తాత్-మునుపు, దత్తవరమ్-అట్లని ఇచ్చిన వరము గలదు.

14. తథా-ఆ విధముగానే-అర్జునుని గుఱ్ఱము లట్లే అమరములు; దన్తవర్ణాః-తెల్లని వన్నెగలవి; రథే యుక్తాః-రథమున పూన్చినవియై; భాన్తి-ప్రకాశించుచున్నవి; ఋక్షప్రఖ్యాః - ఋక్షము లనగా నక్షత్రములు. ఇచ్చట సప్తర్షిమండలమును గ్రహింప దగును. సప్తర్షినక్షత్రములవంటి తేజముగలవి. 'ఋక్షా ఇతి స్మ వై పురా సప్త ఋషీ నాచక్షతే' - ఋక్షములని గదా పూర్వము సప్తఋషులను పేర్కొందురు-అని శతపథ బ్రాహ్మణమున గలదు.

ఋశ్యమని పాఠాంతరము గలదు. ఆ పక్షమున ఒక మృగము. దాని వంటి వని భావము.

అట్లే ధర్మరాజు రథమునకు పూన్చిన గుఱ్ఱములు దంతములవంటి వన్నె కలవి, పెద్దవి. అర్జునుని గుఱ్ఱముల వంటి బలము కలవి. భీమసేనుని గుఱ్ఱములు సప్తర్షులకు దీటైన తేజస్సు, గాలి వేగమువంటి వేగము గలిగి అలరారు చున్నవి.

కల్మాషాఙ్గా స్తిత్తిరిచిత్రపృష్ఠా
భ్రాత్రా దత్తా ప్రీయతా ఫాల్గునేన,
భ్రాతు ర్వీరస్య స్వైస్తురఙ్గై ర్విశిష్టా
ముదా యుక్తాః సహదేవం వహన్తి. 15

కావివన్నెయు, తీతువు పిట్టవలె చిత్రమైన వెన్నును కలవియు, అన్న యగు అర్జునుడు ప్రీతివడి యిచ్చినవియు, వీరుడగు అన్న గుఱ్ఱములతో దీటైన వియు, ఎల్లప్పుడు ఉత్సాహముతో ఉరకలు వేయునవియు నగు గుఱ్ఱములు సహదేవుని రథమును మోయుచున్నవి.

మాద్రీపుత్రం నకులం త్వాజమీఢ
మహేన్ద్రదత్తా హరయో వాజిముఖ్యాః,
సమా వాయో ర్బలవన్త స్తరస్వినో
వహన్తి వీరం వృత్రశత్రుం యథేన్ద్రమ్. 16

అజమీఢవంశమున పుట్టిన రాజా! మహేంద్రు డిచ్చినవియు, పసిమివన్నె గలవియు, వాయువునకు దీటైనవి, బలము, దమ్ము గలవియు నగు గుఱ్ఱములు వృత్రుని చంపిన ఇంద్రునివంటి వీరుడు మాద్రి కొడుకగు నకులుని మోయుచున్నవి.

తుల్యాం శ్చైభి ర్వయసా విక్రమేణ
మహాజవా శ్చిత్రరూపాః సదశ్వాః,
సౌభద్రాదీన్ ద్రౌపదేయాన్ కుమారాన్
వహన్త్యశ్వా దేవదత్తా బృహన్తః. 17

---

17. దేవదత్తాః-దేవజాతివాడగు చిత్రరథుడను గంధర్వు డిచ్చినవి.

వయసున పరాక్రమమున వీనితో సాటివచ్చునవియు, గొప్పవేగము గలవియు, చిత్రములగు వన్నెలు గలవియు, ఉత్తమజాతికి చెందినవియు చిత్రరథు డిచ్చిన పెద్ద గుఱ్ఱములు అభిమన్యుడు మున్నగువారిని ద్రౌపది కొడుకులను తాల్చుచున్నది.

ఇతి శ్రీమహాభారతే ఉద్యోగపర్వణి యానసంధిపర్వణి
సంజయవాక్యే షట్పఞ్చాశత్తమోఽధ్యాయః.

ఇది శ్రీమహాభారతము ఉద్యోగపర్వమున యానసంధిపర్వమున
సంజయవాక్యము గల ఏబదియారవ అధ్యాయము.

—(o)—

## సప్తపఞ్చాశత్తమోఽధ్యాయః
## ఏబదియేడవ అధ్యాయము

సఞ్జయేన శాత్రవాణాం సమరోద్యోగసమనువర్ణనమ్, ధృతరాష్ట్రవిలాపః, దుర్యోధనేన స్వపక్షప్రాబల్యప్రతిపాదనమ్, తదుపరి ధృతరాష్ట్ర స్యావిశ్వాసః, సఞ్జయేన ధృష్టద్యుమ్నసందేశనివేదనం చ.

సంజయుడు శత్రువుల యుద్ధప్రయత్నమును వివరించుట; ధృతరాష్ట్రుని విలాపము; దుర్యోధనుడు తనవైపువారి ప్రాబల్యమును ప్రతిపాదించుట, ధృతరాష్ట్రుడు దానిని నమ్మకుండుట, సంజయుడు ధృష్టద్యుమ్నుని సందేశమును నివేదించుట.

ధృతరాష్ట్ర ఉవాచ - ధృతరాష్ట్రు డిట్లు పలికెను.

కాం స్తత్ర సంజయాపశ్యః ప్రీత్యర్థేన సమాగతాన్,
యే యోత్స్యన్తే పాణ్డవార్థే పుత్రస్య మమ వాహినీమ్. 1

సంజయా! పాండవులప్రీతికై నా కొడుకు సేనతో పోరగలవారి నెవరి నట చూచితివి?

సఞ్జయ ఉవాచ - సంజయు డిట్లు పలికెను.

ముఖ్య మన్ధకవృష్ణీనా మపశ్యం కృష్ణ మాగతమ్,
చేకితానం చ తత్రైవ యుయుధానం చ సాత్యకిమ్. 2

అంధక వృష్ణి వంశములకు పెద్ద కృష్ణుని చూచితిని. ఆ వంశమువారే యగు చేకితానుని, యుయుధానుని, సాత్యకిని గాంచితిని.

పృథగక్షౌహిణీభ్యాం తు పాణ్డవా నభిసంశ్రితౌ,
మహారథౌ సమాఖ్యాతా వుభౌ పురుషమానినౌ. 3

వా రిరువురు మహారథులను ప్రసిద్ధి గన్నవారు. గొప్ప పౌరుషము గలవారు. ఇద్దరు విడివిడిగా ఒక్కొక్క అక్షౌహిణీసేనతో పాండవులను చేర కొనిరి.

అక్షౌహిణ్యాఽథ పాఞ్చాల్యో దశభి స్తనయై ర్వృతః,
సత్యజిత్ప్రముఖై ర్వీరై ర్ధృష్టద్యుమ్నపురోగమైః. 4

పాంచాలరాజు ద్రుపదుడు, సత్యజిత్తు మున్నుగాగల పదిమంది కొడుకులతో ధృష్టద్యుమ్నుడు ముందు నడచుచుండగా ఒక అక్షౌహిణి సేనతో వచ్చెను.

ద్రుపదో వర్ధయన్ మానం శిఖణ్డిపరిపాలితః,
ఉపాయా త్సర్వసైన్యానాం ప్రతిచ్ఛాద్య తదా వపుః. 5

పరువు పెంచుకొనుచు, శిఖండి రక్షించుచుండగా సమస్తసేనల దేహమును కప్పి ద్రుపదుడు వచ్చెను.

విరాటః సహపుత్రాభ్యాం శఙ్ఖే నైవోత్తరేణ చ,
సూర్యదత్తాదిభి ర్వీరై ర్మదిరాక్షపురోగమైః, 6
సహితః పృథివీపాలో భ్రాతృభి స్తనయై స్తథా,
అక్షౌహిణ్యైవ సైన్యానాం వృతః పార్థం సమాశ్రితః. 7

విరాటమహారాజు శంఖుడు, ఉత్తరుడు, అను నిద్దరు కొడుకులతో సూర్యదత్తుడు, మదిరాక్షుడు మున్నగు వీరులగు తమ్ములతో కూడి ఒక అక్షౌహిణి సేనతో ధర్మరాజును చేరుకొనెను.

జారాసంధి ర్మాగధశ్చ ధృష్టకేతుశ్చ చేదిరాట్,
పృథక్పృథగనుప్రాప్తౌ పృథగక్షౌహిణీవృతౌ. 8

మగధరాజు జరాసంధుని కొడుకు అగు సహదేవుడును, చేదిరాజగు ధృష్టకేతుడును విడివిడిగా ఒక్కొక్క అక్షౌహిణితో వచ్చిరి.

కేకయా భ్రాతరః పఞ్చ సర్వే లోహితకధ్వజాః,
అక్షౌహిణీపరివృతాః పాణ్డవా నభిసంశ్రితాః. 9

కేకయరాజులైన అయిదుగురన్నదమ్ములు అందరు ఎఱ్ఱని జెండాలవారు. ఒక అక్షౌహిణిసేనతో పాండవుల కడకు వచ్చి చేరిరి.

ఏతా నేతావత స్తత్ర తానపశ్యం సమాగతాన్,
యే పాణ్డవార్థే యోత్స్యన్తి ధార్తరాష్ట్రస్య వాహినీమ్, 10

పాండవులకై ధృతరాష్ట్రుని కొడుకు సేనతో పోరుటకు వచ్చినవారి నింత మాత్ర మచట చూచితిని.

యో వేద మానుషం వ్యూహం దైవం గాన్ధర్వ మాసురమ్,
స తత్ర సేనాప్రముఖే ధృష్టద్యుమ్నో మహారథః. 11

మనుష్యులకు, దేవతలకు, గంధర్వులకు, రాక్షసులకు సంబంధించిన వ్యూహముల నెరిగిన మహారథుడు ధృష్టద్యుమ్నుడు సేనకు ముందు నిలిచి యున్నాడు.

భీష్మః శాన్తనవో రాజన్ భాగః క్లుప్తః శిఖణ్డినః
తం విరాటోఽనుసంయాతా సార్ధం మత్స్యైః ప్రహారిభిః. 12

శంతనుకుమారు డగు భీష్ముని శిఖండిపాలుగా ఏర్పరచిరి. అతనికి తోడుగా విరాటుడు, మత్స్యదేశపు పోటుగాండ్రతో నడచును.

జ్యేష్ఠస్య పాణ్డుపుత్రస్య భాగో మద్రాధిపో బలీ,
తౌ తు తత్రాబ్రువన్ కేచి ద్విషమౌ నో మతా వితి. 13

పాండుని పెద్దకొడుకుభాగము బలవంతుడగు మద్రరాజు శల్యుడు. కాని అందు కొందరు వీరిరువురు సమయోధులు కారని తెలిపియుండిరి.

దుర్యోధనః సహసుతః సార్ధం భ్రాతృశతేన చ,
ప్రాచ్యాశ్చ దాక్షిణాత్యాశ్చ భీమసేనస్య భాగతః. 14

కొడుకులతోపాటు నూరుగురు తమ్ములతోపాటు దుర్యోధనుడును, తూర్పు దక్షిణదిక్కుల రాజులును భీమసేనుని పాలు.

అర్జునస్య తు భాగేన కర్ణో వైకర్తనో మతః,
అశ్వత్థామా వికర్ణశ్చ సైన్ధవశ్చ జయద్రథః. 15

సూర్యునికొడు కగు కర్ణుడును, అశ్వత్థామ, వికర్ణుడు, సింధురాజగు జయద్రథుడు అర్జునుని పాలు.

అశక్యాశ్చైవ యే కేచిత్ పృథివ్యాం శూరమానినః,
సర్వాం స్తా నర్జునః పార్థః కల్పయామాస భాగతః. 16

ఇంకను శూరుల మనుకొను అసాధ్యులగు రాజులు భూమిపై ఎవరెవరు కలరో, వా రందరు అర్జునుని భాగముగా నగుదురు.

మహేష్వాసా రాజపుత్రా భ్రాతరః పఞ్చ కేకయాః,
కేకయా నేవ భాగేన కృత్వా యోత్స్యన్తి సంయుగే 17

గొప్పవిలుకాండ్రైన రాజపుత్రులు కేకయసోదరు లయిదుగురు (మన పక్షమున నున్న) కేకయులనే పాలుగా చేసికొని యుద్ధమున పోరుదురు.

తేషా మేవ కృతో భాగో మాలవాః శాల్వకా స్తథా,
త్రిగర్తానాం చైవ ముఖ్యౌ యౌ తౌ సంశప్తకా వితి. 18

ఆ కేకయసోదరులే మాలవులను, శాల్వకులను, త్రిగర్తులలో ముఖ్యులగు సంశప్తకులను చంపుదురు.

దుర్యోధనసుతాః సర్వే తథా దుఃశాసనస్య చ,
సౌభద్రేణ కృతో భాగో రాజా చైవ బృహద్బలః. 19

దుర్యోధనుని, దుశ్శాసనుని కొడుకులు మరియు బృహద్బలు డను రాజు అభిమన్యుని పాలు.

ద్రౌపదేయా మహేష్వాసాః సువర్ణవికృతధ్వజాః,
ధృష్టద్యుమ్నముఖా ద్రోణ మభియాస్యన్తి భారత. 20

గొప్ప ధానుష్కులైన ద్రౌపదికొడుకులు సువర్ణమయములగు ధ్వజములతో ధృష్టద్యుమ్నుని ముందిడుకొని ద్రోణుని ఎదుర్కొందురు.

చేకితానః సోమదత్తం ద్వైరథే యోద్ధు మిచ్ఛతి,
భోజం తు కృతవర్మాణం యుయుధానో యుయుత్సతి. 21

చేకితానుడు సోమదత్తుని ఎక్కటికయ్యమున పోర నుంకించుచున్నాడు. భోజవంశమువాడగు కృతవర్మను సాత్యకి తలపడును.

సహదేవస్తు మాద్రేయః శూరః సంక్రన్దనో యుధి,
స్వమంశం కల్పయామాస శ్యాలం తే సుబలాత్మజమ్. 22

21. ద్వైరథే - ఇద్దరు రథికులు ఒకరితో నొకరు పోరు యుద్ధమున;
22. సంక్రన్దనః - పెద్దగా అరచువాడు;

మాద్రికొడుకు, శూరుడు సహదేవుడు యుద్ధమున సింహనాదము చేయుచు, నీ మరది సుబలుని కొడుకగు శకునిని తన భాగముగా చేసికొనెను.

ఉల్లూకం చైవ కైతవ్యం యే చ సారస్వతా గణాః,
నకులః కల్పయామాస భాగం మాద్రవతీసుతః. 23

జూదరి యగు ఉల్లూకుని, సారస్వతుల గణములను మాద్రికొడుకు తనవంతుగా చేసికొనెను.

యే చాన్యే పార్థివా రాజన్ ప్రత్యుద్యాస్యన్తి సజ్గరే,
సమాహ్వానేన తాంశ్చాపి పాణ్డుపుత్రా అకల్పయన్. 24

ఇంకను యుద్ధమునకు రాగల ఆ యా రాజుల నందరను పేరుపేరున చెప్పుకొని పాండవులు తమవంతుగా చేసికొనిరి.

ఏవ మేషా మనీకాని ప్రవిభక్తాని భాగశః,
యత్తే కార్యం సపుత్రస్య క్రియతాం తదకాలికమ్. 25

ఇట్లే సేన లన్నింటిని పంచుకొని వారు తమ భాగములుగా చేసికొనిరి. ఇంక నీవును నీ కొడుకును కాలవిలంబనము చేయక తగిన పని చేయుడు.

ధృతరాష్ట్ర ఉవాచ- ధృతరాష్ట్రు డిట్లు పలికెను.

న సన్తి సర్వే పుత్రా మే మూఢా దుర్ద్యూతదేవినః,
యేషాం యుద్ధం బలవతా భీమేన రణమూర్ధని. 26

ఓరి నాయనా! నా కొడుకు లందరు ఇక మిగులరు. ఈ తెలివిలేనివారు కపటద్యూతము గావించిరి. వీరికి మిక్కిలి బలశాలియగు భీమునితో రణరంగమున యుద్ధము దాపురించినది.

రాజానః పార్థివాః సర్వే ప్రోక్షితా కాలధర్మణా,
గాణ్డీవాగ్నిం ప్రవేక్ష్యన్తి పతఙ్గా ఇవ పావకమ్. 27

---

25. అకాలికమ్-కాలము మించిపోక మున్ను - ఆలసింపక అని తాత్పర్యము;
26. న సన్తి - లేరు - చత్తు రని భావము.
27. ప్రోక్షితాః - మంత్రించిన నీరు చల్లబడినవారు; యజ్ఞమున బలిచేయబడు పశువుపై మంత్రించిన నీళ్ళు చల్లుదురు. దానిని ప్రోక్షణ మందురు. అనగా మరణము నిశ్చయమని తాత్పర్యము.

నేల యేలు రాజు లందరిపై యముడను యజమానుడు నీటిని చల్లెను. వీరందరు నిప్పున దూకు మిడుతలవలె గాండీవ మను నగ్నిలో దుముకు చున్నారు.

విద్రుతాం వాహినీం మన్యే కృతవైరై ర్మహాత్మభిః,
తాం రణే కేఽనుయాస్యన్తి ప్రభగ్నాం పాణ్డవై ర్యుధి. 28

పగబట్టిన ఆ మహాత్ములు సేనను చెల్లాచెదరు చేసినట్లే యనిపించు చున్నది. అట్లు పాండవులు నుగ్గుచేసిన ఆ సేనను రక్షించుటకై వెంటనంటి పోగలవా రెవ్వరు?

సర్వే హ్యతిరథాః శూరాః కీర్తిమన్తః ప్రతాపినః,
సూర్యపావకయో స్తుల్యా స్తేజసా సమితిఞ్జయాః. 29

వారందరు మహారథులు, శూరులు, కీర్తి నందినవారు. ప్రతాపము గల వారు. తేజస్సులో సూర్యునకు, అగ్నికి దీటైనవారు, యుద్ధమున గెలుపు పొందు వారు.

యేషాం యుధిష్ఠిరో నేతా గోప్తా చ మధుసూదనః,
యోధౌ చ పాణ్డవౌ వీరౌ సవ్యసాచివృకోదరౌ. 30

వారికి నాయకుడు యుధిష్ఠిరుడు. రక్షకుడు శ్రీకృష్ణుడు. యుద్ధవీరులు అర్జునుడును, భీముడును.

నకులః సహదేవశ్చ ధృష్టద్యుమ్నశ్చ పార్షతః,
సాత్యకి ర్ద్రుపదశ్చైవ ధృష్టకేతుశ్చ సానుజః. 31

ఉత్తమౌజాశ్చ పాఞ్చాల్యో యుధామన్యుశ్చ దుర్జయః,
శిఖణ్డీ క్షత్రదేవశ్చ తథా వైరాటి రుత్తరః. 32

కాశయ శ్చేదయశ్చైవ మత్స్యాః సర్వే చ సృంజయాః,
విరాటపుత్రో బభ్రుశ్చ పాంచాలాశ్చ ప్రభద్రకాః. 33

నకులుడు, సహదేవుడు, ధృష్టద్యుమ్నుడు, సాత్యకి ద్రుపదుడు, తమ్ముళ్తో కూడిన ధృష్టకేతువు, పాంచాలరాజగు ఉత్తమౌజుడు, జయింపరాని యుధామన్యువు, శిఖండి, క్షత్రదేవుడు, విరాటుని కొడుకు ఉత్తరుడు, కాశి - చేది - మత్స్య - సృంజయరాజులు, విరాటుని కొడుకు బభ్రువు, పాంచాలు రగు ప్రభద్రకులు - వీరందరు ఆవైపు యోధులు.

యేషా మిన్ద్రోఽప్యకామానాం న హరేత్ పృథివీ మిమామ్,
వీరాణాం రణధీరాణాం యే భిన్ద్యుః పర్వతానపి. 34

ఇంద్రు డైనను, వారి యిచ్ఛ లేక వీరులు రణధీరులు నైన ఈ రాజుల భూమిని హరింపజాలడు. వీరు కొండలనైన పిండి చేయుదురు.

తాన్ సర్వగుణసంపన్నా నమనుష్యప్రతాపినః,
క్రోశతో మమ దుష్పుత్రో యోద్ధుమిచ్ఛతి సఞ్జయ. 35

అట్లు సర్వగుణములు నిండుగా గల అమానుషప్రతాపముగల వారితో, చెడబుట్టిన నా కొడుకు నేనెంత మొత్తుకొనుచున్నను వినక పోర నుంకించుచున్నాడు.

దుర్యోధన ఉవాచ- దుర్యోధను డిట్లు పలికెను.

ఉభౌ స్వ ఏకజాతీయౌ తథోభౌ భూమిగోచరౌ,
అథ కస్మాత్ పాణ్డవానా మేకతో మన్యసే జయమ్. 36

మేమిరువురము ఒకేవిధమువారము. ఇద్దరము భూమియందే కానవచ్చువారము. అట్టియెడ పాండవులకే జయ మగునని నీవేల భావింతువు ?

పితామహం చ ద్రోణం చ కృపం కర్ణం చ దుర్జయమ్,
జయద్రథం సోమదత్త మశ్వత్థామాన మేవ చ, 37
సుతేజసో మహేష్వాసా నింద్రోఽపి సహితోఽమరైః,
అశక్తః సమరే జేతుం కిం పున స్తాత పాణ్డవాః. 38

---

34. అకామానామ్ - వారై కోరి భూమి నీవలసినదే కాని, అట్లుగాక వారిని గెలిచి భూమిని గ్రహించుట సాధ్యము కాదని భావము.

తాత, ద్రోణుడు, కృపుడు, ఎవ్వరికిని గెలువరాని కర్ణుడు, జయద్రథుడు, సోమదత్తుడు, అశ్వత్థామ ఈ గొప్పతేజముగల విలుకాండ్రను దేవత లందరితో కూడి వచ్చిన యింద్రుడు కూడ గెలువజాలడు. నాయనా! పాండవులు గెలుతురా?

సర్వే చ పృథివీపాలా మదర్థే తాత పాణ్డవాన్,
ఆర్యాః శస్త్రభృతాః శూరాః సమర్థాః ప్రతిబాధితుమ్. 39

నాకొరకై వచ్చిన ఈరాజు లందరు, తండ్రీ! ఆర్యులు, ఆయుధవీరులు, శూరులు, పాండవులను త్రిప్పికొట్టుటకు సమర్థులు.

న మామకాన్ పాణ్డవాస్తే సమర్థాః ప్రతివీక్షితుమ్,
పరాక్రాన్తో హ్యహం పాణ్డూన్ సపుత్రాన్ యోద్ధు మాహవే. 40

ఆ పాండవులు నావారిని తేరి పారజూడను జాలరు. యుద్ధమున పాండవులను, వారి కొడుకులను నేను లోగొందును.

మత్ప్రియం పార్థివాః సర్వే యే చికీర్షన్తి భారత,
తే తా నావారయిష్యన్తి ఐణేయా నివ తన్తునా. 41

నా ప్రియము చేయగోరి వచ్చిన రాజులందరు ఆ పాండవులను లేడి పిల్లలను ఉచ్చునందు బిగించినట్లు బిగింతురు.

మహతా రథవంశేన శరజాలైశ్చ మామకైః,
అభిద్రుతా భవిష్యన్తి పాఞ్చాలాః పాణ్డవైః సహ. 42

నావైన గొప్పరథముల సముదాయముచేతను, బాణములచేతను, ఆ పాండవులు పాంచాలురతోపాటు చెల్లాచెదరై పోవుదురు.

ధృతరాష్ట్ర ఉవాచ- ధృతరాష్ట్రు డిట్లు పలికెను.

ఉన్మత్త ఇవ మే పుత్రో విలపత్యేష సఞ్జయ,
న హి శక్తో రణే జేతుం ధర్మరాజం యుధిష్ఠిరమ్. 43

సంజయా! నాకొడుకు పిచ్చివానివలె ప్రేలుచున్నాడు. ధర్మరాజగు యుధిష్ఠిరుని యుద్ధమున వీడు గెలువజాలడు.

జానాతి హి యథా భీష్మః పాణ్డవానాం యశస్వినామ్,
బలవత్తాం సపుత్రాణాం ధర్మజ్ఞానాం మహాత్మనామ్. 44

ఆ పాండవులు, వారి కొడుకులు పేరుప్రఖ్యాతులు గలవారు. ధర్మ మెరిగిన మహాత్ములు. వారి బల మెంతటిదో ఈ భీష్ము డెరుగును గదా!

యతో నారోచయ దయం విగ్రహం తై ర్మహాత్మభిః,
కిం తు సఞ్జయ మే బ్రూహి పునస్తేషాం విచేష్టితమ్. 45

కావుననే ఈతని కా మహాత్ములతోడి పగ రుచింపదు. కానిమ్ము. సంజయా! ఇంకను ఆ పాండవుల చేష్ట యట్టిదో పలుకుము.

కస్తాం స్తరస్వినో భూయః సందీపయతి పాణ్డవాన్,
అర్చిష్మతో మహేష్వాసాన్ హవిషా పావకానివ. 46

మహావేగము, తేజము కలిగి, పెద్ద పెద్ద విండ్లు చేపట్టియున్న ఆ పాండవులను - హవిస్సుచే అగ్ని వలె ఎవడు ప్రజ్వలింపజేయును?

సఞ్జయ ఉవాచ- సంజయు డిట్లు చెప్పెను.

ధృష్టద్యుమ్నః సదైవైతాన్ సందీపయతి భారత,
యుద్ధ్యధ్వమితి మా భైష్ట యుద్ధా ద్భరతసత్తమాః. 47

రాజా! ధృష్టద్యుమ్నుడు "భరతవీరులారా! పోరుడు. యుద్ధమువలన భయపడకుడు" అని వారిని నిత్యము రెచ్చగొట్టుచున్నాడు.

యే కేచిత్ పార్థివా స్తత్ర ధార్తరాష్ట్రేణ సంవృతాః,
యుద్ధే సమాగమిష్యన్తి తుములే శస్త్రసంకులే. 48
తాన్ సర్వా నాహవే క్రుద్ధాన్ సానుబన్ధాన్ సమాగతాన్,
అహ మేకః సమాదాస్యే తిమి ర్మత్స్యానివోదకాత్. 49

"దుర్యోధనుడు సేకరించిన రాజుల నందరిని, ఆయుధములతో నిండిన యుద్ధరంగమునకు వచ్చినవారి నందరిని, క్రోధముతో తలపడువారి నందరిని, వారివారితో పాటు నేనొక్కడనే నీటిలోని చేపలను తిమి పీల్చివేయునట్లు పీల్చి వేయుదును."

భీష్మం ద్రోణం కృపం కర్ణం ద్రౌణిం శల్యం సుయోధనమ్,
ఏతాంశ్చాపి నిరోత్స్యామి వేలేవ మకరాలయమ్. 50

'భీష్ముడు, ద్రోణుడు, కృపుడు, కర్ణుడు, అశ్వత్థామ, శల్యుడు, దుర్యోధనుడు - వీ రందరిని కూడ సముద్రమును చెలియలికట్టవలె నిలువరింతును;

తథా బ్రువన్తం ధర్మాత్మా ప్రాహ రాజా యుధిష్ఠిరః,
తవ ధైర్యం చ వీర్యం చ పాఞ్చాలాః పాణ్డవైః సహ 51

సర్వే సమధిరూఢాః స్మ సఙ్గ్రామా న్నః సముద్ధర,
జానామి త్వాం మహాబాహో క్షత్రధర్మే వ్యవస్థితమ్. 52

అట్లు పలుకుచున్న ధృష్టద్యుమ్నునితో ధర్మాత్ము డగు యుధిష్ఠిరు డిట్లు పలికెను- 'ఓ మహాబాహూ! నీ ధైర్యము, నీ వీర్యము పాండవులతోపాటు పాంచాలు రందరు గట్టిగా నెరుగుదురు. ఈ యుద్ధమునుండి మమ్ము మద్ధరింపుము. క్షత్రియధర్మమున నిలిచియున్న నిన్నెరుగుదును

సమర్థ మేకం పర్యాప్తం కౌరవాణాం వినిగ్రహే,
పురస్తా దుపయాతానాం కౌరవాణాం యుయుత్సతామ్. 53

మీదికి దుముకుచు పోరికై వచ్చుచున్న కౌరవుల నందరిని నిలుపుటలో నీవొక్క డవే చాలినవాడవు!

భవతా యద్విధాతవ్యం తన్నః శ్రేయః పరంతప.

నీ వేది చేయగోరుదువో అది మాకు శ్రేయము.

సఙ్గ్రామా దపయాతానాం భగ్నానాం శరణైషిణామ్, 54
పౌరుషం దర్శయన్ శూరో యస్తిష్ఠే దగ్రతః పుమాన్,
క్రీణీయా త్తం సహస్రేణ ఇతి నీతిమతాం మతమ్. 55

'యుద్ధభూమియందు దెబ్బ తిని, శరణు కోరి పారిపోవుచున్నవారికి పౌరుషము చూపుచు, ముందు నిలువగల పురుషుని వేయిమంది నిచ్చియైనను కొనవలయు నని నీతిమంతుల అభిప్రాయము.

స త్వం శూరశ్చ వీరశ్చ విక్రాన్తశ్చ నరర్షభ,
భయార్తానాం పరిత్రాతా సంయుగేషు న సంశయః. 56

'అట్టి నీవు శూరుడవు, వీరుడవు. ముందుకు చొచ్చుకుని పోగలవాడవు. యుద్ధములలో భయముతో దుఃఖించువారికి రక్షకుడవు. సంశయము లేదు.'

ఏవం బ్రువతి కౌన్తేయే ధర్మాత్మని యుధిష్ఠిరే,
ధృష్టద్యుమ్న ఉవాచేదం మాం వచో గతసాధ్వసమ్.

ధర్మాత్ముడు కుంతికొడుకు యుధిష్ఠిరు డిట్లు పలుకుచుండగా సిగ్గులేని నన్ను గాంచి ఆ ధృష్టద్యుమ్ను డిట్లు పల్కెను.

సర్వాన్ జానపదాన్ సూత యోధా దుర్యోధనస్య యే, 57
సబాహ్లికాన్ కురూన్ బ్రూయాః ప్రాతిపేయాన్ శరద్వతః.

సూతా! దుర్యోధనుని పోటుగాండ్రందరితో, జానపదులతో, బాహ్లికునితో పాటు కౌరవులతో ప్రతీపుని సంతతితో గొప్ప ఆయువుగల వానితో నిట్లు పలుకుము.

సూతపుత్రం తథా ద్రోణం సహపుత్రం జయద్రథమ్, 58
దుఃశాసనం వికర్ణం చ తథా దుర్యోధనం నృపమ్,
భీష్మం చ బ్రూహి గత్వా త్వమాశు గచ్ఛ చ మా చిరమ్. 59

'కర్ణుని, ద్రోణుని, ద్రోణపుత్రుని, జయద్రథుని, దుశ్శాసనుని, వికర్ణుని, అట్లే రాజైన దుర్యోధనుని, భీష్ముని గాంచి యిట్లు పలుకుము. త్వరగా పొమ్ము. తడవు సేయకుము'.

యుధిష్ఠిరః సాధు నైవాభ్యుపేయో
మా వోఽవధీ దర్జునో దేవగుప్తః,
రాజ్యం దధ్వం ధర్మరాజస్య తూర్ణం
యాచధ్వం వై పాణ్డవం లోకవీరమ్. 60

'యుధిష్ఠిరుని ఎదుర్కొనకుండుట మేలు. దేవతలను కాపాడుచున్న అర్జునుడు మిమ్ములను వధింపకుండుగాక! ధర్మరాజునకు వెంటనే రాజ్య మొసగుడు. లోకమునకెల్ల వీరుడగు పాండవుని దయ జూడు మని అడుగుకొనుడు.

నైతాదృశో హి యోధోఽస్తి పృథివ్యామిహ కశ్చన,
యథావిధః సవ్యసాచీ పాణ్డవః సత్యవిక్రమః. 61

ఈ భూమండలము మొత్తమున అర్జునునకు దీటైన యోధుడు లేడు. ఆతడు సత్యమగు పరాక్రమము గలవాడు. కుడి యెడమ చేతులతో బాణములు గుప్పించును.

దేవైర్హి సంభృతో దివ్యో రథో గాణ్డీవధన్వనః,
న స జేయో మనుష్యేణ మా స్మ కృద్ధ్వం మనో యుధి. 62

'ఆ గాండీవధారి రథమంతయు దేవతలతో నిండినది. మానవమాత్రుడు వానిని గెలువ జాలడు. యుద్ధమున బుద్ధి పెట్టకుడు'.

ఇతి శ్రీమహాభారతే ఉద్యోగపర్వణి యానసంధిపర్వణి
సఞ్జయవాక్యే సప్తపఞ్చాశత్తమోఽధ్యాయః.

ఇది శ్రీమహాభారతము ఉద్యోగపర్వమున యానసంధిపర్వమున
సంజయవాక్యముగల ఏబదియేడవ అధ్యాయము.

—(o)—

58. శరద్వతః - ఆయుష్మంతులు - ఇచట వ్యతిరేక లక్షణముచేత ఆయువు తీరిన వారితో - నని భావము.
60. దధ్వమ్ - ఇండు.
62. కృద్ధ్వమ్-చేయుడు.

# అష్టపఞ్చాశత్తమో ఽధ్యాయః

# ఏబదియెనిమిదవ అధ్యాయము

ధృతరాష్ట్రేణ యుద్ధస్య భీష్మాద్యనభిమతత్వా చ్ఛాన్త్యర్థ మభిధానే దుర్యోధనేన సాహంకృతి హుంకృతిః, పాణ్డవహననప్రతిజ్ఞా, ధృతరాష్ట్రేణ అన్యయోద్ధృభ్యో యుద్ధే భయప్రదర్శనమ్.

ధృతరాష్ట్రుడు భీష్మాదులు యుద్ధమునకు విముఖులని చెప్పి, శాంతి నొందుమని చెప్పగా దుర్యోధను డహంకారముతో హుంకరించుట; పాండవులను చంపుదునని ప్రతిజ్ఞ చేయుట; ధృతరాష్ట్రుడు ఇతర యోద్ధలకు యుద్ధమున గలుగు భయమును వక్కాణించుట.

ధృతరాష్ట్ర ఉవాచ - ధృతరాష్ట్రు డిట్లు పలికెను.

క్షత్రతేజా బ్రహ్మచారీ కౌమారా దపి పాణ్డవః,
తేన సంయుగ మేష్యన్తి మన్దా విలపతో మమ. 1

ఆ పాండునికొడుకు పసితనమునుండియు, క్షత్రతేజము గలవాడు; బ్రహ్మచారి. నే నెంత మొత్తుకొనుచున్నను ఈ బుద్ధిహీనులు వానితో యుద్ధమునకు తలపడుచున్నారు.

దుర్యోధన నివర్తస్వ యుద్ధా ద్భరతసత్తమ,
న హి యుద్ధం ప్రశంసన్తి సర్వావస్థ మరిందమ. 2

నాయనా! భరతకులవరేణ్యా! శత్రుసంహారకా! దుర్యోధనా! యుద్ధము నుండి మరలుము. ఏదశయందును యుద్ధమును కొనియాడరు.

అల మర్థం పృథివ్యాస్తే సహామాత్యస్య జీవితుమ్,
ప్రయచ్ఛ పాణ్డుపుత్రాణాం యథోచిత మరిందమ. 3

నీవును, నీతోడివారును బ్రదుకుటకు నేలలో సగము చాలును. పాండుని కొడుకులకు తగిన భాగ మిమ్ము.

ఏతద్ధి కురవః సర్వే మన్యన్తే ధర్మసంహితమ్,
యత్త్వం ప్రశాన్తిం మన్యేథాః పాణ్డుపుత్త్రై ర్మహాత్మభిః. 4

కురువంశమువా రందరు దీనిని ధర్మమార్గ మని తలపోయుచున్నారు. నీవు మహాత్ములగు పాండుపుత్రులతో ప్రశాంతినే కోరవలయును.

అఙ్గ మాం సమవేక్షస్వ పుత్ర స్వామేవ వాహినీమ్,
జాత ఏష తవాభావ స్త్వం తు మోహా న్న బుధ్యసే. 5

అయ్యో! కొడుకా! నీ యీ సేనను నీవే పరికింపుము. ఇదిగో నీకు చావు మూడినది. నీవు మాత్రము మోహమువలన దీని నెరుగకున్నావు.

న న్వహం యుద్ధ మిచ్ఛామి నైత దిచ్ఛతి బాహ్లికః,
న చ భీష్మో న చ ద్రోణో నాశ్వత్థామా న సఞ్జయః. 6
న సోమదత్తో న శలో న కృపో యుద్ధ మిచ్ఛతి,
సత్యవ్రతః పురుమిత్రో జయో భూరిశ్రవ స్తథా. 7

నేను, బాహ్లికుడు, భీష్ముడు, ద్రోణుడు, అశ్వత్థామ, సంజయుడు, సోమదత్తుడు, శలుడు, కృపుడు, సత్యవ్రతు డగు పురుమిత్రుడు, జయుడు, భూరిశ్రవుడు యుద్ధమును కోరుట లేదు.

యేషు సమ్ప్రతితిష్ఠేయుః కురవః పీడితాః పరైః,
తే యుద్ధం నాభినన్దన్తి తత్తుభ్యం తాత రోచతామ్. 8

పరులు పీడించినపుడు కౌరవు లెవరియందు నెలకొని మేలు గాంతురో వారెవ్వరును, యుద్ధమును కోరరు. తాతా! అది నీకును రుచించుగాక!

న త్వం కరోషి కామేన కర్ణః కారయితా తవ,
దుఃశాసనశ్చ పాపాత్మా శకుని శ్చాపి సౌబలః. 9

నీవును నీ ఇష్టముతో ఈపని చేయుటలేదు. దీని నంతయు నడుపువాడు కర్ణుడు. అట్లే పాపాత్ముడగు దుశ్శాసనుడును, సుబలరాజు శకునియు నిన్ను త్రిప్పుచున్నారు.

దుర్యోధన ఉవాచ- దుర్యోధను డిట్లు పలికెను.

నాహం భవతి న ద్రోణే నాశ్వత్థామ్ని న సఞ్జయే,
న భీష్మే న చ కామ్బోజే న కృపే న చ బాహ్లికే. 10

సత్యవ్రతే పురుమిత్రే భూరిశ్రవసి వా పునః,
అన్యేషు వా తావకేషు భారం కృత్వా సమాహ్వాయమ్. 11

రాజా! నేను నీయందుగాని, ద్రోణుడు, అశ్వత్థామ, సంజయుడు, భీష్ముడు, కాంభోజరాజు, కృపుడు, బాహ్లికుడు, సత్యవ్రతు డగు పురుమిత్రుడు, భూరిశ్రవసుడు అనువారియందుగాని భారముంచి మిమ్ము పిలువలేదు.

అహం చ తాత కర్ణశ్చ రణయజ్ఞం వితత్య వై,
యుధిష్ఠిరం పశుం కృత్వా దీక్షితౌ భరతర్షభ. 12

నాయనా! నేనును, కర్ణుడును యుద్ధమను యజ్ఞమును దీర్చితిమి. యుధిష్ఠిరుని పశువుగా చేసితిమి. దీక్షగొని యుంటిమి.

రథో వేదీ స్రువః ఖడ్గో గదా స్రుక్ కవచం సదః,
చాతుర్హోత్రం చ ధుర్యా మే శూరా దర్భా హవి ర్యశః. 13

ఈ యజ్ఞమున రథము యజ్ఞవేదిక. కత్తి స్రువము. గద స్రుక్కు. కవచము యజ్ఞశాల. నా గుఱ్ఱములు నాలుగు ఋత్విక్కులు చేయు పనిని నిర్వహించును. శూరులే దర్భలు. కీర్తియే హోమద్రవ్యము.

ఆత్మయజ్ఞేన నృపతే ఇష్ట్వా వైవస్వతం రణే,
విజిత్య చ సమేష్యావో హతామిత్రౌ శ్రియా వృతౌ. 14

ఇట్టి ఆత్మయజ్ఞములో రాజా! రణరంగమున యముని పూజించి, గెలిచి శత్రువులను చంపి లక్ష్మి వరింపగా తిరిగివత్తుము.

అహం చ తాత కర్ణశ్చ భ్రాతా దుఃశాసనశ్చ మే,
ఏతే వయం హనిష్యామః పాణ్డవాన్ సమరే త్రయః. 15

నాయనా! నేను, కర్ణుడు, తమ్ముడు దుశ్శాసనుడు - ఈ మువ్వురము పాండవులను యుద్ధమున రూపుమాపగలము

---

13. స్రువః - స్రుక్ - యజ్ఞాదులందు నేతిని తీయుటకు, అగ్నిలో వేయుటకు ఉపయోగించు కొయ్యపాత్రలు; సదః - యజ్ఞక్షేత్రములో ప్రాచీనవంశమనుదానికి తూర్పుగా నిర్మించిన ఒక చిన్న కొట్టము; చాతుర్హోత్రమ్- బ్రహ్మ, అధ్వర్యువు, హోత, ఉద్గాత - అను నలుగురు ఋత్విక్కులు యజ్ఞమున నిర్వహించు కార్యము.

అహం హి పాణ్డవాన్ హత్వా ప్రశాస్తా పృథివీ మిమామ్,
మాం వా హత్వా పాణ్డుపుత్రా భోక్తారః పృథివీ మిమామ్. 16

నే నా పాండవులను చంపి ఈ నేల నేలుదును. లేదా పాండవులే నన్ను చంపి ఈ భూమి ననుభవింతురు.

త్యక్తం మే జీవితం రాజ్యం ధనం సర్వం చ పార్థివ,
న జాతు పాణ్డవైః సార్ధం వసేయ మహ మచ్యుత. 17

రాజా! చావు లేనివాడా ! నే నీ జీవితము, రాజ్యము, ధనము, సర్వము విడిచితిని. పాండవులతో కూడి యెన్నటికిని బ్రదుకను.

యావద్ధి సూచ్యా స్తీక్ష్ణాయా విధ్యేదగ్రేణ మారిష,
తావద ప్యపరిత్యాజ్యం భూమే ర్నః పాణ్డవాన్ ప్రతి. 18

అయ్యా! వాడి సూదిమొన తాకినంత నేలయు పాండవులకు ఇచ్చునది లేదు.

ధృతరాష్ట్ర ఉవాచ - ధృతరాష్ట్రు డిట్లు పలికెను.
సర్వాన్ వ స్తాత శోచామి త్యక్తో దుర్యోధనో మయా,
యే మన్ద మనుయాస్యధ్వం యాన్తం వైవస్వతక్షయమ్. 19

ఈ దుర్యోధనునిపై ఆశ వదలుకొంటిని. యమపురి కరుగుచున్న ఈ బుద్ధిలేని వానిని వెంటనంటి పోవుచున్న మిమ్ములనుగూర్చి ఏడ్చుచున్నాను.

రురూణా మివ యూథేషు వ్యాఘ్రాః ప్రహరతాం వరాః,
వరాన్ వరాన్ హనిష్య న్తి సమేతా యుధి పాణ్డవాః. 20

మిక్కిలి పోటుగాండ్రైన పాండవులు యుద్ధమున ఒక్కపెట్టున కౌరవుల మందలలో చొచ్చి పులులవలె గొప్పగొప్పవారి నేరి చంపుదురు.

ప్రతీపమివ మే భాతి యుయుధానేన భారతీ,
వ్యస్తా సీమ న్తినీ గ్రస్తా ప్రమృష్టా దీర్ఘబాహునా. 21

పొడవైన బాహువులుగల సాత్యకి చేత జిక్కి భరతవంశము వారిసేన పుణ్యస్త్రీ నీచునకు చిక్కి చెదరిపోయినట్లు విపరీతముగా నాకు తోచుచున్నది.

---

21. భారతీ - భరతవంశమువారి సేన - స్త్రీగా రూపణము.

సంపూర్ణం పూరయన్ భూయో ధనం పార్థస్య మాధవః,
శైనేయః సమరే స్థాతా బీజవత్ ప్రవపన్ శరాన్. 22

ఆ శిని మనుమడు సాత్యకి అర్జునుని బలమును పూర్తిగా నింపుచు విత్తనములు నాటినట్లు బాణములను నాటుచు యుద్ధమున నిలుచును.

సేనాముఖే ప్రయుద్ధానాం భీమసేనో భవిష్యతి,
తం సర్వే సంశ్రయిష్యన్తి ప్రాకార మకుతోభయమ్. 23

యుద్ధమునందు బాగుగా పోరుచున్న యోధు లందరకు ఎందును భయము లేని భీముడు ప్రాకార మగును. అందరకు ఆతడే దిక్కు.

యదా ద్రక్ష్యసి భీమేన కుఞ్జరాన్ వినిపాతితాన్,
విశీర్ణదన్తాన్ గిర్యాభాన్ భిన్నకుమ్భాన్ సశోణితాన్. 24
తా నభిప్రేక్ష్య సఙ్గ్రామే విశీర్ణానివ పర్వతాన్,
భీతో భీమస్య సంస్పర్శాత్ స్మర్తాసి వచనస్య మే. 25

భీముని దెబ్బకు దంతములు విరిగి, కుంభములు పగిలి, నెత్తురులు కారుచున్న పగిలిన కొండలవలె కూలిన ఏనుగులను చూచినపుడు ఆతని తాకిడికి భయపడినవాడవై నామాట స్మరింతువు.

నిర్దగ్ధం భీమసేనేన సైన్యం రథహయద్విపమ్,
గతి మగ్నేరివ ప్రేక్ష్య స్మర్తాఽసి వచనస్య మే. 26

భీమసేనుడు నిప్పువలె చెలరేగి బూడిదచేసిన సైనికులను, రథములను, గుఱ్ఱములను, ఏనుగులను చూచి నీవు నామాటను స్మరింతువు.

మహద్వో భయ మాగామి న చే చ్ఛామ్యథ పాణ్డవైః,
గదయా భీమసేనేన హతాః శమ ముపైష్యథ. 27

మీరు పాండవులతో శాంతి బొందరేని మీకు మహాభయము వచ్చిపడును. భీమసేనుని గదతో చచ్చి మీరు శాంతి పొందుదురు.

---

22. ధనమ్ - బలము.
23. ప్రాకారమ్ - కోటగోడవలె నని భావము.

మహావన మివ చ్ఛన్నం యదా ద్రక్ష్యసి పాతితమ్,
బలం కురూణాం భీమేన తదా స్మర్తాఽసి మే వచః. 28

భీమునిచేత కూలిన సేన పెద్దతోట విరిగి నేలకూలినట్లుండగా చూచి నీ వపుడు నామాట స్మరింతువు.

వైశమ్పాయన ఉవాచ - వైశంపాయను డిట్లు చెప్పెను.

ఏతావదుక్త్వా రాజా తు సర్వాంస్తాన్ పృథివీపతీన్,
అనుభాష్య మహారాజ పునః పప్రచ్ఛ సఞ్జయమ్. 29

ఆరాజు లందరినిగూర్చి ఆ రాజట్లు పలికి చెప్పవలసినది చెప్పి తిరిగి సంజయుని ఇట్లు అడిగెను.

ఇతి శ్రీమహాభారతే ఉద్యోగపర్వణి యానసంధిపర్వణి
ధృతరాష్ట్రవాక్యేఽష్టపఞ్చాశత్తమోఽధ్యాయః.

ఇది శ్రీమహాభారతము ఉద్యోగపర్వమున యానసంధిపర్వమున
ధృతరాష్ట్రవాక్యముగల ఏబదియెనిమిదవ అధ్యాయము.

—(०)—

# ఏకోనషష్టితమోఽధ్యాయః

# ఏబదితొమ్మిదవ అధ్యాయము

పునఃపృష్టేన సఞ్జయేనాన్తఃపురగతయోః
కృష్ణపార్థయోః సన్దేశశ్రావణమ్.

మరల అడుగగా సంజయుడు అంతఃపురమున నున్న
కృష్ణార్జునుల సందేశము వినిపించుట.

ధృతరాష్ట్ర ఉవాచ - ధృతరాష్ట్రు డిట్లు పలికెను.

యదబ్రూతాం మహాత్మానౌ వాసుదేవధనఞ్జయౌ,
తన్మే బ్రూహి మహాప్రాజ్ఞ శుశ్రూషే వచనం తవ. 1

మహామేధావీ! ఆ మహాత్ములు వాసుదేవధనంజయు లేమి పలికిరి? అది చెప్పుము. నీమాట వినగోరుదును.

సఞ్జయ ఉవాచ - సంజయు డిట్లు పలికెను.

శృణు రాజన్ యథా దృష్టౌ యథా కృష్ణధనఞ్జయౌ,
ఊచతు శ్చాపి యద్వీరౌ తత్తే వక్ష్యామి భారత. 2

భారతా! రాజా! ఆ కృష్ణార్జునుల నెట్లు కనుగొంటినో, వారేమి పలికిరో చెప్పెదను, వినుము.

పాదాఙ్గులీ రభిప్రేక్షన్ ప్రయతోఽహం కృతాఞ్జలిః,
శుద్ధాన్తం ప్రావిశం రాజ న్నాఖ్యాతుం నరదేవయోః. 3

నేనా నరదేవుల పాదముల వ్రేళ్లను భక్తితో చూచుచు, చేతులు జోడించుకొని భక్తిశ్రద్ధలు గలవాడనై, వారితో మాటాడుటకు అంతఃపురము ప్రవేశించితిని.

నైవాభిమన్యు ర్న యమౌ తం దేశ మభియాన్తి వై,
యత్ర కృష్ణౌ చ కృష్ణా చ సత్యభామా చ భామినీ. 4

ఆ కృష్ణు లిరువురు, ద్రౌపది, సత్యభామయు నున్న ఆచోటికి అభిమన్యుడు గాని నకులసహదేవులుగాని నేరుగా పోరు.

ఉభౌ మధ్వాసవక్షీబౌ వుభౌ చన్దనరూషితౌ,
స్రగ్విణౌ వరవస్త్రౌ తౌ దివ్యాభరణభూషితౌ. 5

ఆ యిద్దరు మధువు గ్రోలి ఆనందముతో నున్నారు. మంచిగంధము పూసికొని యున్నారు. మాలలు ధరించియున్నారు. మంచి వస్త్రములు తాల్చి యున్నారు. దివ్యములగు భూషణముల నలంకరించుకొని యున్నారు.

నైకరత్నం విచిత్రం తు కాఞ్చనం మహదాసవమ్,
వివిధాస్తరణాకీర్ణం యత్రాసాతా మరిందమౌ. 6

ఆ శత్రుసంహారకు లున్నచోట అనేకవర్ణములతో విచిత్రమైనదియు, గొప్పదియు, వివిధములగు పరపులు గలదియు నగు బంగారుఆసనము గలదు.

అర్జునోత్సఙ్గగౌ పాదౌ కేశవస్యోపలక్షయే,
అర్జునస్య చ కృష్ణాయాం సత్యాయాం చ మహాత్మనః. 7

అర్జునుని యొడిలో నున్న శ్రీకృష్ణుని పాదములు కనుగొంటిని. ద్రౌపది యచట నుండగా మహాత్ముడగు నర్జును డాతని పాదములు తనయొడిలో నుంచుకొనెను.

కాఞ్చనం పాదపీఠం తు పార్థో మే ప్రాదిశ త్తదా,
తదహం పాణినా స్పృష్ట్వా తతో భూమా వుపావిశమ్. 8

శ్రీకృష్ణుని బంగారుపాదపీఠమును అర్జునుడు నాకై యొసగెను. నేను దానిని చేతితో తాకి నేలపై కూర్చుంటిని.

ఊర్ధ్వరేఖాతలౌ పాదౌ పార్థస్య శుభలక్షణౌ,
పాదపీఠా దపహృతౌ తత్రాపశ్యమహం శుభౌ. 9

మంచిలక్షణములు గల పైకి సాగు రేఖలుగల శుభములైన అర్జునుని పాదములను పాదపీఠమునుండి తీయునపుడు చూచితిని.

శ్యామౌ బృహన్తౌ తరుణౌ శాలస్కన్ధా వివోద్గతౌ,
ఏకాసనగతౌ దృష్ట్వా భయం మాం మహ దావిశత్. 10

నీలవర్ణము, మంచివయసు గలిగి, పెద్ద ఆకారములో పైకి పొడుచుకొని వచ్చిన సాలవృక్షపు కొమ్మలవలె నున్నవారును, ఒక ఆసనమున నున్నవారును అగు వారిరువురను చూడగా నాకు భయము పొడమినది.

ఇన్ద్రవిష్ణుసమా వేతౌ మన్దాత్మా నావబుద్ధ్యతే,
సంశ్రయా ద్ద్రోణభీష్మాభ్యాం కర్ణస్య చ వికత్థనాత్. 11

ద్రోణభీష్ముల నాశ్రయించి యుండుటవలనను, కర్ణుని పోటరి మాటల వలనను బుద్ధి కోల్పోయిన దుర్యోధనుడు ఇంద్రవిష్ణువులవంటి వీరినెరుగకున్నాడు.

నిదేశస్థౌ యిమౌ యస్య మానస స్తస్య సేత్స్యతే.
సంకల్పో ధర్మరాజస్య నిశ్చయో మే తదాభవత్. 12

ఇట్టివారు ఎవని ఆజ్ఞలో నుందురో అట్టి ధర్మరాజు మనసునందలి సంకల్పము తప్పక నెరవేరు ననుు నిశ్చయము నా కపుడు కలిగినది.

సత్కృత శ్చాన్నపానాభ్యా మాసీనో లబ్ధసత్క్రియః,
అఞ్జలిం మూర్ధ్ని సన్ధాయ తౌ సన్దేశ మచోదయమ్. 13

అన్న మొసగి నీరిచ్చి నన్ను వారు సత్కరించిరి. నేను కూర్చుంటిని. మన్నన నందితిని. తలపై దోసిలి యొగ్గి వారికి సందేశము చెప్ప దొరకొంటిని.

ధనుర్గుణకిణాఙ్కేన పాణినా శుభలక్షణమ్,
పాద మానమయన్ పార్థః కేశవం సమచోదయత్. 14

వింటినారి ఒరపిడితో కాయలు కాచిన చేతితో శుభమగు చిహ్నములు గల కృష్ణుని పాదములకు మ్రొక్కించుచు అర్జునుడు కృష్ణుని ప్రేరణ చేసెను.

ఇన్ద్రకేతు రివోత్థాయ సర్వాభరణభూషితః,
ఇన్ద్రవీర్యోపమః కృష్ణః సంవిష్టో మాభ్యభాషత. 15

సర్వాభరణములతో అలంకృతుడైనవాడు, ఇంద్రుని బలము వంటి బలము గలవాడు నగు కృష్ణుడు ఇంద్రధనుపువలె లేచి కుదురుగా కూర్చొని నాతో ఇట్లాడెను.

---

11. ద్రోణభీష్మాభ్యాం - దీనిని షష్ఠ్యంతముగా భావింపవలయును.
12. మానసః - మనస్సునను నున్న.

వాచం స వదతాం శ్రేష్ఠో హ్లాదినీం వచనక్షమామ్,
త్రాసినీం ధార్తరాష్ట్రాణాం మృదుపూర్వాం సుదారుణామ్, 16
వాచం తాం వచనార్హస్య శిక్షాక్షరసమన్వితామ్,
అశ్రౌష మహ మిష్టార్థాం పశ్చాద్ధృదయహారిణీమ్. 17

ఆ మాటనేర్పరి మాట హృదయమునకు ఆనందము కూర్చినది. మాట యన్నచో నట్లుండవలయు నన్నట్లున్నది. ధృతరాష్ట్రునికి చెందినవారికి గుండె దడ పుట్టించునట్టిది. పైకి మెత్తగా నున్నది కాని మిక్కిలి గట్టిగా నున్నది. అట్టి మాటలన్న నతనికే చెల్లును. ప్రతిఅక్షరము పొల్లుపోనిదై యున్నది. ఇష్టమైన అర్థములు గలిగి ఆలోచించినపిదప మనోహరముగా నుండిన ఆ వాక్కులను వింటిని.

**వాసుదేవ ఉవాచ** - వాసుదేవు డిట్లు పలికెను.

సఞ్జయేదం వచో బ్రూయా ధృతరాష్ట్రం మనీషిణమ్,
కురుముఖ్యస్య భీష్మస్య ద్రోణస్యాపి చ శృణ్వతః. 18

సంజయా! కురువులలో పెద్దవాడు భీష్ముడు, ద్రోణుడును వినుచుండగా బుద్ధిగల ఆ ధృతరాష్ట్రున కీ మాట చెప్పుము.

ఆవయో ర్వచనాత్ సూత జ్యేష్ఠాన ప్యభివాదయన్,
యవీయసశ్చ కుశలం పశ్చాత్ పృష్ట్వైవ ముత్తరమ్. 19

ముందుగా మా యిరువురి మాటగా పెద్దవారికి మన్నన లందించుచు, పిన్నవారిని కుశల మడుగుచు పిదప ఈ మాట పలుకుము.

యజధ్వం వివిధై ర్యజ్ఞై ర్విప్రేభ్యో దత్తదక్షిణాః,
పుత్రదారైశ్చ మోదధ్వం మహద్వో భయ మాగతమ్. 20

విద్యావంతులగు విప్రశ్రేష్ఠులకు మంచి దక్షిణలు నిచ్చుచు చేయగల యజ్ఞము లన్నియు చేయుడు. కొడుకులతో భార్యలతో ఆనందింపుడు. మీకు గొప్ప చేటు దాపురించినది.

అర్థాం స్త్యజత పాత్రేభ్యః సుతాన్ ప్రాప్నుత కామజాన్,
ప్రియం ప్రియేభ్య శ్చరత రాజా హి త్వరతే జయే. 21

యోగ్యులకు ధన మొసగుడు. కోరినట్లు కొడుకుల గనుడు. ప్రియులకు ప్రియ మాచరింపుడు. ధూరాజు జయమునకై త్వరపడుచున్నాడు.

ఋణ మేతత్ ప్రవృద్ధం మే హృదయా న్నాపసర్పతి,
యద్గోవిన్దేతి చుక్రోశ కృష్ణా మాం దూరవాసినమ్. 22

దవ్వుల నున్న నన్ను ద్రౌపది, గోవిందా! అని మొరపెట్టుకొనెనే. ఆ ఋణము పెరిగిపోయినది. నా గుండెనుండి తొలగకున్నది.

తేజోమయం దురాధర్షం గాణ్డీవం యస్య కార్ముకమ్,
మద్ద్వితీయేన తేనేహ వైరం వః సవ్యసాచినా. 23

నిలువెల్లయు తేజమే అయినది, ఎట్టివానికిని లొంగనిదియు నగు గాండీవ మను ధనుపు గలిగి కుడి యెడమ చేతులతో బాణములు గుప్పించు అర్జునునితో-నేను తోడై యుండగా-మీకు వైర మేర్పడినది.

మద్ద్వితీయం పునః పార్థం కః ప్రార్థయితు మిచ్ఛతి,
యోఽపి కాలపరీతో వాఽప్యపి సాక్షా త్పురన్దరః. 24

కాలము మూడినవాడో కాక సాక్షాత్తు ఇంద్రుడో తప్ప నేను తోడుగా గల అర్జునుని మార్కొనగోరువా డెవ్వడు?

బాహుభ్యా ముద్వహే ద్భూమిం దహేత్ క్రుద్ధ ఇమాః ప్రజాః,
పాతయే త్త్రిదివా న్దేవాన్ యోఽర్జునం సమరే జయేత్. 25

అర్జునుని పోరున గెలుచువాడు చేతులతో భూమిని పెల్లగించును. ప్రజల నందరను మాడ్చివేయును. స్వర్గమునుండి దేవతలను కూలద్రోయును.

దేవాసురమనుష్యేషు యక్షగన్ధర్వభోగిషు,
న తం పశ్యామ్యహం యుద్ధే పాణ్డవం యోఽభ్యయా ద్రణే. 26

అర్జునుని యుద్ధమున నెదుర్కొనగలవానిని దేవతలలో, రాక్షసులలో, మనుష్యులలో, యక్షులలో, గంధర్వులలో, నాగులలో కానను.

---

22. ఋణమ్-జూదమునాడు వస్త్రములు తొలగించుచుండగా నెందో యున్న న న్నుద్దేశించి ద్రౌపది, 'గోవిందా'! యని దిక్కుమాలి యరచిన అరపు యొక్క అప్పు; హృదయాత్, న, అపసర్పతి-కౌరవులను సమూలముగ నాశముచేయక ఆ అప్పు ఎదనుండి తొలగిపోదని భావము;

యత్త ద్విరాటనగరే శ్రూయతే మహ దద్భుతమ్,
ఏకస్య చ బహూనాం చ పర్యాప్తం తన్నిదర్శనమ్. 27

విరాటనగరములో జరిగిన మహాద్భుతము వినవచ్చుచున్నది గదా! ఒక్కడు పెక్కండ్రకు చాలెను. అది నిదర్శనము.

ఏకేన పాణ్డుపుత్రేణ విరాటనగరే యదా,
భగ్నాః పలాయత దిశః పర్యాప్తం తన్నిదర్శనమ్. 28

పాండుని కొడు కొక్కడు విరాటనగరమున మిమ్మందర చీల్చి చెండాడెను. మీరు దిక్కులకు పారిరి. అది నిదర్శనముగా చాలును.

బలం వీర్యం చ తేజ శ్చ శీఘ్రతా లఘుహస్తతా,
అవిషాదశ్చ ధైర్యం చ పార్థా న్నాన్యత్ర విద్యతే. 29

దేహబలము, మనస్సునందలి ఉత్సాహము, వాడిమి, వేగము, ఒడుపు, నీరుగారిపోకుండుట, ధైర్యము అనునవి అర్జునునిలో కాక మరియొకనియందు గానరావు.

ఇత్యబ్రవీ ద్ధృషీకేశః పార్థ ముద్ధర్షయన్ గిరా,
గర్జన్ సమయవర్షీవ గగనే పాకశాసనః. 30

పార్థునికి మాటతో ఉడు కెక్కించుచు, తగుకాలమున వర్షించు నింద్రుడు గగనమున గర్జించునట్లు గర్జించుచు కృష్ణు డిట్లు పలికెను.

కేశవస్య వచః శ్రుత్వా కిరీటీ శ్వేతవాహనః,
అర్జునస్త న్మహద్వాక్య మబ్రవీ ద్రోమహర్షణమ్. 31

ఒడలు గగుర్పొడుచు, ఆకృష్ణవాక్యమును విని తెల్లని గుఱ్ఱములు, ఇంద్రు డిచ్చిన కిరీటము గల ఆ అర్జును డిట్లు పలికెను.

ఇతి శ్రీమహాభారతే ఉద్యోగపర్వణి యానసంధిపర్వణి
సఞ్జయేన శ్రీకృష్ణవాక్యకథనే ఏకోనషష్టితమోఽధ్యాయః.
ఇది శ్రీమహాభారతము ఉద్యోగపర్వమున యానసంధిపర్వమున
సంజయుడు శ్రీకృష్ణుడాడిన మాటలు చెప్పుట యను
ఏబదితొమ్మిదవ అధ్యాయము.

—(౦)—

---

29. బలమ్-దేహపుష్టి, వీర్యమ్-మానసమైన ఊపు; తేజః-శౌర్యము-ముందుకు చొచ్చుకొనిపోవు పటిమ; శీఘ్రతా-సమయమునకు తగిన స్ఫూర్తి; లఘుహస్తతా-బాణప్రయోగములోని ఒడుపు; అవిషాదః-క్రుంగిపోకుండుట; ధైర్యమ్-బుద్ధి చాకచక్యము;

# షష్టితమోఽధ్యాయః

# అరువదియవ అధ్యాయము

ధృతరాష్ట్రేణ స్వపరపక్షయో ర్బలాబలయోర్గుణదోష
సమీక్షణపూర్వకం సమాఖ్యానమ్.

ధృతరాష్ట్రుడు స్వపరపక్షముల బలాబలముల
గుణదోషముల సమీక్షించుచు మాట లాడుట.

వైశమ్పాయన ఉవాచ-వైశంపాయను డిట్లు చెప్పెను.

సఞ్జయస్య వచః శ్రుత్వా ప్రజ్ఞాచక్షు ర్జనేశ్వరః,
తతః సంఖ్యాతు మారేభే తద్వచో గుణదోషతః. 1

సంజయుని మాట విని గ్రుడ్డిరాజు ఆ మాటలోని తప్పొప్పులను పరిగ
ణింప దొరకొనెను.

ప్రసఙ్ఖ్యాయ చ సౌక్ష్మ్యేణ గుణదోషాన్ విచక్షణః,
యథావ న్మతితత్త్వేన జయకామః సుతాన్ ప్రతి. 2
బలాబలం వినిశ్చిత్య యాథాతథ్యేన బుద్ధిమాన్,
శక్తిం సఙ్ఖ్యాతు మారేభే తదా వై మనుజాధిపః. 3

గుణదోషముల నా వివేకశాలి సూక్ష్మముగా పరిగణించి తన సహజబుద్ధితో
కొడుకులకు జయము గోరుచున్నవాడై ఎవరికెంత బలమో ఉన్నదున్నట్లు లెక్క
వేయ నారంభించెను.

దేవమానుషయోః శక్త్యా తేజసా చైవ పాణ్డవాన్,
కురూన్ శక్త్యాఽల్పతరయా దుర్యోధన మథాబ్రవీత్. 4

---

4. పాండవులకు దేవమానుషశక్తులు రెండును గలవు. కౌరవులకు మానుష
శక్తిమాత్రమే కలదు. కావున వారిశక్తి పాండవుల శక్తికంటె హీన మైన
దని భావము.

పాండవులకు దైవశక్తియు, మానవశక్తియు, తేజస్సును గలదు. కౌరవులశక్తి వారికంటె తక్కువది అని పరికించి దుర్యోధనునితో ఇట్లు పలికెను.

దుర్యోధనేయం చిన్తా మే శశ్వన్న వ్యుపశామ్యతి,
సత్యం హ్యేత దహం మన్యే ప్రత్యక్షం నానుమానతః. 5

దుర్యోధనా! నా యీ చింత ఒక్కనాటికిని అణగకున్నది. ఇది ప్రత్యక్షమైన సత్యమని నేను తలతును. అనుమానించి కాదు.

ఆత్మజేషు పరం స్నేహం సర్వభూతాని కుర్వతే,
ప్రియాణి చైషాం కుర్వన్తి యథాశక్తి హితాని చ. 6

సర్వప్రాణులు తమ సంతానమునందు మిక్కిలి వాత్సల్యము పెట్టును. శక్తినంతయు వినియోగించి వారికి ప్రియములు, హితములు చేయుచుండును.

ఏక మేవోపకర్తృణాం ప్రాయశో లక్షయామహే,
ఇచ్ఛన్తి బహులం సన్తః ప్రతికర్తుం మహత్ ప్రియమ్. 7

అట్లే సాధారణముగా ఉపకారము పొందినవారు ఉపకారము చేసినవారికి గొప్పమేలు చేయగోరుటయు చూచుచుందుము.

అగ్నిః సాచివ్యకర్తా స్యాత్ ఖాణ్డవే తత్కృతం స్మరన్,
అర్జునస్యాఽపి భీమేఽస్మిన్ కురుపాణ్డుసమాగమే. 8

ఖాండవమున అర్జునుడు చేసిన మేలు తలపోసి భయంకరమగు కురుపాండవసమరమున అగ్నిదేవు డర్జునునకు మంత్రిత్వము నెరపును.

జాతిగృద్ధ్యాభిపన్నాశ్చ పాణ్డవానా మనేకశః,
ధర్మాదయః సమేష్యన్తి సమాహూతా దివౌకసః. 9

ధర్మదేవత మున్నగు స్వర్గవాసు లందరు ఇక్కడ తమ అంశములను పాండవులయందు నిలిపిరి. కావున వీరు పిలిచినచో సహాయులుగా వా రందరు కూడి వత్తురు.

---

8. భీమే - భయంకరమైన;
9. జాతిగృద్ధ్యా - జన్మము గ్రహించిన కారణమున యుధిష్ఠిరాదుల తండ్రులు యముడు మున్నగువారు వారికి సహాయు లగుదురని భావము.

భీష్మద్రోణకృపాదీనాం భయా దశనిసన్నిభమ్,
రిరక్షిషన్తః సంరంభం గమిష్యన్తీతి మే మతమ్. 10

ధర్మజుడు మున్నగువారు భీష్మద్రోణకృపాదుల భయమువలన పాండవులను రక్షింపగోరుచు పిడుగువంటి కోపమును పొందుదు రని నా అభిప్రాయము.

తే దేవైః సహితాః పార్థా న శక్యాః ప్రతివీక్షితుమ్,
మానుషేణ నరవ్యాఘ్రా వీర్యవన్తోఽస్త్రపారగాః. 11

దేవతలతో కూడిన ఆ పాండవులను తేరిపార జూడను శక్యము గాదు. మనుష్యశక్తిచేతనే వారు నరులలో బెబ్బులుల వంటివారు. గొప్పశక్తి గలవారు. అస్త్రవిద్యలో ఆరితేరినవారు.

దురాసదం యస్య దివ్యం గాణ్డీవం ధనురుత్తమమ్,
ధారుణౌ చాక్షయౌ దివ్యౌ శరపూర్ణౌ మహేషుధీ. 12

ఆ అర్జునుని విల్లు గాండీవము. అది ఉత్తమమైనది. ఎవరికిని లొంగనిది. దివ్యమైనది. అట్లే ఆతని అంపపొదులు రెండును తరుగువోనివి. దారుణము లైనవి. దేవలోకమునకు చెందినవి. ఎల్లవేళల బాణములతో నిండియే యుండునవి.

వానరశ్చ ధ్వజే దివ్యో నిఃసఙ్గో ధూమవద్గతిః,
రథశ్చ చతురన్తాయాం యస్య నాస్తి సమః క్షితౌ. 13

టెక్కెమున దివ్యపురుషుడు హనుమ గలడు. ఆతని రథము నాలుగు సముద్రములు ఎల్లలుగా గల భూమియందు పొగవలె అడ్డులేని గమనముతో చరించును. అట్టివానికి దీటైనవాడు లేడు.

మహామేఘనిభశ్చాపి నిర్ఘోషః శ్రూయతే జనైః,
మహాశనిసమః శబ్దః శాత్రవాణాం భయఙ్కరః. 14

ఆతని రథఘోష పెద్దపిడుగుమ్రోతవలె జనులకు వినవచ్చును. ఆఘోష శత్రువులకు గుండెదడ పుట్టించును.

---

10. రిరక్షిషన్తః - రక్షింపగోరినవా రగుచు; సంరంభమ్ - క్రోధమును.

యం చాతిమానుషం వీర్యే కృత్స్నో లోకో వ్యవస్యతి,
దేవానా మపి జేతారం యం విదుః పార్థివా రణే. 15

ఈ సమస్తలోకము అతనిని సాధారణమానవుడు కాదని పరిగణించి నది. రాజు లందరు ఆతడు దేవతలనైన గెలుచువానినిగా నెరుగుదురు.

శతాని పఞ్చ చైవేషూన్ యో గృహ్ణన్నైవ దృశ్యతే,
నిమేషా న్తరమాత్రేణ ముఞ్చన్ దూరం చ పాతయన్. 16

అత డయిదువందల బాణములను గ్రహించి కనుమూసి తెరచునంత లోపల చాల దూరము విసరి కొట్టుచుండగా చూచుటయు సాధ్యము కాదు.

య మాహ భీష్మో ద్రోణశ్చ కృపో ద్రౌణి స్తథైవ చ,
మద్రరాజ స్తథా శల్యో మధ్యస్థా యే చ మానవాః. 17
యుద్ధా యావస్థితం పార్థం పార్థివై రతిమానుషైః,
అశక్యం నరశార్దూలం పరాజేతు మరిన్దమమ్. 18

భీష్ముడు, ద్రోణుడు, కృపుడు, అశ్వత్థామ, మద్రరాజగు శల్యుడు, అట్లే రెండు పక్షములకు కావలసిన మనుజు లందరు అర్జునుడు పోరుకై నిలిచినచో ఎంత మహిమగల రాజులకైనను అసాధ్యు డనియు, శత్రుమర్దను డగు నాతనిని ఓడించుట సాధ్యము కాదనియు చెప్పుదురు.

క్షిపత్యేకేన వేగేన పఞ్చబాణశతాని యః,
సదృశం బాహువీర్యేణ కార్తవీర్యస్య పాణ్డవమ్. 19

ఒక్కడిగిని అయిదువందల బాణములు గుప్పించగలడు. అతడు చేతుల సత్తువలో కార్తవీర్యునికి దీటైన వాడని నేను పరిగణింతును.

తమర్జునం మహేష్వాసం మహేన్ద్రోపేన్ద్రవిక్రమమ్,
నిఘ్నన్త మివ పశ్యామి విమర్దేఽస్మిన్ మహాహవే. 20

గొప్ప విల్లు తాల్చి మహేంద్రుడో, మహావిష్ణువో యన్నట్లు పరాక్రమము చూపుచున్న ఆ అర్జునుడు ఈ ఘోరమైన మహాయుద్ధమున నందరను చంపు చున్నట్లే నాకు తోచుచున్నాడు.

ఇత్యేవం చిన్తయన్ కృత్స్నా మహోరాత్రాణి భారత,
అనిద్రో నిఃసుఖ శ్చాస్మి కురూణాం శమచిన్తయా. 21

---

16. న, ఏవ దృశ్యతే - అయిదు వందల బాణము లెప్పుడు పొదుల నుండి లాగెనో ఎపుడు వింటికి కూర్చెనో ఎపుడు ప్రయోగించెనో చూపులు పట్టుకొన లేవని తాత్పర్యము.

రాత్రింబవళ్ళు ఇదే చింతతో నిద్ర లేక, సుఖము లేక కౌరవు లందరు నశింతు రని ఏడ్చుచున్నాను.

క్షమోదయోఽయం సుమహాన్ కురూణాం ప్రత్యుపస్థితః,
అస్య చేత్ కలహస్యాన్తః శమాదన్యో న విద్యతే. 22

కౌరవులకు సర్వనాశ మిదిగో దాపురించినది. ఈ కయ్యమునకు అందరు నాశమగుట కాక మరొక ఫలము కానరాదు.

శమో మే రోచతే నిత్యం పార్థైస్తాత న విగ్రహః,
కురుభ్యో హి సదా మన్యే పాణ్డవాన్ శక్తిమత్తరాన్. 23

నాయనా! పాండవులతో శాంతినొందుటయే నా కెల్లవేళల ఇష్టము. విరోధము కాదు. పాండవు లే నాటికిని కౌరవులకంటె మించిన శక్తికలవా రని నేను తలతును.

ఇతి శ్రీ మహాభారతే ఉద్యోగపర్వణి యానసంధిపర్వణి
ధృతరాష్ట్రవివేచనే షష్టితమోఽధ్యాయః.
ఇది శ్రీమహాభారతము ఉద్యోగపర్వమున యానసంధిపర్వమున
ధృతరాష్ట్రుని వివేకముగల అరువదవ అధ్యాయము.

—(౦)—

---

ఈ అధ్యాయమున (3వశ్లోకము మొదటిపాదము తర్వాత)
[యదా తు మేనే భూయిష్ఠం తద్వచో గుణదోషతః,
పునరేవ కురూణాం చ పాణ్డవానాం చ బుద్ధిమాన్.]
[సంజయునిమాటలను బట్టి పాండవులయు కౌరవులయు గుణదోషముల నా బుద్ధిమంతుడు సంభావించెను.]

(అయిదవశ్లోకము తర్వాత)
[ఈదృశోఽభినివిష్టస్య పృథివీక్షయకారకే,
అధర్మ్యే చాయశస్యే వా కార్యే మహతి దారుణే
పాణ్డవై ర్విగ్రహస్తాత సర్వథా మే న రోచతే.]
[ఇట్లు నిశ్చయము పొందిన నాకు భూమియంతయు నశించుటకు కారణమైనదియు, ధర్మమునకు విరుద్ధమైనది, అపకీర్తికి కారణమైనదియు, మహాదారుణమైనదియు నగు కార్యము వచ్చినపుడు, తండ్రీ! పాండవులతోడి పగ సర్వవిధముల నాకు గిట్టదు.]

## ఏకషష్టితమో౽ధ్యాయః

## అరువదియొకటవ అధ్యాయము

### దుర్యోధనస్య స్వసామర్థ్యసముద్ఘోషణమ్.

### దుర్యోధనుడు తన సామర్థ్యమును నొక్కి చెప్పుట.

వైశమ్పాయన ఉవాచ - వైశంపాయను డిట్లు చెప్పెను.

పితు రేతద్ వచః శ్రుత్వా ధార్తరాష్ట్రో౽త్యమర్షణః,
ఆధాయ విపులం క్రోధం పునరేవేద మబ్రవీత్. 1

తండ్రి పలికిన యా మాట విని దుర్యోధనుడు కొంచెమైనను సహింపక పెనుక్రోధము పెంచుకొని తిరిగి యిట్లు పలికెను.

అశక్యా దేవ సచివాః పార్థాః స్యురితి యద్ భవాన్,
మన్యతే తద్ భయం వ్యేతు భవతో రాజసత్తమ. 2

రాజవరేణ్యా! పాండవులకు దేవతలతోడు కలదు కావున అసాధ్యులు అని నీవు తలంచుచున్నావు. ఆ భయము నీకు తొలగిపోవుగాక!

అకామద్వేషసంయోగ లోభద్రోహాచ్చ భారత,
ఉపేక్షయా చ భావానాం దేవా దేవత్వ మాప్నువన్. 3

కామము, ద్వేషము, ఒకరితోడి కలయిక, లోభము, ద్రోహము-అనునవి లేకుండుట, ఆ యా భావములను పట్టించుకొనకుండుట అనువానివలననే దేవతలకు దేవత్వము కలిగినది.

ఇతి ద్వైపాయనో వ్యాసో నారదశ్చ మహాతపాః,
జామదగ్న్యశ్చ రామో నః కథా మకథయత్ పురా. 4

ఇట్లని ద్వీపము నెలవుగా గల వ్యాసుడు, గొప్ప తాపసి యగు నారదుడు, జమదగ్ని కుమారుడగు రాముడు మనకు మునుపు చెప్పిరి.

నైవ మానుషవ ద్దేవా ప్రవర్తన్తే కదాచన,
కామాత్ క్రోధాత్ తథా లోభా ద్ద్వేషాచ్చ భరతర్షభ. 5

దేవతలు మనుష్యులవలె కామము, క్రోధము, లోభము, ద్వేషము అను వానివలన ఎన్నటికిని ప్రవర్తింపరు.

యదా హ్యగ్నిశ్చ వాయుశ్చ ధర్మ ఇన్ద్రో౽శ్వినా వపి,
కామయోగా త్ప్రవర్తేర న్న పార్థా దుఃఖ మాప్నుయుః. 6

అగ్ని, వాయువు, ధర్ముడు, ఇంద్రుడు, అశ్వినీదేవతలు కామసంబంధము వలననే ప్రవర్తించియున్నచో కుంతికొడుకులు దుఃఖము పొంది యుండెడివారు కారు గదా!

తస్మా న్న భవతా చిన్తా కార్యైషా స్యాత్ కథంచన,
దైవేష్వపేక్షకా హ్యేతే శశ్వద్భావేషు భారత. 7

కావున నీవు ఎన్నడు దీనినిగూర్చి చింతింపవలదు. దేవతలు దైవభావము లందే ఎప్పటికిని కోరికలు కలిగి యుందురు.

అథ చేత్ కామసంయోగా ద్ద్వేషో లోభశ్చ లక్ష్యతే,
దైవేషు దైవప్రామాణ్యాన్నైషాం తద్విక్రమిష్యతి. 8

అట్లు కాక కామసంబంధమువలన దేవతలయందు ద్వేషము, లోభము కానవచ్చినచో అవి వారికి ప్రయోజనము గలిగింపదు. ఇది వేదప్రమాణము వలన తెలియదగినది.

మయా౽భిమన్త్రితః శశ్వ జ్జాతవేదాః ప్రశామ్యతి,
దిధక్షుః సకలాన్ లోకాన్ పరిక్షిప్య సమన్తతః. 9

---

7. ఏతే-దేవాదులు, దైవేషు భావేషు - శమము, దమము మున్నగు దివ్యభావములయందు; అపేక్షకాః-కోరికగలవారు. అంతేకాని, ఆసురభావములగు కామాదులయందు కాదని తాత్పర్యము. కావున దేవతలు పాండవులకు సాయము చేయరని ఫలితార్థము.

8. దైవప్రామాణ్యాత్ - వేదప్రామాణ్యమువలన; తత్-కామాదులతో చేసిన పని;న విక్రమిష్యతి-సాగదు. సత్ఫలము నొసగదని తాత్పర్యము.

9. ఈ శ్లోకమున దుర్యోధనుడు దైవానుగ్రహము తనకును గలదని నిరూపించుచున్నాడు.

లోకము లన్నింటిని అన్నివైపులను క్రమ్మి కాల్చివేయ నుంకించిన అగ్నిదేవుడును నేను మంత్రములతో నీరు చల్లగా ఆరిపోవును.

యద్వా పరమకం తేజో యేన యుక్తా దివౌకసః,
మమా ప్యనుపమం భూయో దేవేభ్యో విద్ధి భారత. 10

దేవలోకవాసుల గొప్పతేజస్సు నాకును సాటిలేని తీరున కలదని యెరుగుము.

విదీర్యమాణాం వసుధాం గిరీణాం శిఖరాణి చ,
లోకస్య పశ్యతో రాజన్ స్థాపయా మ్యభిమన్త్రిణాత్. 11

బ్రద్దలగుచున్న భూమిని, విరిగిపోవుచున్న కొండకొమ్ములను లోకమంతయు చూచుచుండగా నేను మంత్రించి నిలుపగలను.

చేతనాచేతనస్యాస్య జఙ్గమస్థావరస్య చ,
వినాశాయ సముత్పన్న మహం ఘోరం మహాస్వనమ్. 12
అశ్మవర్షం చ వాయుం చ శమయామీహ నిత్యశః,
జగతః పశ్యతోఽభీక్ష్ణం భూతానా మనుకమ్పయా. 13

ప్రాణ మున్నట్టిదియు, లేనట్టిదియు, కదలెడునదియు, కదలనిదియు నగు సమస్తమైన జగత్తును రూపుమాపుటకై పుట్టిన భయంకరమగు రొదతో కూడిన రాలవానను, పెనుగాలిని లోకమంతయు చూచుచుండగా ప్రాణికోటిపై దయతో నేను అణగార్పగలను.

స్తమ్భితాస్వప్సు గచ్ఛన్తి మయా రథపదాతయః,
దేవాసురాణాం భావానా మహమేకః ప్రవర్తితా. 14

నీటిని కదలకుండచేసి దానిపై రథములను సైనికులను నడుపగలను. ఇట్లు దివ్యములు, రాక్షసములు నగు భావములను నేనొక్కడనే త్రిప్పుదును.

అక్షౌహిణీభి ర్యాన్ దేశాన్ యామి కార్యేణ కేనచిత్,
తత్రాశ్వా మే ప్రవర్తన్తే యత్ర యత్రాభికామయే 15

నే నేదైన పనిమీద అక్షౌహిణులతో ఏ యే దేశముల కరుగుదునో అందందు నాగుఱ్ఱములు నా యిచ్ఛవచ్చినట్లు తిరుగును.

భయానకాని విషయే వ్యాలాదీని న సన్తి మే,
మన్త్రగుప్తాని భూతాని న హింసన్తి భయఙ్కరాః. 16

నా దేశమున భయమును గొలుపు పాములు మొదలగునవి నేను మంత్రము వైచి రక్షించు ప్రాణులను హింసింపజాలవు.

నికామవర్షీ పర్జన్యో రాజన్ విషయవాసినామ్,
ధర్మిష్ఠాశ్చ ప్రజాః సర్వా ఈతయశ్చ న సన్తి మే. 17

నా దేశమున నున్న ప్రజలకు వర్షదేవత కోరిన వర్ష మొసగును. ప్రజ లందరు మిక్కిలిగా ధర్మమును పాలింతురు. వారికి ఈతిబాధలు కలుగవు.

అశ్వినా వథ వాయ్వగ్నీ మరుద్భిః సహ వృత్రహా,
ధర్మశ్చైవ మయా ద్విష్టా న్నోత్సహన్తేఽభిరక్షితుమ్. 18

అశ్వినీదేవతలు, వాయువు, అగ్ని, దేవతలతోపాటు, దేవేంద్రుడు, ధర్మ దేవతయు నేను ద్వేషించువారిని రక్షింప నుత్సహింపరు.

యది హ్యేతే సమర్థాః స్యు ర్మద్ద్విషస్త్రాతు మఞ్జసా,
న స్మ త్రయోదశసమాః పార్థా దుఃఖ మవాప్నుయుః. 19

ఈ దేవతలు నా పగవారిని కాపాడగలిగి యుందురేని పదుమూ డేండ్లు కుంతికొడుకులు దుఃఖపడియుండరు.

నైవ దేవా న గన్ధర్వా నాసురా న చ రాక్షసాః,
శక్తా స్త్రాతుం మయా ద్విష్టం సత్యమేత ద్బ్రవీమి తే. 20

నేను ద్వేషించినవానిని దేవతలుగాని, గంధర్వులుగాని, అసురులుగాని, రక్కసులుగాని, రక్షింప సమర్థులు గారు. నీకు నిజము చెప్పుచున్నాను.

యదభిధ్యా మ్యహం శశ్వ చ్ఛుభం వా యది వాఽశుభమ్,
నైత ద్విపన్నపూర్వం మే మిత్రేష్వరిషు చోభయోః. 21

ఎన్నడుగాని నేను మిత్రులకు మేలో, శత్రువులకు కీడో చింతించినచో అది మునుపెన్నడు చెడలేదు.

భవిష్యతీద మితి వా యద్బ్రవీమి పరన్తప,
నాన్యథా భూతపూర్వం చ సత్యవాగితి మాం విదుః. 22

ఇది యిట్లగునని నేను పలికినది మును పెన్నడు వేరువిధముగా జరుగ లేదు. నన్ను సత్యవాక్కని జను లెరుగుదురు.

లోకసాక్షిక మేతన్మే మాహాత్మ్యం దిక్షు విశ్రుతమ్,
ఆశ్వాసనార్థం భవతః ప్రోక్తం న శ్లాఘయా నృప. 23

ఈ నా గొప్పతనమును లోక మంతయు స్వయముగా చూచియున్నది. దిక్కులన్నింట తెలియ వచ్చినది. నిన్నూరడించుటకై యిది చెప్పుచున్నాను గాని పొగడికోలునకు కాదు.

న హ్యహం శ్లాఘనో రాజన్ భూతపూర్వః కదాచన,
అసదాచరితం హ్యేత ద్యదాత్మానం ప్రశంసతి. 24

నేను మునుపెన్నడు పొగడికొన్నవాడను కాదు. తన్ను తాను పొగడు కొనుట చెడు చేష్ట.

పాణ్డవాంశ్చైవ మత్స్యాంశ్చ పాఞ్చాలాన్ కేకయైః సహ,
సాత్యకిం వాసుదేవం చ శ్రోతాఽసి విజితాన్ మయా. 25

పాండవులు, మత్స్యదేశమువారు, పాంచాలదేశమువారు, కేకయులు, సాత్యకి, వాసుదేవుడు-వీరందరు నా కోడిరని నీవు విందువు.

సరితః సాగరం ప్రాప్య యథా నశ్యన్తి సర్వశః,
తథైవ తే వినఙ్క్ష్యన్తి మామాసాద్య సహాన్వయాః. 26

నదులు సముద్రమున చేరి సంపూర్ణముగా రూపుమాసినట్లు నన్ను తాకినవా రందరు వంశమువా రందరితో పాటు నశించి పోవుదురు.

పరా వృద్ధిః పరం తేజో వీర్యం చ పరమం మమ,
పరా విద్యా పరో యోగో మమ తేభ్యో విశిష్యతే. 27

రాజా! వారికంటె నాది ఉత్కృష్టమగు వృద్ధి, గొప్పది యగు తేజము మిక్కిలి యగు వీర్యము, ఉత్కృష్ట మగు విద్య, మిన్నయగు యోగము.

పితామహశ్చ ద్రోణశ్చ కృపః శల్యః శల స్తథా,
అస్త్రేషు యత్ ప్రజానన్తి సర్వం తన్మయి విద్యతే. 28

తాత, ద్రోణుడు, కృపుడు, శల్యుడు, శలుడు, అస్త్రముల విషయమున నేమేమి యెరుగుదురో అది యంతయు నాయందు కలదు.

ఇత్యుక్త్వా సఞ్జయం భూయః పర్యపృచ్ఛత భారతః,
జ్ఞాత్వా యుయుత్సోః కార్యాణి ప్రాప్తకాల మరిన్దమః. 29

ధృతరాష్ట్రుడు దుర్యోధనుడు పలికిన దంతయు సంజయునకు వినిపించి, మున్ను తాను ప్రస్తావింపచున్న అర్జునుని మహిమనుగూర్చియు, యుయుత్సువు యొక్క కార్యమునుగూర్చి మరల అడిగెను.

ఇతి శ్రీమహాభారతే ఉద్యోగపర్వణి యానసంధిపర్వణి
దుర్యోధనవాక్యే ఏకషష్టితమోఽధ్యాయః.

ఇది శ్రీమహాభారతము ఉద్యోగపర్వమున యానసంధిపర్వమున
దుర్యోధనవాక్యము గల అరువదియొకటవ అధ్యాయము.

—(o)—

---

29. ఇతి-ఇట్లు దుర్యోధనుడు పలికినదానిని; ఉక్త్వా - సంజయునకు చెప్పి, ప్రాప్తకాలమ్-మునుపు ప్రసంగమునకు వచ్చిన అర్జునుని మహిమను గూర్చియే; పర్యపృచ్ఛత-అడిగెను. ఇదిగో నా కొడుకు బలము-దీని నెరిగి పాండవుల బలమునుగూర్చి పలుకుము అని తాత్పర్యము.
యుయుత్సోః-ధృతరాష్ట్రునకు వైశ్యస్త్రీయందు పుట్టిన కొడుకు యుయుత్సువుయొక్క; (ఆతడు పాండవులయం దనురాగముగలవా డయ్యెను.) కార్యాణి-పనులను; జ్ఞాత్వా - ఎఱిగి; వీరందరు చావగా రాజ్యలాభము మొదలగునది జరుగునని ఎఱిగి అడిగెనని తాత్పర్యము;

## ద్విషష్టితమోఽధ్యాయః
## అరువదిరెండవ అధ్యాయము

కర్ణ స్యాత్మవికత్థనమ్, భీష్మాధిక్షిప్తేన తేన సభాత్యాగః,
భీష్మస్య కర్ణం ప్రతి పునరాక్షేపకరణమ్.

కర్ణుడు తన్నుతా బొగడుకొనుట, భీష్ముడు ఎత్తి పొడువగా
ఆతడు సభనుండి వెడలిపోవుట, భీష్ముడు కర్ణుని మరల ఆక్షేపించుట.

వైశమ్పాయన ఉవాచ - వైశంపాయను డిట్లు చెప్పెను.

తథా తు పృచ్ఛన్త మతీవ పార్థం
వైచిత్రవీర్యం తమచిన్తయిత్వా,
ఉవాచ కర్ణో ధృతరాష్ట్రపుత్రం
ప్రహర్షయన్ సంసది కౌరవాణామ్. 1

అట్లు తిరిగి తిరిగి అర్జునునిగూర్చి యడుగుచున్న ధృతరాష్ట్రుని లెక్క చేయక కర్ణుడు కౌరవులసభలో దుర్యోధనుని ఉప్పొంగజేయుచు నిట్లు పలికెను.

మిథ్యా ప్రతిజ్ఞాయ మయా యదస్త్రం
రామాత్ కృతం బ్రహ్మమయం పురస్తాత్,
విజ్ఞాయ తేనాస్మి తదైవ ముక్త-
స్తేనాన్తకాలే ప్రతిభాస్యతీతి. 2

నేను అబద్ధమాడి మునుపు పరశురాముని నుండి బ్రహ్మమయమగు అస్త్ర విద్యను నేర్చితిని. అది యెరిగి యాతడు, 'ఓరి దొంగా! తుదికాలమున అస్త్రముల స్మృతి నీకు తొలగిపోవు' నని నాతో పలికెను.

---

1. అచిన్తయిత్వా-పార్థునిగూర్చి యడుగుచున్న ధృతరాష్ట్రుని లెక్కచేయక అని తాత్పర్యము;
2. స్తేన - దొంగా; అన్తకాలే - నీ తుదికాలమున; ప్రతిభా - అస్త్రములకు సంబంధించిన స్మృతి; అస్యతి - వెడలిపోవును.

మహాపరాధే హ్యపి యన్న తేన
మహర్షిణాఽహం గురుణా చ శప్తః,
శక్తః ప్రదగ్ధుం హ్యపి తిగ్మతేజాః
ససాగరా మప్యవనిం మహర్షిః. 3

మహర్షియగు నా గురువు, నే నెంత ఘోరమైన తప్పిదము చేసినను నన్ను శపింపలేదు. మిక్కిలి తీవ్రమగు తేజస్సుగల ఆ మహర్షి సముద్రములతో పాటు భూమి నంతటిని కాల్చివేయగలడు.

ప్రసాదితం హ్యస్య మయా మనోఽభూ-
చ్ఛుశ్రూషయా స్వేన చ పౌరుషేణ,
తదస్తి చాస్త్రం మమ సావశేషం
తస్మాత్ సమర్థోఽస్మి మమైష భారః. 4

నేను చేసిన సేవచేతను, నా పౌరుషముచేతను ఆయన మనస్సు ప్రసన్నమైనది. ఆయన యొసగిన అస్త్రము గలదు. నా ఆయు వింకను మిగిలియున్నది. కావున నేను సమర్థుడను. ఈ బరువంతయు నాది.

నిమేషమాత్రా త్తమృషేః ప్రసాద-
మవాప్య పాఞ్చాల-కరూష-మత్స్యాన్,
నిహత్య పార్థాన్ సహ పుత్రపౌత్రై-
ర్లోకానహం శస్త్రజితాన్ ప్రపత్స్యే. 5

త్రుటికాలములో ఆ ఋషి యనుగ్రహము సంపాదించి పాంచాలురను, కరూషులను, మత్స్యులను, కొడుకులతో మనుమలతోపాటుగ పాండవులను చంపి, లోకుల నందరిని శస్త్రముచే కోడిన వారినిగా చేయుదును.

---

4. సావశేషమ్ - (నా ఆయువు)మిగిలియున్నది; కావున అంతకాలము రాలేదు. కనుక నే నర్జునుని గెలువగలనని భావము;

5. ప్రపత్స్యే - పొందింతును;

పితామహ స్తిష్ఠతు తే సమీపే
ద్రోణశ్చ సర్వే చ నరేన్ద్రముఖ్యాః,
యథా ప్రధానేన బలేన గత్వా
పార్థాన్ హనిష్యామి మమైష భారః. 6

తాతగారు నీకడనే యుండుగాక! అట్లే ద్రోణుడును రాజముఖ్యు లందరు ఇక్కడనే ఉందురు గాక! నేను ప్రధానసేనతో నరిగి పాండవులను చంపుదును. ఈ భారము నాది.

ఏవం బ్రువన్తం తమువాచ భీష్మః
కిం కత్థసే కాలపరీతబుద్ధే,
న కర్ణ జానాసి యథా ప్రధానే
హతే హతాః స్యు ర్ధృతరాష్ట్రపుత్రాః. 7

కర్ణు డిట్లు పలుకుచుండగా భీష్ము డిట్లు పలికెను. "కాలముమూడిన బుద్ధి గలవాడా! ఎందుకట్లు గొప్పలు చెప్పుకొందువు? ముఖ్యవ్యక్తివగు నీవు చచ్చినచో ధృతరాష్ట్రుని కొడుకులు చత్తురని, కర్ణా! నీ వెరుగవా?"

యత్ ఖాణ్డవం దాహయతా కృతం హి
కృష్ణద్వితీయేన ధనఞ్జయేన,
శ్రుత్వైవ తత్కర్మ నియన్తు మాత్మా
యుక్త స్త్వయా వై సహబాన్ధవేన. 8

---

7. ప్రధానే - ప్రధానుడవగు నీవు; హతే సతి - చంపబడగా; సర్వే హతాః స్యుః - అందరు చత్తురు కావున ముందు నిన్ను కాపాడుకొను మని భావము.

8. ఆత్మా - మనస్సు; నియన్తుమ్ - అణచుటకు; యుక్తః - తగిన పని. అర్జునద్వేషమునుండి మరలుట కర్తవ్యము. అతడు జయింపరానివా డని ఎరుగుట మంచిదని భావము;

ఖాండవము దహించుచున్న అర్జునుడు కృష్ణుడు తోడైయుండగా చేసియున్నపనిని తెలిసికొనియైన నీవు నీ చుట్టములు మనస్సు నదుపులో నుంచుకొనుట మేలు.

యాం చాపి శక్తిం త్రిదశాధిప స్తే
దదౌ మహాత్మా భగవాన్ మహేన్ద్రః,
భస్మీకృతాం తాం సమరే విశీర్ణాం
చక్రాహతాం ద్రక్ష్యసి కేశవేన. 9

దేవతల ప్రభువు భగవాను డగు మహేంద్రుడు నీ కిచ్చెనే-ఆ శక్తి యుద్ధ భూమిలో శ్రీకృష్ణుని చక్రము దెబ్బ తిని బూడిద అయి రాలిపోవుటను చూడగలవు.

య స్తే శరః సర్పముఖో విభాతి
సదాఽగ్ర్యమాల్యై ర్మహితః ప్రయత్నాత్,
స పాణ్డుపుత్రాభిహతః శరౌఘైః
సహ త్వయా యాస్యతి కర్మనాశమ్. 10

ఇక నీ కొక తలపాము బాణ మున్నది. నిత్యము గొప్పమాలలతో ప్రయత్న పడి దానిని గొప్ప చేయుచున్నావు. అర్జునుని బాణముల వెల్లువ దెబ్బ తిని నీతో పాటు అది రూపు మాసిపోవును.

బాణస్య భౌమస్య చ కర్ణ హన్తా
కిరీటినం రక్షతి వాసుదేవః,
య స్త్వాదృశానాం చ వరీయసాం చ
హన్తా రిపూణాం తుములే ప్రగాఢే. 11

మరియు భౌమమైన బాణమును నాశము చేసి వాసుదేవుడు అర్జునుని కాపాడును. ఆ కృష్ణుడు నీవంటివారిని, నీతలదన్నినవారిని కూడా ఎంత దొమ్మి కయ్యమునం దైనను చంపగలడు.

కర్ణ ఉవాచ- కర్ణు డిట్లు పలికెను.

అసంశయం వృష్ణిపతి ర్యథోక్త-
స్తథా చ భూయాం శ్చ తతో మహాత్మా,

అహం యదుక్తః పరుషం తు కిఞ్చిత్
పితామహస్తస్య ఫలం శృణోతు. 12

వృష్ణివంశనాయకుడు కృష్ణుడు నీవన్నట్టివాడే. సంశయము లేదు. ఆ మహాత్ము డంతకంటె గొప్పవాడు. కాని, తాత నన్నుగూర్చి పలికిన కారులకు ఫలమేమో వినవలయును.

న్యస్యామి శస్త్రాణి న జాతు సఙ్ఖ్యే
పితామహో ద్రక్ష్యతి మాం సభాయామ్,
త్వయి ప్రశాన్తే తు మమ ప్రభావం
ద్రక్ష్యన్తి సర్వే భువి భూమిపాలాః. 13

ఇదిగో శస్త్రసన్న్యాసము చేయుచున్నాను. యుద్ధమున అస్త్రము ముట్టను. సభలో తాత గెలుపొందిన నన్ను చూచును. భీష్మా! నీవు అణగినప్పుడే నా మహిమను భూమియందలి భూమిపాలు రందరు చూతురు.

వైశమ్పాయన ఉవాచ- వైశంపాయను డిట్లు చెప్పెను.

ఇత్యేవ ముక్త్వా స మహాధనుష్మాన్
హిత్వా సభాం స్వం భవనం జగామ,
భీష్మస్తు దుర్యోధన మేవ రాజన్
మధ్యే కురూణాం ప్రహస న్నువాచ. 14

ఆ మహాధానుష్కుడు ఇట్లని పలికి, సభను వదలి తన భవనమున కరిగెను. భీష్ముడు మాత్రము కురువంశమువారి నడుమ దుర్యోధనుని వెక్కిరించుచు నిట్లు పలికెను.

సత్యప్రతిజ్ఞః కిల సూతపుత్ర -
స్తథా సభారం విషహేత కస్మాత్,

---

13. మాం - గెలిచిన నన్ను - అని భావము. ఇచట కర్ణుని భావ మిది. నేను యుద్ధము చేసినచో ఈతనికి బ్రదుకు కలుగును. అది కాకుండవలయును. ఈతడు సారములేని బ్రదుకు బ్రదికి చావవలయును.

వ్యూహం ప్రతివ్యూహ్య శిరాంసి భిత్వా
లోకక్షయం పశ్యత భీమసేనాత్. 15

ఈ సూతపుత్రుడు సత్యమైన ప్రతిజ్ఞ కలవాడట! ఇట్టివా డెట్లు బరువు మోయును? భీమసేనుడు ఎత్తుకు పైయెత్తు వేసి తలలు పగులగొట్టినపుడు లోక మంతయు నశించుటను మీరు చూడుడు.

అవన్త్యకాళిఙ్గజయద్రథేషు
చేదిధ్వజే తిష్ఠతి బాహ్లికే చ,
అహం హనిష్యామి సదా పరేషాం
సహస్రశ శ్చాయుతశశ్చ యోధాన్. 16

అవంత, కళింగరాజులు, జయద్రథుడు, చేదిరాజు, బాహ్లికుడు-వీరందరు నుండగా నేను పరులయోధులను లక్షలకొలదిగా చంపుదును.

యదైవ రామే భగవత్యనిన్ద్యే
బ్రహ్మ బ్రువాణః కృతవాన్ తదస్త్రమ్,
తదైవ ధర్మశ్చ తపశ్చ నష్టం
వైకర్తన స్యాధమపూరుషస్య. 17

భగవానుడు, ఏదోష మెరుగనివాడు నగు పరశురామునికడ 'నేను బ్రాహ్మణుడు'నని చెప్పుకొని ఎన్నడీ నీచుడు అస్త్రవిద్య నేర్చెనో అపుడే ఈ కర్ణుని ధర్మము, తపస్సు చెడిపోయినవి.

---

15. సత్యప్రతిజ్ఞః కిల-ముందు నీకై పోరుదు నని చెప్పి ఇపుడు నేనుండగా పోర ననుచున్న ఆతడు సత్యప్రతిజ్ఞు డెట్లగునని ఆక్షేపణము. నేను పడిపోవుదాక నీ నాశమును ఉపేక్షించు వీడు మిత్ర మెట్లగును? భార మెట్లు మోయును? అని ఆక్షేపణము.

17. బ్రహ్మ బ్రువాణః - బ్రాహ్మణుడ నని చెప్పుకొనుచు; వైకర్తనస్య - వికర్తనుని - సూర్యుని పుత్రునియొక్క;

వైశమ్పాయన ఉవాచ - వైశంపాయను డిట్లు చెప్పెను.

తథోక్తవాక్యే నృపతీన్ద్రి భీష్మే
నిక్షిప్య శస్త్రాణి గతే చ కర్ణే,
వైచిత్ర్యవీర్యస్య సుతోఽల్పబుద్ధి -
ర్దుర్యోధనః శాన్తనవం బభాషే. 18

భీష్ము డట్లు పలుకగా కర్ణుడు ఆయుధములు పారవైచి పోగా ధృత రాష్ట్రుని కొడుకు అల్పబుద్ధి దుర్యోధనుడు భీష్మునితో నిట్లు పలికెను.

ఇతి శ్రీమహాభారతే ఉద్యోగపర్వణి యానసంధిపర్వణి
కర్ణభీష్మవాక్యే ద్విషష్టితమోఽధ్యాయః.

ఇది శ్రీమహాభారతము ఉద్యోగపర్వమున యానసంధిపర్వమున
కర్ణభీష్మవాక్యములు గల అరువదిరెండవ అధ్యాయము.

—(०)—

## త్రిషష్టితమోఽధ్యాయః

## అరువదిమూడవ అధ్యాయము

దుర్యోధనస్య స్వపక్షప్రాబల్యపరివర్ణనమ్,
విదురేణ దమస్య ప్రశంసనమ్.

దుర్యోధనుడు తనపక్షము ప్రాబల్యము నుగ్గడించుట -
విదురుడు నిగ్రహమును కొనియాడుట.

దుర్యోధన ఉవాచ - దుర్యోధను డిట్లు పలికెను.

సదృశానాం మనుష్యేషు సర్వేషాం తుల్యజన్మనామ్,
కథ మేకాన్తత స్తేషాం పార్థానాం మన్యసే జయమ్. 1

ఆ పాండవులు అందరు మనుష్యులవంటివారే. అందరివలెనే పుట్టినవారే. అట్టివారికి తప్పక జయము కలుగునని నీవెట్లు తలచెదవు?

వయం చ తేఽపి తుల్యా వై వీర్యేణ చ పరాక్రమైః,
సమేన వయసా చైవ ప్రాతిభేన శ్రుతేన వా. 2

వీర్యము, పరాక్రమము, సమమైన వయసు, సమయస్ఫూర్తి, పాండిత్యము-అను విషయములలో మేమును వారును సమానులమే.

అస్త్రేణ యోగయుగ్యా చ శీఘ్రత్వే కౌశలే తథా,
సర్వే స్మ సమజాతీయాః సర్వే మానుషయోనయః. 3

అస్త్రవిద్యలో, యోధులను పొందుటలో, ఒడుపులో, నేర్పులో మే మందరము ఒకేవిధమువారము. అందరము మనుష్యులకే పుట్టితిమి.

పితామహ విజానీషే పార్థేషు విజయం కథమ్.

తాతా! అట్టి యెడ పాండవులకే విజయమని నీ వెట్లెరుగుదువు?

నాహం భవతి న ద్రోణే న కృపే న చ బాహ్లికే, 4
అన్యేషు చ నరేన్ద్రేషు పరాక్రమ్య సమారభే.

నేను నీయందుగాని, ద్రోణునియందు గాని, కృపునియందుగాని, బాహ్లికునియందు గాని, యితరరాజులందు గాని ఆధారపడి యుద్ధము నారంభింపలేదు.

అహం వైకర్తనః కర్ణః భ్రాతా దుఃశాసనశ్చ మే, 5
పాణ్డవాన్ సమరే పఞ్చ హనిష్యామః శితైః శరైః.

నేనును, సూర్యునికొడుకు కర్ణుడును, తమ్ముడు దుశ్శాసనుడును వాడి ములుకులతో పాండవు లైదుగురిని యుద్ధమున మట్టుపెట్టుదుము.

తతో రాజన్ మహాయజ్ఞై ర్వివిధై ర్భూరిదక్షిణైః, 6
బ్రాహ్మణాం స్తర్పయిష్యామి గోభి రశ్వై ర్ధనేన చ.

పిదప రాజా! గొప్పదక్షిణలు గల అనేకవిధములగు మహాయజ్ఞము లాచరించి, గోవులు, గుఱ్ఱములు, ధనములు పుష్కలముగా నిచ్చి, బ్రాహ్మణులను తృప్తిపరచెదను.

యదా పరికరిష్యన్తి ఐణేయానివ తన్తునా,
అతరిత్రానివ జలే బాహుభి ర్మామకా రణే. 7
పశ్యన్తస్తే పరాం స్తత్ర రథనాగసమాకులాన్,
తదా దర్పం విమోక్ష్యన్తి పాణ్డవాః స చ కేశవః. 8

రక్షించువాడు లేక నీట మునిగిపోవుచున్న లేడిపిల్లలను త్రాడుగట్టి లాగిన విధమున నావారు చేతులతో పరులను-రథములతో ఏనుగులతో గజిబిజిగా నున్నవారిని - లాగుచున్నపుడు చూచుచు, ఆ పాండవులును ఆ కేశవుడును గర్వము విడనాడెదరు.

---

7. తరిత్రు లనగా-నావను రక్షించు కర్ణధారుడు మున్నగువారు-వారు లేని వారు అతరిత్రులు-అట్టివారు నీట మునిగిపోవుదురు. ఇచట అట్లు నీట మునిగిపోవుచున్న లేడిపిల్లలను త్రాటితో గట్టి పైకి లాగినవిధమున అని ఉపమానము.

విదుర ఉవాచ : ఇంద్రియములపై అదుపులేని ఈ దుర్యోధనుడు కుల మంతటిని నాశము చేయుచున్నాడని విదురుడు దమముయొక్క గొప్పదనమును వివరించుచున్నాడు.

విదుర ఉవాచ-విదురు డిట్లు పలికెను.

ఇహ నిఃశ్రేయసం ప్రాహు ర్వృద్ధా నిశ్చితదర్శినః,
బ్రాహ్మణస్య విశేషేణ దమో ధర్మః సనాతనః. 9

లోకతత్త్వమును నిశ్చయించి చూచిన పెద్దలు, విశేషముగా బ్రాహ్మణునకు, నిగ్రహము సనాతనమైన ధర్మము, పరలోకసుఖము నొసగునది యని చెప్పుదురు.

తస్య దానం క్షమా సిద్ధి ర్యథావ దుపపద్యతే,
దమో దానం తపో జ్ఞాన మధీతం చానువర్తతే. 10

ఎవని దానము, తపస్సు, జ్ఞానము, అధ్యయనము అనునవి నిగ్రహము ననుసరించి యుండునో-దానము, సహనము సిద్ధియు వానికే లభించును.

దమ స్తేజో వర్ధయతి పవిత్రం దమ ఉత్తమమ్,
విపాప్మా వృద్ధతేజాస్తు పురుషో విన్దతే మహత్. 11

దమము తేజమును వృద్ధి పొందించును. దమము ఉత్తమమైనది. పవిత్రమైనది. అట్టి దమమును పాటించి పాపమును పోగొట్టుకొన్నవాడు, తేజమును పెంపొందించుకొన్నవాడును అగు పురుషుడు పరమప్రయోజనమును పొందును.

క్రవ్యాద్భ్య ఇవ భూతానా మదాన్తేభ్యః సదా భయమ్,
యేషాం చ ప్రతిషేధార్థం క్షత్రం సృష్టం స్వయమ్భువా. 12

---

9. దమః-ఇంద్రియములపై అదుపు; బ్రాహ్మణస్య-బ్రహ్మమునుగూర్చి తెలిసికొనదలచినవానికి, బ్రహ్మజిజ్ఞాస కలవానికి ఏది శుభమో అట్టి దమము సనాతనము-ముఖ్యమైన ధర్మమని తాత్పర్యము.

10. తస్య-అతనికి; దానమ్-దానము; క్షమాసిద్ధిః చ-సహనము, మోక్షము అనునవి; ఉపపద్యతే-లభించును; కస్య-ఎవని కన్నచో; యస్య-ఎవనికి; దమః - ఇంద్రియములపై నిగ్రహము; దానమ్ - దానమును; తపః - తపస్సును; జ్ఞానమ్-జ్ఞానమును; అధీతమ్ - అధ్యయనము - వేదములను పఠించుట; ఎటుగుట అనువానిని: అనువర్తతే-అనుసరించి వర్తించునో-దమము లేని దాన, తప ఆదులు వ్యర్థము లని భావము.

11. మహత్ - బ్రహ్మమును; విన్దతే - పొందును;

18. సముదయః - అభ్యుదయము కలిగించుటకు హేతువైనది;

ఇంద్రియములపై అదుపులేనివారలవలన సర్వభూతములకు క్రూర మృగములవలన వలె ఎల్లవేళల భయము కలుగుచున్నది. అట్టివానిని తొలగ ద్రోలుటకే బ్రహ్మ క్షత్రియజాతిని సృజించెను.

ఆశ్రమేషు చతుర్ష్వాహు ర్దమమే వోత్తమం వ్రతమ్,
తస్య లిఙ్గం ప్రవక్ష్యామి యేషాం సముదయో దమః. 13

నాలుగాశ్రమములవారికిని దమమే ఉత్తమమగు వ్రతము. దమము అభ్యుదయహేతువు. అట్టివారిలక్షణము చెప్పుచున్నాను.

క్షమా ధృతి రహింసా చ సమతా సత్యమార్జవమ్,
ఇన్ద్రియాభిజయో ధైర్యం మార్దవం హ్రీ రచాపలమ్. 14
అకార్పణ్య మసంరంభః సన్తోషః శ్రద్దధానతా,
ఏతాని యస్య రాజేన్ద్ర స దాన్తః పురుషః స్మృతః. 15

క్షమ, ధృతి, అహింస, సమత్వము, సత్యము, ఆర్జవము, ఇంద్రియముల పై సంపూర్ణమగు జయము, ధైర్యము, సిగ్గు, చాపల్యము లేకుండుట, కార్పణ్యము లేకుండుట, క్రోధము లేకుండుట, సంతోషము, శ్రద్ధగలిగి యుండుట-రాజేంద్రా! ఈ లక్షణములు గలవాడు దాంతుడు.

---

14-15 క్షమా-పరులు కొట్టినను, తిట్టినను, సంతాపము పొందకుండుట; ధృతిః - కామము, క్రోధము మున్నగువానికి కుంది పోకుండుట; అహింసా - వాక్కు, మనసు, శరీరము అను వానితో ఇతరులను బాధింపకుండుట; సమతా - శత్రువులయందును, మిత్రులయందును ఒకే తీరున మెలగుట; సత్యమ్ - యథార్థమును పలుకుట; ఆర్జవమ్ - కుటిల స్వభావము లేకుండుట; ఇంద్రియాణామ్, అభిజయః - ఇంద్రియములకు ఎన్నటికిని ఏ కొంచెమును లోబడకుండుట; ధైర్యమ్ - ఎంత గొప్ప ఆపద కలిగినను చెదరకుండుట; మార్దవమ్ - ప్రియము పలుకుట; హ్రీః - తప్పుడుపనులనుండి మరలుట; అచాపలమ్ - త్రికరణములతో స్థిరముగా నుండుట; అకార్పణ్యమ్ - దీనముగా బ్రదుక కుండుట; అసంరంభః - క్రోధము తొణుకు బెణుకులు లేకుండుట; శ్రద్దధానతా - శ్రద్ధ - చేపట్టిన, మంచి పనియందు హృదయము నిలుపుట - ఇవి దాంతుని గుణములు ;

కామో లోభశ్చ దర్పశ్చ మన్యుర్నిద్రా వికత్థనమ్,
మాన ఈర్ష్యా చ శోకశ్చ నైతద్దాంతో నిషేవతే.

కామము, లోభము, దర్పము, కోపము, నిద్ర, ఆత్మస్తుతి, నేనింతవాడ ననుకొనుట, ఈర్ష్య, శోకము - అను వానిని దాంతుడు దరికి రానీడు.

అజిహ్మ మశఠం శుద్ధ మేత ద్దాన్తస్య లక్షణమ్. 16

కపటము లేకుండుట, మొండిపట్టు లేకుండుట, దోషము లేకుండుట, అనునవి దాంతుని లక్షణము.

అలోలుప స్తథాఽల్పేప్సుః కామానా మవిచిన్తితా,
సముద్రకల్పః పురుషః స దాన్తః పరికీర్తితః. 17

లేకితనము - అత్యాశ లేనివాడు, కామాదులను భావింపనివాడు నగు పురుషుడు సముద్రము వలె గంభీరుడని పేరు పొందును.

సువృత్తః శీలసమ్పన్నః ప్రసన్నాత్మాఽఽత్మవిద్బుధః,
ప్రాప్యేహ లోకే సంమానం సుగతిం ప్రేత్య గచ్ఛతి. 18

మంచి నడవడి, చక్కని శీలము, ప్రసన్నమగు మనస్సు, ఆత్మజ్ఞత, అన్నింటిని వివేకించి చూడగల బుద్ధి కలవాడు - ఈలోకమున మన్నన పొంది మరణించిన పిదప సుగతి నొందును.

---

17. అలోలుపః - ఆశలు లేనివాడు; కామానామ్ - స్త్రీలు మున్నగు వారిని, అవిచిన్తితా - ధ్యానము చేయనివాడు; సముద్రకల్పః - గంభీరమైన హృదయము కలవాడు ;

16. కామః - దుర్యోధనుడు తామసిక లక్షణములు గలవాడగుటచే అదాంతుడనియు అతనికి ఇహపరలోకములు లేవనియు తాత్పర్యము. అజిహ్మమ్- కపట ప్రవర్తన లేని వానిని; అశఠమ్ - మొండి పట్టుదల లేని వానిని; శుద్ధమ్ - మనసునందు, దేహమునందు కల్మషము లేనివానిని;

18. ప్రసన్నాత్మా - కల్మషము లేని హృదయము కలవాడు; ఆత్మవిత్ - పరమాత్మ నెఱిగినవాడు; బుధః - యుక్తము, అయుక్తము అను వాని వివేకము గల పండితుడు;

అభయం యస్య భూతేభ్యః సర్వేషా మభయం యతః,
స వై పరిణతప్రజ్ఞః ప్రఖ్యాతో మనుజోత్తమః. 19

ఎవనికి భూతములవలన భయము కలుగదో, ఎవనివలన భూతములకు భయము కలుగదో అట్టి మనుజశ్రేష్ఠుని పరిణతప్రజ్ఞు డని కొనియాడుదురు.

సర్వభూతహితో మైత్ర స్తస్మా న్నోద్విజతే జనః,
సముద్ర ఇవ గమ్భీరః ప్రజ్ఞాతృప్తః ప్రశామ్యతి. 20

సర్వభూతములకు హితము కూర్చువాడు, మైత్రికలవాడు నైన వానివలన లోకము కళవళపడదు. అతడు సముద్రమువలె గంభీరుడై ప్రజ్ఞతో తృప్తి నందుచు శాంతి నొందును.

కర్మణా చరితం పూర్వం సద్భిరాచరితం చ యత్,
తదేవాస్థాయ మోద న్తే దాన్తాః శమపరాయణాః. 21

కర్మఫలముగా లభించినదానిని, సదాచారముతో పొందినదానిని గ్రహించి తృప్తిపడువారు దాంతులు. వారు శాంతియందే మనసు నిల్పుదురు.

నైష్కర్మ్యం వా సమాస్థాయ జ్ఞానతృప్తో జితేన్ద్రియః,
కాలాకాఙ్క్షీ చరన్ లోకే బ్రహ్మభూయాయ కల్పతే. 22

---

21. పూర్వమ్-మునుపటి; కర్మణా; ఆచరితమ్-కర్మముతో చేసినదానిని-పూర్వకర్మఫలముగా సిద్ధించినదాని నని భావము; సద్భిః-సజ్జనులతో; ఆచరితమ్-చేయబడినదానిని-సజ్జనులు ప్రవర్తించిన మార్గమును;

22. నైష్కర్మ్యమ్-వాక్కు, మనసు, కర్మ అనువానితో సంపూర్ణముగా ప్రవృత్తి లేకుండుట-దానిని నిర్వికల్పకఅవస్థయందురు; దానికి హేతువు చెప్పుచున్నారు; జ్ఞానతృప్తః-జ్ఞానముచేత-శ్రవణము, మననము అను వానిచేత జనించిన అపరోక్షజ్ఞానముచేత; తృప్తః-రాగద్వేషాదులు లేని వాడు; దానికిని హేతువు చెప్పుచున్నారు,జితేంద్రియః అని. కాలాకాంక్షీ-కాలానుసారముగా వచ్చుదానికై - శుభముకాని అశుభముగాని-ఎదురు చూచువాడు - మమతలేని వాడని భావము. బ్రహ్మభూయాయ-బ్రహ్మ భావమునకు-మోక్షమునకు, కల్పతే-యోగ్యు డగుచున్నాడు.

నైష్కర్మ్యము నవలంబించి జ్ఞానముతో తృప్తి నందుచు, నింద్రియము లను గెలిచినవాడై కాలమును కాంక్షించువాడు బ్రహ్మభావమునకు యోగ్యు డగును.

శకునీనా మివాకాశే పదం నైవోపలభ్యతే,
ఏవం ప్రజ్ఞానతృప్తస్య మునే ర్వర్త్మ న దృశ్యతే. 23

ఆకసమున పక్షులకు నిలుచుచోటు లభింపనివిధమున, ప్రజ్ఞానముతో తృప్తిచెందిన మునియొక్క మార్గము కానరాదు.

ఉత్సృజ్యైవ గృహాన్ యస్తు మోక్షమే వాభిమన్యతే,
లోకా స్తేజోమయా స్తస్య కల్పన్తే శాశ్వతా దివి. 24

సంసారమును విడచి మోక్షమునే దృఢముగా తలపోయువానికి తేజస్సుతో నిండిన శాశ్వతములైన లోకములు దివమునందు కలుగును.

ఇతి శ్రీమహాభారతే ఉద్యోగపర్వణి యానసంధిపర్వణి
విదురవాక్యే త్రిషష్టితమోఽధ్యాయః.

ఇది శ్రీమహాభారతము ఉద్యోగపర్వమున యానసంధిపర్వమున
విదురవాక్యము గల అరువదిమూడవ అధ్యాయము.

—(o)—

23,24 ఈ శ్లోకములలో బ్రహ్మభావమునకు ఫలమును వక్కాణించుచున్నారు. 'న తస్య ప్రాణా ఉత్క్రామన్తి అత్రైవ సమవనీయన్తే బ్రహ్మైవ సన్ బ్రహ్మాప్నోతి' - అతని ప్రాణము లెగిరిపోవు. ఇక్కడనే నిలిచిపోవును. అతడు బ్రహ్మమే అయి బ్రహ్మమును పొందును. అను శ్రుతివలన చెప్పఁజాలని రూపము పొందిన బ్రహ్మవేత్తకు విశ్వమంతట నిండిన గగనమునకువలె పోవుట యనునది యుండదు. కావున స్వర్గమునకు చేరిన వారికివలె నట్టివానికి మార్గము కానరాదు.

24. కేవలము సన్యాసము వలననే క్రమముక్తి స్థాన మని చెప్పుచున్నారు. మోక్షమ్- సన్యాసాశ్రమమును; శాశ్వతాః-తిరిగివచ్చుట లేని వగు;

## చతుష్షష్టితమోఽధ్యాయః
## అరువదినాలుగవ అధ్యాయము

విదురేణ జ్ఞాతివిరోధస్యానర్థప్రతిపాదనపూర్వకం
శాన్త్యర్థం ధృతరాష్ట్రస్య ప్రబోధనమ్.
విదురుడు జ్ఞాతులతోడి పగవలన వచ్చు కీడును వక్కాణించి
శాంతికొరకు ధృతరాష్ట్రుని ప్రబోధించుట.

విదుర ఉవాచ - విదురు డిట్లు పలికెను.

శకునీనా మిహార్థాయ పాశం భూమా వయోజయత్,
కశ్చి చ్ఛాకునిక స్తాత పూర్వేషా మితి శుశ్రుమ. 1

నాయనా! ఒకానొక పిట్టలు పట్టువాడు పిట్టలకై నేలపై వలపన్నెనట. దీనిని మునుపు పెద్దలవలన వినియుంటిమి.

తస్మింస్తౌ శకునౌ బద్ధౌ యుగప త్సహచారిణౌ,
తా వుపాదాయ తం పాశం జగ్మతుః ఖచరా వుభౌ. 2

కలసి బ్రదుకు రెండు పక్షు లం దొక్కమారుగా చిక్కినవి. ఆ రెండును ఆ వల నెత్తుకొని ఆకసమున కెగిరిపోయినవి.

తా విహాయస మాక్రాన్తౌ దృష్ట్వా శాకునిక స్తదా,
అన్వధావ దనిర్విణ్ణో యేన యేన స్మ గచ్ఛతః. 3

పిట్టలవా డట్లు గగనమున కెగిరిన ఆ పిట్టలను చూచి విసుగు చెందక అవి యెందెందు పోయెనో యందందు పరువెత్తెను.

---

విదుర ఉవాచ - దమము శ్రేష్ఠమని ప్రతిపాదించి దమములేని యిరువురు కలహించినచో ఇరువురు నశింతు రని నిరూపింపగోరి కథను విదురులు చెప్పుచున్నారు.

1. పూర్వేషామ్-పూర్వుల నోట అని భావము.
3. విహాయసమ్-ఆకాశమును.

తథా తమనుధావన్తం మృగయుం శకునార్థినమ్,
ఆశ్రమస్థో మునిః కశ్చి ద్దదర్శాథ కృతాహ్నికః. 4

అట్లు పులుగులకొరకు వెంటబడి పరువెత్తుచున్న ఆ వేటగానిని ఒకానొక ఆశ్రమమునందు పగలు చేయవలసిన ధర్మకార్యములు ముగించియున్న ముని యొకడు గాంచెను.

తా వన్తరిక్షగౌ శీఘ్ర మనుయాన్తం మహీచరమ్,
శ్లోకే నానేన కౌరవ్య పప్రచ్ఛ స ముని స్తదా. 5

ఆకసమున వడివడిగా పోవుచున్న వానివెంట బడి నేలపై పోవుచున్న వానిని ఆ ముని ఈశ్లోకముతో పలుకరించెను.

విచిత్రమిద మాశ్చర్యం మృగహన్ ప్రతిభాతి మే,
ప్లవమానౌ హి ఖచరౌ పదాతి రనుధావసి. 6

ఓయి వేటగాడా! ఇది నాకు విచిత్రముగా, ఆశ్చర్యముగా కన్పట్టుచున్నది. ఆకసమున తేలుచున్న పక్షులను నేలపై పోవుచు వెంబడించుచున్నావు!

శాకునిక ఉవాచ- పక్షులవా డిట్లనెను.

పాశమేక ముభావేతౌ సహితౌ హరతో మమ,
యత్ర వై వివదిష్యేతే తత్ర మే వశ మేష్యతః. 7

ఈరెండును కలసి నా వల నెత్తుకొని పోవుచున్నవి. ఇవి రెండును వాదులాడిన యెడల నాచేతికి చిక్కును.

విదుర ఉవాచ- విదురు డిట్లు చెప్పెను.

తౌ వివాద మనుప్రాప్తౌ శకునౌ మృత్యుసంధితౌ,
విగృహ్య చ సుదుర్బుద్ధీ పృథివ్యాం సన్నిపేతతుః. 8

ఇంతలో ఆరెండు పక్షులును, చావు మూడి, తమలో కలహించి వాదులాటకు దిగినవి. ఏకొంచెము బుద్ధిలేని యవి రెండును నేల గూలినవి.

తౌ యుద్ధ్యమానౌ సంరబ్ధౌ మృత్యుపాశవశానుగౌ,
ఉపసృత్యాపరిజ్ఞాతో జగ్రాహ మృగహా తదా. 9

మృత్యువు పాశమునకు చిక్కిన ఆపక్షులు రెండును మహాక్రోధముతో కొట్లాడుచుండగా ఆవేటగాడు తెలియరాకుండ వానిని సమీపించి పట్టుకొనెను.

ఏవం యే జ్ఞాతయోఽర్థేషు మిథో గచ్ఛన్తి విగ్రహమ్,
తేఽమిత్రవశ మాయాన్తి శకునావివ విగ్రహాత్. 10

కలహించిన ఈ పక్షులవలె ఒక కులమున పుట్టినవారు అర్థములకై తమలో తాము కలహించినచో వారు పగవారికి చిక్కుదురు.

సంభోజనం సంకథనం సంప్రశ్నోఽథ సమాగమః,
ఏతాని జ్ఞాతికార్యాణి న విరోధః కదాచన. 11

కలసి భుజించుట, కలసి మాటలాడుకొనుట తమలో తాము కుశలము అడుగుట, కలసి తిరుగుట అనునవి చుట్టములు చేయదగిన పనులు. అంతేకాని విరోధ మెన్నటికిని కాదు.

యే స్మ కాలే సుమనసః సర్వే వృద్ధానుపాసతే,
సింహగుప్త మివారణ్య మప్రధృష్యా భవన్తి తే. 12

ఆయా కాలములందు మైత్రి నెరపుకొనుచు, ఎల్లవేళల పెద్దలను సేవించుచుండువారు, సింహములు కాపాడు అడవుల వలె ఎవ్వరికిని లొంగనివారగుదురు.

యేఽర్థం సతత మాసాద్య దీనా ఇవ సమాసతే,
శ్రియంతే సంప్రయచ్ఛన్తి ద్విషద్భ్యో భరతర్షభ. 13

ఎల్లప్పుడు ధనములు సంపాదించియు దీనులవలె బ్రదుకువారు, తమ సంపదను పగవారికి చేతులార దోచిపెట్టుదురు.

ధూమాయన్తే వ్యపేతాని జ్వలన్తి సహితాని చ,
ధృతరాష్ట్రోల్ముకా నీవ జ్ఞాతయో భరతర్షభ. 14

ధృతరాష్ట్రా! జ్ఞాతులు కొరకంచులవలె విడివడినచో పొగచూరి పోవుదురు. కలసియున్నచో ప్రకాశింతురు.

ఇదమన్యత్ ప్రవక్ష్యామి యథా దృష్టం గిరౌ మయా,
శ్రుత్వా తదపి కౌరవ్య యథాశ్రేయ స్తథా కురు. 15

నేను ఒక కొండయందు చూచిన మరియొకదానిని కూడ చెప్పుచున్నాను. కురువంశనృపా! దానినికూడ విని ఏది మేలో అది చేయుము.

వయం కిరాతైః సహితా గచ్ఛామో గిరి ముత్తమమ్,
బ్రాహ్మణై ర్దేవకల్పైశ్చ విద్యాజమ్భకవార్తికైః. 16

మే మొకపర్యాయము మంత్రములను, ఓషధులను గూర్చి ప్రియముగా మాటాడు దేవతుల్యులగు బ్రాహ్మణులతోడను, ఆటవికులతోడను కలసి ఉత్తర దిక్కునందలి కొండకడ కరుగుచుంటిమి.

కుఞ్జభూతం గిరిం సర్వ మభితో గన్ధమాదనమ్,
దీప్యమానౌషధిగణం సిద్ధగన్ధర్వసేవితమ్. 17

అన్నివైపుల పొదలుగలదియు, వెలుగొందుచున్న ఓషధులు గలదియు, సిద్ధులు, గంధర్వులు తిరుగుచున్నదియు నగు గంధమాదనపర్వతముకడ కరిగితిమి.

తత్రాపశ్యామ వై సర్వే మధుపీతక మాక్షికమ్,
మరుప్రపాతే విషమే నివిష్టం కుమ్భసమ్మితమ్. 18

అందు ఎగుడుదిగుళ్ళుగా నున్న పెనులోయలో పెద్దకుండవలె కానవచ్చు పసిమివన్నెగల తేనెపట్టును మేమందరము చూచితిమి.

ఆశీవిషై రక్ష్యమాణం కుబేరదయితం భృశమ్,
యత్ప్రాప్య పురుషో మర్త్యోఽప్యమరత్వం నియచ్ఛతి. 19

దానిని త్రాచుపాములు రక్షించుచున్నవి. అది కుబేరునికి మిక్కిలి ప్రియమైనది. దానిని పొందినచో మర్త్యుడుకూడ చావులేనివా డగును.

---

16. విద్యాజమ్భకవార్తికైః - విద్య లనగా మంత్రములు, యంత్రములు మొదలగనవి. జంభక మనగా ఓషధులను సాధించు పరికరములు; వానికి సంబంధించిన వార్తలు ఇష్టముగా గలవారు - మంత్రతంత్రాదులను గూర్చియు, ఓషధులను వెలికితీయు సాధనములను గూర్చియు ప్రియముగా మాటాడుకొనువారిచేత అని భావము.

17. కుఞ్జభూతమ్ - అంతట లత లల్లుకొనియున్నదానిని;

18. పీతకమాక్షికమ్ - బంగారువన్నెగల జుంటితేనెను;

అచక్షు ర్లభతే చక్షు ర్వృద్ధో భవతి వై యువా,
ఇతి తే కథయన్తి స్మ బ్రాహ్మణా జమ్భసాధకాః 20

కన్నులు లేనివాడు కనులు పొందును. ముదుసలి పడుచువా డగును - అని ఆ ఓషధివిద్వాంసులు పలుకజొచ్చిరి.

తతః కిరాతా స్తద్దృష్ట్వా ప్రార్థయన్తో మహీపతే,
వినేశు ర్విషమే తస్మిన్ ససర్పే గిరిగహ్వరే. 21

అంత నా కిరాతులు అది చూచి దానిని కోరినవారై జారునట్టి ఆ కొండ లోయలో పడి చచ్చిరి.

తథైవ తవ పుత్రోఽయం పృథివీ మేక ఇచ్ఛతి,
మధు పశ్యతి సమ్మోహాత్ ప్రపాతం నానుపశ్యతి. 22

అట్లే యీ నీ కొడుకు తన కొక్కనికే భూమిని కోరుచున్నాడు. కను గాననితనమున జుంటినే చూచుచున్నాడు కాని గోతిని చూడకున్నాడు.

దుర్యోధనో యోద్ధుమనాః సమరే సవ్యసాచినా,
న చ పశ్యామి తేజోఽస్య విక్రమం వా తథావిధమ్. 23

దుర్యోధనుడు యుద్ధమున అర్జునునితో పోరగోరుచున్నాడు. అతని వాడిమి గాని, పరాక్రమము గాని యీతనియం దెన్నడు చూడను.

ఏకేన రథ మాస్థాయ పృథివీ యేన నిర్జితా,
భీష్మద్రోణప్రభృతయః సంత్రస్తాః సాధుయాయినః. 24
విరాటనగరే భగ్నాః కిం తత్ర తవ దృశ్యతామ్,
ప్రతీక్షమాణో యో వీరః క్షమతే వీక్షితం తవ. 25

ఒక్క రథమును గొని ఆతడు భూమినంతటిని జయించెను. చక్కగా వెంట వచ్చిన భీష్మద్రోణాదు లందరు విరాటనగరమున వెరగంది భంగపడిరి. ఆతని బలము నీవే చూడుము. కాక అర్జునునితో పోరుటకై యెదురు చూచు చున్న ఆ కర్ణుడు చూడనగును.

---

25. తవ దృశ్యతామ్ - వారి బలము నీచేత చూడబడుగాక అని భావము; యో వీరః - వీరుడైన కర్ణుడు మొదలగువారు;

ద్రుపదో మత్స్యరాజశ్చ సంక్రుద్ధశ్చ ధనఞ్జయః,
న శేషయేయుః సమరే వాయుయుక్తా ఇవాగ్నయః. 26

ద్రుపదుడు, విరాటుడు, మిక్కిలిగా కోపముతో చెలరేగిన అర్జునుడును గాలి తోడైన అగ్నులవలె యుద్ధమున మిమ్ము మిగులనీయరు.

అఙ్కే కురుష్వ రాజానం ధృతరాష్ట్ర యుధిష్ఠిరమ్,
యుధ్యతోర్హి ద్వయోర్యుద్ధే నైకాన్తేన భవేజ్జయః. 27

ధృతరాష్ట్రా! యుధిష్ఠిరుని ఒడికి చేర్చుకొనుము. పోరుచున్న యిద్దరకు యుద్ధమున జయము నిశ్చయముగా గలుగదు.

ఇతి శ్రీమహాభారతే ఉద్యోగపర్వణి యానసంధిపర్వణి
విదురవాక్యే చతుష్షష్టితమోఽధ్యాయః.

ఇది శ్రీమహాభారతము ఉద్యోగపర్వమున యానసంధిపర్వమున
విదురవాక్యము గల యరువదినాలుగవ అధ్యాయము.

—(౦)—

27. పోరుచున్న యిరువురిలో ఎవరు నశించినను అది నీకే నష్టమని భావము.

# పఞ్చషష్టితమోఽధ్యాయః
# అరువదిఅయిదవ అధ్యాయము.

## ధృతరాష్ట్రకర్తృకం దుర్యోధనబోధనమ్
## ధృతరాష్ట్రుడు దుర్యోధనునకు చేసిన బోధ.

ధృతరాష్ట్ర ఉవాచ - ధృతరాష్ట్రు డిట్లు పలికెను.

దుర్యోధన విజానీహి యత్త్వాం వక్ష్యామి పుత్రక !,
ఉత్పథం మన్యసే మార్గ మనభిజ్ఞ ఇవాధ్వగః. 1

ఓరి కొడుకా! దుర్యోధనా! నేను చెప్పుదానిని బాగుగా తెలిసికొనుము. ఏమియు నెరుగని బాటసారివలె చెడుబాటయే బాటగా తలచుచున్నావు.

పఞ్చానాం పాణ్డుపుత్రాణాం యత్తేజః ప్రజిహీర్షసి,
పఞ్చానా మివ భూతానాం మహతాం లోకధారిణామ్. 2

లోకమును ధరించు అయిదు మహాభూతముల తేజమువంటి పాండవులైదుగురి తేజమును నీవు హరింపగోరుచున్నావు.

యుధిష్ఠిరం హి కౌన్తేయం పరం ధర్మ మిహాస్థితమ్,
పరాం గతి మసంప్రేత్య న త్వం జేతు మిహార్హసి. 3

మిక్కిలి గొప్పది యగు ధర్మమున నిలిచియున్న కుంతికొడుకు యుధిష్ఠిరుని పరమగతి బొందక నీవు జయింపజాలవు.

భీమసేనం చ కౌన్తేయం యస్య నాస్తి సమో బలే,
రణాన్తకం తర్జయసే మహావాత మివ ద్రుమః. 4

---

1. ఉత్పథమ్ - అపమార్గమునే; మార్గమ్ - సరియగు మార్గముగా; మన్యసే - తలచుచున్నావు:
3. పరాం గతిమ్, అసంప్రేత్య - 'చావక' అని భావము.

ఆ కుంతికొడుకు భీమసేనునకు బలమున ఈడైనవాడు లేడు. యుద్ధములలో అతడు యముడు. పెనుగాలిని చెట్లు బెదిరించిన ట్లాతనిని బెదిరించుచున్నావు.

సర్వశస్త్రభృతాం శ్రేష్ఠం మేరుం శిఖరిణా మివ,
యుధి గాణ్డీవధన్వానం కో ను యుద్ధ్యేత బుద్ధిమాన్. 5

ఆయుధధారు లందరిలో శ్రేష్ఠుడు. పర్వతములలో మేరువు వంటివాడు నగు గాండీవము పట్టిన అర్జునుని బుద్ధిగలవా డెవ్వడు యుద్ధమున మార్కొనును?

ధృష్టద్యుమ్నశ్చ పాఞ్చాల్యః కమివాద్య న శాతయేత్,
శత్రుమధ్యే శరాన్ ముఞ్చన్ దేవరా డశనీ మివ. 6

పాంచాలరాజుకొడుకు ధృష్టద్యుమ్నుడు పగవారి నడుమ, దేవేంద్రుడు వజ్రమునువలె, బాణములు గుప్పించుచు నెవనిని పగులగోయడు?

సాత్యకి శ్చాపి దుర్ధర్షః సంమతోఽన్ధకవృష్ణిషు,
ధ్వంసయిష్యతి తే సేనాం పాణ్డవేయహితే రతః. 7

ఆ సాత్యకియు అసాధ్యుడు. అంధకవృష్ణివంశమువారి మన్నన కెక్కినవాడు. పాండవుల హితమే అతనికి ప్రియమైనది. అతడు నీ సేనను ముక్కలు చేయును.

యః పునః ప్రతిమానేన త్రీన్ లోకా నతిరిచ్యతే,
తం కృష్ణం పుణ్డరీకాక్షం కో ను యుద్ధ్యేత బుద్ధిమాన్. 8

పోల్చినచో మూడులోకములను మించువాడు, పద్మములవంటి కన్నులు గలవాడు నగు కృష్ణునితో తలపడు బుద్ధిమంతు డెవ్వడు?

ఏకతో హ్యస్య దారాశ్చ జ్ఞాతయశ్చ సబాన్ధవాః,
ఆత్మా చ పృథివీ చేయ మేకతశ్చ ధనఞ్జయః. 9

---

6. న శాతయేత్ - పగులగొట్టడు.

8. ప్రతిమానేన - పోలికతో;

ఆ కృష్ణునకు భార్యలు, కులమువారు, చుట్టములు, తాను, ఈ భూమి-ఇవి యన్నియు నొక యెత్తు. అర్జును డొక యెత్తు.

వాసుదేవోఽపి దుర్ధర్షో యతాత్మా యత్ర పాణ్డవః,
అవిషహ్యం పృథివ్యాఽపి తద్బలం యత్ర కేశవః. 10

అర్జును డెక్కడ నుండునో ఎవ్వరికిని అణపరానివాడు, మనసుపై అదుపు గలవాడు నగు వాసుదేవు డక్కడ నుండును. కేశవు డున్నవైపు బలమును ఈ భూమి మొత్తము భరింపలేదు.

తిష్ఠ తాత సతాం వాక్యే సుహృదా మర్థవాదినామ్,
వృద్ధం శాన్తనవం భీష్మం తితిక్షస్వ పితామహమ్. 11

నాయనా! మైత్రి గలవారు, మనమేలునే బోధించువారు నగు మంచివారి మాటపై నిలుపుము. తాత, పెద్దవాడు, శంతనుని కొడుకు అగు భీష్ముని మన్నింపుము.

మాం చ బ్రువాణం శుశ్రూష కురూణా మర్థదర్శినమ్,
ద్రోణం కృపం వికర్ణం చ మహారాజం చ బాహ్లికమ్. 12

కౌరవుల మేలు గోరి పలుకుచున్న నన్ను ద్రోణుని, కృపుని, వికర్ణుని, గొప్ప దీప్తిగల బాహ్లికుని మన్నించి మా మాట వినుము.

ఏతే హ్యపి యథైవాహం మన్తు మర్హసి తాం స్తథా,
సర్వే ధర్మవిదో హ్యేతే తుల్యస్నేహాశ్చ భారత. 13

వీరందరు నేను నీ కెట్లో అట్లు మన్నన చూపదగినవారు. అందరు ధర్మము నెరిగినవారు. అందరకు నీయందు సమానమగు ప్రేమ గలదు.

యత్త ద్విరాటనగరే సహ భ్రాతృభి రగ్రతః,
ఉత్సృజ్య గాః సుసంత్రస్తం బలం తే సమశీర్యత. 14

విరాటనగరమున నీ సోదరు లందరితోపాటు సేన యంతయు గోవులను విడచి మిక్కిలి వెరగంది చెల్లాచెద రయినది.

---

11. భీష్మం తితిక్షస్వ - అతని మాటను పాటింపు మని భావము.

యచ్చైవ నగరే తస్మిన్ శ్రూయతే మహ దద్భుతమ్,
ఏకస్య చ బహూనాం చ పర్యాప్తం తన్నిదర్శనమ్. 15

ఆ నగరమున ఒక్కనికి పెక్కండ్రతో జరిగిన మహాద్భుతము విన వచ్చినది. ఈ నిదర్శనము చాలును.

అర్జున స్తత్తథాఽకార్షీత్ కిం పునః సర్వ ఏవ తే,
న భ్రాతౄ నభిజానీహి వృత్త్యా తం ప్రతిపాదయ. 16

అర్జును డొక్క డంతపని చేసెను. వారందరు కలిసినచో చెప్పెడిదేమి ? ఆ సోదరుల నందరిని గట్టిగా ఎరుగుము. రాజ్యభాగము నిచ్చి యాతనిని గౌరవింపుము.

ఇతి శ్రీమహాభారతే ఉద్యోగపర్వణి యానసంధిపర్వణి
ధృతరాష్ట్రవాక్యే పఞ్చషష్టితమోఽధ్యాయః.

ఇది శ్రీ మహాభారతము ఉద్యోగపర్వమున యానసంధిపర్వమున
ధృతరాష్ట్రవాక్యము గల అరువదియైదవ అధ్యాయము.

—(ం)—

16. వృత్త్యా - రాజ్యమున సగమిచ్చుటచేత; తం - ఆ ధర్మరాజును, ప్రతిపాదయ - గౌరవింపుము.

# షట్షష్టితమోఽధ్యాయః

# అరువదియారవ అధ్యాయము.

## సంజయస్య ధృతరాష్ట్రం ప్రతి ధనంజయసందేశకథనమ్

## సంజయుడు ధృతరాష్ట్రునకు అర్జునుని సందేశమును చెప్పుట.

వైశమ్పాయన ఉవాచ - వైశంపాయను డిట్లు చెప్పెను.

ఏవముక్త్వా మహాప్రాజ్ఞో ధృతరాష్ట్రః సుయోధనమ్,
పునరేవ మహాభాగః సఞ్జయం పర్యపృచ్ఛత. 1

మిక్కిలి తెలివిగల ధృతరాష్ట్రుడు దుర్యోధనునితో నిట్లు పలికి మరల సంజయు నిట్లడిగెను.

బ్రూహి సఞ్జయ యచ్ఛేషం వాసుదేవా దనన్తరమ్,
యదర్జున ఉవాచ త్వాం పరం కౌతూహలం హి మే. 2

వాసుదేవు డట్లాడిన పిదప సంజయా! అర్జును డేమాడెనో యా మిగిలినది చెప్పుము. మిక్కిలి వినవేడుకగా నున్నది.

సఞ్జయ ఉవాచ - సంజయు డిట్లు చెప్పెను.

వాసుదేవవచః శ్రుత్వా కున్తీపుత్రో ధనఞ్జయః,
ఉవాచ కాలే దుర్ధర్షో వాసుదేవస్య శృణ్వతః. 3

వాసుదేవుని మాట విని కుంతికొడుకగు ధనంజయుడు, వాసుదేవుడు వినుచుండగా, తత్కాలమున నిట్లు పలికెను.

పితామహం శాన్తనవం ధృతరాష్ట్రం చ సఞ్జయ,
ద్రోణం కృపం చ కర్ణం చ మహారాజం చ బాహ్లికమ్. 4
ద్రౌణిం చ సోమదత్తం చ శకునిం చాపి సౌబలమ్,
దుఃశాసనం శలం చైవ పురుమిత్రం వివింశతిమ్. 5

వికర్ణం చిత్రసేనం చ జయత్సేనం చ పార్థివమ్,
విన్దానువిన్దా వావన్త్యౌ దుర్ముఖం చాపి కౌరవమ్. 6

సైన్ధవం దుఃసహం చైవ భూరిశ్రవస మేవ చ,
భగదత్తం చ రాజానం జలసన్ధం చ పార్థివమ్. 7

యే చాప్యన్యే పార్థివా స్తత్ర యోద్ధుం
సమాగతాః కౌరవాణాం ప్రియార్థమ్,
ముమూర్షవః పాణ్డవాగ్నౌ ప్రదీప్తే
సమానీతా ధార్తరాష్ట్రేణ హోతుమ్. 8

యథాన్యాయం కౌశలం వన్దనం చ
సమాగతా మద్వచనేన వాచ్యాః,
ఇదం బ్రూయాః సఞ్జయ రాజమధ్యే
సుయోధనం పాపకృతాం నిధానమ్. 9

తాతయగు శంతనుకుమారుని, ధృతరాష్ట్రుని, ద్రోణుని, కృపుని, కర్ణుని, మహారాజు బాహ్లికుని, అశ్వత్థామను, సోమదత్తుని, సుబలరాజు శకునిని, దుశ్శాసనుని, శలుని, పురుమిత్రుని, వివింశతిని, వికర్ణుని, చిత్రసేనుని, జయత్సేనుని, అవంతిరాజకుమారు లగు విందానువిందులను, కౌరవు డగు దుర్ముఖుని, సహింప శక్యముగాని సైంధవుని, భూరిశ్రవుని, భగదత్తుని, జలసంధుని మరియు కౌరవులకు ప్రియము చేయగోరి, దుర్యోధనుడు వ్రేల్వగా ప్రజ్వలించుచున్న పాండవాగ్నిలో బడగోరుచు వచ్చిన రాజులందరిని వారివారికి తగినవిధముగా నామాటగా కుశల మడుగుము. నమస్కరింపుము. సంజయా! రాజుల నడుమ పాపిష్ఠులకు మూలపురుషుడైన దుర్యోధనునితో ఇట్లు పలుకుము.

అమర్షణం దుర్మతిం రాజపుత్రం
పాపాత్మానం ధార్తరాష్ట్రం సులుబ్ధమ్,
సర్వం మమైత ద్వచనం సమగ్రం
సహామాత్యం సఞ్జయ శ్రావయేథాః. 10

సహనము లేనివాడు, దుష్టబుద్ధి, పాపాత్ముడు, మిక్కిలి పిసినిగొట్టు అయిన రాజుకొడుకునకు ఆతని మంత్రులకును నేను చెప్పెడి దంతయు సంపూర్ణముగా వినిపింపుము.

ఏవం ప్రతిష్ఠాప్య ధనఞ్జయో మాం
తతోఽర్థవ ద్ధర్మవ చ్చాపి వాక్యమ్,
ప్రోవా చేదం వాసుదేవం సమీక్ష్య
పార్థో ధీమాన్ లోహితాన్తాయతాక్షః. 11

ధనంజయుడు నన్నిట్లు కుదురు కొలిపి, వాసుదేవుని పరికించి అర్థయుక్తముగా ధర్మయుక్తముగా నిట్లు పలికెను. అప్పుడా ధీశాలి వెడదకన్నుల అంచులు ఎరుపెక్కి యున్నవి.

యథా శ్రుతం తే వదతో మహాత్మనో
మధుప్రవీరస్య వచః సమాహితమ్,
తథైవ వాచ్యం భవతా హి మద్వచః
సమాగతేషు క్షితిపేషు సర్వశః. 12

మాధవుని వాక్యము నిలుకడగా మనస్సుతో వింటివి గదా! రాజు లందరు కొలువుదీరి యున్నచోట నామాటను గూడ నీవట్లే చెప్పవలయును.

శరాగ్నిధూమే రథనేమినాదితే
ధనుఃస్రువే ణాస్త్రబలప్రసారిణా,
యథా న హోమః క్రియతే మహామృధే
సమేత్య సర్వై ప్రయతధ్వ మాదృతాః. 13

---

11. లోహితాన్తాయతాక్షః - ఎరుపెక్కిన అంచులుగల వెడల్పైన కన్నులు గలవాడు;

13. శరాగ్నిధూమే - బాణము లొకదాని నొకటి తాకినపుడు పుట్టిన అగ్ని పొగ; రథనేమినాదితే - రథము పట్టాల చప్పుడు అనెడు మంత్రధ్వనులు గలదానియందు; ధనుఃస్రువేణ - ధనుస్సు అనెడు హోమపాత్రచేత; అస్త్రబలప్రసారిణా - శాస్త్రబలముతో సాగు యజ్ఞమునందువలె అస్త్ర బలముతో సాగెడు యుద్ధమున;

రథముల పట్టాల చప్పుళ్ళనెడు మంత్రధ్వనులు గలదియు, ధనుస్సు లనెడు స్రువములు గలదియు, అస్త్రబలముతో సాగెడునదియు నగు బాణముల అగ్నిపొగయందు మేము హోమము చేయకుండు తెరగను మీరందరు ఆదరముతో కూడి ప్రయత్నింపుడు.

న చే త్ప్రయచ్ఛధ్వ మమిత్రఘాతినో
యుధిష్ఠిర స్యాంశ మభీప్సితం స్వకమ్,
నయామి వః సాశ్వపదాతికుఞ్జరాన్
దిశం పితౄణా మశివాం శితైః శరైః. 14

శత్రువులను రూపుమాపు యుధిష్ఠిరునకు ఇష్టమైనది, ఆతనికి చెందినదియు నగు భాగము నీకుందు రేని మిమ్ములను, మీ గుఱ్ఱములతో, సైనికులతో, ఏనుగులతో పాటు అమంగళమగు పితృదేవతల దిక్కునకు వాడి బాణములతో తోలుదును.

తతోఽహ మామన్త్ర్య తదా ధనఞ్జయం
చతుర్భుజం చైవ నమస్య సత్వరః,
జవేన సంప్రాప్త ఇహామరద్యుతే
తవాన్తికం ప్రాపయితుం వచో మహత్. 15

అంత నేను ఆ ధనంజయుని కడ సెలవు గైకొని చతుర్భుజుని మ్రొక్కి వడివడిగా వారు పలికిన గొప్పమాటను నీకందించుటకై యిచటకు వచ్చి పడితిని.

ఇతి శ్రీమహాభారతే ఉద్యోగపర్వణి యానసంధిపర్వణి
సఞ్జయవాక్యే షట్షష్టితమోఽధ్యాయః.

ఇది శ్రీమహాభారతము ఉద్యోగపర్వమున యానసంధిపర్వమున
సంజయవాక్యము గల అరువదియారవ అధ్యాయము.

—(౦)—

15. చతుర్భుజమ్ - యోగులు చూచెడు నాలుగు చేతులుగల శ్రీమహావిష్ణువు సంజయునికిని దృష్టిగోచరు డయ్యెనని ఊహింపనగును.

# సప్తషష్టితమోఽధ్యాయః

## అరువదియేడవ అధ్యాయము

ధృతరాష్ట్రసమీపే వ్యాసగాంధార్యో రాగమనమ్, వ్యాసస్య సంజయం ప్రతి శ్రీకృష్ణార్జునవిషయే సారం వర్ణయితు మభ్యనుజ్ఞానమ్.

ధృతరాష్ట్రునితడకు వ్యాసగాంధారుల రాక, వ్యాసుడు సంజయునకు శ్రీకృష్ణార్జునుల విషయమున సారమును వర్ణించుట కనుజ్ఞ నిచ్చుట.

వైశమ్పాయన ఉవాచ - వైశంపాయను డిట్లు చెప్పెను.

దుర్యోధనే ధార్తరాష్ట్రే తద్వచో నాభినన్దతి,
తూష్ణీంభూతేషు సర్వేషు సముత్తస్థు ర్నరర్షభాః. 1

ధృతరాష్ట్రుని కొడుకు దుర్యోధను డామాటను మన్నింపకుండగా, అందరు మిన్నకుండగా రాజులు పైకి లేచిరి.

ఉత్థితేషు మహారాజ పృథివ్యాం సర్వరాజసు,
రహితే సఞ్జయం రాజా పరిప్రష్టుం ప్రచక్రమే. 2

రాజులందరు అటనుండి వెడలిపోవగా ఏకాంతమున రాజు సంజయుని అడుగ దొరకొనెను.

ఆశంసమానో విజయం తేషాం పుత్రవశానుగః,
ఆత్మనశ్చ పరేషాం చ పాణ్డవానాం చ నిశ్చయమ్. 3

కొడుకు వెంబడి పోవు ధృతరాష్ట్రుడు తన కొడుకులకు విజయము నాకాంక్షించుచు, తానేమి చేయవలయును? తటస్థు లేమి నిశ్చయించిరి? పాండవుల నిశ్చయమేమి? అని యడుగజొచ్చెను.

---

3. పరేషామ్ - తటస్థులయొక్క.

ధృతరాష్ట్ర ఉవాచ - ధృతరాష్ట్రు డిట్లు పలికెను.

గావల్గణే బ్రూహి నః సారఫల్గు
స్వసేనాయాం యావ దిహాస్తి కశ్చిత్,
త్వం పాణ్డవానాం నిపుణం వేత్థ సర్వం
కి మేషాం జ్యాయః కిము తేషాం కనీయః. 4

సంజయా! మన సేనలో ఉన్నదానిలో సారమేది? పొల్లేది? నీవు పాండవులను గూర్చిన సర్వమును మెలకువతో తెలిసికొంటివి. వీరిలో వారికంటె మేలైన దేది? వారిలో వీరికంటె తక్కువతన మేది?

త్వమేతయోః సారవిత్ సర్వదర్శీ
ధర్మార్థయో ర్నిపుణో నిశ్చయజ్ఞః,
స మే పృష్టః సఞ్జయ బ్రూహి సర్వం
యుధ్యమానాః కతరేఽస్మి న్న సన్తి. 5

ఈ రెండు పక్షములలో నీవు సర్వమును చూడగలవాడవు. సార మెరిగిన వాడవు. ధర్మార్థముల నిశ్చయతత్త్వమును చక్కగా ఎరుగుదువు. సంజయా! నే నడుగుచున్నాను. నా కంతయు చెప్పుము. ఎవ రెవరు ఉదాసీనులుగా నుందురు?

సఞ్జయ ఉవాచ - సంజయు డిట్లు చెప్పెను.

న త్వాం బ్రూయాం రహితే జాతు కిఞ్చి
దసూయా హి త్వాం ప్రవిశేత రాజన్,
ఆనయస్వ పితరం మహావ్రతం
గాన్ధారీం చ మహిషీ మాజమీఢ. 6

రాజా! ఒంటరిగా నున్నపుడు నే నెన్నటికిని నీకేమియు చెప్పను. ఏల యన నీలో అసూయ చోటుచేసికొనును. గొప్ప నిష్ఠగల తండ్రి వ్యాసుని, పట్టపురాణి గాంధారిని - రప్పింపుము.

---

5. యుధ్యమానా న సన్తి - యుద్ధము చేయకుందురో - తటస్థముగా ఉందురో అని భావము;

6. అసూయా - దోషదృష్టి; పితరమ్ - వ్యాసుని.

తౌ తేఽసూయాం వినయేతాం నరేన్ద్రి
ధర్మజ్ఞౌ తౌ నిపుణౌ నిశ్చయజ్ఞౌ,
తయోస్తు త్వాం సన్నిధౌ తద్వదేయం
కృత్స్నం మతం కేశవపార్థయో ర్యత్. 7

ధర్మమెరిగినవారు, నేర్పరులు, నిశ్చయములను చక్కగా చేయగలవారు నగు వారిరువురు నీ అసూయను చక్కదిద్దుదురు. వారి యెదుట కృష్ణార్జునుల అభిప్రాయమును మొత్తముగా నీకు పలుకుదును.

వైశమ్పాయన ఉవాచ - వైశంపాయను డిట్లు చెప్పెను.

ఇత్యుక్తేన చ గాన్ధారీ వ్యాస శ్చాత్రాజగామ హ,
ఆనీతౌ విదురే ణేహ సభాం శీఘ్రం ప్రవేశితౌ. 8

సంజయు డట్లు పలుకగా గాంధారియు, వ్యాసుడును అక్కడకు వచ్చిరి. విదురుడు వడివడిగా వారిని సభలో ప్రవేశపెట్టెను.

తత స్సన్మత మాజ్ఞాయ సఞ్జయ స్యాత్మజస్య చ,
అభ్యుపేతో మహాప్రాజ్ఞః కృష్ణద్వైపాయనోఽబ్రవీత్. 9

అంత సంజయుని, కుమారుడగు ధృతరాష్ట్రుని అభిప్రాయమెరిగిన మిక్కిలి బుద్ధివిశేషముగల కృష్ణద్వైపాయనుడు ఇట్లు పలికెను.

వ్యాస ఉవాచ - వ్యాసు డిట్లు పలికెను.

సంపృచ్ఛతే ధృతరాష్ట్రాయ సఞ్జయ
ఆచక్ష్వ సర్వం యావ దేషోఽనుయుఙ్క్తే,
సర్వం యావద్వేత్థ తస్మిన్ యథావ
ద్యాథాతథ్యం వాసుదేవేఽర్జునే చ. 10

సంజయా! నిన్ను ధృతరాష్ట్రు డేదేది యడుగుచున్నాడో యది యంతయు చెప్పుము. ఈతనియందు ఆ వాసుదేవార్జునులయందు ఉన్నదంతయు ఉన్నది ఉన్నట్లుగా నీ వెరిగినంతవరకు చెప్పుము.

ఇతి శ్రీమహాభారతే ఉద్యోగపర్వణి యానసంధిపర్వణి
వ్యాసగాన్ధార్యాగమనే సప్తషష్టితమోఽధ్యాయః.

ఇది శ్రీమహాభారతము ఉద్యోగపర్వమున యానసంధిపర్వమున
వ్యాసగాంధారులరాక గల అరువదియేడవ అధ్యాయము.

—(o)—

10. అనుయుఙ్క్తే - అడుగుచున్నాడు.

# అష్టషష్టితమో౽ధ్యాయః
# అరువదియెనిమిదవ అధ్యాయము

**సంజయేన ధృతరాష్ట్రం ప్రతి శ్రీకృష్ణసారవత్త్వస్య కథనమ్.**

**సంజయుడు ధృతరాష్ట్రునకు శ్రీకృష్ణుని సారవత్త్వమును చెప్పుట.**

సఞ్జయ ఉవాచ - సంజయు డిట్లు చెప్పెను.

అర్జునో వాసుదేవశ్చ ధన్వినౌ పరమార్చితౌ,
కామా దన్యత్ర సంభూతౌ సర్వభావాయ సమ్మితౌ. 1

ధనుర్విద్యలో ఆరితేరిన ఆ అర్జునుడును కృష్ణుడును జగన్మాన్యులు. వారు లోకానుగ్రహముకొరకు అవతరించిరి. బ్రహ్మముతో సమానులు.

వ్యామాన్తరం సమాస్థాయ యథాముక్తం మనస్వినః,
చక్రం తద్వాసుదేవస్య మాయయా వర్తతే విభో. 2

ఆ వాసుదేవుని చక్రము చాచిన బార అంతటిది. ఆ మేధావి యెట్లు తలచిన అట్లు వెడలునట్టిది; మాయతో సంచరించునట్టిది.

---

1. కామాత్, అన్యత్ర సంభూతౌ - కామపూర్వకమైన కర్మను వదలి పుట్టినవారు-వారు తక్కిన వారి వలె తలిదండ్రుల కామవ్యాపారము ఫలముగా పుట్టినవారు కారు; లోకానుగ్రహముకొరకు సూర్యునివలె ఆవిర్భవించిన వారని తాత్పర్యము; సర్వభావాయ - బ్రహ్మభావము కొఱకు; సమ్మితౌ - తుల్యులు - సాక్షాత్పరబ్రహ్మస్వరూపు లని భావము.
2. వ్యామాన్తరమ్ - వ్యామ మనగా రెండు చేతులను ప్రక్కలకు చాపగా నేర్పడు కొలత. బార - ఆయిదుమూరల మధ్య ప్రమాణము కలది యని భావము. యథాముక్తమ్ - ఎంత ప్రమాణము భావించినచో అంతమాత్రమగు స్వరూపమును పొంది ప్రయోగింపబడునది. మాయయా వర్తతే - చూడరాని స్వరూపముతో సంచరించునది.

సాపహ్నవం కౌరవేషు పాణ్డవానాం సుసమ్మతమ్,
సారాసారబలం జ్ఞాతుం తేజఃపుఞ్జావభాసితమ్. 3

అది కౌరవుల విషయమున సంహారదృష్టితో నున్నది. పాండవులకు మిక్కిలి యిష్టమైనది. బలములోని సారమును, పొల్లును ఎఱుగుశక్తిగలది. ముద్దకట్టిన నిప్పువలె కానవచ్చునట్టిది.

నరకం శమ్బరం చైవ కంసం చైద్యం చ మాధవః,
జితవాన్ ఘోరసంకాశాన్ క్రీడన్నివ మహాబలః. 4

నరకుడు, శంబరుడు, కంసుడు, శిశుపాలుడు అను మహాఘోరస్వరూపులను మహాబలుడగు కృష్ణుడు ఆటలాడువిధమున పరిమార్చెను.

పృథివీం చాన్తరిక్షం చ ద్యాం చైవ పురుషోత్తమః,
మనసైవ విశిష్టాత్మా నయత్యాత్మవశం వశీ. 5

ఆ పురుషోత్తముడు విశిష్టమగు రూపముతో నేలను నింగిని స్వర్గమును మనసుతోడనే తన వశమున నుంచుకొనును. ఆతడు అన్నింటికి ఈశ్వరుడు.

భూయో భూయో హి యద్రాజన్ పృచ్ఛసే పాణ్డవాన్ ప్రతి,
సారాసారబలం జ్ఞాతుం తత్ సమాసేన మే శృణు. 6

రాజా! పాండవులనుగూర్చియు, రెండు పక్షముల బలములందలి తారతమ్యమునుగూర్చియు మాటిమాటికి నడుగుచువు. సంక్షేపముగా చెప్పెదను. వినుము.

ఏకతో వా జగత్ కృత్స్న మేకతో వా జనార్దనః,
సారతో జగతః కృత్స్నా దతిరిక్తో జనార్దనః. 7

సమస్తమగు జగత్తంతయు నొక యెత్తు. జనార్దను డొక యెత్తు. సారమును బట్టి చూచినచో సమస్తజగముకంటె జనార్దనుడు మిన్న.

భస్మ కుర్యా జ్జగదిదం మనసైవ జనార్దనః,
న తు కృత్స్నం జగచ్ఛక్తం భస్మ కర్తుం జనార్దనమ్. 8

3. సాపహ్నవమ్ - సంహారముతో కూడినది;

5. మనసైవ - సంకల్పమాత్రముచేత; విశిష్టాత్మా - శ్రేష్ఠమగు రూపము గలవాడు; వశీ-ఐశ్వర్యము కలవాడు.

సమస్తమగు జగమును జనార్దనుడు మనసుతోడనే మాడ్చివేయగలడు. జగత్తు మొత్త మొక్కటి యైనను జనార్దను నేమియు చేయజాలదు.

యతః సత్త్వం యతో ధర్మో యతో హ్రీ రార్జవం యతః,
తతో భవతి గోవిన్దో యతః కృష్ణ స్తతో జయః. 9

సత్త్వగుణము, ధర్మము, పాడుపనుల కేవగించుకొనుట, కపటస్వభావము లేకుండుట అనునవి యెందుండునో గోవిందు డం దుండును. కృష్ణు డెక్కడ నున్నచో జయ మక్కడ కలుగును.

పృథివీం చాన్తరిక్షం చ దివం చ పురుషోత్తమః,
విచేష్టయతి భూతాత్మా క్రీడన్నివ జనార్దనః. 10

నేలను, నింగిని, స్వర్గమును పురుషోత్తముడు, సర్వభూతముల కాత్మయు నగు జనార్దనుడు ఆటలాడుచున్నట్లు కదలించుచున్నాడు.

స కృత్వా పాణ్డవాన్ సత్రం లోకం సమ్మోహయన్నివ,
అధర్మనిరతాన్ మూఢాన్ దగ్ధు మిచ్ఛతి తే సుతాన్. 11

ఆతడు పాండవులను నెపముగా గొని అందరి కనులు కప్పుచు అధర్మము నందే ఆనందించు మూఢులగు నీ కొడుకులను కాల్చివేయదలచుచున్నాడు.

కాలచక్రం జగచ్చక్రం యుగచక్రం చ కేశవః,
ఆత్మయోగేన భగవాన్ పరివర్తయతేఽనిశమ్. 12

---

10. సర్వభూతముల కాత్మయైనవాడు కావున అన్నింటి కదలికలు ఆతనిని బట్టియే జరుగుచున్న వని భావము.

11. సత్రం-నెపము; సంమోహయన్-తాను జగత్తునకు కర్త యైనను కానట్లు చూపుచు;

12. కాలచక్రమ్ - సంవత్సరరూపమైన చక్రమును; జగత్‌చక్రమ్ - పుట్టుక, ఉండుట, నశించుట-అను వ్యాపారము గలదానిని; యుగచక్రమ్-కృత, త్రేతా, ద్వాపర, కలినామములు గల యుగముల చక్రమును; ఒకదాని వెనుక ఒకటి మరల అవియే వచ్చును గాన వీనిని చక్రముగా భావించుట జరిగినది. ఈ అన్నింటి సమాహారమే కర్మచక్రము అనగా సంసారము. దానిని నడపువాడు కృష్ణుడు; ఆత్మయోగేన-చైతన్యసంబంధముచేత;

కాలచక్రమును, జగచ్చక్రమును, యుగచక్రమును, తన చైతన్య సంబంధముచేత భగవానుడగు కేశవుడు రాత్రింబవళ్ళు త్రిప్పుచున్నాడు.

కాలస్య హి చ మృత్యోశ్చ జఙ్గమస్థావరస్య చ,
ఈశతే భగవా నేకః సత్యమేత ద్బ్రవీమి తే. 13

కాలము, మృత్యువు, జంగమప్రపంచము, స్థావరప్రపంచము - అను ఈ అన్నింటికిని, ఆ భగవాను డొక్కడే ప్రభువు. నీకు సత్యమును చెప్పుచున్నాను.

ఈశన్నపి మహాయోగీ సర్వస్య జగతో హరిః,
కర్మాణ్యారభతే కర్తుం కీనాశ ఇవ వర్ధనః. 14

ఆ కృష్ణుడు సమస్తజగత్తును పాలించువా డయ్యును, మహాయోగియై యుండును. ఆయా కార్యము లన్నియు చేయ దొరకొనును. కీనాశునివలె వర్ధను డగును.

తేన వఞ్చయతే లోకాన్ మాయాయోగేన కేశవః,
యే తమేవ ప్రపద్యన్తే న తే ముహ్యన్తి మానవాః. 15

తనదైన మాయచేత లోకము లన్నింటిని కేశవుడు వంచించుచున్నాడు. అతనినే శరణుచొచ్చిన మానవులు మాత్రము వంచనలో పడరు.

ఇతి శ్రీమహాభారతే ఉద్యోగపర్వణి యానసంధిపర్వణి
సఞ్జయవాక్యేఽష్టషష్టితమోఽధ్యాయః.

ఇది శ్రీమహాభారతము ఉద్యోగపర్వమున యానసంధిపర్వమున
సంజయవాక్యముగల అరువదియెనిమిదవ అధ్యాయము.

—(ం)—

---

13. కాలస్య - ప్రాణుల ఆయువును విభాగించు దేవతయొక్క, మృత్యోః - దేహమును ప్రాణమును వేరుచేయు దేవతయొక్క, జఙ్గమస్థావరస్య చ - కదలెడు జీవరాసులయొక్క - కదలని పర్వతాదులయొక్క; ఈశతే - పాలకు డగుచున్నాడు;

14. ఈశన్నపి - ఈశాను డైనను - ఇది ఆత్మనేపదక్రియ పరస్మైపది యగుట ఆర్షము. కీనాశః - కర్షకుడై; వర్ధనః - ధాన్యము మొదలగు వానిని పెంపొందించును; లేదా, కీనాశః - యముడై; వర్ధనః - దేహాదు లను ఛేదించును;

# ఏకోనసప్తతితమోఽధ్యాయః
# అరువదితొమ్మిదవ అధ్యాయము

**సంజయేన శ్రీకృష్ణస్య భగవద్భావ ప్రతిపాదనపూర్వకం తత్ప్రాప్త్యుపాయప్రదర్శనమ్.**

**సంజయుడు శ్రీకృష్ణుని భగవద్భావమును నిరూపించుచు ఆతనిని పొందు ఉపాయమును ప్రదర్శించుట.**

ధృతరాష్ట్ర ఉవాచ - ధృతరాష్ట్రు డిట్లు పలికెను.

కథం త్వం మాధవం వేత్థ సర్వలోకమహేశ్వరమ్,
కథ మేనం న వేదాహం తన్మమాచక్ష్వ సఞ్జయ. 1

సంజయా! ఆ మాధవుడు సర్వలోకములకు మహేశ్వరు డని నీ వెట్లెరుగుదువు? నేనేల ఎరుగజాలను? - అది నాకు చెప్పుము.

సఞ్జయ ఉవాచ - సంజయు డిట్లు చెప్పెను.

శృణు రాజ న్న తే విద్యా మమ విద్యా న హీయతే,
విద్యాహీన స్తమోధ్వస్తో నాభిజానాతి కేశవమ్. 2

రాజా! వినుము. నీకు విద్యలేదు. నాకు విద్య తరుగదు. విద్యలేనివాడు, తమస్సుచేత చెడినవాడు కేశవు నెరుగడు.

విద్యయా తాత జానామి త్రియుగం మధుసూదనమ్,
కర్తార మకృతం దేవం భూతానాం ప్రభవాప్యయమ్. 3

---

2. విద్యా - 'తత్త్వమసి' - మొదలగు వాక్యములవలన పుట్టిన జ్ఞానము; తమోధ్వస్తః-అజ్ఞాన మావరింపగా స్వస్వరూపమునుండి జారిపోయినవాడు; (1 వ శ్లోకములోని) కథమ్ - ఏ ప్రకారముచేత - జ్ఞానమును సాధించునవి ఏవి: దానికి అడ్డుతగులునవి ఏవి; అని ప్రశ్న భావము.

3. త్రియుగమ్ - స్థూల, సూక్ష్మ, కారణరూపము లగు శరీరములు మూడును రజ్జువునందు సర్పమువలె ఎవనియందు సంబంధము కలిగి

నాయనా! మూడింటి సంబంధముగల మధుసూదనుని నేను విద్యతో ఎరుగుదును. అతడు భూతము లన్నింటికి కర్త. పుట్టుకకు లయమునకు కారణ మైనవాడు. ఆతనికి కర్త లేదు.

ధృతరాష్ట్ర ఉవాచ - ధృతరాష్ట్రు డిట్లు పలికెను.

గావల్గణేఽత్ర కా భక్తి ర్యాతే నిత్యా జనార్దనే,
యథా త్వ మభిజానాసి త్రియుగం మధుసూదనమ్. 4

గవల్గణకుమారా! నీకు జనార్దనునియందు ఎన్నడు చెడని భక్తి యున్నది. దాని స్వరూప మెట్టిది? దానితో కదా నీవు త్రియుగుడైన మధుసూదనుని ఎరుగుదువు?

సఞ్జయ ఉవాచ - సంజయు డిట్లు చెప్పెను.

మాయాం న సేవే భద్రం తే న వృథా ధర్మ మాచరే,
శుద్ధభావం గతో భక్త్యా శాస్త్రా ద్వేద్మి జనార్దనమ్. 5

రాజా! మాయను సేవింపను. వ్యర్థముగా ధర్మము నాచరింపను. శుద్ధ మైన మనస్సును పొంది భక్తితో శాస్త్రమువలన జనార్దనుని ఎరుగుచున్నాను.

---

యుండునో అట్టివాడు; కర్తారమ్ - విశ్వమునకు నిమిత్తకారణమైన వానిని; అకృతమ్ - కర్మములచేత సాధ్యము కానివాడు - నిత్యసిద్ధుడు కనుక; భూతానామ్ - ఆకాశము, వాయువు మొదలగు వానికి; ప్రభవ, అప్యయమ్-ఉత్పత్తి స్థానము, లయమగు చోటు;

4. భక్తిః - జ్ఞానమే ఆనందరూపమైనచో భక్తి యగును. అది యెట్టిది? అనగా భగవంతుని రాజువలె వేరుగా నున్నట్లు భావించి ధ్యానింప వలయునా? లేక పరమాత్మయే సర్వప్రాణులలో నున్నాడని భావించియా? అని ప్రశ్నార్థము.

5. మాయామ్-సంసారరూపమున పెరిగిన అవిద్యను; న సేవే-సేవింపను; వృథా-వ్యర్థముగా-భగవదర్పణము చేయకుండ; ధర్మమ్-ధర్మమును; న ఆచరే-ఆచరింపను, ఆచరించిన ధర్మమును భగవంతునికి సమర్పించుటయే ధర్మము వ్యర్థము కాకుండుట; శుద్ధభావమ్-మనస్సున కామ క్రోధాదులు లేకుండుటవలన నేర్పడు నిర్మలత్వము, గతః-పొందిన.

ధృతరాష్ట్ర ఉవాచ - ధృతరాష్ట్రు డిట్లడిగెను.

దుర్యోధన హృషీకేశం ప్రపద్యస్వ జనార్దనమ్,
ఆప్తో నః సఞ్జయ స్తాత శరణం గచ్ఛ కేశవమ్. 6

నాయనా! దుర్యోధనా! ఇంద్రియములకు ప్రభువు, సర్వజనులకు దిక్కు-అయిన కృష్ణుని శరణు పొందుము. ఈ సంజయుఁడు మన కాప్తుడురా! కృష్ణుని శరణు పొందుము.

దుర్యోధన ఉవాచ - దుర్యోధను డిట్లు పలికెను.

భగవాన్ దేవకీపుత్రో లోకాంశ్చే న్నిహనిష్యతి,
ప్రవద న్నర్జునే సఖ్యం నాఽహం గచ్ఛేఽద్య కేశవమ్. 7

భగవంతు డగు దేవకి కొడుకు అర్జునునియందు స్నేహము ప్రకటించుచు లోకములను రూపుమాపనిమ్ము. నేను నేడు ఆ కేశవుని చేరుకొనను.

---

వాడనై, భక్త్యా-ధ్యానముతో, శాస్త్రాత్- 'తత్త్వమసి' - 'నీవదియే అయి ఉన్నావు' వంటి వేదవాక్యమువలన, జనార్దనమ్-జగత్తు నాశమునకు స్థానమైనవానిని; జ్ఞానమే అడ్డుగోడగా అయినవానిని - జ్ఞానము కలుగనంతవరకు జీవుడు వేరు, దేవుడు వేరు. కలుగుటయే తడవు ఆ రెంటికి భేదము గోచరింప దని తాత్పర్యము. బ్రహ్మమును-అట్టి బ్రహ్మము నేను సంసారిని కాను, బ్రహ్మమనే అను తత్త్వజ్ఞానముచేతనే లభించును. ఇది పాము కాదు. త్రాడే అన్నట్లు భ్రమరకీటన్యాయ మిట చెల్లదు. అనగా జీవుడు దేవునిగా భావింపగా భావింపగా దేవుడుగా మారడని భావము;

7. అర్జునే - అర్జునునియందు - కామక్రోధాదిమలములు లేక శుద్ధుడైనవానియందు; సఖ్యమ్-స్నేహమును; ప్రవదన్-పలుకుచు, భగవాన్ అస్తి-భగవాను డున్నాడు. అట్టివాడు లోకము లన్నింటిని రూపు మాపినప్పటికిని; అద్య - నేడు - కామాదులు సంపూర్ణముగా పైకొన్నదశలో అని భావము; నాహం గచ్ఛే-నేను చేరను. నేను భగవానుని పొందలేనని తాత్పర్యము. ఆసురభావము పైకొన్న నాకు అతనిని పొందు భాగ్యము లేదని అంతరార్థము;

ధృతరాష్ట్ర ఉవాచ - ధృతరాష్ట్రు డిట్లు పలికెను.

అవాగ్గాంధారిపుత్రస్తే గచ్ఛత్యేష సుదుర్మతిః,
ఈర్షు ర్దురాత్మా మానీ చ శ్రేయసాం వచనాతిగః. 8

గాంధారీ! నీ కొడుకు నరకమునకు పోవుచున్నాడు. వీని బుద్ధి పూర్తిగా పుచ్చినది. ఈర్ష్యతో వీని హృదయ మంతయు చెడిపోయినది. పొగరెక్కి కొట్టుకొనుచున్నాడు. సాధువుల మాటను ధిక్కరించును.

గాన్ధార్యువాచ - గాంధారి యిట్లు పలికెను.

ఐశ్వర్యకామ దుష్టాత్మన్ వృద్ధానాం శాసనాతిగ,
ఐశ్వర్యజీవితే హిత్వా పితరం మాం చ బాలిశ. 9

ఓరీ దుర్యోధనా! పిల్లచేష్టలవాడా! నీవు ఐశ్వర్యమును మాత్రమే కోరుదువు. కావుననే నీ బుద్ధి పుచ్చినది. పెద్దల మాట త్రోసివేయుచున్నావు. ఈ ఐశ్వర్యపు బ్రదుకున బడి తండ్రిని, నన్నును వదలి చెడుచున్నావు.

వర్ధయన్ సుహృదాం ప్రీతిం మాం చ శోకేన వర్ధయన్,
నిహతో భీమసేనేన స్మర్తాఽసి వచనం పితుః. 10

నీ సావాసగాండ్రకు ప్రీతిని మాకు శోకమును పెంచుచు, భీమసేనునితో చచ్చునాడు తండ్రి మాట విందువు.

వ్యాస ఉవాచ - వ్యాసు డిట్లు పలికెను.

ప్రియోఽసి రాజన్ కృష్ణస్య ధృతరాష్ట్ర నిబోధ మే,
యస్య తే సఞ్జయో దూతో యస్త్వాం శ్రేయసి యోక్ష్యతే. 11

రాజా! ధృతరాష్ట్రా! నీవు కృష్ణునకు ప్రియుడవు. ఇది యెరుగుము. ఈ సంజయుడు నీకు దూత. నిన్ను శ్రేయోమార్గము పట్టించును.

జానా త్యేష హృషీకేశం పురాణం యచ్చ వై పరమ్,
శుశ్రూషమాణ మైకాగ్ర్యం మోక్ష్యతే మహతో భయాత్. 12

---

8. అవాక్ - క్రిందికి - నరకమునకు; శ్రేయసామ్-సాధువుల; వచనాతిగః - మాటను విననివాడు;

12. ఐకాగ్ర్యమ్ - అనన్యదృష్టి కలిగి; శుశ్రూషమాణమ్ - సేవించుచున్న; త్వామ్ - నిన్ను; మోక్ష్యతే - తప్పించును;

ఈ సంజయుడు సనాతనుడు, పరమాత్మయగు కృష్ణు నెరిగినవాడు. ఆ కృష్ణుడు భక్తిశ్రద్ధలతో సేవించుచున్న నిన్ను మహాభయమునుండి తప్పించును.

వైచిత్రవీర్య పురుషాః క్రోధహర్షసమావృతాః,
సితా బహువిధైః పాశై ర్యే న తుష్టాః స్వకై ర్ధనైః. 13

విచిత్రవీర్యతనయా! క్రోధము, హర్షము అనునవి చుట్టుకొన్న పురుషులు తమకున్న ధనములతో తుష్టి నందనివారు, అనేకవిధములగు పాశములతో కట్టువడుదురు.

యమస్య వశ మాయాన్తి కామమూఢాః పునః పునః,
అన్ధనేత్రా యథైవాన్ధా నీయమానాః స్వకర్మభిః. 14

అట్లు బద్ధులైనవారు గ్రుడ్డివాడు నడుపుచున్న గ్రుడ్డివారివలె తమ కర్మములు గుంజుకొని పోవుచుండగా కామము కన్నులు కప్పివేయగా మాటిమాటికి యమునికి వశమగుదురు.

ఏష ఏకాయనః పన్థా యేన యాన్తి మనీషిణః,
తం దృష్ట్వా మృత్యు మత్యేతి మహాంస్తత్ర న సజ్జతి. 15

ఈ జ్ఞానమార్గము పరమాత్మను చేర్చునట్టిది. జ్ఞానసంపద గలవారు దీనిని పట్టిపోయిరి. అది గాంచిన మహాపురుషుడు మృత్యువును దాటిపోవును. అందు తగులుకొనడు.

ధృతరాష్ట్ర ఉవాచ - ధృతరాష్ట్రు డిట్లు పలికెను.
అఙ్గ! సఞ్జయ మే శంస పన్థాన మకుతోభయమ్,
యేన గత్వా హృషీకేశం ప్రాప్నుయాం సిద్ధి ముత్తమామ్. 16

---

13. సితాః - బంధింపబడినవారు; పాశైః - కామాదులచేత;

14. అన్ధనేత్రాః - అంధుడు - గ్రుడ్డివాడు - నేతా - నడుపువాడుగా కలవారు;

15. ఏషః - ఈ జ్ఞానమార్గము; ఏకాయనః - ఒక్కడే అయిన పరమాత్మను పొందించునది; తం - దానిని; దృష్ట్వా - చూచి, యెరిగి; మృత్యుమ్ - సంసారమును - జననమరణరూపమైనదానిని; అత్యేతి - దాటిపోవును. తత్ర - ఆ సంసారమందు; మహాన్ - మహానుభావుడు; న సజ్జతి - తగులము నొందదు.

16. సిద్ధిమ్ - మోక్షమును;

ఆహా! సంజయా! ఎందును భయములేని ఆ మార్గము నాకు బోధింపుము. దానిని బట్టి శ్రీకృష్ణుని చేరుకొని ఉత్తమసిద్ధి నందుదును.

సఞ్జయ ఉవాచ – సంజయు డిట్లు పలికెను.

నాకృతాత్మా కృతాత్మానం జాతు విద్యా జ్జనార్దనమ్,
అత్మనస్తు క్రియోపాయో నాన్య త్రేన్ద్రియనిగ్రహాత్. 17

మనసు గెలువనివా డెన్నటికిని నిత్యసిద్ధియగు జనార్దను నెరుగజాలడు. మనస్సును పట్టుకొను యాగాదిరూపమగు ఉపాయమన్ననో ఇంద్రియనిగ్రహము కంటె మరియొకటి లేదు.

ఇన్ద్రియాణా ముదీర్ణానాం కామత్యాగోఽప్రమాదతః,
అప్రమాదోఽవిహింసా చ జ్ఞానయోని రసంశయమ్. 18

పొగరెక్కిన ఇంద్రియములను, ఏమరుపాటు లేక కోరికలనుండి మరలించుట, మరల పొరపాటుపడకుండుట, హింసపొంత పోకుండుట అను వానినుండి జ్ఞానము పుట్టును. ఇందు సంశయము లేదు.

ఇన్ద్రియాణాం యమే యత్తో భవ రాజ న్నతన్ద్రితః,
బుద్ధిశ్చ తే మా చ్యవతు నియచ్ఛైనాం యత స్తతః. 19

రాజా! ఏ కొంచెము జారుపాటు లేనివాడవై యింద్రియములను నిలువరించుటలో ప్రయత్నపరుడవు కమ్ము. నీబుద్ధి జారకుండుగాక! సర్వవిషయముల నుండి దానిని మరలింపుము.

ఏత జ్జ్ఞానం విదుర్విప్రా ధ్రువ మిన్ద్రియధారణమ్,
ఏతజ్జ్ఞానం చ పన్థాశ్చ యేన యాన్తి మనీషిణః. 20

---

17. అకృతాత్మా – మనస్సు నరికట్టలేనివాడు; కృతాత్మానమ్ – నిత్యము సిద్ధిగల ప్రత్యగాత్మను; న విద్యాత్ – ఎరుగడు; ఆత్మనః – తనదైన, ఇంద్రియనిగ్రహాత్ అన్యత్ర – ఇంద్రియముల నదుపులో పెట్టుకొనుట కంటె వేరైన, క్రియా – యాగాదిరూపమైన: ఉపాయః – ఉపాయము; నాస్తి – లేదు;

19. మా చ్యవతు – తత్త్వమునుండి జారకుండుగాక! యత స్తతః – లోపలివి, బయటివి – అగు సమస్తవిషయములనుండి; నియచ్ఛ – మరలింపుము.

20. ఇన్ద్రియధారణమ్ – మనస్సుతోపాటు ఇంద్రియములను నిలువరించుట;

ఇంద్రియములను చెదరకుండ పట్టుకొనుటయే జ్ఞానమని విద్యావేత్తలు చెప్పుదురు. ఈ జ్ఞానమే బుద్ధిమంతులు పట్టిపోయిన మార్గము.

అప్రాప్యః కేశవో రాజ న్నిన్ద్రియై రజితై ర్నృభిః,
ఆగమాధిగమా ద్యోగా ద్వశీ తత్త్వే ప్రసీదతి. 21

పట్టుచిక్కని యింద్రియములు గల నరులకు కేశవుడు, రాజా! దొరకడు. శాస్త్రము, యుక్తి అనువానిని పొంది యోగమువలన పట్టుచిక్కినవాడు తత్త్వ విషయమున ప్రసన్నుడగును.

ఇతి శ్రీమహాభారతే ఉద్యోగపర్వణి యానసంధిపర్వణి
సఙ్జయవాక్యే ఊనసప్తతితమోఽధ్యాయః.

ఇది శ్రీమహాభారతము ఉద్యోగపర్వమున యానసంధిపర్వమున
సంజయవాక్యముగల అరువదితొమ్మిదవ అధ్యాయము.

--(o)--

---

21. ఆగమాధిగమాత్ - శాస్త్రము, యుక్తి అనువాని లాభమువలన; యోగాత్ - చిత్తవృత్తి నిరోధమువలన; వశీ - ఈశ్వరుడై; తత్త్వే - తనదైన యథార్థస్వరూపజ్ఞానమునందు; ప్రసీదతి - ప్రసన్నుడగును;

# సప్తతితమోఽధ్యాయః
# డెబ్బదియవ అధ్యాయము

## భగవతః శ్రీకృష్ణస్య వివిధనామ్నాం నిర్వచనమ్
## భగవంతుడగు శ్రీకృష్ణుని వివిధములగు పేరుల నిర్వచనము

ధృతరాష్ట్ర ఉవాచ - ధృతరాష్ట్రు డిట్లు పలికెను.

భూయో మే పుణ్డరీకాక్షం సఞ్జయాచక్ష్వ పృచ్ఛతః,
నామకర్మార్థవి త్తాత ప్రాప్నుయాం పురుషోత్తమమ్. 1

నాయనా! సంజయా! అడుగుచున్నాను. ఇంకను ఆ పుండరీకాక్షునిగూర్చి ఎరిగింపుము. ఆయన పేర్లు, కర్మములు తెలిసికొని ఆ పురుషోత్తముని చేరు కొందును.

సఞ్జయ ఉవాచ - సంజయు డిట్లు చెప్పెను.

శ్రుతం మే వాసుదేవస్య నామభి ర్వచనం శుభమ్,
యావత్తత్రాభిజానేఽహ మప్రమేయో హి కేశవః. 2

నేను శుభమైన వాసుదేవుని నామముల నిర్వచనము వినియుంటిని. దాని నెరిగినంతవరకు చెప్పుదును. కేశవుడు ఊహ కందనివాడు గదా!

---

1. నామకర్మార్థవిత్ - నామములను, కర్మములను, ఎరిగినవాడనై;
2. యావత్ అభిజానే - ఎంతవరకు ఎరుగుదునో, అంతమాత్రము చెప్పుదు నని భావము; హి - ఏలయన, కేశవః - కేశవుడు; అప్రమేయః - ప్రమాణమునకు అందనివాడు - అట్టివానిని గురించి మొత్తముగా చెప్పుట సాధ్యము కాదని భావము. వాసుదేవః - (1) వస్తే ఇతి వాసుః (2) వస్యతీతి వాసుః (3) వసత్యస్మిన్ భువన మితి వాసుః - అనగా ఆచ్ఛాదన చేయువాడు, లోకమును స్తంభింపజేయువాడు; లోకము ఇతని యందు నివసించును - అను నర్థములతో 'వాసు' శబ్ద మేర్పడును. దేవః -

వసనాత్ సర్వభూతానాం వసుత్వా ద్దేవయోనితః,
వాసుదేవ స్తతో వేద్యో బృహత్వాద్విష్ణు రుచ్యతే. 3

సర్వభూతములను మాయతో కప్పును; ఆవరించియుండును. దేవయోనులనుండి ప్రకాశించును. కావున ఆతడు వాసుదేవుడుగా తెలియవచ్చుచున్నాడు. అంతట వ్యాపించియుండుటవలన 'విష్ణువు'గా పేరొందెను.

మౌనా ద్ధ్యానాచ్చ యోగాచ్చ విద్ధి భారత మాధవమ్,
సర్వతత్త్వమయత్వాచ్చ మధుహా మధుసూదనః. 4

మౌనము, ధ్యానము, యోగము అనువానివలన మాధవు డని పేరు కలిగెను. అన్ని తత్త్వములు అతనియందు నిండియుండుటవలన మధుహుడు, మధుసూదనుడు అందురు.

---

ప్రకాశించువాడు - వాసువై ప్రకాశించువాడు - వాసుదేవుడు - వస న్తి దేవా అస్మిన్నితి వా - దేవత లందరు నితనియందు వసింతురు అనియు అర్థము. సమస్తేంద్రియములు పుట్టుటకు, చచ్చుటకు స్థానమైనవా డని తాత్పర్యము. విష్ణుః - వేవేష్టి వ్యాప్నోతి సర్వమితి విష్ణుః - సర్వమును వ్యాపించియుండువాడు విష్ణువు.

4. మౌనాత్ - మౌనమువలన. ముని ఆచరించు కార్యము మౌనము. అనగా శాస్త్రమును బట్టియు, ఊహను బట్టియు, తత్త్వమునే చింతించుట; ధ్యానాత్-ధ్యానమువలన; తత్త్వము నిశ్చయమునకు రాగా మనస్సును దానియందు పట్టి నిలుపుట; యోగాత్-యోగమువలన; యోగమనగా అట్లు నిలచిన చిత్తమును చెదరనీకుండుట - చిత్తవృత్తిని నిరోధించుట; 'మా' అనగా బుద్ధియొక్క వృత్తి-తనకు ఆధారమైన ఆ వృత్తిని-ధవయతి-దూరీకరించువాడు-మౌనాదులవలన దూరముచేయువాడు-మాధవుడు; మధుహా-మధువు లను-పృథివి మొదలగువానిని, హన్తి-సంహరించువాడు లేక చేరువాడు - మధుహుడు. "ఇయం పృథివీ సర్వేషాం భూతానాం మధు - అస్యై పృథివ్యై సర్వాణి భూతాని మధు." - ఈ భూమి అన్నిభూతములకు మధువు. ఈ భూమికి అన్నిభూతములు మధువు. అను శ్రుతివలన పృథివి మొదలగు తత్త్వములకు మధువని పేరు. మధుసూదను డనగా మధువను రక్కసుని చంపినవాడు

కృషి ర్భూవాచకః శబ్దో ణశ్చ నిర్వృతివాచకః,
విష్ణు స్తద్భావయోగాచ్చ కృష్ణో భవతి సాత్వతః. 5

'కృష్' ధాతువునకు 'ఉనికి' అర్థము. 'ణ' అనగా నిర్వృతి-సుఖము. ఆ రెండు ధాతువుల యర్థములు కలియుటవలన కృష్ణశబ్ద మేర్పడినది. సాత్వతు డట్లు కృష్ణు డాయెను.

పుణ్డరీకం పరం ధామ నిత్య మక్షయ మవ్యయమ్,
తద్భావాత్ పుణ్డరీకాక్షో దస్యుత్రాసా జ్జనార్దనః. 6

పుండరీక మనగా పరమస్థానము. అది నాశము, తరుగు, మార్పు అను వికారములు లేనిది. అందుండి క్షీణత నొందనివాడు పుండరీకాక్షుడు. రక్కసి మూకను భయపెట్టువా డగుటచే జనార్దను డందురు.

యతః సత్త్వాన్న చ్యవతే యచ్చ సత్త్వాన్న హీయతే,
సత్త్వతః సాత్వత స్తస్మా దార్షభా ద్వృషభేక్షణః. 7

---

5. కృషిః - 'కర్షత్యాత్మని సర్వం సంహరతీతి కృషిః'. సర్వమును తన యందు కలుపుకొనువాడు కృషి. కృషి యనగా సత్త-ఉనికి, భూవాచకః- ఉనికిని తెలుపు పదము. ణః-సుఖము - ఆ రెంటి కలయికవలన 'కృష్ణ' శబ్ద మేర్పడుచున్నది-సన్మాత్రానందరూపు డని యర్థము.

6. పుణ్డరీకమ్ - తెల్లని పద్మము - దానివంటిది కనుక పుండరీక మనగా హృదయకమలము - అది నెలవుగా గలవాడు, అయినను అక్షః - నశింపనివాడు - పుండరీకాక్షుడు. శ్రుతి యిట్లు చెప్పుచున్నది. 'నాస్య జర స్త్యైత జ్జీర్యతి న వధేనాస్య హన్యతే'. హృదయకమలము చివికినను పరమాత్మ చివికిపోడు. అది చచ్చినను చావడు. కావున హృదయ పద్మముయొక్క అవస్థాభేదములు పరమాత్మ నంటవు. దస్యు త్రాసాత్ - జన మనగా దస్యుజనము - రక్కసిగుంపు - దానిని అర్దయతి - పీడించువాడు - జనార్దనుడు;

7. సత్త్వ మనగా ఎవనిచేతను బాధింపబడకుండుట. అది కలవాడు సత్త్వ తుడు. సత్త్వతుడే సాత్వతుడు-సత్త్వము వదలనివాడు, సత్త్వమును వదలని వాడు అనియు దీని కర్థము. ఆర్షభః.ఆర్ష మనగా ఋషిసంబంధమైనది-

సత్త్వగుణము నుండి జారుపాటు లేనివాడు, సత్త్వమును వదలనివాడు కావున సత్త్వతుడు, సాత్వతుడు అను పేర్లు కలిగినవి. ఆర్షభు డగుటవలన వృషభేక్షణు డని యందురు.

న జాయతే జనిత్రాఽయ మజస్తస్మాదనీకజిత్,
దేవానాం స్వప్రకాశత్వా ద్దమా ద్దామోదరో విభుః. 8

పుట్టనివాడు, పుట్టింపనివాడు అను నర్థములతో అజు డయ్యెను. దేవతలలో తనంత వెలుగొందువాడు కావున అనీకజిత్తు. దమమువలన దామోదరు డయ్యెను.

హర్షాత్ సుఖాత్ సుఖైశ్వర్యా ద్ధృషీకేశత్వ మశ్నుతే,
బాహుభ్యాం రోదసీ బిభ్రన్ మహాబాహు రితి స్మృతః. 9

హర్షము, సుఖము, ఐశ్వర్యము అనువానివలన హృషీకేశు డయ్యెను. బాహువులతో భూమ్యాకాశములను భరించుటచేత మహాబాహువను పే రయ్యెను.

అధో న క్షీయతే జాతు యస్మా త్తస్మా దధోక్షజః,
నరాణా మయనా చ్చాపి తతో నారాయణః స్మృతః. 10

---

ఋషి అనగా వేదము. దానిచేత ప్రకాశించువాడు ఆర్షభుడు - ఉపనిషత్తులు ప్రతిపాదించిన పురుషుడని భావము. వృషమనగా ధర్మము-దానిని భాసింపజేయునది వృషభము - వృషభము ఈక్షణ మైనవాడు-వృషభేక్షణుడు;

8. అనీకజిత్-సేనలను జయించువాడు - స్వయముగా ప్రకాశించువా డని యర్థము. దామోదరః-దమముగలవాడు దాముడు, ఉదరః-ఉత్-అత్యధికముగా, ఋచ్ఛతి - ప్రకాశించువాడు. ఉదరః-దాముడై ఉదరుడైనవాడు దామోదరుడు.

9. హృష్య త్యనేన ఇతి హృషీకమ్-దీనిచే హర్షించును. కావున హృషీకమనగా-ఇంద్రియములవలన గలుగు సుఖము. సుఖ మనగా - స్వరూపానందము-దీనికి ఈశ్వరుడుడైనవాడు హృషీకేశుడు.

10. 'అధో న క్షీయతే జాతు' -'అధోక్షజాతు' అను సమాసములో చివరి భాగము లోపించుటవలన 'అధోక్షజః' అనురూప మేర్పడినది. ఎన్నడు క్రిందికి జారనివాడు; ఎల్లప్పుడు సంసారధర్మ మంటనివా డని తాత్పర్యము.

ఎన్నటికిని క్రిందికి జారనివా డగుటచేత అధోక్షజుడు. నరులకు స్థాన మగుటచే నారాయణు డయ్యెను.

పూరణాత్ సదనాచ్చాపి తతోఽసౌ పురుషోత్తమః,
అసతశ్చ సత శ్చైవ సర్వస్య ప్రభవావ్యయాత్. 11

అన్నింటిని నింపుటవలనను, అన్నింటియందు ఉండుటవలనను ఈతడు పురుషుడు. అన్నింటికి కారణమైనవాడు, కార్యమైనవాడు, ఉత్పత్తిలయములకు స్థానమైనవాడు నగుటచే ఉత్తముడు. అట్లీతడు పురుషోత్తము డగుచున్నాడు.

సర్వస్య చ సదా జ్ఞానాత్ సర్వమేతం ప్రచక్షతే.

అందరకు అన్నివేళల జ్ఞానమొసగు నీతనిని సర్వు డందురు.

సత్యే ప్రతిష్ఠితః కృష్ణః సత్యమత్ర ప్రతిష్ఠితమ్. 12
సత్యాత్ సత్యం తు గోవిన్ద స్తస్మా త్సత్యోఽపి నామతః.

సత్యమందు కృష్ణుడు కుదురుకొని యున్నాడు. సత్య మాతనియందు కుదురుకొని యున్నది. సత్యముకంటె సత్యము గోవిందుడు. అందుచేత నాతడు సత్యుడు.

విష్ణు ర్విక్రమణా ద్దేవో జయనా జ్జిష్ణు రుచ్యతే. 13

అన్నింటి నాక్రమించు దేవుడు కాన విష్ణువు. అన్నింటిని జయించుట వలన జిష్ణు వందురు.

---

11. 'పూరయతీతి పురుః' - పూరించువాడు పురువు. సీద న్త్యస్మిన్నితి సః - అన్నియును, అందరును ఇతనియందు నిలిచియుందురు గావున 'సః'. పురు + సః - పురుషః' అగును. కార్యకారణములు తానే అయి సర్వమునకు, ఉత్పత్తికి, లయమునకు స్థానమగుటవలన ఉత్తముడు. పురుషుడు ఉత్తముడు కావున పురుషోత్తము డాయెను.

12. సత్యే - ధర్మమునందు; సత్యాత్ - ధర్మముకంటె - దాని ఫలమగు బ్రహ్మలోకముకంటె; సత్యమ్ - సత్యమైనవాడు;

13. విశేషేణ స్రౌతి - ప్రస్రవతే - గచ్ఛతీతి - విష్ణుః. విశేషముగా ప్రసరించువాడు - విష్ణువు, జయతీతి - జిష్ణుః - జయించుస్వభావము గలవాడు జిష్ణువు.

శాశ్వతత్వా దనన్తశ్చ గోవిన్దో వేదనాద్గవామ్,
అతత్త్వం కురుతే తత్త్వం తేన మోహయతే ప్రజాః. 14

శాశ్వతుడైన కారణమున అనంతుడు. గోవులను పొందుటవలన లేక ప్రకాశింపజేయుటవలన గోవిందుడు. తత్త్వము కానిదానిని తత్త్వముచేసి లోకములను మోహపెట్టును.

ఏవంవిధో ధర్మనిత్యో భగవాన్ మధుసూదనః,
ఆగన్తా హి మహాబాహు రానృశంస్యార్థ మచ్యుతః. 15

ఆ భగవంతుడగు మధుసూదను డిట్టివాడు. ధర్మ మతని యందు చెడక యుండును. ఆ మహాబాహువు అచ్యుతుడు జాలితో మన కడకు వచ్చును.

ఇతి శ్రీమహాభారతే ఉద్యోగపర్వణి యానసన్ధిపర్వణి
సఞ్జయవాక్యే సప్తతితమోఽధ్యాయః.
ఇది శ్రీమహాభారతము ఉద్యోగపర్వమున యానసంధిపర్వమున
సంజయవాక్యమున డెబ్బదియవ అధ్యాయము.

—(౦)—

---

14. శాశ్వతత్వాత్ - శశ్వద్భవత్వాత్ - ఎల్లవేళల ఉండువాడగుటవలన - అంతము లేనివాడగుటవలన అనంతుడు; గవామ్ - ఇన్ద్రియాణామ్ వేదనాత్ - గోవు లనగా ఇంద్రియములు - వానిని పొందుటవలన లేక ప్రకాశింపజేయుటవలన గోవిందుడు; అతత్త్వమ్ - మిథ్య అయిన జగత్తును; తత్త్వమ్ - తత్త్వముగా - తన యునికిని స్ఫురింపజేయుట వలన - సత్యమువలె చేసి లోకమును మోహపెట్టును;

15. ధర్మమునందు నిత్యము సన్నిహితుడై యుండుటవలన ధర్మనిత్యుడు; అనృశంస్యార్థమ్ - జాలివలన కౌరవులకు నాశము కలుగకుండుగాక అనువిధమైన జాలివలన; ఆగన్తా - (ఇచటకు దూతరూపమున) వచ్చును

# ఏకసప్తతితమో౽ధ్యాయః

# డెబ్బదియొకటవ అధ్యాయము

శ్రీకృష్ణః సమాగమిష్యతీతి వృత్తమాకర్ణ్య హృష్టేన ధృతరాష్ట్రేణ తద్దర్శనసౌభాగ్యజుషాం ప్రశంసనపురఃసరం తదీయశరణగ్రహణమ్.

శ్రీకృష్ణుడు వచ్చునన్న వార్త విని పొంగిపోవు ధృతరాష్ట్రుడు అతని దర్శనభాగ్యము పొందువారిని పొగడుచు వారిని శరణు పొందుట.

ధృతరాష్ట్ర ఉవాచ - ధృతరాష్ట్రు డిట్లు పలికెను.

చక్షుష్మతాం వై స్పృహయామి సఞ్జయ
ద్రక్ష్యన్తి యే వాసుదేవం సమీపే,
విభ్రాజమానం వపుషా పరేణ
ప్రకాశయన్తం ప్రదిశో దిశశ్చ. 1

సంజయా! కన్నులున్నవారి భాగ్యమును ఆసపడుదును. ఏలయన వారు జ్ఞానమాత్రమగు దేహముతో వెలిగిపోవుచు దిక్కులను, మూలలను వెలిగించుచు నుండు వాసుదేవుని దగ్గరగా చూచుచుందురు.

ఈరయన్తం భారతీం భారతానా
మభ్యర్చనీయాం శఙ్కరీం సృఞ్జయానామ్,
బుభూషద్భి ర్గ్రహణీయా మనిన్ద్యాం
పరాసూనా మగ్రహణీయరూపామ్. 2

---

1. చక్షుష్మతాం స్పృహయామి - కన్నులున్నవారి భాగ్యము నాశపడుదును. కన్నులున్నవారు ధన్యులుగదా అని భావము. ఇచట చక్షుష్మంతు లనగా జ్ఞానవంతు లనియు నర్థము; పరేణ-జ్ఞానస్వరూపమైన; వపుషా - దేహముతో;

2. భారతానామ్ - భరతవంశము వారైన పాండవుల; భారతీమ్-వాక్కును; ఈరయన్తమ్ - (సభలో) పలుకువానిని; శంకరీమ్ - మంగళకర

ఆ దేవుడు పాండవుల పలుకును మనసభలో పలుకును. అది సృంజయులకు మంగళకరమైనది. పూజింపదగినది. ఐశ్వర్యము కోరువారికి ఆ వాక్కు నిందింపరానిది. గ్రహింపదగినది. ప్రాణములు కోల్పోవువారికి పట్టశక్యము కానిది.

సముద్యన్తం సాత్వత మేకవీరం
ప్రణేతార మృషభం యాదవానామ్,
నిహన్తారం క్షోభణం శాత్రవాణాం
ముఞ్చన్తం చ ద్విషతాం వై యశాంసి. 3

సాత్వతుడగు ఆ కృష్ణుడు ఏకవీరుడు. యాదవుల నందరను నడపించు ప్రభువు. శత్రువులను క్షోభపెట్టి రూపుమాపువాడు. పగవారి పేరు ప్రఖ్యాతులను ఊడగొట్టువాడు. అందుకై అవతరించినాడు.

ద్రష్టారో హి కురవ స్తం సమేతా
మహాత్మానం శత్రుహణం వరేణ్యమ్,
బ్రువన్తం వాచ మనృశంసరూపాం
వృష్ణిశ్రేష్ఠం మోహయన్తం మదీయాన్. 4

మహాత్ముడు, శత్రుహంత, వరేణ్యుడు, దయగలపలుకు పలుకువాడు; నావారిని కనుగప్పువాడు, వృష్ణిశ్రేష్ఠుడు అగు నాతనిని కౌరవు లందరు కలసి చూతురు గదా!

ఋషిం సనాతనతమం విపశ్చితం
వాచః సముద్రం కలశం యతీనామ్,

---

మగుదానిని; బుభూషద్భిః - ఐశ్వర్యము కోరువారి చేత; పరాసూనామ్- చచ్చినవారికి;

3. సముద్యన్తమ్ - తన్ను దాను దేహరూపముతో ప్రకటించుకొనువాడు - అవతరించువాడని భావము - నిత్యుడనియు నర్థము.

4. వరేణ్యమ్ - అందరు అతనిని కోరుదు రని భావము.

అరిష్టనేమిం గరుడం సుపర్ణం
హరిం ప్రజానాం భువనస్య ధామ. 5

అత్యంతసనాతను డగు ఋషి, ఆత్మము నెరిగిన విద్వాంసుడు. వాక్కులకు సముద్రము. యతులకు కలశము. మంచిరెక్కలుగల గరుడుడు. మర్యాద తప్పనివాడు. ప్రజలను హరించువాడు. లోకమునకు నెలవు.

సహస్రశీర్షం పురుషం పురాణ-
మనాదిమధ్యాన్త మనన్తకీర్తిమ్,
శుక్రస్య ధాతార మజం చ నిత్యం
పరం పరేషాం శరణం ప్రపద్యే. 6

వేయితలలుగల పురాణపురుషుని, ఆది, మధ్యము, అంతము లేనివానిని, అనంతమగు కీర్తి గలవానిని, ఎల్లబీజములకు సృష్టికర్తయైన వానిని, అజుని, నిత్యుని, పరముల కన్నింటికి పరమైనవానిని శరణు చొత్తును.

---

5. ఋషిమ్ - సర్వజ్ఞుడగువానిని; విపశ్చితమ్ - ఆత్మతత్త్వమెరిగిన విద్వాంసుని: యతీనామ్ - పరమార్థమునకై యత్నించువారికి; కలశమ్ - చేతికందు కలశమువంటివానిని; వాచః - వాక్కుల విషయమున; సముద్రమ్ - సముద్రమువంటివానిని; సముద్రమ్ - యోగముద్రతో కూడినవానిని అనియు నర్థము. ముద్రయే మాటగా నైనవానిని - మౌనముతోడనే సర్వము బోధించువాడని తాత్పర్యము. అరిష్టనేమిమ్ - హింసింపబడని నేమి - పాదము గలవాడని ప్రాచీనులు; - నేమి అనగా మర్యాద - చెడని మర్యాద కలవానిని; గరుడమ్ - అది భగవన్నామము; సుపర్ణమ్ - చెక్కు చెదరని రెక్కలు గలవానిని; హరిమ్ - హరించువానిని;

6. ఆదిః - కారణము - ఆదిలేనివాడు అనాది; శుక్రస్య - కర్మమునుండి పుట్టిన బీజమునకు; ధాతారమ్ - సృష్టికర్త అయిన వానికి; పరేషామ్ - విరాట్టు మొదలగు వాని కంటెను, పరమ్ - శ్రేష్ఠమగు వానిని;

త్రైలోక్యనిర్మాణకరం జనిత్రం
దేవాసురాణా మథ నాగరక్షసామ్,
నరాధిపానాం విదుషాం ప్రధాన-
మిన్ద్రానుజం తం శరణం ప్రపద్యే. 7

మూడులోకములను నిర్మించువానిని, దేవతలు, అసురులు, నాగులు, రక్షస్సులు, రాజులు - ఈ అన్నింటి పుట్టుకకు కారణమైనవానిని, విద్వాంసులలో ప్రధానుడైనవానిని, ఇంద్రుని తమ్ముని, ఆ శ్రీకృష్ణుని శరణు చొత్తును.

ఇతి శ్రీమహాభారతే ఉద్యోగపర్వణి యానసంధిపర్వణి
ధృతరాష్ట్రవాక్యే ఏకసప్తతితమోఽధ్యాయః.

ఇది శ్రీమహాభారతము ఉద్యోగపర్వమున యానసంధిపర్వమున
ధృతరాష్ట్రవాక్యముగల డెబ్బదియొకటవ అధ్యాయము.

సమాప్తం యానసన్ధిపర్వ
యానసంధిపర్వము ముగిసెను.

—(౦)—

7. నిర్మాణమ్ - రచన; జనిత్రమ్ - పుట్టించిన వానిని;